## కోశనిర్మాణప్రక్రియ : సంపాదకత్వం

ఇటువంటి మాండలిక కోశం ఇదివరకు భారతదేశ భాషల్లో వెలువడక పోవటంవల్ల ఈ రకంగా వాడుక నుంచి సేకరించిన పదాలను కోశస్థం చెయ్యటంలో సంపాదకుణ్ణి అపరిచిత సమస్యలు అనేకం ఎదురు కొన్నాయి. ప్రధానమైనవి :

1. సంగ్రహించిన పదా లన్నిటినీ మామూలు కోశాల్లో లాగా అకారాదిగా ఇవ్వటమా లేక పదసంగ్రహణ ప్రణాళికనుబట్టి కొన్ని భాగాలుగా ఇవ్వటమా ? రెండోపద్ధతి అనుసరించినపుడు ఆయా భాగాలకింద పదాలు ఏ క్రమంలో ఇవ్వాలి ? 'గ్రియర్‌సన్' మొదలైనవారి లాగా విషయ క్రమాన్ని అనుసరించి కథనపద్ధతి పాటించటమా ?[2] లేక అకారాది కోశక్రమం పాటించటమా ?
2. ఒకే అర్థంలో వచ్చిన అనేక పదాల మధ్య ఉన్న అన్యోన్య సంబంధం కోశంలో ఎలా నిరూపించటం ?
3. అర్థనిర్ణయం సూత్రప్రాయంగా చేయటమా ? వివరణాత్మకంగా చేయటమా?
4. ఒక్కొక్క పదం వాడుకలోఉన్న ప్రాంతాన్ని ఎలా సూచించటం? ఆయా ఊళ్ళను వాటి పేర్లతో గాని, గుర్తుగా పెట్టుకొన్న అంకెలతోగాని సూచించవచ్చు. పేర్లతో సూచించినపుడు తాలూకా, జిల్లాల సూచనలు కూడ ఉండాలి. అంకెలతో సూచించినపుడు ఈ అంకెలు అన్ని గ్రామాలకు ఏదో ఒక వరుసలో 1-121 అని నిర్దేశించటమా ? లేక దేశాన్ని స్థూలంగా కొన్ని ప్రాంతాలుగా విభజించి, ఒక్కొక్క ప్రాంతంలో అంకెలు వరుసగా ఇవ్వటమా ?

ఇందులో కొన్ని సమస్యలను ముందే ఊహించి వాటి పరిష్కారానికి అనుగుణంగానే పదసంగ్రహణ ప్రణాళిక తయారు చేయబడ్డది. కోశ సంపాదనలో పై సమస్య లన్నిటికీ సంతృప్తికరంగా నిర్ణయాలు చేసుకోగలిగాను.

## స్థూలరూపనిర్ణయం

మొదట కోశంలోకి వచ్చే పదాలన్నిటినీ విషయాన్ని బట్టి కొన్ని భాగాలుగా విభజించి ఇచ్చి, అందులో పదాలు అకారాది క్రమంలో ఇస్తేనే ఎక్కువ ఉపయోగం ఉంటుందని తోచింది. అన్ని భాగాల్లోను వచ్చిన పదాలను మళ్ళీ కోశం చివర అకారాదిగా అనుబంధంలో ఇవ్వాలనే నిర్ణయం కూడ జరిగింది. దీని వల్ల రెండు రకాల ప్రయోజనాలు సిద్ధిస్తాయి : (1) వ్యవసాయవృత్తిలో ఏవో కొన్ని ప్రత్యేక విషయాలకు చెందిన మాటలు కావలసివారు ఆయాభాగాల్లో ప్రయాస లేకుండా చూచుకోటం సాధ్యమవుతుంది. ఉదా : వ్యవసాయ పరికరాల పేర్లు, కలుపు మొక్కల పేర్లు, వడ్లు మొ. ధాన్యాలకు సంబంధించిన పేర్లు, పైరు తెగుళ్ళు, పశువ్యాధులు—మొ. వి. (2) ఏదో ఒక పదం మాత్రం తెలిసి, ఆ పదానికి అర్థంగాని, వ్యవహారవిస్తృతిగాని, దానికి సరిగా మిగిలిన ప్రాంతాల్లో వాడే పలుకుబళ్ళను గాని తెలుసుకోదలచినవారు చివరి అనుబంధంలో ఆమాట, పుట సంఖ్య(లు) చూచి కోశంలో ఆ వివరాలు సంగ్రహించవచ్చు.

### ఆరోపనిర్ణయం[3]

1. వర్గీకరించి ఒకచోట చేర్చిన సమానార్థక రూపాల మధ్య అన్యోన్య సంబంధం నిరూపించటం. పదరూపాల సాధుత్వాసాధుత్వ నిశ్చయం, ప్రమాణీకరణం—ఇవి ఈ కోశనిర్మాణంలో ప్రధానమైన సమస్యలు, క్లిష్టమైనవి కూడా. వీటిని గూర్చి ఒక నిర్ణయానికి రావటానికి చాలాకాలం పట్టింది.

పర్యటన పరిశోధకులకు ధ్వనిశాస్త్రంలో కొంత

---

2. Sir G. A. Grierson, *Bihar Peasant Life* (2nd rev. ed.); Superintendent, Government Printing, Bihar & Orissa, Patna (1926). ఈ గ్రంథంలో వ్యవసాయపదాలేగాక మిగిలిన వృత్తులకు, గ్రామజీవితానికి సంబంధించిన పదాలుకూడా కథనపద్ధతిలో ఇవ్వబడ్డాయి.

3. 'ఆరోపం' అనే పదాన్ని 'entry' అనేదానికి సమానార్థకంగా మొదటిసారి ఉపయోగించినవారు శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు (నన్నయ పదప్రయోగకోశము, పుట-iii).

శిక్షణ ఇవ్వటంవల్ల, వాడుకలో ఉన్న రూపాలు వ్యవహర్త ఉచ్చరించినట్లే రాసుకోవాలనే కట్టడివల్ల తెలుగులిపి మేరకు సాధ్యమైనంతవరకు పదాలను ఉచ్చారణ విధేయంగానే సంగ్రాహకులు రాశారు.

పదపట్టికలనుంచి వేరుచేసి వర్గీకరించిన సమానార్థక శబ్దాల స్వరూపం, వాటిలో ఆరోపాలు (entries)గా ఎన్నుకున్న రూపాలు ఈ కింది పట్టికలో మచ్చుకు కొన్ని చూడవచ్చు.

| పర్యటకుల పట్టికల్లో (Field reports) వచ్చినవి | కోశంలో ఆరోపాలుగా ఇచ్చినవి* |
|---|---|
| 1. ఇసక, ఇసికె, ఇసెక, ఇస్క, ఉసికె, ఉసెక, ఉస్కె | ఇసక (ఉ. ఇసికె, ఇసెక, ఇస్క)<br>ఉసికె (ఉ. ఉసెక, ఉస్కె) |
| 2. ఖుష్కి, కుష్కి, కుసికీ, కుస్కి | ఖుష్కి (ఉ. కుష్కి, కుసికీ, కుస్కి) |
| 3. గనిమ, గనుము, గనెం, గినం, గినిమ, గెనం, గెనిమ, గెనుం, గెనెం | గనిమ (ఉ. గనుము, గినిమ, గెనిమ)<br>గనెం (ఉ. గినం, గెనం, గెనుం, గెనెం) |
| 4. తువ్వ, తువ, తూ, తూవ, దుబ్బ | తువ్వ (ఉ. తువ, తూ, తూవ)<br>దుబ్బ |
| 5. పొలిమేర, పొలిమారి, పొలిమేరు, పొల్మరు, పొల్మారు, పొల్మెర | పొలిమేర (ఉ. పొలిమారి, పొలిమేరు)<br>పొల్మారు (ఉ. పొల్మరు)<br>పొల్మెర |
| 6. బదుగు, బొదుగు, బొదువు | బదుగు (ఉ. బొదుగు, బొదువు) |
| 7. గట్టు, గెట్టు | గట్టు (ఉ. గెట్టు) |
| 8. గరుసు, గెరుసు | గరుసు (ఉ. గెరుసు) |
| 9. గమిడి, గెమిడి | గమిడి (ఉ. గెమిడి) |
| 10. రాగడి, రాగిడి, రేగడి, రేగడ, రేగిడి, రేవడి, రేవడ | రాగడి (ఉ. రాగిడి)<br>రేగడి (ఉ. రేగడ, రేగిడి)<br>రేవడి (ఉ. రేవడ) |
| 11. గడ్డ, గెడ్డ | గడ్డ (ఉ. గెడ్డ) |
| 12. గండి, గండె, గిండి, గెండి | గండి (ఉ. గండె, గిండి, గెండి) |
| 13. గిరక, గిర్క, గిర్కె, గిలక | గిరక (ఉ. గిర్క, గిర్కె)<br>గిలక |
| 14. చిల్ల, జిల్ల, సిల్ల | చిల్ల (ఉ. జిల్ల, సిల్ల) |
| 15. చొరవ, చరవ, సొరవ, చొరె, సొరె | చొరవ (ఉ. చరవ, సొరవ)<br>చొరె (ఉ. సొరె) |
| 16. వలిగం, వలిగెం, వళిగం | వలిగం (ఉ. వలిగెం, ఎళిగం) |
| 17. కర్రు, కరు (బహు : కర్లు) | కర్రు (ఉ. కరు) |
| 18. కాడి, కాణి, కాండి, కాని, కావడి, కాడిమాను, కాడిమాను | కాడి (రూ. కాణి, కాండి, కాని, కావడి)<br>కాడిమాను<br>కాడిమాను |
| 19. చెరణాకోల, శరణాకోల, చెర్నాకోల, చెర్లకోల, నెర్లకోల, నెల్రకోల | చెరణాకోల (ఉ. శరణాకోల, చెర్నాకోల)<br>చెర్లకోల (ఉ. నెర్లకోల, నెల్రకోల) |
| 20. జడ్డిగం, జడిగెం, జడిగం, జడెగం, జడ్డిగెం, జణిగెం | జడ్డిగం (ఉ. జడిగెం, జడిగం, జడెగం, జడ్డిగెం, జణిగెం) |

*బ్రాకెట్లలో ఉన్న రూపాలు వాటి ముందున్న ఆరోపాలకు ఉచ్చారణభేదాలుగా ఇవ్వబడ్డాయి.

21. తగిరె, తగిర, తగిరి, తమిరె, తమిర, తమిరి, తమెరి — తగిరె (ఉ. తగిర, తగిరి) తమిరె (ఉ. తమిర, తమిరి, తమెరి)

22. మాగాణి, మాగాటి, మాగాడి, మాగాని, మాగిలి, మాగేలి — మాగాణి (ఉ. మాగాటి, మాగాడి, మాగాని) మాగిలి మాగేలి

పై పట్టికలో ఒక్కొక్క అడ్డవరసలో ఉన్న రూపాలన్నీ అన్యోన్యం రూపాంతరాలు. రూపాంతరాలంటే చారిత్రకంగా ఒకానొక కాలంలో ఒకే రూపంతో వాడుకలో ఉన్న పదం కాలక్రమాన ఉచ్చారణలోని మార్పులవల్ల అనేక రూపాలుగా ఏర్పడటం. ఈ మార్పుల్లో కొన్ని ప్రాచీనకాలంలోనే ఏర్పడ్డవి కావచ్చు; మరికొన్ని ఇప్పుడిప్పుడే ఏర్పడుతున్నవి కావచ్చు. కొన్ని మార్పులను ప్రాంతీయాలుగా గుర్తించవచ్చు; మరికొన్ని వైయక్తికాలు (వ్యవహర్తల సాంఘిక విద్యాదిక స్థితులను ఆశ్రయించినవి)కావచ్చు. ఈ విధంగా ఒకే పదానికి ఏకకాలంలో వ్యాప్తిలో ఉన్న ఉచ్చారణ భేదాలన్నిటిలోను ఒకటి, రెండు మాత్రం-శిష్టభాషకు పరిమితంగా ఉన్నవి-ప్రమాణ రూపాలవుతాయి. మిగిలినవాటిని అప్రమాణ రూపాలని మాండలిక రూపాలని అంటారు.

ఉచ్చారణలోని మార్పులు నియత ధ్వనుల మధ్యనే కలుగుతుంటాయి. ఉదా: గ-వ,వ-జ,డ-ణ,ల-న మొ. అంతేగాని క-ర, ల-త మొదలైన మార్పులు కనిపించవు, ధ్వనుల మార్పు ఫలితంగా ఏర్పడ్డ రూపభేదాలన్నీ—ప్రాచీనాలైనా అర్వాచీనాలైనా, ప్రాంతీయాలైనా, వైయక్తికాలైనా, విస్తృతాలయినా, పరిమితాలయినా భాషాపరిణామాన్ని అర్థంచేసుకోటానికి సమానార్హత గల శాస్త్ర విషయాలు అవుతాయి కాబట్టి వాటిల్లో ఏ ఒక్క రూపాన్నీ నిరాకరించటానికి వీలులేదు.అంత మాత్రాన ఉచ్చారణలో వచ్చిన రూపా లన్నిటినీ యథాతథంగా కోశస్థం చేస్తే గ్రంథం చాలా పెరుగుతుంది. అదీగాక ప్రమాణభాషలో వీటన్నిటికీ సమానార్హత ఉండదు ; శిష్టోచ్చారణకు దగ్గరగా ఉన్నవి, ప్రాచీనమైనవి, ప్రాంతీయ విస్తృతికలవి మాత్రం ప్రమాణభాషలో చెలామణి అవుతాయి. అందుకని భాషాప్రామాణ్యం దృష్టితో ఆయా భేదాల్లో ప్రధానమైనవేవో, అప్రధానమైనవేవో నిర్ణయించి, ప్రధానమైన వాటినే ఆరోపపదాలుగా ఇచ్చి, అప్రధానమైనని వాటి ఉచ్చారణభేదాలుగా ఇవ్వటం ఉచితం అనిపించింది. ఈ పద్ధతిని బట్టి వ్యవహారంలో వచ్చిన రూపాలన్నీ కోశస్థం కావటమే గాక వాటిలో ప్రమాణ రూపాలేవో నిరూపించటం గూడా జరిగింది.

ఈ విధంగా ఆరోపనిర్ణయం చేయటానికి కొన్ని శాస్త్ర పద్ధతులు ఈ కింది విధంగా అవలంబించబడ్డాయి.

| శిష్టోచ్చారణ | శిష్టేతరోచ్చారణ |
|---|---|
| మహాప్రాణం (ఖుష్కీ, అనూరాధ) | అల్పప్రాణం (కుస్కీ, అనూరాద) |
| గ-(గట్టు, గడ్డ, గండి) | గె-(గెట్టు, గెడ్డ, గెండి) |
| చ (చవుడు, ఊచ) | స (సవుడు, ఊస) |
| వ (వెల్తురు, ఆవిటి) | య (యెల్తురు, ఆయిటి) |
| హ (హద్దు, హరివిల్లు, రోహిణి) | పదాదిన లోపం, అచ్చుల మధ్య య-వ. (అద్దు, అరిల్లు, రోయిణి, రోవిణి) |
| సంయుక్త హల్లు (జ్యేష్ఠ, హస్త, ఆశ్లేష) | ఒక హల్లు లోపం గాని, సమీకరణంగాని, విప్రకర్ష (స్వరభక్తి) గాని (జెట్ట, అత్త, అసిలేరు) |
| [శ], ష, స (అశ్వని, పుష్యమి) | న (అసెని, పుసేల) |

1. పై నిరూపించిన రెండోరకపు ఉచ్చారణలు ఉత్తరోత్తర ప్రకర్షతో జానపద వ్యవహారానికి ఉపలక్షకంగా ఉంటాయి. వ్యవసాయపదాలు చాలావరకు దేశ్యాలు కావటంవల్ల, అవి ప్రధానంగా జానపద వ్యవహారంనుంచి శిష్టసంఘానికి వ్యాపించటంవల్ల వాటి ఉచ్చారణలో శిష్టులకు శిష్టేతరులకు మధ్య భేదాలు అల్పసంఖ్యాకంగానే ఉంటాయి. రైతులలోనే చదువు లేకపోయినా నాగరక సంపర్కమున్నవారు ఖుష్కీ, గట్టు, చవుడు, వెల్లురు, హద్దు, హస్త, మొదలైన ఉచ్చారణలు సులభంగా అలవర్చుకోగలరు. ఈ విధంగా అలవర్చుకోటానికి కష్టమయింది: మహాప్రాణ ధ్వనుల ఉచ్చారణ. సుమారు తొమ్మిదివేల ఆరోపాలు గల ఈ కోశం మొత్తంలో మహాప్రాణధ్వనులతో వచ్చిన పదాలు పది పన్నెండుకన్నా లేవు. సంస్కృతం నుంచి తీసుకున్న నక్షత్రాల పేర్లలోనే జానపదోచ్చారణలో ఎక్కువ భేదాలు కనిపిస్తాయి (చూ. పుటలు 307-314). కాలక్రమాన రైతుల్లో విద్యాభివృద్ధి అయ్యే కొద్దీ పైన నిరూపించిన ఉచ్చారణభేదాలు చాలా వరకు నశించి శిష్టోచ్చారణకే ప్రాబల్యం ఏర్పడుతుంది. ఈ ప్రమాణాన్ని బట్టి శిష్టోచ్చారణకు సన్నిహితంగా ఉన్న రూపాన్నే ఆరోపంగా తీసుకొని మిగిలినవాటిని దాని ఉచ్చారణ భేదాలుగా నిరూపించటం జరిగింది. ఈ ప్రమాణంవల్ల ఖుష్కీ, గనిమ, గట్టు, గరుసు, గమిడి, గడ్డ, గండి, చిల్ల, చౌరవ, చౌరె, మొదలైనవి ఆరోపాలుగా నిర్ణయించబడ్డాయి (చూ. పైన 2, 3, 7, 8, 9, 11, 12, 14, 15).

2. ఒకేమాటకు కనిపిస్తున్న రూపభేదాలన్నిటిలోను కొన్ని నిష్కర్షగా ప్రాంతీయాలని నిరూపించవచ్చు. మరికొన్ని అలా నిరూపించటానికి వీలుకానివి. ఉదా: పైన 4వ వరసలో ఇచ్చిన అయిదు రూపాల్లోను 'తువ్వ', 'దుబ్బ' అని రెండే ఆరోపాలుగా గ్రహించబడ్డాయి. 'తువ్వ, తువ' తూ, తూవ' అనే నాలుగు రూపాలు, 'దుబ్బ'తో పోల్చిచూస్తే సన్నిహిత ప్రాంతంలో వాడుకలో ఉన్న ఉచ్చారణలు; వీటిల్లో 'తువ్వ' ఎక్కువగా వాడుకలో ఉండటంవల్ల అదే ఆరోపంగా తీసుకోబడ్డది. మిగిలిన మూడు రూపాలకు ప్రాంతీయభేదం విలక్షణంగా లేకపోవటంవల్ల ఈ ఆరోపానికి ఉచ్చారణ భేదాలుగా నిరూపించబడ్డాయి. 'తువ్వ-దుబ్బ'ల భేదంమాత్రం ప్రాంతీయం (చూ.పటం 2). అలానే ఈ ప్రమాణాన్ని బట్టి పొలిమేర, పొల్మారు (5); రాగడి-రేగడి-రేవడి (10); గిరక-గిలక (13); చౌరవ-చౌరె (15); తగిరె-తమిరె (21) మొదలైనవి ఆరోపపదాలుగా నిర్ణయింపబడ్డాయి (చూ. పటాలు 1, 11).

3. చారిత్రకంగా శబ్దోత్పత్తి చరిత్రనుబట్టి ప్రాచీనమైన రూపాలు ఇంకా ఎక్కడన్నా నిలిచి ఉంటే అవి విస్తారంగా వాడుకలో లేకపోయినా ప్రత్యేకారోపాలుగానే తీసుకోబడ్డాయి. ఉదా: నారు-నేరు (పుట 142) 'నేరు' తె. 22 లో మాత్రం వచ్చింది; కాని నా-/నే-లమార్పు చారిత్రకంగా విలక్షణమైనది[4].

18వ వరసలో ఇచ్చిన 'కాండి, కాణి, కాని' అనే మూడు రూపాలు సన్నిహిత ప్రాంతంలోనే వాడుకలో ఉన్నవి. (చూ.పటం 5). వీటిల్లో 'కాని' ఎక్కువ ప్రాంతంలో వాడబడేది గాబట్టి దాన్ని ప్రధానరూపంగా తీసుకొని 'కాండి, కాణి' అనేవి ఉచ్చారణ భేదాలుగా నిరూపించవచ్చు కాని చారిత్రకంగా విలక్షణ మని, జరుగుతున్న ధ్వనుల మార్పు (phonetic change in process) కు నిదర్శనంగా ఉంటాయని (ణ్డి>ణి>ని), ఈ మూడు రూపాలు ప్రత్యేకారోపాలుగానే చూపించబడ్డాయి. ఇనక-ఉసికె (1), మాగాణి-మాగిలి-మాగేలి (22) మొదలైనవి. ఈ ప్రమాణాన్ని బట్టి ఆరోపాలుగా గ్రహించబడ్డాయి.

4. వీటైనంతవరకు కనిష్ఠమైన విలక్షణ భేదాలు (minimal distinctions) ఆధారంగా ఆరోప

---

4. తమిళం-ఞాఱు 'అంకురించు;' నాఱు, నాఱ్ఱు 'తిరిగి నాటటానికి పెంచే మొలకలు;' మలయాళం-ఞాఱు; తుళు-నేజి; కూయి-నేజ. ప్రాచీన ద్రావిడ 'ఞ' నుంచి 'న' అన్ని ద్రావిడభాషల్లోను ఏర్పడ్డది; ఈ రకంగా ఏర్పడ్డ నకారం పక్కన అ-ఎ, ఆ-ఏ లు పరస్పరం మారటం సామాన్య లక్షణం: ఉదా. నమలి/నెమలి, నరయు/నెరయు. తెలుగులో 'నేరు' అనే రూపం ఒక మాడుమూల ప్రాంతంలో ఇంకా నిలిచి ఉండటం విశేషం.

నిర్ణయం జరిగింది. ఉచ్చారణభేదాలు ధ్వనులను (అచ్చులను, హల్లులను) ఆశ్రయించి ఉంటాయి. పై పట్టికలో ఇనక, ఇనికె, ఇనెక, ఇన్క, ఉనికె, ఉనెక, ఉన్కె అనే రూపాలన్నిటిమధ్య ఉన్న ఉచ్చారణ భేదాలను పరిశీలిస్తే మొదటి అక్షరంలో ఇ/ఉ, రెండవ అక్షరంలో అ/ఇ/ఎ/లోపం, చివరి అక్షరంలో అ/ఎ కనిపిస్తాయి. పదంలో మొదటి రెండక్షరాల్లోను వచ్చేమార్పులు మిగిలిన అక్షరాల్లో వచ్చే మార్పులకన్న చారిత్రకంగా ప్రధానమైనవి, విలక్షణమైనవి కూడా. వీటిల్లో అల్పసంఖ్యాకంగా ఉన్న మార్పులు ఆధారంగా పై రూపాలను రెండు తెగలుగా విభజించవచ్చు. 'ఇ'తో మొదలయ్యే 'ఇనక, ఇనికె, ఇనెక, ఇన్క' ఒకతెగ, 'ఉ'తో మొదలయ్యే 'ఉనికె, ఉనెక, ఉన్కె' రెండోతెగ. దీన్నిబట్టి మొత్తం ఏడు రూపాలకూ రెండు కనిష్ఠ భేదాలు ఆధారంగా రెండే ఆరోపాలు నిరూపించటం ఆవశ్యకమని తేలుతుంది. మొదటి తెగలో 'ఇనక', రెండవతెగలో 'ఉనికె' ఆ యా తెగల్లో ఉన్న మిగిలిన రూపాలకంటె విస్తృత వ్యవహారంలో ఉండటం వల్ల ఆరోపాలుగాను, తక్కినవి ఉచ్చారణ భేదాలుగాను గ్రహించబడ్డాయి. ఈ ప్రమాణాన్ని బట్టే 10 వ వరసలో ఉన్న రూపాల్లో రా-రే,గ-వ ల మార్పులు ఆధారంగా 'రాగడి, రేగడి, రేవడి' అని ఆరోపనిర్ణయం జరిగింది ఈ రకంగా నిర్ణయించిన ఆరోపాలమధ్య ప్రాంతీయభేదంకూడ విలక్షణంగా కనిపిస్తుంది.

5. వ్యవహార బాహుళ్యం ఉన్న రూపం ఆరోపంగాను పరిమిత వ్యవహారంలో ఉన్నవి దాని ఉచ్చారణ భేదాలుగాను గ్రహించటం అనేది పై వాటితో అంతటా వర్తించే సామాన్య ప్రమాణం.

ఈ రకంగా రూపాంతరాలు నిర్ణయించినమీదట వర్గీకరించిన సమానార్థక శబ్దాల్లో ఇంకా కొన్ని మిగిలిపోయినాయి. అవి పర్యాయపదాలుగా చూపించబడ్డాయి. ఒకే అర్థంలో వచ్చే రెండుమాటలకు రూపసాదృశ్యం ఏమాత్రము లేకపోతే వాటిని పర్యాయపదాలంటాం; ఉదా. మాగాణి, ఊడ్పుచేను, కాన, చేను, నంజె, నీరావరి, పల్లపునేల, పొలం(జోర్రుపొలం, తరిపొలం, నీరుపొలం, బురదపొలం, వందురుపొలం, వరిపొలం), మడి, వరిమడి, వరిమొత్త-ఇవన్నీ దేశంలో భిన్నప్రాంతాల్లో ఒకే అర్థంలో ఉపయోగించే మాటలు; అన్యోన్యం పర్యాయపదాలు. అలానే మెట్ట, ఎలగడ, ఎలి, ఎలిగాడి, ఎలిజెలక, ఖుష్కి, గరువు, గుడ్డి, చెలక, చేను, దిన్నె, పుంజె, పొలం, బయలుపొలం, బరక, మిరు, మెరక—ఇవన్నీ పర్యాయపదాలు మోట-కపిల నాగలి-మడక, కాడి-పూజు, మొ వి సమానార్థక పదాలు. పై పదాల్లో చేను,పొలం అనేమాటలు కొన్ని ప్రాంతాల్లో 'మెట్ట' కు పర్యాయపదాలుగాను, మరికొన్నిచోట్ల 'మాగాణి'కి పర్యాయపదాలుగాను వాడుకలో ఉండటంవల్ల ఈ రెండు వర్గాల్లోను వాటిని పరిగణించవలసి వచ్చింది.

పై విధంగా ఉచ్చారణ భేదాలు, రూపాంతరాలు, పర్యాయపదాలు నిర్ణయించి కోశంలో రూపాంతరాలు, పర్యాయపదాలే ఆరోపాలుగా ఎక్కించటం జరిగింది. కాని వాటిల్లో ఏ ఒక్క పదమన్నా తెలిసిన పాఠకుడు ఆ పదానికి సరిగా మిగిలిన ప్రాంతాల్లో ఏయే పదాలు వాడుకలో ఉంటాయో చూచుకోటానికి తగినసౌలభ్యం కల్పించటం కర్తవ్యం. అంటే రూపాంతరాలు, పర్యాయపదాలకు గల సమన్వయ సూచన (cross-reference)కు ఏదైనామార్గం కల్పించాలి; ఉదా: నాగలి, నాగెల, నాంగలి, నాగేలి, మడక, వీటిల్లో మొదటి నాలుగు, రూపాంతరాలు. ఇవన్నీ కలిసి 'మడక'కు పర్యాయపదాలు. వీటిల్లో ప్రతిమాట దగ్గర మిగిలినమాట లన్నిటినీ ఇస్తూవస్తే గ్రంథం చాలా విస్తరిల్లుతుంది. అదీగాక వ్యవహార విస్తృతి వీటన్నిటికీ సమానంగా లేదు. పర్యటించిన 12౦ గ్రామాల్లోను 'నాగలి' ఎక్కువ ప్రాంతంలో వాడుకలో ఉంది. ఆ తరవాత 'నాగేలి', అంతకంటె తక్కువ ప్రాంతంలో 'మడక', మరీ పరిమిత ప్రాంతాల్లో వాడుకలో ఉన్నవి 'నాంగలి', 'నాగెల', ఈస్థితి ఆధారంగా ఎక్కువప్రాంతంలో వాడుకలో ఉన్న ఆరోపపదం దగ్గరే పూర్తి వివరాలు (రూపాంతర పర్యాయపదాలను గూర్చినవి) ఇచ్చి, మిగిలిన వాటిదగ్గర 'వివరాలకు అక్కడ చూడవలసినది' అనే సూచనచేస్తే ఉచితంగా ఉంటుందనిపించింది.

దీన్నిబట్టి కోశంలో పై పదాలు ఈవిధంగా ఇవ్వబడ్డాయి.: నాగలి రూ. నాగెల, నాగేలి, నాంగలి; పర్యా. మడక, (తరవాత) అర్థం, ప్రాంతం, అంటే 'నాగలి' అనే దానికి 'నాగెల, నాగేలి, నాంగలి' రూపాంతరాలుగాను, 'మడక' పర్యాయపదంగాను నిరూపించబడ్డాయి. ఆ రూపాంతరాల్లో ఒక్కొక్క దాని వద్ద ఇలా ఉంటుంది: నాగెల చూ. నాగలి (ప్రాంతం మాత్రం). నాగేలి చూ. నాగలి (ప్రాంతం) నాంగలి చూ. నాగలి (ప్రాంతం). మడక పర్యా. చూ. నాగలి (అంటే పర్యాయపదాలకు చూడు, నాగలి) (అర్థం, ప్రాంతం), రూపాంతరాలన్నీ సాధారణంగా అకారాదిక్రమంలో దగ్గరదగ్గరగా వచ్చేవి కాబట్టి వాటి ఆరోపాలన్నిటి కింద అర్థం పునరావృత్తం చెయ్యకుండా ప్రధానరూపం దగ్గరే అర్థం ఇవ్వబడ్డది. సాధారణంగా రూపాంతరాలన్నీ కాస్త ముందు వెనుకలుగా ఒకే పుటలో వస్తాయి. అందువల్ల ప్రధానరూపం దగ్గరే అర్థం ఇచ్చినా వెతుక్కోటంలో ప్రయాస ఉండదు పర్యాయపదాలు అకారాది క్రమంలో దూరదూరంగా వస్తాయి కాబట్టి అర్థ వివరణ అక్కడ పూర్తిగా, పాఠక సౌలభ్యం కోసం ఇవ్వాలి. ఆరోపం తరవాత ఉ. = ఉచ్చారణ భేదాలు; రూ. = రూపాంతరాలు; పర్యా.— పర్యాయపదాలు- ఈ క్రమంలో వస్తాయి. తరవాత అర్థం, రేఖాచిత్ర సూచన, ప్రాంతం [5]

పై వివరణాన్ని అంతటినీ ఇంకోరకంగా చెప్పాలంటే : (1) ఏ ఆరోపం కిందనన్నా ఉచ్చారణ భేదాలుండవచ్చు. (2) ఆరోపం పక్కన చూ. ఉంటే దాన్ని అనుసరించి వచ్చేమాట ప్రధానరూపమనీ, దానికి ఈ ఆరోపం రూపాంతరమనీ గ్రహించాలి. (3) ఆరోపంపక్కన రూ. ఉంటే ఆరోపం ప్రధాన రూపమనీ, రూ. తరవాత వచ్చేవన్నీ దానిరూపాంతరాలనీ గ్రహించాలి, (4) ఆరోపం పక్కన రూ... పర్యా...కూడా ఉంటే సమానార్థక శబ్దాలన్నిటిలోను ఈ ఆరోపం ప్రధానశబ్దంగా గ్రహించబడ్డదని గుర్తించాలి. (5) ఆరోపం పక్కన పర్యా. చూ. ఉంటే దాన్ని అనుసరించి వచ్చే పదారోపం దగ్గర పూర్తి వివరాలు చూసుకోవాలి. ప్రధానపదానికి ఉన్న పర్యాయపదాల్లో ఇది ఒకటి అని గమనించాలి.

కోశంలో ప్రధానారోపంగా ఉన్న పదంతో కలిసి వచ్చే పదబంధాలు (compounds) ప్రధానారోపం కిందనే '–' (hyphen) గుర్తుకు పరానగాని, (కొన్ని చోట్ల) పూర్వాపగాని వస్తాయి. ఉదా : 'అక్కిడి' (ప్రధానారోపం). దీనికింద -కట్టె, – కొళివి అని ఉపారోపాలుంటాయి (చూ. పుట 51): అలానే 'తుంగ' ప్రధానారోపం; ఉపారోపాలు ఆకు-, ఇసక- (పుట 168). ఇటువంటి చోట్ల, '–' స్థానంలో ప్రధానారోపం కలిపి చదువుకోవాలి. గ్రంథం చివరి పద సూచిలో ఉపారోప భాగాలన్నీ ఏటవాలు టైపులోను, ప్రధానారోపాలన్నీ మామూలుటైపు లోను ఉంటాయి.

## అర్థనిర్ణయం :

ఆరోపపదాలకు అర్థం నిర్ణయించటంలో చాలవరకు పరిశోధకు లిచ్చిన వివరాలే ఆధారం. § 8 మొక్కలు; చెట్లు, § 11 పంటలు—ఈ భాగాల్లో ఇచ్చిన ఆరోపాలకు అర్థవివరాలు పదసంగ్రాహకులు ఇవ్వలేదు. చాలావరకు పేర్లుమాత్రమే రాసి స్థూలమైన వరిగణనం మాత్రం చేశారు; ఉదా : మొక్కలపేర్లలో 'ఇదొక కలుపుమొక్క', 'ఈ చెట్టు కొమ్మలు కొట్టి కంచెగా వేస్తారు', 'ఆకెరువుగా ఉపయోగించే మొక్క' ఇత్యాది. వృక్షశాస్త్ర గ్రంథాలు కొన్ని పరిశీలించి ఇటువంటి మాటలకు అర్థవివరణ ఇవ్వవలని వచ్చింది. మిగిలిన తెలుగు కోశాల్లోలాగా 'ఇదొక వృక్షవిశేషము' అనేరకంగా అర్థమివ్వకుండా అనమ

5. ఉచ్చారణ భేదాలకు ముందు అక్కడక్కడ వ్యాకరణరూపవివరణం (బహు = బహువచనం, వి. విశేష్యం, విణ. విశేషణం మొ.) అవసరమైనచోట్ల ఇవ్వబడ్డది. చాలాచోట్ల విశేష్యాలతో కలిసివచ్చే అనుయోగ క్రియాపదాలు (appropriate verbs) కూడా ఈ స్థానంలో ఇవ్వబడ్డాయి; ఉదా. ఊదర (– కొట్టు) పుట 201, కుప్ప (– కొట్టు, – పెట్టు, – వేయు) పుట 203, పడుగు ( – ఆడు, – ఒడ్డు, నెరచు, – నెరపు, – పొడుచు, పోయు) పుట 210. అక్కడక్కడ వ్యుత్పత్తి సూచనకూడా ఆరోపపదాన్ననుసరించి చేయబడ్డది; దాన్ని అనుసరించి ఉ., రూ., పర్యా. ఉంటాయి.

గ్రమైనా కొద్ది వివరణ ఇచ్చి అంతర్జాతీయ పారిభాషిక నామం కూడా ఇవ్వటం ఉచితం అనిపించింది.

అతివ్యాప్తి-అవ్యాప్తులులేని అర్థాలు నిరూపించటం ఏ భాషాకోశంలోనైనా క్లిష్టమైనపని. అందులోను అతి పరిచితమైన శబ్దాలకు, ఉదా : ఆకు, ఆవు, ఎద్దు, మబ్బు మొదలైనవాటికి వివరణాత్మకమైన అర్థం ఇవ్వటం మరీకష్టం. ఏ పదానికి అర్థమిస్తున్నామో ఆ పదం అర్థనిరూపణలో రాకుండా చెప్పటం శాస్త్రీయ పద్ధతి. ఇటువంటి సమస్యలన్నిటినీ దృష్టిలో పెట్టుకొని యథాశక్తిగా అర్థనిర్ణయం చేయటం జరిగింది.

పర్యాయపదాలుగా నిరూపించిన వాటన్నిటికి ఒకే అర్థం ఆయా పదాలన్నిటి దగ్గర పునరావృత్తం చెయ్యబడ్డది. అవన్నీ పర్యాయపదాలేనా ? కావా ? అనటానికి పదసంగ్రాహకుల వివరణతప్ప వేరే ఆధారం లేదు. వారి వివరణలోని అసమగ్రతవల్ల ఎక్కడయినా పర్యాయపదాలు కానివి పర్యాయపదాలుగా చూపబడి ఉండవచ్చు. ఇటువంటి లోపాలేవన్నా ఉంటే సహృదయులైన పాఠకులు సంపాదకుడికి తెలియపరచితే రెండో ముద్రణలో పరిష్కరించటం సాధ్యం అవుతుంది. ఒకటి రెండు ఊళ్ళలోనే వచ్చిన పదాల్లో రూపంగాని, అర్థంగాని అస్పష్టంగా ఉన్నప్పుడు అవి పరిహరించబడ్డాయి.

ఒకే పదానికి భిన్నప్రాంతాల్లో సమానార్థాలు కాక స్థూలంగా తుల్యార్థాలున్నపుడు ఆయా అర్థాలు ఆ ఆరోపం కిందనే (1) (2) (3) అంకెలతో చూపించబడ్డాయి అర్థభేదం నిష్కర్షగా ప్రాంతీయభేదానికి ఉపలక్షకంగా ఉన్నచోట్ల ఒక్కొక్క అర్థం పక్కనా ఆయా ప్రాంతాల సూచనకూడా వేరువేరుగా చేయబడ్డది.

ఒకేరూపమున్న రెండు మూడు పదాల అర్థాల్లో ఏరకమైన సాదృశ్యమూ కనిపించకపోతే అవన్నీ ప్రత్యేక పదాలుగా పరిగణించి. ప్రత్యేకారోపాలుగా ఆయా అర్థాలతో ఇవ్వబడ్డాయి (చూ పుట 326).

**రేఖాచిత్రసూచన :**

కొన్ని పనిముట్లకూ వాటి భాగాలకూ వాడే పేర్లు అర్థవివరణవల్ల సుగమం కానిచోట్ల స్పష్టతకోసం కొన్ని భాగాల చివర రేఖాచిత్రాలు పొందుపరచబడ్డాయి. ఒకే భాగానికి ఆ మాట దగ్గరే రేఖాచిత్రం ఇవ్వటంలో కొంత క్లేశం ఉంది. ఒకే అర్థంలో ఒకే పనిముట్టుకు గాని, దాని భాగానికిగాని అనేక పదాలు అకారాది క్రమంలో వేరువేరు చోట్ల వస్తుంటాయి కాబట్టి ప్రతిచోటా ఒకే రేఖాచిత్రం ఇవ్వటంకంటే ఒక్కొక్క భాగం చివర ఇవ్వటంలో ఎక్కువ సౌలభ్యం ఉంది.

**ప్రాంతసూచన :**

పదసంగ్రహణం పూర్తి అయిపోయినదాకా కోశంలో ఇచ్చిన పదాల వ్యాప్తిని ప్రాంతీయంగా సూచించే పద్ధతిని గురించి నిర్ణయానికి రాలేదు. పదవర్గీకరణం (indexing) లో కూడ ఆయా ఊళ్ళ నెంబర్లు సంగ్రాహకుల పేర్లతో కలిపివేయబడ్డాయి. ఉదా : రా. (రామారావు) 1, 2, 3—25 ; కో. (కోనేటప్ప) 1, 23, ఈ రకంగా.

పదాల వాడుక దృష్ట్యా మనకు పరిచితమైన తాలూకా జిల్లాల విభాగం కృత్రిమమైనది. భ్రాంతికారకం కూడా. అందుకని ఏదో ఒక స్పష్టమైన సాంకేతిక పద్ధతి ఏర్పరచుకోవలసి వచ్చింది. గ్రామాలన్నిటినీ 1-121 అంకెలు వేసుకొని ఆరోపం, అర్థం, వీటి తరవాత ఆరోపపదం వాడుకలో ఉన్న ఊళ్ళ నెంబర్లూ ఇవ్వవచ్చు. కాని, దీనివల్ల పాఠకులు ప్రతిసారి పటంలో చూసుకుంటే తప్ప పదవిస్తృతిని గూర్చిన అభిప్రాయం ఏమీ ఏర్పడదు. అందుచేత ప్రాంతాలను గురించిన స్థూలసూచన ఏదన్నా చేస్తే బాగుంటుందని తోచింది. నేడు మనం వ్యవహరిస్తున్న కోస్తా జిల్లాలు, తెలంగాణా, రాయలసీమ అనే విభాగం రాజకీయమైనదే గాక స్థూలంగా భాషావిషయకంగా కూడ సరిపోతుంది, ఈ కారణంవల్ల దేశాన్ని కో. (=కోస్తాజిల్లాలు), తె. (=తెలంగాణా), రా. (=రాయలసీమ)అని మూడు ప్రాంతాలుగా విభజించి ఒక్కొక్క ప్రాంతంలోను పర్యటించిన గ్రామాలకు ఒకటి మొదలు వరుస నంబర్లు వేసుకుంటూ వచ్చాను. ఈ విభాగంవల్ల సామాన్య పాఠకుడికి ఆరోపపదం స్థూలంగా కేవలం ఏ ఒకటి రెండు ప్రాంతాలకో పరి

మితమయినదనిగాని లేక మూడు ప్రాంతాల్లోనూ వాడుకలో ఉన్నదనిగాని తెలుసుకొనే వీలుంటుంది. ఇంకొక ప్రయోజనం – సమానార్థక శబ్దాల్లో ప్రధాన పద నిర్ణయానికి కూడా ఈ విభాగం ఉపయోగిస్తుంది. అంటే, ఒకపదం కో. తె. రా. మూడు ప్రాంతాల్లోను విస్తృతంగా వాడుకలో ఉండి, దీనికి సరిగా ఇదే అర్థంలో ఏ ఒక్క ప్రాంతంలోనైనా 5, 6 పదాలు వాడుకలో ఉన్నప్పుడు దీన్నే ప్రధానపదంగా తీసుకొని రూ. పర్యా. మొదలైన వివరాలు దీనికిందనే ఇవ్వటానికి ఒక శాస్త్రీయ ప్రమాణం లభిస్తుంది.

పదవర్గీకరణం అయిన తరవాత ఈ అంకెల మార్పుచేయటంతో పాతనెంబర్లన్నీ (సంగ్రాహకుల పేర్లతో కలిపివేసినవి) కొత్త నెంబర్లుగా మార్చుకోటానికి ఎక్కువ కాలం పట్టింది; ఈ మార్పులో అక్కడక్కడా కొన్ని నెంబర్లు తారుమారుగాకూడా పడి ఉండవచ్చు. ఇకముందు జరిగే వృత్తిపదకోశ నిర్మాణాల్లో ప్రాంతనిర్ణయం ముందే చేసుకోవాలి అనే గుణపాఠం ఈ అనుభవాన్నిబట్టి నేర్చుకోటం అయింది.

పదసంగ్రాహకులకు ఇచ్చిన ప్రణాళికయొక్క నిర్దిష్ట పరిమిత ప్రయోజనంవల్ల పర్యటించిన కొన్ని ఊళ్ళలో వాడుకలో ఉన్న కొన్ని మాటలు ఈ కోశంలోకి రాకపోవచ్చు. అంటే దేశంలో వాడుతున్న వ్యవసాయ పదాల్లో నూటికి తొంభైదాకా ఈ కోశంలో దొరకవచ్చు గాని ప్రతి ఆరోపం కింద ఇచ్చిన ప్రాంతీయ పరిమితి సమగ్రమైనదని ఊహించటానికి వీలులేదు. సంఖ్యలు గుర్తించిన ఊళ్ళలో నిర్దిష్టపదం వాడుకలో ఉన్నదని నిర్ధారణగా చెప్పవచ్చును గాని మిగిలిన ఊళ్ళలో లేదనటానికి వీలులేదు. కాని అనవధానతవల్ల కూడ పర్యటకులు ప్రశ్నించకుండా వదలటానికి వీలులేని పదాలు కూడా ఎన్నో ఉన్నాయి; ఉదా: నాగలి, బండిచక్రం, ఆకు, మెట్ట, మాగాణి, మొ. వి. ఇటువంటి పదాలు ఆధారంగానే నేటి తెలుగులో మాండలిక భేదాలు నిర్ణయించటం సాధ్యమవుతుంది (చూ. వ్యాసం చివర). ఉపారోపాల్లో సాధారణంగా ఊళ్ళ నెంబర్లు ఇవ్వలేదు; కో. తె. రా. అని స్థూలమైన ప్రాంత సూచనే చెయ్యబడ్డది. అంటే ప్రధానారోపపదం వాడుకలో ఉన్న ఊళ్ళలోనే ఉపారోప పదం కూడా ఉంటుందని దీన్నిబట్టి గ్రహించవచ్చు. 'పంటలు' అనే భాగంకింద ఇచ్చిన ధాన్యాల పేర్లలో ఉపారోప పదాల కింద కూడా ఆయా ఊళ్ళ నెంబర్లు ఇవ్వబడ్డాయి. ఈ వివరాలు వృక్షశాస్త్రజ్ఞులు, వ్యవసాయ శాస్త్రజ్ఞులు ధాన్యాదుల నామభేదాలకు కారణాలు తెలుసుకోదలచి చేసే భవిష్యత్పరిశోధనలో ఉపయోగించవచ్చునని అలా చేయబడ్డది.

లిపి – భాష :

ఆరోపాలలో పాటించిన కొన్ని సంకేతాలను గురించి, భాషను గురించి, అకారాది క్రమాన్ని గురించి ఒకటి రెండు మాటలు చెప్పాలి.

మన లిపిలో ఉన్న సంకేతాలతో నేటి తెలుగు ఉచ్చారణలో ఉన్న ప్రధానభేదాలన్నిటినీ స్పష్టంగా వ్యతిక్రమంలేకుండా సూచించటం సాధ్యం అవుతుంది. కాకపోతే ఞ (ఏ) (వచ్చేడు, తాటేకు మొదలైన పదాల్లో మధ్యాక్షరంలో ఉచ్చరించే అచ్చు)కు, *f* ధ్వనికి-మనభాషలో సంకేతాలులేవు. వ్యవసాయ పదాల్లో *f* వచ్చిన శబ్దాలులేవు. ఞ వచ్చినచోట్ల ఆది ఏ అనే గుర్తుతో సూచించబడ్డది. కొన్నిచోట్ల మనం ఒకరకంగా రాసి ఇంకొక రకంగా చదువుతుంటాం, ఉదా: చక్రం, జడ, జామ—ఇటువంటి పదాల్లో 'చ జ' లతో కలిపి రాసే అచ్చులు అ ఆ లైనా ఉచ్చారణలో వాటిని ఎ, ఏ లని గుర్తించవచ్చు స్పష్టతకోసం, సంకేతోచ్చారణల మధ్య నియతసంబంధం స్థాపించటం కోసం ఇటువంటి రూపాల్లో కొద్ది మార్పులు చేశాను. అలానే సంస్కృత ఋకారం వ్యవహారంలో ప్రచురమైన తత్సమాల్లో వచ్చేచోట దాని ఉచ్చారణ కొన్ని శతాబ్దుల కిందటనే రి-రు గా మారింది. అటువంటి చోట్ల కూడ పదస్వరూపాన్ని ఉచ్చారణవిధేయంగా మార్చాను. ఉదా. క్రిష్ణరేగడి, క్రిష్ణకాటుకలు, రుషి చుక్కలు, మొ. వి.

'ఇ ఈ ఎ ఏ ఏ' లతో మొదలైన ఆరోపాలన్నిటికి ఉచ్చారణలో యకారం ముందు కలుస్తుంది. అలానే 'ఉ ఊ ఒ ఓ' లతో మొదలైన ఆరోపాలకు ఉచ్చారణలో వకారం ముందు కలుస్తుంది. ఇది దేశం

అంతటికీ సామాన్యమైన ఉచ్చారణ లక్షణం కాబట్టి దీన్నిబట్టి ఆరోపాల స్వరూపం మార్చలేదు. అలానే చకారాది శబ్దాలన్నిటికీ ఉచ్చారణ భేదాలుగా స-శ లతో మొదలయ్యే శబ్దాలు దేశమంతటా శిష్టేతరుల భాషలో వాడుకలో ఉన్నాయి; ఉదా: చదును-సదును; చాలు–సాలు; చిల్ల-సిల్ల చేట-శేట; ఇటువంటి చోట్ల చాలవరకు స, శ లతో మొదలయ్యే శబ్దాలు ఉచ్చారణ భేదాలుగా ఇవ్వలేదు. ఈ సూత్రం ఆధారంగా పాఠకులు ఆయా రూపభేదాలు కోశంలో పరిగణించినట్టుగానే ఊహించుకోవాలి.

అర్థనిరూపణలో ఉపయోగించిన భాష నేటి శిష్టుల వాడుకకు చాలావరకు సన్నిహితమైనదని చెప్పవచ్చు. శాస్త్రీయంగా ఉంటూ ఎక్కువమందికి అర్థమయ్యే భాషలో అర్థాలు రాయాలనే ప్రయత్నం జరిగింది.

## ఫలితాలు : ప్రయోజనాలు

ఈ పరిశోధన ఫలితంగా ఇదివరకు కోశాలకెక్కని శబ్దాలు, దేశ్యవైకృతాలు, కొన్ని వేలు, కోశస్థం కావటమేగాక, నేటి తెలుగులో ఉన్న భాషామండలాల పరిమితి, వ్యవహారంలో వచ్చే ధ్వనుల మార్పుల స్వరూపం, భాషకు సాంఘిక రాజకీయ పరిస్థితులకు మధ్యగల అన్యోన్య, సంబంధం తెలుగుపై ఇరుగు పొరుగు భాషల ప్రభావం, నూతన పదసృష్టిలో జానపదుల వ్యవహారానికి గల విచిత్రశక్తి మొ. విశేషాలెన్నో తెలుస్తున్నాయి.

### పదజాలం

1. ఈ కోశంలోనే మొదటిసారిగా కనబడుతున్న దేశ్యవైకృత శబ్దాలు కొన్ని మచ్చుకు (బ్రాకెట్లలో ఉన్నవి. పుటల సంఖ్యలు) : అక్కిడి (51), అంకెన (51, 200), అంచె (88. 200, 384), అట్టడి (52), అట్టవ (133, 384), అడప (133), అని (52), అనువు (267), అరిసిక (88), ఆగం (315), ఆవిటి (315), ఈడి, ఈడిక (53), ఈదు (53), ఈనెన (289), ఉగ్గు (53), ఊసర (158, 186), ఎదల, ఎసల (289), ఎలిమి (187), ఎలుగు, ఎలువు (54), ఏగిలి (201), ఏగర (25), ఏడె (25, 54, 109, 135), ఏను (89, 135), ఒడవ (135), ఒది (55, 135), ఒని (110), ఒల్చె (18, 110), ఓగిలి (201), ఓవు (201).
2. ఇదివరకు కోశాల్లో ఉన్న పదాలకే కొన్నిటికి అర్థవిశేషాలు ఈ కోశంలో దొరుకుతాయి; ఉదా: ఆట్టడి (23, 133), ఆరం (134), ఇలారం (134, 278), ఉక్కడం (24, 53), ఉండ (109), కుంటెన (27, 57).
3. ఉపలభ్య కోశాల్లో ఒకే రూపంతో ఉన్న మాటలకు ప్రాంతీయంగా ఏర్పడ్డ రూపభేదాలు ఈ కోశంలో కనిపిస్తాయి; ఉదా. కర్రు (56)—కారు (57): కఱ్ఱు (సూ, ని., శ. ర., బ్రౌ.); గరువు-గరుగు—గరుబు—గరుసు (౬); గరువు (సూ. ని., శ. ర.); గుంటక—గుంటవ గూటవ (59) : గుంటక (సూ. ని., శ. ర., బ్రౌ.); తగిరె (63, 115)-తమిరె (63, 116): (సూ. ని., శ. ర.)
4. పూర్వకోశాల్లోనే దొరికే రూపాంతరాలు, పర్యాయ పదాలు నేటి తెలుగులో ఏయే ప్రాంతాలకు పరిమితంగా ఉన్నది ఈ కోశాన్ని బట్టి తెలుస్తుంది : ఉదా. తూము-మదుము (చూ. పటం 4) నాగలి-నాగేలి-మడక (చూ. పటం 6), పయ్యె-పనె (చూ. పటం 24), మబ్బు-మొగులు—మొయిలు మోడం (313).
5. కావ్యభాషలో వచ్చిన కొన్ని పదాల రూపంగాని, అర్థంగాని అస్పష్టంగా ఉన్నచోట్ల ఆ పదాలు ఈ కోశంలోకూడా వచ్చినట్లైయితే కొంతవరకు సందేహనివృత్తి కావటానికి వీలుంది. మన్మథుడి రథవర్ణన :

ఉదా . సీ. సింధువారంబులు సీలలు గేతకుల్
మెట్టులు మొల్లలు మెట్టుగుదెలు
(కు. సం. 4,439)

ఇక్కడ 'మెట్టుగుదె' అన్న పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'ఒక విధమగుశకటావయవము' అని అర్థం ఇచ్చారు. ఈ పదం ఇంకా నేటి తెలుగులో నెల్లూరు మండలంలో వాడుకలో ఉంది.

చూ. మెట్టుగుది 'బండివరాన్ని డొలుపుకు బిగించే తాడు' (124); కాని 'మెట్టు' అనే పదం వాడుకలో దొరకలేదు. బహుశా దీని అర్థం 'డొలుపు' అయి ఉంటుంది (115). డకారాది కావటంవల్ల ఈ పదం అర్వాచీనమైన అన్యదేశ్యం కావచ్చు. చూ. (హిం. ఢోల్, ఢోలక్). మెట్టుగుది, మెట్టుతాడు, మెట్టుమోకు, మెట్టుగుదిమోకు మొదలైన సమాసాల్లోనే 'మెట్టు' నిలిచి ఉంది. ఇంకొకటి :

'వ. తెక్కప్రాసంగు దొండముక్కువడియె' (కాశీ. 3. 23); 'మ. బలుసుల్ పండెను దొండ ముక్కు వడియెన్ బ్రాసంగుజేల్...' (శివరా. 4. 19). సూ. ని. లో 'దొండముక్కువడు' అనే ఆరోపంకింద 'దొండపండువలె గింజల కొన లెఱ్ఱఁబడు' అని అర్థం ఉంది. శ్రీనాథుని భాషలోనే కనిపించే ఈ నుడికారం నేటి తెనుగులో మహబూబ్‌నగర్ జిల్లాలో ఇంకా వాడుకలో ఉన్నది ; చూ. తొండముక్కువారు. 'కంకికొనగింజలు ముదిరి ఎఱ్ఱబడటం' (140). దీన్నిబట్టి శబ్ద స్వరూపం 'తొండముక్కు' గాని 'దొండముక్కు' గాదని నిశ్చయంగా చెప్పవచ్చు. ముదిరినతొండ ముక్కు ఎఱ్ఱగా ఉండటం లోకప్రసిద్ధం; అంతే గాక పదాది దకారానికి ఈ రెండూ నిర్ధారక ప్రయోగాలుకావు. ఒకటి ప్రథమమీద, రెండోది ద్రుతంమీద రావటంవల్ల సరళాదేశం వచ్చి 'తొండముక్కు' 'దొండముక్కు' అవుతుంది.

హరివంశం, భాగవతం, సింహాసన ద్వాత్రింశిక, హంసవింశతి మొదలైన కావ్యాల్లో వ్యవసాయ వృత్తిపదాలు వచ్చినచోట్ల శబ్దార్థ స్వరూప నిర్ణయానికి ఈ కోశం ఎంతో ఉపకరిస్తుంది ; ఉదా :

ఆ. వె. నరిడిపువ్వు కప్పనావురు కడుపూఁద
యదురుఁద్రిక్కు యనఁగ నదరి మఱియుఁ
దెవుళులెన్ని యేనిఁదవిలి యెంతయు మహో
గ్రంబులయ్యెఁ బహుగణంబునందు
(హరి. పూ. 6. 46)

పశువ్యాధుల భాగంలో (289-296) ఈ పదాలు చాలావరకు వచ్చాయి : ఊదు (289), కప్పనాగర, కప్పనామర (290), తిక్క (292), నెరిడె (290).

6. ఈ కోశంలో వచ్చిన ఆరోపాల్లో చాలాభాగం పద బంధాలు. అంటే ఒకటి రెండు ప్రాథమిక పదాల సంయోజనవల్ల అర్థవిశేషాల్లో ఏర్పడ్డవి. అన్యభాషాసంపర్కం లేని జానపదులు కొత్తకొత్త అభిప్రాయాలు చెప్పవలసివస్తే వారి వాడుకలోనే ఉన్న పాతమాటల కలయికతో నూతన పద బంధాలు సృష్టించుకుంటారు ఇది అచ్చతెలుగు సమాన స్వరూపానికి శబ్దశక్తికి ఎంతో నిదర్శకంగా కనిపిస్తుంది ; ఉదా. అగ్గి తెగులు (185) అచ్చుకట్టుదంతె (51), అడిబండ (23), అడిమేత (278), అడ్డపడుగుచాలు (52), అద్దపు చైట (303), అనగొమ్మ (133), అంపనన్న కట్టెలు (108), అరపదును (315), అరగాడి (28), అనినెమరు, అనిమేత, అనిమేపు (289), అకుగిట్ట (271), ఇరవాలుచుక్క (53), ఉచ్చ కల్లు (289), ఉరిగింజలు (134) ఉలిపదును (315), ఉనికంకి, ఉనిపడుగు (201), ఉసురు నీళ్ళు (184), ఊచబియ్యం వరువు (134), ఊచపొట్ట (184) ఊడ్పుచేను (2), ఎడగారు పెయ్య (266), ఎఱ్ఱదుమ్మతెగులు (187), ఎలిగట్టువాగలి (54), ఒంటెద్దుపొత్తు (17), ఓదె మునుము (201), కట్టుగారుపడ్డ (266), కన్నె కలుపు (135), కప్పనామర (266), కురిమెలుపు (136), కొదమపెయ్య (266), కొరివి కంకి (168), కోటబొమ్మంచులు (316), కోడి జుట్టుకూర (161, 245), తల్లేరుకాడి (116), మొ. వి.

నాగరకులు సంస్కృత సంపర్కంవల్ల వాడే నక్షత్రాల పేర్లు జానపదులకు అపరిచితాలు. కాని వీటన్నిదకీ వీరి వాడుకలో వింతైన పలుకుబళ్ళు స్వీయ భావనాకల్పితాలు ఎన్నో ఏర్పడ్డాయి. (చూ. 307-314); ఉదా. అక్కాచెల్లెలు చుక్కలు 'పూర్వోత్తరాషాఢలు', అత్తాకోడలి చుక్కలు 'పుబ్బ, ఉత్తర', అలబొద్దుచుక్క 'శుక్రుడు', అలమంద, ఆవులదొడ్డి, 'శతభిష', కాపుచెరువుచుక్క 'బృహస్పతి', కుమ్మర

మచ్చు, మచ్చె మంచె (145,213,281): క. మచ్చు.
మడక నాగలి (73): క. మడికె ఒకరకం గుంటక.
మేటికొయ్య (–గుంజ,–మాను) కళ్ళంమధ్య పాతే గుంజ (214): క. మేటి (? సం. మేథి–).
మళ మేకు (74): క. మొళె (చూ. తెలు. మొల మొల్ల (76).
ససి మొలక (149): క. ససి (< సం. సస్య-).
సుగ్గికూలీ నాట్లపనికి వచ్చే కూలీ (22): క. సుగ్గి వసంతఋతువు (మరా. సుగీ).
సొండు, సొండెం మోటబొక్కెన తొండం (45): క. సొండలు, సొండిలు సొండ్లు తొండం.
2. తెలంగాణా పశ్చిమోత్తరజిల్లాల్లో పరిసర మహారాష్ట్ర భాషనుంచి చాలా పదాలు జానపద వ్యవహారంలోకి వచ్చాయి (మరా. = మరాఠీ); ఉదా: ఆరె బండిచక్రపు ఆకు (109). మరా.ఆర్,అరా, కచరం, కచ్చరం గూడుబండి (110): మరా. ఖచరా, ఖాచర్, బీరారు రాష్ట్రంలో ఉపయోగించే ఒకరకం ఎద్దుబండి.
కూరె గొర్రు (57): మరా. కురీ.
గవటం, గావుటాన్ గ్రామకంఠం (5): మరా. గాంవ్‌ఠణ్, గాంవ్‌ఠాణ్.
గిరక బావిగిలక (29): మరా. గిర్కా, గిర్కీ,
గుంగురు మువ్వ (284); మరా. ఘుంగుర్, ఘుంగర్, ఘుంగూర్, ఘుంగరూ చిరుగంట, గజ్జె.
చాండు విత్తనపుకోడె (266): మరా. సాండ్.
చెకడాబండి గూడుబండి (114): మరా. ఛకడా, ఛకడ్ 'ఒకరకం ప్రయాణపుబండి.
జూడు. జూడెం గడ్డికుప్ప (207): మరా. జుడీ కట్ట, కుప్ప.
ఢేప్ని వామి(207): మరా. ఢేపణ్. ఢేప్ గడ్డివామి; ఢేప్ణే కుప్పవేయు.
తిగుట తూర్పారపోసేవాడు కూర్చుండే మూడుకాండ్ల పీట(208): మరా . తికటీ, తిక్టీ, తిక్టేం (<సం. త్రికాష్ఠ-).
తొగరు కంది (289): మరా. తువరీ, తూరీ.
దౌరాగుంటక చదునుచేసే పరికరం (66): మరా. డవర్ గుంటక.
నఖరె ఏపు (పైరు) (141): మరా. నఖరా సౌకుమార్యము.
పసులపాన, పసులపానాది నక్షత్రమార్గం (311): మరా. పాందీ, పాంథీ బాడ్లుపోయే ఇరుకుదారి, నక్షత్రమార్గం.
పాశె మేడి (69): మరా. ఫాళ్ కర్రు (అర్థ విపరిణామం).
పేరె బండిచక్రపు పూటీ (121): మరా. పేర్ అతుకు (< సం. పర్వ-).
బీగడ, బీగం, బిగం, బిగడు బిగా ఒక భూమికొలత (322): మరా. బిఘా (< సం. విగ్రహ-).
బుసక, బుసి, బుసుగు, బూసి నుంకు, నుసి (145, 212,213); మరా. భూస్ చెత్త; భుసా దువ్వ, నుసి.
బొండ కంకిపొట్టు, వట్టికంకి (145,213): మరా. బోండ్ గింజపొట్టు.
బోరెం పెద్ద జనపనార గోతం (213): మరా. బోరియా.
మదగం, మదనం పొట్టు ధాన్యం కలిసిన కుప్ప (214): మరా. మదన్.
రాతాళం గెనుసుగడ్డ(246): మరా. రతాళీ (<సం రక్తాళు.-).
రుంబ, రుంబెన గొర్రు, గుంటక, మొ. వాటి మేడి (76): మరా. రుమణీ, రుమ్హణీ, లుమణే.
లొంబ ఎన్ను (148): మరా. లొంబి.
సాటవ, సాటా బండిపరం(126): మరా. సాటా.
3. దక్షిణాన చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లో తమిళ సంపర్కంవల్ల వాడుకలోకి వచ్చిన మాటలు (త = తమిళం); ఉదా:
ఉళువాయి చక్రానికి ఇరుసుకు మధ్యవేసే ఇనపకట్టు (109): త. ఉళువాయ్ (చిత్తూరు తమిళం[6]).

6. 'చిత్తూరు తమిళం' అని సూచించిన పదాలు తిరుత్తని తాలూకాకు చెందిన ఎమ్. కందప్పచెట్టి (ట్యూటర్, తెలుగు శాఖ, వెంకటేశ్వర విశ్వవిద్యాలయం) వ్యవహారంనుంచి సేకరించినవి.

## ధ్వనులమార్పు

జీవద్భాషోచ్చారణలో ధ్వనులమార్పు సహజం. ప్రాఙ్నన్నయ కాలంనుంచి ఇప్పటివరకు తెలుగులో ఎన్నో రకాలైన ధ్వనుల మార్పులు వచ్చాయి. శాసన భాషలో కన్పించే 'వాన్రు', 'మూన్రు' మొ. శబ్దాల్లోని 'న్రు' కాలక్రమాన 'ణ్డు, ండు, ఁడు, డు' లుగా మారి పోయి 'వాడు, మూడు' అనే శబ్దాలేర్పడ్డాయి. అలానే*మరన్ > మ్రాను > మానుగా మారింది. ఈ విధంగా క్రావళ్ళుపోయి ఏర్పడ్డవే పాత, కొత్త, తాడు మొ. శబ్దాలు. ర–ఱ ల మధ్య భేదం లోపించటం (అర, అఱ > అర), పదాది డకారం దకారంగా మారటం (డాగు > దాగు, డగ్గఱ > దగ్గర), అరసున్న ఉచ్చారణ నశించటం (వాఁడు > వాడు, తోఁట > తోట,) మొ. ధ్వనుల మార్పులు ఈ పది శతాబ్దుల్లోను ఏర్పడి భాష వాడుకలో ఉన్నంత మేర ఆయా శబ్దాల స్వరూపాన్ని మార్చివేశాయి.

ఇటువంటి మార్పులు వర్తమానాంధ్ర వ్యవహారంలో కూడా ఎన్నో వ్యాప్తిలో ఉన్నాయి. భాషోచ్చారణలో జరుగుతున్న మార్పు తీరును (change in process) పరిశీలించటానికి ఈ కోశంలోని పదజాలం ఎంతో సహకరిస్తుంది. శిష్టుల వాడుకలో అన్యభాషా సంపర్కంతో చేరే తత్సమ పదాల ద్వారా ధ్వనుల మార్పులు బహుళంగా వస్తుంటాయి ఇవి జానపదుల వాడుకలోకి కూడా వారివారి అనుకరణశక్తినిబట్టి శిష్టసమాజంతో వారికున్న సంపర్క ప్రాబల్యాన్ని బట్టి క్రమంగా వ్యాపిస్తాయి. అందుకని నాగరకుల వాడుకను అనుసరించటంలో జానపదుల ఉచ్చారణలో అనేక భేదాలు కనిపిస్తాయి; ఉదా. సంస్కృతం నుంచి తీసుకున్న నక్షత్రాలు, కార్తెల పేర్ల ఉచ్చారణలో గరిష్ఠ భేదాలు జానపదుల వాడుకలో ఏర్పడ్డాయి, ఉదా. చూ. అనూరాధ (307), అరుంధతి, అశ్వని, ఆరుద్ర, ఆశ్లేష (308), కృత్తిక (309), జ్యేష్ఠ (310), పుబ్బ (311), పుష్యమి (312), మృగశిర (313), విశాఖ (314). కానీ జానపదుల మాటలు నాగరకులు గ్రహించినపుడు ధ్వనుల మార్పులు తక్కువగా ఉంటాయి. వ్యవసాయపదాలు చాలావరకు జానపదుల వాడుకనుంచి నాగరకుల వాడుకలోకి ప్రసరిస్తాయి కాబట్టి ఆయా మాటల ఉచ్చారణలో ఈ రెండు తెగలమధ్య భేదం అట్టే కనిపించదు. అదీగాక ఈ మాటల్లో చాలా భాగం దేశ్య శబ్దాలు. వీటిల్లో జానపదులకు కొరుకుడు పడని మహాప్రాణ ధ్వనులు (ఘ, భ, ధ, మొ. వి.), ఊష్మాలు (శ, ష, మొ. వి.) పలకవలసిన మాటలు చాలా తక్కువ; ఉదా. నాగలి, గొర్రు, కాడి, పలుగు మొ. వి.

దేశ్యభాగంలో వచ్చే ధ్వనుల మార్పులు సాధారణంగా శిష్టభాషకు శిష్టేతరభాషకు సమానంగానే ఉంటాయి. ఉదా. గ-వ, డ–ణ. జ-ద, ల మార్పులు అటువంటివి (తెగులు-తెవులు, మునిడి-మునిణి, సజ్జ-సద్ద); ఇలాటి మార్పులు చాలావరకు ప్రాంతీయంగా ఏర్పడుతున్నవని నిరూపించవచ్చు. దేశ్యశబ్దాల్లో కొద్దిపాటి మార్పులు కేవలం శిష్టేతరుల వ్యవహారానికి ఉపలక్షకంగా ఉండేవి కూడాఉన్నాయి; ఉదా. చ > స (చవుడు > సవుడు, నాచు > నాసు), ల- > న- (లేత > నేత, లేగ > నేగ), గ– > గె- (గట్టు > గెట్టు, గండి > గెండి), శ- > ల-(కళ్ళం > కల్లం; బిళ్ళ > బిల్ల). ఈ రెండో రకపు ఉచ్చారణలనుబట్టి ఆయా వ్యవహర్తలు జానపదులని గుర్తించవచ్చు.

జానపదుల ఉచ్చారణలో కూడా వచ్చే మార్పులు కొన్ని కాలక్రమాన శిష్టోచ్చారణలోకి కూడా ప్రవచ్చన్నంగా జొరబడతాయి; ఉదా. వి, వీ, వె, వే లతో మొదలయ్యే పదాల్లో వకారలోపం చదువురానివారి వాడుకకు లక్షణంగా శిష్టులు గుర్తిస్తారు;

ఉదా : (విశాఖ > ఇసాక, వీసం > ఈసం, వెలగ > ఎలగ, వేప > ఏప). కాని ఈ మార్పు తమ ఉచ్చారణలో కూడా ప్రవేశించినట్లు శిష్టులు చాలామంది గుర్తించరు. ఉదా: 'ఇంటికెళ్ళు' ఎళ్ళు (<వెళ్లు), శిష్టుల్లో ప్రమాణరూపంగా వ్యవహరించబడుతున్నది. ఏకాడు, ఇత్తనం మొ. రూపాలు(పదేశారు)ము(రిత్తనం, అప్రామాణికాలని వెంటనే శిష్టులకు స్ఫురించదు. ఇలా బహుళంగా వాడే ఏ నాలుగైదు శబ్దాల్లోనో తప్ప మిగిలిన పదాల శిష్టోచ్చారణలో ఈ మార్పింకా రాలేదు. (వెలుతురు, వెండి, వేడి, వెర్రి, వేకువజాం మొ. చోట్ల). సమాజంలో శిష్టులకు శిష్టేతరులకు మధ్య

అన్యోన్య వ్యవహారం ప్రబలి ఆర్థిక విద్యా సంస్కృతులలో వైషమ్యాలు తగ్గినకొద్దీ ప్రమాణ భాషకు గ్రామ్యభాషకు మధ్యభేదం సన్నగిల్లుతుంది. దేశ కాలానవచ్చిన్నంగా ఏ ఒక ఉచ్చారణ లక్షణమైనా శిష్టమనిగాని అశిష్టమనిగాని నిష్కర్షగా చెప్పటానికి వీలులేదు. ఒక కాలంలో శిష్టోచ్చారణలోనే ఉన్న పదాలకు భ్రష్టరూపాలుగాను, అసాధు రూపాలుగాను ఏర్పడ్డ ఉచ్చారణ భేదాలు కాలాంతరంలో వ్యవహార ప్రాచుర్యం పొంది పూర్వరూపాల స్థానాన్ని పూర్తిగా ఆక్రమించి ప్రామాణికా లవుతాయి; ఉదా. 'వచ్చుచున్నాడు' ప్రామాణిక రూపమైన కాలంలో 'వస్తున్నాడు' భ్రష్టరూపం; కాని 'వస్తున్నాడు' శిష్టవ్యవహారంలో చెలామణి అవుతున్న ఈనాడు 'ఒత్తున్నాడు' అనేది గ్రామ్యం అని అందరూ ఒప్పుకుంటారు. ఏదైనా ఒకమార్పు సమగ్రంగా భాషా ప్రాంతమంతటా వ్యాపించటానికి కొన్ని శతాబ్దులు పడుతుంది.

| పదాదిస్థానంలో వచ్చే మార్పులు | రెండవ అక్షరంలో వచ్చే మార్పులు |
|---|---|
| క-గ (11) | డ-ణ-న (23) |
| చ-జ (3) | గ-వ-మ (46) |
| త-ద (6) | మ-వ-య (6) |
| ప-బ (1) | డ-ర (11) |
| డ-ద (5) | శ-ల (12) |
| స-జ (6) | ల-డ (4) |
| క-చ (2) | య-గ (3) |
| | ట-ద (2) |
| | ర-న (1) |
| | స-య (1) |
| | డ-జ (1) |

పై పట్టికనుబట్టి పదాది స్థానంలో వచ్చే మార్పుల కన్నా అపదాది స్థానంలో వచ్చే మార్పులు అధికమని గుర్తించవచ్చు. అందులోను ప్రధానమైనవి డ-ణ-న, గ-వ-బ-మ. అక్షరస్థాన నియమం లేకుండా వచ్చే మార్పుల్లో ప్రధానమైనవి జ-ద, చ/స-త/ద. కొన్ని ప్రధానమైన వాటికి ఉదాహరణలు [పుటల సంఖ్యలు బ్రాకెట్లలో ఇవ్వబడ్డాయి]:

ఈ కింద నిరూపించబోయే మార్పులన్నింటికీ ప్రాంతీయ విస్తృతి నిష్కర్షగా నిర్దేశించటం కష్టం. సుమారు అయిదారు వేల గ్రామాల్లో ఉచ్చారణ విధేయమైన లిపిలో పదాలు సేకరించి ఆయా వ్యవహర్తల సాంఘిక పరిస్థితుల దృష్ట్యా పరిశీలిస్తేనే తప్ప ఈ పని సాధ్యంకాదు. 'నియత ధ్వనులమధ్యనే మార్పులు జరుగుతుంటాయి' అనే సూత్రాన్ని స్థాపించటమే ఈ ఉదాహరణల పరిమిత లక్ష్యం.

## (1) హల్లుల మార్పులు

కోశంలో రూపాంతరాలు, ఉచ్చారణ భేదాలుగా నిరూపించిన ఆరోపాలన్నిటినీ పరిశీలిస్తే నేటి తెలుగు వాడుకలో ఏర్పడి వ్యాపిస్తున్న హల్లుల మార్పులు ఈ కింది విధంగా ఉన్నాయి [బ్రాకెట్లలో ఇచ్చిన అంకె ఆయా మార్పులకు లోనైన పదక్రమాల మొత్తాన్ని సూచిస్తుంది];

| | స్థాననియమం లేకుండా వచ్చే మార్పులు |
|---|---|
| చ/స-త/ద | *(4 + 4) |
| ద-జ | (11 + 13) |
| గ-ల | (2 + 16) |
| ల-న | (4 + 10) |
| వ-బ | ( 1 + 9) |
| బ-మ | ( 2 + 4) |

[*ఈ వరుసలో ఇచ్చిన అంకెల్లో మొదటిది పదాది స్థానంలో వచ్చే మార్పుల సంఖ్య, రెండోది అపదాది స్థానంలో వచ్చే మార్పుల సంఖ్య].

A. పదాది స్థానంలో వచ్చే మార్పులు :

| (a) డ- | ద- |
|---|---|
| డల్లు (316) | దల్లు (317) |
| డొలుపు (115) | దొలుపు (117) |
| డొల్ల (115) | దొల్ల (117) |
| డోని (115) | దోనె (117) |

డల్లు, డోని శబ్దాల్లో దకారం అర్వాచీనంగా దకారంనుంచి ఏర్పడ్డట్టు తోస్తుంది. ఈ రెండు తెలంగాణా ఉత్తర జిల్లాల్లోనే వాడుకలో ఉన్నాయి.

| (b) క- | చ- |
|---|---|
| కింక (203) | చింక (206) |
| కీలిసె, కీడిసె (203) | చీలిసె 207) |

తాలవ్యీకరణం పొందని కింక, కీలిసె, కీకట, కీగర (203) వంటి శబ్దాలు ఇంకా దర్శి (నెల్లూరు), వినుకొండ, పల్నాడు (గుంటూరు), కంభం, మార్కాపురం (కర్నూలు) తాలూకాల్లో నిలిచి ఉండటం విశేషం. భాషావిషయికంగా ఈ ప్రాంతం ఇంకా అనేక పురాతన శబ్దాలను నిలుపుకొన్నదని ప్రదర్శించవచ్చు.

B. అపదాది స్థానంలో వచ్చే మార్పులు:

| (a) -డ- | -ణ- | -న- |
|---|---|---|
| ఏడికర్ర (54) | ఏణికర్ర (54) | |
| మునిడి (178) | మునిణి (178) | |
| పడత (65) | పణత (274) | |
| దాడిమ్మ (258) | దాణిమ్మ (258) | దానిమ్మ (258) |
| దండెగాడి (65) | దండెగాణి (65) | |
| బొడగ (287) | బొణుగు (287) | బొనుగు (287) |
| | కణెం (110) | కనెం (110) |
| సింగిడి (319) | సింగిణి (319) | |

కోస్తా రాయలసీమ ప్రాంతాల్లో దకారయుక్త శబ్దాలకు సరిగా తెలంగాణా (ముఖ్యంగా ఖమ్మం, వరంగల్ జిల్లాల్లో)లో ణ-న లతో ఉన్న రూపాలు వినిపిస్తాయి. ఈ మార్పులో తెలంగాణా ప్రభావం జగ్గయ్యపేట, తిరువూరు (కృష్ణాజిల్లా) తాలూకాల్లోకి కూడా చొచ్చుకొని వస్తున్నది. చూ. ఏణికర్ర (54), దండెగాణి (65), మునిణి (178).

| (b) -ండ- | -ణ- | -న- |
|---|---|---|
| కాండి (57, 111) | కాణి (56, 111) | కాని (57, 111) |
| మండిగం (123) | (*మణిగం) | మనిగం (123) |

కాణి, కాని రూపాలు ఏర్పడ్డ ప్రాంతం, చూ. పటం 5.

| c) -గ- | -వ- | -మ- |
|---|---|---|
| అగిసె (242) | అవిసె (242) | |
| తెగులు (191) | తెవులు (192) | |
| నూగులు (259) | నూవులు, నువ్వులు (259) | |
| మూగ (287) | మూవ, మువ్వ (287) | |
| రాగిసె (179) | రేవస (179) | |
| రేగడి (14) | రేవడి (15) | |
| అలుగు (23) | అలువు (23) | |
| ఎలుగు (54) | ఎలువు (54) | |

| | |
|---|---|
| గరుగు (5) | గరువు (5) |
| కరుగు (136) | కరువు (136) |
| కలిగి (159) | కలివి, కలివె (159) |
| నలుగు (77) | నలువు (77) |
| తగిరె (63) | తమిరె (63) |
| చల్లతెగడ (190) | చల్లతెమడ (190) |
| సాగినె (216) | సామెన, సామెర (217) |
| నాగర (293) | నామర (293) |
| పరిగె (172) | పరిమె (172) |
| వెలగ (255) | వెలం (255) |
| పొదుగు (275) | పొదుము (276) |
| మెలుగు (75) | మెలుము (75) |

గ- మ ల మధ్య మార్పు కనిపిస్తున్న రూపాల్లో వకారయుక్త రూపాలుకూడా ఉచ్చారణలో ఉండి ఉండాలి; అంటే *తవిరె, *తెవడ, *నావర, *పొదువు మొ. వి. ఇటువంటివి ఉచ్చారణభేదాలుగా వాడుకలో ఉన్నట్లు ఆయా ఆరోపాల కింద కోశంలో చూపించబడ్డాయి. ప్రాచీన గ కారం అచ్చుల మధ్య వ కారంగా గోదావరీనదికి ఉత్తరాన గల కోస్తాజిల్లాల్లో మారినట్టు గుర్తించవచ్చు(చూ. పటం 1). వరిమె, పొదుము, వెలం మొ. మకారయుక్త శబ్దాలు చాలావరకు శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాల్లోనే వినిపిస్తాయి. 'మూగ, నూగు' అనే రూపాలు, 'మువ్వ, నువ్వు' ల కంటె చారిత్రకంగా ప్రాచీనాలు.

(d)

| -ళ- | -ల- |
|---|---|
| ఉళవాయి (109) | ఉలవ (109) ఉలవాయి (109) |
| కళివె (159) | కలివి (159) |
| తొళికె (93) | తొలికె, తొలిక (93) |
| బళ (71) | బల, బల్ల (71) |
| కొండిమళ (57) | కొండిమొల (57) |

కన్నడ తమిళ భాషలతో కలిసే సరిహద్దు గ్రామాల్లోనే ళకారయుక్త శబ్దాలు వినిపిస్తాయి. మిగిలిన దేశమంతటా లకారంతో ఉన్న రూపాలే ప్రచురంగా ఉన్నాయి. ప్రాచీనద్రావిడ ళ-ణలు క్రీ. శ. ఎనిమిది, తొమ్మిది శతాబ్దుల్లోనే తెలుగులో ల-నలుగా మారిపోయినాయి. దేశ్యశబ్దాల్లో అందువల్ల ళ-ణలతో కూడిన మాటలు ఎక్కువగా ఉండవు. ఈ మార్పు రాని తమిళ కన్నడాలనుంచి సరిహద్దు ప్రాంతాల్లో ఎరవుగా తీసుకున్న మాటల్లోనే ఈ ధ్వనులు వినిపిస్తాయి.

(e)

| -ఱ- | -ర- |
|---|---|
| ఎఱగుంటక (53) | ఎరగుంటక (53) |
| ఈఱికమాను (88) | ఈరికెమాను (88) |
| ఓఱ్క (25) | ఓర్క (25) |
| చిఱత (114) | చిరత (114) |
| కొమ్ముగొఱిసె (291) | కొమ్ముగొరిజె, కొమ్ముగురిసె (291) |

(f)

| -ర- | -ల- |
|---|---|
| గరుసు, గరువు (5) | గలుసు (5) |
| గిరక (29) | గిలక (29) |
| గిర్ర, గిర (113) | గిల్ల (113) |
| కోటారు, కోటేరు (58) | కోటేలు (58) |
| నెరిడె (294) | నెలెడ (294) |
| పీరిసె (211) | పీలిసె (211) |

పై రూపాల్లో స్థానికంగా రకారం లకారంగా మారుతున్నట్టు తెలుస్తుంది. తెలంగాణాలోనే రెండు రూపాలున్నచోట్ల ఈ మార్పు నల్గొండజిల్లాలో ఏర్పడుతున్నట్టు గ్రహించవచ్చు; చూ. గిల్ల (113) కోస్తాజిల్లాలో కృష్ణానదికి ఉత్తరాన ర>ల వ్యాపిస్తున్నట్టు కూడా ఊహించవచ్చు; చూ. కోటేలు (58).

| (g) -ల- | -న- |
| --- | --- |
| గాలు (113) | గాను (113) |
| జీలుగు (166) | జీనుగు (166) |
| ముల్స (42) | మునస (41) |
| ములగ (254) | మునగ (258) |
| ములుకోల (74) | మునకాల (74) |
| తలుగు (285) | తనుగు (285) |

పదాది స్థానంలో వచ్చే ల>న ప్రాంతీయంగా శిష్టేతర భాషలోనే కనిపిస్తుంది. ఉదా: లేత>నేత; కాని అపదాది స్థానంలో వచ్చే ల-నల మార్పు శిష్ట భాషలో కూడా కేవలం ప్రాంతీయంగానే ఏర్పడుతున్నది; ఉదా: గోదావరినదికి ఉత్తరాన ఉండే ప్రాంతంలోనే 'మునకాల' అనే రూపం ఉన్నది. అలానే 'ములగ' కో. 23 లోను, 'తనుగు' తె. 18–21 (ఆదిలాబాద్) లోను వచ్చాయి.

| (h) -వ- | -బ- |
| --- | --- |
| తువ్వ (7) | తుబ్బ (8) |
| దవ్వ (141) | దబ్బ (141) |
| ఉవ్వ (157) | ఊబ (157) |
| కరివాయి (238) | కరిబాయి (268) |

పదాదిస్థానంలో వరిగె-బరిగె (241,240) అన్న రూపాంతరాల్లోనే వ>బ కనిపిస్తుంది. బరిగె అన్న రూపం కన్నడంనుంచి తీసుకొన్నది కాబట్టి (చూ. పుట 29) దాన్ని పరిహరించవచ్చు దబ్బ, కరిబాయి అనే రూపాల్లో కూడా వ>బ కన్నడ భాషా సాహచర్యం వల్ల ఏర్పడ్డదే.

పైన f, g, h లలో నిరూపించిన ధ్వనుల మార్పులు స్థాన నియమం లేకుండా వచ్చే వాటిలో పరిగణించినా (చూ. పుట33) పదాది స్థానంలో కంటె అపదాది స్థానంలోనే ఇవి బహుళంగా రావటంవల్ల ఈ భాగంలో చూపించబడ్డాయి.

C. స్థాననియమం లేకుండా వచ్చే మార్పులు:

| (a) చ/స | త/ద |
| --- | --- |
| చట్ట (138) | తట్ట (140) |
| చెమ్మ (248) | తమ్మ (249) |
| సొండు, సొండెం (45) | తొండం (34) |
| సీటి (217) | (<తీట), తిగుట తివుట (208) |
| ఊసర (153) | ఊదర (157) |
| పోసుకోలు (2 2) | పోతుకోలు (212) |
| బోదసరం (177) | బోదతరం (177) |

| (b) జ | ద |
| --- | --- |
| జంజెడ (32) | దందెడ (34) |
| జడ్డిగం (62) | దడ్డిగం (65) |
| జొతికె (ఉ. జొత్తికె) (63, 115) | దొత్తె (66, 117) |
| జంతె (63, 166) | దంతె (65, 169) |
| జొమ్మ (292) | దొమ్మ (298) |
| జల్లు (316) | దల్లు (317) |
| జిష్టికుండ, జిష్టిబొమ్మ (139) | దిష్టికుండ, దిష్టిబొమ్మ (141) |
| జడివాన (316) | దడివాన (317) |
| పూజు (70, 120) | పూదు (70) |
| గాజె (205) | గాదె (205) |
| అంజె (288) | అందె (283) |
| ఉజ్జి (24) | ఉద్ది (24) |
| బంజేరు (174) | బందారు (175) |
| రోజా (124) | రోదా (124) |

'జ' కు పరాన వచ్చిన అచ్చు ఏదయినా 'ద' గా మారవచ్చు : దడ్డిగం, దొత్తె, దొమ్మ, దల్లు, దడివాన, పూదు, సద్ద మొదలైనవి ఇలాటివి; కాని తాలవ్యాచ్చుతో కలిసినప్పుడే ద>జ మార్పు సాధారణంగా ఉంటుంది. ఉదా. జిష్టి, ఉజ్జి, గాజె, అంజె మొదలైనవి ఈ తెగకు చెందినవి. ఈ మార్పులు అక్కడక్కడ స్థానికంగా ఏర్పడుతున్నట్టు ఆ యా ఆరోపాల కింద ఇచ్చిన ప్రాంత సూచన పరిశీలిస్తే తెలుస్తుంది.

## 2. అచ్చుల మార్పులు

హల్లుల్లోలాగానే పదం మొదటి అక్షరాల్లో వచ్చే మార్పులకన్నా అపదాద్యక్షరాల అచ్చుల్లో వచ్చే మార్పులే ఎక్కువ. పదాద్యక్షరంలో సంవృత

వివృతాచ్చులమధ్య మార్పులు సామాన్యం : ఏ-ఆ. ఇ-ఎ, ఉ-ఒ, ఒ-అ. నిరోష్ఠ్యాచ్చులు (ఇ, ఎ) ఓష్ఠ్యాచ్చులుగ (ఉ, ఒ) మారటం కూడా కద్దు.[7]

| (a) ఏ– (తాలవ్యం, అర్ధవివృతం) | ఆ- (కంఠ్యం, వివృతం) |
| --- | --- |
| మేర (14) | మారు (14) |
| పొలిమేర (11) | పొల్మారు (11) |
| రేగడి (నేల) (14) | రాగడి (14) |
| ఏరగట్ట (54) | (ఆరగట్ట 52) |

పై రూపాల్లో వివృతోచ్చారణ (మారు, పొల్మారు, రాగడి, ఆరగట్ట) తెలంగాణా ఉత్తర జిల్లాల్లో ఏర్పడుతున్నట్టు ఆయా రూపాలకింద ఇచ్చిన ప్రాంత సూచన్నుబట్టి తెలుసుకోవచ్చు.

| (b) ఇ– (తాలవ్యం, సంవృతం) | ఎ- (తాలవ్యం, అర్ధసంవృతం) |
| --- | --- |
| మిట్ట (పొలం) (14) | మెట్ట, మెట్టు (14) |
| గిట్ట (271) | గెటిక (271) |
| మిరుగు (318) | మెరుగు (318) |
| తిగుట (208) | తెగిటె (209) |
| రిల్ల (148) | రెళ్ళ (148) |

| (c) ఉ– సంవృతం, కంఠ్యం) | ఒ- అర్ధసంవృతం. కంఠ్యం) |
| --- | --- |
| గురుజ (138) | గొరిసె (138) |
| గులుగు (162) | గొలుగు (163) |
| గుజ్జంగి (162) | గొజ్జంగ (163) |
| ముదిసిక (178) | మొదనిక (178) |

పై మార్పులు చాలావరకు స్థానికంగా పరిమిత ప్రాంతాల్లో ఏర్పడుతున్నట్టు తోస్తుంది.

| (d) ఒ- (కంఠ్యం, ఓష్ఠ్యం, అర్ధసంవృతం) | అ- కంఠ్యం, నిరోష్ఠ్యం, వివృతం) |
| --- | --- |
| నొగ (67) | నగ (66) |
| మొల. మొల్ల (76) | మళ (74) |
| కొండిమొల (57) | కొండిమళ (57) |
| పొణక (12) | పనక (119) |
| మొలవ (178) | మలవ (178) |

పై రూపాల్లో రెండో అక్షరంలో వచ్చిన వివృత-అకార సంయోగంవల్ల పూర్వాక్షరంలోని ఒకారం అకారంగా మారిపోయింది (చూ. పైన a). దీనికి విరుద్ధమైన మార్పు కూడా (అ>ఒ) భిన్నపరిసరాల్లో జరుగుతుంది, ఉదా: పలుగు>పొలుగు (69), తవ్వకం>తొవ్వకం (140), పడుగు>పొడుగు (270), పలుపు>పొలుపు (286). ఈ రూపాల్లో ఓష్ఠ్యహల్లుల (ప, బ, వ, మొ.) కలయికవల్ల అకారానికి ఓష్ఠ్యోచ్చారణవచ్చి ఒకారంగా మారినట్టు చెప్పవచ్చు. కాని ఈ మార్పు నేటి తెలుగు వాడుకలో చాలావరకు శిష్టేతర భాషలోనే ఉండటంవల్ల పొలుగు, పొలుపు మొ. రూపాలు కోశంలో ఆ యా ఆరోపాల కింద ఉచ్చారణ భేదాలుగానే ఇవ్వబడ్డాయి. బబ్బెర-బొబ్బెర అనే జంటలో మాత్రం బ-బొల భేదం ప్రాంతీయంగా శిష్టభాషలో గూడ ఏర్పడ్డదని తెలుసుకోవచ్చు (చూ. పటం 22).

(e) పద్యాక్షరంలో ఇ-ఉ (ఇనక-ఉసికె. ఇసిరికె-ఉసిరిక, దిరిసెన-దురిసెన), ఇ-ఒ (బిదర-బొదర, గిట్ట-గొట్టె), ఎ-ఒ (గెల-గొల), అ-ఉ (గనుపు-గుసుపు) మొ. మార్పులు కొద్ది జంటల్లో కనిపిస్తాయి. ఈ మార్పులకు ఆయా శబ్దాల వ్యుత్పత్తులు, ప్రాంత భేదాలు ఆధారాలుగా ప్రదర్శించవచ్చు.

---

7. ఈ వ్యాసంలో 'సంవృత వివృత' శబ్దాలు సంస్కృత వ్యాకరణ శిక్షాశాస్త్రాల్లో ఉపయోగించిన అర్థంలోగాక, అంతకన్నా విస్తృతమైన అర్థంలో ఉపయోగించబడ్డాయి. ఆధునిక ధ్వనిశాస్త్రంలో అచ్చుల్లో ఇ-ఉ లు close (vowels), ఎ-ఒ half-close, ఏ-ఓ half-open, అ open అని విభజించారు. ఆయా అచ్చుల ఉచ్చారణలో ఏర్పడే వక్త్రావకాశాన్నిబట్టి ఈ విభజన జరిగింది. Close కు సమానార్థకంగా 'సంవృతం' అని, open కు సమానార్థకంగా 'వివృతం' అని ఇక్కడ వాడబడ్డాయి. ఇ-ఉ లతో పోల్చినప్పుడు ఎ-ఒ ల ఉచ్చారణ వివృతం. ఏ-ఓ ల ఉచ్చారణ వివృతతరం, అ ఉచ్చారణ వివృతతమం; అలానే కిందినుంచి పైకి వెళ్ళేకొద్దీ (అ-ఓ-ఒ-ఉ, ఏ-ఎ-ఇ) ఉచ్చారణలో క్రమంగా సంవృతత్వం ఏర్పడుతుంది.

(f) ఒక హల్లు పరమైనప్పుడు పదం మొదటి అక్షరంలో ఉండే దీర్ఘాచ్చు, రెండు హల్లులు పరమైనప్పుడు ఉండే హ్రస్వాచ్చు — పరస్పరం మారటం వైకృతశబ్దాల్లో తరచు కనిపిస్తుంది.

| దీర్ఘాచ్చు [ఒక హల్లు | హ్రస్వాచ్చు [రెండుహల్లులు |
|---|---|
| ఏతం (25) | ఎత్తం (24) |
| చీల (61) | చిల్ల (61) |
| కడచీల (110) | కడచిల్ల (110) |
| కారు (57) | కర్రు (56) |
| గూటవ (59) | గుంటవ (59) |
| పేడ (95) | పెండ (94) |
| గీర (113) | గిర్ర (113) |
| నూగులు (నూవులు) (259) | నువ్వులు (259) |
| దూడ (266) | దుడ్డె (266) |

ఈ భేదం కొన్ని మాటల్లో ప్రాంతీయంగా ఏర్పడుతున్నదని నిష్కర్షగా చెప్పవచ్చు (చూ. పటాలు 8, 10, 13).

(g) రెండక్షరాల మాటల్లో ఆద్యక్షరంలోని దీర్ఘాచ్చు. అనుబంధ ప్రత్యయం (formative suffix) చేరి ఆ పదం మూడక్షరాలదిగా మారినప్పుడు, హ్రస్వాచ్చుగా మారుతుంది, ఉదా :

| | |
|---|---|
| గీర (29) | గిరక (29) |
| దోని (66) | దొనుప (66) |
| పూలి (174) | పులివె (174) |
| బూసి (213) | బుసక (212) |

ఇలానే నారవ-నరవ (35), దూసర - దుసర (170), మోటికె-మొటిక (147) మొ. చోట్ల కూడా అక్షరసంఖ్య పెరిగినప్పుడు పదాద్యచ్చు పరిమాణంలో మార్పు కనిపిస్తుంటుంది.

అపదాద్యక్షరాల్లో ఉండే అచ్చుల మార్పులు బహుముఖంగా ఉండటంవల్ల గ్రంథవిస్తర భీతిచేత ఇవ్వటం లేదు. రెండు, మూడక్షరాల్లో అ-ఇ-ఉ-ఎ లు అన్యోన్యం మారుతుంటాయి. ఇటువంటి మార్పులు వచ్చిన రూపాలు చాలా వరకు వైయక్తికాలు, స్థానికాలు కావటంవల్ల ఆరోపాలుగా ఇచ్చిన ప్రమాణరూపాల కింద ఉచ్చారణ భేదాలుగానే చూపించబడ్డాయి. కాని, ఈ మార్పుల్లో ఒకటి మాత్రం ప్రాంతీయంగా విలక్షణమైనది.

(h) మూడుగాని అంతకన్న ఎక్కువగాని అక్షరాలు గల మాటల్లో అపదాదిస్థానంలో ఒక ప్రాంతం వాడుకలో ఉన్న దీర్ఘాచ్చుకు సరిగా మరొక ప్రాంతంలో హ్రస్వాచ్చు ఉంటుంది. అచ్చు పరిమాణం (quantity)లో వచ్చే మార్పులతోపాటు స్వరూపం (quality) కూడా మారటం కద్దు. చారిత్రకంగా దీర్ఘాచ్చులున్న రూపాలే ప్రాచీనాలని ఆయా పదాల వ్యుత్పత్తులనుబట్టి నిరూపించవచ్చు.

| దీర్ఘాచ్చు | హ్రస్వాచ్చు (స్వరూపం మారకుండా) | హ్రస్వాచ్చు (స్వరూపం మార్పుతో |
|---|---|---|
| నాగేలి(లు) (67) | నాగెల (67) | నాగలి (67) |
| గుద్దేలి(లు) (91) | గుద్దెల (91) | గుద్దలి (91) |
| మాగేలి (13) | (*మాగెలి) | మాగిలి (13) |
| కైకూలి (18) | (*కైకులి) | కైకిలి (18) |
| గంజేరు (161) | గంజెర (245) | |
| తంగేడు (167) | తంగెడు (167) | |
| బోదారి (40) | | బొదర (39) |
| మారేడు (262) | (*మారెడు) | (మారడ) |
| నేరేడు (260) | (*నేరెడ) | (నేరడ) |
| వడిసేల (148) | వడిసెల (148) | (వడిసల) |
| పిల్లిపీచర (173) | పిల్లిపిసర (173) | (పిల్లిపెసర) |

[పైన బ్రాకెట్లలో ఉన్న రూపాలు కోశంలో ఆయా ఆరోపాలకు ఉచ్చారణ భేదాలుగా చూపించబడ్డవి. *గుర్తున్న రూపాలు ఈ కోశంలో రాకపోయినా పూర్వాపరరూపాలను అతికేవిగా ఉచ్చారణలో ఉండి ఉండవచ్చునని సూచన.]

పై రూపాల్లో ఒక్కొక్క క్రమంలో ఉండే రూపాంతరాల చరిత్ర, ప్రాంతీయ విస్తృతి పరిశీలిస్తే ఈ మార్పు ఆయా శబ్దాల్లో కొన్ని శతాబ్దుల కిందటనే ఆరంభమై పూర్వరూపాలు వాడుకలో ఉన్న ప్రాంతాలను క్రమంగా ఆక్రమిస్తున్నట్టు తెలుస్తుంది. కొంతకాలానికి నాగలి, గుద్దలి, మొ. రూపాలు పూర్తిగా దేశమంతా వ్యాపించి నాగేలి, గుద్దేలి, మొ. రూపాలను పూర్తిగా వాడుకలో లేకుండా చేయవచ్చు (చూ. పటం 6).

## 3. సామాన్య ధ్వనిపరిణామాలు

ఇంతవరకు చెప్పిన ధ్వనుల మార్పులు తెలుగు భాషకు విలక్షణమైనవి. ఇవిగాక ఏ భాషలోనైనా ఉచ్చారణ సౌలభ్యం కోసం సామాన్యంగా జరిగే ధ్వనుల మార్పులు కొన్ని ఉన్నాయి; ఉదా.

(a) వర్ణసమీకరణం (Assimilation):

రెండు విజాతీయ హల్లులుగాని అచ్చులుగాని సన్నిహితంగా వచ్చినపుడు వాటిలో ఒకవర్ణం సన్నిహితవర్ణానికున్న ఉచ్చారణ ధర్మాలను పాక్షికంగా గాని పూర్తిగా గాని పొందుతుంది.

సంపూర్ణ సమీకరణానికి ఉదా.

| | |
|---|---|
| బొంతు (145, 213) | బొత్తు (213, 282) |
| పందకం (119) | పన్నకం (68,119) |
| మంచె (145,213) | మచ్చు(145,213,281) |
| జంబి (166) | జమ్మి (166) |
| పొట్కు (252) | పొక్కు (252) |
| కర్తాళి (159) | కత్తాళి (159) |
| అర్ద (200) | అద్ద (200) |
| కాష్ఠం (279) | కాట్టం (279) |
| జ్యేష్ఠ (310) | జిట్ట, జెట్ట (310) |

అచ్చుల్లో సమీకరణానికి నాగేలి - నాగలి, కైకాలి–కైకేలి (చూ. పైన h).

పాక్షిక సమీకరణానికి ఉదా.

| | |
|---|---|
| మెంటె (75) | మెండు (75) |
| ఎంటి (201) | ఎండు (201) |
| పుంటి(కూర) (251) | పుండి (251) |
| కలుజు (కజ్లు) (27) | (కన్జు) |
| వణత (68,274) | (వన్త) |

ఈ రూపాల్లో శ్వాసవంతమైన టకారం నాదవంతమైన ణకార సంయోగంవల్ల నాదవర్ణంగా(డ) మారింది. ల్జ > న్జ లో లకారం, జకారం ఏర్పడే దంత మూలస్థానానికి సమీకృతం అయింది. అలానే దంత్యతకార సంయోగంలో మూర్ధన్య ణకారం దంత్య నకారంగా మారింది. ణత > న్త.

(b) స్వరభక్తి [Anaptyxis]:

విజాతీయ హల్లులు సమీకరణం పొందనప్పుడు వాటిమధ్య ఒక హ్రస్వాచ్చు చేరి రూపంలో మరొక అక్షరం పెరుగుతుంది. ఇలా ఏర్పడ్డ రూపాలు చాలావరకు జానపదుల వాడుకలోనే ఉండటంవల్ల అవి ఉచ్చారణ భేదాలుగా కోశంలో చూపించబడ్డాయి; ఉదా. అగ్రహారం (1)>(అగ్గురారం). మక్తా (21)> (మగతా)ఖుష్కి-[5]>[కుసికి], కుర్పె(90)>[కురిపె,కురుపి, కురిపి], రక్తనూల [296]> (రగతనూల), ఇంద్రజిత్తు [315]>(ఇందరజిత్తు).

(c) వర్ణవ్యత్యయం (Metathesis)

భిన్నాక్షరాలకు చెందిన అచ్చులుగాని హల్లులుగాని పరస్పరం స్థానవినిమయం పొందటం;ఉదా.

| | |
|---|---|
| దబ్బ (65,116) | బద్ద (71) |
| కోంద్ర (58) | కోర్న (58) |
| తమిరె (63,116) | తరిమి (116) |
| మొలతాడు (215) | మొఠతాలు (215) |
| రాగోల [147] | [రోగాలు] |
| వారిజె (77) | వాన్రె [77] |

వాన్రె, బర్రలు (<బర్లు, బర్రెలు), మొ. రూపాలు ఎక్కువగా ఉత్తర తెలంగాణా ప్రాంతం వాడుకలో ఏర్పడుతున్నాయి.

(d) అక్షరసంకోచం (Vowel contraction):

మామూలుగా మూడుకంటె ఎక్కువ అక్షరాలున్న మాటల్లో అపదాది స్థానంలో వచ్చే తేలిక ధ్వనులు (గ, వ, య మొ. వి.) లోపించి తత్పూర్వాచ్చు సామాన్యంగా దీర్ఘం అవుతుంది. ఈ దీర్ఘాచ్చు రెండవతరపు మార్పులో మళ్ళీ హ్రస్వం కావచ్చు; అపదాది స్థానంలో వచ్చే అచ్చుగాని హల్లుగాని లోపించటంవల్ల కూడా కొన్ని మాటలు కురుచకావచ్చు; ఉదా.

| | |
|---|---|
| కొడవలి (90) | కొడేలి (90) |
| | కొడలి (90) |
| వాయిదార (96) | వాదర (96) |
| పెటకోల (144) | పెటాల (144) |
| కసివెంద (160) | కసింద (159) |
| గువ్వగుత్తి (162) | గూగుత్తి (162) |
| తిగుట (208) | తీట (208) |
| ఉళువాయి (109) | ఉలవ (109) |
| జీలుగు (166) | (జీంగ) |
| బయాహుండా (229) | (బైగొండ) |
| ఏరువాక (303) | ఏరక (303) |
| మృగశిర (313) | మీసర (313) |
| వుబసం (మాను) (28) | వూసం (28) |

(e) ఊతలేనిఅచ్చులోపం

(Loss of unstressed vowel):

తెలుగులో అపదాద్యక్షరాల్లోని అచ్చుల మీద ఊత (stress, prominence) ఉండదు. తెలంగాణా పశ్చిమోత్తర జిల్లాలవారి ఉచ్చారణలో ఉర్దూ, మరాఠీ భాషల ప్రభావంవల్ల రెండో అక్షరంలోని హ్రస్వాచ్చు లోపించి కొత్తరకాలైన హల్సంయోగాలు ఏర్పడతాయి: చెరువు (31) >(చెర్వు), మడుగు (40) > (మడ్గు), ఇసక (నేల) (2) > (ఇస్క), పట్టుకంబం (60) > (పట్గంబం).

(f) జానపద వ్యుత్పత్తి (Folk etymology):

ఒక పదంలోగాని పదబంధంలోగాని అపరిచితంగా (లేక అల్ప పరిచితంగా) ఉన్న పదభాగాన్ని తీసివేసి దాని స్థానంలో పరిచితపదాన్ని ఉంచటం జానపదుల నూతనపద సృష్టిలో ఒక పద్ధతి, ఉదా శ్రీకుసుమ (226) <C- కుసుమ (ముసుపు వ్యవసాయశాఖవారి విభజనలో దీన్ని C-కుసుమ అనేవారు). పొగాకు>పువ్వాకు (261), చెక్రవంతికూర (248)>(చెక్రవర్తికూర), అరుంధతి >ఆరంజోతి (307), ఆశ్లేష>అసిలేరు (425), ఆరుద్రకార్తె > ఆరెద్దులకార్తె (303), కోడిపీట (112) >(కోడిపిట్ట, కోడిపెట్ట), మక్కా-(జొన్న) >మొక్కజొన్న నొష్టనుడి>నష్టనుడి (273).

ఇంతవరకు ప్రదర్శించిన ధ్వనుల మార్పులవల్ల కలిగిన రూపాంతరాల్లో చారిత్రకంగా ఏవి ప్రాచీనాలో, ఏవి అర్వాచీనాలో నిరూపించే ప్రయత్నం అంతటా చేయలేదు. ఒక్కొక్క మాట చరిత్ర సమగ్రంగా పరిశీలిస్తేనే తప్ప ఈ పని సాధ్యంకాదు. దానికి ప్రత్యేక పరిశోధన అవసరం. నేటి తెలుగు వాడుకలో ఏ యే ధ్వనులమధ్య మార్పులు జరుగుతున్నది, అవి ప్రాంతీయంగా ఎలా వ్యాపిస్తున్నది స్థూలంగా సూచించటమే పై విభజన ఉద్దేశ్యం. ఈ మార్పుల్లో ఏవో కొన్ని ముందు ముందు పరిస్థితుల అనుకూల్యాన్నిబట్టి దేశమంతటా వ్యాపించి, ఆ యా శబ్దాల స్వరూపాన్ని మార్చివేయవచ్చు. ఉదా. నాగలి<నాగేలి, నూవులు/నువ్వులు < నూగులు. కొద్ది ప్రాంతాల్లోనే ఇంకా వాడుకలో ఉన్న నాగేలి, నూగులు అనే రూపాలు నాగలి, నువ్వులు అనే రూపాల వ్యాప్తికిలొంగి, క్రమంగా వ్యవహారచ్యుతి పొందవచ్చు.

ఏ ధ్వనుల మార్పైనా సమగ్ర వ్యాప్తి పొందటానికి కొన్ని శతాబ్దులైనా పడుతుంది. ఇప్పటి వాడుకలో కనిపించే గ-వ, డ-ణ మొ. మార్పులు ఈనాటివి కావు; ఉదా అడగు-అణగు, తెగులు, తెవులు మొ. రూపాంతరాలు నన్నయకాలంనుంచి కావ్యభాషలోగూడా కనిపిస్తున్నాయి. కాని ఇవి డ->ద- (డాగు>దాగు, మొ.), ఱ > ర (అఱ>అర) మొ. మార్పుల్లాగా వాడుకలో సమగ్ర పరిణతిని ఇంకా పొందలేదు. ఈ కారణంవల్ల పైన నిరూపించినవన్నీ అనేక శతాబ్దులుగా వాడుకలో జరుగుతున్న ధ్వనుల మార్పుల వర్తమాన స్వరూపాన్ని ప్రదర్శిస్తాయని గ్రహించాలి.

### భాషామండల విభాగం

నేటి తెలుగు వాడుకలో ఎన్ని భాషామండలాలు (dialects) ఉన్నాయి, అనేది ఇంతవరకు ఎవ్వరూ పరిష్కరించని సమస్య. పరిపాలన సౌకర్యాని కేర్పరచుకొన్న జిల్లాల పేర్లనుబట్టి చేసే మాండలిక విభాగం (గుంటూరుమాండలికం, విశాఖపట్నం మాండలికం మొ వి) శాస్త్రీయమైందికాదు.

సమానార్థంలో దేశమంతటా లభించిన పదాల (రూపాంతరాలు, పర్యాయ పదాలు) ప్రాంత విస్తృతి ఆధారంగా నేటి తెలుగులో ప్రధాన భాషామండలాలను, వాటి సరిహద్దులను శాస్త్రీయంగా నిరూపించవచ్చు. కొన్ని మాటలు కొన్ని ప్రాంతాలకే పరిమితంగా ఉంటాయి; వాటికి సరిగా మిగిలిన ప్రాంతాల్లో వేరు వేరు పదాలు వాడుకలో ఉంటాయి; ఉదా. బండి చక్రం అనే అర్థంలో పది పదకొండు శబ్దాలు దేశమంతటా భిన్న ప్రాంతాల్లో వాడుకలో ఉన్నాయి: చక్రం, ఉండ, గాను, గాలు, గిర్ర, గిల్ల, గిరె, గారె, పయ్యె, రోజా, రోదా. వీటిల్లో ఒక్కొక్క పదం నిర్దిష్ట ప్రాంతంలోనే వాడుకలో ఉండటానికి ఆ పద చరిత్రను పరిశీలించి, హేతువులూహించవచ్చు. అలానే మోట–కపిల, తూము–మదుం, నాగలి–నాగేలి-మడక, ఎరువు–గెత్తం మొ.వి వేరు వేరు ప్రాంతాల్లో వాడుకలోఉన్న సమానార్థక శబ్దాలు.

కోశంలో ఇచ్చిన గ్రామసంఖ్యలు ఆధారంగా సమానార్థక శబ్దాల్లో ఒక్కొక్కదానికున్న ప్రాంత విస్తృతి ఆంధ్రదేశ పటంలో వేరు వేరు సంకేతాలతో సూచించవచ్చు. సంకేతం మారినచోట వాడుక మారుతున్నట్టు గ్రహించాలి. ఈవిధంగా ఒక్కొక్క మాట వాడుకకు పటంలో సరిహద్దులు నిర్ణయించి, వీటిని రేఖలతో సూచించవచ్చు. ఈ రేఖలను వ్యవహార భేదకరేఖలు (Isoglosses) అనవచ్చు. అనేక సమానార్థక పద సమూహాలకు ఈవిధంగా ప్రాంత విస్తృతి గుర్తించిన పటాలను పోల్చి చూచినపుడు ఏ రెండు పటాలూ పూర్తిగా ఒకేరకంగా ఉండక పోవచ్చు కాని, ఎక్కువ పటాల్లో వచ్చే కొన్ని వ్యవహారభేదకరేఖలు ఒక బొత్తిగా సమాన ప్రాంతాలను వేరుచేస్తున్నట్టు కనిపిస్తే ఆ బొత్తి భిన్న భాషామండలాలకు సరిహద్దుగా గుర్తించవచ్చు.

ఈ వ్యాసం చివర ఇటువంటి పటాలు ఇరవై ఎనిమిది దాకా పొందుపరచబడ్డాయి. ఒక్కొక్క పటంలో సమానార్థంలో వచ్చే వాడుకల భేదాలు వేరువేరు గుర్తులతో సూచించబడ్డాయి. ఈ పటాలు ఆధారంగా ఆ యా మాటల చరిత్ర ఇంతకుముందు కంటె మనకు స్పష్టంగా తెలుస్తుంది. దీన్నిబట్టి వ్యక్తులకులాగానే పదాలకుగూడా చరిత్ర ఉంటుందని నిరూపించవచ్చు. జీవజంతువులకు లాగానే మాటలకు గూడా వృద్ధి క్షయాలు సహజం.

చివర ఇచ్చిన పటాల్లో ఒక్కొక్క దానిలోఉన్న మాటల స్థూల చరిత్ర [సంకేత వివరణ : తెలు. = తెలుగు; త. = తమిళం; మ. = మలయాళం; క. = కన్నడం: తు. = తుళు; మరా. = మరాఠీ; హిం. = హిందూస్తానీ; సం. = సంస్కృతం; ప్రా. = ప్రాకృతం; *DED* = *Dravidian Etymological Dictionary;* * గుర్తు కొన్ని తులనాత్మక రీతులను బట్టి పునర్నిర్మించిన పూర్వరూపానికి సూచన.]

*పటం* 1 : రేగడి - రేవడి - రాగడి. చారిత్రకంగా ప్రాచీనరూపం రేగడ. సోదరభాషలతో పోల్చినప్పుడు దీని పూర్వరూపం *ఇరయ్‌కడ ఇది సమస్తపదం. *ఇరయ్ నల్లని, కడ చోటు; నల్లనేల అని అర్థం [క. ఎరె నలుపు ఎరుపు గలిసిన రంగు నల్లనేల] ఇరులు చీకటి, ఇనుము (<ఇరుంబు నల్ల లోహం), మొ, రూపాల్లో ఉన్న *ఇర్ అనే ధాతువే *ఇరయ్‌లో ఉన్నది (సోదర భాషల్లో ఉండే రూపాలకు. చూ. *DED* ఆరోపం 2102). వర్ణవ్యత్యయం వల్ల *ఇర-, రే అవుతుంది. ఈ మార్పు తెలుగులో చరిత్ర కందని కాలంలోనే జరిగింది. *ఎళ->లే-, *పఱ>ప్రా-, ఇటువంటివి).

రేగడ శబ్దానికి ఔపవిభక్తికాలుగా ఏర్పడ్డ రేగటి, రేగడి అనే రూపాలు సామ్యంవల్ల ప్రథమలోగూడా వాడబడుతూ వచ్చాయి. ఈ రకంగా ఒకే పదానికి మూడు రూపాంతరాలు ఏర్పడ్డాయి. రేగడ-రేగడి రేగటి. చివరి అక్షరంలో ఉండే ఇకార ఆకర్షణవల్ల

మధ్య అక్షరంలో అ>ఇ కొందరి ఉచ్చారణలోవచ్చి రేగిడి అన్న రూపం గూడా స్థానికంగాను, వైయక్తికంగాను ఏర్పడ్డది. ఈ రూపాంతరాలన్నిట్లోను నేటి వాడుకలో ఎక్కువగా ఉన్నది *రేగడి*. ఈ పద చరిత్రలో ఒకానొకప్పుడు తెలుగు వ్యవహారంలో రేగడ ఒక్కటే ప్రథమలో ఉండి ఉండాలి.

గోదావరిజిల్లాలో ఈ పదోచ్చారణలో క్రమంగా *గ*, *వ* గా మారింది. ఈ మార్పు(*గ*>*వ*) దక్షిణాన కృష్ణానది వరకు, పశ్చిమాన ఖమ్మంమెట్టు జిల్లాలోకి, ఈశాన్యాన విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాల్లోకి ఇప్పటికి వ్యాపించింది. విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లో *రేవడి-రేగడి* అని రెండురూపాలు పక్కపక్కనే ఉండటం గమనించదగ్గది క్రమంగా *రేవడ* రూపం ప్రచురమౌతున్నట్టు పటాన్నిబట్టి గుర్తించవచ్చు. తూర్పు గోదావరి జిల్లాలో శబరీనది దగ్గర ఈ మార్పు ఆగిపోయింది.

తెలంగాణాలో రెండుచోట్లా, రాయలసీమలో అక్కడక్కడా రే లో ఉండే అచ్చు ఏ క్రమంగా వివృతమై ఆ గా మారిపోయి **రాగడి-రాగిడి** అనే రూపాలేర్పడ్డాయి. ఈ మార్పు తెలంగాణా పశ్చిమోత్తర జిల్లాల్లో (ఆదిలాబాద్, కరీంనగర్, నిజామాబాద్, మెదక్) ఎక్కడో మొదలై నాలుగువైపులా వ్యాపిస్తున్నట్టు పటాన్నిబట్టి తెలుస్తుంది. దేశంఅంతటా రే లో ఉన్న అచ్చు ఏ>ఏ (æ) అయిందని నిరూపించవచ్చు. ఇది మరీ వివృతమై ఆ గా మారుతుంది, ఈ వివృతోచ్చారణకు కారణం రెండో అక్షరంలో ఉండే అ; మేడ, మేక, లేత, పేడ మొ పదాల్లోగూడా మొదటి అక్షరంలోని అచ్చు ఉచ్చారణ ఈ కారణం వల్లనే ఏ గా మారింది. (చూ. పుట 37 a)

*పటం. 2* : తువ్వ-దుబ్బ. తువ్వ శబ్దం చారిత్రకంగా ప్రాచీనం; అంతకుముందు రూపం తూవ. బహుశా కన్నడ సాహచర్యంవల్ల వ, బ గా మారి *తూబ, దూబ శబ్దాలేర్పడతాయి. పదాద్యచ్చు హ్రస్వమై, పరహల్లు ద్విరుక్తమైనపుడు తువ్వ, దుబ్బ రూపాలేర్పడతాయి (చూ. పుట 38 f); తువ్వ> దుబ్బ గా మారిన ప్రాంతం పటంలో ప్రత్యేకంగా గుర్తించబడ్డది. ఈ వ్యవహారభేదకరేఖ (Isogloss) మహబూబ్‌నగర్, ఖమ్మంమెట్టు జిల్లాల్లో కొంత భాగం, మిగిలిన తెలంగాణా ప్రాంతమంతటా వచ్చినట్టు గుర్తించవచ్చు. సమీపాన కృష్ణాజిల్లాలోకికూడా ఈ మార్పు తోసుకువచ్చింది. మహబూబ్‌నగర్‌లో దుబ్బ-తువ్వలు కలిసే సరిహద్దు ప్రాంతంలో (తె. 1, 2) ఈ రెండు రూపాలూ ఉండటం విశేషం, చూ. కల్లువ్వ (5), దుబ్బతువ్వ (12).

*పటం 3* మోట-కపిల. కపిల దేశ్యం ప్రాచీనం. ఇది రాయలసీమ, నెల్లూరు జిల్లాల్లోనే నిలిచిఉన్నది; [చూ. త. కపిలై, కవలై. తు. కప్పి]. మిగిలిన దేశమంతా వ్యాప్తిలో ఉన్న మోట అన్యదేశ్యం < హిం మోట్ తోలుబొక్కెన. గోదావరి జిల్లాలో ఈ పనిముట్టు పేరు పదసంగ్రహణలో రాలేదు. కపిల వ్యాప్తిలో ఉన్న ప్రాంతంలో కూడా మోట అన్న పదం అందరికీ పరిచితం. కొంతకాలానికి మోట పదమే కపిలను తోసివేసి దక్షిణాది జిల్లాలకు కూడా వ్యాపించే సూచనలున్నాయి, కపిల అనే పదానికి మహాభారత ప్రయోగం ఉంది :

> కుడువనిచ్చు తఱియుఁ గురువర క్రక్కించు నవ
> సరంబు నెఱిఁగి యరినృపాలు
> నీవు ధీరవృత్తినిడుఁ ద్రాట బోనిమ్ము
> క్రమ్మ కపిల యనఁగఁ గ్రమ్మి చెఱవు

(పాఠాంతరం : చెఱుము) (భార. ఆశ్రమ. 1.72). ఈ ఉపమానంలో కుడువనిచ్చు (బొక్కెననింపటం). క్రక్కించు, నిడుద్రాట గమనించదగ్గ పదాలు, మోటకు ప్రాచీన కవిప్రయోగం లభించలేదు.

*పటం 4* తూము-మదుం. రెండూ దేశ్య శబ్దాలే. (చూ (1) త. మ. తూంపు గొట్టం. చెరువు కాలవ; క. తూబు చెరువు కాలవ; తు. తూంబు, సూంబు తూము; (2) త. మతకు కట్టుబడితూము; క. మదగ, మదగు చెరువుతూము (flood gate); తెలు. మదుగు జలస్రుతి (భాగ. 10. పూ. 7. 56) (సూ ని.).] మదుము, మదువులు సూ. ని. లో వాడుక రూపాలుగానే ఇవ్వబడ్డాయి. అచ్చులమధ్య *గ*>*వ*>*మ* మార్పు కళింగదేశంలో కనిపిస్తుంది (చూ. పుట 39). దేశమంతటా వ్యాపించిన **తూము** శబ్దం కళింగదేశపు సరిహద్దుతో ఆగిపోయింది,

శ్రీకాకుళం, విశాఖపట్టణం ప్రాంతంలోనే ఈ తొలి తెలుగుపదం ఇంకా వాడుకలో నిలిచి ఉంది. కో. 34 (తూము, మదుముల వాడుకకు సరిహద్దు గ్రామం)లో **తూము**, మెదవు అనే రెండు పదాలు ప్రయోగ వైలక్షణ్యంతో వాడుకలో ఉన్నాయి. నీరు పొయ్యేమార్గం తూము (పుట 33);దాని కడ్డంగావేసే రాయి మెదువు రాయి (పుట 42).

రాజకీయంగా కళింగదేశం అనేక శతాబ్దులు (16 వ శతాబ్దివరకు) మిగిలిన దేశంతో సంబంధం లేకుండా ఉండటంవల్ల తూము పదం ఆ ప్రాంతంలో జారబడలేదు. నేటి వాడుకలోగూడా కళింగదేశం ప్రత్యేక భాషామండలమని స్థాపించవచ్చు.

*పటం 5*. (1) **కాడి**, (2) **కాడిమాను-మాకు**, (3) **కాండి-కాణి-కాని**, (4) **కావడి**, (5) **పూజు – పూదు**. ప్రాంత విస్తృతిని బట్టి ఈ పటంలో గుర్తించిన పదాలను అయిదు తెగలు చేయవచ్చు. మొదటి మూడు *కాణ్డి శబ్దంనుంచి ఏర్పడ్డవి. పూజు-పూదు లో జ>ద వల్ల పూదు అర్వాచీనం; పూజు, పూంచు సోదర శబ్దాలు; పూను ధాతువు. ప్రాచీన ద్రావిడం *పూణ్ (చూ. DED 3577). స్థూలంగా కళింగదేశంతప్ప మిగిలిన ఆంధ్రదేశమంతటా ఒకప్పుడు కాండి రూపమే వాడుకలో ఉండి ఉండాలి. పటంలో గుర్తించినట్టు తెలంగాణాలో తప్ప మిగిలిన ప్రాంతంలో కాణ్డి> కాండి >కాడిగా మారింది. అంటే దీర్ఘాచ్చుమీది అనునాసికం, ఆనునాసిక్య మాత్రమై పూర్తిగా లోపించింది. ఈ మార్పు వచ్చిన ప్రాంతంలో ఒకచోట (రాయలసీమ, మహబూబ్‌నగర్) ఈ పదంతో మ్రాను-మ్రాకులు కలిసి వాడుక స్థిరపడ్డది : కాడిమాను-కాడిమాకు; తుంగభద్రకు ఉత్తరాన కాడిమాకు అని దక్షిణాన కాడిమాను అని అంతర్భేదం ఏర్పడ్డది. మొత్తానికి స్థూలంగా కాడి–కాణ్డి ప్రధాన భేదాలుగా గుర్తించవచ్చు. కాణ్డిలో అనునాసికం లోపించని ప్రాంతంలో మరొక ధ్వనుల మార్పువస్తున్నది, ణ్డి >ణి >ని; ఇది ఇంకా పూర్తిగా పరిణతిపొందని మార్పు. తెలంగాణాలో గోదావరి నదిపొడవునా కాణ్ణి - కాణి రూపాలు, ఆ కింద (మెదక్, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ, జిల్లాల్లో) ఒక్క-కాని అనే రూపం వాడుకలో ఉండటం గమనించదగ్గది. ఈ మొత్తం ప్రాంతంలో రెండు మార్పులు తెరలు తెరలుగా వచ్చాయి. 'వరంగల్' బహుశా ఈ మార్పులకు కేంద్రమై ఉంటుంది. ముందు ఈ దేశమంతతా ణ్డి > ణి గా మారింది. రెండోది ణి >ని మార్పు. ఈ ప్రాంతానికి అంచుల్లా ఉన్న కో. 25, తె. 10 గ్రామాల్లో ఇంకా కాణిరూపం వాడుకను బట్టి ణి>ని తెలంగాణా నడిమిజిల్లాల్లోనే ఆరంభమై ఉంటుందని ఊహించవచ్చు.

**కావడి** కన్నడంలో మన కాడికి సమానార్థంగా వాదేపదం. రా. 15,16 గ్రామాల్లో ఇది కన్నడం నుంచి తీసుకున్న ఎరువుమాట కావచ్చు (చూ. పుట 82).

మిగిలిన దేశంతో ఏ రకమైన సంబంధమూ లేని పదం పూజు, దేశ్యమైనా, కళింగదేశంలోనే ఉండటం ఆ ప్రాంతపు రాజకీయ పృథక్త్వానికి సూచన (చూ. పటం 4 ను గూర్చిన వివరణం).

*పటం 6*.చారిత్రకంగా నాగలి-నాంగలి-నాగెల నాగేలి (లు) ఒకపదం; మడక వేరొకపదం రెండూ దేశ్యాలే. *నాఞ్గేల్ ప్రాచీన ద్రావిడ రూపానికి సన్నిహితం (చూ. DED 2368). ఈ పదం వాడుకలో ఉన్న దేశమంతటా రెండురకాల ధ్వనుల మార్పులు వచ్చాయి. (1) దీర్ఘంమీద అనునాసికం లోపించటం *నాంగేల్ >నాగేలి (2) రెండో అక్షరంలో ఏ>ఎ>అ అనే మార్పు. మొదటిరకం మార్పు సార్వత్రికం; శ్రీకాకుళం కొట్టకొనన కొద్ది ప్రాంతంలో మాత్రం (కో. 50,51) నాంగలి రూపం ఇంకా నిలిచిఉంది. దేశమంతటా పూర్తిగా వ్యాపించని రెండోమార్పు అర్వాచీనం. ఈ భేదాన్ని గుర్తించే రేఖ (Isogloss) నెల్లూరు, రాయలసీమ, గుంటూరు జిల్లా దక్షిణపశ్చిమ భాగాలను (ఒంగోలు, వినుకొండ) పల్నాడు] మిగిలిన దేశంనుంచి వేరు చేస్తున్నది. నాగేలి, నాగలి అయ్యేముందు నడిమితరపు ధ్వనుల మార్పు మరొకటి జరిగినట్టు తార్కాణగా నాగెల అనేరూపం తె. 4,6 (రెండు వాడుకల సరిహద్దు ప్రాంతం)లో వాడుకలో ఉన్నది. 13 వ శతాబ్ది కావ్య

ప్రయోగాల్లో నాగేలి(లు), నాగలి కూడా కనిపించ టంవల్ల ఈ మార్పు అనేక శతాబ్దుల కిందనే మొద లైందని ఊహించవచ్చు.

మడక కూడా దేశ్య శబ్దమే. స్థూలంగా పెన్నా నది మడక-నాగేలి వాడుకలకు భేదకసీమగా పరిగ ణించవచ్చు. మడక వాడే ప్రాంతం కన్నడ దేశానికి సన్నిహితం కావటంవల్ల, ఈ పదానికి కావ్యప్రయో గాలు (సూ.ని. బట్టి) దొరకక్కపోవటంవల్ల, కన్నడం నుంచి తీసుకున్న ఎరవు మాట (loanword) కావచ్చునని తెలుస్తున్నది.

పటం 7. చారిత్రకంగా మేడి (ఉ. మేడు)- మేడితోక (ఉ. మేడితాక) ఒక పదం; పాలె మరొక పదం. పటంలో ఉచ్చారణ భేదంగా గుర్తించిన మేడు శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల్లోనే వాడుకలో ఉంది. మేడితాక తుంగభద్ర దిగువన, మేడితోక తుంగభద్ర ఎగువన వాడుకలో ఉన్నాయి. పాలె ఒక్క తెలంగాణా జిల్లాలోనే మేడికి సమానార్థంగా వ్యవహరింపబడుతున్నది. మేడి, పాలెల వాడుకలు కలిసే సరిహద్దు గ్రామాల్లో రెండుపదాలూ కొంచెం అర్థభేదంతో వ్యవహారంలో ఉండటం విశేషం. తె. 8 35 గ్రామాల్లో నాగలివెనక అమర్చింది పాలె అని, గొర్రు గుంటకలకు అమర్చింది మేడితోక అని అంటారు (చూ. కోశం).

మేడి దేశ్యశబ్దం (త. మ. మేఴి, క. మేణి, చూ. *DED* 4183). నాగలి కట్టుబడిలో కోస్తాజిల్లాల్లో మేడి ఒకభాగం, దాని చివర దున్నేవాడు పట్టుకో టానికి అమర్చే కొయ్యముక్క (సోగ) మరొకభాగం (చూ. చిత్రం 6 క. 12, 13, పుట 79). రాయల సీమ కొంత ప్రాంతంలో ఈ రెండు భాగాలకు కలిపి పెట్టుకొన్న పేరు మేడితోక. బహుశా ఇక్కడి నాగలి నిర్మాణంలో మేడి- సోగలు వేర్వేరు భాగాలు గాక, అంతా ఒకే కొయ్యతో చివరతోక వచ్చేట్టుగా చేసు కున్నదై ఉండవచ్చు నిర్ధారణగా తెలియదు, 'తోక- సొగ,లు సోదరశబ్దాలు (cognates).

పాలె, ఫాళ్ అనే మరాఠీ శబ్దభవం. మరాఠీలో దీని అర్థం 'నాగటి కర్రు' అని. ఈ ప్రాంతంలో కర్రు నిలిచి ఉండటంవల్ల అర్థవిపరిణామం వచ్చి నాగలికి చెందిన మరొక భాగానికి (మేడికి) పేరుగా పాలె వాడుకలో స్థిరపడి ఉంటుంది. ఉత్తరజిల్లాలో గొర్రు, గుంటక, మొ. ఇతర వ్యవసాయ పరికరాల మేడికి మరొక పేరు (రిమ్మెన, రుమడి, రుంబ, రుంబెన రొంబడి మొ. రూపాలతో) మరాఠీ రుమ్హణి, రుమణి శబ్దభవం వాడుకలో ఉంది.

పటం 8. చారిత్రకంగా కర్రు, కారు ఒక శబ్దం; నక్కు మరొకశబ్దం. *కాఱు నుంచి ఏర్పడ్డవి కర్రు కారు (త. క. కాఱు, *DED* 1263). ఈ రెంటికి సామాన్యంగా వచ్చిన ధ్వనుల మార్పు ఱ>ర; పెన్నానది ఉత్తరాన దేశమంతటా 'కా'లో దీర్ఘం హ్రస్వమై పరహల్లు ద్విత్వమైంది.; కాఱు>కఱ్ఱు (>కర్రు). మడక-కాఱు స్థూలంగా ఒకే ప్రాం తంలో వాడుకలో ఉండి, నాగేలి-కర్రు ప్రాంతం నుంచి దీన్ని వేరుచేస్తున్నాయి. పెన్నానదే ఈ రెండు రకాల వాడుకలకు సరిహద్దుగా ప్రవర్తిస్తున్నదని చెప్ప వచ్చు.

*   *   *

ఈ విధంగా వాడుక మార్పులు ప్రాంతీయంగా సూచించే పటాలు ఎన్ని అయినా తయారుచేయవచ్చు. ఎక్కువ గ్రామాల్లో ఉచ్చారణ విధేయమైన లిపిలో పదాలు సేకరించినపుడు ఆయా వాడుకల భేదాలకు మనం పటంలో సూచించే సరిహద్దు రేఖలు ఇతోధి కంగా శాస్త్రీయమైనవిగా ఉంటాయి. ప్రస్తుత పరిశోధ నలో పర్యటించిన గ్రామాలు 121 మాత్రమే కావటం వల్ల ఆయా వ్యవహార భేదక ప్రాంతాలకు సరిహద్దు లను సూచించే రేఖలు అంత కచ్చితమైనవని చెప్ప టానికి వీలులేదు. అయినా ఇరువైపులా ఇరవై ముప్పై మైళ్ళ తేడాలో ఈ రేఖలు పటంలో గుర్తించిన చోట్లనే వాడుక మార్పులు సూచిస్తాయని నిశ్శంకంగా చెప్పవచ్చు,

సమకాలీనభాషా మాండలికభేదాలను నిరూ పించే ఇటువంటి పటాల మొత్తాన్ని Dialect atlas అంటారు. ఈ రూపమైన భాషా పరిశోధనను Dialect geography అంటారు.

పైన చర్చించిన మాండలిక పటాల్లో ఒక్కొక్క దానిలో వాడుక మార్పు ఉన్నచోట్ల (సంకేతాలు మారినచోట) వచ్చే వ్యవహారభేదకరేఖలు ఒక పల్చటి కాగితంమీద గుర్తించి అటువంటి పటాలను కొన్నిటిని ఒకదానిమీద ఒకటి ఉంచి (నాలుగైదు పటాల్లో ఉన్న రేఖలు ఒకేసారి కనబడేట్లుగా) వెలుగు వైపు పట్టిచూస్తే కొన్ని పటాల్లో గుర్తించిన రేఖలు ఒక మొత్తంగా సమాన ప్రాంతాలను వేరుచేస్తున్నట్టు తెలుస్తుంది. ఇటువంటి రేఖల బొత్తి (bundle of isoglosses)చే వేరుచేయబడే ప్రాంతాలు ప్రత్యేక భాషామండలాలని నిర్వచించవచ్చు ఇలా కాకుండా మరికొన్ని పటాల్లో ఈ రేఖలు ఒకదాన్నొకటి క్రమ విరహితంగా అడ్డదిడ్డంగా దాటిపోతున్నట్లు కూడా కనిపిస్తాయి ఇవి ఆయాభాషా మండలాల్లో ఏర్పడు తున్న ఇటీవలి అంతర్భేదాలకు (sub-dialectal variations) సూచన

ఈ పద్ధతిలో 28 పటాలను పరిశీలిస్తే నేటి తెలుగు భాషా మండలాలను గురించి ఈ కింది నిర్ణయాలు సాధ్యమవుతాయి.

(a) 4, 5, 8, 12, 13, 16, 18, 20, 21, 23, 25, పటాలను పోల్చి చూచినప్పుడు కళింగదేశం (శ్రీకాకుళం, విశాఖపట్టణం) ఒక ప్రత్యేక భాషా మండలమని చెప్పవచ్చు (చూ. పటం 29). ఈ ప్రాంతంలో వాడే మదుం, పూజు, నక్కు, రేకు, ఉండ, ఓవు, ఆనప, చోడి, గంటె, చిప్ప, గాబు పదాలకు సరిగా సన్నిహిత ప్రాంతాల్లో వేరు వేరు శబ్దాలు వాడుకలో ఉన్నాయి.

(b) 3, 6, 9, 13, 15, 20, 24, 26 పటాలను పోల్చి చూచినప్పుడు స్థూలంగా రాయలసీమ, నెల్లూరు జిల్లాలు మరొక ప్రధాన భాషామండల మని నిర్ణయించవచ్చు. దీనికి సరిహద్దుగా ఏర్పడే వ్యవహారభేదకరేఖలు స్థూలంగా బళ్ళారి ప్రాంతంలో బయలుదేరి తుంగభద్రా కృష్ణల గతిని అనుసరించి పల్నాడు దక్షిణ భాగం, వినుకొండ, ఒంగోలు తాలూకాలను కూడా ఈ భాషా మండలంలో కలుపుకుంటూ పోతు న్నాయి. 6, 13, 24 పటాల వ్యవహారభేదక రేఖలను బట్టి మహబూబ్‌నగర్‌లో చాలా ప్రాంతాన్ని ఈ భాషా మండలంలోనే కలుపు కోవాలి (చూ. పటం 30).

ఈ మొత్తం భాషా మండలానికి విలక్షణమైన శబ్దాలు; కపిల, నాగేలి, నాగెల నొగ, గాను, గాలు, దోనె, రాగి, పసె, కర.

(c) 2, 5, 7, 14, 18, 22 పటాలను పోల్చి చూచి నప్పుడు స్థూలంగా మహబూబ్‌నగర్ దక్షిణ భాగం మినహా తెలంగాణా జిల్లాలు, వాటితో కలిసే జగ్గయ్యపేట, తిరువూరు (కృష్ణాజిల్లా) తాలూకాలు మరొక భాషామండలంగా చెప్పవచ్చు. 2, 14 పటాల్లోని వ్యవహారభేదకరేఖల మొత్తం మహబూబ్‌నగర్ ఉత్తరార్ధాన్ని మాత్రమే కలుపు కుంటూ నల్గొండ జిల్లాతో పాటు సత్తెనపల్లి, జగ్గయ్యపేట, తిరువూరు తాలూకాలను కలుపుకొని ఖమ్మంమెట్టు జిల్లాను రెండుభాగాలుచేస్తూ, గోదా వరిని అనుసరించి కరీంనగర్ తూర్పుకొనన అంతమవుతున్నది (చూ. పటం 31). 5, 7 పటాలకు వచ్చే రేఖలు మహబూబ్‌నగర్, నల్గొండ, ఖమ్మం, వరంగల్ జిల్లాల్లో ఉత్తరభాగా లనే తెలంగాణా భాషామండలంలో కలుపు తున్నాయి. స్థూలంగా కోస్తా, రాయలసీమ జిల్లా లతో కలిసే పూర్వ దక్షిణ తెలంగాణా ప్రాంతా లను తీసివెయ్యగా మిగిలింది ఒక భాషామండల మని చెప్పవచ్చు.

పటం 29 లో సూచించిన వ్యవహార భేదక రేఖలనుబట్టి (9, 10, 16, 18, 19) కర్నూలు, అనంతపురం జిల్లాల పడమటి భాగం, ఒక చీలి కగా ఈ భాషామండలంలో చేరుతుంది.

(d) పైన నిర్దేశించిన మూడు ప్రధాన భాషా మండలాలను వేరుచేసినప్పుడు మిగిలేవి ఉభయ గోదావరి జిల్లాలు, కృష్ణా గుంటూరులు. ఈ ప్రాంతం అంతా ఒక భాషామండలం అనటం కంటె- ఆయా మండలాలతో కలిసే మిశ్రభాషా మండలం అనవచ్చు. కొన్ని వాడుకల్లో కృష్ణా గోదావరి జిల్లాలు కళింగ ప్రాంతంతోటి (చూ.

పటం 32, రేఖలు 1, 9) మరికొన్ని వాడుకల్లో దక్షిణ భాషామండలంతోను కలుస్తాయి (చూ. పటాలు 2, 5, 7, 16, 18, 21); కొన్ని వాడుకల్లో ఈ ప్రాంతపు ప్రత్యేకత కూడా కనిపిస్తుంది (చూ. పటాలు 9, 11, 13, 14, 15). ఈ భాషామండలంతో కొన్ని పదాల వాడుకల్లో కలిసేవి ఖమ్మం, వరంగల్ జిల్లాలు. చూ. పటం 32).

(ఇ) ఈ నాలుగు భాషామండలాల్లోను మరికొన్ని అంతర్భాషా మండలాలేర్పడుతున్నాయి (చూ. పటాలు 32, 33). అంటే వాటిని చుట్టివచ్చే వ్యవహారభేదకరేఖలు ప్రత్యేక భాషామండలాన్ని స్థాపించేటంత ఒత్తుగా ఏర్పడటంలేదని గ్రహించాలి. దక్షిణ భాషామండలాన్ని (రాయలసీమ, నెల్లూరు) రెండు భాగాలు చేస్తూ కొంతవరకు పెన్నానది గతిని అనుసరించి పోయే వ్యవహారభేదకరేఖలు ముఖ్యంగా రెండున్నాయి (పటం 33, రేఖలు 6, 8). ఇవి మడక, కారు అనే పదాల వాడుకను నాగేలి, కర్రు అనే వాటి వాడుక నుంచి వేరుచేస్తున్నాయి. అలానే మరొక రేఖ దిగువ భాగంలో 'మేడి' అని పై భాగంలో 'మేడితోక' అని వాడుకను వేరు చేస్తున్నది (చూ. రేఖ 7).

అలానే ఉత్తర తెలంగాణా జిల్లాలనురెండు ఉపభాషామండలాలుగా వేరుచేసే భేదక రేఖలు కొన్ని ఉన్నాయి (చూ. పటం 32, రేఖలు 1,12, 14). రాగడి (ఉ. రాగిడి), జోడు, ఆకు అని ఒకవైపు ఉన్న వాడుకలకు సరిగా రెండోవైపు రేగడి దొత్తె, అరె అనే వాడుకలున్నాయి. అదీగాక తెలంగాణా పశ్చిమోత్తర జిల్లాల్లోనే ఉర్దూ ప్రభావం ఎక్కువగా కనబడుతుంది. పయ్యె, (రేఖ 13), తుకం (రేఖ 27), అనే మాటలు ఈ జిల్లాల్లోనే వాడుకలో ఉన్నాయి.

పై విధంగా భాషామాండలిక భేదాలు (వాడుకలో సరిహద్దులు) ఏర్పడటానికి కారణం ఆ యా మండలాల ప్రజలమధ్య రాకపోకల ఒత్తిడి (density of communication) తక్కువ కావటమే. దీనికి, రాజకీయ నైసర్గిక పరిస్థితులకు సంబంధం ఉంటుంది. చరిత్రలో కొన్ని శతాబ్దుల పాటు రాజకీయ సంబంధం లేని ప్రాంతాల మధ్య రాకపోకలు ఎక్కువై కాలక్రమాన భాషావ్యవహారంలో మార్పులు వస్తాయి. అంటే ఒక ప్రాంతం వాడుకలో ఏర్పడ్డ నూతన శబ్దాలు, ధ్వని పరిణామాలు, ఆ ప్రాంతంలోనే వ్యాపించి రాజకీయపు సరిహద్దు తగిలిన చోట ఆగిపోతాయి. ఈ విధంగా పరస్పర సంబంధం లేని వాడుకల మార్పాటువల్ల కాలం జరిగేకొద్దీ ఆయా ప్రాంతాలు ప్రత్యేక భాషామండలా లవుతాయి. శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు 16 వ శతాబ్దిదాకా కళింగ రాజ్య భాగంగా ఉండి మిగిలిన దేశంతో రాజకీయ సంబంధం లేకపోవటం వల్ల అక్కడి పలుకుబళ్ళు మిగిలిన తెలుగుదేశం కంటె విలక్షణంగాఉంటాయి. అదేవిధంగా తెలుగు చోడుల కాలంలోను విజయనగర పరిపాలనలోను ఏక ప్రాంతంగాఉన్న రాయలసీమ, నెల్లూరుజిల్లాల వాడుకలో ఎక్కువ సమరూపత ఉండటంవల్లనే అదొక భాషామండలంగా పరిగణించబడ్డది. అదే విధంగా కాకతీయులు, మహమ్మదీయులు పరిపాలించిన తెలంగాణా ప్రాంతానికి రాజకీయమైన సరిహద్దే వ్యవహారసీమగా కూడా మనకు కనిపిస్తుంది (చూ. పటాలు 29, 31). రాజకీయమైన అస్థిమితత్వమే కృష్ణాగోదావరీ మధ్యదేశం ప్రత్యేక భాషామండలంగా కనిపించకపోవటానికి కారణం.

దుర్గమాలైన మహానదులు, పర్వత పంక్తులు అరణ్యాలు రెండు భాషాప్రాంతాలను వేరుచేస్తూ ఆ యా వ్యవహర్తల రాకపోకలకు ఆటంకాలుగా ఉన్నంతవరకు అవికూడా భాషామండలాలకు సరిహద్దు లవుతాయి. ఇటీవల రాకపోకల సౌకర్యాలవల్ల పరిస్థితి కొంత మారినా పూర్వ చరిత్రలో ఏర్పడ్డ మాండలికభేదాలు అంత తొందరగా మాసిపోవు. పైన సూచించినట్టు పెన్నకు దక్షిణాన కారు, మడక అనే వాడుకలు, ఉత్తరాన కర్రు, నాగేలి అనే వాడుకలు ఏర్పడ

టానికి ఇదే కారణం కావచ్చు. పొదిలి, దర్శి, మార్కాపురం, వినుకొండ, పల్నాడు తాలూకాల్లో పాత మాటలు ఇంకా నిలిచి ఉండటానికి కారణం- వాటి చుట్టూరా ఉన్న తూర్పు కనుమలు, కృష్ణా నదివల్ల మిగిలిన ప్రాంతాలతో అనేక శతాబ్దులు రాకపోకలు తక్కువగా ఉండటమే. అలానే రాజకీయపు సరిహద్దుతోబాటు కృష్ణా తుంగభద్రా నదులు దక్షిణ భాషా మండలాన్ని (రాయలసీమ, నెల్లూరు) మిగిలిన దేశం నుంచి వేరు చేస్తున్నాయి.

## ముగింపు

మొన్న మొన్నటివరకు దేశభాషలకు ప్రాధాన్యం లేదు. సంస్కృతాంగ్లభాషాసంపర్కంవల్ల మన విద్యాసంస్కృతులు ఎంతో పురోగమించినా దేశ్యమైన తెలుగు నుడికారం పెరుగుదలకు ఈ భాషలు తీవ్ర ప్రతిబంధకాలయినా యని చెప్పక తప్పదు. ప్రభుత్వభాష ఆంగ్లమై, విద్యావంతులైన తెలుగు వారిలో నూతనభావ నివేదనకు శబ్దసామగ్రి సమకూర్చేది సంస్కృతమైనప్పుడు జానుతెలుగు పామరులైన గ్రామప్రజల వాడుకలోనే వర్ధిల్లుతూ వచ్చింది. వీరి దైనందిన జీవితం పరంపరగా వచ్చిన కులవృత్తులకు పరిమితమై, వీరి భాషా వ్యవహారం సంకుచితమైనదైనా ఆ కొద్ది పరిధిలోనే తెలుగు నుడికారం ఊహకందనంత విశాలంగా పెరిగింది. తెలుగు వలుకుబళ్ళలోనే కొత్తతలపులకు మాటలు కల్పించే శక్తి జానపదుల సొమ్ము (చూ. పుట 32). తెలుగుభాషా స్వరూపాన్ని సమగ్రంగా దర్శించటానికి జానపదుల వాడుకలోని మాటలన్నిటిని దేశం నాలుగు మూలల నుంచి సేకరించి కోశరూపంగా సంకలనం చెయ్యటం ఎంతైనా ఆవశ్యకం.

ఇలాంటి కోశాలవల్ల ఇంకా అనేక ప్రయోజనాలున్నాయి. వ్యవసాయం (Agriculture), మత్స్య పోషణ (Fisheries), మొదలైన ఆధునికశాస్త్రాల్లో గ్రంథరచనకు దేశీయమైన శబ్దజాలం ఎంతో ఈ కోశాల్లో లభిస్తుంది. చారిత్రకులకు, సాంఘిక శాస్త్రజ్ఞులకు, మానవశాస్త్ర పరిశోధకులకు, భాషా శాస్త్రజ్ఞులకు జిజ్ఞాసాపోషకమైన ముడిసరుకు పదజాల రూపంగా ఇలాటి కోశాలు అందిస్తాయి. వీటన్నిటి కంటె ముఖ్యమైనది — తెలుగుభాషాచరిత్ర సమగ్రంగా రాయటానికి, ఒక్కొక్కమాట పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోటానికి, తెలుగుకు పరిసర భాషలతో గల సంబంధాన్ని నిరూపించటానికి, అసలు భాషకు, ప్రజాజీవితానికి గల పరస్పర సంబంధ పరిణామాలను అవగాహన చేసుకోటానికి, తెలుగుభాషా వైశాల్యాన్ని దర్శించటానికి ఇటువంటి కోశాలు అత్యావశ్యకమైనవి. ఇంతేగాక కావ్యభాషలో మన కింతవరకు అర్థంతెలియని దేశ్యశబ్దాల స్పష్టార్థనిరూపణకు ఇటువంటి కోశాలుతోడ్పడతాయి. భాషను ప్రమాణీకరించటానికి, దేశ్య పదజాలాన్ని ప్రమాణభాషలో పునరుజ్జీవింపజేయటానికి, మాతృభాషలో కొన్ని సామాన్యశాస్త్ర గ్రంథాలు రచించటానికి, వయోజన విద్యావాప్తికి కూడా ఈ కోశాల్లోని పదజాలం అపారంగా ఉపకరిస్తుంది.

వాడుకలో ఉన్న పదజాలాన్నంతటినీ సేకరించి ప్రధాన కావ్యాలకు పదప్రయోగకోశాలు సిద్ధం చేసిన మీదటనే తెలుగుభాషకు చారిత్రక సూత్రాలపై సమగ్రమైన భాషాకోశం వెలువడుతుంది.

భద్రిరాజు కృష్ణమూర్తి

# ఉపయుక్త గ్రంథాలు

## (BIBLIOGRAPHY)


ఆంధ్రదర్శిని (*Āndhradarśini*). Vijayawada : Viśālāndhra publishers (1959).

Brown, C. P., *A Dictionary, Telugu and English*. Madras (1852), & rev. ed, (1907).

Bentley & Henry, *Medicinal plants*, 4 vols. London. J & A Church-hill, New Burlington st. (1880).

Burrow, T. & Emeneau, M.B., *A Dravidian Etymological Dictionary* (abbrev. *DED*).: London: Oxford University Press (1861).

Fyson, P.F , *The flora of South Indian Hill stations*, vol 1; Madras: Superintendent, Government Press (1932).

Gamble, J.S., *Flora of the Presidency of Madras*, vols. 1 & 2; Fisher, Cecil E.C , vol. 3. Calcutta: Sri Gouranga Press (reprinted ed. 1957).

Grierson, Sir G. A., *Bihar Peasant Life* (2nd rev. ed.). Patna: Superintendent, Government Printing, Bihar and Orissa (1926).

Kittel, F., *A Kannada-English Dictionary*. Mangalore; Basel Mission Book and Tract Depository (1894).

Lushington, A.W., *Vernacular list of trees, Shrubs and Woody Climbers in the Madras Presidency*, 2 vols. Madras: Superintendent. Government Press(1915).

*Manual of the Administration of the Madras Presidency* (abbrev. MAMP), vol. 3 glossary). Madras : Superintendent, Government Press (1893).

Molesworth, J. T., *A Dictionary, Marāthī and English*, Bombay: Bombay Education Society Press (1857).

Sundararaj, D. Daniel and Balasubramanyam, Girija, *Guide to the Economic Plants of South India*. Madras : Amudha Nilayam (1959).

సూర్యరాయాంధ్ర నిఘంటువు (*sūryarāyāndhra nighaṇṭuvu*), 7 vols. Kākināda: Āndhra sāhitya pariṣattu (1936-1960).

*Tamil Lexicon*, 6 vols. Madras : Madras University (1924-39).

Watt, George, *A Dictionary of Economic Products of India*, 6 vols. Calcutta (1889-96).

*The Wealth of India* (A-K), 4 vols. Delhi: Council of Scientific and Industrial Research (1948).


## ప్రధాన సంకేత వివరణం

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు)
కో. = కోస్తాజిల్లాలు
(క్రి) = క్రియాపదం
చూ. = చూడు
తె. = తెలంగాణా
పర్యా. = పర్యాయపదం (-పదాలు)
రా. = రాయలసీమ
రూ. = రూపాంతర (రూపాంతరాలు)
వి. = విశేష్యం
విణ. = విశేషణం

హిం. = హిందూస్తానీ

*తులనాత్మక పరిశోధన పద్ధతులనుబట్టి పునర్నిర్మించిన ప్రాగ్రూపం

[< >] చారిత్రక నిష్పత్తి సూచనకు గుర్తు: మొనవైపున్న రూపం అర్వాచీనం, రెండో వైపున్నది ప్రాచీనం

C. = Coastal districts
DED (see bibliography)
MAMP (see bibliography)
T. = Telangana districts
R. = Rayalaseema

# పరిశోధకుల పర్యటన వివరాలు

| ప్రాంతం * ఊరి నెంబరు (1) | పర్యటించిన ఊరు (2) | తాలూకా (3) | జిల్లా (4) | వ్యవహర్తల వివరాలు: పేరు (5) | కులం (6) | వయస్సు (7) | ప్రధానవృత్తి (8) | ఉపవృత్తి (9) | చదువు (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 1 | సూళ్ళూరు పేట | సూళ్ళూరు పేట | నెల్లూరు | వాసంరెడ్డి వెంకురెడ్డి | రెడ్డి | — | సేద్యం | | |
| | | | | కె. యం. సుబ్రహ్మణ్యం | — | — | ,, | | |
| | | | | కె. రామక్రిష్ణారెడ్డి | రెడ్డి | — | ,, | | |
| కో. 2 | బుచ్చిరెడ్డిపాలెం | కోవూరు | — | శెట్టిపల్లి శీనయ్య | — | — | ,, | | |
| | | | | సుబ్బానాయుడు | — | — | ,, | | |
| | | | | గద్ది పేరయ్య | — | — | ,, | | |
| కో. 3 | కలువాయి | ఆత్మకూరు | ,, | మామిళ్ళ వెంకటనరసయ్య | — | — | ,, | | |
| కో. 4 | ఆత్మకూరు | ఆత్మకూరు | ,, | — | — | — | ,, | | |
| కో. 5 | ముసునూరు | కావలి | ,, | నిమ్మకాయల అయ్యన్న | బలిజ | 54 | ,, | | |
| కో. 6 | మోపాడు | కందుకూరు | ,, | తోకల నరసింహం | కమ్మ | 62 | ,, | | |
| కో. 7 | సీతారాంపురం | ఉదయగిరి | ,, | మారుజోళ్ళ నాగయ్య | శెట్టిబలిజ | 62 | ,, | | |
| కో. 8 | కనిగిరి | కనిగిరి | ,, | అచ్చాల బాలయ్య | రెడ్డి | 50 | ,, | | |
| కో. 9 | దర్శి | దర్శి | ,, | ఉప్పు మల్లయ్య | బలిజ | 60 | ,, | | |
| కో. 10 | నరగాయపాలెం | వినుకొండ | గుంటూరు | ఏరువ చినరామిరెడ్డి | రెడ్డి | 65 | ,, | | |
| | | | | ఏరువ ఏలిగొండారెడ్డి | ,, | 70 | ,, | | |
| | | | | మాలపాటి చంద్రారెడ్డి | ,, | 56 | ,, | | 8వ తరగతి |
| కో. 11 | శ్రీగిరిపాడు | పల్నాడు | ,, | సప్పరపు వెంకటరెడ్డి | రెడ్డి | 70 | ,, | | |
| | | | | పప్పుల నాగయ్య | మాల | 70 | కూలి | నేత | |

*కో. = కోస్తా జిల్లాలు; రా. = రాయలసీమ; తె. = తెలంగాణా.

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 12 | పిడుగురాళ్ళ | వల్నాడు | గుంటూరు | దాచినేటి వెంకయ్య | కమ్మ | 70 | సేద్యం | | |
| కో. 13 | జొన్నలగడ్డ | నరసరావుపేట | ,, | నల్లపాటి కోటేశ్వరుడు | ,, | 50 | ,, | | 4వ తరగతి |
| కో. 14 | అద్దంకి | ఒంగోలు | ,, | గోరంట్ల రంగయ్య | ,, | 55 | ,, | | |
| కో. 15 | అల్లూరు | ,, | ,, | బంకా వెంకటస్వామి | యాదవ | 70 | ,, | | |
| కో. 16 | పేటపాలెం | బాపట్ల | ,, | ఉమ్మడిసింగు వెంకటసుబ్బయ్య | వెలమ | 60 | ,, | | |
| | | | | పావినేని నాగభూషణం | వెలమ | 50 | ,, | | |
| కో. 17 | చింతలపూడి | ,, | ,, | చల్లా వెంకటస్వామి | బలిజ | 60 | ,, | | |
| | | | | మారుపూడి లక్ష్మయ్య | కమ్మ | 76 | ,, | | |
| | | | | నల్లూరు సీతారామయ్య | | 49 | ,, | | |
| కో. 18 | కంతేరు | గుంటూరు | ,, | పామర్తి వెంకటస్వామి | యాదవ | 70 | ,, | | |
| కో. 19 | చినపాలెం | తెనాలి | ,, | పిన్నిబోయిన తిరపతి | యాదవ | 70 | ,, | | |
| | | | | దేసిబోయిన తిరపతి | ,, | 70 | ,, | | |
| కో. 20 | వెల్లటూరు | రేపల్లె | ,, | మోటూరి సుబ్బరాయుడు | కమ్మ | 55 | ,, | | |
| | | | | నాదెండ్ల బాపయ్య | ,, | 64 | ,, | | |
| | | | | దున్నా అబ్రహాం | హరిజన్ | 56 | ,, | | |
| | | | | మోటూరి హనుమంతరావు | కమ్మ | 45 | ,, | | |
| కో. 21 | అవనిగడ్డ | దివి | కృష్ణా | అన్నపురెడ్డి చినచెంచయ్య | కాపు | 65 | ,, | | |
| కో. 22 | చినవోగిరాల | గన్నవరం | ,, | పాలడుగు పరశురామయ్య | కమ్మ | 80 | ,, | | |
| | | | | కోడె వెంకట్రామయ్య | ,, | 48 | ,, | | |
| | | | | పాతూరి కోటయ్య | ,, | 70 | ,, | | |
| కో. 23 | పోతురెడ్డిపల్లె | నూజివీడు | ,, | సుంకర శీతారామయ్య | కమ్మ | 58 | ,, | | |
| | | | | పర్వతనేని రామశేషయ్య | ,, | 70 | ,, | | |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 24 | మక్కపేట | జగ్గయ్యపేట | కృష్ణా | ఇనపలుర్తి నాగభూషణం | హరిజన్ | 70 | సేద్యం | | |
| | | | | కనగాల రాఘవయ్య | కమ్మ | 65 | ,, | | |
| | | | | జానవాలు అప్పయ్య | ఊరలంబాడి | 60 | ,, | | |
| | | | | అజ్మీరు వెంకటప్ప | ,, | 45 | ,, | | |
| కో. 25 | కంభంపాడు | తిరువూరు | ,, | కటారి వీరవెంకయ్య | తెలగ ఉప్పర | 80 | ,, | | |
| కో. 26 | భీమడోలు | ఏలూరు | ప. గోదావరి | బొమ్మ రామకృష్ణయ్య | కాపు | 55 | ,, | | |
| కో. 27 | మొగల్తుర్రు | నర్సాపురం | ,, | ఓబూరి గంగాధరం | కమ్మ | 55 | ,, | | |
| కో. 28 | వేల్పూరు | తణుకు | ,, | పెనుమర్తి పాపన్న | కమ్మ | 55 | ,, | కూలి | |
| కో. 29 | పోలవరం | పోలవరం | ,, | బి. సుబ్బరాజు | కాపు | 55 | ,, | | |
| కో. 30 | వీరభద్రవరం | వెంకటాపురం* | తూ.గోదావరి | నిడుగ సమ్మాయాలు | కాపు | 55 | ,, | | |
| కో. 31 | సుబ్బరాయగూడెం | భద్రాచలం | ,, | కురసం మారప్ప (పటేల్) | కోయ | 55 | ,, | | |
| కో. 32 | కోనవరం | ,, | ,, | కోటా బతాగయ్య | హరిజన్ | 50 | ,, | | |
| కో. 33 | ఎల్లవరం | ఎల్లవరం | ,, | సంపతి చినవెంకన్న | క్రిష్టియను | 50 | ,, | కూలి | |
| కో. 34 | గవర్నమెంటు రాగంపేట | పెద్దాపురం | ,, | ఆరుమిల్లి నాగన్న | కమ్మ | 55 | ,, | | |
| కో. 35 | యానాం | కాకినాడ | ,, | కె. సుబ్బారావు | కాపు | 45 | ,, | | |
| కో. 36 | సత్యవరం | ఎలమంచిలి | విశాఖపట్నం | ఖైడి సత్యరాజు | తెలగ | 60 | ,, | | |
| కో. 37 | ధర్మవరం | ఎలమంచిలి | ,, | నగిరెడ్డి జగ్గారాయుడు | కాపు | 75 | ,, | | |
| కో. 38 | ఉమ్మడాల | అనకాపల్లి | ,, | (వివరాలు ఇవ్వలేదు) | | | | | |
| కో. 39 | బలిఘట్టం | నర్సీపట్నం | ,, | భీమిరెడ్డి నారాయణమూర్తి | వెలమ | 50 | ,, | | |

*ఇక్కడ కో. 30, 31, 32 గా పరిగణించిన ఊళ్ళు ఇటీవల ఖమ్మం జిల్లాలో చేర్చబడాయి. శబరీనదికి వాయవ్యంగా ఇదివరకు తూర్పుగోదావరి జిల్లాలో ఉన్న భాగమంతా ప్రస్తుతం ఖమ్మంజిల్లాలో కలిసింది.

**అట్టడి** పర్యా. చూ. అక్కడి. ఒక పైరు చాలు; ముఖ్యంగా పత్తి, ఆముదాలు ఇలా వేస్తారు: ఆ విధంగా వేసిన పైరు (కో. 12); -బుర్ర పర్యా. చూ. అక్కడికట్టె. అక్కడి పైరుకు విత్తనాలువేసే కొయ్య పరికరం; దీన్ని గొర్రుకుగాని. నాగలికిగాని వెనకవైపు కట్టి ఎదబెడతారు. చూ. చిత్రం 8 క. (కో.).

**అడుసుదుక్కి** నీళ్ళుబెట్టి దున్నిన మాగాణి పొలం; మాగాణిలో దమ్ముచేయటం (రా. 6, 8).

**అడుసునాగేలి** పర్యా. చూ. బురదనాగలి. మాగాణిలో దున్నే చిన్నసైజు నాగలి. చూ. చిత్రం 6. ట (కో. 1; రా. 1).

**అడుసుమడక** పర్యా. చూ. బురదనాగలి. మాగాణి నేల దున్నే చిన్నసైజు నాగలి. చూ. చిత్రం 6. ట (రా. 5, 6, 8).

**అడ్డ** (1) పర్యా. అచ్చు, తుంపు, దింపు, దోలుపు, పట్టె, పరందింపు, మాను. దున్నిన పొలాన్ని చదునుచేసే కొయ్యమొద్దు (కో. 9, 10, 15, 18, 24, 31; తె. 41); (2) పర్యా. చూ. దింపు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9–12, 1 (కో. 4-19, 21, 25, 29, 31-33, 35, 41, 43; తె. 1, 6, 26, 32, 34-42).

**అడ్డగచాలు** చూ. అడ్డచాలు (కో. 51).

**అడ్డగుంటువ** విత్తులు చల్లిన పైరులో గడ్డిపోపటానికి తోలే గుంటక; దీని దింపు (అడ్డ)కు పది లేక పన్నెండు మేకులుంటాయి (రా. 4).

**అడ్డచాలు** రూ. అడ్డగచాలు: పర్యా. చూ. ఇరవాలు. విలువు దున్నినతరవాత అడ్డంగా దున్నిన చాలు (కో. 15–17, 20–23, 40, 44, 45, 47, 48, తె. 16, 18).

**అడ్డదుక్కి** అడ్డంగా దున్నటం (కో. 48).

**అడ్డపడుగుచాలు** పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నినతరవాత అడ్డంగా దున్నిన చాలు( తె. 9).

**అంటుపనకం** దున్నేటప్పుడు కాడికి ఏడికోలకు కలిపి కట్టే కట్టు. చూ. పన్నకం (రా. 23, 25, 26).

**అండగొట్టు** (క్రి.) మాగాణి గట్లను పారతో చెక్కి బాగుచెయ్యటం (కో. 39).

**అండమలుపు** ? నాలుగోసారి దున్నటం (రా. 26).

**అని** పొలంలో అడ్డచాలు నిలువుచాలు, కలిసే చోటు (తె. 1).

**అనికెలకట్టు** చూ. అంకెండ్లకట్టె (రా. 8).

**అరక** ఉ. అర్కు; పర్యా. చూ. ఏరు. సామాన్లన్నీ అమర్చి ఎడ్లను కట్టి దున్నటానికి సిద్ధంచేసిన సాగు పని ముట్టు (కో. 8, 11-20, 24, 25; తె. 10, 13, 14, 21, 23–26); -పీట పర్యా. చూ. వారిణెపీట. ఎలువు నలువులకు, ఏడికోల కాడి కలిపే చోట వారిణె దూర్చిన చిన్న కొయ్యగొట్టం. చూ. చిత్రం 6. చ. 9 (తె).

**అలుకుజాలు** ఉ. అలుకుసాలు; రూ. అల్కు-(పు) చాలు; పర్యా. ఊడ్పుచాలు. మాగాణిలో విత్తనం చల్లే ముందుగాని, నాటువేసే ముందుగాని దున్నిన చాలు (కో. 9; తె. 4, 8–12, 33).

**అలుకుడుపట్టె** ఎద(వెద)పెట్టక ముందు పొలం చదును చెయ్యటానికి తోలే కొయ్య మొద్దు (తె. 35).

**అలుగు** పర్యా. చూ. పలుగు. గుంటక గుజ్జులకు తగిలించిన ఇనపబద్దె. చూ. చిత్రం 9. 3 (రా. 1).

**అల్కు-(డు)చాలు** ఉ. అల్కు-(డు)జాలు, అల్కు-(డు) సాలు; చూ. అలుకుచాలు (తె. 17, 19, 25, 27).

**ఆకుమొల** పర్యా. చూ. కర్రుమొల. గొర్రుచెక్క (కొయ్య)కు కర్రు బిగించే ఇనపకొంకి. చూ. చిత్రం 7 క. 6 (కో. 15).

**ఆటగొర్రు** పర్యా. ఉపిగొర్రు, ఎడగొర్రు, బీటిగొర్రు, మట్టిగొర్రు, వట్టిగొర్రు, వాటుగొర్రు, వాయిగొర్రు, వాలు గొర్రు. భూమి దున్నే గొర్రు; నాగలితో దున్నినతరువాత విత్తటానికి ముందు పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు నుంచి ఎనిమిది దాకా దీని చెక్కలు (కొయ్యలు) ఉంటాయి. చూ. చిత్రం 7 చ. (కో. 12, 17, 20–23; తె. 39).

**ఆరగట్టు** ఉ. అర్గట్ట (సామాను), అర్గట్టు (సామాను). చూ. ఏరగట్ట (తె. 17, 19, 25).

**ఆరు** ఉ. అర్ర, అరి, అరె, ఓరు, ఓరె(నాగటోరు, నాగటోరె), వారు, వాల, వాలు; పర్యా. ముసుదూల, ముసదొల, మొన. కర్రు బిగించే నాగలి చివరిభాగం. చూ. చిత్రం 6 క. 5 (కో. 1–25, 31-36, 40-43; తె. 1-4, 6-9, 11, 12, 14, 29, 31–35, 37-42; రా. 1, 4, 6–11, 14-18, 20-28); -పొది పర్యా. చూ. దోని. ఆరులో కర్రు బిగించటానికి తొలిచిన గాడి (తె.).

**ఇంగల్‌చిల్ల** పర్యా. చూ. షిరచీల. ఏడికోలను వణతలో దూర్చి ఊడకుండా చివర కొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (రా 16).

**ఇడుగువాలు** ఉ. ఇడ్గువాలు; పర్యా. చూ. ఇరవాలు. పొలంలో రెండోసారి దున్నటం; నిలువు దున్నిన తరువాత అడ్డంగా చాళ్ళు దున్నటం; కొద్దిచోట్ల మొదటిసారి దున్నటం (తె. 17, 19–23, 31).

**ఇనమారు(చాలు)** ఉ. ఇనమాలుసాలు, ఇనుమారు సాలు, ఎనిమారుసాలు; పర్యా. చూ. ఇరవాలు. పొలం రెండోసారి దున్నటం (కో. 27, 29, 32-34, 36, 39, 40, 41, 46, 49-51; తె. 35).

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 6 | తిమ్మాజీపేట | నాగరకర్నూల్ | మహబూబ్ నగర్ | కాళ్ళ పెద్ద శాయన్న | హరిజన్ | 55 | సేద్యం | | |
| తె. 7 | ఆమనగల్లు | కల్వకుర్తి | ,, | ? ఎరికల పెద్దయ్య | గౌడు | 65 | ,, | | |
| తె. 8 | ఇబ్రహీమ్‌పటన్ | ఇబ్రహీమ్‌పటన్ | హైదరాబాద్ | ఆకుల సత్తెన్న | మున్నూరుకాపు | 55 | ,, | | |
| చె. 9 | ఆస్పల్లిగూడెం | షాబాద్ | ,, | ఎలిగేటి రామిరెడ్డి | మోటాటికాపు | 60 | ,, | | |
| తె. 10 | అల్లీపురం | జహీరాబాద్ | మెదక్ | దాసరి వెంకటరెడ్డి | గుడాదికాపు | 55 | ,, | కూలి | |
| తె. 11 | చిన్నచింతకుంట | నర్సాపూర్ | ,, | కుమ్మరి శివయ్య | కుమ్మరి | 50 | ,, | | |
| తె. 12 | చిన్నఉండవల్లి | సిద్దిపేట | ,, | చంద్రిరెడ్డి పుల్లారెడ్డి | చిప్పైవకాపు | 45 | ,, | | |
| తె. 13 | కామారెడ్డి | కామారెడ్డి | నిజామాబాద్ | రాజంపేట రామకృష్ణయ్య | తెన్గోళ్లు (తెలగాలు) | 65 | ,, | | |
| తె. 14 | బెంజపల్లి | ఎల్లారెడ్డి | ,, | అడపాల నారాయణ | వడ్ల | 50 | ,, | | |
| తె. 15 | బాన్‌స్వాడ | బాన్‌స్వాడ | ,, | పత్తి వెంకన్న | మున్నూరుకాపు | 64 | ,, | | |
| తె. 16 | ఆర్మూరు | ఆర్మూరు | ,, | సడాకు పోసెట్టి | ,, | 65 | ,, | | |
| తె. 17 | నేరేడికొండ | బోత్ | ఆదిలాబాద్ | వెల్టి రాజరెడ్డి | కాపు | 60 | ,, | | |
| తె. 18 | రాంపురం | ఆదిలాబాద్ | ,, | వెల్టి రామిరెడ్డి | గురుడకాపు | 55 | ,, | | |
| తె. 19 | ఉట్నూరు | ఉట్నూరు | ,, | సాడ్గె శివన్న | వంజారి (తెలగాలు) | 50 | ,, | | |
| తె. 20 | బెల్లాల | ఖానాపురం | ,, | తుమ్మల రాములు | గొల్ల | 50 | ,, | | |
| తె. 21 | దడ్వాపురం | ఆశిఫాబాద్ | ,, | సెండి భూరు | బారోళ్ళు | 50 | ,, | | |
| తె. 22 | సిరిపురం(లక్ష్మీపురం) | సిర్పూర్ | ,, | మాదాసు భీమయ్య | కాపు | 50 | ,, | | |
| తె. 23 | చెన్నూరు | చెన్నూరు | ,, | మిర్దొడ్డి సాంబయ్య | మున్నూరుకాపు | 60 | ,, | | |
| తె. 24 | శాస్త్రుల్లపల్లె (ఎగలాసపురం) | మంథెన | కరీంనగర్ | అన్నల ఎల్లయ్య | ఆరోళ్ళు(ఆరె) | 50 | ,, | పదేలుగిరి | |
| తె. 25 | నందిమేడారం | సుల్తానాబాద్ | ,, | సురకంటి శంభయ్య | గూడాటికాపు | 60 | ,, | | |
| తె. 26 | పొలాస | జగ్త్యాల | ,, | కొచ్చాల లక్ష్మీరాజం | బ్రాహ్మలు | 50 | ,, | గ్రామంలో రాజాశ్రితం | వేదం, కొద్దిచదువు |

**ఎరసేద్యం** చూ. ఎడసేద్యం (రా. 12, 23, 24).

**ఎలగటిపగ్గం** పర్యా. చూ. పగ్గం. ఎడ్ల కొమ్ములకూ మేడికీ కలిపికట్టే ఎడ్లను మలపటానికి ఉపయోగించే తాడు (తె. 42).

**ఎలి(గట్టు)దుక్కి** ఉ. ఎలిగెట్టుదుక్కి, ఎల్దుక్కి; రూ. ఎలిగడదుక్కి. దున్నిన మెట్టపొలం; మెట్టదున్నకం (తె. 3, 10-12, 29, 33, 42; రా. 4, 6, 8, 23, 26, 27).

**ఎలిగట్టునాగలి** (<వెలిగట్టు-); ఉ. ఎలిగెట్టు-; రూ. ఎలిగడ-; పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (తె. 8, 11, 12, 16, 20, 26, 29, 32-38, 42).

**ఎలిగడగుంటక** పర్యా. చూ. బీటిగుంటక. పైరు వెయ్యకముందు మెట్టలో గడ్డి మొ. పోవటానికి తోలే గుంటక. చూ. చిత్రం 9 క (రా. 11).

**ఎలిగడదుక్కి** చూ. ఎలి (గట్టు) దుక్కి (రా. 11).

**ఎలిగడనాగలి** ఉ. ఎలిగడి-; చూ. ఎలిగట్టు నాగలి (కో. 7, 24).

**ఎలిదినాగేలి** ఉ. ఎల్ది- పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (కో. 1; రా. 1).

**ఎలిదుక్కినాగేలి** పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (కో. 2-5, 15; తె. 3).

**ఎలిదుక్కిమడక** పర్యా. చూ. మెట్టనాగలి. వెలి (మెట్ట) దుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (రా. 6).

**ఎలినాగేలి** (<వెలి-); పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి; "వెలి" అంటే మెట్ట. చూ. చిత్రం 6 క (రా. 27, 28).

**ఎలిమడనాగేలి** పర్యా. చూ. మెట్టనాగలి. మెట్ట దుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (రా. 11).

**ఎలుగు** చూ. ఎలువు (కో. 30; తె. 23, 24, 27).

**ఎలువు** రూ. ఎలుగు, ఎల్గు. నాగలి, గొర్రు, గుంటక మొ. వాటి కర్రు లేక పలుగు నేలలో లోతుగా దిగటం; దున్నేటప్పుడు నేల లోతుగా తెగటం (కో. 6, 8-13, 15-17, 19, 23, 24, 26-30, 32-35, 37, 40, 44, 46-51; తె. 1, 3, 41; రా. 1, 9, 23, 25); **-పీట** రూ. ఎల్గుపీట; పర్యా. చూ. వారిజె.- ఎలువు నలువులకు ఏడికోల, కాడికలిపేచోట వారిజె- దూర్చిన చిన్న కొయ్యగొట్టం. చూ. చిత్రం 6 చ. 9 (తె.); **-పేడు** రూ. ఎల్గుపేడు; పర్యా. చూ. చవ్వ. ఏడికోలను పణతలో దూర్చేచోట కిందివైపు కొట్టే పేడు; నాగలి భూమిలో లోతుగా దిగటానికి (ఎలువుకు) ఇలాచేస్తారు. చూ. చిత్రం 6 క. (కో. రా.).

**ఎల్గు** చూ. ఎలువు (తె. 15-17, 19-28); **-పీట** చూ. ఎలువుపీట (తె.); **-పేడు** చూ. ఎలువుపేడు (తె.).

**ఎసగొండ్ర** ఉ. ఎసగండ్ర; పర్యా. చూ. కుని. కొండ్రవేసిన తరవాత పొలంలో మిగిలినమూల (కో. 25).

**ఏటు** (-కట్టడం, -పెట్టడం); పర్యా. చూ. పన్నకం. (1) దున్నేముందు మోకును పణతచుట్టూ తిప్పి కాడికి కట్టేకట్టు; (2) పర్యా. చూ. అరక (కో. 25, 39-45; తె. 2, 16, 21, 23); **-తాడు** చూ. ఏరతాడు (తె.); **-తాళ్ళు** పర్యా. చూ. ఏరగట్ట. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిజె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట (తె.); **-సామాను** చూ. ఏట తాళ్ళు (కో.).

**ఏటికర్ర** చూ. ఏడికర్ర (కో. 28, 29, 33-37, 39-50; తె. 37, 38, 42).

**ఏటుకొండ్ర** మొదటి కొండ్ర పక్కన వేసే రెండో కొండ్ర; కొన్నిచోట్ల మొదటి కొండ్ర (కో. 25, 30, 33, 34; తె. 24-27, 29, 37, 39-41).

**ఏడికర్ర** రూ. ఏటికర్ర, ఏణికర్ర; పర్యా. ఈసు, ఏడికోల, ఒంటేలకట్టె, కోల, నగ, నొగ. కాడినీ పణతనీ కలిపే పొడుగు కర్ర; ఏడికోల. చూ. చిత్రం 6 క. 2 (కో. 11, 13-19, 22-24, 26, 27, 30-32, 51; తె. 30, 39, 41).

**ఏడికోల** పర్యా. చూ. ఏడికర్ర. నాగటి కాడినీ పణతనీ కలిపే పొడుగు కర్ర. చూ. చిత్రం 6 క. 2 (కో. 1, 8, 20, 21; తె. 1, 2; రా. 1-3, 23); **-తాప** పర్యా. చూ. కొమ్ము. కోలేరు వేసినప్పుడు ఏడికోల చివర అరిగిపోకుండా వేసిన ఇనపరేకు చూ. చిత్రం 6 క. 1 (కో. రా.).

**ఏడె** ? నిలువుగా అడ్డంగా దున్నటం (తె. 22).

**ఏణికర్ర** ఉ. ఏనికర్ర; చూ. ఏడికర్ర (కో. 25; తె. 40).

**ఏనాదిచాలు** దున్నటంలో ఆఖరిచాలు; సాధారణంగా ఇక్కడ ఐదుసార్లు దున్నుతారట (కో. 6).

**ఏరగట్ట** రూ. అరగట్ట, ఏరుకట్ట పర్యా. ఏటతాళ్ళు, ఏటసామాను, ఏర్మట్టు (సామాను), కర్రుజోడు, గుత్తికట్ట, తాళ్ళకట్ట, తాళ్ళగుత్తి. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిజె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట (కో. 6, 9-11, 13-15, 17-20, 22, 25; తె. 6, 9, 12, 35, 37-39, 42).

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రా. 4 | నడింపల్లి | పలమనేరు | చిత్తూరు | గుమ్మకంటి వెంకటరామన్న | వడ్డె | 62 | సేద్యం | | |
| రా. 5 | అంగల్లు | మదనపల్లి | ,, | మొలక రామలింగారెడ్డి | రెడ్డి | 55 | ,, | | |
| రా. 6 | దొడ్డిపల్లి | వాయల్పాడు | ,, | ఆర్యల నాగబసిరెడ్డి | ,, | 40 | ,, | వైద్యం | |
| | | | | గుద్దిలి చిన్నపరెడ్డి | ,, | 35 | ,, | | |
| రా. 7 | బయనపల్లి | రాజంపేట | కడప | కస్తూరి శేషయ్యనాయుడు | కమ్మ | 70 | ,, | | |
| రా. 8 | రాయచోటి | రాయచోటి | ,, | కె. శ్రీనివాసులు | ,, | 45 | ,, | | |
| రా. 9 | పాతపేట | సిద్ధవటం | ,, | అతికారి పుల్లయ్య | బలిజ | 45 | ,, | | |
| రా. 10 | వేల్పుల | పులివెందుల | ,, | లింగాల నారాయణరెడ్డి | కాపు | 50 | ,, | | |
| | | | | కదిరి నారాయణరెడ్డి | ,, | 40 | ,, | | |
| రా. 11 | పోరుమామిళ్ళ | బద్వేలు | ,, | చెన్ను ఓబయ్య | బలిజ | 45 | ,, | | |
| రా. 12 | జమ్మలమడుగు | జమ్మలమడుగు | ,, | అంగడి బయపరెడ్డి | కాపు | 60 | ,, | | |
| రా. 13 | ధర్మవరం | ధర్మవరం | అనంతపురం | నారపరెడ్డి | ,, | 50 | ,, | | |
| | | | | ఎంకిరెడ్డి | ,, | 45 | ,, | | |
| రా. 14 | రాగన్నగారిపల్లె | కదిరి | ,, | చిన్నపరెడ్డి | ,, | 48 | ,, | | |
| రా. 15 | పరిగి | హిందూపురం | ,, | పి. చిన్నారాయణరెడ్డి | ,, | 60 | ,, | | |
| రా. 16 | కంబదూరు | కళ్యాణదుర్గం | ,, | కామలపురి నరసప్ప | బలిజ | 60 | ,, | | |
| రా. 17 | వేపరాళ్ళ | రాయదుర్గం | ,, | రంగసంద్రం లక్ష్మప్ప | కాపు | 40 | ,, | | |
| రా. 18 | ఛాయాపురం | గుత్తి | ,, | తమ్మినేని అశ్వత్థప్ప | కమ్మ | 60 | ,, | | |
| | | | | లింగుట్ల కోనేటప్ప | ,, | 50 | ,, | | |
| రా. 19 | ఇల్లూరు | అనంతపురం | ,, | బోయ మునలప్ప | బోయ | 60 | ,, | కూలి | |
| రా. 20 | చీమలవాగుపల్లె | తాడిపత్రి | ,, | కొండేటి తిరుపతయ్య | ? కమ్మ | 50 | ,, | వడ్రంగం | |
| రా. 21 | పుచ్చపుయలమాడ | పత్తికొండ | కర్నూలు | బోయ పెద్దాయప్ప | బోయ | 60 | ,, | కూలి | |
| రా. 22 | ఎమ్మిగనూరు | ఆదోని | ,, | డంగోజీ పెద్ద నరసప్ప | ఉప్పర | 60 | ,, | | |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రా. 23 | పాణ్యం | నంద్యాల | కర్నూలు | బారమీసాల వెంకటన్న | బోయ | 53 | సేద్యం | | |
| రా. 24 | భీమునిపాడు | కోవెలకుంట్ల | ,, | పి. సి. బాలిరెడ్డి | కొడిదెకాపు | 48 | ,, | | |
| రా. 25 | ఆళ్ళగడ్డ | శిరువెళ్ళ | ,, | పల్లె చిన్నవరెడ్డి | పెదకంటికాపు | 50 | ,, | | |
| రా. 26 | కంభం | కంభం | ,, | మోదంపూరి సుబ్బరాజు | భట్రాజు | 54 | ,, | | |
| రా. 27 | ఎరగొండపాలెం | మార్కాపురం | ,, | ఒంగోలు చిన్నమూర్తెయ్య | మోటాటికాపు | 52 | ,, | | |
| రా. 28 | ఆత్మకూరు | నందికొట్కూరు | ,, | బంగారు సుబ్బన్న | తోటబలిజ | 60 | ,, | కూలి | |

# సూ చ న లు

1-28 పటాల్లో ఒక్కొక్కటి సమానార్థంలో వాడుతున్న భిన్నపదాల ప్రాంతపరిమితిని సూచిస్తుంది, ఉదా. పటం 1 లో 'నల్లనేల' అనే అర్థంలో తెలుగుదేశమంతటా వాడుకలో ఉన్న రేగడి-రేవడి-రాగడి అనే మూడు ప్రధాన శబ్దరూపాల ప్రాంతీయ పరిమితులు కనిపిస్తాయి. రే>రా మార్పు, గ>వ మార్పు ఎక్కడ ఏర్పడ్డదీ కూడా స్పష్టంగా చూడవచ్చు. వేరువేరు వాడుకలకు వేరువేరు సంకేతాలు పటాల్లో గుర్తించబడ్డాయి. అంటే సంకేతం మారిన చోట స్థూలంగా వాడుక మారుతున్నదని గుర్తించాలి. పటం 3 ను బట్టి ఒక ప్రాంతంలో మోట అనీ అదే అర్థంలో మరొక ప్రాంతంలో కపిల అనీ వాడుతున్నట్టు తెలుస్తుంది. ఆయా వాడుకల మాండలికభేదాలు స్పష్టంగా పటంలో కనిపిస్తాయి.

రెండు రకాల వాడుకలు కలిసే సరిహద్దు గ్రామాల్లో రెండు గుర్తులూ ఆయా గ్రామసంఖ్యలతో కలిసి కనబడుతుంటాయి; ఉదా. చూ. పటం 4 తూము-మదుం గుర్తులు రెండూ కో. 33 పక్కన, పటం 7 లో మేడితోక-పాలె గుర్తులు రెండూ తె 8, 35 పక్కన కనిపిస్తాయి. ఈ విధంగా గీచిన పటాలు ఆయా పదాల వ్యుత్పత్తి చరిత్రలను అర్థంచేసుకోటానికి ఎంతో ఉపకరిస్తాయి. పటాలు 1-8 లను గూర్చిన సంగ్రహ వ్యాఖ్యానం గ్రంథ పరిచయంలో ఇవ్వబడ్డది (చూ. పుటలు 41-45).

పటాలు 29, 30, 31 మన భాషలో ప్రస్తుతమున్న ప్రధానభాషామండలాలను (dialects), పటాలు 32, 33 ఉపభాషామండలాలను (sub-dialects)సూచిస్తాయి. 1-28 పటాల్లో వాడుకలు మారినచోట సరిహద్దు గీతలు (వ్యవహార భేదక రేఖలు) గీచి, అవిమొత్తంగా ఒకచోటచేర్చి 29-33 పటాల్లో చూపబడ్డాయి. ఒక్కొక్క రేఖకు గుర్తుగా ఇచ్చిన అంకె ఆ యా పటాల (1-28)కు చెందినదని గ్రహించాలి.

ఈ పటాలను గూర్చిన ఇతర వివరాలకు చూ. గ్రంథపరిచయం (పుట 41)

*                *



మధ్యప్రదేశం
ఒరిస్సా
మద్రాసు
△ రేగడి (ఉ. రేగడ, రేగిడి)
▲ రేవడి (ఉ. రేవడ)
రాగడి (ఉ. రాగిడి)
స్కేలు
0 70 140 మైళ్ళు
76
78
80
82
84
14
16
18


పటం 1


మధ్యప్రదేశం
ఒరిస్సా
× మోటు.
△ కపిల (ఉ: కపిలి, కపిలె, కపిళె, -కబిల, కవిల, కైల)
స్కేలు
0 70 140 మైళ్ళు
76
78
80
82
84
14
16
18

పటం 3


మధ్యప్రదేశం
ఒరిస్సా
మదరాసు
△ నాగలి
▲ నాగేలి (ఉ. నాగేలు)
నాగెల.
నాంగలి.
× మడక.
స్కేలు
0 70 140 మైళ్ళు
76
78
80
82
84
18
16
14

పటం 6


మధ్యప్రదేశం
బంగాళాఖాతం
× మేడి (ఉ. మేడు)
※ మేడితోక (ఉ. మేడితాక)
▲ పాలె
మైళ్లు
0
70
140 మైళ్లు
76
78
80
82
84
14
16
18
మదరాసు

పటం 7




పటం 10


మధ్యప్రదేశం
ఒరిస్సా
మదరాసు
△ తమిరె (ఉ. తమిర, తమిరి, తమెరి)
▲ తగిరె (ఉ. తగిర, తగిరి)
తయిర (ఉ. తయిరె)
మైళ్లు
0 70 140
76 78 80 82 84
14 16 18

పటం 11


మధ్యప్రదేశం
ఒరిస్సా
మహారాష్ట్ర
బంగాళాఖాతం
చెక్రం
ఉండ
గాను (ఉ. గోను)
గాలు
గారె
గిర్ర (ఉ. గిరర, గిరె)
గిల్ల
గీర (ఉ. గీరె)
పయెచ్చ
(ఉ. పయె,
రోజా
రోదా
మైళ్లు
0 70 140
76 78 80 82 84

పటం 13

కదలకుండా బిగింపుకువేసే తాడు. చూ. చిత్రం 7 ట. 4 (రా. 17).

**బిడిచీల** పర్యా. చూ. నొగచీల. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టే మేకు (కో. 34, 39, 41).

**బిర్రుపలక** జంటక్కిడి లొట్టలు దూర్చే పలక. చూ. చిత్రం 8 చ. 3 (రా. 18).

**బీటిగుంటక** పర్యా. ఎడగుంటక, ఎలిగడగుంటక, కత్తెరగుంటక, చాళ్ళగుంటక, తరిపిగుంటక, దిన్నెగుంటక, దుమ్ముగుంటక, బోడ్డెంగుంటక, సానెగుంటక. విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి మొ.వి పోవటానికి, నేల ఒదులుకావటానికి మెట్టలో తోలే గుంటక. చూ. చిత్రం 9 క (తె. 9, 32, 35; రా. 18).

**బీటిగొర్రు** పర్యా. చూ. ఆటగొర్రు. భూమిదున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కులుంటాయి. చూ. చిత్రం 7 చ (తె. 2; రా. 18, 26-28).

**బీటిచాలు** మొదటిసారి గుంటకతో దున్నినచాలు; గుంటకతో దున్నటం (కో. 33; తె. 1, 2, 8-10, 14, 29, 34, 35, 37, 39; రా. 4, 25, 27).

**బీటిచేను** పర్యా. చూ. బీటిపొలం. దున్నవలసిన పొలం (కో. 9, 15).

**బీటిదున్నకం** నీళ్ళు పెట్టక ముందు మాగాణిలో దున్నటం (తె. 7, 10).

**బీటినేల** పర్యా. చూ. బీటిపొలం. దున్నవలసినపొలం. (కో. 10).

**బీటిపొలం** పర్యా. చూ. బీటిచేను, బీటినేల. దున్నవలసిన చేను (కో. 16, 24).

**బీటిమడక** (1) మెట్ట(బీడు)నేలలు దున్నేనాగలి (రా. 9); (2) పొలాన్ని మొదటిసారి దున్నటం (కో. 15).

**బీటిసేద్యం** ఉ. బీటిసేద్దెం; పర్యా. ఎరసేద్యం, ఎలిగడసేద్యం, చెలకసేద్యం, తరవుసేద్యం, దుమ్ముపాపనం. తొలకరి ముందు పొలంలో గుంటకతో దున్నటం; మొదటి సాగు (రా. 12, 18, 20).

**బీసుగుంటక** వెదబెట్టిన చాళ్ళు పూడ్చిన తరవాత తోలే గుంటక (రా. 17).

**బుడ్డగొర్రు** పర్యా. చూ. చిన్నగొర్రు. పొగ, మిరప, వేరుసెనగ మొ. చేలలో తోలే చిన్నసైజు గొర్రు; దీని అడ్డ చిన్నది (రా. 18, 21).

**బురదగొర్రు** పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికి, విత్తిన తరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 12 (కో. 29, 35; తె. 12, 29-31, 35-38, 40-42).

**బురదచాలు** ఉ. బురచ్చాలు. మాగాణికి నీళ్ళుపెట్టి దున్నిన చాలు (కో. 13, 16, 24).

**బురదదుక్కి** ఉ. బురదుక్కి, బుర్దదుక్కి. నీళ్ళుపెట్టి దున్నిన మాగాణిపొలం; మాగాణిలో దున్నటం (కో. 8; తె. 3, 12, 22, 39, 42; రా. 22, 23).

**బురదనాగలి** పర్యా. అడుసు-, కరిగట్టు-, తరి-, దంప-, దమ్ము-, పల్లపు-, మడికట్టు-, మడిమడక, రొంపి-. బురద(మాగాణి)నేలలు దున్నేనాగలి. చూ. చిత్రం 6 ట (కో. 12, 13, 16, 17, 24, 29, 31; తె. 12, 21, 30, 31, 33, 34-36, 38, 40-42).

**బురదనాగేలి** చూ. బురదనాగలి (కో. 4, 6, 14; రా. 22, 23, 26, 28).

**బురదమడక** పర్యా. చూ. బురదనాగలి. బురదనేల (మాగాణి)లో దున్నే నాగలి. చూ. చిత్రం 6 ట (రా. 13, 14, 17-20).

**బుర్ర** పర్యా. చూ. పణత. ఏడికోల దూర్చే కొయ్య మొద్దు; నాగటివంపు పైభాగం. చూ. చిత్రం 6 క. 2 (కో. 41, 43).

**బెడెం** పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చేచోట అవసరాన్నిబట్టి ఎలువు నలువులకు కొట్టేపేడు. చూ. చిత్రం 6 క. 10 (తె. 6).

**బెడ్డదుక్కినాగలి** ఎండాకాలం దుక్కికుపయోగించే నాగలి (కో. 47).

**బెండు** పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9-12 క. 1 (తె. 13).

**బేరడ** ఉ. బేరడు; బహు. బేరండ్లు, బేరల్లు, బేరళ్ళు, బేరాల్లు; పర్యా. చూ. పట్టెడ. ఎద్దులను కాడికికట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలువట్టా. చూ. చిత్రం 6 చ. 4 (కో. 12, 24, 25; తె. 1, 6, 7-12, 17, 18, 24, 25, 29, 32-39, 42); **-వారు** ఉ. బేరటవారు, బేరదోరు; పర్యా. చూ. దావారు. బేరడ చివర కాడికి తగిలించేవారు (తోలుతాడు) (కో. తె.); **బేరడాకు** ఉ. బారడాకు, బేరటాకు; చూ. బేరడ (తె.).

**బొక్క** పర్యా. చూ. తొలి. రంధ్రం; కాడి, పణత మొ. వాటికి వేసిన రంధ్రం. చూ. చిత్రం 6 చ. 3 (కో. 33).

**బొంగరంచాలు** వేరుసెనగ వెయ్యటానికి గుండ్రంగా వేసినకోండ్ర (కో. 37, 40, 43, 45, 48-50).

**బొట్టె** ఉ. బొద్దె; పర్యా. కాడితమ్మె, జోతికెతమ్మె, జోతికెలచిప్ప, పట్టెడకొలికి, పట్టెడతాడు, పట్టెడచిలకట, పట్టెడపలుపు, వెలిగొలికి. కాడికి తగిలించే పట్టెండ్ల కొస




పటం 17


మధ్యప్రదేశం
ఒరిస్సా
గోంగూర (ఉ. గుంగూర)
గోగాకు.
పుండికూర
పుంటికూర (ఉ. పొంటెక్కూర)
పుండ్రేకు
స్కేలు
0 70 140 మైళ్లు

పటం 19



మధ్యప్రదేశం
ఒరిస్సా
మహారాష్ట్ర
అలచంద (ఉ. అలసంద, అలిచంద, అలిసెంద, అల్సంద, అల్సాంద [అల్సాండ)
బొబ్బర.
బొబ్బెర (ఉ. బెబ్బర)
స్కేలు - మైళ్లు.
0 70 140
20
18
16
14
74
78
80
84


పటం 22


మధ్యప్రదేశం
ఒరిస్సా
మద్రాసు
ఫ్రూటీ(డ.కూటీ)
పురిటీ.
చుట్టు
వంపు
వంకె
చిప్ప.
పేరె.
ఒట్టు.
కనెం.
మైళ్లు
0 70 140 మైళ్లు
18
16
14
76
78
80
82
84

పటం 23




పటం 21.


మధ్యప్రదేశం
ఒరిస్సా
△ నారు.
▲ నేరు.
× ఆకు
† తుకం
□ మొలక (ఉమలక)
స్కేలు
0 70 140 మైళ్లు
76 78 80 82 84
14 16 18

పటం 27



మధ్యప్రదేశం
ఒరిస్సా
△ మాగాణి (ఉమాగాటి, మాగాడి, మాగాని)
▲ మాగిలి
× తరి (పొలం)
మాగెలి
◒ మడి
§ నీరు పొలం
† పల్లపునేల
# చేను
స్కేలు.
0 70 140 మైళ్లు
76
78
80
82
84
18
16
14


పటం 28




పదసంగ్రాహకులు పర్యటించిన ఊళ్ళు

isoglosses enclosing the Telangana region extends into this area (see Map 31, isoglosses 2, 5 and 14).

Within the major dialect areas set up, there are several cris-crossing lines of usage representing more recent localized variations (Maps 32, 33). Within the Telangana region several subdialectal variants have arisen cutting the northern districts vertically into two; variants marked in Maps 1, 12, 14 and 27 separate the westren half from the eastern. The regional extent of Hindustani influence is illustrated by isoglosses 13 and 27 in Map 32.

In the Rayalaseema-Nellore dialect region, several variations in usage occur between the zones north and south of the Penna river (see Map 33); corresponding to *karru* and *nāgēli* used in the north, *kāru* and *maḍaka* occur in the south. Isoglossess 7 and 14 in Map 33 cut across two major dialect regions—mostly covering the transition belt.

From this study it is now possible to know, better than ever before, what areas to concentrate for data collection in future dialect surveys. The wide transition belt between Telangana on the one hand and Rayalaseema-Nellore on the other with over-lapping dialect boundaries is a fertile area for intensive and extensive field work by both linguists and sociologists. This belt comprises the northern half of Kurnool district (R), most of Mahabubnagar and the southern half of Nalgonda districts (T). Khammam forms part of another transitional zone which extends into the adjacent coastal districts, viz. Krishna and West Godavari. A closer survey of the area covered by C 33-40 in future would certainly help in a more precise formulation of the dialect boundary between East Godavari and Visakhapatnam.

## CONCLUSION

The foremost contribution of this work is to Telugu lexicography. As stated earlier out of the 9,000 entries recorded in this dictionary the native items form a large part, most of which are documented for the first time. Secondly this work is also the first systematic attempt in Telugu dialectology.

The scheme and shape of any dictionary is determined by the purpose for which it is intended. Vocabulary recorded in this dictionary is meant to be useful to scholars of different interests. Principles have been formulated to standardise certain of the variants as entries, while others are listed under the respective entries, if not altogether eliminated. This system is meant to help future writers on agricultural topics in Telugu in their choice of the right terminology. However, the author is fully aware of the limitations in the application of these principles. For, the basis of field work being a list of topics and not an exhaustive list of worditems, the geographical distribution of the items cannot be complete in all cases. Therefore, this cannot completely qualify as a ground for the popularity rating and standardization of certain entries.

Little need be said of the utility of the material in this work for the historical and comparative linguist in Dravidian. More new cognate and dialectal material from Telugu is now available as a useful addition to Dravidian etymologies. Hundreds of items like *gānu/gālu* 'wheel'; *ēnu* 'one edge of blade of hoe or spade etc', *meda* 'heap, etc, can now be incorporated into the Dravidian etymologies (*DED* 1242, 752 lack cognates from Telugu while there is no entry for Ka. *mede* heap). Dialect dictionaries of occupational vocabularies provide rich material for sociologists and cultural anthropologists by supplying the linguistic correlates of cultural items and indicating the dialect areas and transition zones for further field studies in culture-centres and migration patterns, etc.[13]

13. A general discussion of this approach occurs in John J. Gumperz, "Speech Variation and the Study of Indian Civilization", *American Anthropologist*, Vol. 63 (October, 1961), pp. 976-988.

## KEY TO DIALECT MAPS IN TRANSLITERATION

u.= *uccāraṇabhēda*/ subvariant. Owing to typographical difficulties, the symbols used for representing the different regional variants in the maps are not reproduced here. However, the order of occurence of the items below is the same as that in the maps.

Map 1. 'black soil'.
rēgaḍi (*u.* rēgaḍa, rēgiḍi), rēvaḍi (*u.* rēvaḍa), rāgaḍi (*u.* rāgiḍi).

Map 2. 'thin sandy soil'.
tuvva (*u.* tuva, tū, tūva), dubba.

Map 3. 'an instrument for lifting water from an irrigation well' (see figure 2, pp. 46–49).
mōṭa, kapila, (*u.* kapili, kapile, kapiḷe, kabila, kavila, kayla).

Map 4. 'a sluice, flood-gate, tubular outlet of tank, etc.'
madum(*u.* madam, madugu, maduvu, mudum), tūmu.

Map 5. 'yoke resting on shoulders of bullocks, of plough, drill plough, etc.'
kāḍı, kāḍimānu/°māku, kāṇḍi, kāṇi, kāni, kāvadi, pūju, pūdu, (*u.* pūdu).

Map 6. 'the plough'
nāgali, nāgēli (*u.* nāgēlu), nāgela, nāṅgali, maḍaka.

Map 7. 'pough tail or handle'.
mēḍi (u. mēḍu), mēḍitōka (*u.* mēḍitāka), pāle.

Map 8. 'plough share'.
karru, kāru, nakku.

Map 9. 'plough shaft plough beams'.
ēḍıkarra, ēṭikarra, ēṇikarra, ēḍıkola, kola, noga, naga, īsu (*u.* īsa), maṭṭu.

Map 10. 'dung of cattle'.
peṇḍa, pēḍa.

Map 11. 'a nail fixed in the middle of yoke to stop it from slipping'.
tamire (*u.* tamira, tamiri, tameri), tagire (*u.* tagira, tagiri), tayira (*u.* tayire).

Map 12. 'spoke of wheel of a country cart'.
āku, āre, kallu (? kannu), rēku, lāka.

Map 13. 'wheel of cart'.
cekram, uṇḍa, gānu (*u.* gonu), gāḷu, gāre, girra (*u.* gira, gire), gilla, gīra (*u.* gīre), payye (*u.* paye, payya), rojā, rodā.

Map 14. 'leathern belt used to fasten bullocks to yoke'.
paṭṭeḍa, bēraḍa (*u.* bēraḍu), jotike, *u.* jatike, jottike), dotte, jōḍu.

Map 15. 'wooden beam under frame of cart to which axle is fixed'
ḍolupu, dōni, dōne (*u.* dōni, dōnu), dōniga, maṇḍigam (*u.* maḍigem, maṇḍagam, maṇdigem maṇḍgam), manigam (*u.* manigem), diṇḍu, dūlaganem.

Map 16. 'small bundle of cut corn, etc.'
ōde (*u,* ūde, odi, ōja, vādi, vāde), ōvu (*u.* ovvu), meda, sariḍe (*u.* sarḍı) pempu.

Map 17. 'disease, particularly plant disease,
tegulu, tevulu.

Map 18. 'gourd, *Lageneria vulgaris*'
sora, ānapa (*u.* ānaba), anipe, ānaga (*u.* ānuga), ānigem.

Map 19. 'Deccan hemp, *Hibiscus cannabinus*'.
gōṅgūra (*u.* guṅgūra), gōgāku, puṇḍikūra, puṇṭikūra (*u.* poṇṭikūra), puṇḍæ:ku.

Map 20. 'a kind of millets, *Eulisine coracana*'.
tamide (*n.* tamida, tayda), rāgi, cōḍi (*u.* sōḍi).

Map 21. 'spiked millet, *Panicum spicatum*'.
sadda (*u.* sodda). sajja, gaṇṭe (*u.* gaṇṭi), kambu.

Map 22. 'a variety of gram'.
alacanda, (*u.* alasanda, alicanda, alisenda, alsanda, alsenta, alsonda), bobbara, babbera (*u.* bebbara).

Map 23. 'felloe of a wheel'.
pūṭī (*u.* kūṭī), puriṭī, cuṭṭa, vampu. vaṅke, cippa, pēre, oṭṭu, kanem.

Map 24. 'whitish pink colour, of cattle', payye (*u.* paye, payya, peya, pay). pase (*u.* pasi, passe).

Map25. 'weeding, weeds'.
kalupu, gābu.

Map 26. 'fencing'.
kance (*u.* kanci), elugu (*u.* enugu), kara.

Map 27. 'seedlings for transplantation'.
nāru, nēru, āku, tukam, molaka (*u.* malaka), sasi.

Map 28. 'wet land'.
māgāṇi(*u.* māgāṭi, māgāḍi, māgāni), māgili, māgēli, tari (polam), maḍi, pallapunēla, nīrupolam, cēnu.

# మాండలిక వృత్తిపదకోశం

## 1. భూములు

### మట్టితీరు, సాగుతీరు, మేరలు, రెవెన్యూ

**అగ్రహారం** ఉ. అగ్గహారం, అగ్రారం. పండితులు, పురోహితులు అయిన బ్రాహ్మణులకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొదలయినవారు ఇచ్చిన భూమి (కో. 1,10,13,19,25,48-51; తె. 39,42).

**అడ్డగనెం** ఉ. అడ్డగెనెం; పర్యా. చూ. పిల్లగనెం. మాగాణిలో మడికీమడికీ మధ్య అడ్డుగా వేసిన చిన్న మట్టికట్ట (రా. 7).

**ఆబాదీ** పర్యా. చూ. గ్రామకంఠం. గ్రామస్థులందరికీ ఉమ్మడిహక్కు గల భూమి; కొన్నిచోట్ల శిస్తుగూడా ఉమ్మడిగానే చెల్లిస్తారు (తె. 15, 16, 27, 28, 31).

**ఆయకట్టు** (1) కొందరు రైతులు ఉమ్మడిగా పట్టా తీసుకొన్న భూమి; (2) సాగుకు లాయకైన గవర్నమెంటు బంజరు; (3) చెరువుకింద సాగుచేసే భూమి పరిమితి (రా. 6, 10, 11, 13, 14, 18, 27).

**ఇనాం** (< హిం. ఇనాం బహుమానం, పారితోషికం); ఉ. ఈనాం; పర్యా. కొలువు, మాన్యం. తమకు చేసిన సేవకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొదలయినవారు ఇచ్చిన భూమి (కో. 1, 3, 9, 11, 17, 22, 25, 30, 31, 33, 40, 41, 44, 47, 49, 50; తె. 1-8, 10 - 29, 31, 33, 36, 37, 39; రా. 7,10-18, 20-28). ప్రధానభేదాలు: **అసాది-**, **ఆసాది-** అ (ఆ) సాదులు మాదిగవాళ్ళలో ఒక శాఖ. వీరు గ్రామదేవతోత్సవాల్లో కథలు చెప్పినందుకు ఇచ్చిన ఇనాం (రా.); **ఆయగాళ్ళ-** చాకలి, మంగలి మొదలయిన వృత్తులవారికిచ్చింది (రా.); **ఉప్పర-** చెరువుకు గండిపడ్డప్పుడు పూడ్చేఉప్పర్ల కిచ్చింది (తె.); ? **ఊరడు-** వేసవి కాలంలో చలివేంద్రం పెట్టేవారి కిచ్చింది (తె.); **ఒడ్డర-** ఒడ్డెవాళ్ళ కిచ్చింది (కో.); **కమ్మరి-** (కో. తె. రా.); **కంసలి-**, **కంసాలి-** (కో. తె.); **కరణం-** (కో. రా.); **కళావంతుల-** దేవదాసీల కిచ్చింది (కో.); **కావలి-** కోటద్వారం దగ్గర కావలి కాచే వారి కిచ్చింది (కో. తె. రా.); **కుమ్మరి** (కో. తె. రా.); **కొమ్ము-** యుద్ధంలో కొమ్మూదినవారి కిచ్చింది (రా.); **ఖాజ-**, **ఖాజీ-** (< హిం. క్వాజీ మహమ్మదీయ న్యాయాధికారి) ముస్లిమ్ పురోహితులకు (పెండ్లిళ్ళు చేయించేవారికి) ఇచ్చింది (తె.); **ఖిద్మత్ -** (< హిం. ఖిద్మత్) సుంకరి, తలారి, మొ. ఊరి నౌకర్లకు ఇచ్చింది (తె.); **ఖైరాతీ-** (< హిం. ఖైరాతీ విశ. దానంగా ఇచ్చిన) దేవదాయ, ధర్మదాయాలు (తె.); **గణాచారి -** గ్రామదేవతోత్సవాల్లో ఒళ్ళు పెరిగే వ్యక్తి కిచ్చింది (కో.); **చాకలి-** (కో. తె. రా ); **చాకిరీ-** ఊరి నౌకర్ల కిచ్చింది (కో. తె. రా.); **చౌతా-** (< హిం. చౌథా విశ. నాలుగోవంతు) నాలుగోవంతుపన్నుమాత్రం కట్టేట్టు తీర్మానించి చాకలి, మంగలి, మొ.వృత్తులవారి కిచ్చింది(తె.) ; **జంగం-** (తె.); **జీరిగ-** వడ్లబత్తుడి కిచ్చింది (రా.) ; **జోగి-** ఊరి జాతరలో కథ చెప్పేవాడి కిచ్చింది (తె.) ; **తంబళ్ళ-** శైవపూజార్ల కిచ్చింది (తె. రా.); **తలారి-**, **తలార్ల-** ఊరి తలారి కిచ్చింది (రా.) ; **తోలుబొమ్మల-** తోలు బొమ్మలాట ఆడించే వారి కిచ్చింది (రా.); **దరిమిలా-**? చాకలి, మంగలి, మొ. గ్రామవృత్తుల వారి కిచ్చింది (కో.); **దర్గా-** (< హిం. దర్గా, దర్గాహ్, గోరీ) ముస్లిం సమాధిస్థలాని కిచ్చింది (తె.); **దీపం-** దేవాలయంలో దీపం పెట్టేవారి కిచ్చింది (తె.రా.); **దేవతా-** **దేవల్-**, **దేవస్థానం-**, **దేవాలయం-**, **దేవుని-** దేవాలయాల పోషణకు, దేవతల అంగరంగభోగాలకు ఇచ్చింది (కో. తె. రా.); **దొరతనం-** గవర్నమెంటుకు సహాయపడ్డవారి కిచ్చింది (కో.); **నంబి-** వైష్ణవ పూజార్ల కిచ్చింది (తె.); **నౌకరీ-**, **నౌక్రీ-** (< హిం. నౌకరీ సేవ) చాకలి, మంగలి, మొ. ఊరి నౌకర్ల కిచ్చింది (కో. తె.); **నిస్ప-**, **నిస్పా-** (< హిం.

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విశ. = విశేషణం; హిం. = హిందుస్తానీ.

నిక్ఫ్ సగం) సగంపన్ను చెల్లించవలసిన ఇనాం (తె.); **నీరడి-, నీరుడిగాడి-, నీరుగట్టు-, నీరుగంటు-** మాగాణి ఉన్న ఊళ్ళలో పొలాలకు నీరు పంపకంచేసే వాడికిచ్చింది (కో. తె. రా.); **పంచాగం-** పురోహితుడికిచ్చింది (రా.); **పటేల్ -** గ్రామమున్సబు కిచ్చింది (కో. తె.); **పట్వారీ-** గ్రామకరణాని కిచ్చింది (తె.); **పాళెగాళ్ళ-** యుద్ధాల్లో చిన్న సేనాపతులుగా ఉన్నవారి కిచ్చింది (రా.); **పీర్ల-** (< హిం. పీర్ ముస్లిమతగురువు) (తె. రా.); **పురోహిత-** (కో.); **బటవర్తి-** చూ. భటవృత్తి- (తె. రా.); **బట్టు-** భట్రాజుల కిచ్చింది (తె.); **బత్తులు-** వడ్లబత్తుల కిచ్చింది (రా.); **బందెల-** ఊరి కాపలివాడి కిచ్చింది (కో.); **బలోతా-, బల్వతా-** చూ. ఆయగాళ్ళ- (తె.); **బాగత్-** (హిం. బాగీ. తిరుగుబాటుదారుడు) సేనాపతి కిచ్చింది (తె.); **బాపన-** చూ. పంచాంగం- (కో. తె. రా.); **బారికి-** చూ. తలారి- (కో. రా.); **బేగరి-** (< హిం. బేగార్ సేవకుడు) బాటసారుల మూటలు మోసే మాదిగవాడి కిచ్చింది (తె.); **బైండ్ల-** (< బవినీండ్ల-) శ్మశానంలో గోతులు తవ్వేవాళ్ళ కిచ్చింది (తె.); **భటవృత్తి-** ఊరి నౌకర్ల కిచ్చింది (కో.); **మఠం-** ఏదేనా మతసంస్థ కిచ్చింది (తె. రా.); **మసీదు-** (హిం. మసీద్, మస్జిద్) (తె.రా.); **ముల్లా-** (< హిం. ముల్లా ముస్లింపండితుడు) ముస్లింపండితుడి కిచ్చింది (తె. రా.); **మేజర్-** (< major) పెద్ద ఇనాం; గ్రామమంతటినీ ఇనాముగా ఇస్తే ఇట్లా అంటారు (రా.); **మేతర్ల-** చూ. బేగరి- (తె.); **రెడ్డి-** గ్రామ మునసబును రాయలసీమ నెల్లూరు ప్రాంతాల్లో "రెడ్డి" అంటారు; అతని కిచ్చింది (రా.); **వడ్రంగి-, వడ్ల-** (కో. తె. రా.); **వృత్తి-** చూ. భట్వృత్తి- (కో. తె. రా.); **వెట్టి-** ఉ. ఎట్టి-. గ్రామ కరణం దగ్గర పనిచేసే వెట్టివాడికి (తలారికి) ఇచ్చింది (కో. తె.); **వ్యక్తిగత-** జమీందారు, నవాబులు, మొ. వారు తమ కిష్టులైనవారి కిచ్చింది. దీన్నే కొన్నిచోట్ల "పర్సనాల్టీ"ఇనాం అని కూడా అంటారు (రా.); **సర్వదుంబాల-** చాలామందికి కలిపి పూర్తిపన్ను లేకుండా ఇచ్చింది (కో.); **సర్వీస్-** (< Service) ప్రభుత్వోద్యోగుల కిచ్చింది (కో. రా.); **సాలిం-, సాలెం-** (< హిం. సాలిమ్ పూర్తిగా) పూర్తిగా శిస్తు రద్దుచేసి దేవధర్మస్థానాల కిచ్చింది (తె.); **సుంకర-** సుంకం (పన్ను) వసూలు చేసేవాడి కిచ్చింది (తె.); **సేత్ సింద్-** చూ. తలారి (తె.).

**ఇసక(నేల)** ఉ. ఇసికె, ఇసె(శ)క, ఇస్క; రూ. ఉసికె. ఇసక ఎక్కువగా ఉన్ననేల. సామాన్యంగా వేరుశనగ, మొ.పంటలు, కొబ్బరి, అరటి, పనస, మొ.తోటలు ఈ నేలల్లో వేస్తారు (కో. 1–7, 9, 15, 16, 34, 37 – 41, 43, 45, 46, 48, 49; తె. 4, 19, 37, 41; రా. 1, 5, 6, 18, 24, 26); **-పర, - పఱ్ర** ఇసక, మన్ను (చవుడు, తెల్లనేల, ఎఱ్ఱనేల, మొ.) పొరలు పొరలుగా కలిసి ఉన్న నేల; ఇసకభాగం ఎక్కువ (కో. రా.); **-పాడు** ఇసక కలిసిన పాటినేల (రా.); **ఇసకొరస** చూ. ఇసకపఱ్ర (రా.); **ఇసక్కఱ** (< ఇసక + కఱ) చూ. ఇసకపఱ్ర (కో.)

**ఉగి(నేల)** చూ. ఊబి(తె. 20).

**ఉత్తరశివాయి** ముందుగా ఆక్రమించి పట్టా కోసం దరఖాస్తు పెట్టుకొన్న భూమి. దీన్ని శివాయి జమాలాగా వదులుకోటానికి వీల్లేదు (కో. 1; రా. 1).

**ఉదూదుర్** (< హిం. హుదూద్ హద్దులు); పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి(తె. 10).

**ఉప్పునేల** పర్యా. చూ. చవుడు. మామూలుగా తెలుపు రంగు గల చవిటినేల; బిరుసుగా ఉంటుంది. పంటలకు మంచిదిగాదు (కో. 6, 18).

**ఉప్పుచవుడు** ఉప్పుపండే చవిటినేల; చూ. చవుడు (కో. 1, 2, 9, 17, 26–29, 35; తె. 39; రా. 11, 17, 18, 21, 25).

**ఉబ్బ(నేల)** చూ. ఊబి- (కో. 34).

**ఉబ్బలి (నేల)** చూ. ఊబి- (కో.5; రా. 16); **-చవుడు** వాన కురిస్తే కాళ్ళు దిగబడే చవిటినేల; సేద్యపు పనికి రాదు; బొడ్డుతుంగ మొలుస్తుంది (కో. 5).

**ఉసికె(నేల)** ఉ. ఉసె (శ) క, ఉస్క; చూ. ఇసక- (కో. 13, 29, 31; తె. 16, 25, 26, 31, 40); **-పొర(నేల)** చూ. ఇసకపఱ్ర (కో. 13).

**ఊటదుబ్బ** నీరు చెమ్మగిలే తువ్వనేల; చూ. తువ్వ- (తె. 38).

**ఊటచవుడు** నీరు పైకి ఉబికివచ్చే చవిటినేల (కో. 33).

**ఊడ్పుచేను** పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు, మొ.వాటి నీటితో సాగుచేసే నేల. వరిచేను. (ఊడ్పు = నాటు) (కో. 36).

**ఊదుచవుడు** పర్యా. చూ. పీతిచవుడు. పసుప్పచ్చని చవిటినేల (రా. 21).

**ఊబి(నేల)** రూ. ఉగి, ఉబ్బ, ఉబ్బలి; పర్యా. జవుకు, దిబ్బలి, బుజుగు, బుడుగు, బూపుండు. వాన కురిసినప్పుడు బురబురపొంగి దిగబడే చవిటినేల (రా. 18).

**ఎద్దడిపరం** మిర్రుగా ఉన్న మడికీ, పల్లంగా ఉన్న మడికీ మధ్య వేసిన గట్టు; చూ. వరం (తె. 1, 2, 36).

**ఎర్రకట్టు (నేల)** పర్యా. చూ. ఎర్రనేల. ఎర్రరంగు మన్నుగల నేల; వేరుసెనగ, కొర్ర, పచ్చజొన్న, సజ్జ, ఉలవ, బొబ్బర్లు మొ. మెట్టపంటలకు మంచిది (రా. 21).

**ఎర్రగరువు** ఉ. ఎరగరువు, ఎర్రగరుగు; పర్యా. ఎర్రగేరె. ఎర్రమట్టి, గులక కలసిన నేల; ఎర్ర గులకగల నేల (కో. 26, 29, 33, 34, 36, 41; తె. 24, 41; రా. 5, 8, 18, 20).

**ఎర్రగులక** ఉ. ఎర్రగొలుసు. ఎర్రరంగు గులకరాయి గల నేల (కో. 1; తె. 1).

**ఎర్రగేరె** పర్యా. చూ. ఎర్రగరువు. ఎర్రచెక్క నేల (తె. 24).

**ఎర్రచవుక** ఎర్రమట్టి కలిసిన ఇసక నేల (కో. 47, 50; తె. 27).

**ఎర్రచవుడు** ఉ. ఎరచవుడు, ఎరజవుడు, ఎర్రజవుడు. ఎర్రరంగు గల చవిటినేల; ఎర్రమట్టి, చవుడు గలిసిన నేల (కో. 8, 25; తె. 26, 32, 36-39, 42; రా. 14).

**ఎర్రచెక్క (నేల)** ఉ. ఎరజెక్క-, ఎర్రచెక్క-, ఎర్రజెక్క-; రూ. ఎర్రడెక్క-, ఎర్రసెలక. పర్యా. చూ. ఎర్రనేల; కంది మొదలుగలనేల; ఎర్రనేల. పంటలకుమంచిది (కో. 8, 9, 33; తె. 25, 26, 28, 35, 42; రా. 17, 20, 28).

**ఎర్రడెక్క (భూమి)** చూ. ఎర్రచెక్క నేల (తె. 25).

**ఎర్రనేల** ఉ. ఎరనేల, ఎర్నేల; పర్యా. ఎర్రకట్టు-, ఎర్రచెక్క-, ఎర్రచెక్క-, ఎర్రమట్టి-, ఎర్రసెలక. ఎర్రరంగు మన్నుగల నేల; వేరుసెనగ, కొర్ర, పచ్చజొన్న, సజ్జ, ఉలవ, బొబ్బర్లు, మొ. మెట్టపంటలకు మంచిది (కో. 3-7, 10-13, 25, 39, 43; తె. 2, 6, 11-13, 15, 35, 37, 38; రా. 2, 4, 5, 7-10, 13-19, 21-23, 26-28).

**ఎర్రతువ్వ** ఉ. ఎరతువ; రూ. ఎర్రదుబ్బ. ఎర్రరంగు గల తువ్వనేల; చూ. తువ్వ (రా. 23, 25, 28).

**ఎర్రదుబ్బ** ఉ. ఎరదుబ్బ; చూ. ఎర్రతువ్వ- (తె. 38, 42).

**ఎర్రబెణుకు** ఎర్రరంగు పలకరాళ్లు గల నేల (రా. 18).

**ఎర్రమట్టి (నేల)** పర్యా. చూ. ఎర్రనేల. ఎర్రరంగు మన్నుగల నేల; మెట్టపంటలకు మంచిది (కో. 1, 27, 30, 37, 40, 47, 51; తె. 40).

**ఎర్రమసక** ఉ. ఎరమసక. ఎర్రమన్ను కలిసిన (ఇసక) నేల (కో. 29; తె. 1, 10, 18; రా. 25).

**ఎర్రరేగడి** ఉ. ఎర్రరేగడ; రూ. ఎర్రరేవడ. ఎర్ర మన్ను కలిసిన రేగడినేల. మామిడిపండురంగులో ఉంటుంది. సారవంతమైనది (కో. 1, 8, 33, 49; తె. 1, 2, 22, 23; రా. 1, 2).

**ఎర్రరేవడ** చూ. ఎర్రరేగడి (కో. 37, 45).

**ఎర్రసెలక** చూ. ఎర్రచెక్క- (తె. 14, 33, 34).

**ఎలగడ** రూ. ఎలిగాడి; పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండేనేల (తె. 38).

**ఎలిగాడి** చూ. ఎలగడ (రా. 7).

**ఎలిజెలక** పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండేనేల (తె. 2).

**ఎలిపొలం** (<వెలి=బయలు, మెట్ట): పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండేనేల (తె. 3; రా. 8, 21, 23, 26).

**ఎల్లరాయి** ఉ. ఎల్లాయి; పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (కో. 1; రా. 1).

**ఒడ్డు** పర్యా. చూ. గట్టు, గనెం. (1) రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టిగట్టు; (2) మాగాణిలో మడికీ మడికీ మధ్య వేసిన మట్టికట్ట (తె. 4, 14, 24, 29).

**ఒంటితురేగడి** ఎక్కువ పదునైతే నాగలికి కరుచుకుపోయి దున్నటానికి కష్టమయ్యే రేగడినేల; ఒండు కలిసిన రేగడి; పైర్లకు మంచిదిగాదు; ఈ నేలలో పుళిందరాయి ఉంటుందట (కో. 3, 4).

**ఒండలి(నేల)** చూ. ఒండు- (కో. 1).

**ఒండు (నేల)** రూ. ఒండలి-; పర్యా. రేవ. వరదల్లో కొట్టుకువచ్చి నిలిచేమట్టి; చెరువులు, కుంటలు మొ. వాటి అడుగున పేరుకొన్నది: సారవంతమైన మెత్తని నల్లనేల; గోధుమ, సెనగ, పొగాకు పంటలకు శ్రేష్ఠం (తె. 23; రా. 5, 15, 16).

**ఓటితువ్వ** పంటకు పనికిరాని తువ్వనేల. ఎప్పుడూ తేమ నిలిచి ఉంటుంది: చూ. తువ్వ- (రా. 20).

**కంకర (నేల)** రూ. కనికెరాయి-. మొరపరాళ్ళుగల నేల; చూ. మొరం (కో. 30, 37, 50).

**కంచె** గవర్నమెంటు అధీనంలో ఉన్న బీడు. పుల్లరి (గడ్డిపన్ను) కట్టి పశువుల్ని దీనిలో మేపుకోవచ్చు (కో. 1, 3, 7, 9; తె. 1, 2, 20, 21, 23-28, 31, 32, 34, 38; రా. 1).

**కట్టెచవుడు** పర్యా. కొయ్యచవుడు. గట్టి తెల్లని చవిటి నేల; ఇందులో తుంగ గూడా మొలవదు (కో. 6, 10, 18; తె. 37).

**కడి** చూ. కడెం (తె. 14).

**కడెం** రూ. కడి; పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (తె. 24–26).

**కండభూమి** సారవంతమైన నేల (తె. 34).

**కండెం** పర్యా. చూ. పొలిమేర. ఊరి సరిహద్దు; గ్రామసీమ (కో. 18).

**కనికెరాయి(నేల)** రూ. కంకర(నేల). ఎరుపు తెలుపు కలిసిన రంగుతో గట్టిగా ఉండే రాయి. ఇటువంటి రాళ్ళుండటం పంటకు మంచిదట (రా. 18).

**కందిమొరుం** కందిగింజ అంత మొరపరాళ్ళు (గల నేల) చూ. మొరుం(కో. 18).

**కబ్జా** పర్యా. చూ. పట్టాభూమి. రైతు శిస్తు చెల్లించి దున్నుకొనే సొంతభూమి (తె. 6).

**కర** పర్యా. చూ. గట్టు. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టికట్ట (రా. 1).

**కలసరేగడి** ఇసక కలిసిన రేగడి. మసర రేగడి (రా. 12).

**కల్దువ్వ(నేల)** ? ఎర్రరంగు గల తువ్వనేల (తె. 1, 2).

**కల్లిసక (నేల)** నల్లటి ఇసకనేల (రా. 26).

**కాడిగట్టు** పర్యా. చూ. గట్టు. రెండుపొలాల మధ్య హద్దుగా వేసిన మట్టికట్ట (కో. 43); **–రాయి** పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (కో.).

**కాన** పర్యా. చూ. మాగాణి. కాలువ, చెరువు, మొ. వాటినీటితో సాగుచేసే నేల (రా. 4).

**కారి(నేల)** తడిసినప్పుడు ఊబిగాను ఎండినప్పుడు గట్టిబడి తెల్లగాను ఉంటుంది; జిగురుగా ఉండే ఉప్పునేల; ఒక మోస్తరు సారంగలది; వేపగింజల పిండి, ఇసక కలిపితే 'కారి' విరుగుతుందట (కో. 37, 38, 40, 41, 46–48, 50). రకాలు: గొడియకారి, చవిటికారి, జింకకారి, పంటకారి, పీతికారి.

**కాస్తకారీ** (< హిం. కాశ్త్ సేద్యం; కాశ్త్కార్ సేద్యగాడు; కాశ్త్కారీ సొంతసేద్యం): పర్యా. చూ. పట్టాభూమి. రైతు శిస్తు చెల్లించి దున్నుకొనే సొంతభూమి (తె. 2).

**కుంటిమూరు** పర్యా. చూ. కుని. చేలో ఒకమూల కోసుగా ఉన్న భాగం (తె. 4).

**కుని** పర్యా. కుంటిమూరు, కొంజె, కొండిమూల, కొనిమూల, కోజేరు, కోన, కోస, కోసు, కోసుమూల, లొక, మూలకట్టు, మొల్లి. చేలో ఒకమూల కోసుగా ఉన్న భాగం (తె. 3; రా. 18).

**కుప్పచవుడు** పర్యా. చూ. పుల్లచవుడు. గోధుమవర్ణం గల చవిటినేల; వాకప్పు ఉపయోగించేది; కొద్దిగా పంటలు పండుతాయి (రా. 23).

**కూనురాతు** పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులునిర్ణయించి ప్రభుత్వంవారు పొలం నాలుగు మూలలా గుర్తుగా పాతిన రాయి (తె. 20, 32).

**కూబు** ఉ. కూపి, కూపు. కంట్రాక్టు తీసుకొన్న అడవి (రా. 26; కో. 50, 51).

**కైకోలుభూమి** పర్యా. చూ. కొర్నుభూమి. సేద్యం చేస్తూ సరిగాపండకపోవటంవల్ల వదిలివేసినభూమి (తె.42).

**కొంజె** పర్యా. చూ. కుని. చేలో ఒక మూల కోసుగా ఉన్న భాగం (రా. 18).

**కొండిమూల** పర్యా. చూ. కుని. కోసుగా ఉన్న చేని మూల (తె. 35, 36).

**కొనిమూల** పర్యా. చూ. కుని. చేలో కోసుగాఉన్న మూల (తె. 38).

**కొయ్యచవుడు** పర్యా. కట్టెచవుడు. గట్టిగాఉండి ఉప్పురిసేచవిటినేల; ఈ నేలలో 'ఉప్పాకు' అనే మొక్క పెరుగుతుందట (కో. 13).

**కొర్నుభూమి** పర్యా. కైకోలు. సరిగాపండక వదిలివేసిన భూమి; 'రాజీనామా' ఇచ్చిన 'శివాయి జమా' (కో. 44).

**కొలరాయి** చూ. కొల్తరాయి (కో. 46, 50).

**కొలువు** పర్యా. చూ. ఇనాం. ప్రభుత్వోద్యోగులు చేసిన సేవకు పారితోషికంగా ఇచ్చిన భూమి; ఎట్టికొలువు, బంట్రోతుకొలువు, తలార్లకొలువు ఇత్యాది వ్యవహారం (తె. 3).

**కొల్తకడి** పర్యా చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (తె. 35–38, 39, 42).

**కొల్తరాయి** రూ. కొలరాయి; పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (తె. 35–38, 39, 42).

**కోజేరు** పర్యా. చూ. కుని. చేలో కోసుగా ఉన్న మూల (తె. 39).

**కోన** పర్యా. చూ. కుని. చేలో కోసుగా ఉన్న మూల; పొలంమూల (తె. 21; రా. 2). **–రాతు** పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి (తె. 21).

**కోరడ** పర్యా. చూ. గట్టు. రెండు పొలాల మధ్య హద్దుగావేసిన ఎత్తైన మట్టిగట్టు (కో. 44).

**కోస** రూ. కోసు, కోసు(మూల); పర్యా. చూ. కుని. చేలో కోసుగా ఉన్న మూల (తె. 6).

**కోసు** చూ. కోస (తె. 36).

కోసుమూల చూ. కోస (తె. 35).

క్రిష్ణరేగడి (< కృష్ణరేగడి). పర్యా. చూ. నల్లరేగడి. ఎక్కువగా నల్లగా ఉండే రేగడినేల. సారవంతమైనది (కో. 41; రా. 23).

ఖండపురాయి ఉ. కందపురాయి, కందెపురాయి, కండవారాయి, కన్నపురాయి. నాలుగైదు నెంబర్లు గల పొలాలకు కలిపి హద్దుగా ప్రభుత్వంవారు పాతినరాయి (కో. 8, 10, 11, 12, 17, 24, 37 ; రా. 5, 6, 23—25, తె. 39).

ఖారిజ్‌ఖాతా (హిం. ఖారిజ్ వదులుకొన్న, ఖాతా పట్టా); ఉ. ఖరాదీఖాతా, ఖరీజ్‌ఖాతా. సేద్యం చేస్తూ సరిగా పండకపోవటంవల్ల పట్టా వదులుకొన్న శివాయి జమా భూమి (తె. 1, 2, 6—12, 29—38).

ఖుష్కీ (< హిం. ఖుశ్కీ మెట్టనేల: విశే. ఎండి, నది). ఉ. కుష్కీ, కుసికి, కుస్కీ; పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండే నేల (తె. 10, 13, 15—19, 21, 23—25 ; రా. 10, 12, 19, 20, 24, 25, 27). రాయలసీమ ప్రాంతంలో 'కుస్కీ' అనే ఉచ్చారణ సామాన్యం.

గట్టు ఉ. గెట్టు; పర్యా. ఒడు, కర, కాడిగట్టు, కోరడ. గడుసు, దూర, నట్టు, బదుగు, బాంద్రకుప్ప, బోదె, మండది గట్టు, మందల, మారు, మేర, మొరం, వరం. (1) రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టిగట్టు. (2) మాగాణిలో మడికీ మడికీ మధ్య వేసిన చిన్న మట్టికట్ట (కో. 4, 6, 8, 9, 12, 14—16, 18, 21—23, 25, 26, 28, 30, 31, 36—40, 43—46, 50; తె. 1, 2, 6—8, 11, 12, 22, 29, 31—39, 42; రా. 9, 20, 23—26); -బండ, -రాయి ఉ. గట్రాయి, గెట్టురాయి, గెట్రాయి ; పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతిన రాయి (కో. తె. రా.) ; -రౌతు చూ. గట్టురాయి (తె.); -వరం ఉ. గెట్టువరం, గెట్వారం; పర్యా. చూ. పోతుగనెం. మాగాణి పొలం చుట్టూ ఎత్తుగా వేసిన మట్టికట్ట (తె. రా.).

గడ్డ (-నేల, -భూమి). ఇనాం భూములకు తెలంగాణాలో కొన్నిచోట్ల 'గడ్డ' అనే వాడుక ఉంది. ఉదా: నిమాజుగడ్డ, కొలిమిగడ్డ, బత్తులగడ్డ, మఠంగడ్డ మొ. (తె. 8).

గడ్డనేల సారవంతమైన నేల (రా. 6); రకాలు: జేడగడ్డ, నూనెగడ్డ.

గనిమ ఉ. గనుము, గినిమ, గెనిమ; చూ. గనెం (కో. 2, 3, 7, 17, 18, 20).

గనెం ఉ. గినం, గెనం, గెనుం, గెనెం; రూ. గనిమ; పర్యా. దుగం, వరం. (1) మాగాణిలో మడిచుట్టూ వేసిన మట్టికట్ట; (2) రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన గట్టు. (కో. 1, 3, 10, 14, 15, 22, 24, 25, 28, 29, 31, 36; తె. 30, 31, 40; రా. 2, 6, 7, 9, 11, 14, 22, 25—27); -రాయి పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (తె.).

గనెవరం పర్యా. చూ. పోతుగనెం. మాగాణి పొలం చుట్టూ ఎత్తుగా వేసిన మట్టికట్ట (తె. 1, 32, 36).

గమిడి ఉ. గెమిడి. ఊరిచుట్టూరా ఉన్న సరిహద్దు (కో. 5, 6, 9—15, 17).

గయాలు ఉ.గయాలి; పర్యా. చూ. పోరంబోకు. గవర్నమెంటు అధీనంలో ఉన్న భూమి (రా. 3, 5, 16).

గరప-'గరువు' యొక్క విశేషణరూపం, ఉదా. గరపనేల, గరపసెలక; చూ. గరువు (కో. 13, 17, 19, 24, 28, 29, 31, 33, 34).

గరుగు విశే. గరక-; చూ. గరువు (రా. 5, 7, 8, 14—16, 18).

గరుబు చూ. గరువు (కో. 15, 24, 25; తె. 42).

గరువు రూ. గరప-, గరుగు (గరక-), గరుబు, గలస, గలుసు, గర్రె, గేరె. (1) సన్నని గులకరాయి కలిసిన నేల; కొన్నిచోట్ల ఇసక గులక గలిసిన ఎర్రనేలలు గాని, నల్లనేలలు గాని; పునాసపంటలు (వేరుశెనగ, జొన్న, సజ్జ, మొ.), అరటి, పసుపు, నిమ్మ, మొ. తోటలు ఈ నేలల్లో వేస్తారు; (2) పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండేనేల (కో. 13, 14, 16, 18, 19, 23, 26, 29, 31 - 34, 36, 39, 40 - 42, 45; తె. 34, 39—41; రా. 5, 8, 10, 20); -సెలక గులకరాయి కలిసిన ఎర్రనేల. ఇక్కడ 'సెలక' అంటే మెట్టపొలం (తె.). గరువుభేదాలు: ఎర్ర- తెల్ల-, పాటి-, పాల-, పీతి-, సున్నపు.

గరుసు ఉ. గెరుసు. పర్యా. చూ. గట్టు. (1) రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన గట్టు; (2) మాగాణిలో మడికీ మడికీ మధ్య వేసిన మట్టికట్ట (తె. 4; రా. 14).

గలస(నేల) చూ. గరువు. అల్లం, ఆకుతోటలు వేసే గరువు (కో. 3).

గలుసు(నేల)ఉ. గెలుసు; చూ. గరువు (తె. 5 15).

గల్లినేల ? జిరుగుగా ఉండే గట్టినేల (కో. 38)

గవటం చూ. గ్రామకంఠం (తె. 2).

గావుటాన్ చూ. గ్రామకంఠం (తె. 17—23, 28).

గుడం (1) పర్యా. చూ. నట్టు'. భూఖండం. పంచుకొన్న నేలలో ఒక ముక్క (తె. 4; రా. 8); (2) పర్యా. పెరడు. ఇండ్లవెనకా,పక్కనా సేద్యానికిఉపయోగించే నేల; మెట్ట(తె. 13).

**గుడ్డె** ఉ. గుడ్డి. మెట్ట సాగుచేసే ఎత్తైననేల; మిట్ట పొలం (కో. 43, 46-51).

**గుంటి** పైపరతో గూడిన చిన్న భూఖండం (కో. 2).

**గులకనేల** ఉ. గొలుకు; పర్యా. చూ. మొరుం. సన్న రాయి ఎక్కువగా కలిసిన నేల; కంది, జొన్న, ఆముదాలు, మొ. పంటలు వేస్తారు (కో. 1, 2, 5; రా. 1); చూ. ఎర్రగులక- (కో.).

**గులకరేవడి** గులకరాళ్ళు కలిసిన రేగడి (కో. 29).

**గుల్లరేగడి** రూ. గుల్లరేవడి; పర్యా. బొగ్గురేగడి, పొల్లురేవడి. గుల్లగా (ఒదులుగా) ఉండే రేగడి (కో. 44).

**గుల్లరేవడి** చూ. గుల్లరేగడి (కో. 28).

**గువ్వపుల్లుడు** ?గువ్వరంగులో ఉన్న పుల్లుడునేల (కో. 25).

**గువ్వరేగడి** ?నీళ్ళు పడితే విచ్చిపోయే రేగడినేల (కో. 32; తె. 41).

**గెర్రె** చూ. గరువు. మొరపగడ్డల నేల (తె. 25).

**గైరాన్** ఉ. గాయ్‌రాన్; పర్యా. చూ. పొరంబోకు. గవర్నమెంటు అధీనంలో ఉన్న భూమి; పశువుల మేతకు వదిలింది (తె. 2, 4, 6, 23, 35, 36; రా. 8, 9).

**గొంచి** గ్రామస్థులు ఉమ్మడిసేద్యం చేసుకొనే భూమిలో ఒక్కొక్కరి భాగం (రా. 18).

**గోడిభూమి** గోడిరాళ్ళు (గులకరాళ్ళు) కలిసిన ఒండు నేల (కో. 46).

**గోడియకారి** గోడిరాళ్ళు కలిసిన కారినేల; చూ. కారి నెల (కో. 50).

**గోడిరేవడి** తెల్లటి గులకరాయి కలిసిన రేగడి (కో. 48).

**గొమ్మునేల** ? గోదావరి వరదల తాకిడి గల నేలలకు ఒక ప్రాంతంలో ఉన్న వ్యవహారం (కో. 32).

**గ్రామకంఠం** రూ. గవటం, గావుటాన్; పర్యా. ఆబాదీ, గ్రామగొంచి. గ్రామస్థులందరికి ఉమ్మడిహక్కుగల బంజరు. కొన్నిచోట్ల శిస్తు గూడా ఉమ్మడిగానే చెల్లిస్తారు. (కో. 1, 11, 12, 23, 24, 27–33, 40, 46, 48–51; తె. 24–26, 33, 39, 41, 42; రా. 18, 27). చూ. గ్రామ ఖండము. గ్రామస్థులు ఇళ్ళు కట్టుకోటానికి ఉచితంగా ఇచ్చిన స్థలం (MAMP).

**గ్రామగొంచి** పర్యా. చూ. గ్రామకంఠం. గ్రామస్థులకు ఉమ్మడిహక్కు గల భూమి (తె. 1).

**గ్రామనత్తం** ఉ. గ్రామనెత్తం; పర్యా. జాగా. గ్రామస్థులు ఇళ్ళు కట్టుకోటానికి మాత్రమే గవర్నమెంటువారిచే శిస్తు రద్దుచేయబడ్డ భూమి (కో. 1–7, 14, 15; తె. 40; రా. 1, 4, 5, 7, 9, 11, 12, 17–22, 28).

**చట్టు(నేల)** రాతినేల; గట్టినేల; దున్నినప్పుడు తొందరగా తెగదు (కో. 10, 15, 25, 43).

**చలితువ్వ(నేల)** ఉ. చలితువ-, చలితూ-, చలితూప; రూ. చలిదుబ్బ, చల్వదుబ్బ. చెమ్మతో గూడిన తువ్వనేల; మంచు పడితే పొంగినట్టు ఉంటుందట; ఉలవ, మామిడి, మొ. వాటికి మంచిది (రా. 7, 8, 9, 11, 25).

**చలిదుబ్బ** చూ. చలితువ్వ- (తె. 40).

**చలిపుతక(నేల)** చెమ్మ తొందరగా ఆరని ఒకరకం రేగడి; ఉలవపంటకు మంచిది (కో. 5).

**చల్వదుబ్బ** చూ. చలితువ్వ- (తె. 27).

**చలిమొరస(నేల)** తేమ ఆరని మొరుంనేల; చూ. మొరుం. వర్షాలెక్కువగా కురిస్తే పండదు (కో. 12).

**చవట(నేల)** చూ. చవుడు (తె. 2, 8, 9, 11, 13, 14, 25, 32; రా. 6); **-తెర** తెరలుతెరలుగా చవుడున్న నేల (రా.).

**చవిటికర** ఉ. చవిటిక్రు. ఒక అంచున చవుడున్న నేల (కో. 5, 11).

**చవిటికారి** చవుడు గలిసిన కారినేల; చూ. కారి (కో. 40, 46, 48).

**చవితేకునేల** (< చవిటి+ఆకు) చవుడు కలిసిన నేల (కో. 22).

**చవిటొరస(నేల)** (< చవిటి+ఒరస; -ఒరస < వరస). చవుడు పొరలుపొరలుగా ఉన్న నేల; ఒక వరస చవుడున్న నేల (కో. 24; రా. 12).

**చవుక(నేల)** ఉ. చవక-. ఇసక, ఎర్రమట్టి కలిసిన నేల. పదును కాస్తుంది. వాన కురిసినా బురద కాదు. సారవంతమైనది. మెట్టపంటలకు, మాగాణి పంటలకు గూడా మంచిది (కో. 30, 38, 46 – 48, 50; తె. 15, 16, 21–23, 27–32; రా. 20); **-రేగడి** పర్యా. చూ. పిప్పి రేగడి. ? నిస్సారమైన రేగడి (రా.)

**చవుటకట్టు** పూర్తిగా చవుడున్న నేల; కొన్నిచోట్ల చవుడు, రేగడి కలిసినది (తె. 4, 14).

**చవుటపొక్కిలి** అక్కడక్కడ చవుడు పురకలుగల నేల (కో. 34).

**చవుటరేగడి** ఉ. చవట్రాగిడి. చవిత్రేగడి, చవుత్రేగడి. చవుడు కలిసిన రేగడి (కో. 13; తె. 3, 27, 31, 33, 35, 42; రా. 19, 20, 28).

**చవుడు** (విణ. చవట-, చవిటి-, చవుట-); ఉ. చౌడు; పర్యా. ఉప్పునేల. మామూలుగా తెలుపురంగుగల ఉప్పునేల; బిరుసుగా ఉండి నీరింకదు; పంటలకు మంచిది గాదు (కో. 3, 5–9, 11–30, 33–35, 37, 38, 40, 46, 48, 51; తె. 6, 10, 15–24, 26–28, 38, 40, 41; రా. 3, 5, 6, 9 – 11, 13, 14, 18, 21, 22, 24–26); **పర్ర-** ఉ. పర. పైన చవుడు, కింద మన్నుగల

నేల (రా.).

**చిగురునేల** మెత్తని మన్నుగల మసరనేల (తె. 5).

**చిన్నపురాయి** (< చిహ్నపు); పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (కో. 5).

**చిన్నవరం** ఉ. చిన్నొరం; పర్యా. చూ. పిల్లగనెం. మడికీమడికీ మధ్య అడ్డుగావేసిన మట్టికట్ట (తె. 12, 36, 37).

**చెక్క-(నేల)** రూ. చెక్కు-, గట్టినేల. సామాన్యంగా ఎర్రనేల (తె. 25, 26, 28, 33, 35, 38, 42).

**చెక్కు-(నేల)** చూ. చెక్క- (రా. 17, 20, 28).

**చెరాయి** ఉ. శరాయి; చూ. బంచెరాయి (తె. 13, 15–17, 19–21).

**చెలక** ఉ. చెల్క, చె(శె)లక, సెల్క; రూ. సెలిక పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండే నేల (తె. 1, 5 7–9, 11–13, 15 – 18, 22, 25–28, 32–37, 40 42).

**చేను** (1) రూ. (ఊడ్పు) చేను; పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల. వరి. పంటకు ఉపయోగించేది (కో. 34, 35); (2) పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండే నేల (కో. 11; తె. 20, 22, 28, 39; రా. 2, 4–6, 14); (3) పర్యా. చూ. తోట. ఎక్కువగా బావినీటితో సాగుచేసే నేల (రా. 11).

**జక్కరభూమి** ఊటనీటితో సాగుచేసే నేల (కో. 50).

**జరీబుతోట** (< హిం. జేర్ ఆబ్ నీటి కింద-); ఉ. సెరీబు-. బావినీటితో సాగుచేసే పొగాకు, చెరకు, మొ. తోట (కో. 23, 25; తె. 39).

**జవుకు(నేల)** పర్యా. చూ. ఊబి-. వాన కురిస్తే దిగబడే నేల (తె. 18, 19; రా. 18).

**జాగా** ఉ. జోగ; పర్యా. చూ. గ్రామనత్తం. గ్రామస్థులు ఇళ్ళు కట్టుకోటానికి మాత్రమే గవర్నమెంటువారు శిస్తు రద్దుచేసి వదిలినభూమి (తె.).

**జాగీరు** (< హిం. జాగీరు); ఉ. జేగీర్. నవాబులు యోధుల కిచ్చిన మాన్యం; కొన్నిచోట్ల సగంపన్ను మాత్రమే కట్టుకోవాలి (తె. 31, 33, 42; రా. 13, 14). "తమ విధులను సక్రమంగా నిర్వహించనప్పుడుగాని, నవాబుల ఆగ్రహానికి గురియైనప్పుడుగాని యోధులు తమ జాగీర్లను కోల్పోయేవాళ్ళు. కొన్ని జాగీర్లపై జీవితాంతం వరకు అనుభవయోగ్యత ఉండేది; కొన్నిటిపై ప్రభుసేవలో ఉన్నంతవరకే ఉండేది. కొంత 'నజరానా' కట్టిన మీదట జాగీర్దారు మరణానంతరం అతని వారసులకు భూమి ఇవ్వటం కద్దు. జాగీరును 'ఇనాం కమిషన్' వారు 'మేజర్ ఇనాం'గా పరిగణించారు" (MAMP).

**జిగటరేవడి** పర్యా. చూ. బంకరేగడి.[*] బంకమన్ను కలిసి, నలుపుతెలుపురంగులో ఉండే రేగడి (కో. 33).

**జిగినేల** గట్టినేల; ఎర్రనేల (తె. 3).

**జింకకారి** కారినేల భేదం. మరీ జిగురుగా ఉండే కారి నేల. చూ. కారి (కో. 37).

**జిరాయతీ(భూమి)** (< హిం. జిరా అత్ వ్యవసాయం); పర్యా. చూ. పట్టాభూమి. రైతు శిస్తు చెల్లిస్తూ దున్నుకొనే సొంతభూమి (కో. 9, 23, 29, 31, 39, 41, 47, 49, 51).

**జేడగడ్డ** గట్టినేల; సారవంతమైనది (రా. 27).

**జేరబావలీ** ఉ. జేరుబావలీ, జేరుబావిలీ. పాతబావుల కింద సాగుచేసే మాగాణిభూమి. దీనిపై వర్షాకాలం నీటి పన్ను అదనంగా వసూలు చేస్తారు (తె. 2, 35).

**డెల్టా** (< Delta); పర్యా. చూ. లంక. నదుల పాయల మధ్య దిబ్బవేసిన నేల. సామాన్యంగా ఒండునేల (కో. 26).

**జోరు** ఉ. జోరె. కొండవాగుల నీళ్ళకు గట్టుకట్టి సాగుచేసే భూమి (కో. 37, 40, 42, 44, 46 – 51). **-కట్టుభూమి, -పొలం** చూ. జోరు (కో.).

**డొంక** పశువులు, బండ్లు నడవటానికి గవర్నమెంటు వారు వదిలిన బాట (కో. 1, 7, 10–14, 17–19, 23, 26, 29, 31, 32; తె. 41); **-రాయి** 'డొంక'ను నిర్దేశించటానికి వేసిన సర్వేరాయి (కో. తె.).

**తంపరభూమి** నీరునిల్చే నేల; సామాన్యంగా ఏటి ఒడ్డున ఉన్న భూమి (కో. 47).

**తరి(పొలం)** పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల; ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించేది (తె. 1, 8–10, 12–17, 19–21, 23–25, 28, 33–35; రా. 13, 20, 25, 27).

**తాసనపురాయి** చూ. శాసనంరాయి (తె. 34).

**తీపిచవుడు** పర్యా. నల్లచవుడు. రేగటినేలలో కలిసిన చవుడు; ఈ నేలలో నిలిచిన నీరు తియ్యగా ఉంటుందట; కొద్దిగా పంటలు పండుతాయి (రా. 17).

**తీరవగడ్డ** పర్యా. చూ. పోతుగనెం. మాగాణినేల చుట్టూ ఎత్తుగా వేసిన మట్టికట్ట (రా. 14).

**తువ్వ(నేల)** ఉ. తువ-, తూ-, తూవ-; రూ. దుబ్బ. తవుడులాగా ఉండే మెత్తని ఇసకనేల. వేరుసెనగ, ఉలవ ముఖ్యంగా పండుతాయి (కో. 5, 6, 8, 9, 12–15, 24, 29, 32; తె. 1, 2, 6, 38, 40; రా. 1, 3, 5 – 14, 18, 20, 22, 23, 25, 26, 28); **- చవుడు** ఉ. తువచవుడు; రూ. దుబ్బచవుడు. ఇసక కలిసిన చవిటినేల. కొద్దిగా పండుతుంది (కో. 33; తె. 6);**- పాడు** 'తువ్వ'

కలిసిన పాటినేల (కో. 16).

**తూకట్టు(నేల)** దువ్వ పొరలుపొరలుగా ఉన్న నేల (రా. 14).

**తూచెక్క-(భూమి)** దువ్వ కలిసిన చెక్కనేల (రా. 28).

**తెంపూరిభూమి** పర్యా· చూ. శివాయిజమా. పక్క పొలం రేటు ప్రకారం శిస్తు కడుతూ ప్రభుత్వం అనుమతి మీద సాగుచేసుకొనే పొలం. అవసరం లేనప్పుడు దీన్ని వదులుకోవచ్చు(కో. 21).

**తెల్లకోడినేల** ఎక్కువ తెలుపురంగు గల నేల (కో. 34).

**తెల్లగరువు** పర్యా. పాలగరుగు. తెల్లరాతి గులకగల నేల (కో. 26, 33, 34):

**తెల్లచవుడు** ఉ. తెల్లజవుసు; పర్యా. పాలచవుడు, బట్టచవుడు. జిగురుగా తెలుపుగా ఉండి ఇసుకకర కలిసిన చవుడు. పైర్లకు మంచిది. నీటి పారుదల ఉంటే వరిపంటకు పనికి వస్తుంది (కో. 15, 25, 26; తె. 1, 2, 29, 34, 36, 40; రా. 2, 14, 22).

**తెల్లతువ్వ(నేల)** ఉ. తెల్లదువ; తెల్లతూ-; చూ. తెల్లదుబ్బ. తెల్లరంగు దువ్వనేల (రా. 5, 25).

**తెల్లదుబ్బ(నేల)** చూ. తెల్లదువ్వ- (తె. 38, 42).

**తెల్లనేల** తెల్లదాలుగా ఉన్న నేల; కొన్నిచోట్ల ఒండు భూమి; గోడల పూతకు పనికివస్తుంది; కొర్ర సజ్జ, మొ. పంటలు వేస్తారు; ఈ నేలకే, 'తెల్లజేను, తెల్లబొలం, తెల్ల భూమి; తెల్లాకునేల-' అని గూడా వ్యవహారం (కో. 4, 13, 16, 19, 20; రా. 4, 5, 8, 15, 16, 28).

**తెల్లచెక్క-(నేల)** గట్టి తెల్లనేల (రా. 28).

**తెల్లపాడు(నేల)** తెల్లమన్ను కలిసిన పాటినేల (రా. 24).

**తెల్లమసక** చూ. తెల్లమసర (కో. 29, 32; రా. 18).

**తెల్లమసర** రూ. తెల్లమసక. తెల్లమన్ను కలిసిన (రేగడి) నేల (కో. 36).

**తెల్లరేగడి** రూ. తెల్లరేవడి. తెల్లమన్ను కలిసిన రేగడి నేల (రా. 20).

**తెల్లరేవడి** చూ. తెల్లరేగడి (కో. 26).

**తేటనేల** ? మెత్తని ఎర్రనేల (రా. 17).

**తొస్సెదుబ్బ** ? గడువు కలిసిన దువ్వ. పైరుకు అట్టే పనికిరాదు. చూ. దువ్వ- (తె. 7).

**తోక** పర్యా. చూ. కుని. చేలో ఒక మూల కోసుగా ఉన్న భాగం (తె. 10).

**తోట** పర్యా. బాగాయిత్, మడి, ములుం, ఎక్కువగా బావినీటితో సాగుచేసే నేల; తమలపాకు, చెరకు, పొగాకు

అరటి, మిరప, పసుపు మొ. వి
34, 36, 37, 40, 43, 46–51
28, 31, 36, 38–41; రా.
19, 22, 23, 25–27).

**తోపు** పర్యా. వనం. మ
టెంకాయ, చందనం మొ. చెట్లు
తె. 1, 32; రా. 3, 7, 23, 25

**దడప** వాగుల ఒడ్డున ఉండే
లోపల ఇసకా ఉంటుంది (తె. 2

**దంపరేవడి** పర్యా. చూ.
చేలోని రేగడి; నలుపు తెలుపు
32, 34).

**దుగం** పర్యా. చూ. గనెం.
వేసిన మట్టికట్ట (కో. 24, 25;

**దుబ్బ(నేల)** చూ. దువ్వనే
7–10, 21, 23, 27, 28, 30,
చూ. దువ్వచవుడు (తె.); -నె
అంటే మెట్ట (తె.).

**దుబ్బదువ్వ** లావుపాటి ఇ
(తె. 1, 2).

**దూర** పర్యా. చూ. గట్టు.
హద్దుగా వేసిన గట్టు(తె. 17–1

**దిన్నె(నేల)** పర్యా. చూ. మె
నేల (రా. 15, 16).

**దిబ్బలి** పర్యా. చూ. ఊబి.
పొంగి దిగబడే చవిటినేల (తె. 32

**దేవాదాయం** దేవదాయం;
మాన్యం (కో. 3, 14, 15, 49–5
20, 22).

**ధర్మాదాయం** ధర్మదాయం;
ఇచ్చిన మాన్యం (కో. 14, 15).

**నంజె** ఉ. నంజి; పర్యా. చూ.
చెరువు, మొ. వాటి నీటితో సాగుచే
పంటకు ఉపయోగించేది (కో. 1, 5

**నట్టు**[1] పర్యా. గుడ్డం, పట్టె,
భూఖండం; పంచుకొన్న నేలలో ఒ

**నట్టు**[2] పర్యా. చూ. గట్టు.
హద్దుగా వేసిన మట్టికట్ట (రా. 19).

**నదర్‌రాయి** పర్యా. చూ.
హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు
(తె. 29).

**నంబర్‌రాతు** చూ. నెంబర్రాయి
'రాయి' (తె. 32).

**నల్లగరువు** నల్లమట్టి, గులకరాళ్ళు గలిసిన నేల (కో. 31).

**నల్లచవుడు** ఉ. నల్లజవుడు; పర్యా. తీపిచవుడు, మఱ్ఱచవుడు. రేగడి గలిసిన చవిటి నేల; పంటలకు మంచిది; కొన్నిచోట్ల నల్లరంగుగల చవిటినేలకు ఈ మాట వాడతారు; దీనిలో పంటలు పండవు (కో. 8, 25; తె. 1, 2, 5, 7, 17, 19, 23, 29, 37–39; రా. 2, 22).

**నల్లపొచ్చె** నల్లని పొచ్చెరాళ్ళు గల నేల; చూ. పొచ్చెనేల (రా. 18).

**నల్లబెళుకు** నల్లని పలకరాళ్ళుగల నేల (రా. 18).

**నల్లమలుకు** నల్లరంగుగల ఇసకనేల (తె. 4).

**నల్లమసక** చూ. నల్లమసర (కో. 10, 29; రా. 16).

**నల్లమసర** రూ. నల్లమసక. నలుపురంగు ఎక్కువగా కలిసిన తెల్లనేల గాని, ఎఱ్ఱనేలగాని; చూ. మసరనేల (రా. 15, 17).

**నల్లరేగడి** ఉ. నల్లరేగడ, నఱ్ఱేగడ, నఱ్ఱేగడి; రూ. నల్లరేవడ(డి); పర్యా. క్రిష్ణరేగడి. ఎక్కువ నలుపు రంగులో ఉన్న రేగడినేల. సారవంతమైనది (కో. 1–6, 8, 9, 14, 15, 17, 20, 24, 38, 44; తె. 1, 2, 21–24, 36; రా. 1, 2, 18, 20, 25).

**నల్లరేవడ** ఉ. నల్లరేవడి. చూ. నల్లరేగడి (కో. 27, 29, 35, 36, 46, 49).

**నామాలరాయి** పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతినరాయి. దీనిమీద 'నామాల' వంటి గుర్తు వేస్తారు (రా. 5).

**నివేశనభూమి** పర్యా. గ్రామనత్తం. ఇళ్ళు కట్టుకోటానికి ప్రభుత్వం వారు శిస్తు లేకుండా వదిలిన భూమి (కో. 37).

**నీరావరి** పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు, మొ.వాటి నీటితో సాగుచేసే నేల; ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించేది (తె. 2; రా. 15).

**నీరుపొలం** పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు, మొ.వాటి నీటితో సాగుచేసే నేల. ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించేది (తె. 2).

**నూనెగడ్డ** నీరువెలిసే నేల; ఊటనేల; "మట్టిగడ్డ నూనె రాచినట్టు మెరుస్తుంటుంది. కాబట్టి అలా పిలుస్తా"మని ఒకరు (కో. 24, 26, 29).

**నూనెరేగడి** మంచి నల్లరేగడి (కో. 38).

**నెంబర్‌రాయి** (< Number + రాయి); ఉ. నంబర్‌రాయి; రూ. నంబర్‌రౌతు; పర్యా. చూ. హద్దురాయి. పొలానికిహద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగాపాతిన సర్వేరాయి (కో. 12, 26, 28, 31, 36; తె. 1, 4, 5, 30, 31, 34, 35; రా. 6, 14, 23).

**నేదురు(నేల)** గోదావరి నీళ్ళు నిలిచేనేల(కో. 32).

**నొగవరం** పర్యా. చూ. పిల్లగనెం. మడికీ మడికీ మధ్య అడ్డుగా వేసిన చిన్న మట్టికట్ట; చూ. వరం(తె. 32).

**పచ్చనేల** పర్యా. చూ. పీతినేల. పచ్చరంగునేల (కో. 34, 38).

**పటంగడ్డ** పర్యా. చూ. పిల్లగనెం. మడికీ మడికీ మధ్య అడ్డుగా వేసిన మట్టికట్ట (రా. 9).

**పట్టా** "జమీందారుగాని, ప్రభుత్వంగాని రైతుకిచ్చిన పత్రం. పూర్వకాలం తాటాకులమీద, ఇప్పుడు కాయితాలమీద పట్టా వివరాలు రాస్తున్నారు. ఈ పత్రంలో రైతుకిచ్చిన భూమి పరిమితి, హక్కులు, చెల్లించవలసిన శిస్తు మొ. వివరాలుంటాయి" (MAMP).

**పట్టాబీడు** రైతు శిస్తు చెల్లించే బీడు (రా. 26).

**పట్టాభూమి** పర్యా. కబ్జా, కాస్తకార్- జిరాయితీ, పట్టేదారీ-, రైత్వారీ-, శేరీ-. రైతు శిస్తుచెల్లించి దున్నుకొనే సొంతభూమి; శిస్తుచెల్లించే వాడికి అనుభవ విక్రయ హక్కులుగల భూమి (కో. 12, 26, 31, 32, 36-43, 44, 45; తె. 1,5, 7-15, 20-27, 29-42; రా. 2-8, 10, 13, 20-28).

**పట్టి** ఉ. పట్టీ; పర్యా. చూ. నట్టు[1]. భూఖండం; పంచుకొన్న నేలలో ఒక ముక్క (రా. 18).

**పట్టేదారీ** పర్యా. చూ. పట్టాభూమి. శిస్తుచెల్లించేవాడికి అనుభవ విక్రయ హక్కులుగల భూమి (తె. 20-27).

**పడావా** చూ. పొడావు (తె. 24).

**పంటకారి** వరిపంటకు పనికివచ్చే కారినేల; చూ. కారి (కో. 40).

**పన్మక్తా** కొంతపన్ను మాత్రమే చెల్లించవలసిన ఇనాం (తె. 8,9).

**పందికండ** ఉ. పన్నికండ. సారవంతమైన మసరనేల (తె. 42); ఎఱ్ఱమట్టి కలిసిన రేగడి (కో. 12).

**పంపు** పర్యా. చూ. నట్టు[1]. భూఖండం; పంచుకొన్న నేలలో ఒక ముక్క (రా. 18).

**పరతువ** ఉ. పరతూ(నేల). పొరలు పొరలుగా ఉండే తువ్వనేల (కో. 12; రా. 9, 11, 20).

**పరనేల** చూ. పఱ్ఱనేల (రా. 13, 18).

**పరంబోకు** ఉ. పరంపోకు, పరంపోగు, పరంబోగు; చూ. పొరంబోకు (తె. 9, 11, 13, 14, 16-22, 24, 25, 27; రా. 2, 4, 6, 8, 21, 23).

**పరంరాయి** పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (తె. 4).

**పఱ్ఱ(నేల)** రూ. పర (నేల). (1) పొరలు పొరలుగా

ఉండే మట్టి. కొన్నిచోట్ల పాటినేల, మరి కొన్నిచోట్ల ఇసక, రాయి కలిసిన నేల, (2) పంటకు అసలు పనికిరాని నేల (కో. 21,31, 49).

పల్లపునేల పర్యా. చూ. మాగాణి.కాలవ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల; ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించేది (కో. 13, 30, 37, 38, 40, 42, 44, 46-51).

పసెదుబ్బ తెల్లమట్టితో కలిసిన తువ్వనేల (తె. 5).

పలుగు(నేల) చిన్న గట్టి పలకరాళ్ళు గల నేల (కో. 9; తె. 1, 6-8, 11, 30, 36).

పాటిగరువు పాటిమన్ను, గులక గలిసిన నేల (కో. 23, 41).

పాటినేల రూ. పాడి-, పాడు-, పాండ్రి-. (పాటిగడ్డ, పాటిదిబ్బ,పాటిపరువు,పాటిభూమి అనికూడా వాడుక); పర్యా. బూడిదపట్టు, బూడిదపాటు. బూడిదరంగు మన్నుగలనేల. ఊళ్ళుపాడుబడ్డచోట ఇటువంటి నేలలు ఏర్పడతాయట; సారవంతమైనది; ఈ మన్ను ఎరువుగా గూడా ఉపయోగిస్తుంది; అన్నిరకాల పంటలకు మంచిది. (కో. 4-6, 8, 9, 12-15, 18, 23-25, 29, 33, 34, 40, 43, 47-50, తె. 28, 35, 37, 39, 42; రా. 18, 27).

పాటిరేవడి ఉ. పాఁ్రేవడి. పాటిమన్ను కలిసిన రేగడి. చూ. రేగడి (కో. 45).

పాడినేల చూ. పాటినేల (కో. 40).

పాడు(భూమి) చూ. పాటినేల (కో. 37; తె. 10, 34; రా. 23-25, 28); రకాలు: ఇసకపాడు, తెల్లపాడు, తువ్వపాడు, మసరపాడు;-పర పైన మాత్రం ఒక పొర పాటిమన్ను గల నేల (రా.).

పాండ్రి(నేల) చూ. పాటినేల (తె. 15, 18, 26, 27).

పాలగరుగు పర్యా. తెల్లగరువు. తెల్లరాతిగులక గల నేల (రా. 8, 18).

పాలచవక ఇసక గలిసిన తెల్లనేల. చూ. చవుక- (కో. 38, 46, 47, 50).

పాలచవుడు పర్యా. చూ. తెల్లచవుడు. జిగురుగా తెలుపుగాఉండి, ఇసకకర కలిసిన చవుడు. పైరుకు మంచిది. మాగాణిపంటలకు గూడా పనికివస్తుంది (కో. 1-6, 8-21, 23-25; 28-30; తె. 5, 7, 22, 32, 39, 42; రా. 3, 6, 11, 18, 25).

పాలపొచ్చె తెల్లరంగు పొచ్చరాళ్ళుగల నేల; చూ. పొచ్చె- (రా. 18).

పిట్టకారి తెలుపు నలుపు రంగులో (అంటే పిట్ట రంగులో) ఉండే కారినేల; చూ. కారి-(కో. 50).

పిప్పిరేగడి పర్యా. చవుకరేగడి, చిక్కరేవడి. నిస్సారమైన రేగడినేల (తె. 33; రా. 18).

పిల్లగనెం పర్యా. అడ్డగనెం, చిన్నవరం, నాగవరం, పటంగడ్డ, పెడ, వారవగడ్డ. మడికీ మడికీ మధ్య అడ్డగా వేసిన చిన్న మట్టికట్ట (రా. 22).

పీక పర్యా. చూ. నట్టు[1]. భూఖండం. పంచుకున్న నేలలో ఒక ముక్క (రా. 8).

పీతికారి సున్నం కొంత కలిసిన కారినేల. ఈ నేలలో ఎక్కువగా సీమగరికె దుబ్బులు మొలుస్తాయి (కో. 46-48).

పీతిగరుగు పసుపుపచ్చని గులకరాళ్ళుగల నేల (రా. 18).

పీతిచవుడు ఉ. పీచ్చవుడు, పర్యా. ఊదుచవుడు, మురికిచవుడు. పసుపుపచ్చని రంగుగల చవిటినేల (రా. 24, 25).

పుంజె ఉ. పుంజి; పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండేనేల (కో. 1, 51; రా. 1, 4, 6).

పుల్లచవుడు రూ. పుల్లుడుచవుడు. గోధుమవన్నె గల చవిటినేల; చాకళ్ళు ఉపయోగించేది: కొద్దిగా మాత్రం పంటలు పండుతాయి (కో. 7, 23; తె. 32, 33, 41; రా. 17, 18).

పుల్లరాగిడి చూ. పుల్లరేగడి (తె. 37).

పుల్లరేగడి రూ. పుల్లరాగిడి, పుల్లుడురాగిడి, పుల్లరేవడి. తక్కువరకం రేగడి; పంటకు అంత మంచిదిగాదు (తె. 41).

పుల్లరేవడి చూ. పుల్లరేగడి (కో. 29).

పుల్లుడిసక ఎరుపు తెలుపు కలిసిన రంగు (పుల్ల రంగు) గల ఇసక (తె. 41).

పుల్లుడుచవుడు చూ. పుల్లచవుడు (తె. 37, 38 40, 42).

పుల్లుడు(నేల) నిస్సారమైన నేల; చవుడు, గులకరాయి కలిసినది; తడిస్తే దిగబడుతుంది. దున్నటానికి కష్టమైన నేల; సామాన్యంగా పైర్లకు పనికి రాదు (కో.19, 25; తె. 39, 40).

పుల్లుడురాగిడి చూ. పుల్లరేగడి (తె. 38).

పూజవుడు రూ. పూతచవుడు. ? పూర్తి చవిటి నేల; పంటలు పండవు. (తె. 6).

పూతచవుడు చూ. పూజవుడు (తె. 38).

పెడ పర్యా. చూ. పిల్లగనెం. మడికీ మడికీ మధ్య అడ్డగా వేసిన మట్టికట్ట (రా. 7, 15, 26).

పెద్దవరం పర్యా. చూ. పోతుగనెం. మాగాణి నేలచుట్టూ ఎత్తుగా వేసిన మట్టికట్ట (తె. 14, 37).

పెరడు పర్యా. గుడ్డం. ఇంటిచుట్టుపక్కల తోట సేద్యానికి ఉపయోగించే నేల (తె. 13, 20-22, 24-28,

38).

**పొచ్చెనేల** మట్టి అడుగున పెంకుముక్కలవంటి పల్చటి రాళ్ళు పొరలుపొరలుగా ఉన్ననేల. ఈ రాళ్ళకు రాయలసీమలో పొచ్చెరాళ్ళని వాడుక (రా. 18).

**పొడావు** రూ. పడావా. నేద్యానికి పనికి రాకుండా పడిఉన్న భూమి; అడవి (తె. 14).

**పొరంబోకు** ఉ. పురంబోకు, పొరంబోకు, పొరం బాక, పొరంబోగు; రూ. పరంబోకు, పోరంబోకు; పర్యా. గయాలు, గైరాన్, చెరాయి(శరాయి), బంచెరాయి. బంజరు, బేచర్, షికం. గవర్నమెంటువారి అధీనంలో ఉన్న భూమి; గ్రామస్థులందరు ఉమ్మడిగా ఉపయోగించుకొనే రోడ్లు, కాల్వలు, శ్మశానం, మొ.వాటికి గవర్నమెంటువారు వదిలిన నేల; కొన్నిచోట్ల సాగుకు వీలైన పొరంబోకు దున్నుకోటానికి రైతులకు పట్టాలిస్తారు. ఏరు, చెరువు, మొ. వాటితో కలిసిఉన్న శిస్తులేని నేలకు 'ఏటి పొరంబోకు, చెరువుపొరంబోకు' ఇత్యాది వ్యవహారం. కొన్ని పొరంబోకు రకాలు: ఏటి-, ఓని- (పశువులు, బండ్లు పోయే సందు), కాలవ-, కుంట-, కొండ-, గుట్ట-, గుంట-, చెరువు-( చెరువులోతట్టునేలకు ), డొంక-, తెరువు-, తోపు-, దోవ- (ఉ. దోవ, దావ), దేవస్థానం-, నదీ-, బాట-, మేతబీటి-(పశువుల మేతకు ఉపయోగించే బీడు), వంక-, వాగు-, స్మశాన-, హీన-(తక్కువజాతులకు మాత్రమే ఇచ్చేది) (కో. 1-4, 12, 29, 30, 32, 35, 38, 44; తె 1, 6, 10, 26, 28-30, 32-36, 39, 42; రా. 1, 3, 5-7, 9, 13-20, 22, 24-28).

**పొలం** పర్యా. చూ. మాగాణి, మెట్ట. (1) కాలవ, చెరువు, మొ. వాటి నీటితో సాగుచేసే నేల. వరి పంటకు ఉపయోగించేది (కో. 31, 36, 39); (2) వర్షాధారంతో పండే నేల (కో. 29; రా. 23, 28).

**పొలిమేర** ఉ. పొలిమారి, పొలిమేరు; రూ. పొల్మారు, పొల్మెర; పర్యా. కండెం, సరిహద్దు. ఊరి సరిహద్దు; గ్రామసీమ (కో. 2-6, 8-22, 24, 26, 32, 36, 38; తె. 1, 30, 32, 39, 41);**-రాయి** ఉ. పొలిమేర్రాయి, పర్యా. తాసనపురాయి, శాసనంరాయి, సరిహద్దురాయి. ఊరిసరిహద్దును సూచించేరాయి (కో. తె.);**-రాతు** చూ. పొలిమేరరాయి (తె.).

**పొల్మారు** ఉ. పొల్మరు; చూ. పొలిమేర (తె. 17, 19, 21, 24, 26-28).

**పొల్మెర** చూ. పొలిమేర (తె. 19, 20, 23, 25).

**పోడు** పర్యా. ఓటిపాడు. అడవికొట్టి సాగుచేసే పొలం (కో. 15, 23, 30, 33, 36, 39, 40, 45, 47, 49-51; తె. 21-25, 27, 38, 41, 42; రా. 7); **-కాలు** చూ. పోడు (కో. తె.); **-దుక్కి** అడవిసాగు (కో.).

**పోతుగనెం** పర్యా. గట్టువరం, గనెవరం, తిరవగడ్డ, పోతువరం. మాగాణిపొలంచుట్టూ ఎత్తుగావేసిన మట్టికట్ట; చూ. గనెం(రా. 7, 22).

**పోతువరం** ఉ. పోతారం; పర్యా. చూ. పోతుగనెం. మాగాణి పొలంచుట్టూ ఎత్తుగావేసిన మట్టికట్ట; చూ. వరం (తె. 5, 10).

**పోరంబోకు** ఉ. పోరంబోగు, పోరుంబాక; చూ. పొరంబోకు (కో. 5-7, 9-11, 13, 17, 20, 23, 24, 28, 39, 40, 42, 46-51; తె. 31).

**బక్కరేవడి** పర్యా. చూ. చవుకరేగడి. నిస్సారమైన రేగడి (కో. 29).

**బగర్‌సాగు** పర్యా. చూ. శివాయిజమా. పట్టాలేకుండా ప్రభుత్వానికి శిస్తుకట్టి దున్నుకొనే ఏర్పాటు; ఇష్టంలేనప్పుడు తిరిగి ప్రభుత్వానికి వదులుకోవచ్చు (రా. 27).

**బంకచవుడు** బంకమన్ను కలిసిన చవిటినేల. రేగడి కలిసిన చవుడు (రా. 25).

**బంకరేగడి** ఉ. బంకరేగిడి; రూ. బంకరేవడి; పర్యా. జిగటరేవడి, దంపరేవడి. బంకమన్ను కలిసిన రేగడి (కో. 44; రా. 25).

**బంకరేవడి** చూ. బంకరేగడి (కో. 26-28).

**బంచెరాయి** (< హిం. బన్ = వనం; చరానా = మేయటం): రూ. చెరాయి; పర్యా. చూ. పొరంబోకు. గవర్నమెంటు అధీనంలో ఉన్న బీడునేల; పశువుల మేతకు వదిలింది (తె. 1, 2, 11, 12, 15,-17, 19-23, 25-29, 32-38, 42).

**బంజరు** ఉ. బంజర, బంజరి, బంజరు; పర్యా. చూ. పొరంబోకు. గవర్నమెంటు స్వాధీనంలో ఉన్న భూమి; సాగుకు అట్టే పనికిరానిది; ముఖ్యంగా పశువుల మేతకు వదులుతారు; ఏరు, చెరువు, మొ. వాటితో కలిసిన శిస్తులేని నేలకు, 'ఏటి బంజరు, చెరువు బంజరు' ఇత్యాది వ్యవహారం: ఏటి-, కాలవ-, కొండ-, చెరువు-, దావ-( = దోవ), మెరక-, వంక-, వాగు- (కో. 4, 23, 26, 27, 31, 41, 43-45, 49-51; తె. 2, 33; రా. 10-12, 20, 25-27).

**బట్టచవుడు** పర్యా. చూ. తెల్లచవుడు; తెల్లమట్టి అక్కడక్కడ కలిసిన చవుడు; అసలు పంటకు పనికిరాదు (తె. 33).

**బదుగు** ఉ. బొదుగు, బొదువు; పర్యా. చూ. గట్టు. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టిగట్టు. (తె. 3; రా. 12, 19, 22).

**బందోబస్తు** (< హిం. బందోబస్త్ = ఏర్పాటు, నిర్ణయం)

పొలం సరిహద్దులు ప్రభుత్వంవారు సర్వేచేసి నిర్ణయించటం (తె. 21, 22); -బండ పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి గవర్నమెంటువారు గుర్తుగా పాతిన రాయి(తె.).

**బయలుపొలం** పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండే నేల (తె. 4 ; రా. 22).

**బరక(నేల)** (1) పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండే నేల (రా. 11); (2) గరువు కలిసిన ఎర్రనేల ; పైర్లకు అంత మంచిదిగాదు (తె. 3, 4, 9).

**బాగాయిత్** (< హిం. బాగ్ = తోట); ఉ. బాగాత్, బాగాయితీ; పర్యా. చూ. తోట. ఎక్కువగా బావినీటితో సాగుచేసే నేల ; తమలపాకు, చెరుకు, పొగాకు, అరటి, మిరప మొ. వేస్తారు (తె. 10, 31, 38).

**బాడబ** పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు, మొ. వాటి నీటితో సాగుచేసే నేల; ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించేది (కో. 29).

**బాడవ** (-చేను, -బీడు). (1) ఏటిపక్కన ఉండటం వల్ల ఎప్పుడూ తేమతో ఉండే ఒండునేల; (2) పశువుల మేతకు ఉపయోగించే బీడు (కో. 9–13, 15, 20-26, 33, 36, 49, 50: తె. 29, 39, 40, 42).

**బాండురాయి** చూ. బొండరీరాయి (కో. 48, 51).

**బాంద్రకుప్ప** పర్యా. చూ. గట్టు. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టికట్ట (తె. 10).

**బాంద్‌రాయి** (< హిం. బాంధ్ = అడ్డుకట్ట); పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (తె. 10).

**బింగిలి(నేల)** బింగి (? వంకరటింకర) రాళ్లుగల నేల (రా. 18).

**బిరుసు(నేల)** ఎండితే బిగుసుకుపోయే బంకమట్టినేల (తె. 5, 36).

**బీటిపారు** పర్యా. పోడు. అడవికొట్టి సాగుచేసిన నేల (కో. 34).

**బీడు** సాగుచెయ్యకుండా పశువుల మేతకు వదిలిన భూమి; పట్టాభూమిగాని, బంజరుగాని కావచ్చు (కో. 2, 3, 5, 6, 8–10, 14, 15, 17 - 37, 40, 46 – 51; తె. 1, 2, 16, 18, 22 – 28, 30, 31, 38 – 42; రా. 26).

**బుజుగు** చూ. బుడుగు (రా. 18).

**బుడుగు** రూ. బుజుగు; పర్యా. చూ. ఊబి. వాన కురిస్తే బురబురపొంగి దిగబడే చవిటినేల (తె. 22, 24, 32, 40).

**బురదపొలం** పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు, మొ. వాటి నీటితో సాగుచేసే నేల. ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించేది (తె. 38).

**బుర్రచవుడు** చవిటినేల భేదం; ఉప్పుచవుడు; పంటలకు మంచిదిగాదు (కో. 3, 4, 13, 14).

**బూడిదతువ** ఉ. బూడిత్తువ. పాటిమన్ను గలిసిన తువ్వనేల; చూ. తువ్వ- (రా. 3).

**బూడిదపట్టు** రూ. బూడిదపాటు ; పర్యా. చూ. పాటినేల. బూడిదరంగు మన్నుగల నేల ; ఊళ్ళు పాడుబడ్డ చోట ఇటువంటి నేలలు ఏర్పడతాయట ; సారవంతమైన నేల ; ఈ మన్ను ఎరువుగా గూడా ఉపయోగిస్తుంది ; అన్ని రకాల పంటలకు మంచిది (తె. 12).

**బూడిదపాటు** చూ. బూడిదపట్టు (కో. 29); **-సెలక** పాటిమట్టి భూమి. 'సెలక' అంటే మెట్టభూమి లేక ఎర్ర నేల (కో.).

**బూడిదమసక** పాటిమట్టి కలిసిన రేగడి (కో. 29)

**బూపుండు** పర్యా. చూ. ఊబి. వాన కురిస్తే దిగబడే చవిటినేల (తె. 32).

**బెట్ట** రాతినేల (తె. 34,36); **-సెలక** గట్టి ఎర్రనేల (తె.).

**బెళుకునేల** పలకలు తయారుచేసే రాళ్లుగల నేల (రా. 18).

**బేచర్** పర్యా. చూ. పొరంబోకు. గవర్నమెంటు స్వాధీనంలో ఉన్న భూమి ; బంజర్‌భూమి (రా. 1).

**బొగుడ** ఎత్తైన నేల ; మిర్రున ఉన్న పొలం (తె. 27).

**బొగ్గురేగడ** పర్యా. చూ. గుల్లరేగడి. గుల్లగా (ఒదులుగా) ఉన్న రేగడి ; చూ. రేగడి (కో. 2).

**బొడ్డురాయి** ఉ. బొడ్రాయి. గ్రామం కట్టేటప్పుడు ఊరిమధ్య పాతిన రాయి(కో. 10, 11, 13 – 15, 17, 19, 26, 28, 35; తె. 41; రా. 18).

**బొల్లిచవుడు** పర్యా. చూ. తెల్లచవుడు. తెల్లగాఉండి నిస్సారమైన ఉప్పుచవుడు ; చూ. చవుడు (కో. 15).

**బొండరీరాయి** రూ. బాండురాయి; పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి(కో. 40, 46, 47, 49, 50).

**మక్తా** (< హిం. మక్తా = అద్దె) భూకామందుకు రైతు ఇచ్చే డబ్బుగాని, పంటగాని (కో. తె. రా.) ; గవర్నమెంటు గుత్తకు ఇచ్చిన పొలం (తె. 2).

**మడనేల** ఒండుమట్టి కలిసిన రేగడినేల (కో. 12).

**మడి** పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు, మొ. వాటి నీటితో సాగుచేసే నేల. ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించే నేల (కో. 48; తె. 3–5; రా. 2, 3, 5–9, 14, 26, 28); పర్యా. చూ. తోట. బావినీటితో సాగుచేసే నేలను ఒక ప్రాంతంలో 'మడి' అంటారు (తె. 19).

**మందడి-** చూ. మందల (కో. 38); **-గట్టు** రెండు

పొలాలమధ్యనున్న సరిహద్దు గట్టు (కో.); **-రాయి** పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతినరాయి (కో.).

**మందబయలు** పర్యా. శాగడా. పశువులమందలు నిల్చే శిస్తులేని భూమి (కో. 3 – 6 ; రా. 1).

**మందల** రూ. మందడి-; పర్యా. చూ. గట్టు. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టికట్ట; పొలంలో గట్టు పొడవునా ఉన్న మేర (కో. 24, 41).

**మన్నేల** మంచినేల ; ఎర్రనేలల్లో సారవంతమైనది (రా. 10).

**మర్రచవుడు** పర్యా. చూ. నల్లచవుడు. రేగడి కలిసిన చవిటినేల ; 'మర్ర' అంటే 'బిరుసైన' అని ; పంటలకు మంచిది ; కొన్నిచోట్ల నల్లరంగుగల చవిటినేల ; దీన్లో పంటలు పండవు (రా. 18, 21).

**మర్రరేగడి** ఉ. మర్రేగడి. ? గరుకుగా ఉండే రేగడి; ఎర్రమట్టి కలిసినది. సారవంతమైన నేల (రా. 18, 20).

**మసక(నేల)** చూ. మసర (కో. 10, 12, 29, 31, 32, 44; తె. 10, 31, 41 ; రా. 16, 18, 25); **-చవుడు** పైన చవుడు కింద రేగడి, ఎర్రమన్ను మొ. కల నేల; మసరనేల (తె.); **-రేగడి, -రేవడి** రూ. మసపరేగడి. ఎర్రమన్ను కలిసిన రేగడి (కో. 27, 31, 32, 44 ; తె. 31 ).

**మసపరేగడి** చూ. మసకరేగడి (తె. 4).

**మసర(నేల)** రూ. మసక-, మసప-. రెండు మూడు రకాల (లేక రంగుల) మన్ను కలిసిన నేల; పైర్లకు మంచిది. వేరుసెనగ, కంది, కొర్ర, మొ. పునాస పంటలు వేస్తారు (కో. 11, 33, 36; తె. 39, 41; రా. 15, 17, 21, 22); **-కట్టు** చూ. మసరనేల (రా.); **-పాడు** ఇంకో రకం మన్ను కలిసిన పాటినేల (కో.).

**మాగాణి** ఉ. మాగాటి, మాగాడి, మాగాని ; రూ. మాగిలి, మాగేలి; పర్యా. ఊడ్పుచేను, కాన, చేను, నంజె, నీరావరి, పల్లపునేల, పొలం,-పొలం(బోరుపొలం, తరి పొలం, నీరుపొలం, బురదపొలం, వందురుపొలం, వరి పొలం), బాడవ, మడి, వరిమడి, వరిమొత్త. కాలువ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల; ముఖ్యంగా వరి పంటకు ఉపయోగించేది (కో. 1, 2, 4 – 9, 11 – 28, 32; తె. 30, 41, 42 ; రా. 14, 16–18, 22).

**మాగిలి** చూ. మాగాణి (కో. 8, 10, 13).

**మాగేలి** చూ. మాగాణి (కో. 15).

**మాన్యం** ఉ. మాన్నెం; పర్యా. ఇనాం, కొలువు. తమకు చేసిన సేవకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొ. వారు ఇచ్చిన భూమి (కో. 3, 4, 6, 8, 9, 11, 13, 14, 16, 18, 21, 24, 25, 27 – 29, 31, 34, 35, 39; తె. 40 – 42; రా. 2–6, 9, 24, 25, 28). కొన్ని ప్రధానమైన మాన్యాలు: **ఆయగాళ్ళ-** గ్రామంలోని బారావతి (అంటే పన్నెండు) వృత్తులవారికి ఇచ్చింది (రా.); **ఊరుబిండి-** ఊరుబిండి పెట్టేవారి కిచ్చింది. (కో.); **ఎట్టి-** చూ. వెట్టి- (కో. తె. రా.); **కమ్మర-** (కో. రా.); **కరణం-**(కో. తె. రా.); **కర్మల-** కమ్మరివాడి కిచ్చింది (రా.); **కుమ్మరి-** (కో. రా.); **గాజుల-** గాజులు చేసి ఇచ్చేవారి కిచ్చింది (కో.); **గుడి-** దేవదాయం (రా.); **గుర్రం-** గుర్రాన్ని బాగా ఆడించినందుకు ఆడించినవాడి కిచ్చిందట (కో.); **గొడుగు-** రాజుకు గొడుగు పట్టేవాడి కిచ్చింది (రా.); **గొల్ల-** పశువులు కాచేవాడి కిచ్చింది (కో.); **గొని-** గ్రామ దేవతకు బలి ఇవ్వటానికి మేకపోతులను సరఫరా చేసేవాడి కిచ్చింది (రా.); **చలింద్రం-** (<చలివేంద్రం) వేసవికాలంలో బాటసారులకు చలివేంద్రం పెట్టినవారి కిచ్చింది (కో.); **చాకలి-** (కో. రా.); **చాకిరి-** చూ. ఆయగాళ్ళ- (కో.); **జిమ్మేదారి-**(< హిం. జిమ్మా = పర్యవేక్షణం)గ్రామంలో న్యాయవిచారణాధికారి కిచ్చింది. (తె.); **తలారి-** ఊరి తలారి (వెట్టివాడి) కిచ్చింది (కో. రా.); **తోటి-** చెరువునీరు పొలాలకు పంపకం చేసేవాడికి ఇచ్చింది (రా.); **దర్గా-** (< హిం.దర్గా,దర్గాహ్ = ముస్లిం సమాధి) ముస్లిం సమాధులకు 'ఉరుసు' (ఉత్సవం) చేయటానికిచ్చింది (కో.); **దీపం-** దేవాలయంలో దీపారాధనచేసేవాడి కిచ్చింది (రా.); **దూదేకుల-** దూది ఏకేవారి కిచ్చింది (కో. తె.); **దేవస్థానం-, దేవతా-, దేవాలయ-, దేవుడి-, దేవుని-** దేవస్థానాలకు, దేవతల అంగరంగభోగాలకుగా ఇచ్చింది; దేవాదాయం (కో. తె. రా.); **నీరుకట్టు-** పొలాలకు నీళ్ళు చెరువు నుంచి వదిలేవాడి కిచ్చింది (కో.); **నీరుగట్టి-** చూ. నీరుకట్టు- (రా.); **నీరుడిగాడి-** చూ. నీరుకట్టు- (కో.); **పంచాంగం-** పంచాంగంచెప్పే పురోహితుడి కిచ్చింది (రా.); **పనిబాటల-** చూ. ఆయగాళ్ళ- (కో.); **పీర్ల-** పీర్లు మోసేవాడి కిచ్చింది (కో. తె. రా.); **పురోహిత-** చూ. పంచాంగం- (కో. తె. రా.); **పులినీళ్ళ-** అన్నపు గంజిని పులవబెడితే పులినీళ్ళు అంటారు ; అవి ఇచ్చేవారికి బహూకరించింది (కో.); **పూజలవారి-** ఉ. పూజలోరి. పూజార్ల కిచ్చింది (కో.); **పెద్దకాపు-** ఊరిపెద్దకిచ్చింది (కో.); **పోలీసురెడ్డి-** గ్రామంలోని తగాదాలను విచారించే వ్యక్తిని ఈ ప్రాంతంలో పోలీసురెడ్డి అంటారు ; అతని కిచ్చింది (తె.); **-బట్టు, -భట్టు** పొగిడినందుకు భట్రాజు కిచ్చింది (రా.); **బలావతి-** చూ. ఆయగాళ్ళ- (కో.); **బాపన-, బ్రాహ్మల-, బ్రాహ్మణుల-** పురోహితమాన్యం (కో. రా.); **భోగం-** దేవదాసీల కిచ్చింది (కో. రా.); **భజంత్రీ-** దేవాలయాల్లో మేళం వాయించేవారి కిచ్చింది

(కో.); మంగలి- (కో. రా.); మసీదు- ముస్లిముల ప్రార్థనాలయరక్షణ కిచ్చింది (కో. రా.); **మాదిగ-** చూ. వెట్టి- (కో. రా.); **మాసుల్దారు-** గ్రామంలో తగాదాలు తీర్చటానికి అన్ని పక్షాల వారిని ఒకచోటికి పిలిచేవాడి కిచ్చింది (తె.); **ముల్లా-** ముస్లింపండితుల కిచ్చింది; మసీదు కిచ్చింది (రా.); **మేళం-** చూ. భజంత్రీ- (రా.); **మోతాదు-** ప్రభుత్వ వర్తమానాలను పట్టణాల నుంచి గ్రామోద్యోగులకు అందజేసేవాడి కిచ్చింది (కో.); **రెడ్డి-** గ్రామమునసబు కిచ్చింది (రా.); **వడ్రంగం-, వడ్ల-** వడ్రంగి కిచ్చింది (కో. రా.); **వృత్తి-** చూ. ఆయగాళ్ళ- (తె.).

**మాఫీమక్తా** పూర్తిపన్ను రద్దుచేసిన ఇనాం (తె. 8, 9, 36).

**మారు** చూ. మేర(తె.4).

**మాసూర** అడవి (తె. 31).

**మిట్ట(పొలం)** చూ. మెట్ట (తె. 6; రా. 3. 9.).

**మినాభూమి** ? ఊరికి ఆనుకొని ఉన్న గవర్నమెంటు భూమి. కావలిస్తే పట్టాలివ్వడానికి వీలైనది (కో. 8, 14).

**మిరు (నేల)** పర్యా. చూ. మెట్ట. వర్షాధారంతో పండే నేల (రా. 13).

**మురికిచవుడు** పర్యా. చూ. పీతిచవుడు. ఒకరకం చవిటినేల; పసుప్పచ్చని రంగులో ఉంటుంది (రా. 3).

**ములుం** పర్యా. చూ. తోట. బావినీటితో సాగుచేసే నేల; తమలపాకులు, చెరుకు, మొ. వి వేసే చోటు (కో. 1).

**మూలకట్టు** పర్యా. చూ. పని. చేలో ఒక మూల కోనుగా ఉన్న భాగం (తె. 4).

**మూలరాయి** రూ. మూలరౌతు; పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి నాలుగు మూలలా ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (కో. 26, 28,29, 32, 35; తె. 4, 30, 31, 41).

**మూలరౌతు** చూ. మూలరాయి (తె. 18).

**మెట్ట** రూ. మిట్ట (పొలం), మెట్టు; పర్యా. ఎలగడ, ఎలి-, ఎలిగాది, ఎలిజెలక, ఖుష్కీ, గరువు, గుడ్డి, చెలక (చెల్క, నెలక, నెలిక, నెల్క), చేను, దిన్నె, పుంజె, పొలం, బయలు (పొలం), బరక, మిరు, మెరక, మెర్క, వర్షాధారంతో పండే నేల (కో. 2 – 10, 12 – 21, 23, 24, 32, 40, 51; తె. 30, 31, 41; రా. 17, 18).

**మెట్టు** చూ. మెట్ట (కో. 22, 37–40, 44–50).

**మెదినేల** మెత్తని నేల (కో. 38).

**మెరక** పర్యా. చూ. మెట్ట (కో. 20, 25–28, 30, 35, 43, 46).

**మెర్క (భూమి)** చూ. మెరక (తె. 16).

**మేర** రూ. మారు; పర్యా. చూ. గట్టు. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టికట్ట; పొలం సరిహద్దు (రా. 4, 5, 6, 10, 12, 20).

**మేల్వారం** "భూభాగమందు ప్రభుత్వానికి ధనరూపంగా గాని, ధాన్యరూపంగాగాని చెల్లించేభాగం" (MAMP, పుటలు 457–8).

**మొఖాసా** ఉ. మొకాసా. జమీందారుకు మొత్తంగా నిర్ణయించుకొన్న శిస్తు కడుతూ, గ్రామస్థుల దగ్గర తన ఇష్టం వచ్చినట్టు శిస్తు వసూలు చేసుకొనే ఏర్పాటుమీద పొందిన భూమి (కో. 41, 42); **-దారు** పైవిధంగా గ్రామాధికారం పొందిన వ్యక్తి (కో.). "జమీందారు తన బంధువులు, అనుచరులు, ఆశ్రితులుగా ఉన్నవారికి గాని, సైనిక సేవలో ఉన్నవారికి గాని వారి స్వయంపోషణకుగా ఇచ్చిన భూమి." (MAMP, పుట 506).

**మొరప** విణ. చూ. మొరుం (కో. 2, 7, 9–12), -గడ్డ, -నేల మొరుం గలిసిన నేల (కో.)

**మొరం** పర్యా. చూ. గట్టు. (1) రెండుపొలాల మధ్య హద్దుగాపోసిన మట్టికట్ట; (2) మాగాణిలో మడికీ మడికీ మధ్య అడ్డుగా వేసిన కట్ట (తె. 5; రా. 9).

**మొరుం(నేల)** ఉ. మరుం; రూ. మొరప-, మొరుసు; పర్యా. గులక-. సన్నని గులకరాయి ఎక్కువగా కలిసిన నేల; వేరుసెనగ, ఆముదాలు, ఉలవ, మొ. పంటలు వేస్తారు (కో. 4, 18; తె. 5, 22, 23, 25–27; రా. 24); **-గడ్డ** మొరపనేల (తె.); **-రేగడి** సన్నని ఎర్ర గులక కలిసిన రేగడి (నల్లనేల) (రా.).

**మొరుసు(నేల)** ఉ. మరుసు-, మొరస-, మొర్సు-; చూ. మొరుం- (కో. 8, 12, 13; తె. 3, 7, 33, 38; రా. 27); **-రాగిడి** చూ. మొరుంరేగడి (తె.).

**మొల్ల** పర్యా. చూ. కుని. చేలో కోసుగా ఉన్న ఒక మూల (తె. 38, 39).

**రాగడి** ఉ. రాగిడి; చూ. రేగడి (తె. 3, 11-13, 16-19, 21-24, 26, 34, 37, 38; రా. 10, 13, 26).

**రిజరు** (<Reserve) పన్ను కట్టనిదే పశువులను మేపు కోటానికి వీల్లేని అడవి (రా. 6, 7, 9, 15, 19, 22, 23, 25, 26).

**రేగడి(నేల)** (కొన్నిచోట్ల విణ. రేగటి-); ఉ. రేగడ, రేగిడి; రూ. రాగడి, రేవడి. నల్లమట్టినేల; సారవంతమైనది; పత్తి, తెల్లజొన్న, ధనియాలు, కొమ్ముసెనగ, మొ. పంటలకు శ్రేష్ఠం (కో. 1, 3, 8, 11-13, 18, 25, 31, 32, 38, 44, 47-49; తె. 1, 2, 4, 6, 10, 14, 15, 20-24, 25, 27-29, 31-33, 35, 41, 42; రా. 1, 3, 5, 8, 9, 11, 12, 14, 18-20, 22-25, 28).

రేవ పర్యా. చూ. ఒండునేల, వరదల్లో కొట్టుకువచ్చి నిల్చేమట్టి; చెరువులు, కుంటలు, మొ. వాటి అడుగున పేరు కున్నది; సారవంతమైన మెత్తని నల్లనేల; గోధుమ, సెనగ, పొగాకుపంటలకు శ్రేష్ఠం (కో. 30, 31; తె. 21, 23,24, 30).

రేవడి ఉ. రేవడ; చూ. రేగడి (కో. 23, 26–29, 33–37, 40,43, 45–48; తె. 40, 41)

రైకమడత పర్యా. చూ. కుని. చేలో కోసుగాఉన్న భాగం (తె. 6)

రైత్వారీ (భూమి) పర్యా చూ. పట్టాభూమి. రైతు శిస్తు చెల్లించి దున్నుకొనే సొంతభూమి; శిస్తు చెల్లించే వాడికి అనుభవ విక్రయ హక్కులుగల భూమి(కో. 1, 30, 40, 42, 46, 48 50, 51; తె. 26– 28; రా. 12 – 17, 19).

రోమునేల ఎక్కువగా గడ్డిపట్టే ( పెరిగే ) నేల (కో. 34).

లంక నదుల పాయలమధ్య దిబ్బవేసిన నేల; సామాన్యంగా ఒండునేల; చూ. ఒండు-(కో 27, 29, 35).

వనం పర్యా. తోపు, మామిడి, చింత, నిమ్మ, కొబ్బరి మొ. చెట్లు పెంచే నేల (కో. 8; తె. 38,39).

వందరు ఉ. వందురు- ఏటిఒడ్డున ఉన్న గవర్నమెంటు భూమి. వాగు బంజరు (తె 9, 29; రా. 24). -నేల ఏటి ఒడ్డు నేల (తె); -పొలం పర్యా. చూ. మాగాణి. కాలవ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల (తె).

వరం పర్యా. చూ. గట్టు, గనెం. (1) మాగాణిలో మడికీ మడికీ మధ్య వేసిన మట్టికట్ట; (2) పొలాల రెండు మధ్య హద్దుగా వేసిన గట్టు (తె. 1, 2, 5, 9, 10, 12, 14, 32, 36, 37, 39).

వరిపొలం ఉ. అరిపొలం; పర్యా. చూ. మాగాణి. వరి పండించే నేల (కో. 33; తె. 6, 15, 16, 19, 22–24)

వరిమడి చూ. మడి. (రా. 28)

వరిమొత్త పర్యా. చూ. మాగాణి, కాలవ, చెరువు, మొ. వాటి నీటితో సాగుచేసేనేల; ముఖ్యంగా వరిపంటకు ఉపయోగించే నేల (తె. 39).

వారవగడ్డ పర్యా. చూ. పిల్లగనెం. మడికీ మడికీ మధ్య అడ్డుగావేసిన చిన్న మట్టికట్ట. (రా. 14)

శాగడా పర్యా. మంద బయలు. గ్రామంలోని పశువులు నిలపటానికి, మేయడానికి ప్రభుత్వంవారు వదలిన భూమి (కో. 5; రా. 1)

శాసనంరాయి ఉ. శాసన్రాయి, సాసనంరాయి; రూ. తాసనపురాయి; పర్యా. చూ. పొలిమేరరాయి. ఊరి సరిహద్దును సూచించే రాయి (తె. 2, 33, 35, 36).

శివాజ చూ. శివాయిజమా (తె. 30).

శివాయి చూ. శివాయిజమా (తె. 21, 27, 28)

శివాయిజమా (<హి. సివాయ్ జమా = రాబడ్ లేని); ఉ. సివాయిజమీ, శివోయిజమా, సెవాయిజమా; రూ. శివాజ, శివాయి; పర్యా. తెంపూరిభూమి, బగర్సాగు. పక్క ఉన్న పొలంరేటు ప్రకారం శిస్తుకడుతూ ప్రభుత్వం అనుమతిమీద సాగుచేసుకొనే పొలం; అవసరంలేనప్పుడు వదులుకోవచ్చు ; సాగుకు లాయకైన గవర్నమెంటు బంజరు; దీనిపై రైతుకు విక్రయహక్కులుండవు (కో 1, 4, 5, 50; తె. 17, 19, 20, 22–26, 39, 41; రా. 4, 13–19, 23–26, 28).

శేరి(భూమి) పర్యా. చూ. పట్టాభూమి. భూస్వామికి శిస్తు చెల్లిస్తూ రైతులతో సేద్యం చేయించే భూమి; శేరి అంటే సేద్యం (కో. 16–18, 21, 23; తె. 1, 5, 7–10, 38, 39).

శ్రోత్రియం వేదపండితులకు జమీందార్లు అన్ని హక్కులు చెల్లేట్టుగా ఇచ్చిన ఇనాం; ప్రధానంగా తోటలు, మెట్టపొలాలు; దీనిపై పన్ను గవర్నమెంటుకే చెల్లించు కోవాలి (రా 12, 14, 15, 17, 26). కొన్ని శ్రోత్రియం భేదాలు : కిట్టెంటు-, క్విట్టెంటు- (<Quitrent) నాలుగోవంతు మాత్రమే పన్ను కట్టుకోవలసిన నేల (కో); కుడివరం అనుభవించటానికి, అమ్మటానికి హక్కుగల శ్రోత్రియం (రా); మేల్వరం- సేద్యంచేసుకొనే హక్కు మాత్రమేకల ఇనాం; విక్రయహక్కుండదు (రా.); సర్వభోగం- అన్ని హక్కులుగల శ్రోత్రియం (రా.) హిస్సా-ఎక్కువమందికి ఉమ్మడిగా ఇచ్చిన శ్రోత్రియం (రా.).

షికం ఉ. సికం, సిగం; పర్యా, చూ. పోరంబోకు, గవర్నమెంటు అధికారంలో ఉన్న భూమి. చెరువు లోతట్టు భూమికి, అంటే చెరువు పొరంబోకుకు ఈ పదం తెలంగాణాలో ఎక్కువగా వాడతారు. 'షికం తాలాబ్' అని గూడా వాడుక(2, 5, 32, 34–38, 42).

సగుడు చూ. చవుడు (కో. 47).

సందుకట్టు(భూమి) పర్యా. చూ. మసరనేల, రేగడి. ఇసక కలిసిన నేల (తె. 28, 32).

సరిదికట్టు గట్టి మసరనేల (తె. 29).

సరిహద్దు ఉ. సరెద్దు; పర్యా. చూ. పొలిమేర. మేర, సీమ. ఊరి సరిహద్దు, గ్రామసీమ (కో. 21, 26, 28, 29, 31, 32, 34, 36, 39, 47; తె. 13, 16–28, 31, 41); -రాయి ఉ. సరెద్దురాయి, ఊరి పొలిమేరను సూచించే రాయి (కో. తె.): - రౌతు ఉ. సరెద్దురాయి (తె.).

సర్వేరాయి పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు సర్వేచేసినిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన

రాయి (కో. 22, 26, 28-30, 34-37, 39-41, 43-45, 47, 48, 51; రా. 5, 23).

**సిలుకు** పర్యా. చూ. నట్టు[1]. భూఖండం; పంచుకున్న నేలలో ఒక ముక్క (కో. 21).

**సుద్ద-** సున్నపు రాయి(తె. 7, 15, 20, 26; రా. 1, 6, 18); **-కట్టు** (నేల) మెత్తని సున్నపురాళ్ళ నేల (తె.); **-గడ్డ** తెల్లమట్టినేల; పంటకు మంచిదిగాదు; మిద్దెల మీద పరిస్తే కప్పు కురవదు (తె.); **-చవుడు** సున్నం కలిసిన చవుడు; కప్పు కురవకుండా డాబామీద వేస్తారుట (రా.).; **-బెట్టె** సున్నపురాళ్ళ గరువు; చూ. గరువు (తె.); **-బెళుకు** మెత్తని పలక (బెళుకు) రాళ్లుగల నేల (రా.); **-లట్టి** చూ. సుద్దగడ్డ (రా.).

**సున్నపుగరుగు** పర్యా. సున్నారంగరుగు. సున్నపు రాతి గులక కలిసిన నేల (తె. 41).

**సున్నారంగరుగు** పర్యా సున్నపుగరుగు. సున్నపు రాతి గులక కలిసిననేల; చూ. గరువు (రా 3, 5).

**సూను** పొలంలో ఒక మూలతో కలిసిఉన్న చదరపు ముక్క (రా. 2).

**సెలిక** ఉ. సెలికె; చూ. చెలక (కో. 9, 13, 18-20, 23, 25, 26): సాగుచెయ్యటం మాని పశువుల మేతకు వీటుగా మార్చిన నేల (కో. 8).

**సొల్లురేవడి** పర్యా. చూ. గుల్లరేగడి. గుల్లగా (ఒదు లొదులుగా) ఉండే రేగడినేల (కో. 33).

**హద్దురాయి** ఉ. అద్దురాయి; పర్యా. ఉదూదుర్, ఎల్లరాయి, కడి, కణెం, కాడిగట్టురాయి, కూనురౌతు, కొలరాయి, కొత్తకడి, కొత్తరాయి, కోనరౌతు, గట్టుబండ, గట్టురాయి, గట్టురౌతు, గనెంరాయి, చిన్నపురాయి, నదర్‌రాయి, నంబర్‌రౌతు, నామాలరాయి, నెంబర్‌రాయి, పరంరాయి, బందోబస్తుబండ, బాండురాయి, బాంద్‌రాయి, బొండరీరాయి, మందడిరాయి, మూలగట్టురాయి, మూలరాయి, మూలరౌతు, పర్వేరాయి, హద్దురౌతు, హద్బంద్. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి (కో. 3, 5, 6, 16, 23, 31, 39, 41; తె. 6, 7, 28-31, 33).

**హద్దురౌతు** ఉ. అద్దురౌతు; పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి (తె. 12, 20).

**హద్‌బంద్** పర్యా. చూ. హద్దురాయి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి (తె. 8, 9, 11).

# 2. సేద్యం

## భేదాలు, భాగస్వాములు

**అంటుకూలి** పర్యా. ఆజీలుకూలి, ఉద్దోరణి, కట్టుకూలి, కాయంకూలి, చేన(ను)మాల, రాతంకైకిలి. సంవత్సరమంతా ఒక రైతుదగ్గరే కూలిపనిచేసేవాడు (తె. 5, 6).

**అతిబోయ** పర్యా. చూ. జీతగాడు. అన్నవస్త్రాలిచ్చి పొలంపనులకు పెట్టుకొన్న జీతగాడు (కో. 41).

**అతుకుబడి** పర్యా. చూ. కదపసాగు. సొంతభూమి లేని రైతు ఇతరుల భూమిని కౌలుకుగాని, పాలికిగాని సేద్యం చెయ్యటం (కో. 39).

**అదవసేద్యం** పర్యా. చూ. కదపసాగు. సొంత భూమి లేని రైతు ఇతరుల భూమిని కౌలుకుగాని, పాలికిగాని సేద్యంచెయ్యటం (తె.42).

**అమరకం** పర్యా. చూ. కౌలు. భూకామందుకు డబ్బుగాని, పంటగాని ఇంత ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం (కో. 49).

**అంబారం** (1) కౌలుకింద రైతు ఆసామికిచ్చేధాన్యం; (2) ఆసామి, రైతు కలిసి సేద్యం చేసినప్పుడు పంటను ఆసామి మూడు వంతులు, రైతు ఒకవంతు పంచుకొనే పద్ధతి (కో. 25, 50, 51).

**అరకపాలు** పర్యా. కాడిపాలు, కావడిపాలు, నాగలిపాలు. ఆసామి పొలం, రైతు తన అరకతో, సాగుచేసి పంట చెరిసగం పంచుకొనే పద్ధతి (కో. 27; తె. 8, 32-36, 38, 39); **అరకపాలిగాడు** అరకపాలుకు చేసేవాడు (తె.); **అరకపాలేరు** అరకపాలుకు చేసేవాడు (కో. తె.).

**అరకపొత్తు** పర్యా. కాడిపొత్తు, నాగలిపొత్తు. తమ తమ అరకలతో ఒకరికొకరు సహకరించుకొంటూ చేసే సేద్యం; చూ. పొత్తు(ల)సేద్యం (కో. 27, 32, 36; తె. 20, 23, 25, 30, 31).

**ఆజీలుకూలి** పర్యా. చూ. అంటుకూలి. సంవత్సరమంతా ఒక రైతు దగ్గరే కూలిపని చేసేవాడు (కో. 29, 35; తె. 41).

**ఆమినికూలి** పర్యా. చూ. సుగ్గికూలి. నాట్లపనికి వచ్చే కూలి (రా. 14).

**ఆయగాళ్లు** పర్యా. చూ. మేరవాళ్లు. గ్రామంలో రైతుదగ్గర మొత్తం సంవత్సరానికి నిర్ణయించుకొన్న ప్రకారం కళ్ళంలోని ధాన్యం తీసుకునే చాకలి, మంగలి మొ. వివిధ వృత్తులవాళ్లు (రా 18).

**ఆవారి** పర్యా. చూ. నిగామాన్. పెద్దరైతు దగ్గర జీతగాళ్ళచేత వ్యవసాయం చేయించేవాడు (తె. 22).

**ఆసామి** పర్యా. బుగత, భూకామందు, భూస్వామి, మోతుబరి, సాహుకారి. (1) పెద్దరైతు; ఎక్కువ పొలమున్న రైతు; (2) పొలం సొంతదారు (కో. 2, 5-8, 13-15, 19, 25, 26 29, 31, 33, 35,40; తె.5-9, 22, 25-28, 37; రా. 11).

**ఇనాందార్** జమీందారులనుంచి ఇనాం పొందినవాడు. చూ. ఇనాం †. (కో. 46; తె. 16, 17).

**ఈసదారు** పర్యా. చూ. పాలికాడు. పాలికి సేద్యం చేసేవాడు; చూ. పాలు (తె. 34).

**ఈసబడి** భూకామందుకు డబ్బు ఇంత ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం; కౌలులో ఒక రకం; చూ. కౌలు (కో. 21).

**ఉడుపుకూలి** పర్యా. చూ. సుగ్గికూలి. నాట్లపనికి వచ్చే కూలి (కో. 49).

**ఉద్దోరణి** పర్యా. చూ. అంటుకూలి (1) సంవత్సరమంతా ఒక రైతుదగ్గరే కూలిపని చేసేవాడు; (2) కూలీల మేస్త్రీ (కో. 34).

**ఉమ్మడిసాగు** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్న రైతులు కొంతమంది కలిసి చేసే వ్యవసాయం (కో 37, 41, 45, 46, 49).

**ఉమ్మడిసేద్యం** పర్యా. ఉమ్మడిసాగు, కూటుసేద్యం, గొంచిసేద్యం, పొత్తుకాపురం, పొత్తుకాస్త, పొత్తు(ల)సేద్యం, ముయిసేద్యం, మొగుసేద్యం, రాశిసేద్యం, వాటాసాగు. చిన్నరైతులు కొంతమంది కలిసి చేసే సేద్యం (కో. 28, 34, 35, 39, 44; తె. 30, 41).

**ఎద్దుపాలు** పర్యా. కొమ్ముపాలు. ఆసామి ఎద్దు(ల)తో తనది ఒక ఎద్దు కలిపి సాగుచేసే రైతు పంటలో నాలుగోవంతు తీసుకునే ఏర్పాటు (తె. 17, 18, 20, 34; రా. 13, 14, 17).

**ఒంటెద్దుపొత్తు** చెరొక ఎద్దును వేసుకొని చేసే ఉమ్మడి సేద్యం; చూ. పొత్తు(ల) సేద్యం (కో. 32, 36; తె. 30, 31).

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు) : కో. = కోస్తాజిల్లాలు ; చూ. = చూడు ; తె. = తెలంగాణా ; పర్యా. = పర్యాయపదం (-పదాలు) ; రా. = రాయలసీమ ; రూ. = రూపాంతరం ; విశే. = విశేషణం ; హిం. = హిందుస్తానీ.

**ఒల్చె** పర్యా. చూ. పాయకారి. పొరుగూరినుంచి వచ్చి సేద్యం చేసే రైతు (తె. 2).

**కట్టుకూలి** పర్యా. చూ. అంటుకూలి. సంవత్సరమంతా ఒక రైతుకే జీతానికి కూలిపని చేసేవాడు (రా. 13, 18, 22).

**కట్టుబడి** భూకామందుకు ధాన్యంలో పాలు ఇంత ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం; కౌలులో ఒకరకం; చూ. కౌలు (కో. 21).

**కదపసాగు** పర్యా. అతుకుబడి, అదవసేద్యం, పాయకారిసేద్యం. సొంతభూమిలేని రైతు ఇతరుల భూమిని కౌలుకుగాని పాలికిగాని తీసుకుని సేద్యంచెయ్యటం (కో. 40, 41, 46, 48, 49).

**కమతగాడు** పర్యా. చూ. జీతగాడు, పాలికాడు. (1) ఆసామి తన ఇంట్లోనే అన్న వస్త్రాలిచ్చి సంవత్సరానికింత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకున్న వ్యవసాయపు పనివాడు; (2) పాలికి సేద్యంచేసేవాడు; చూ. **పాలు** (కో. 9, 11, 12, 19, 21, 27, 28, 36; రా. 27).

**కమతంపాలు** పర్యా. చూ. సంగోరు. ఆసామి, సాగు చేసిన రైతు, పంటలో చెరిసగం పంచుకొనే పద్ధతి (కో. 10).

**కంబారి(రీ)** రూ. కాంబారి; పర్యా. చూ. జీతగాడు. ఆసామి తన యింట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరాని కింత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకున్న వ్యవసాయపు పనివాడు (కో. 44, 46, 48, 51);-**సేద్యం** జీతగాళ్ళను బెట్టి చేయించే వ్యవసాయం (కో.).

**కాడిపాలు** రూ. కావడిపాలు; పర్యా. చూ. అరకపాలు. ఆసామి పొలం రైతు తన నాగలితో దున్ని పంట చెరిసగం పంచుకొనే పద్ధతి (తె. 33, 34; రా. 13, 14, 21).

**కాడిపొత్తు** పర్యా. చూ. అరకపొత్తు. రైతులు తమ తమ అరకలతో ఒకరికొకరు సహకరించుకొంటూ చేసే సేద్యం (తె. 40).

**కాపు** పర్యా. చూ. రైతు. వ్యవసాయంచేసేవాడు (తె. 6).

**కాపురం** పర్యా. చూ. సేద్యం. వ్యవసాయం (తె. 1).

**కాంబారి** చూ. కంబారి (కో. 47, 49–51).

**కాయంకూలి** పర్యా. చూ. అంటుకూలి. సంవత్సరమంతా ఒక రైతుదగ్గరే కూలిపని చేసేవాడు (రా. 22).

**కావడిపాలు** చూ. కాడిపాలు (రా. 17).

**కాస్త** : పర్యా. చూ. సేద్యం. వ్యవసాయం (తె. 2, 5, 8, 9, 11, 12, 14, 29, 32, 33); -**దార్** పర్యా. చూ. రైతు వ్యవసాయం చేసేవాడు (తె.).

**కూటుసేద్యం** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్న రైతులు కొంతమంది కూడి చేసే సేద్యం (రా. 3).

**కూలి** రూ. కైకిలి, కైకూలి. రైతుకు అవసరం వచ్చినప్పుడు పనులరోజుల్లో గింజలకుగాని డబ్బుకుగాని పని చేసేవాడు (కో. 1, 5, 10–17, 19–39, 41–50; తె. 1–8, 14, 29–41; రా. 1–6, 8–28); రకాలు:అంటు-, అజీలు-, అమిని-, ఉకుపు-, ఉద్దోరణి, కట్టు-, కాయం-, గాలి-, చేన(ను)మాల, రాతంకైకిలి, వరపు-, సుగ్గి-.

**కైకిలి** ఉ. కైకిలి; చూ. కూలి (తె. 11 – 13, 15–24, 26–28).

**కైకూలి** చూ. కూలి (తె. 9, 10, 24, 25, 42).

**కొమ్ముపాలు** పర్యా. ఎద్దుపాలు. ఆసామి ఎద్దు(ల)తో తనది ఒక ఎద్దు కలిపి సాగుచేసే రైతు పంటలో ఎనిమిదో వంతు తీసుకునే ఏర్పాటు (తె. 34, 38, 39, 42; రా 13); **కొమ్ముపాలికాడు**, **కొమ్ముపాలేరు** కొమ్ముపాలుకు చేసేవాడు (తె.).

**కోరు** పర్యా. చూ. పాలు. (1) ఆసామి (భూమి సొంతదారు), పొలంచేసేరైతు, పండినపంటలో ఒక్కొక్కరికి 'ఇంత' అని నిర్ణయించుకొన్న భాగం (చెరిసగం గాని అంతకన్న ఎక్కువగాని; (2) ఈ ఏర్పాటును బట్టి చేసే సేద్యం (కో. 25, 29, 32, 40; తె. 3, 41, రా. 1–6, 9, 11, 15, 18, 20, 21, 24–28); రకాలు:ముంగోరు, సంగోరు; -**దారు** పర్యా. చూ. పాలికాడు. కోరుకు (పాలికి) సేద్యంచేసేవాడు; చూ. పాలు; -**పాలు** పర్యా. చూ. సంగోరు. ఆసామి, సాగు చేసిన రైతు పంటలో చెరిసగం పంచుకొనే పద్ధతి; -**వారం** పర్యా. చూ. పాలికాడు. పాలికిసేద్యం చేసేవాడు (రా.)

**కౌలు** (<హిం.కౌల్ = ఒప్పందం, ఒడంబడిక) పర్యా అమరకం, గుత్త,గెరాంచి, మక్తా, మునాఫ, రైన్, శిస్తుసాగు. పొలంచేసే రైతు భూకామందుకు డబ్బుకాని పంటకాని ఇంత ఇచ్చేట్టు అని ముందుగా చేసుకొనే ఒప్పందం; భూస్వామి రైతుకు రాసిఇచ్చే అంగీకారపత్రం (కో. 12–14, 18, 21–23, 26–29, 31–36; తె. 1–6; 8–10, 12, 13, 15–28, 38, 42; రా 12, 17, 18, 24, 26, 27); రకాలు : ఈసబడి, కట్టుబడి, గల్లాకాస్త, గల్లా మక్తా, పంచోటికౌలు, రిజిష్టరు కౌలు, పొడికౌలు, భోగ్యం, భోగబంద, మార్నెం, మేజువాడీ; -**కాస్త** కౌలుకుచేసే సేద్యం ; చూ. కాస్త (తె.); -**దారు** ఉ. కౌల్దారు; పర్యా, గుత్తదారు, గుత్తరైతు, గుత్తవాడు, పాయకారి, బేదారు, మక్తారైతు, శిస్తుదార్. కౌలుకుసేద్యం చేసే రైతు (తె.); -**సేద్యం** కౌలుకుచేసే సేద్యం (కో. తె.).

**ఖబ్జదార్** భూస్వామి. దేశముఖ్ లాంటివాడు (తె.

1, 4).

**గల్లాకాస్త** (< హిం. గల్లా='పంట', ధాన్యం): పర్యా. చూ. గల్లామక్తా. భూకామందుకు ఇంత డబ్బు ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం (తె. 5,9, 36).

**గల్లామక్తా** (< హిం. గల్లా 'పంట'); పర్యా. గల్లాకాస్త, రకంకాస్త. పంట పండినా పండకపోయినా నిర్ణయించుకొన్న పంటలో పాలు తప్పనిసరిగా ఇచ్చేట్టు ఒప్పందం కుదుర్చుకొని చేసే కౌలు లేక మక్తా; చూ. కౌలు (కో. 40, 46-48).

**గాలికూలీ** పర్యా. వరపుకూలీ. వేసవికాలంలో పొలం పనిలోకి వచ్చేకూలీ (రా. 17, 18).

**గాసగాడు** పర్యా. చూ. జీతగాడు. ఆసామి తన ఇంట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరాని కింత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకున్న వ్యవసాయపు పనివాడు (తె. 1-5; రా. 21—24, 28).

**గుత్త** (1) పర్యా. చూ. కౌలు. రైతు, భూకామందుకు డబ్బుగాని, పంటగాని ఇంత ఇచ్చేట్టు అని ముందుగా చేసుకొనే ఒప్పందం; (2) ముందుగానే నిర్ణయించుకొన్న పైకం భూకామందు కిచ్చి రైతు కొన్ని ఏళ్ళపాటు సాగుచేసుకొనే పద్ధతి (కో. 26—36, 44, 47, 50, 51; తె. 1, 2, 4, 7—9, 12, 15—18, 20, 31, 40, 41; రా. 3, 9-11, 20, 24-26); రకాలు: ఖండగుత్త, గుండుగుత్త, బురదగుత్త; **-దారు, -రైతు, -వారం** చూ. కౌలుదారు (రా. ).

**గెరాంచి** పర్యా. చూ. కౌలు. (1) పొలంచేసే రైతు భూకామందుకు డబ్బుగాని పంటగాని ఇంత ఇచ్చేట్టు అని ముందుగా చేసుకొనే ఒప్పందం; (2) కౌలుకుచేసే భూమి (కో. 51.)

**గొంచికాడు** చూ. గొంచిసేద్యం. గొంచిసేద్యంచేసే రైతుల్లో పెద్ద (రా. 15, 16, 18).

**గొంచిసేద్యం** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్న రైతులు కొంతమంది కలిసిచేసే సేద్యం (రా. 15, 16, 18).

**చిరకపొత్తు** పర్యా. చూ. చేతరపాలు. ఆసామి అరకతోనే సాగుచేసి రైతు పంటలో ఒక భాగం పంచుకొనే పద్ధతి (తె. 23).

**చేతరపాలు** చూ. చేతలపాలు (రా. 14).

**చేతలపాలు** రూ. చేతరపాలు, చేపాలు; పర్యా. చిరకపొత్తు. ఆసామి అరకతోనే సాగుచేసి రైతు పంటలో ఒక భాగం పంచుకొనే పద్ధతి; రెక్కల (చేతుల) కష్టానికి మాత్రమే పొందే ఫలభాగం (తె. 6-8, 13, 32, 33, 35, 36, 38, 39, 42).

**చేన(ను)మాల** పర్యా. చూ. అంటుకూలి. సంవత్సరమంతా ఒక రైతుదగ్గరే కూలిపని చేసేవాడు, చేనుపని చేసే మాలవాడు (తె. 31, 39).

**చేపాలు** చూ. చేతలపాలు (తె. 22-28).

**జమీందారు**(< హిం. జమీన్=భూమి, దార్=కలవాడు); "భూస్వామి; మొగలాయీ చక్రవర్తుల కాలంలో ఒక జిల్లాకుచెందిన భూముల ఆర్థికపర్యవేక్షణకై నియోగింప బడ్డవాడు; ఆ తర్వాత వంశపారంపర్యంగా ఆయా భూములపై స్వతంత్రాధికారం సంక్రమించింది" (MAMP. పుట 1042).

**జాగీర్దారు** నవాబునుంచి కొంత జాగీరును పొందినవాడు. చూ. జాగీరు § 1 (తె. 16, 32, 33, 42).

**జాతికాస్త** పర్యా. చూ. సొంతసేద్యం. తన భూమిని తాను సాగుచేసుకోటం (తె. 10).

**జాతీజిరాయి** పర్యా. చూ. సొంతసేద్యం. తన భూమిని తాను సాగుచేసుకోటం (తె. 28).

**జిమ్మేదారు** ? అధికారి భూమిచేసేవాడు (తె. 3).

**జిరాయితీదారు** (< హిం. జిరాఅతీ 'వ్యవసాయ సంబంధమైన'); పర్యా. చూ. పట్టాదారు. భూమిపై పట్టాహక్కు కలిగినవాడు; చూ. పట్టా (కో. 38).

**జీతగాడు** పర్యా. అతిబోయ, కంబారి, కమతగాడు, కాంబారి, గాసగాడు, పాలికాపు, పాలేరు, సంబళగాడు, సేద్యగాడు. ఆసామి తన ఇంట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరాని కింత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకొన్న వ్యవసాయపు పనివాడు (కో. 6, 7, 10-18, 24-32; 36—38, 40; తె. 6-9, 11-22, 29-42; రా. 4, 5, 10, 11, 13, 15, 17—20, 25—27).

**ఠాణేదార్** జమీందారీ భూముల్లో సముద్దారుకు వశం కాని శిస్తులను వసూలుచేసేవాడు; కోశాధికారి; చూ. సముద్దార్ (కో. 23).

**తలమనిషి** పర్యా. చూ. నిగామాన్. పెద్దరైతు దగ్గర జీతగాళ్ళచేత వ్యవసాయం చేయించేవాడు (కో. 2,5).

**దేశముఖు** నవాబుల పరిపాలనాకాలంలో కొన్ని గ్రామాల కధికారి (తె. 14, 37).

**దొంతరపొత్తు** ఎక్కువమంది (సుమారు పదిమంది దాకా) కలిసిచేసే ఉమ్మడిసాగు; చూ. పొత్తు(ల)సేద్యం (తె. 33).

**నాగటిపాలు** పర్యా. చూ. అరకపాలు. ఆసామి పొలం రైతు తన నాగలితో పాలికి చేసి పంట చెరిసగం పంచుకొనే పద్ధతి; కొన్నిచోట్ల భూస్వామికి మూడు వంతులూ, రైతుకు ఒకవంతు (తె. 30, 41); **నాగటి పాలికాడు** నాగలిపాలుకు చేసేవాడు (తె.).

**నాగలిపొత్తు** పర్యా. చూ. అరకపొత్తు. రైతులు తమ

తమ అరకలతో ఒకరికొకరు సహకరించుకొంటూ చేసే సేద్యం; చూ. పొత్తు(ల)సేద్యం (కో. 27, 29, 36).

నిగామాన్ పర్యా. ఆవారి, తలమనిషి. పెద్దరైతు దగ్గర జీతగాళ్ళచేత వ్యవసాయం చేయించేవాడు (కో. 20–23, 25).

నీరుగట్టి కాలువలు, చెరువులు ఉన్న ఊళ్ళలో మాగాణికి నీళ్ళు పంచేవాడు (రా. 2, 5, 19).

పంచోటికొలు పంటలో రేటు నిర్ణయించుకొని రాసుకొనే కౌలు; చూ. కౌలు (తె. 13).

**పట్టాదారు** రూ. పట్టేదారు; పర్యా. జిరాయితీదారు. భూమిపై పట్టాహక్కు కలిగినవాడు; చూ. పట్టా § 1 (కో. 37, 39; తె. 2, 10, 11, 14, 37–39, 42; రా. 18).

**పట్టేదారు** చూ. పట్టాదారు (తె. 1, 12, 13, 15–29, 32, 33).

**పాయకారి(రీ)** పర్యా. చూ. కౌలుదారు, ఒల్పె. (1) పైగ్రామం నుంచి వచ్చి (పాలికి గాని, కౌలుకుగాని) సేద్యంచేసేరైతు; (2) కౌలుకుచేసేవాడు (కో. 2, 37, 43; రా. 24) -**సేద్యం** (1) పర్యా. చూ. కవుపసాగు. సొంత భూమిలేని రైతు ఇతరుల భూమిని పాలికిగాని, కౌలుకుగాని సేద్యం చెయ్యటం (కో.); (2) ఆసామి పై గ్రామంలో ఉండి తన భూమిని కౌలుకిచ్చి చేయించే సేద్యం (కో.).

**పాలికాడు** పర్యా. ఈసదారు, కోరుదారు, కోరువారం, పాలిదారు, పాలిరికెదారు, పాలేరు, మేగూలి, సాగుదారు, సిగురుగాడు. పాలికి సేద్యంచేసేవాడు; చూ. పాలు (తె. 6–8, 18, 19, 32–34, 38, 39; రా. 7, 11, 13, 16, 17, 21).

**పాలికాపు** పర్యా. చూ. జీతగాడు, ఆసామి తన ఇంట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరానికింత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకొన్న వ్యవసాయపు పనివాడు (కో. 34, 36, 37, 39, 41, 42, 45, 47, 50).

**పాలిదారు** పర్యా. చూ. పాలికాడు. పాలికి సేద్యం చేసేవాడు (కో. 30, 36).

**పాలిరికెదారు** పర్యా. చూ. పాలికాడు. పాలికి సేద్యం చేసేవాడు (రా. 23, 25).

**పాలిసేద్యం** పర్యా. చూ. పాలు. ఆసామి (భూమి సొంతదారు)కి పొలంచేసేరైతు పండినపంటలో కొంతభాగం ఇవ్వటానికి నిర్ణయించుకొని (సగంగాని, అంతకన్న ఎక్కువగాని) చేసే సేద్యం (కో. 27, 33, 36; తె. 7, 30).

**పాలు** పర్యా. కోరు, పాలిసేద్యం, పాలుకాస్త, పాలుసేద్యం, బటాయ్, పంపుసాగు, వాస. (1) ఆసామి (భూమి సొంతదారు) పొలంచేసే రైతు, పండినపంటలో ఒక్కొక్కరికి "ఇంత" అని నిర్ణయించుకొన్న భాగం (చెరిసగం గాని, అంతకన్న ఎక్కువగాని); (2) ఈ యేర్పాటును బట్టి చేసే సేద్యం (కో. 3, 5, 6, 9, 11, 28, 30–36, 46–50, తె. 1, 2, 4–6, 8, 10, 13, 16–18, 21–34, 37–42.; రా. 7, 8, 11, 17–19, 21, 23, 25. 27, 28); -**కాస్త** ఉ. పాలికాశ్త; పర్యా. చూ. పాలు. పాలికిచేసే సేద్యం (తె.); -**సేద్యం** పర్యా. చూ. పాలు. పాలికి చేసే సేద్యం (కో. తె.).

**పాలేరు** పర్యా. చూ. జీతగాడు, పాలికాడు. ఆసామి తన యింట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరానికింత జీతం ఇచ్చేట్టుగా పెట్టుకొన్న వ్యవసాయపు పనివాడు; చూ. పాలు (కో. 21–23, 25, 26, 28, 32, 33, 35, 37, 40, 42; రా. 28).

**పొడికొలు** రాతపూర్వకమైన ఒప్పందం చేసుకొని చేసే కౌలు; చూ. కౌలు (కో. 26, 36; తె. 41).

**పొత్తుకాపురం** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్న రైతులు కొంతమంది కలిసి చేసే సేద్యం (తె. 1).

**పొత్తుకాస్త** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్నరైతులు కొంతమంది కలిసి చేసే సేద్యం (తె. 2, 11, 12, 14, 29, 32, 33).

**పొత్తు(ల)సేద్యం** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్న రైతులు కొంతమందికలిసి చేసే సేద్యం (కో. 28, 33, 36; తె. 3, 5, 15, 17–27, 30, 31, 40, 41); రకాలు: అరకపొత్తు, ఒంపెద్దుపొత్తు, దొంతరపొత్తు, మనిషిపొత్తు, సాదాపొత్తు.

**బటాయ్** పర్యా. చూ. పాలు, పాలికాడు. (1) ఆసామి (భూమి సొంతదారు)కి పొలంచేసేరైతు పండినపంటలో ఇవ్వటానికి నిర్ణయించుకొన్న భాగం (సగంగాని అంతకన్న ఎక్కువగాని); (2) ఈ యేర్పాటునుబట్టి చేసే సేద్యం; (3) కొన్నిచోట్ల పాలికి చేసేవాడు (తె. 1, 4, 5, 7–29, 35, 36, 38).

**బటేదారు** పర్యా. చూ. కౌల్దారు. కౌలుకు సేద్యంచేసే రైతు (తె. 10, 12).

**బదలాయి** రైతులు పరస్పరసహకారంతో చేసే సేద్యం (తె. 11).

**బుగత** పర్యా. చూ. ఆసామి. (1) ఎక్కువపొలమున్న రైతు; పెద్దరైతు. (2) పొలం సొంతదారు (కో. 37, 39–41, 43, 45–49, 51).

**భూస్వామి** పర్యా. చూ. ఆసామి. (1) ఎక్కువ పొలమున్నరైతు; పెద్దరైతు. (2) పొలం సొంతదారు (తె. 2, 37; రా. 24).

**భోగబంద** కౌలు నిర్ణయించుకొని డబ్బు ముందుగా చెల్లించిన తర్వాత రైతుకిచ్చిన భూమి (కో. 47).

**భోగ్యం** ఉ. భోగ్గెం. భూకామందుకు ముందుగా డబ్బిచ్చి

కౌలుకు చేసే వ్యవసాయం (తె. 3).

**మక్తా** ఉ. మగతా, మొగతా; పర్యా. చూ. కౌలు. పొలంచేసే రైతు భూకామందుకు డబ్బుగాని పంటగాని ఇచ్చేట్టు అని ముందుగా చేసుకొనే ఒప్పందం (కో. 3-12, 14-17, 20, 24, 47; తె. 32, 33, 38, 40); -రైతు పర్యా. చూ. కౌల్దారు. మక్తాకు సేద్యంచేసే రైతు (కో. తె.).

**మక్తేదారు** పొలం గుత్తకిచ్చినవాడు (తె. 32).

**మనిషిపొత్తు** ఒక రైతు ఎద్దులతోను, మరొకరైతు మనిషిసహాయంతోను చేసే ఉమ్మడిసాగు; చూ. పొత్తు(ల) సేద్యం (కో. 32, 36; తె. 40).

**మనేగాళ్లు** పర్యా. చూ. మేరవాళ్ళు. గ్రామంలో రైతుదగ్గర మొత్తం సంవత్సరానికి నిర్ణయించుకొన్న ప్రకారం కళ్ళంలో ధాన్యం తీసుకొనే చాకలి, మంగలి మొ. వివిధ వృత్తులవాళ్ళు (రా. 15).

**మార్నెం** నూరుసంవత్సరాలకు తీసుకొన్న కౌలు, చూ. కౌలు (కో. 27).

**ముంగోరు** పంటను ఆసామి రెండు భాగాలు, సాగు చేసిన రైతు ఒకభాగం పంచుకొనే పద్ధతి (తె. 3).

**ముచ్చిలక(కా)** రైతు ఆసామికి (భూకామందుకు) రాసిఇచ్చిన కవులుపత్రం; పంట పండినా పండకపోయినా "ఇంత" డబ్బు ఇచ్చేట్టుగా నిర్ణయించుకొని రాసిఇచ్చిన రిజిష్టరుపత్రం (కో 48, 50, 51).

**మునాఫ** ఉ. మునాబ; పర్యా. చూ. కౌలు. భూకామందుకు డబ్బుగాని, పంటగాని "ఇంత" ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం (తె. 11, 12, 18-29, 31, 32, 35, 42).

**ముయిసేద్యం** చూ. మొగుసేద్యం (రా. 18).

**మేగూలి** పర్యా. చూ. పాలికాడు. పాలికిసేద్యం చేసేవాడు (కో. 16).

**మేజువాడీకౌలు** మాట ఒప్పందంమీద చేసే కౌలు; చూ. కౌలు (కో. 26).

**మేడిపాలు** ఆసామి దగ్గర పొలం సాగుచేసిన రైతుకు పంటలో సగంకంటె ఎక్కువగా వచ్చేభాగం (కో. 41; రా. 1).

**మేరవాళ్ళు** ఉ. మేరోళ్ళు; పర్యా. ఆయగాళ్లు, మనేగాళ్ళు. గ్రామంలో రైతుదగ్గర మొత్తం సంవత్సరానికి నిర్ణయించుకున్న ప్రకారం కళ్ళంలో ధాన్యం తీసుకొనే చాకలి, మంగలి మొ. వివిధవృత్తులవాళ్ళు (తె. 31).

**మొకాసాదార్** ఒకగ్రామం మొత్తానికి అధికారి. జమీందారు దగ్గర పారితోషికంగా పొందిన గ్రామాన్ని మొకాసా' అంటారు; చూ. మొకాసా § 1 (కో. 37, 42).

**మొగుసేద్యం** రూ. ముయిసేద్యం; పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్నరైతులు కొంతమంది కలిసిచేసే సేద్యం (కో. 51).

**మోతుబరి(రైతు)** పర్యా. చూ. ఆసామి. ఎక్కువ పొలమున్న రైతు, పెద్దరైతు (రా. 5).

**రకంకాస్త** పర్యా. చూ. గల్లామక్తా. పంట పండినా పండకపోయినా నిర్ణయించుకొన్న డబ్బు తప్పనిసరిగా ఇచ్చేట్టు ఒప్పందం కుదుర్చుకొని చేసే కౌలు లేక మక్తా (తె. 5).

**రాతంకైకిలి** పర్యా. చూ. అంటుకూలి. సంవత్సరమంతా ఒక రైతుకే కూలిపని చేసేవాడు (తె. 13, 20).

**రాశిసేద్యం** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్నరైతులు కొంతమంది కలిసిచేసే సేద్యం (రా. 8).

**రైతు** పర్యా. కాపు, కాస్తదార్, సాగుదారు, సికిందార్, సేద్యగాడు. పొలంసాగుచేసేవాడు. వ్యవసాయదారుడు. కొన్నిచోట్ల సొంతభూమిని సాగుచేసేవాడినే రైతంటారు(కో. 2-8, 12-16, 18, 20, 21, 23-26, 29, 32, 33, 35, 36, 42, 44; తె. 3, 7, 40; రా. 2, 3, 5-28).

**రైన్** పర్యా. చూ. కౌలు. పొలంచేసేరైతు భూకామందుకు డబ్బుగాని, పంటగాని "ఇంత" ఇచ్చేట్టు అని ముందుగా చేసుకొనే ఒప్పందం (తె. 6, 11, 14, 32). రకాలు: బేషుదతి-, ముదతి-.

**లోపాయకారీ** పై ఊళ్ళో ఉన్న ఆసామిదగ్గర కౌలుకు తీసుకొన్న భూమిని తనసొంత పూచీపై మరిఒకరిచేత సేద్యం చేయించే పద్ధతి; చూ. పాయకారీ (కో. 41, 50, 51).

**వంతుసాగు** పర్యా. చూ. పాలు. ఆసామి (భూమిసొంతదారు)కి పొలంచేసే రైతు పండిన పంటలో కొంత భాగం ఇవ్వటానికి నిర్ణయించుకొని (సగంకాని అంతకన్న ఎక్కువగాని) చేసే సేద్యం (కో. 39, 43, 45).

**వరపుకూలీ** పర్యా. గాలికూలీ. వేసవికాలంలో పొలం పనిలోకి వచ్చేకూలీ (కో. 39).

**వాటాసాగు** పర్యా. చూ. ఉమ్మడిసేద్యం. చిన్నరైతులు కొంతమంది కలిసిచేసే సేద్యం (కో. 40).

**వాస** పర్యా. చూ. పాలు. ఆసామి (భూమి సొంతదారు)కి పొలంచేసే రైతు పండిన పంటలో ఇవ్వటానికి ఒప్పుకొన్న భాగం (సగంకాని అంతకన్న ఎక్కువకాని). ఈ ఏర్పాటునుబట్టి చేసే సేద్యం (తె. 7).

**వ్యవసాయం** ఉ. ఎగసాయం, ఎవసం, ఎవసాయం; పర్యా. చూ. సేద్యం. రైతుపొలందున్ని పంటలు పండించటం (కో. 10, 12, 17, 19, 22, 25, 27, 36, 50; తె. 13, 16, 20, 28, 34-36, 38).

**శిస్తుకౌలు** సాగుచేసిన రైతు భూకామందుకు నగదు (డబ్బు) రూపంలో చెల్లించేది (కో. 48).

**శిస్తుదార్** పర్యా. చూ. కౌల్దారు. కౌలుకు సేద్యం చేసేవాడు (కో. 42).

**శిస్తుసాగు** పర్యా. చూ. కౌలు. భూకామందుకు డబ్బు గాని పంటగాని ఇంత ఇచ్చేట్టు అని, ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం (కో. 40, 41, 43, 45).

**శేరీకాస్త** పర్యా. చూ. సొంతశేరీ. జమీందారుకింద ఉన్న పెద్ద ఉద్యోగస్థుడు సొంతగా చేసుకొనే వ్యవసాయం, చూ. శేరీ § (తె. 10, 14, 38).

**శేరీదారు** దేశముఖుల దగ్గరనుంచి భూమి గుత్తకు తీసుకొని సేద్యం చేయించేవాడు(తె. 5, 7, 24, 26-28, 39).

**శేరీసేద్యం** పర్యా. చూ. సొంతశేరీ. జమీందారుకింద ఉన్న పెద్ద ఉద్యోగస్థుడు సొంతగా చేసుకొనే వ్యవసాయం (తె. 3, 7).

**సగపాలు** పర్యా. చూ. సంగోరు. ఆసామి, సాగు చేసిన రైతు పంటలో చెరిసగం పంచుకొనే పద్ధతి (కో. 31; తె, 34).

**సంగోరు** పర్యా. కమతంపాలు, కోరుపాలు, సగపాలు. ఆసామి, సాగుచేసినరైతు, పంటలో చెరిసగం పంచుకొనే పద్ధతి (కో. 25, 32, 40; తె. 3, 41).

**సముద్దారు** జమీందారీ రోజుల్లో రైతుల దగ్గర పన్నులు వసూలుచేసేవాడు(కో. 23).

**సంబళగాడు** పర్యా. చూ. జీతగాడు. ఆసామి తన ఇంట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరానికింత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకొన్న వ్యవసాయపు పనివాడు (రా. 16).

**సాగు** పర్యా. చూ. సేద్యం. వ్యవసాయం (కో. 37, 40, 41, 45, 46, 49; రా. 16, 17);- **దారు** పర్యా. చూ. పాలికాడు. రైతు. పాలికి సేద్యం చేసేవాడు (రా.); వ్యవసాయదారుడు (కో.).

**సాదాపొత్తు** ఇద్దరు కలిసిచేసే సాగు; చూ. పొత్తు(ల) సేద్యం (తె. 33).

**సావుకారి** పర్యా. చూ. ఆసామి. (1) పెద్దరైతు. ఎక్కువ పొలమున్నరైతు; (2) పొలం సొంతదారు (కో. 45; రా. 14, 19, 21, 22, 26–28).

**సిక్మేదార్** ఉ. సికిమ్‌దార్. (1) "శేరీ" గల అన్నదమ్ముల్లో పెద్దవాడు శేరీదారు; మిగిలినవాళ్ళను సిక్మేదార్లంటారు(తె. 14, 35); (2) పర్యా. చూ. రైతు. వ్యవసాయం చేసేవాడు (తె. 4, 34).

**సిగురుగాడు** పర్యా. చూ. పాలికాడు. పాలికి సేద్యం చేసేవాడు; చూ. ఎద్దుపాలు (రా. 16).

**సుగ్గికూలీ** పర్యా. అమినికూలీ, ఉడుపుకూలీ. నాట్ల పనికి వచ్చేకూలి (రా. 18, 22).

**సేద్యగాడు** పర్యా. చూ. జీతగాడు, రైతు. ఆసామి తన ఇంట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరాని "కింత" జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకున్న వ్యవసాయపు పనివాడు; వ్యవసాయం చేసేవాడు (కో. 1, 2, 4–6. రా. 1–4, 6-9, 12, 14).

**సేద్యం** పర్యా. కమతం, కాపురం, కాస్త, సాగు; వ్యవసాయం. రైతు పొలందున్ని పంటలు పండించటం (కో. 28, 33– 36, 39, 44, 51; తె. 3, 5, 15, 17–27, 30, 31, 40, 41; రా. 3, 6, 8, 15, 16, 18).

**సొంతకమతం** పర్యా. చూ. సొంతసేద్యం. తన భూమిని తానే సాగుచేసుకోటం (కో. 26, 27, 28, 32–34, 36, 44; తె. 2, 3, 40, 41).

**సొంతకాస్త(శ్త)** పర్యా. చూ. సొంతసేద్యం. తన భూమిని తానే సాగుచేసుకోటం (తె. 2, 4, 7–9, 11, 12, 14, 29, 32, 33).

**సొంతశేరీ** పర్యా. శేరీకాస్త, శేరీసేద్యం. జమీందారు కింద ఉన్న పెద్ద ఉద్యోగస్థుడు సొంతంగా చేసుకొనే వ్యవసాయం (కో. 44; తె. 9–13, 15).

**సొంతసాగు** పర్యా. చూ. సొంతసేద్యం. తనభూమిని తానే సాగుచేసుకోటం (కో. 41, 43, 45).

**సొంతసేద్యం** పర్యా. జాతికాస్త. జాతీజిరాయి, సొంత కమతం, సొంతకాస్త, సొంతసాగు. తనభూమిని తానే సాగుచేసుకోటం (కో. 26-36, 39, 44; తె. 31, 37, 39, 40–42; రా. 16- 20, 24-28).

# 3. నీటివనరులు : తోడేసాధనాలు

**అట్టడి** పర్యా. చూ. చప్పిడి. పొలంలోపడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా నీళ్ళుమాత్రం పోవటానికి పల్లంగా ఉన్నవైపు కట్టిన రాతికట్టడం; చెరువుకు అలుగు లాగానే పొలానికి ఇదిగూడా (రా. 12).

**అడిబండ** పర్యా. గూటి-, తొట్టి-, కప్పు-, తలంటు రాయి, తలండ్లం-, సిర్తల. మోటబావి లోపలివైపున్న సూదిమానులమీద అడ్డంగా వేసిన బండ లేక చాపరాయి. చూ. చిత్రం 2 ట. 3 (రా. 5, 8).

**అడ్డకమ్మి** పర్యా. చూ. అడ్డచీల. ఏతపు బొక్కెన చెవికట్లగుండా దూర్చే ఇనపచువ్వ. కొన్నిచోట్ల కర్ర. చూ. చిత్రం 3 చ. 2 (కో. 14).

**అడ్డచీల** రూ. అడ్డజిల్ల; పర్యా. అడ్డకమ్మి, గజం, దూలాపుకర్ర, బానిరుసు, బొక్కెనదండె. ఏతపు బొక్కెన చెవికట్లగుండా దూర్చే ఇనపచువ్వ; కొన్నిచోట్ల కర్ర. చూ. చిత్రం 3 చ. 2 (కో. 39).

**అడ్డజిల్ల** చూ. అడ్డచీల (కో. 2).

**అడ్డి** పర్యా. చూ. చప్పిడి. పొలంలోపడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా నీళ్ళు మాత్రం పొర్లిపోవటానికి పల్లంగా ఉన్నవైపు గట్టుచివర కట్టిన రాతికట్ట; ఇది చెరువు అలుగును పోలి ఉంటుంది. (తె. 39).

**అడ్డుగమ్మ** పర్యా. చూ. కంపెదూలం. మోటబావి మీద, ఏతపు బావిమీద, అడ్డంగా వేసిన పట్టె. చూ. చిత్రం 3 క. 10 (కో. 38).

**ఆండ** గట్టిచట్టుగల బావికి సహజంగా ఉన్న ఉద్ది (తె. 1).

**అదరు** వర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళు తోడిపోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట. చూ. చిత్రం 2 ట. 1 (తె. 29); **-మాకు** పర్యా. చూ. కంపెదూలం. ఉద్దిలేని బావిమీద అడ్డంగా వేసిన మొద్దు. చూ. చిత్రం 3 క. 10 (తె.).

**అదారు** పర్యా. చూ. కంపెదూలం. ఉద్దిలేని బావి మీద అడ్డంగా వేసిన పట్టె. చూ. చిత్రం 3 క. 10 (తె. 28).

**అనకట్ట** పర్యా. చూ. పూన, కట్ట. (1) ఏరుగాని కాలవగాని ఒకచోట ఆపి నీళ్ళను పొలాలకు ప్రవహించేట్టు చేయటానికి రాళ్ళతోగాని మట్టితోగాని కట్టినకట్ట; ఆనకట్ట. (2) వాననీళ్ళకు పొలంలో మట్టి కొట్టుకొనిపోకుండా పోసిన కట్ట(తె. 33, 35; రా. 18).

**అప్పసం** (-తీయు, -వేయు, -మూయు); పర్యా. చూ. మడవ. ఒక మడినుంచి ఇంకో మడికి నీళ్ల పోవటానికి మడిగట్టు తెగ్గొట్టి ఏర్పరిచిన దోవ లేక కంత (కో. 39, 49–51).

**అర** పర్యా. కొల్లుగుంట, సూలగుంట. మోట దోనె నుంచి వచ్చిన నీరు నిలిచే చోటు; ఈ 'అర' దగ్గిరినుంచి పొలానికి నీళ్ళుపోయే కాలవ ఉంటుంది. చూ. చిత్రం 2 క. 6 (రా. 16, 17); **-బండ** పర్యా. దోనెబండ. మోట బావి దోనెఅర (లోపలివైపు)కు అడుగున వేసిన బండ (రా.).

**అరగాడి** (< అర + గాడి) ఉ. అరగాణి, అరగాని; పర్యా. చెరువుగర్భం, చెరువుతొట్టి, చెరువుతొట్టు, తొట్టు గాడి. తటాకగర్భం; నీళ్ళు ఎక్కువలోతుగా ఉండే చెరువు నడిమిభాగం. చెరువు లోపలివైపుకు 'అర-' అనే పేరుండ వచ్చు. చేతిలోతట్టుకు 'అరచెయ్యి' అన్నట్టు; చూ. అర (కో. 1–3, 5, 6, 15; రా. 1).

**అలవ** ఏతం తొక్కే మనిషి పడకుండా పట్టుకోటానికి పక్కన కట్టిన వెదురుదడి. చూ. చిత్రం 3. 9 (కో. 13).

**అలుగు** (1) రూ. అలువు(కొమ్ము), అల్గు; పర్యా. కడగొమ్ము, కలుజు, కళింగ, కొమ్ముకళింగ, కోడి, చెరువు కొమ్ము, పొర్లు, మత్తడి, మరగొమ్ము, మరుగు, మొరవ, మొరవగొమ్ము, వాలాటం, వాలుగొమ్ము. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర కట్టిన రాతికట్టడం; కొన్నిచోట్ల తలుపులుంటాయి. (కో. 3, 4, 6, 7, 9, 10, 14, 15, 26, 29, 31; తె. 1, 6–9, 12, 14, 24, 26, 27, 31, 33–36, 38, 40, 42; రా. 2, 7, 20, 22, 24, 27); (2) పర్యా. చూ. చప్పిడి. పొలంలో పడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా పల్లంగా ఉన్నవైపు గట్టు చివర కట్టిన రాతికట్టడం; చెరువుకు అలుగులాగానే పొలానికి ఇది గూడా: దీనివల్ల పొలంలోని సారవంతమైన మన్ను పోకుండా పొలంలోనే నిలుస్తుంది (తె. 4; రా. 24–26).

**అలువు (కొమ్ము)** చూ. అలుగు (కో. 42).

**అల్గు** చూ. అలుగు (తె. 13, 15, 16, 19, 20, 25, 28).

**అవుజుమొత్త** పర్యా. చూ. పెంటిదోనె. దోనెమలుపు తరువాత ఉన్నభాగం; దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (తె. 10).

**ఉ.** = ఉచ్చారణభేదం (-భేదాలు); కో. = **కోస్తాజిల్లాలు; చూ.** = **చూడు**; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం(-**పదాలు**); బహు. = బహువచనం; రా. = **రాయలసీమ; రూ.** = **రూపాంతరం; విశే.** = విశేషణం; హిం. = **హిందుస్తానీ.**

**ఆటకర్ర** ఉ. ఆటకర్ర ; పర్యా. చూ. నిడె. ఏతంలో ఒకభాగం, మనిషి తొక్కే (లేక లాగే) ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 46 ; తె. 39).

**ఆటమాను** పర్యా. చూ. నిడె. ఏతంలో ఒకభాగం ; మనిషితొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 44).

**ఆనుగర్ర** పర్యా. చూ. పట్టుగడ. ఏతం తొక్కేమనిషి కిందపడకుండా ఊతకోసం పెట్టుకొనే కర్ర. చూ. చిత్రం 3 క. 9 (రా. 18).

**ఆనుగుంజ** పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్ది మీద కొమిరె (నిలువుగుంజ) కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య ; రెండు కొమిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (తె. 10).

**ఆవ** పర్యా. సాగరం. పెద్దచెరువు. సంవత్సరం పొడు గునా నీరుండే చెరువు (కో. 29, 40).

**ఇరుసు** (1) ఉ. ఇర్సు ; పర్యా. కండెనకట్టె. నిడె (ఏతపుమాను) మధ్యగుండా పంగలకర్రలగుండా కొమిరెలకు గాని బిగించిన అడ్డపుల్ల ; ఇది ఆధారంగా నిడె, పైకి కిందికి రావటానికి (తొక్కటానికి) వీలవుతుంది. చూ. చిత్రం 3 క. 3 (కో. 4, 15, 37, 46–51 ; తె. 11, 12, 24, 25, 34 35, 39, 42); (2) పర్యా. చూ. కండెనకట్టె. మోటబిళ్ళ (గిలక) ఇరుసు. చూ. చిత్రం 2 చ. 5 (కో. 44 ; తె. 10, 20, 24, 25, 37; రా. 16).

**ఈదరకాలవ** చెరువుగట్టుపక్కగా పొయ్యే కాలవ (కో. 4).

**ఉక్కడం** ఉ. ఉక్కడం (బహు. ఉక్కడాలు, ఉక్కటాలు); పర్యా. కణువారు. మోటగూనకి (=తోలుతో చేసింది) వలిగానికీ కలిపివేసిన తోలుకుట్టు (కో. 11 ; రా. 15).

**ఉగి** పర్యా. చూ. ఊట. నేలలో ఊరే నీరు (తె.26).

**ఉగ్గపుతాడు** (1) పర్యా. చూ. చెలివితాడు. మోట తొండం చివర రెండువైపులా రంధ్రాలు వేసి దూర్చేతాడు; తొండపుతాడును దీనికి తగిలిస్తారు. చూ. చిత్రం 2 త. 9 (కో. 22, 23); (2) పర్యా. మోరతాడు. గూడమూతికి అటూ ఇటూ కట్టినతాడు. చూ. చిత్రం 4.4 (కో. 21).

**ఉంగరం** పర్యా. చూ. తూము. మోటబొక్కెనపైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (తె. 5, 37; రా. 4, 15, 28).

**ఉజ్జి** చూ. ఉద్ది (కో. 17, 18).

**ఉద్ది** రూ. ఉజ్జి; పర్యా. అదరు, ఎదపురి, ఒట్టు, గుట్ట, గూడు, దుసవు, దొరువు, పురి, మత్త, మత్తడి, ములుగు, మూలమత్త, మోటకట్ట, మోటమత్త, మోటు. (1) మోట బావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళు తోడిపోసేవైపు ఎత్తుగా కట్టినకట్ట. చూ. చిత్రం 2 ట. 1; (2) మోటలాగే ఎద్దులు బారిపైకి ఎక్కివచ్చి నిలిచేచోటు. చూ చిత్రం 2 క. 11 (కో. 4, 6, 7, 9, 11; తె. 3; రా. 1, 18, 22, 28).

**ఉద్దుగాలవ** పొలం గట్టులోపల పారే కాలవ (కో.4).

**ఉరుగాలవ** ఉ. ఊరుగాలవ. పర్యా. చూ. బోదె[1] పొలానికి నీళ్ళుపెట్టే కాలవ (కో. 2, 4, 5).

**ఊట** పర్యా. ఉగి, జెల. భూమిలోనుంచి ఊరే నీరు (కో. 41, 51; తె. 1, 22, 24, 28, 30, 32, 38: రా. 14–16, 18);-**కాలవ** ఉ. ఊటకాలువ, ఊటకాల్వ; పర్యా. ఊటగడ్డ, ఊటజాలు, ఊటవర్రె (ఊటొర్రె), కసింకాల్వ, జాలుకాల్వ, తలిపెకాల్వ, బుగ్గకాల్వ. ఊటనీటికాలవ (రా. తె);-**గడ్డ** ఉ. ఊటగెడ్డ. కొండలమీదనుంచి పారే ఊటనీటికాలవ (కో.);-**గుమ్మి** ఊటనీళ్ళగుంట; దీనినుంచి గూడతో పొలాలకు నీళ్ళుతోడతారు. (కో.);- **జాలు** ఊట నీటి కాలవ (తె);-**బట్టె** ఊటనీటి కాలవ (కో.);-**వర్రె** ఊటనీటికాలవ (తె.).

**ఊటుగాలవ** రూ. ఊరుగాలవ. మాగాణి మడినుంచి నీళ్ళు బయటికిపోయేదారి; మురికినీళ్ళకాలవ (కో. 2–5).

**ఊదుగుంజ** ఉ. ఊదగుంజ; యా. ఊదుడుగుంజ; పర్యా. అనుగుంజ. జింకగుంజ, తన్నుగర్ర, తన్నుగుంజ, తన్నుడుగుంజ, పొట్టుకొయ, పోటీగుంజ, పోటుగుంజ, పోటుగొయ్య, పోటుచిమ్ము, బెట్టుగుంజ. మోటబావి ఉద్దిమీద కొమిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య; రెండు కొమిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (కో. 7, 14; రా. 14, 16, 17).

**ఊదుడుగుంజ** ఉ. ఊజుడుగుంజ: చూ. ఊదుగుంజ (కో. 4, 6, 8).

**ఊరుగాలవ** చూ. ఊటుగాలవ (కో. 6).

**ఎక్కుడుబారి** పర్యా. చూ. ఎగుబారి. ఒకసారి మోట లాగింతరవాత ఎద్దులు మోటబావివైపు ఎక్కివెళ్ళేదారి. చూ. చిత్రం 2 క. 8 (కో. 8; రా. 16).

**ఎగుబారి** ఉ. ఎగుబారి; పర్యా. ఎక్కుడు–, చుట్టు–తిరుగుడు–, మలకవ–, వెనక–, వెలి–. ఒకసారి మోట లాగింతరువాత ఎద్దు మోటబావివైపు ఎక్కివెళ్ళేదారి. చూ. చిత్రం 2 క. 8 (రా. 2, 47).

**ఎడకాల్వ** రెండుమళ్ళ మధ్యగుండా పారేకాలవ (రా. 19, 20).

**ఎత్తం** చూ. ఏతం (తె. 1).

**ఎత్తుమోట** ఏటికాలవకు ఉద్దిగట్టి తోలేమోట (తె.1).

**ఎదదోని** పర్యా. చూ. పోతుదోనె. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించేచోటు; దోనెమొదలు. చూ. చిత్రం 2 క. 1 (తె. 1).

**ఎదపురి** పర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ.

వాటినుంచి నీళ్ళుతోడ పోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట. చూ. చిత్రం 2 ట. 1 (రా. 16, 17).

**ఎదురుగొలుసు** పర్యా. చూ. కుంటెన. పొడుగు చాల నప్పుడు మోటమోకు చివర అతికే తాడుముక్క (తె. 29, 32, 33).

**ఎదురుచిత్త** పర్యా. చూ. కుంటెన. పొడుగు చాల నప్పుడు మోటమోకు చివర అతికే తాడుముక్క (రా. 22).

**ఎదురుతుండు** పర్యా. చూ. కుంటెన. పొడుగుచాల నప్పుడు మోటమోకు చివర అతికే తాడుముక్క (కో. 9).

**ఎద్దుతొక్కు** ఉ. ఎత్తొక్కు, ఎద్దొక్కు, ఎద్దోకు; పర్యా. చూ. ముక్కరమాను. కొమిరెకి ఆధారంగా మోట దోనెపక్కగా బావివైపు చొచ్చుకువచ్చిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (తె. 8, 33–39, 42).

**ఎల్లదోనె** పర్యా. చూ. పోతుదోనె. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు; దోనెమొదలు. చూ. చిత్రం 2క. 1 (తె. 5, 7).

**ఏగర** (బహు. ఏగర్లు); పర్యా. చూ. పిల్లకాలవ. పంటకావలనుంచి చీలేకాలవ; కొన్ని పొలాలకు మొత్తంగా నీళ్ళుసరఫరా చేసేది (కో. 2).

**ఏటికాలవ** ఉ. ఏటికాలువ. ఏటినుంచి చెరువుకుగాని పొలాలకుగాని తీసినకాలవ (కో. 40, 45; రా. 1, 2, 6, 8, 14, 18 – 20).

**ఏడె** పర్యా. బారిగడ్డ. దిగువారిలో ఎడ్లు నడిచే రెండుదారుల మధ్య భాగం; బారినడిమి. చూ. చిత్రం 2 క. 9 (తె. 6– 9).

**ఏతపుమాను** చూ. ఏతంమాను (కో. 13; తె.36).

**ఏతం** ఉ. ఆతం; రూ. ఎత్తం, ఏతాం; పర్యా. తలుము. పొలాలకు నీళ్ళుతోడే ఏటవాలుకొయ్య యంత్రం. చూ. చిత్రం 3 (కో. 3, 6, 11, 13, 15, 17, 39, 42, 43; తె. 11-13, 15-17, 19–28, 33, 34, 42; రా. 2-4, 18); **-బారు** పర్యా. చూ. నిడె. ఏతంలో ఒకభాగం; మనిషి తొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (తె.); **-మాను** రూ. ఏతపుమాను, ఏతాంమాను; చూ. ఏతంబారు (రా.).

**ఏతాం** చూ. ఏతం (కో. 4, 5, 14, 16, 37, 44, 46-48; తె. 26, 27, 30, 31, 34-36); **-మాను** చూ. ఏతంమాను (కో.).

**ఒట్టు** పర్యా. చూ. ఉద్ది. మోటలాగే ఎద్దులు బారిపైకి వచ్చి నిలిచేచోటు. చూ. చిత్రం 2 క. 11 (రా.15).

**ఒడికె** ఉ. ఒడికి; రూ. ఓడ్క, ఓర్క; పర్యా. కయ్య, గండవ, గండి, గాడి, లొయ్య, వందు. పొలంలో వాననీళ్ళు పారటంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి (తె. 1, 2, 6, 7; రా. 28).

**ఒడ్డు** పర్యా. చూ. కట్ట. పొలంలో పడ్డ వాన నీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా అడ్డుగా పోసే కట్ట (తె. 4, 12, 29; రా. 18, 28).

**ఒంటిగూన** పర్యా. ఒంటిమోట. బావికి ఒకవైపే కట్టి తోలే మోట (రా. 18).

**ఒంటిమోట** పర్య. ఒంటిగూన. బావికి ఒకవైపే కట్టి తోలే మోట; చూ. సంగడిమోట (తె. 5, 29, 32).

**ఒండ** ప్రవాహ వేగంవల్ల ఏటిగట్టుకు ఏర్పడ్డ కోత (కో. 50).

**ఓడ్క** చూ. ఒడికె (తె. 9, 10, 35).

**ఓర్క** చూ. ఒడికె (తె. 4, 5).

**కక్కుదోనె** రూ. కక్కుడుదోనె; పర్యా. చూ. పోతుదోనె. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు; దోనె మొదలు. చూ. చిత్రం 2 క. 1 (తె. 32).

**కక్కుడుదోనె** చూ. కక్కుదోనె (తె. 33).

**కక్కుడుమొత్త** పర్యా. చూ. పోతుదోనె. మోట బొక్కెన నీళ్ళు కుమ్మరించేచోటు; దోనె మొదలు. చూ. చిత్రం 2 క. 1 (తె. 10).

**కట్ట** రూ. కట్టవ; పర్యా. ఒడ్డు, కతవ, కోపు, దట్టి, నట్టు, పొలు, బందం. పొలంలో పడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా మధ్య వేసిన మట్టికట్ట (కో. 13, 15, 24; తె. 2, 5, 7–9, 11, 14-16, 19, 21, 25-28, 31, 32, 34, 36-39; రా. 7, 9, 12, 15-18, 20, 21, 23, 25).

**కట్టవ** చూ. కట్ట (రా. 5, 6, 24).

**కట్టు** పర్యా. చూ. నలిగం. మోటబొక్కెనపైన ఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (కో. 6, 9, 11, 14; రా. 27); **-కాలు** పర్యా. చూ. నీసుకాలు. వలిగానికి వేసిన అడ్డచువ్వ. చూ. చిత్రం 2 త. 3 (రా.).

**కట్టుకాలవ** ఉ. కట్టుకాల్వ, కట్టుగాల్వ; పర్యా. పరవ. చెరువుకు నీళ్ళువచ్చే కాలవ (కో. 23; తె. 15, 17, 27).

**కట్టెచొరవ** ఉ. కట్టెసొరవ; పర్యా. కట్టెపురి. కొయ్యలతో కట్టిన మోటబావి ఉద్ది. చూ. పురి (తె. 5).

**కట్టెపురి** పర్యా. కట్టెచొరవ. కొయ్యలతో కట్టిన మోటబావి ఉద్ది; చూ. పురి (తె. 1, 6, 12, 33, 35-37).

**కడగొమ్ము** (1) పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువగా ఉన్న నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర కట్టిన రాతికట్టడం (రా. 22); (2) పర్యా. చూ. చప్పిడి. పొలంలో పడ్డ వాననీళ్ళు పొర్లిపోవటానికి పొలంగట్టు చివర పల్లంగా ఉన్నవైపు కట్టిన రాతికట్టడం;

చెరువుకు అలుగు లాగానే పొలానికి ఇది గూడా (రా. 22).

**కడితునక** పర్యా. చూ. దవడరాయి. మోటబావి దోనెకు రెండువైపులా నిలబెట్టిన బండ (లు). చూ. చిత్రం 2 ట. 7 (తె. 9).

**కడెం** (1) పర్యా. చూ. తూము. మోటబొక్కెన పైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం. 2 త. 4 (తె. 5, 6, 36, 42 ; రా. 3, 5, 8); (2) పర్యా. చూ. వలిగం. మోటబొక్కెన పైన ఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (కో. 18, 19, 22–24 ; తె. 42); (3) పర్యా. చిక్కెం. గూడనడుముకు వేసిన తాడుకట్టు. చూ. చిత్రం 4. 4 (కో. 17).

**కణువారు** పర్యా. ఉక్కడం. మోటగూనకీ (తోలుతో చేసింది) వలిగానికీ కలిపి వేసిన తోలు కట్టు (రా. 16).

**కంటు** సిడె (ఏతపుమాను) చాలకపోతే వేసిన అతుకు; రెండు కొయ్యముక్కలు సిడెగా అతికినచోటు (కో. 14).

**కంపెదూలం** రూ. గండెదూలం; పర్యా. అడ్డుగమ్మ, అదరుమాను, అదారు, కంపెబారు, కంపెమాను, నీరుగడ్డి, పందిమాస. ఉద్దిలేని మోటబావి మీద గాని, ఏతపు బావిమీదగాని అడ్డంగావేసిన పట్టె. చూ. చిత్రం 3 క. 10 (కో. 24 ; తె. 41).

**కంపెబారు** పర్యా. చూ. కంపెదూలం. ఉద్దిలేని మోటబావిమీద గాని, ఏతపుబావిమీద గాని అడ్డంగా వేసిన పట్టె. చూ. చిత్రం 3 క. 10 (తె. 37-39).

**కంపెమాను** పర్యా. చూ. కంపెదూలం. ఉద్దిలేని మోటబావిమీద గాని, ఏతపుబావి మీద గాని అడ్డంగావేసిన పట్టె. చూ. చిత్రం 3 క. 10 (తె. 36).

**కతవ** 1 పర్యా. చూ. బోదె 1. పంటకాలవ నుంచి పొలానికి తీసిన కాలవ (తె. 9, 35).

**కతవ** 2 (1) పర్యా. చూ. పూన. వాగుకు కట్టిన ఆనకట్ట; అక్కడనుంచి పంటపొలాలకు కాలవ మళ్ళిస్తారు (తె. 38); (2) పర్యా. చూ. కట్ట. పొలంలో పడ్డ వాన నీళ్ళకు మట్టికొట్టుకుపోకుండా అక్కడక్కడ పోసిన కట్ట (లు) (కో. 11, 38 ; తె. 3 ; రా. 23, 26).

**కత్తప** చూ. కత్వాబల్ల (కో. 50).

**కత్తిరికాలు** ఏతపు(తాటి)దోనెకింద ఎత్తుకోసం వేసిన కఱ్ఱ. చూ. చిత్రం 3 క. 7 (కో. 39).

**కత్వా(బల్ల)** రూ. కత్తప; పర్యా. చూ. మదుం–. నీటిపారుదల అవసరంలేనప్పుడు తూము లేక మదుం రంధ్రానికి అడ్డంగా పైనించి దించిన కొయ్యపలక ; కొయ్యలాకు (కో. 33).

**కదం** ఉ. కదమ, కడుము; పర్యా. కుంచం, మానిక, సొంగ. మోటబానకు అడుగున తొండం కలిపే చోటు. చూ. చిత్రం 2 త. 6 (తె. 1, 5-7, 11, 34-39; రా. 1) ;**-బొక్కెన** అడుగున తూమున్న ఇనపబొక్కెన ; మోటపరికరం (తె.).

**కదురు** ఉ. కదురు, కద్రు ; పరా. పుల్లిరుసు. మోటబాన చివరి తొండపుతాడు నేలకు తగలకుండా జరగటానికి వీలుగా అమర్చిన కొయ్యగిలక. చూ. చిత్రం 2 ట. 6 (తె. 1, 3, 5-13, 19, 20, 22-29, 32-39, 42 ; రా. 1, 3, 7, 9, 22, 27, 28) ; **-కొక్కు** పర్యా. చూ. కుక్కగొయ్య. పుల్లిరుసు (కిందిగిలక) తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకువచ్చేట్టు వేసిన కొయ్య ; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 5 (తె.) ; **-కోల** ఉ. కదురుగోల, చూ. కదురు (కో. రా.).; **-కొండి** ఉ. కదురుగొండి ; చూ. కదురుకొక్కు (రా.). ; **-గొయ్య** (-కొయ్య) కదురుకొక్కు (తె. రా.) ; **-చిమ్మ** చూ. కదురుకొక్కు (తె.) ; **-చీల** చూ. కదురుమొల (తె.) ; **-చెవి** చూ. కదురుకొక్కు (తె. రా.); **-తొక్కు** చూ. కదురుకొక్కు (తె.) ; **-బెండు** చూ. కదురుమొల (తె.) ; **-మొల** పర్యా. కిదురుచీల, కదురుబెండు, మొలకాలు. కుక్కగొయ్యలమీద మోసే కదురు (పుల్లిరుసు) కొన. చూ. చిత్రం 2 ట. 7 (తె.).

**కందెనకఱ్ఱ** (1) పర్యా. ఇరుసు, గిర్కకట్టె, బిళ్ళకట్టె, బిళ్ళకడ్డీ, బిళ్ళచ్చు, బిళ్ళరుసు, సలాక. మోటబిళ్ళ (గిలక) ఇరుసు. చూ. చిత్రం 2 చ. 5 (తె. 5, 6, 8, 9, 12, 32–36, 38; రా. 22); (2) పర్యా. చూ. ఇరుసు. సిడె (ఏతపుమాను) మధ్యగుండా పంగలకఱ్ఱకుగాని కొమ్మెలకుగాని బిగించిన అడ్డపుల్ల ; ఇది ఆధారంగా సిడె, పైకి కిందికి రావటానికి (తొక్కటానికి) వీలవుతుంది. చూ. చిత్రం 3 క. 3 (తె. 12).

**కన్నికాలవ** : మిరప, తమిద, మొ. పైరుపొలాల్లో పారే చిన్న కాలవ (కో. 1).

**కన్ను** పర్యా. చూ. తలపరిగె. ఊటకాలవ పుట్టే చోటఉన్న గుంట లేక గొయ్యి, ఊట నీటిగుంట (రా. 15).

**కపిల** ఉ. కపిలి, కపిలె, కపిళె, కబిల, కవిల, కైల; పర్యా. మోట. ఎద్దులనుకట్టి బావినుంచి పొలాలకు నీరుతోడే సాధనం. చూ. చిత్రం 2 (కో. 1–7, 9, 12 ; రా. 1–4, 7–9, 11, 14–16, 18, 25) ; **-బావి** పర్యా. చూ. మోటబావి. నీళ్ళు తోడటానికి కపిల అమర్చిన బావి (కో. రా.) ; **-వాసం** పర్యా. చూ. నీరుకాలు. మోట బొక్కెన వలిగానికివేసిన అడ్డచువ్వ. చూ. చిత్రం 2 త. 3 (కో.).

**కప్పి** రూ. కప్పిసీ ; పర్యా. చూ. బిళ్ళ. మోటబావి గిలక. చూ. చిత్రం 2 చ. 4 (కో. 43).

**కప్పిసీ** ఉ. కప్సీ; చూ. కప్పి (కో. 37).

**కప్పుకాల్వ** తోటచుట్టూరా పారే కాలవ (రా. 6).

**కప్పుబండ** పర్యా. చూ. అడిబండ. మోటబావి లోపలివైపున్న సూదిమాకుల మీద అడ్డంగా వేసిన బండ లేక చాపరాయి. చూ. చిత్రం 2 ట. 3 (రా. 27).

**కయ్య** పర్యా చూ. ఒడికె. పొలంలో వాననీళ్ళు పారటంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి (తె. 15).

**కరుడుమొద్దు** : చూ. కొరుడుమొద్దు (రా. 15).

**కలుజు** ఉ. కల్జు, కంజు ; పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువగావున్న నీళ్ళు పొర్లి పోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర కట్టిన రాతికట్టడం (కో. 2-6, 15 ; రా. 10, 14).

**కవరు** ఏతపు కొమిరెకు చెక్కిన పంగల కొసలు (కో. 15).

**కళ్ళ** ? గూడగుంటకు నీళ్లవచ్చే కాలవ ; చూ. గూడ (రా. 3).

**కసరుకాల్వ** ఉ. కసురుకాల్వ ; పర్యా. కీటుకాల్వ. ఏటినుంచి తోటకు నీళ్లుపెట్టే కాలవ (రా. 19, 20).

**కసింకాల్వ** పర్యా. చూ. ఊటకాల్వ. ఊటనీటి కాలవ (రా. 3).

**కళింగ** రూ. (కొమ్మ) కళింగ ; పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువగా ఉన్న నీళ్లు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర కట్టిన రాతికట్టడం (కో. 23-36).

**కారుగడ్డ** చెరువు లోపలివైపు మిట్టగా ఉన్న భాగం ; ఈ 'గడ్డ' గూడా మునిగితే కారుపండుతుందని వాడుక ; చూ. నెద (కో. 3).

**కారెం** పర్యా. గాడెం, గేడెం, తొట్టేతం. మెరక పొలాలకు నీళ్ళుతోడే తాటిదోనె. చూ. చిత్రం 5 (కో. 26-36 ; రా. 18).

**కాలవ** ఉ. కాలువ, కాల్వ ; పర్యా. బద్దె. సమాస మధ్యంలో కొన్ని పదాల్లో గకారాదిగా వస్తుంది : -గాలవ -గాలువ, -గాల్వ. చెరువు, ఏరు, మొ. వాటి నుంచి మాగాణి పొలాలకు, తోటలకు నీళ్ళు సరఫరాచేసే మార్గం (కో. 1-6, 9, 10, 14-18, 21, 23-25, 27, 28, 31, 37, 39, 40, 44, 45 ; తె. 1, 2, 5, 6, 8, 13-17, 19-28, 31-34, 36, 38-42 ; రా. 1-3, 6-11, 14-20, 22, 23, 25-28). కాలవల్లో భేదాలు : ఈదర-, ఉద్దు-, ఉద్రు-, ఊట , ఊటు-, ఊరు-, ఎడ-, ఏటి-,కట్టు-, కన్ని-, కప్పు-, కసరు-, కసిం-, కీటు-, కుంట-, కొండజవురు-, కోలు-, గుంటి-, చీలు-, చీలుపు-, చెరువు-, జాలు-, తల-, తలిపె-, తీరు-, దొంపు-, పంట-, వంపు-, పర-, ప్రె-, పిల్ల-, పెద్ద-, బుగ్గ-, బోరు-, మడ-, మిట్ట-, రాజ-, రాయ-, రాస-, పంపు-, సందు-.

**కిందిరోలు** పర్యా. చూ. మానికవాయి. చెరువునీళ్లు బయటకి పోవటానికున్న తూముల్లో కిందిది. చూ. చిత్రం 1. 1 (తె. 23-28).

**కీటుకాల్వ** పర్యా. కసరుకాల్వ. ఏటినుంచి తోటకు నీళ్ళు తెచ్చే కాలవ (రా. 8).

**కుక్కగొయ్య** ఉ. కుగ్గొయ్య ; పర్యా. కదురు కొక్కు, కదురుకొండి, కదురుగొయ్య, కదురుచిమ్మ, కదురుచెవి, కదురుతొక్కు, కొక్కు, తొక్కు, పిల్లతొక్కు, ముక్కరచెవి, మొత్తకొయ్య. పుల్లిరుసు (కిందిగిలక) తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకు వచ్చేట్టు వేసిన కొయ్య ; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 5 (కో. 4, 8, 9, 11).

**కుంచతుండు** చూ. కుంచం (1) (రా. 3).

**కుంచం** (1) రూ. కుంచతుండు ; పర్యా. కరుడు మొద్దు, కొరుడుమొద్దు, కొల్డి, తూముతుండు, తూముమాను, తూముమొద్దు, పంతొల ; కొంచెం నిర్మాణభేదంతో, చూ. మదుం. నీటిపారుదల అవసరంలేనప్పుడు (చెరువు) తూము రంధ్రానికి అడ్డంగా వేసిన కొయ్యమొద్దు (కో. 39 ; రా. 3, 7) ; (2) పర్యా. చూ. కదం. మోటబానకు అడుగున తొండం కలిపేచోటు. చూ. చిత్రం 2 త. 5 (కో. 22) (3) పర్యా. చూ. తూము. మోటబొక్కెన పైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (తె. 11, 12, 29, 32, 33, 38).

**కుంట** పర్యా. గాత, గుమ్మి, దొరువు, పొనికె. మాగాణీ పంటలకు, తోటలకు నీళ్ళుపెట్టటానికి పొలంలో తవ్విన చిన్న జలాశయం (తె. 1, 5, 6, 13-16, 19-25, 27-29, 32-38 ; రా. 14, 18, 25).

**కుంటుకాల్వ** ? పొలంలో తవ్విన కుంటనుంచి తీసిన కాలవ (తె. 14 ; రా. 25).

**కుంటెన** ఉ. కుంటిని ; పర్యా. ఎదురుగొలుసు, ఎదురుచిత్త, ఎదురుతుండు, చేవార్నె. పొడుగు చాల నప్పుడు మోట మోకు చివర అతికే తాడుముక్క (కో. 7; తె. 10, 42 ; రా. 7, 8, 15).

**కుండకట్టు** పర్యా. చూ. పలిగం. మోటబొక్కెన పైన ఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (రా. 28).

**కుండమదుం** పర్యా. గూనతూము. కుమ్మరివాడు చేసిన మట్టిగొట్టాలతో అమర్చిన చెరువుతూము ; చూ. మదుం (కో. 40, 50).

**కుండి** చూ. కుంది (కో. 23).

**కుండు** వరాం. చూ. కుంది. (తె. 8).

**కుదువ** పర్యా. చూ. చప్పిడి. పొలంలో పడ్డ వాన నీళ్లు పొర్లిపోవటానికి పొలంగట్టు చివర పల్లంగాఉన్నవైపు కట్టిన రాతికట్టడం; చెరువుకు అలుగులాగానే పొలానికి ఇది గూడా (రా.6).

**కుంది** రూ. కుండి, కుండు; పర్యా. కొల్లు, తొట్టి, తొట్టికట్ట. చెరువు తూమునుంచి బయటకి వచ్చిన నీళ్ళు ఆపి పొలాలకు పెట్టటానికి తూము దగ్గర గచ్చుతోగాని, సిమెంటుతోగాని కట్టిన తొట్టి (కో. 18, 24).

**కుబసం(మాను)** చూ. కూసం (రా. 16).

**కుసుం(మాను)** చూ. కూసం (రా. 17).

**కూనతూము** పర్యా. చూ. ముసలవాయి. చెరువు నీళ్ళు బయటకి పోవటానికున్న తూముల్లో పైది. చూ. చిత్రం 1. 3 (తె. 16).

**కూసం** రూ. కుబసం-, కుసుం; పర్యా. చూ. కొమిరె. నిలువుగుంజ; దోర్నప్పట్టె కాధారంగా ఉండే నిలువుగుంజ; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 1 (కో. 9, 14; రా. 15, 25).

**కెఱుకు** పర్యా. చూ. చప్పిడి. పొలంలో పడ్డ వాన నీళ్ళు పొర్లిపోవడానికి పొలంగట్టు చివర పల్లంగాఉన్న వైపు కట్టిన రాతికట్టడం; దీనివల్ల పొలంలో మట్టి కొట్టుకు పోకుండా నిలుస్తుంది (తె. 10).

**కొక్కి** ఉ. కొక్కు; పర్యా. చూ. చెవి. (1). గిలకకు ఆధారంగా దోర్నప్పట్టెమీద బిగించిన చిన్నకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 6 (తె. 7, 8, 11, 32-36, 38); **-చెవి** ఉ. కొక్కిసెవు. చూ. కొక్కి (తె.)

**కొక్కు** పర్యా. చూ. కొక్కుగొయ్య. పుల్లిరుసు (కిందిగిలక) తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకువచ్చేట్టు వేసిన కొయ్య; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 2. ట. 5 (తె. 7).

**కొంజెర** పర్యా చూ. పిల్లకాలవ. పంటకాలవనుంచి తీసిన పిల్లకాలవ (కో. 45).

**కొండగడ్డ** ఉ. కొండగెడ్డ; పర్యా. చూ. కొండవాగు కొండమీదినుంచి పారే కాలవ (కో. 37, 46-51).

**కొండవాగు** పర్యా. కొండగట్టు, గుట్టజాలు, గుట్ట వర్ద, గుట్టవఱ్ఱె, గుట్టవాగు. కొండమీదనుంచి పారే కాలవ (రా. 18).

**కొండవాలాటం** కొండవాగు; ఈ నీటిని చెరువు లోకి పెడతారు (కో. 49).

**కొమిరె** (1) పర్యా. కుబసమ్మాను, కుసుమ్మాను, కూసం, గుజ్జు, గుజ్జుకొమ్మ, గుజ్జుగంబం, నిలువు, నిలువు కూసం, నిలువుగమ్మి, నిలువుగుంజ, నిలువుబిమ్మ, నీరు కాలు; మోటబావిపై దోర్నప్పట్టె కాధారంగాఉండే గుంజ; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం. 2 చ. 1 (కో. 43; తె. 11, 12, 19, 20, 24-29, 32-38); (2) పర్యా. గుజ్జు, గుజ్జుమాను, గుంజ, నాటుగుంజ, నిలువు, నిలువుగుంజ, నిలువుబట్టె, నిలువులాడి, బాతుడుమాను, బాదు, బాదుడు గుంజ, మట్టుచెక్క, మూలమాను, మొలమాను, రగడ గుంజ, రాటికొయ్య, రాడిమాను, రాడు, లాడు. సిడె (ఏతపు మాను) కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (తె. 11, 12).

**కొమ్ముకళింగ** చూ. కళింగ (కో. 23).

**కొరుడుమొద్దు** రూ. కరుడుమొద్దు; పర్యా. చూ. కుంచం. నీటిపారుదల అవసరం లేనప్పుడు (చెరువు) తూము రంధ్రానికి అడ్డంగా వేసిన కొయ్యమొద్దు (కో. 24).

**కొల్లు** పర్యా. చూ. కుంది. చెరువు తూమునుంచి బయటికి వచ్చిన నీళ్ళు ఆపి పొలాలకు పెట్టటానికి తూము దగ్గర గచ్చుతోగాని సిమెంటుతోగాని కట్టినతొట్టి (కో. 6,9); **-గుంట** పర్యా. చూ. అర. మోటదోనె నుంచి వచ్చిన నీరు నిలిచేచోటు ఈ అర దగ్గరనుంచి పొలానికి నీళ్ళు పోయే కాలవ ఉంటుంది (కో.).

**కొల్డి** పర్యా. చూ. కుంచం. నీటిపారుదల అక్కర లేనప్పుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంగావేసిన కొయ్య మొద్దు (రా. 17).

**కోడి** పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పరిచిన రాతికట్టడం (రా. 16, 17).

**కోనంకి** పర్యా. చూ. సిడె. ఏతంలో ఒక భాగం; మనిషితొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 5).

**కోనేరు** నాలుగువైపులా కట్టఉండి, దిగి నీళ్ళు తీసుకోటానికి మెట్లమర్చిన చిన్న చెరువు; నలచదరపు చెరువు; కొన్నిచోట్ల కోనేటినీటితోగూడా సాగుచెయ్యటం కద్దు (కో. 37, 40, 42, 46-48, 50).

**కోపు 1** పర్యా. చూ. కట్ట. వాన నీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా, పొలంలో అక్కడక్కడ అడ్డుగా వేసిన కట్ట(లు) (తె.4).

**కోపు 2** పర్యా. చూ. పడిద. చెరువులో తవ్విన గుంట లేక గాడి (కో. 25).

**కోలతర** : పర్యా. చూ. సిడె. ఏతంలో ఒకభాగం; మనిషితొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 49, 50).

**కోలుకాల్వ** పర్యా. చూ. పెద్దకాలవ. ఏటినుంచి తీసిన మొదటికాల్వ (తె. 1).

**కోలుమోటు** పర్యా. ఎత్తుమోట, బోరుకపిలె. ఏటికాలవకు

ఉద్దిగట్టి తోలేమోట (తె. 1, 34, 39).

**కోవ** మడితవ్వి పొడుగ్గావేసిన కట్ట (కో. 4).

**గజం** పర్యా. చూ. అడ్డచీల. ఏతపుబొక్కెన చెవికట్ల గుండా దూర్చే ఇనపచువ్వ; కొన్నిచోట్ల కర్ర. చూ. చిత్రం 3 చ. 2 (కో. 39).

**గడ** ఉ. గడె, గెడ; పర్యా. గై (కట్టె). ఏతపు బొక్కెన తగిలించే నిలువుగడ; దీని పైకొస సిడె (ఏతపు మాను) కు కడతారు. చూ. చిత్రం 3 క. 5 (కో. 2, 5, 13-15, 17, 37, 39, 43, 44, 46-48, 51; తె. 34-36, 42; రా. 18).

**గడ్డ** ఉ. గెడ్డ. కొండమీదినుంచి వచ్చే ప్రవాహం. వాననీళ్ళుగాని ఊటనీళ్ళుగాని; చెరువుకు నీళ్ళువచ్చే కాలవ; ప్రవాహవేగానికి నేలమీద ఏర్పడ్డ కోత (కో. 34, 39-51).

**గండవ** చూ. గండి (కో. 33).

**గండి** ఉ. గండె, గిండి, గెండి; రూ. గండవ; పర్యా. చూ. ఒడికె, మడవ. (1) చెరువుకట్టగాని, పొలంగట్టుగాని నీళ్ళ ఉరవడికి తెగినచోటు; (2) (మాగాణి) మడిగట్టు తెంపి నీళ్ళు పెట్టేదారి, మడవ; (3) పొలంలో వాననీటి పారుదలవల్ల ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి (కో. 14, 27, 29, 31, 32, 35, 36, 44, 50; తె. 5, 10, 27, 31, 41; రా. 1).

**గండెదూలం** చూ. కంటెదూలం (కో. 7; రా. 11).

**గనము** ఉ. గనం; పర్యా. చూ. పంటకాలవ. ఏటి నుంచిగాని పెద్దకాలవనుంచి గాని తీసిన చిన్నకాలవ; పంట కాలవ (తె. 7, 8).

**గరకచెక్క** పర్యా. చూ. దవడరాయి. మోటబావి దోనెకు రెండువైపులా నిలబెట్టిన బండ(లు). చూ. చిత్రం 2 ట. 7 (తె. 37).

**గల్లెదోనె** పర్యా. చూ. పెంటిదోనె. దోనె మలుపు తరవాత ఉన్న భాగం; దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (తె. 5, 7).

**గల్మ** పర్యా. చూ. మడవ. మాగాణి పొలంలో ఒక మడి నుంచి ఇంకోమడికి నీళ్ళు పోవటానికి కట్ట తెగ్గొట్టి చేసిన దోవ (తె. 26, 27).

**గాడి** (1) పర్యా. చూ. మానికవాయి. చెరువు నీళ్ల బయటకి పోవటానికున్న తూముల్లో కిందిది. చూ. చిత్రం 1. 4 (తె. 11, 14, 15, 19, 20); -మొద్దు చెరువు కున్న కింది తూము మూసే మొద్దు (తె.); (2) పర్యా. చూ. ఒడికె. పొలంలో వాననీళ్ల పారటంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి (కో. 20).

**గాడెం** పర్యా. చూ. కారెం. మెరకపొలాలకు నీళ్ల తోడే థాటిదోనె. చూ. చిత్రం 5 (తె. 13, 28, 33, 37, 38).

**గాత** పర్యా. చూ. కుంట. మాగాణి పంటలకు, తోటలకు నీళ్లు పెట్టడానికి పొలంలో తవ్విన చిన్న జలాశయం (కో. 40).

**గాపతాడు** రూ. గాబతాడు; పర్యా. చూ. తొండపు తాడు. మోటబొక్కెన తొండానికి కట్టినతాడు. చూ. చిత్రం 2 త. 10 (రా. 9).

**గాబతాడు** చూ. గాపతాడు (కో. 7).

**గారె** పర్యా. చూ. బిళ్ళ. మోటబావిగిలక. చూ. చిత్రం 2 చ. 4 (తె. 19, 20, 22).

**గిరక** ఉ. గిర్క, గిర్కె; చూ. గిలక (తె. 13, 19, 22-24, 27, 28); -కట్టె పర్యా. చూ. కండెనకట్టె. మోటబిళ్ళ (గిలక) ఇరుసు. చూ. చిత్రం 2 చ. 5 (తె.); -పట్టె పర్యా. చూ. దోర్నపట్టె. మోటబావి కొమిరె (నిలువుగుంజ) ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (తె.).

**గిలక** రూ. గిరక, గిరె; పర్యా. చూ. బిళ్ళ. మోటబావి గిలక. చూ. చిత్రం. 2 చ. 4 (కో. 18, 44).

**గిరె** చూ. గిలక (తె. 25, 26).

**గుజ్జు** (1) పర్యా. చూ. కొమిరె (1). నిలువుగుంజ; దోర్నపట్టె కాధారంగా ఉండే నిలువు గుంజ; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (కో. 1, 3, 38; రా. 1-4, 7-9; -కొమ్మ చూ. గుజ్జు (రా.); -గంబం చూ. గుజ్జు (రా.); (2) పర్యా. చూ. కొమిరె (2). సిడె (ఏతపు మాను) కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 46; రా. 4); -మాను చూ. గుజ్జు (కో.).

**గుట్ట** పర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ. వాటి నుంచి నీళ్ళుతోడి పోసేవైపు ఎత్తుగా కట్టినకట్ట. చూ. చిత్రం 2 ట. 1 (రా. 15).

**గుట్టజాలు** పర్యా. చూ. కొండవాగు. కొండమీది నుంచి వచ్చే వాననీళ్ళ ప్రవాహం (తె. 24, 26).

**గుట్టవర్ద** పర్యా. చూ. కొండవాగు. కొండల్నుంచి పారే నీళ్ల ప్రవాహం (తె. 16).

**గుట్టవర్రె** ఉ. గుట్టఅర్రె; పర్యా. చూ. కొండవాగు. కొండలమీదినుంచి పారే చిన్నవాగు (తె. 20, 22).

**గుట్టవాగు** ఉ. గుట్వాగు; పర్యా. చూ. కొండవాగు. కొండమీదినుంచి వచ్చే వాననీళ్ళ ప్రవాహం (తె. 17, 19, 21, 23, 28).

**గుడారి** పర్యా. చూ. దోనె. మోటబొక్కెన కుమ్మరించిన నీళ్లపోయే దారి లేక కాలవ (కో. 19).

**గుడ్డబొండేం** చిక్కంకట్టిన ఒకరకం మోటబొక్కెన (కో. 38).

**గుంటికాలవ** రెండు పొలాల మధ్య పారే కాలవ (కో. 1, 9 ; తె. 1).

**గుండగొయ్య** పర్యా. చూ. తూము. మోట బొక్కెన పైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (తె. 36, 39).

**గుండి** పర్యా. చూ. తూము. మోటబొక్కెనపైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (రా. 2).

**గుండు** ఉ. గుండ ; పర్యా చూ. వలిగం. మోట బొక్కెన పైన ఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (కో. 1, 3, 4, 7, 8 ; రా. 2–5, 11, 25) ; **-కాలు** (బహు.-కాళ్లు); పర్యా. చూ. నీరుకాలు, మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (రా.) ; **-లంగరు** చూ. గుండుకాలు (రా.).

**గుత్తిజిల్ల** పర్యా. చూ. చిల్ల (1). మోటబొక్కెన తూము (=వలిగానికున్నది)లో దూర్చి మోకు జారకుండా వేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 2 త. 5 (రా. 5).

**గుదిజిల్ల** పర్యా.చూ. చిల్ల (1). బొక్కెన తూము (=వలిగానికున్నది) లో దూర్చి మోట మోకు తగిలించే కొయ్యముక్క. చూ. చిత్రం 2 త. 5 (రా 8, 14, 27, 28).

**గుంజ** పర్యా. చూ. కొమిరె (2). సిడె (ఏతపుమాను) కు ఆధారంగా నేలతో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 2; తె. 11, 13, 20, 24–28, 33, 34, 37, 39, 42).

**గుమ్మి** ఉ. గుమ్మె ; పర్యా. చూ. కుంట. మాగాణి పంటలకు, తోటలకు నీళ్లు పెట్టటానికి పొలంలో తవ్విన చిన్న జలాశయం ; గుంట, గొయ్యి (కో. 46–49,51).

**గుర్రపురాయి** పర్యా. చూ. చొరవ. మోట ఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ ; ఇటువంటివి రెండుగాని, మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (తె. 10 ; రా. 25, 28).

**గూగుళ్ళు** చెరువు లోపలివైపు కొంత మెరకన ఉన్న రాళ్లు ; అవి మునిగేవరకు నీళ్లువస్తే 'గూగుళ్లు మునిగినాయ్' అంటారుట; చూ. సెద (కో. 3).

**గూటిబండ** పర్యా. చూ. అడిబండ. మోటబావి లోపలివైపున్న సూదిమాకుల మీద అడ్డంగా వేసిన బండ లేక చాపరాయి. చూ. చిత్రం 2 ట. 3 (కో. 9).

**గూడ** రెండువైపులా తాళ్ళు కట్టిన వెదురుబద్దల బుట్ట. ఈ తాళ్ళు చెరొకవైపూ ఇద్దరు మనుషులు పట్టుకొని పల్లంలో ఉన్న నీళ్ళు మెరకపొలాలకు తోడిపోస్తారు. చూ. చిత్రం 4 (కో. 3–7, 9, 12, 17, 18, 21, 33, 37, 39–51 ; తె. 1, 4–6, 9, 11–13, 15, 16, 19, 20, 26, 29, 32, 33, 37–39, 42 ; రా. 3, 4, 7, 14, 18 ; **-కొమ్ము** పర్యా. -చెవి, మట్టు, మడమ, మూతికట్టు, మోరు. గూడకు పైవైపు తాడు కట్టేచోటు. చూ. చిత్రం 4. 2 (తె.) ; **-గుంట** ఉ. గూడగుంత ; పర్యా -పర్రె. బావి, -బొంద, రేవు, మొల్లం. గూడతో పొలాలకు నీళ్లు తోడే గుంట (కో. రా.) ; **-చెవి** చూ. గూడకొమ్ము (కో.); **-చేట** పర్యా. -తట్ట, -బుట్ట. వెదురుతో అల్లిన బుట్ట. చూ. చిత్రం 4. 1 (తె. రా.) ; **-చేరు** చూ. గూడతాడు (కో. తె.) ; **-తట్ట** చూ. గూడచేట (తె.) ; **-తడప** చూ. గూడ తాడు (కో.) ; **-తాడు** పర్యా. -చేరు, -తడప, -దారం, పగ్గం, పట్టుదాడు ; చూ. మోరతాడు. గూడవేసే మనిషి పట్టుకోవటానికి గూడచేటకు కట్టిన తాడు ; ఇవి రెండు వైపులా రెండుంటాయి. చూ. చిత్రం 4, 3, 5 (కో. తె. రా.) ; **-దారం** చూ. గూడతాడు (రా.) ; **-పగ్గం** చూ. గూడతాడు (తె.); **-పర్రె** చూ. గూడగుంట (తె.) ; **-బావి** చూ. గూడగుంట (రా.) ; **-బుట్ట** ఉ. బుట్టి ; చూ. గూడచేట (తె.) **-బొంద** చూ. గూడగుంట (కో. తె.) ; **-రేవు** చూ. గూడగుంట (తె. రా.) ; **-వేయు, -వేత** గూడతో నీళ్లు తోడటం (కో. తె.).

**గూడు** పర్యా. చూ ఉద్ది. ? మోటలాగే ఎద్దులు జారిపైకి ఎక్కివచ్చి నిలిచేచోటు. చూ. చిత్రం 2 క. 11 (రా. 27, 28).

**గూన** (1) పర్యా. చూ. బొక్కెన. మోటగట్టి నీళ్లతోడే పరికరం ; ఇది తోలుదిగాని ఇనపదిగాని కావచ్చు. చూ. చిత్రం 2 త. (తె. 44; రా. 7); (2) పర్యా. చూ. బొక్కెన ఏతంతో నీళ్లతోడే పాత్ర ; దీన్ని చెక్కతోగాని ఇనుముతో గాని చేస్తారు. చూ. చిత్రం 3 త. (కో. 39, 42, 44, 46, 48, 49 ; రా. 18).

**గూనతూము** పర్యా. కుండమదుం. మట్టిగొట్టాలతో వేసిన చెరువు తూము (తె. 6).

**గూబ** పర్యా. చూ. చెవి. ఏతపుబొక్కెన పైవైపున అడ్డచీల దూర్చటానికున్న రింగు ; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 3 చ. 1 (కో. 17).

**గేడం** చూ. గాడెం (తె. 11, 12).

**గేడిబండ** పర్యా. చూ. దవడరాయి. మోటబావి దోనెకు రెండువైపులా గేడిగా (నిలువుగా) వేసిన బండ(లు) చూ. చిత్రం 2 ట. 7 (రా 16).

**గై (కట్టె)** పర్యా. గడ. ఏతపుబొక్కెన తగిలించే నిలువుగడ ; దీని పైకొన సిడె (ఏతపుమాను) కు కడతారు. చూ. చిత్రం 3 క. 5 (తె. 11, 12, 20, 24–27, 33).

**గొణెం** (బహు. గొణేలు) పర్యా. చూ. నీరుకాలు. మోట బొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (తె. 10).

**చక్రం** పర్యా. చూ. బిళ్ళ. మోటబావి గిలక. చూ. చిత్రం 2 చ. 4 (కో. 38 ; రా. 2).

- చంకపాప పర్యా. చూ. తూము. మోటబొక్కెన పైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (తె. 39).

చదుము ఉ. సదుము; పర్యా. చూ. పెంటిదోనె. దోనెమలుపు తరవాత ఉన్నభాగం; దోనె సన్నగిల్లే భాగం చూ. చిత్రం 2 క. త (తె. 1).

చప్పిడి ఉ. చప్పుడు, చప్పట, చప్పిట; పర్యా. అట్టడి, అడ్డి, అలుగు, కడగొమ్ము, కుదువ, కెణుకు, గండి, నడవ, మత్తడి, మరవ, మెది, (రాయి)బిలుకు. పొలంలో పడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా పల్లంగాఉన్న వైపు గట్టుచివర కట్టిన రాతికట్టడం; ఇది చెరువు అలుగును పోలి ఉంటుంది (రా. 7, 14, 15, 18, 21).

చిక్కం పర్యా. కడెం. గూడ నడుముకు వేసిన తాడు కట్టు. చూ. చిత్రం. 4. 4 (కో. 17).

చిమ్మరతాడు చూ. చిమ్మెటతాడు (తె. 36).

చిమ్మ పర్యా. చూ. చౌరవ. మోటఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ. ఇటువంటివి రెండుగాని, మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (కో. 1, 4, 9, 18, 19, 22, 23, 25; తె. 1, 3, 6, 10, 20, 24- 26, 28, 29, 39).

చిమ్మెట పర్యా. ముక్కారు. మూగారు మోటతొండం చివర వేసిన రంధ్రం ఇటువంటివి. రెండుంటాయి; వీటిలోగుండా చెలివితాడు దూర్చి దానికి తొండపుతాడు తగిలిస్తారు. చూ. చిత్రం 2 త. 8 (తె. 1, 6, 7); -తాడు రూ. చిమ్మరతాడు; పర్యా. చూ. చెలివితాడు. మోటతొండం చివర రెండువైపులా రంధ్రాలు వేసి దూర్చేతాడు; తొండపుతాడును దీనికి తగిలిస్తారు. చూ. చిత్రం 2 త. 9 (తె.).

చిర(కట్టె) చూ. చిర్ర (తె. 1).

చిరత(పుల్ల) చూ. చిర్ర (తె. 1, 32).

చిర్ర రూ. చిర(కట్టె), చిరత(పుల్ల) గూడ తాటి చివర ఉన్న అడ్డపుల్ల; గూడవేసే మనిషి ఈ పుల్లను వేళ్ళ సందుల్లో దోపుకుంటాడు. చూ. చిత్రం 4. 6 (తె. 11, 12, 29, 32, 38, 39).

చిల్ల[1] (1) ఉ. జిల్ల, సిల్ల; రూ. చీల; పర్యా. గుత్తిజిల్ల, గుదిచిల్ల. మోటబొక్కెన తూము (= వలిగాని కున్నది)లో దూర్చి మోకు జారకుండా వేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 2 త. 5 (కో. 2, 6, 8, 11, 14; తె. 3, 29; రా. 1-4, 7, 11, 16, 17, 25,); (2) పర్యా. దూకుడుజిల్ల, దూజిల్ల, దూపుడుజిల్ల. మోట మోకు కొస వారెణలో దూర్చి తగిలించే కొయ్యముక్క; ఎద్దులు మోట లాగింతర్వాత చిల్లతీసి వాటిని మళ్ళీ బావివైపు నడిపించటానికి వీలవుతుంది. చూ. చిత్రం 2 క. 10 (కో. 1-8, 11, 14; తె. 3, 10-12, 29, 32, 33; రా. 1-5, 7, 8, 11, 14, 17, 25, 27, 28).

చిల్ల[2] పర్యా. చూ. పిల్లకాలవ పంటకాలవనుంచి చీలే చిన్నకాలవ (తె. 1, 6, 32).

చీల చూ. చిల్ల[1] (తె. 10, 29, 32, 33, 37-39).

చీలుగాలవ పర్యా. చూ. పిల్లకాలవ. పంటకాలవ నుంచి (తీసిన) చీలిన చిన్నకాలవ (కో. 6, 9, 10, 14, 16; రా. 7).

చుట్టుబారి పర్యా. చూ. ఎగుబారి. ఒకసారి మోట లాగింతరవాత ఎద్దులు మోటబావివైపు ఎక్కివెళ్లేదారి. చూ. చిత్రం 2 క. 8 (కో. 2).

చెరువు ఉ. చెర్వు, సెరువు. మూడువైపులా ఎత్తుగా కట్టఉండి నాలుగోవైపు నీళ్ళు రావటానికి దారిఉన్న జలాశయం (కో. 2-7, 9, 10, 14, 15, 18, 23-26, 28, 29, 31, 33, 34, 37-42, 44, 46-50; తె. 1, 4-9, 11, 15, 19, 26-29, 31-42; రా. 1-5, 7, 8, 11, 14-18, 20, 22, 23, 25-28); -కట్ట రూ. చెరువుగట్టు. చెరువు చుట్టూరా ఉన్నగట్టు (కో. తె. రా.);- కాలవ చెరువులోకి నీళ్ళుతెచ్చేకాలవ, చెరువునుంచి పంటపొలాలకు పెట్టేకాలవ (కో. తె. రా.); -కొమ్ము పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లి పోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరిచిన మార్గం (కో.); -గట్టు చూ. చెరువుకట్ట (కో.); -గర్భం, -తొట్టి, తొట్టు పర్యా. చూ. అరగాణి. నీళ్ళు నిలిచే చెరువులోపలి భాగం (కో.).

చెలమ ఉ. చెలవ, సెలవ; రూ. చెల్మె. నీరూరే చిన్న గుంట; నీరింకిన ఏటిలో చెలమ(లు) తీసి ఒడ్డునఉన్న పొలాలకు నీళ్ళు పెడతారు (కో. 17, 36, 46, 51; రా. 15); -కుంట ఏటిలో నీరెండిపోయినచోట తీసిన ఊట నీటికుంట: దీన్నుంచి ఏతంతో నీళ్ళు తోడతారు (కో.).

చెలవ(ల) మాను పర్యా. చూ. పలవగుంజ. సిడె (మనిషి తొక్కే ఏతపుకొయ్య)ను మోసే పంగలగుంజ. చూ. చిత్రం 3 క. 1 (కో. 47).

చెలివితాడు ఉ. చెలిమెతాడు; పర్యా. ఉగ్గపుతాడు. చిమ్మరతాడు, చిమ్మెటతాడు, దావారు, ముక్కరతాడు, ముక్కిడితాడు. మోటతొండం చివర రెండువైపులా రంధ్రాలు వేసి దూర్చేతాడు; తొండపు తాడును దీనికి తగిలిస్తారు. చూ. చిత్రం 2 త. 9 (తె: 25, 28, 29, 32).

చెల్మె చూ. చెలమ (తె. 28).

చెవి (1) ఉ. చెవు; పర్యా. కొక్కి, కొక్కిచెవి, చెవికట్టు, పంతె, పంతెకొక్కు, బిళ్ళకొక్కు, బిళ్ళచిమ్మ, బిళ్ళచెవి, బిళ్ళ, నిలువు, బొమ్మ. గిలకకు ఆధారంగా దోర్నెప్పబైమీద బిగించిన చిన్నకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 6. (కో. 1-9, 11, 14-17, 22-25;

తె. 22-23, 41 ; రా. 1-3, 5, 7, 8, 14, 27, 28) ; (2) పర్యా. గూబ, చెవికట్టు. ఏతపుబొక్కెనకు పై వైపున అడ్డబీల దూర్చటానికి ఉన్న రింగు ; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 3 చ. 1 (కో. 2, 4, 5, 14—16) ; **-కట్టు** ఉ. చెవుకట్టు, చౌకట్టు. చూ. చెవి (1) (2) (కో. తె.రా).

**చెవులపట్టె** పర్యా. చూ. దోర్నెప్పట్టె. మోటబావి కామిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (రా. 28).

**చేగూడ** పర్యా. చూ. సురిటిగూడ. ఒక మనిషి మాత్రమే వేసే గూడ (కో. 44).

**చేటలగూడ** రెండు చేటలు కలిపి కట్టిన గూడ ; చూ. గూడ (తె. 1, 32, 33, 42).

**చేబడితె** పర్యా. చూ. పట్టుగడ. ఏతంతొక్కే మనిషి పడకుండా పట్టుకోవటానికి పక్కన పాతిన కొయ్య. చూ. చిత్రం 3 క. 9 (తె. 35).

**చేవార్నె** పర్యా. చూ. కుంచెన. పొడుగుచాల నప్పుడు మోటమోకు చివర అతికేతాడు ముక్క (రా. 27).

**చౌరమాను** ఉ. సొరమాను ; పర్యా చూ. చౌరవ. మోటఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి మొద్దు ; ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (కో. 1).

**చౌరవ** ఉ. చరవ, సొరవ : రూ. చౌరె ; పర్యా. గుర్రపురాయి, చిము, చౌరమాను, తాబేటిమాను, సూదితోక, సూదిమాకు, సూదిరాయి, సూదికడీ. మోటఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ ; కొన్నిచోట్ల మొద్దు; ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (కో. 3, 11, 25 ; తె. 1, 5, 7, 8, 33-38, 42; రా. 7, 27) ; **-రాయి** ఉ.సొరవరాయి; చూ. చౌరవ (రా.).

**చౌరె** ఉ. సొరె ; చూ. చౌరవ (తె. 12, 19, 20, 25-27, 32).

**జంజెడ** చూ. దండెండ (తె. 24).

**జంటగూన** పర్యా. సంగడిమోట. ఒకే బావికి రెండు వైపులా కట్టిన రెండు మోటలు (రా. 7).

**జవుకు** పర్యా. చూ. వాగు. వానలకు పొలకలో పారే నీటివాగు (రా. 4).

**జాలు** పర్యా. చూ. వాగు. వాన కురిసి పొలంలో పారే నీటివాగు ; కొండలమీదనుంచి వచ్చే ప్రవాహం (కో. 13, 15, 19, 23-25 ; తె. 7, 8, 14, 22, 27, 36, 39) ; **-కాల్వ** పర్యా. చూ. ఊటకాలవ (తె.).

**జింకగుంజ** పర్యా. చూ. ఊదుగుంజ మోటబావి ఉద్ది మీద కామిరెకు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య ; రెండు కామిరెలకూ రెండుంటాయి చూ. చిత్రం 2 చ. 2 (తె. 22).

**జీలు** పర్యా. చూ. వాగు. వానకురిసి పొలంలో పారే నీటి ప్రవాహం (రా. 24, 25).

**జెనిగె** పర్యా. చూ. తూము. మోటబొక్కెన పైన మోకు తగిలించే చిల్లదూర్చిన ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (తె. 34).

**జెల** పర్యా. చూ. ఊట. నూతిలోను ఏటి చెలమల్లోను ఊరేనీరు (తె. 41).

**జోన** రెండుకొండల మధ్యనుంచి పారేవాగు (కో. 37).

**తన్నుగర్ర** ఉ. తొన్నిగర్ర ; పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలువుగుంజ) కు పోటీపెట్టిన ఏటవాలుకొయ్య ; రెండు కామిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (కో. 22, 33).

**తన్నుగుంజ** రూ. తన్నుడుగుంజ ; పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలుకొయ్య ; రెండు కామిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (కో. 2, 24 ; రా. 1, 5, 27).

**తన్నుడుగుంజ** చూ. తన్నుగుంజ (కో. 1. 11).

**తలకసిం** పర్యా. చూ. తలపరిగె. ఊటకాలవ పుట్టే చోటఉన్న (తీసిన) గుంట; కాలవమొదలు (రా. 3).

**తలకాల్వ** పర్యా. చూ. పెద్దకాలవ. ఏటినుంచి తీసిన మొదటి పెద్దకాలవ (రా. 6, 7).

**తలంటురాయి** పర్యా. చూ. అడిబండ. మోటబావి లోపలి వైపున్న సూదిమాకులమీద అడ్డంగా వేసిన బండ లేక చాపరాయి. చూ. చిత్రం 2 ట. 3 (కో. 8).

**తలండ్లంబండ** పర్యా. చూ. అడిబండ మోటబావి లోపలివైపున్న సూదిమాకులమీద అడ్డంగావేసిన బండ లేక చాపరాయి. చూ. చిత్రం 2 ట. 3 (రా. 15, 16).

**తలపరిగె** రూ. తలపరిని, తలపెర ; పర్యా. కన్ను, కొంజెర, తలకసిం, బుగ్గ, మొగ. ఊటకాలవకు నీళ్ళవచ్చే చోట (నీళ్ళూరేచోట) ఉన్నగుంట లేక గొయ్యి ; నీళ్ళూరే చోట నిలవుండటానికి తీసిన గుంట ; కాలవ మొదలు (రా. 14, 16).

**తలపరిని** చూ. తలపరిగె (రా. 8).

**తలపెర** ఉ. తలిపిరి, తలిపెర ; చూ. తలపరిగె (రా. 18-20).

**తలిపెకాల్వ** పర్యా. చూ. ఊటకాలువ. ఊటనీటి కాలవ (రా. 18).

**తలుము** పర్యా. చూ. ఏతం. పొలాలకు నీళ్ళుతోడే ఏటవాలుకొయ్య యంత్రం. చూ. చిత్రం 3 (కో. 2).

**తాగాడి** (బహు. తాగాళ్ళు) పర్యా. తొక్కుడి, తొక్కు, తొక్కుకొయ్య, తొక్కుడు, తొక్కుడుగర్ర, నీరుకాలు, మట్టుకర్ర, నీళ్ళతో పైకివచ్చిన ఏతపు బొక్కెన అందుకొనే

మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య లేక రాయి; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 3 క. 8 (కో. 17, 18, 22, 44; తె. 39, 42).

**తాటిదోనె** పర్యా. చూ. బోదారి. తాటిమొద్దు తొలిచి ఏర్పరిచిన దోనె; మోటబావినీళ్ళు పొయ్యేదారి. చూ. చిత్రం (కో. 25).

**తాటిమదుం** తాటిమాను తొలిచి చేసిన చెరువు తూము; చూ. మదుం (కో. 40).

**తాబేటిమాను** పర్యా. చూ. చౌరవ. మోటకుద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి మొద్దు లేక బండ; ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (కో. 4).

**తిగి** పర్యా. పర. చెరువులోకి వాననీళ్ళు వచ్చేవైపు (తె. 13).

**తిరుగుడు** పర్యా. చూ. పుల్లిరుసు. మోటవాన చివరి తొండపుతాడు నేలకి తగలకుండా జరగటానికి వీలుగా అమర్చిన గిలక. చూ. చిత్రం 2 ట. 6 (కో. 43).

**తిరుగుడుకపిల** ఉ. తిరగడకపిల; పర్యా. తిరుగుడు మోట. ఎద్దులు మోటలాగుతూ దిగి బావివైపు తిరిగి పోవటానికి వేరేదోవ ఏర్పాటుచేసిన మోట ; దిగుబారి, ఎగుబారి వేరువేరుగా ఉన్న మోట (కో. 5; రా. 2).

**తిరుగుడుదోనె** ఉ. తిరుగుడుదోని ; పర్యా. చూ. పెంటిదోనె. దోనెమలుపు తరవాత ఉన్నభాగం; దోనె సన్నగిల్లేభాగం. చూ. చిత్రం 2 క. 5 (కో. 1).

**తిరుగుడుబారి** ఉ. తిరగడ-; రూ. తిరుగు-; పర్యా. చూ. ఎగుబారి. ఒకసారి మోటలాగింతరవాత ఎద్దులు మోట బావివైపు ఎక్కివెళ్ళేదారి. చూ. చిత్రం. 2 క. 8 (కో. 1, 3, 9, 11, 14, 18, 25; తె. 41; రా. 5, 22, 25, 28).

**తిరుగుడుమోట** పర్యా. తిరుగుడుకపిల. ఎద్దులు మోటలాగుతూ దిగి బావివైపు తిరిగిపోవటానికి వేరేదోవ ఏర్పాటుచేసిన మోట. దిగుబారి, ఎగుబారి వేరువేరుగా ఉన్న మోట (రా. 18, 28).

**తిరుగుబారి** చూ. తిరుగుడుబారి (కో. 7; రా. 7, 27).

**తీరవ** పర్యా. చూ. పిల్లకాలవ. పంటకాలవనుంచి చీలిన చిన్నకాలవ (రా. 3).

**తీరు** (-పీస) మడిలోకి నీళ్ళువచ్చే కాలవకంతకు (మడవకు) అడ్డంగాఉన్న మట్టి; దీన్ని పీకితే మడిలోకి నీళ్ళు వస్తాయి (రా. 8, 9, 19,) ; **-కాల్వ** పర్యా. చూ. బోదె. మాగాణిలో మడికి పెట్టిన కాలవ (రా.).

**తొట్టేతం** (తొట్టి+ఏతం); పర్యా. చూ. కారెం. మెరక పొలాలకు నీళ్ళుతోడే తాటిదోనె ; చూ. చిత్రం 5 (తె. 37).

**తురుము** ఎక్కువ వేగంతో వచ్చే కొండవాగు (కో. 37).

**తూము** (1) పర్యా. మదుం, మెదువు. చెరువునీళ్ళు వెలుపలికి పొయ్యే గొట్టం (కో. 2-7, 9, 10, 14, 18, 23-25, 31, 33, 34; తె. 1, 4, 6-9, 11-14, 16, 19, 20, 22, 24, 29, 31-42; రా. 1, 2, 4, 5, 7, 8, 11, 14-18, 22, 23, 25-28) ; **-తుండు** పర్యా. చూ. కుంచం. నీటిపారుదల అవసరం లేనప్పుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంగా వేసే కొయ్యమొద్దు (రా.) ; **-బండ** ఉ. తూంబండ; పర్యా. మెదువురాయి. నీటిపారుదల అక్కరలేనప్పుడు చెరువు తూముకు అడ్డంగా వేసిన బండ (తె.) : **-మాను** ఉ. తూమ్మాను. చూ. తూముతుండు (రా.) ; **-మొద్దు** ఉ. తూమ్మొద్దు; చూ. తూముతుండు (రా.); (2) పర్యా. ఉంగరం, కడెం, పంచెకడెం, పంచెవెవి, కుంచం, గుండకొయ్య, గుండి, జెనిగె, బొందగొయ్య, చంకపాప, మోట బొక్కెనపైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (కో. 3-6, 8, 9; తె. 3; రా. 1, 4, 9, 16, 17, 22, 25).

**తెండా** నిడె చివర బరువుకట్టి ఒక మనిషి మాత్రమే తోడే ఏతం ; చూ. చిత్రం 3 ట. (కో. 50, 51).

**తొక్కిడి** పర్యా. చూ. తాగాడి. నీళ్ళతోపైకి వచ్చిన ఏతపు బొక్కెన అందుకొనే మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య లేక రాయి. చూ. చిత్రం 3 క. 8 (కో. 16, 17).

**తొక్కు** (1) పర్యా. చూ. ముక్కరమాను. కామిరె (నిలువుగుంజ)కు ఆధారంగా అడుగున వేసిన బండ. చూ. చిత్రం 2 ట. 4 (తె. 7, 12, 29, 32); (2) పర్యా. చూ. కుక్కగొయ్య. పుల్లిరుసు (కింది గిలక) తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకువచ్చేట్టు వేసిన కొయ్య; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 5 (తె. 24-28); (3) పర్యా. చూ. తాగాడి. నీళ్ళతో పైకివచ్చిన ఏతపు బొక్కెన అందుకొనే మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య లేక రాయి; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 3 క. 8 (తె. 20, 42); **-గొయ్య** (-కొయ్య) చూ. తొక్కు (3) (రా.).

**తొక్కుడుగర్ర** పర్యా. చూ. తాగాడి. నీళ్ళతో పైకి వచ్చిన ఏతపు బొక్కెన అందుకొనే మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య. చూ. చిత్రం 3 క. 8 (కో. 39; తె. 27).

**తొక్కుడుదిమ్మ** ఉ. తొక్కుడుదిమ్మె; పర్యా. చూ. ముక్కరబండ. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకువచ్చిన రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (తె. 5, 9).

**తొక్కుడుమాను** పర్యా. చూ. సిడె. ఏతంలో ఒక భాగం; మనిషి తొక్కే లేక లాగే ఏటవాలు కొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 14).

**తొట్టి** (1) పర్యా. చూ. దోనె (1). మోటబొక్కెన కుమ్మరించిన నీళ్ళు పోయే దారి లేక కాలవ. చూ. చిత్రం 2 క. 1, 5 (కో. 24, 25; తె. 37, 38, 42, రా. 4); **-బండ** పర్యా. చూ. అడిబండ. మోటబావి లోపలివైపున్న సూదిమోకులమీద అడ్డంగా వేసిన బండ లేక చాపరాయి. చూ చిత్రం 2 ట. 3 (రా.); (2) పర్యా. చూ. దోనె (2). ఏతంతో తోడిన నీళ్ళుపొయ్యే మొదటి కాలవ; కొన్నిచోట్ల దీన్ని తాటిమొద్దు తొలిచి చేస్తారు. చూ. చిత్రం 3 క. 6 (కో. 17; తె. 32, 36); (3) పర్యా. చూ. కుండి. చెరువు తూమునుంచి బయటికి వచ్చిన నీళ్ళు ఆపి పొలాలకు పెట్టటానికి తూము దగ్గర గచ్చుతోగాని సిమెంటుతోగాని కట్టిన తొట్టి (కో. 14).

**తొట్టిగాడి** పర్యా. చూ. అరగాణి. నీళ్ల లోతుగాఉండే చెరువు లోపలి భాగం; తటాకగర్భం (కో. 9).

**తొడరాయి** పర్యా. చూ. ముక్కరబండ. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (రా. 8).

**తొండపుతాడు** రూ. తొండపుతాడు, తొండాపితాడు, తొండెపుతాడు, తొండెంతాడు, సుండుతాడు, సొండుతాడు, సొండెపుతాడు; పర్యా. గాపతాడు, గాబతాడు, తొండపు మోకు, తొండంమోకు, తొండాం మోకు, తోకతాడు, దాప తాడు, పిల్లతాడు. మోటబొక్కెన తొడానిక్కట్టే తాడు. చూ. చిత్రం 2 త. 10 (కో. 3, 11, 18, 22-24; తె. 5-9, 19, 25, 32, 33, 35, 37-39, 42; రా. 2, 3, 18, 27).

**తొండపుమోకు** రూ. తొండంమోకు, తొండాంమోకు; పర్యా. చూ. తొండపుతాడు. మోటబొక్కెన తొండాని క్కట్టిన తాడు. చూ. చిత్రం 2 త. 10 (తె. 41; రా. 28).

**తొండం** (1) రూ. తొండాం, తొండెం, సుండ, సొండెం, సొండు. మోటబొక్కెన అడుగున కట్టిన తోలుగొట్టం లేక తిత్తి. చూ. చిత్రం 2 త. 7 (కో. 2-4, 6-9, 11, 14, 18, 19, 22-25; తె. 5-9, 13, 19, 20, 22-26, 28, 32, 33, 35-39, 41, 42; రా. 1-5, 7-9, 11, 14, 18, 25-28); **-తాడు** చూ. తొండపుతాడు (కో. తె. రా.); **-మోకు** చూ. తొండపుమోకు (తె); (2) పర్యా. చూ. పిల్లకాలవ. పంటకాలవనుంచి తీసే పిల్లకాలవ (తె. 32).

**తొండాపితాడు** చూ. తొండపుతాడు (కో. 2,4-6).

**తొండాం** చూ. తొండం 1) (కో. 1, 5, 22, 24); **-మోకు** చూ. తొండపుమోకు (1) (కో.).

**తొండెపుతాడు** చూ. తొండపుతాడు (తె. 1, 11, 12, 29, 34).

**తొండెం** చూ. తొండం (1) (తె. 1, 11, 12, 29, 34; రా. 22); **-తాడు** చూ. తొండపుతాడు (రా.).

**తోకతాడు** (1) పర్యా. చూ. తొండపుతాడు. మోట బొక్కెన తొండానికి కట్టినతాడు. చూ. చిత్రం 2 త. 10 (కో. 38); (2) పర్యా. చూ. పిర్రతాడు. గూడ నడుముకు ఇటూ అటూ కట్టిన తాడు. చూ. చిత్రం 4. 5 (కో. 7).

**తోగు** కొండలనుంచి నిరంతరమూ పారే వాగు (తె. 23).

**దట్టి** పర్యా. చూ. కట్ట. పొలంలోపడ్డ వాననీళ్ళకు మన్ను కొట్టుకుపోకుండా కట్టిన మట్టికట్ట (తె. 24).

**దండెగదురు** ఉ. దండకదురు, దండగదర, దండ గదురు. తొండపుతాడు నేలకు తగలకుండా బారిమీద వేసిన కదురు. చూ. చిత్రం 2 క. 3. (తె. 6, 7, 12, 29, 38; **-చెవి** పర్యా. చూ. బొమ్మకొయ్య. దండెకదురు (బారిమీద ఉండే పుల్లిరుసు) తిరగటానికి పాతిన సంగలకొయ్య; ఇటువంటివి రెండువైపులా రెండుంటాయి. చూ. చిత్రం 2 క. 2 (తె.).

**దండెడ** చూ. దండెద (తె. 13, 20, 23, 25, 26, 28, 33).

**దండెతాడు** పర్యా. చూ. దండెద. మోటబొక్కెన లాగే మోకు. చూ. చిత్రం 2 చ. 7 (తె. 19).

**దండెద** రూ. జంజెడ, దండెడ. పర్యా. కపిలమోకు, దండెతాడు, పైకట్టు, బద్దు, బిళ్ళమోకు, బొడ్డుతాడు, మోట మోకు. మోటబొక్కెన లాగే మోకు. చూ. చిత్రం 2 చ. 7 (తె. 10-12, 22, 29, 32, 34).

**దవడరాయి** పర్యా. కడితునక, గరకచెక్క, గేదె బండ. మోటబావి దోనెకు రెండువైపులా నిలబెట్టిన బండ (లు). చూ. చిత్రం 2 ట. 7 (రా. 3).

**దవురుగోడ** బావి బొడ్డు (కో. 46).

**దాటదోనె** పర్యా. చూ. పెంటిదోనె. దోనె మలుపు తరవాత ఉన్నభాగం; దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (కో. 44).

**దాపతాడు** పర్యా. చూ. తొండపుతాడు. మోట బొక్కెన తొండానికి కట్టినతాడు. చూ. చిత్రం 2 త. 10 (కో. 8, 9; రా. 5, 7, 8, 11, 14, 25).

**దావారు** ఉ. దాబారు; పర్యా. చెలివితాడు. మోట తొండం చివర రెండువైపులా రంధ్రాలువేసి దూర్చేతాడు; తొండపు తాడును దీనికి తగిలిస్తారు. చూ. చిత్రం 2 త. 9 (రా. 9, 14).

**దిగుబారి** ఉ. దిగబారి; రూ. దిగుడుబారి; పర్యా

నిండుబారి, బారి, లోబారి. ఎద్దులు మోటలాగుతూ దిగువకు నడిచే ఏటవాలు దారి. చూ. చిత్రం 2 క. 7 (రా. 2, 5, 7, 11, 14, 17, 25, 27).

**దిగుడుబారి** చూ. దిగుబారి (కో. 25).

**దురువు** చూ. దొరవు (రా. 8, 14, 15).

**దూకుడుజిల్ల** పర్యా. చూ. చిల్ల (2). మోట మోకు కొన వారెనలో దూర్చి తగిలించే కొయ్యముక్క; ఎద్దులు మోట లాగింతర్వాత చిల్లతీసి వాటిని మళ్ళీ బావివైపు నడిపించటానికి వీలవుతుంది. చూ. చిత్రం 2. క. 10 (కో. 14).

**దూజిల్ల** పర్యా. చూ. చిల్ల (2). మోటమోకు కొన వారెనలో దూర్చి తగిలించే కొయ్యముక్క; ఎద్దులు మోట లాగింతర్వాత చిల్లతీసి వాటిని మళ్ళీ బావివైపు నడిపించటానికి వీలవుతుంది. చూ. చిత్రం 2 క. 10 (కో. 14 ; రా. 27).

**దూపుడుజిల్ల** పర్యా. చూ. చిల్ల (2). మోటమోకు కొన వారెనలో దూర్చి తగిలించే కొయ్యముక్క; ఎద్దులు మోటలాగింతర్వాత చిల్ల తీసి వాటిని మళ్ళీ బావివైపు నడిపించటానికి వీలవుతుంది. చూ. చిత్రం 2 క. 10 (కో. 11).

**దూలపుకర్ర** పర్యా. చూ. అడ్డచీల. ఏతపుబొక్కెన చెవికట్లగుండా దూర్చేకర్ర. చూ. చిత్రం 3 చ. 2 (కో. 16).

**దొంపుకాల్వ** ? మాగాణి పొలంలోకి నీరుతెచ్చే మొదటి కాలవ (రా. 20).

**దొరువు** రూ. దురువు; పర్యా. చూ. ఉద్ది. మోటబావి, పంట మొ. వాటినుంచి నీళ్ళు తోడిపోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట (రా. 3).

**దోనె** (1) ఉ. దోని, దోణి; పర్యా. గుడారి, తొట్టి, మొత్త. మోటబొక్కెన కుమ్మరించిన నీళ్ళుపోయేదారి లేక కాలవ. చూ. చిత్రం 2 క. 1, 5 (కో. 1–6, 8, 9, 11, 14; తె. 1, 5, 9, 20, 22–24, 35–37, 41, 42; రా. 2–4, 7–9, 11, 14, 16, 25, 28); **-బండ** పర్యా. చూ. అరబండ. మోటబావి దోనె అర (లోతట్టు)కు అడుగున వేసిన బండ (రా.) ; (2) ఉ. దోని; పర్యా. తొట్టి, మొత్త. ఏతంతో తోడిన నీళ్ళు పొయ్యే మొదటి కాల్వ; కొన్నిచోట్ల దీన్ని తాటిమొద్దు తొలిచి చేస్తారు (కో. 4, 5, 39, 43, 46; తె. 11, 20, 28, 33, 34; రా. 3, 4, 18).

**దోర్నప్పట్టె** ఉ. తోరణంపట్టె, తోర్నప్పట్టె, దోర్ణప్పట్టె, దోరనపట్టె, దోరనప్పట్టె, దోర్నపట్టె; పర్యా. గిరకపట్టె, చెవులపట్టె, దోర్నప్పలక, దోర్నపీప్పట, దోర్నం, బిళ్ళదూలం, మకపట్టె, మోపపట్టె. మోటబావి కొమిరె (నిలువు గుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (కో. 4, 7–9, 11, 14, 15; తె. 41; రా. 2, 3, 7, 25).

**దోర్నప్పలక** పర్యా. చూ. దోర్నప్పట్టె. మోటబావి కొమిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (కో. 1, 5; రా. 1).

**దోర్నపీప్పట** ఉ. దోనపీప్పట; పర్యా. చూ. దోర్నప్పట్టె. మోటబావి కొమిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (కో. 3, 4; రా. 11).

**దోర్నం** పర్యా. చూ. దోర్నప్పట్టె. మోటబావి కొమిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (కో. 2; రా. 14).

**నట్టు** (-పోయు); పర్యా. చూ. కట్ట. పొలంలో పడ్డ వాననీళ్ళకు మన్ను కొట్టుకుపోకుండా అడ్డుగా పోసిన కట్ట (రా. 19).

**నడవ** పర్యా. చూ. చప్పిడి. పొలంలో పడ్డ వాననీళ్ళు పొర్లిపోవటానికి విడిచిన దారి (తె. 6).

**నరవ** చూ. నారవ (కో. 5).

**నల్లొట్టు** నీళ్ళ ఉరవడికి చెరువులో వేసిన మట్టిదిబ్బ; ఇది మునిగితే చెరువు నిండినట్టు; చూ. సెద (కో. 25).

**నాగవాసం** ఉ. నాగోసం. పర్యా. చూ. నీరుకాలు. మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (కో. 1, 4, 5, 14; రా. 3, 8, 28).

**నాటుగుంజ** పర్యా. చూ. కొమిరె. సిడె (ఏతపుమాను)కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (తె. 34).

**నారవ** రూ. నరవ, నాలవ. వానకురిసి పొలంలోపారే నీటివాగు (రా. 18).

**నారసం** పర్యా. చూ. మానికవాయి. చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న తూముల్లో కిందిది. చూ. చిత్రం 1. 1 (తె. 12); **-మొద్దు** చెరువులో కిందితూము మూసే మొద్దు (తె.).

**నాల** పర్యా. చూ. పంటకాలవ. ఏటినుంచిగాని, పెద్ద కాలవనుంచిగాని తీసిన పంటకాలవ (తె. 15).

**నాలవ** చూ. నారవ (రా. 22).

**నాలికెవాయి** పర్యా. చూ. ముసలవాయి. చెరువునీళ్ళు బయటకి పోవటానికున్న తూముల్లో పైది. చూ. చిత్రం 1. 3 (కో. 25).

**నిండుబారి** పర్యా. చూ. దిగుబారి. ఎద్దులు మోట లాగుతూ దిగువకు నడిచే ఏటవాలుదారి. చూ. చిత్రం 2. 7 (రా. 16).

**నిలువు** (1) పర్యా. చూ. కొమిరె (1) నిలువుగుంజ; దోర్నప్పట్టె కాధారంగా ఉండే నిలువుగుంజ; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 1 (కో. 5, 6, 19, 22, 38, 44; రా. 5, 14, 22); **-చిమ్మ** ఉ. -జిమ్మ;

చూ. నిలువు (1) (కో. రా.); (2) పర్యా. చూ. కొమిరె. నిడె (ఏతపుమాను)కు ఆధారంగా నేలలో పాతిన నిలువు కొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 5, 6; తె. 1, 25, 27); **-గుంజ, -పట్టె, -లాడి చూ.** నిలువు (2) (కో. తె.).

నిలువుదోని పర్యా. చూ. పోతుదోనె. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించేచోటు; దోనె మొదలు. చూ. చిత్రం 2 క. 1 (తె. 1).

**నీరుకాలు** (బహు. నీరుకాళ్ళు). (1) పర్యా. చూ. కొమిరె (1). నిలువుగుంజ; దోర్నపట్టె కాధారంగాఉండే నిలువుగుంజ; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 1; (2) పర్యా. చూ. ముక్కరమాను. నిలువుగుంజల కింది కొయ్య లేక రాయి. చూ. చిత్రం 2 ట. 4 (కో. 4, 7, 8, 11, 14, 18, 22-25; తె. 39, 41, 42; రా. 11, 27); (3) పర్యా. కట్టుకాలు, కపిలవాసం, గుండు కాలు, గుండులంగరు, గొణెం, నాగవాసం, పంటె, పరిటె, పెంటె, పెండె, పోకబద్ద, బొక్కెనకాలు, వలిగంకాలు. మోటబొక్కెన వలిగానికి (పైవైపున్న ఇనపకట్టుకు) వేసిన అడ్డచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (కో. 3, 8, 9; రా. 1, 7, 9); (4) పర్యా. చూ. తాగాడి. నీళ్ళతో పైకివచ్చిన ఏతపుబొక్కెన అందుకొనే మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య లేక రాయి. చూ. చిత్రం 3 క. 8 (కో. 14, 16).

నీరుగడి పర్యా. చూ. పోతుదోనె. మోటబావినుంచి నీళ్ళు తోడిపోసేచోటు. చూ. చిత్రం 2 క. 1 (తె. 7).

నీరుగడ్డి పర్యా. చూ. కంబెదూలం. ఉద్దిలేనిబావికి అడ్డంగావేసిన పట్టె. చూ. చిత్రం 3 క. 10 (తె. 35).

నీర్తల పర్యా. చూ. అడిబండ. మోటబావి లోపలి వైపున్న సూదిమానులమీద అడ్డంగావేసిన బండ లేక చాప రాయి. చూ. చిత్రం 2 ట. 3 (తె. 25, 32).

నై (< హిం. నై = **కాలవ,** వెదురుగొట్టం).? చిన్న కుంటనుంచి తోడిన నీరుపొయ్యే మార్గం; **కాలవ** (తె. 1).

నైరు (<హిం. నహర్ = కాలవ); పర్యా. **చూ.** పంటకాలవ. పెద్దకాలవనుంచి పొలంచేరువకు తెచ్చిన కాలవ; పంటకాలవ (తె. 15).

పంగలకర్ర పర్యా. చూ. పలవగుంజ. నిడె (మనిషి తొక్కే ఏతపుకొయ్య) మోనే పంగలగుంజ. చూ. చిత్రం 3 క. 1 (కో. 47).

పంగు రూ. పంజు. చెరువుగాని, కాలవగాని ఒక మనిషి రోజుకు తవ్వగలిగిన భాగం; సామాన్యార్థం 'భాగం' వంతు, (రా. 19).

పంజు చూ. పంగు (రా. 8).

పట్టుగడ పర్యా. అనుగర్ర, చేబడితె, పట్టుబట్టె. ఏతం తొక్కే మనిషి కిందపడకుండా ఊతకోసం పట్టుకొనే కర్ర. చూ. చిత్రం 3 క. 9 (రా. 3, 4).

**పట్టుదాడు** పరా. చూ. గూడతాడు. గూడవేసేటప్పుడు పట్టుకొనేతాడు. చూ. చిత్రం 4, 3, 5 (కో. 44).

**పట్టుబట్టె** పర్యా. చూ. పట్టుగడ. ఏతం తొక్కేమనిషి పడకుండా పట్టుకోటానికి పక్కన పాతిన కొయ్య. చూ. చిత్రం 3 క. 9 (తె. 27, 36).

**పట్టుసారువ** కారెం పై అడ్డపట్టెకు ఆధారంగాఉన్న నిలువుగుంజ. చూ. చిత్రం (రా. 18).

**పడిద** పర్యా. కోపు, పతి. చెరువులో తవ్విన గుంట లేక **గా**డి (కో. 4).

**పండ** మెరకపొలాలకు కాలవనీరు ప్రవహించటానికి **తాటిమొ**ద్దు తొలిచి కట్టిన కాలవ; తాటికాలవ (రా. 19).

**పతి** పర్యా. చూ. పడిద. ఒక కొలతనుబట్టి చెరువులో తవ్విన గుంట లేక గాడి (కో. 29).

**పంటకాలవ** ఉ. పంటకాలవ; పర్యా. గనమ, నాల, నైరు, పంటగనం, పొంతు. చెరువు, ఏరు మొ. వాటినుంచి పంటపొలాలకు చేరువగా తెచ్చిన కాలవ (కో. 4, 16-18; 21-25, 27, 28, 44; తె. 19; రా. 11, 27).

**పంటగనం** ఉ. పంటగెనం. చెరువు అలుగుకింద పారే కాలవ; పంటకాలవ (తె. 1, 2, 11).

**పంటె** రూ. పరిటె, పెండె; పర్యా. చూ. నీరుకాలు. మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (తె. 5, 6, 12, 34, 39).

**పంతె** పర్యా. చూ. చెవి (1). గిలకకు ఆధారంగా దోర్నపట్టెమీద బిగించిన చిన్నకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 6 (తె. 11-13, 20, 24-29; **-కొక్కు** (1) చూ. పంతె (తె.); (2) ఉ. పంతకొక్కు. ఏతపు కొమిరెకు పంగలుగా చెక్కిన కొస (తె.).

పంతొల పర్యా. **చూ.** కుంచం. నీటిపారుదల అవసరం లేనప్పుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంగా వేసిన కొయ్యమొద్దు (రా. 4).

**పందిమాకు** పర్యా. చూ. కంబెదూలం. ఉద్దిలేనిబావికి అడ్డంగా వేసిన పట్టె. చూ. చిత్రం 3 క. 10 (తె. 24).

**పంపుకాల్వ** పర్యా. చూ. పెద్దకాలవ. ఏటినుంచి చీలే పెద్దకాలవ. (తె. 26).

**పర** పర్యా. తిగి. చెరువులోకి వాననీళ్ళు వచ్చేవైపు (కో. 40).

**పరకాల్వ** పర్యా. చూ. బోదె1. మడికి నీళ్ళుపెట్టిన చిన్నకాలవ (రా. 19, 20).

**పరిటె** ఉ. పరెటు; చూ. పంటె (తె. 1, 6-9, 33, 35-38).

**పర్రెకాల్వ** కొండల్లోనుంచి పారే కాలవ (తె. 2).

**పలవగుంజ** పర్యా. పెలవ(ల) మాను, పంగలకర్ర. పలవ(ల)మాను, మొల్లాంమాను. సిడె (ఏటవాలుకొయ్య)ను మోసే పంగలగుంజ. చూ. చిత్రం 3 క. 1 (తె. 25).

**పలవ(ల)మాను** పర్యా. చూ. పలవగుంజ. సిడె (మనిషి తొక్కే ఏతపుకొయ్య)ను మోసే పంగలగుంజ. చూ. చిత్రం 3 క. 1 (కో. 48).

**పాంటిక** పర్యా. మెటిక. మోటబావిలోకి దిగటానికి కట్టిన మెట్టు (రా. 15).

**పిర్రతాడు** పర్యా. తోకతాడు, మొలతాడు. గూడ నడుముకు అటూ ఇటూ కట్టిన తాడు. చూ. చిత్రం 4. 5 (కో. 3-6).

**పిల్లకాలవ** ఉ. పిల్లకాల్వ; పర్యా. ఏగర, కొంజెర, చిల్ల, చీలుగాలవ, తిరవ, తొండం, పిల్లబట్టె, ?మడ. పంట కాలవనుంచి కొన్ని పొలాలకు మొత్తంగా నీళ్ళు సరఫరా చేసే కాలవ (కో. 17, 23, 25, 27, 28, 31, 37; తె. 1, 6, 14, 15, 19-23, 31, 40, 41; రా. 2, 6, 11, 15, 17, 22, 23, 28).

**పిల్లతాడు** పర్యా. చూ. తొండపుతాడు. మోటబొక్కెన తొండానికి కట్టినతాడు. చూ. చిత్రం 2 త. 10 (కో. 43).

**పిల్లతొక్కు** పర్యా. చూ. కుక్కగొయ్య. పుల్లిరుసు (కిందిగిలక) తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకువచ్చేట్టు వేసినకొయ్య; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 5 (తె. 11, 12, 28, 29, 32).

**పిల్లదోనె** ఉ. పిల్లదోని; పర్యా. చూ. పెంటిదోనె. దోనెమలుపు తరవాత ఉన్నభాగం; దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (కో. 3, 7).

**పిల్లబట్టె** పర్యా. చూ. పిల్లకాలవ. పంటకాలవనుంచి తవ్విన పిల్లకాలవ ; చిన్నకాలవ (కో. 50, 51).

**పుణత** చూ. పుంత (కో. 49).

**పుంత** రూ. పుణత. ఒక పొలంలోనుంచి మరొక పొలంలోకి పారే పిల్లకాలవ (కో. 34).

**పురి** పర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ. వాటి నుంచి నీళ్ళు తోడిపోసేవైపు కట్టిన కట్ట (తె. 1, 5-7, 37).

**పుల్లిరుసు** ఉ. పులిరుసు, పులివిరుసు, పుల్లిట్సు; పర్యా. కదురు, కదురుకోల, తిరుగుడు, పొర్లిక, పొర్లు. మోటబాన చివరి తొండపుతాడు నేలకి తగలకుండా జరగటానికి వీలుగా అమర్చిన కొయ్యగిలక. చూ. చిత్రం 2 ట. 6 (కో. 1-4, 6-9, 11, 14; తె. 11, 29, 41; రా. 2, 5, 11, 7-9, 14, 18, 25); **-మొల** ఉ. మొల. కుక్కగొయ్యలమీద నిల్చే పుల్లిరుసు కొన(లు) (తె. రా.).

**పూడుమాను** (బహు. పూడుమాండ్లు); పర్యా. చూ. ముక్కరమాను. కొమిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకువచ్చినకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (రా. 4, 5).

**పూన** (-కట్టు, -గట్టు) ; ఉ. పూను; పర్యా. అనకట్ట, కతవ, బాంది. ఎత్తుపొలాలకు నీళ్ళు మళ్ళించటానికి ఒక చోట కాలవకు మట్టి, గడ్డి మొ. వాటితో వేసే అడ్డుకట్ట (కో. 43, 50).

**పెద్దకాలవ** ఉ. పెద్దకాల్వ; పర్యా. కోలుకాల్వ, తల కాల్వ, పంపుకాలవ, రాజకాల్వ. ఏటినుంచి తీసినకాలవ; దీన్నుంచి పంటకాలవలు తీస్తారు ; కొన్నిచోట్ల పంటకాలవ (కో. 15, 17, 21; తె. 13, 15, 16, 20, 22-25, 27, 28, 31, 33, 40, 41 ; రా. 16, 26).

**పెద్దతొక్కు** ఉ. పెత్తుక్కు ; పర్యా. చూ. ముక్కర బండ. కొమిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకువచ్చిన రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (తె. 11).

**పెంటిదోనె** ఉ. పెంటిదోని ; పర్యా. అవుజు మొత్త, గల్లదోనె, చదుము, తిరుగుడుదోనె, దాటదోనె, మక్కు దోనె, మలుకుదోనె, మలుపుతొట్టి, మలుపుదోని. దోనె (= మోటబావి నీళ్ళుపొయ్యేదారి) మలుపుతరవాత ఉన్న భాగం; దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (తె. 20).

**పెండె** చూ. పంటె (తె. 11, 29 32).

**పెద్దదోనె** ఉ. పెద్దోని; పర్యా. చూ. పోతుదోనె. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించేచోటు ; దోనె మొదలు. చూ. చిత్రం 2 క. 1 (కో. 7; తె. 24, 27; రా. 1).

**పైకట్టు** ఉ. పైకట్టు; పర్యా. చూ. దండెడ. మోట బొక్కెనలాగే మోకు. చూ. చిత్రం 2 చ. 7 (తె. 9, 10).

**పొట్టుకొరు** పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్దిమీద కొమిరె (నిలుపుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలుకొయ్య ; రెండు కొమిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (రా. 15).

**పొనికె** పర్యా. చూ. కుంట. మాగాణి పంటలకు, తోటలకు నీళ్ళు పెట్టటానికి పొలంలో తవ్విన జలాశయం (తె. 20).

**పొంతు** పర్యా. చూ. పంటకాలవ. చెరువునుంచి పొలా లకు నీళ్ళుతెచ్చే కాలవ ; పంటకాలవ(కో. 26).

**పొయితూము** పర్యా. చూ. మానికవాయి. చెరువునీళ్ళు బయటకి పోవటానికున్న తూముల్లో కిందిది. చూ. చిత్రం 1. 1. (తె. 35).

**పొర్లిక** ఉ. పొర్లికె; రూ. పొర్లు[2]; పర్యా. చూ. పుల్లిరుసు మోటబాన చివరి తొండపుతాడు నేలకి తగలకుండా జరగటానికి వీలుగా అమర్చిన కొయ్యగిలక. చూ. చిత్రం 2 ట. 6 (రా. 15, 17).

**పొర్లు**[1] పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగాఉన్నచివర ఏర్పరిచిన రాతి కట్టడం (కో. 38, 39, 41, 42, 50).

**పొర్లు**[2] చూ. పొర్లిక (రా. 15).

**పొలప** పర్యా. చూ. వాగు. వానకురిసి పొలంలో పారే నీటికాలు లేక వాగు (కో. 10).

**పోకబద్ద(లు)** పర్యా. చూ. నీరుకాలు. మోటబొక్కెన వలిగానికి వేసిన ఇనపచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (కో. 23, 25).

**పోటీగుంజ** పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీ పెట్టిన ఏటవాలు కొయ్య; రెండు కామిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (కో. 5, 19).

**పోటుగుంజ** పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య; రెండు కామిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (కో. 3; రా. 7-9, 11).

**పోటుగొయ్య** పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య; రెండు కామిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2. చ. 2 (కో. 25; రా. 25).

**పోటుచిమ్ము** పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలువు గుంజ)కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య; రెండు కామిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (రా. 22).

**పోటుమడెం** నిడె వెనక కొస. చూ. చిత్రం 3 క. 2b (తె. 35).

**పోతుదోనె** ఉ. పోతుదోని, పోద్దోని; పర్యా. ఎదదోనె, ఎల్లదోనె, కక్కుదోనె, కక్కుడుదోనె, కక్కుడు మొత్త, నిలువుదోనె, నీరుగడి, పెద్దదోనె, బొదడు, బొదర, బోదారి. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించేచోటు; దోనె నీళ్ళు పొయ్యేదారి మొదలు. చూ. చిత్రం 2 క. 1 (తె. 20, 24, 26, 28, 29).

**పోలు** పర్యా చూ. నిడె. ఏతంలో ఒకభాగం; మనిషి తొక్కే లేక లాగే ఏటవాలు కొయ్య. చూ. చిత్రం 3 క. 2 (తె. 35).

**పౌలు** పర్యా. చూ. కట్ట. పొలంలోపడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా అడ్డుగావేసిన కట్ట (తె. 17, 19).

**బటువు** పర్యా. చూ. బొక్కెన. మోటగట్టి నీళ్ళతోడే బొక్కెన; ఇది తోలుతోగాని, ఇనుముతోగాని చేస్తారు. చూ. చిత్రం 2 త (రా. 16, 17).

**బట్టె** పర్యా. చూ. కాలవ, చెరువు, ఏరు మొ. వాటి నుంచి మాగాణి పొలాలకు తోటలకు నీళ్ళు సరఫరా చేసే మార్గం (కో. 44, 46-51).

**బడ్డు** పర్యా. చూ. దండెడ. మోటబొక్కెనలాగే మోకు చూ. చిత్రం 2 చ 7 (కో. 37, 38).

**బండి** పర్యా. చూ. బిళ్ళ. మోటబావి గిలక. చూ. చిత్రం 2 చ. 4 (రా. 1, 4, 5, 14).

**బంద** రూ. బందం[2], బందా. సుమారు ఒకటి రెండెకరాల భూమికి మాత్రం నీరు సరఫరాచేసే చిన్న చెరువు; పెద్దచెరువునుంచి కాలవగుండా నీరుతెచ్చుకొని నిలవ చేసుకొనేచోటు (కో. 37, 40, 42, 46-49).

**బందం**[1] పర్యా. చూ. కట్ట. పొలంలో పారే వాన నీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా అడ్డుగా పోసిన కట్ట (తె. 6).

**బందం**[2] చూ. బంద (తె. 39).

**బందా** చూ. బంద (తె. 33)

**బాతుడుమాను** పర్యా. చూ. కామిరె. నిడె (ఏతపుమాను) కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 14).

**బాదు** పర్యా. చూ. కామిరె. నిడె (ఏతపుమాను)కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (తె. 34).

**బాదుడుగుంజ** పర్యా. చూ. కామిరె. నిడె (ఏతపుమాను)కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 4).

**బాన** (1) పర్యా. చూ. బొక్కెన (1). మోటగట్టి నీళ్ళు తోడే పరికరం; ఇది తోలుదిగాని, ఇనపదిగాని కావచ్చు. చూ. చిత్రం 2 త. (కో. 1-4, 6-14, 18, 19, 22, 23; రా. 1-5, 7, 14, 16, 22); **-గుండు** పర్యా. చూ. వలిగం. మోటబానపైన ఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (రా.); (2)పర్యా. చూ. బొక్కెన (2). ఏతంలో నీళ్ళతోడే పరికరం; దీన్ని ఇనుతోముగాని చెక్కతోగాని చేస్తారు. చూ. చిత్రం 3 చ. (కో. 2, 4, 5, 15-17; రా. 3, 4); **-ఇరుసు** పర్యా. చూ. అడ్డచీల. ఏతపు బొక్కెన చెవికట్లగుండా దూర్చే ఇనపచువ్వ; కొన్నిచోట్ల కర్ర. చూ. చిత్రం 3 చ. 2 (కో.).

**బాంది** పర్యా. చూ. రాతికట్ట. వాగులకు వర్రెలకూ అడ్డుగా పోసిన రాతికట్ట (తె. 18).

**బారి** రూ. బారు; పర్యా. మోటదారి, సార. మోట లాగే ఎద్దులు ముందుకు, వెనక్కు నడిచే ఏటవాలుదారి. చూ. చిత్రం 2 క. 7, 8 (కో. 1-9, 11; తె. 10, 12, 20, 22-26, 32; రా. 1, 2, 4, 5, 7, 11, 14-19, 22, 25, 27); **-గడ్డ** పర్యా. చూ. ఏడె. దిగుబారిలో ఎడ్లునడిచే రెండుదారుల మధ్యభాగం; బారినడిమి (తె.); **-గుంట** రూ. బారిగుంత, బారుగుంట. పశువులు మోట లాక్కునిపోయి ఆగే బారి దిగువ (కో. రా.); **-గుంత** చూ. బారిగుంట (రా.).

**బారు** చూ. బారి (కొ. 1, 14, 18, 22-24; తె. 3, 24, 25, 28, 41); **-గుంట** చూ. బారి గుంట (కో.).

**బాల్చి** పర్యా. చూ. బొక్కెన. మోటతోగాని ఏతంతోగాని నీళ్ళుతోడే బొక్కెన (కో. 43, 47, 49).

**బిదర** చూ. బోదారి (తె. 42).

**బిలుకు** పర్యా. చూ. చప్పిడి. పొలంలో పడ్డ వాన నీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా పొలంగట్టు చివర కట్టిన రాతికట్టడం. చెరువు అలుగులాగానే ఇది పొలానికి ఉంటుంది; వాడుక 'రాతిబిలుకు' (రా. 28).

**బిల్లు** మోటకోలే బాన పైభాగం ; తొండం మినహా పైభాగం. చూ. చిత్రం 2 త. 1 (రా. 15).

**బిళ్ళ** ఉ. బిల్ల; పర్యా. కప్పి, కప్పిసీ, గారె, గిరక, గిలక, గీరె, చక్రం, బండి. మోటబావి గిలక. చూ. చిత్రం 2 చ. 4 (కో. 1-8, 9, 11, 14, 19, 22-25 ; తె. 1, 5-13, 20, 24, 27-29, 32-39, 41, 42; రా. 2-5, 7, 8, 11, 14-18, 22, 25, 27, 28) : **-కట్టె** పర్యా. చూ. కందెనకట్టె. మోటబిళ్ళ (గిలక) ఇరుసు. చూ. చిత్రం 2 చ. 5 (తె. రా.) ; **-కడ్డీ** చూ. బిళ్ళకట్టె (తె. రా.) ; **-కొక్కి** పర్యా. చూ. చెవి. బిళ్ళ (గిలక) కు ఆధారంగా దోర్నపట్టెమీద బిగించిన చిన్నకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 6 (తె.): **-చిమ్ము** ఉ. బిల్లసిమ్ము; చూ. బిళ్లకొక్కి (రా.) ; **-చెవి** ఉ. బిల్లజెవు; చూ బిళ్లకొక్కి (కో. తె.); **-దూలం** పర్యా. చూ. దోర్నపట్టె. మోటబావి కామిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (కో. తె. రా.); **-నిలుపు** చూ. బిళ్ళకొక్కి (రా.); **-మోకు** పర్యా చూ. దండెడ. మోటబొక్కెనలాగే మోకు. చూ. చిత్రం 2 చ. 7 (రా.) ; **బిళ్ళచుప్పు** చూ. బిళ్ళకట్టె (రా.); **బిళ్ళిరుసు** చూ. బిళ్లకట్టె (తె. రా.).

**బుగ్గ** ఊటకాలవ పుట్టేచోటు (రా. 10, 14, 23) ; **-కాల్వ** పర్యా. చూ. ఊటకాలవ. ఊటనీటికాలవ (రా.).

**బెట్టుగుంజ** పర్యా. చూ. ఊదుగుంజ. మోటబావి ఉద్ది మీద కామిరె (నిలువుగుంజ)కు పోటీ పెట్టిన ఏటవాలు కొయ్య ; రెండు కామిరెలకూ రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 2 (కో. 23).

**బెందడి** మోటబావి ఉద్ది కట్టడంలో పెద్దరాళ్ళ మధ్య వేసే గులకరాయి మొ. వి (తె. 9).

**బొక్కెన** (1) పర్యా. గూన, బటువు, బాన, బాల్చి, బొండ్రేం. మోట గట్టి నీళ్ళుతోడే పరికరం; ఇది తోలుదిగాని ఇనపదిగాని కావచ్చు. చూ. చిత్రం 2 త (కో. 3-12, 14, 24, 25; తె. 1, 3, 5-13, 19, 20-29, 32-39, 41, 42; రా. 7-9, 11, 18, 25, 27, 28) ; రకాలు:- ఇనప-, కదం-, తోలు-, సొంగ-; **-కట్టు** పర్యా. చూ. వలిగం. మోటబొక్కెనపైన ఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (రా.) ; **-కడెం** పర్యా. చూ. తూము. మోట బొక్కెనపైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (తె.) ; **-కాలు** (బహు. -కాళ్ళు) పర్యా. చూ. నీరు కాలు. మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (కో.) ; **-గుండు** చూ. బొక్కెన కట్టు (రా.) ; **-చెవి** చూ. బొక్కెనకట్టు (తె.) ; (2) పర్యా. గూన, బాన, బాల్చి, బొండ్రేం. ఏతంతో నీళ్ళుతోడే పాత్ర ; దీన్ని చెక్కతోగాని, ఇనుముతోగాని చేస్తారు. చూ. చిత్రం 3. చ. (కో. 6, 13, 14: తె. 11, 12, 20, 26, 27, 33, 36, 39) ; **-దండె** ఉ. -దండ; పర్యా. చూ. అడ్డచీల. ఏతపుబొక్కెన చెవికట్లగుండా దూర్చే ఇనపచువ్వ; కొన్నిచోట్ల కర్ర. చూ. చిత్రం 3 చ. 2 (తె.).

**బొడ్డుతాడు** (1) పర్యా. చూ. దండెడ. మోట బొక్కెన లాగే మోకు. చూ. చిత్రం 2 చ. 7 (కో. 43); (2) పర్యా. చూ. మోరతాడు. గూడమూతికి ఇటూ అటూ కట్టిన తాడు. చూ. చిత్రం 4, 3 (కో. 7).

**బొండగొయ్య** పర్యా. చూ. తూము. మోటబొక్కెన పైన మోకు తగిలించే ఇనపరింగు. చూ. చిత్రం 2 త. 4 (తె. 1).

**బొండి** పర్యా. రోలు. (1) మదుం (చెరువుతూము) రంధ్రం: (2) పలక అమర్చటానికి మదుం పైన వేసిన కన్నం; చూ. మదుం- (కో. 47, 51); **బొండీత** పర్యా. చూ. మదుం-. తూము రంధ్రానికి (బొండికి) అడ్డంగా వేసిన కొయ్యపలక లేక మొద్దు (కో.).

**బొండ్రేం** (1) పర్యా. చూ. బొక్కెన. మోటగట్టి నీళ్ళుతోడే పరికరం ; ఇది తాటికొయ్యదిగాని ఇనపదిగాని కావచ్చు. చూ. చిత్రం 2 త (కో. 38) ; (2) పర్యా. చూ. బొక్కెన. ఏతంతో నీళ్ళుతోడే పాత్ర; దీన్ని తాటి మొద్దుతోగాని, ఇనుముతోగాని చేస్తారు. చూ. చిత్రం 3 చ. (కో. 37).

**బొదడు** ఉ. బొదట; చూ. బోదారి (తె. 37, 38).

**బొదర** ఉ. బొదురు; చూ. బోదారి (కో. 22, 25 ; తె. 11, 26-29).

**బొమ్మ** పర్యా. చూ. చెవి. గిలకకు ఆధారంగా దోర్న పట్టెమీద బిగించిన కొయ్య. ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 6 (రా. 4).

**బొమ్మకొయ్య** పర్యా. దండెకదురు చెవి, బోజర కొయ్య, మొగరం. దండెకదురు (బారిమీదఉండే పుల్లిరుసు) తిరగటానికి పాతిన పంగలకొయ్య; ఇటువంటివి రెండు వైపులా రెండుంటాయి. చూ. చిత్రం 2 క. 2 (కో. 7, 8).

**బోజెరకొయ్య** పర్యా. బొమ్మకొయ్య. దండెకదురు

(జారీమీదఉండే పుల్లిరుసు) తిరగటానికి పాతిన కొయ్య. ఇటువంటివి రెండువైపులా రెండుంటాయి. చూ. చిత్రం 2 క. 2 (తె. 11).

**బోదడి(దోనె)** చూ. బోదారి (తె. 33).

**బోదారి** రూ. బిదర, బొదడు, బొదర, బోదడి, బోదు; పర్యా. చూ. తాటిదోనె, పెంటిదోనె, పోతుదోనె. (1) మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించేచోటు; దోనె మొదలు. చూ. చిత్రం 2 క. 1; (2) దోనెమలుపు తరవాత ఉన్న భాగం; దోనె సన్నగిల్లేభాగం. చూ. చిత్రం 2 క. 5; (3) తాటిమొద్దు తొలిచి ఏర్పరిచిన దోనె. చూ. చిత్రం 3 క. 6 (తె. 32).

**బోదు** చూ. బోదారి. మోటబావినుంచి నీరు ప్రవహించే కాలవ (కో. 37).

**బోదె**[1] పర్యా. ఉర్రుగాలవ, కతవ, తీరుకాల్వ, పరకాల్వ, మడకాల్వ, మోరు, సందుకాల్వ, సాయ. పిల్ల కాలవనుంచి పొలంలోకి నీళ్ళుతెచ్చే చిన్నకాలవ (కో. 23-40).

**బోదె**[2] పర్యా. చూ. కట్ట. నూతినీళ్ళు తోడిపోసేచోట ఎత్తుగా వేసిన కట్ట; పొలంలోపడ్డ వాననీళ్ళకు మట్టికొట్టుకు పోకుండా అడ్డుగాపోసిన కట్ట (కో. 41).

**బోరుకపిలె** బోదకాలవకు ఉద్దిగట్టి తోలేమోట (రా. 9, 15).

**బోరుకాల్వ** పర్యా. మిట్టకాల్వ. పెద్దకాల్వనుంచి మెరకపొలాలకు నీళ్ళుతీసుకుపోయే కాలవ (రా. 15).

**మకపట్టె** పర్యా. చూ. దోర్నపట్టె. మోటబావి కొమిరె(నిలువుగుంజ)ల మీదఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (రా. 17).

**మక్కుదోనె** పర్యా. చూ. పెంటిదోనె. దోనెమలుపు తరవాత ఉన్నభాగం; దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (తె. 25).

**మంకెనగుండు** పర్యా. చూ. వరిగం. మోటబొక్కెన పైనఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (రా. 7).

**మట్టు** పర్యా. చూ. గూడకొమ్ము. గూడపైవైపు తాడు కట్టే చివర. చూ. చిత్రం 4. 2 (కో. 46).

**మట్టుకర్ర** పర్యా. చూ. తాగాడి. నీళ్ళతో పైకివచ్చిన ఏతపుబొక్కెన అందుకొనే మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య. చూ. చిత్రం 3 క. 8 (కో. 46).

**మట్టుచెక్క** పర్యా. చూ. కొమిరె.? సిడె (ఏతపు మాను)కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 43).

**మడ** చెరువు కాలవనుంచి పొలాలకు నీరుపెట్టే కాలవ ?పిల్లకాలవ (తె. 5; రా. 10, 26); **-కాల్వ** పర్యా. చూ. **బోదె.** మాగాణి మడికి నీరుపెట్టే కాలవ; మడ (పంట కాలవ) నుంచి తీసిన కాలవ (తె. రా.).

**మడమ** పర్యా. చూ. గూడకొమ్ము. గూడకు పైవైపు తాడుకట్టే చివర. చూ. చిత్రం 4. 2 (కో. 47).

**మడవ** పర్యా. అప్పసం, గల్మ. ఒక మడిలోనుంచి ఇంకో మడికి నీళ్ళుపోవటానికి మడిగట్టు తెగగొట్టి ఏర్పరిచిన దోవ లేక కంత (తె. 6, 32, 33; రా. 15, 16, 20); **-బండ** పిల్లకాలవ నీరు పొలాలకు పంచే కంత (దోవ)కు అడ్డంగా వేసిన బండ; ఇది తీస్తే పొలాలకు నీళ్ళు వస్తాయి (రా.).

**మడుగు** ఉ. మడ్గు; పర్యా. చూ. కుంట. పొలంలో తవ్వుకున్న నీళ్ళగుంట; చిన్న జలాశయం (తె. 25, 27, 28).

**మడెంగుంట** సిడె (ఏతపుమాను) వెనకభాగం నేలకు తాకే చోట ఏర్పడ్డ పల్లం లేక గుంట (తె. 35).

**మత్త** పర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళుతోడిపోసే వైపు కట్టిన కట్ట. చూ. చిత్రం 2 ట. 1( రా. 25).

**మత్తడి** (1) పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరిచిన రాతి కట్టడం (తె. 1, 24,-29, 32, 33); (2) పర్యా. చూ. చప్పిడి. పొలంలో పడ్డ వాననీళ్ళు పొర్లిపోవటానికి, మట్టి కొట్టుకుపోకుండా ఉండటానికి పొలం గట్టు చివర కట్టిన రాతికట్ట (తె. 2, 9, 13, 21, 34, 38); (3) పర్యా. ఉద్ది. మోటబావి, కుంట మొ. వాటి నుంచి నీళ్ళుతోడిపోసే వైపు కట్టిన కట్ట (తె. 39).

**మదుం** ఉ. మదం, మదుగు, మదువు, ముదుం; రూ. మెదువు; పర్యా. చూ. తూము. చెరువునీళ్లు వెలుపలికి పొయ్యే గొట్టం; చెరువు తూము (కో. 33, 37, 39-42, 44, 46-48, 50); భేదాలు: కుండమదుం, తాటిమదుం; **-తలుపు, -పలక, -బల్ల** పర్యా. కత్వాబల్ల, కత్తవ, బొందీత. నేటిపారుదల అవసరం లేనప్పుడు మదుం రంధ్రానికి అడ్డంగా పైనించి దించిన కొయ్యపలక (కో.).

**మరగొమ్ము** ఉ. మరుగొమ్మ; పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరిచిన రాతికట్టడం (కో. 10, 21, 23, 24, 29, 37; తె. 39).

**మరవ** ఉ. మొరవ; పర్యా. చూ. చప్పిడి. వాననీళ్ళకు పొలంలో మట్టికొట్టుకుపోకుండా పొలంగట్టు చివర కట్టిన రాతికట్ట; చెరువుకు అలుగులాగానే ఇది పొలానికి కూడా (రా. 10, 12, 20).

**మరుగు** చూ. మొరవ (కో. 34); **-బల్ల** అలుగు తూముకు అడ్డంవేసే చెక్క (కో.).

**మలకవ** పర్యా. చూ. ఎగుదారి. ఒకసారి మోట లాగిం

తరవాత ఎద్దులు మోటబానివైపు ఎక్కి వెళ్ళేదారి. చూ. చిత్రం 2 క. 8 (రా. 14).

**మలుకుదోనె** పర్యా. చూ. పెంటిదోనె. దోనె మలుపు తరవాత ఉన్నభాగం; దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (రా. 1).

**మలుపుతొట్టి** పర్యా. చూ. పెంటిదోనె. దోనెమలుపు తరవాత ఉన్నభాగం, దోనె సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (తె. 38).

**మలుపుదోని** పర్యా. చూ. పెంటిదోనె. సన్నగిల్లే భాగం. చూ. చిత్రం 2 క. 5 (తె. 32).

**మాటు** పొలంలో తవ్విన చిన్నకుంట; చూ. కుంట. (కో. 34; తె. 31, 32): **-కందకం** కుంటనుంచి పొలానికితీసిన కాలవ (తె.); **-మత్తడి** కుంట నింపినప్పుడు మిగులు నీళ్ళుపోయేదోవ; చూ. మత్తడి (తె.).

**మానిక** పర్యా. చూ. కదం. మోటబానకు అడుగున తొండం కలిపేచోటు. చిత్రం 2 త. 6 (తె. 39).

**మానికవాయి** ఉ. మానికాయి, మానికోయి, మానిగవాయి; పర్యా. కిందిరోలు, గావి, నారసం, పోయితూము, వాతి. చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న తూముల్లో కిందిది; కొన్నిచోట్ల పైది; కొద్దిచోట్ల పైతూముకు అడ్డంగా వేసే మొద్దు. చూ. చిత్రం 1. 1-3 (కో. 23-25 : తె. 24, 27, 28, 37, 39, 42).

**మానికమొద్దు** చెరువులో కిందితూము మూసే మొద్దు. చూ. చిత్రం 1. 2 (తె. 20).

**మారుగాయ** చెరువు తూముల్లో పైదాన్ని మూసే మొద్దు. చూ. చిత్రం 1. 4 (తె. 29).

**మిట్ట** పర్యా. చూ. సెద చెరువు లోపలివైపు మిర్రుగా ఉన్నభాగం; ఇదిగూడా మునిగితే చెరువు పూర్తిగా నింపినట్టు (కో. 6, 24).

**మిట్టకాల్వ** పర్యా. బోరుకాల్వ. పెద్దకాలవనుంచి మెరక పొలాలకు, ఎత్తయిన భూములకు నీళ్ళు పారటానికి తీసిన కాలవ (తె. 32).

**మిడిమాను** పర్యా. చూ. సిడె. ఏతంలో ఒక భాగం; మనిషి తొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 39, 42).

**మీటు** (1) రూ. మీన; పర్యా. చూ. సిడె. ఏతంలో ఒక భాగం; మనిషి తొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (తె. 34; రా. 18); (2) సిడె వెనక సగం. చూ. చిత్రం 3 క. 2b (కో. 2, 15).

**మీదిరోలు** పర్యా. చూ. మునలవాయి. చెరువునీళ్ళు బయటకి పోవటానికున్న తూముల్లో పైది. చూ. చిత్రం. 1. 3 (తె. 20, 26).

**మీన** చూ. మీట (1) (రా. 18).

**ముకుదాడు** పర్యా. చూ. మోరతాడు. 'గూడ' మూతికి అటూ ఇటూ కట్టిన తాడు. చూ. చిత్రం 4. 3 (కో. 40).

**ముక్కరచెవి** పర్యా. చూ. కుక్కగొయ్య. పుల్లిరుసు (కిందిగిలక) తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకు వచ్చేట్టు వేసిన కొయ్య. ఇవి రెండుంటాయి. చిత్రం 2 ట. 5 (రా. 9).

**ముక్కరతాడు** రూ. ముక్కిడితాడు; పర్యా. చూ. చెలివితాడు. మోటతొండం చివర రెండువైపులా రంధ్రాలు వేసి దూర్చేతాడు; తొండపుతాడును దీనికి తగిలిస్తారు. చూ. చిత్రం 2 త. 9 (రా. 15).

**ముక్కరబండ** పర్యా. తొక్కు, తొక్కుడు, చిమ్మ, తొడరాయి, పెద్దతొక్కు, ముంగిడిరాయి, మోటబాడు. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన రాయి; ఇటువంటివి రెండుంటాయి. (చూ. ముక్కరమాను). చూ. చిత్రం 2 ట. 4 (రా. 16, 17).

**ముక్కరమాకు** చూ. ముక్కరమాను (కో. 3; రా. 7, 9, 11).

**ముక్కరమాను** (బహు. ముక్కరమాన్లు,-మాండ్లు); రూ. ముక్కరమాకు, ముక్కుమాను, ముంగరమాను ; పర్యా. ఎద్దుతొక్కు, తొక్కు, పూడుమాను, మూలజ్జి, మొట్టు. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి (చూ. ముక్కరబండ). చూ. చిత్రం 2 ట. 4 (కో. 1, 6-9, 11 ; రా. 2, 3, 14, 27).

**ముక్కారు** రూ. మూగాడు; పర్యా. చూ. చిమ్మెట. మోటతొండం చివరవేసిన రంధ్రం ; ఇటువంటివి రెండుంటాయి ; వీటిలోగుండా చెలివితాడు దూర్చి దానికి తొండపుతాడు తగిలిస్తారు. చూ. చిత్రం 2 త. 8 (రా. 5).

**ముక్కిడితాడు** చూ. ముక్కరతాడు (తె. 39).

**ముక్కుమాను** చూ. ముక్కరమాను (రా. 15).

**ముంగరమాను** చూ. ముక్కరమాను (కో. 5).

**ముంగిడిరాయి** పర్యా. చూ. ముక్కరబండ. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన రాయి ; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (రా. 25).

**ముణస** చూ. మునస (కో. 15).

**ముత్తాని** (1) ?సిడె ముందుభాగం ; (2) ?ఏతపు సిడెను బొక్కెనను కలిపే వెదురుగడ. చూ. చిత్రం 3 క. 2a, 5 (రా. 3).

**మునస** రూ. ముణస, ముల్స. సిడె (ఏతపుమాను)కు గడకట్టేవైపున్న భాగం ; సిడె ముందుభాగం. చూ. చిత్రం 3 క. 2a (కో. 2).

**ముప్పిడి** నీటివరద; జలప్రవాహం (కో. 51).

**మురుకోడు** (<మురుగు+కోడు); మాగాణి నుంచి పోయే మురుగునీరు బయటనిల్చే ప్రదేశం (కో. 21).

**ములుగు** ?పర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళు తోడిపోసే వైపు ఎత్తుగా కట్టిన కట్ట. చూ. చిత్రం 2 క. 11 (రా. 4).

**ములుం** ఎత్తుగాఉన్న పొలానికి నీరు సరఫరాచేసే కుంట 2 క. 11 (రా. 1).

**ముల్స** చూ. మునస (కో. 16).

**ముసలవాయి** ఉ. ముసలాయం, ముసలయ్, మొసలాయి; పర్యా. కూనతూము, నాలికెవాయి, మీదిరోలు, మొసలాయ రోలు. చెరువు నీళ్ళు బయటికి పోవటానికున్న తూముల్లోపైది; కొన్నిచోట్ల కింది తూము: తూముకు అడ్డంగా వేసే మొద్దు. చూ. చిత్రం 1. 3 (కో. 23, 24; తె. 1, 2, 6–9, 11–16, 19, 20, 23–28, 33–35, 37–39, 42); **-మొద్దు** పర్యా. రోటిమొద్దు. చెరువులో పైతూము మూసే మొద్దు. చూ. చిత్రం 1. 4 (తె.); **-రోలు** చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న తూముల్లో పైదాని రంధ్రం (తె.).

**మూగారు** చూ. ముక్కారు (రా. 9).

**మూతికట్టు** పర్యా. చూ. గూడకొమ్ము. గూడమూతికి రెండువైపులా తాడు కట్టేచోటు. చూ. చిత్రం 4. 2 (కో. 37, 45).

**మూలజ్జి** పర్యా. చూ. ముక్కరమాను. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (రా. 22).

**మూలమత్త** పర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళు తోడిపోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట. చూ. చిత్రం 2 ట. 1 (రా. 11).

**మూలమాను** పర్యా. చూ. కామిరె. సిడె (ఏతపు మాను) కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 43).

**మెటికె** పర్యా. పాంటిక. మోటబావిలో దిగాటానికి కట్టిన మెట్టు (తె. 3; రా. 9).

**మెట్టు** సిడె (ఏతపుమాను) మీద మనిషి తిరగటానికి వీలుగా కొయ్య ముక్కలతో వేసిన మెట్టు. చూ. చిత్రం 3 క. 4 (కో. 13).

**మెది** పర్యా. చూ. చప్పిడి, మడవ. (1) కాలవ నుంచి మాగాణికి నీళ్ళు పెట్టటానికి గనెం (గట్టు) కొట్టి చేసినదారి; (2) పొలంలోపడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకు పోకుండా గట్టు చివర కట్టే రాతికట్ట (తె. 2, 29).

**మెదువు** చూ. మదుం (తె. 34); **-రాయి** పర్యా. చూ. తూముబండ. నీళ్ళు పారుదల అవసరంలేనప్పుడు చెరువుతూముకు అడ్డంగావేసిన బండ (తె.).

**మెల్గుతాడు** కామిరెలకు దోర్నప్పట్టెకు కలిపి కదల కుండా గట్టిగా కట్టేతాడు (తె. 26).

**మేటి** పర్యా. చూ. సిడె. ఏతంలో ఒకభాగం; మనిషి తొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 43).

**మొగ** పర్యా. చూ. తలపరిగె. కాలవ మొదలు (కో. 41).

**మొగరం** (1) ఉ. మొగురం; పర్యా. చూ. కామిరె. నిలువుగుంజ; మోటబావి దోర్నప్పట్టె కాధారంగా ఉండే నిలువుగుంజ; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 చ. 1 (తె. 1, 5–10, 22, 23); (2) పర్యా. చూ. బొమ్మకొయ్య. దండె కదురు (బారిమీద ఉండే పుల్లిరుసు) తిరగటానికి పాతిన పంగలకొయ్య; ఇటువంటివి రెండు వైపులా రెండుంటాయి. చూ. చిత్రం 2 క. 2 (తె. 22).

**మొట్టు** పర్యా. చూ. ముక్కరమాను. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకువచ్చిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (తె. 23).

**మొత్త** (1) పర్యా. చూ. దోనె. ఏతంతో తోడిన నీళ్ళుపొయ్యే మొదటికాలవ; కొన్నిచోట్ల దీన్ని తాటిమొద్దు తొలిచి చేస్తారు. చూ. చిత్రం 3 క. 6 (తె. 12); (2) ఉ. మొత్తె; పర్యా. చూ. దోనె, పోతుదోనె, నీరుగడి. (1) మోటబొక్కెన కుమ్మరించిన నీళ్ళు పొయ్యేదారి లేక కాలవ; (2) మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించేచోటు; దోనె (నీళ్ళు పొయ్యేదారి) మొదలు చూ. చిత్రం 2 క. 1 5 (తె. 6, 11, 36; రా. 22); **-కొయ్య** పర్యా. చూ. కుక్కగొయ్య. పుల్లిరుసు (కిందిగిలక) తిరగటానికి ఆధారంగా మోటబావి లోపలికి చొచ్చుకువచ్చేట్టు వేసిన కొయ్య; ఇవి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 5 (తె.) **-బండ** పర్యా. చూ. అరబండ. మోటబావి దోనెఅర (లోతట్టు) కు అడుగున వేసిన బండ. చూ. చిత్రం 2 ట. 5 (రా.).

**మొరవ** రూ. మరుగు, మొరవ(గొమ్ము); పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పరిచిన రాతికట్టడం (రా. 4, 5, 8, 14–18; తె. 37); **-గొమ్ము(-కొమ్ము)** చూ. మొరవ (తె.).

**మొలకాలు** పర్యా. చూ. కదురుమొల. కుక్కగొయ్యలమీద మోసే కదురు (పుల్లిరుసు) కొన. చూ. చిత్రం 2 ట. 6 (తె. 39).

**మొలతాడు** పర్యా. చూ. పిర్రతాడు. గూడ నడుముకు అటూ ఇటూ కట్టిన తాడు. చూ. చిత్రం 4. 5 (కో. 41).

**మొలమాను** పర్యా. చూ. కొమిరె. సిడె (ఏతపు మాను) కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 39, 44).

**మొల్లం** పర్యా. చూ. గూడగుంట. గూడతో పొలాలకు నీరుతోడే గుంట (కో. 39, 41, 43, 45).

**మొల్లాంమాను** పర్యా. చూ. పలవగుంజ. సిడె (మనిషి తొక్కే ఏతపుకొయ్య) ను మోనే పంగలగుంజ; చూ. చిత్రం 3 క. 1 (కో. 37).

**మోట** పర్యా. కపిల. పశువులను కట్టి బావినుంచి పొలాలకు నీరుతోడే సాధనం. చూ. చిత్రం 2 క-త (కో. 4, 8, 11, 12, 14, 20, 23-28, 43, 44, 51; తె. 1, 3, 13, 15-17, 19, 29, 32-39, 41, 42; రా. 5, 22, 27, 28); **-కట్ట** పర్యా. చూ. ఉద్ది. మోటబావి, కుంట మొ॥ వాటినుంచి నీళ్ళు తోడిపోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట (రా.); **-దారి** పర్యా. చూ. బారి. మోటలాగే ఎద్దులు ముందుకు, వెనక్కు నడిచే ఏటవాలు దారి. చూ. చిత్రం 2 క. 7, 8 (తె.); **-నుయ్యి** పర్యా. చూ. మోటబావి. నీళ్ళు తోడటానికి మోట అమర్చిన బావి; **-పట్టె** కొమిరె (నిలువుగుంజ) ల మీద ఉన్న అడ్డపట్టె. చూ. చిత్రం 2 చ. 3 (తె.); **-బారు** పర్యా. చూ. ముక్కురబండ. కొమిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 2 ట. 4 (కో.); **-బావి** ఉ. మోటబాయి; పర్యా. కపిలబావి, మోటనుయ్యి. నీళ్ళు తోడటానికి మోట అమర్చిన బావి (కో. తె. రా.); **-మొత్త** చూ. మోటకట్ట (తె. రా.).

**మోటు** చూ. ఉద్ది. మోటలాగే ఎద్దులు బారిపైకి ఎక్కి వచ్చి నిలిచే చోటు. చూ. చిత్రం 2 క. 11 (కో. 8; రా. 27).

**మోరతాడు** పర్యా. ఉగ్గపుతాడు, బొడ్డుతాడు, ముకుదాడు, సిగమోరతాడు. గూడమూతికి అటూ ఇటూ కట్టిన తాడు. చూ. చిత్రం 4. 3 (కో. 43).

**మోరు**[1] పర్యా. చూ. బోదె. పొలంలోకి నీళ్ళు తెచ్చే కాలవ (తె. 5).

**మోరు**[2] పర్యా. చూ. గూడకొమ్ము. గూడకు పైపైపు తాడు కట్టేచోటు. చూ. చిత్రం 4. 2 (కో. 43).

**రగడ(గుంజ)** చూ. రాడు (తె. 11).

**రహట్** (<హిం. రహట్); ఉ. రహత్, రాటు, రాత్. నీళ్ళుతోడే మరచక్రం (తె. 13, 16);

**రాడు రూ.** రగడ(గుంజ), రాడి(మాను), లాడు. పర్యా. చూ. కొమిరె. సిడె(ఏతపుమాను)కు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 3 క. 1 (కో. 15, 16).

**రాజకాల్వ** పర్యా. చూ. పెద్దకాలవ. ఏటినుంచి తీసిన పెద్దకాలవ (రా. 10).

**రాడి(మాను)** చూ. రాడు (రా. 3).

**రానకాల్వ** ?ఏటినుంచి చెరువుకు నీళ్ళువచ్చే కాలవ (తె. 34).

**రాయకాల్వ** ?పర్యా. చూ. పిల్లకాలవ. మడిదగ్గర బోదెలన్నీ చీలే పెద్దకాలవ (రా. 19).

**రెక్కలబొండ్లెం** ?ఒకరకం మోటబొక్కెన; చూ. బొండెం (కో. 38).

**రేవు** మోటబావిలో బొక్కెన మునిగేచోటు (తె. 13).

**రొమ్ము** పర్యా. చూ. నెద. చెరువులోపలి వైపు మిట్టగా ఉన్నభాగం; ఇదిగూడా మునిగితే చెరువు పూర్తిగా నిండినట్టు (కో. 15).

**రోటిమొద్దు** చెరువులో పైతూము మూసే మొద్దు. చూ. చిత్రం 1. 4 (తె. 5).

**రోలు** పర్యా. బొండి. తూము రంధ్రం; తూము (తె. 1, 4, 5, 11, 15, 23, 25, 29, 33, 38, 39, 42).

**లాడు** చూ. రాడు (కో. 17).

**లొద్ది** కొండల మధ్య ఉండే లోయ (తె. 25).

**లొయ్య** పర్యా. చూ. ఒడికె. పొలంలో వాననీళ్ళు పారటంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి (తె. 15).

**లోబారి** పర్యా. చూ. దిగుబారి. ఎద్దులు మోటలాగుతూ దిగువకు నడిచే ఏటవాలు దారి. చూ. చిత్రం 2 క. 7 (కో. 15).

**వంక** పర్యా. చూ. వాగు. వానకురిసి పొలంలో పారే నీటిజాలు; చెరువుకు నీళ్ళువచ్చే కాలవ. (కో. 9; రా. 5, 7, 18, 23).

**వంత** పర్యా. చూ. వాగు. వాన కురిసి పొలంలో పారే నీటిజాలు (తె. 25, 26).

**వందరు** పర్యా. చూ. ఒడికె. పొలంలో వాననీళ్ళు పారటంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి (రా. 18, 26).

**వంపు** ఉ. ఒంపు; పర్యా. చూ. వాగు. కొండ చరియల్నుంచి పారేవాగు. (తె. 1, 6, 32, 36); **-కాల్వ** లోయల్నుంచి నీళ్ళువచ్చే కాలవ; కొండకింది కాలవ (తె.).

**వర** నీటిదారువుకు పోయేబాట (కో. 34).

**వరద** ఉ. వర్ద; పర్యా. చూ. వాగు. వానకురిసి పొలంలో పారే సన్నని నీటిజాలు; చెరువుకి నీళ్ళొచ్చేకాలవ; నీటిపొర్లు లేక ప్రవాహం (కో. 45; తె. 11, 12, 14, 19, 20, 24, 29, 31, 32, 34, 37).

**వరవ** ఉ. ఒరవ; పర్యా. చూ. ఒడికె, కట్టుకాలవ. (1) పొలంలో వాననీళ్ళు పారటంవల్ల కోసుకుపోయి ఏర్పడ్డ పల్లం; (2) చెరువుకి నీళ్ళు వచ్చే కాలవ (కో. 5, 6, 10,

12–16, 18, 23, 29; రా. 1, 3).

వర్రె ఉ. అర్రె, ఒర్రె; పర్యా. చూ. వాగు. చిన్నవాగు వానకురిసి పారే కాలవ (తె. 9, 14, 17–28, 32, 34, 35, 38).

వలిగం ఉ వలిగెం, వళిగం; రూ. వలెం, వలెమె, వల్లేం; పర్యా. కడెం, కట్టు, కుండకట్టు, గుంతు, బావగుంతు, బొక్కెనకట్టు, బొక్కెనగుండు, మంకెనగుండు. మోట బొక్కెన పైనఉన్న ఇనపకట్టు. చూ. చిత్రం 2 త. 2 (రా. 16–18); **-కాలు** (బహు. -కాళ్లు) పర్యా. చూ. నీరుకాలు. మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ(లు). చూ. చిత్రం 2 త. 3 (రా.).

వలెం చూ. వలిగం (తె. 3).

వలెమె చూ. వలిగం (రా. 22).

వల్లేం చూ. వలిగం (కో. 5).

**వాగు** ఉ. **ఆగు, ఓగు**; పర్యా. గడ్డ, జవుకు, జాలు, జీలు, నరవ, నారవ, నాలవ, పొలప, వంక, వంత, వంపు, వరవ, **వాలి**. ఉరవడిగా పారే వాననీటికాలవ: వానకురిసి పొలంలో**పారే** నీటిజాలు; చెరువుకు నీళ్లు వచ్చేకాలవ (కో. 7, 9, 11, 14, 18, 19, 23, 27, 29, 31, 33, 34; తె. 15–28, 30, 33, 35, 36, 38, 39, 42; రా. 27); **-కాల్వ** వాగునుంచి తీసిన పంటకాలవ (తె. రా).

వాతి పర్యా. చూ. మానికవాయి. చెరువునీళ్ళు బయటకి పోవటానికున్న తూముల్లో కిందిది. చూ. చిత్రం 1. 1 (తె. 12).

వాలాటం పర్యా. చూ. అలుగు. చెరువులో ఎక్కువైన నీళ్లు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పరిచిన రాతికట్టడం (కో. 49).

**వాలి** పర్యా. చూ. వాగు. వానకురిసి పొలంలో పారే నీటిజాలు (కో. 41).

**వాలుగొమ్ము** పర్యా. చూ. **అలుగు**. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరిచిన రాతికట్టడం (కో. 44, 46, 50).

**వెనకబారి** ఉ. ఎనకబారి, ఎనికిబారి; పర్యా. చూ. ఎగువారి. ఒకసారి మోట లాగింతరవాత ఎద్దులు మోట బావివైపు ఎక్కివెళ్ళేదారి. చూ. చిత్రం 2 క. 8 (కో. 3, 25; రా. 22, 28).

**వెనకమోట** ఉ. **ఎనికిమోట**; పర్యా. వెనక్కపిల. ఎద్దులు మోటలాగుతూ దిగి బావివైపు తిరిగి పోవటానికి వేరేదోవ ఏర్పాటుచేసిన మోట; **దిగుబారి, ఎగుబారి** కూడా ఉన్న మోట (రా. 28).

వెనక్కపిల ఉ. ఎనక్కపిల, ఎనిక్కపిల: పర్యా. చూ. వెనకమోట. ఎద్దులు **మోటలాగుతూ** దిగి బావివైపు తిరిగి పోవటానికి వేరేదోవ ఏర్పాటుచేసిన మోట; దిగుబారి, ఎగుబారి వేరువేరుగా ఉన్నమోట (కో. 2, 5; రా. 2, 4, 9).

**వెలిబారి** ఉ. ఎలిబారి; పర్యా. చూ. ఎగుబారి. ఒకసారి మోటలాగింతరవాత ఎద్దులు మోట బావివైపు ఎక్కివెళ్ళే దారి. చూ. చిత్రం 2 క. 8 (రా. 15).

**షికం** నీళ్ళు నిలిచే చెరువులోపలి భాగం; తటాక గర్భం (తె. 28).

**సంగడిబావి** రెండుమూటలుగట్టి తోలేబావి (తె. 28).

**సంగడిమోట** పర్యా. జంటమోట. ఒకేబావికి రెండు వైపులా రెండు మోటలు కట్టి తోలే పద్ధతి (తె. 29, 32).

**సందుకాల్వ** పర్యా. చూ. బోదె[1]. మళ్ళకు నీరు సరఫరా చేసే కాలవ (రా. 8).

సలాక పర్యా. చూ. కందెనకట్టె. మోటబిళ్ళ (గిలక) ఇరుసు. చూ. చిత్రం 2 చ. 5 (తె. 23).

సాగరం పర్యా. అవ. సంవత్సరం పొడుగునా నీరుండే పెద్ద చెరువు (కో. 50).

సాయ పర్యా. చూ. బోదె[1]. మడికి నీళ్ళుపెట్టే చిన్న కాలవ (తె. 13).

సారవ పర్యా. చూ. బారి. మోటలాగే ఎద్దులు ముందుకు వెనక్కు నడిచే ఏటవాలు దారి. చూ. చిత్రం 2 క, 7, 8 (కో. 19).

సిగమోరతాడు పర్యా. చూ. మోరతాడు. గూడ మూతికి అటూ ఇటూ కట్టిన తాడు. చూ. చిత్రం 4. 3 (కో. 19; తె. 37, 39).

**సించగూడ** పర్యా. చూ. సురిటిగూడ. ఒకమనిషి మాత్రమే వేసే గూడ (కో. 48, 49, 51).

సిడె ఉ. సిడి; పర్యా. ఆటగర్ర, **ఆట**మాను, ఏతవు మాను, ఏతంవారు, ఏతంమాను, ఏతాంమాను, కోనంకి, కోలకర్ర, తొక్కుడుమాను, **పోలు**, మిడిమాను, మీట, మీన, మేటి. ఏతంలో ఒగభాగం; మనిషితొక్కే లేక లాగే ఏటవాలుకొయ్య. చూ. చిత్రం 3 క. 2 (కో. 17; తె. 11, 12, 20, 25–28, 33, 34).

**సుండు** ఉ. సుండ; చూ. తొండం (రా. 15, 16, 17); **-తాడు** ఉ. సుండతాడు; చూ. తొండపుతాడు (రా.).

**సురిటికర్ర** ? సురిటిగూడ (ఒక మనిషి తోడేగూడ)కు వేసిన పంగలకర్ర (కో. 47).

**సురిటిగూడ** ఉ. సిరిటిగూడ; పర్యా. **చేగూడ**, సించ గూడ. ఒక మనిషి మాత్రమే వేసేగూడ; చూ. గూడ (కో. 46, 47, 50).

**సూదిరాయి** పర్యా. చూ. చౌరప. మోటఉద్ది నిర్మాణానికి **ఆధారంగా** అడుగున వేసిన పొడుగాటి బండ; ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (రా. 3, 5, 8, 14–16).

**సూదితోక** పర్యా. చూ చౌరప. మోటఉద్ది నిర్మా

ణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ; ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (కో. 7, 8).

**సూదిమాకు** పర్యా. చూ. చౌరవ. మోటఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ; ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (రా. 9, 11).

**సూదుకడీ** ఉ. సూదిఃని, సూదుగడ; పర్యా. చూ. చౌరవ. మోటఉద్ది నిర్మాణానికి అధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ; ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి. చూ. చిత్రం 2 ట. 2 (తె. 7, 9, 33).

**సూలగుంట** పర్యా. చూ. అర. మోటదోనె నుంచి వచ్చిన నీరు నిలిచే చోటు; ఈ అర దగ్గరి నుంచి పొలానికి నీళ్ళుపోయే కాలవ ఉంటుంది. చూ. చిత్రం 2 క. 6 (రా. 1).

**సెద** పర్యా. మిట్ట, రొమ్ము. చెరువు లోపలివైపు మిట్ట (ఎత్తు)గా ఉన్న భాగం; ఇదిగూడా మునిగితే చెరువు పూర్తిగా నిండినట్టు (కో. 5; రా. 1).

**సొంగ** పర్యా. చూ. కదం. మోటబానపు అడుగున తొండం కలిపేచోటు. చూ. చిత్రం 2 త. 6 (తె. 37); **-బొక్కెన** పొడుగ్గా కుంచం మాదిరిగా ఉన్న ఇనప బొక్కెన (తె.).

**సొండు** చూ. తొండం (తె. 10); **-తాడు** చూ. తొండపుతాడు (తె.).

**సొండెం** చూ. తొండం (తె. 3); **-తాడు** చూ. తొండపుతాడు (తె.).

**సొన** దొరువుకు నీళ్ళు వచ్చే ఊటనీటి కాలవ (కో. 16).

**సొప్పుతాడు** ? ఏతపు బావి లోతునుబట్టి గైకట్టె పొడుగు మార్చటానికి వీలుగా వాన్నెకు కట్టిన తాడు (కో. 17).

**సొర్రె** కొండల్నుంచి పారే నీళ్ళ ప్రవాహం; కొంచె వాగు (తె. 31).

చిత్రం 1. చెరువుతూము



1. మానికవాయి
2. మానికమొద్దు (కిందితూము మూసే మొద్దు లేక బండ)
3. ముసలవాయి
4. రోటిమొద్దు

చిత్రం 2 క. మోట (కపిల)



1. పోతుదోనె
2. బొమ్మకొయ్య
3. దండెగదురు
4. దోనె (పైబండ)
5. పెంటిదోనె
6. అర(కొల్లుగుంట)
7. దిగుబారి
8. ఎగుబారి
9. ఏడె
10. చిల్ల (దూజిల్ల)
11. ఉద్ది (ఎద్దులు నిలిచేచోటు)

చిత్రం 2 చ. మోట : పైకట్టుబడి




1. కామిరె
2. ఊదుగుంజ
3. దోర్నప్పట్టె
4. బిళ్ళ
5. కందెనకట్టె (= ఇరుసు)
6. చెవులు
7. దండెడ (= మోకు)

చిత్రం 2 ట మోట : అడుగుకట్టుబడి




1. ఉద్ది
2. చౌరవ
3. అడిబండ
4. ముక్కరమాను (ముక్కరబండ)
5. కుక్కగొయ్య
6. పుల్లిరుసు
7. దవడరాయి

చిత్రం **2** త. మోటబొక్కెన



1. బిల్లు
2. వలిగం
3. నీరుకాలు (-కాళ్ళు)
4. తూము
5. చిల్ల
6. కదం
7. తొండం
8. చిమ్మెట
9. చెలివితాడు (= దావారు)
10. తొండపుతాడు

చిత్రం **3** క. ఏతం (తొక్కుడు ఏతం)



1. కొమిరె (= పలవగుంజ)
2. సిడె
   - 2 a. మునస
   - 2 b. మీట
3. ఇరుసు
4. మెట్టు
5. గైకట్టె (= గడె)
6. దోనె
7. కత్తిరికాలు
8. తాగాడి (బహు. తాగాళ్ళు)
9. పట్టుగడ
10. కంబెదూలం

చిత్రం 3 ఛ. ఏత్తపుబొక్కెన.




1. చెవి ( = చెవికట్టు)
2. అడ్డచీల ( = గజం)
3. జానపీట

చిత్రం 3 ట. ఏతం (కుండ ఏతం : ఒకమనిషిలాగేది)



చిత్రం 4. గూడ



1. గూడచేట
2. గూడకొమ్ము
3. మోరతాడు
4. చిక్కం
5. పిర్రతాడు
6. చిర్ర

చిత్రం 5. కారెం (గాడెం)



# సాగుపనిముట్లు: దున్నే పద్ధతులు

**అక్కిడి** ఉ. అక్కిలి, అక్కెడ; పర్యా. అట్టడి. ఒక పైరుకు వెదబెట్టిన చాళ్ళమధ్య మరొకపైరు (సామాన్యంగా పత్తి, వేరుసెనగ, ఆముదాలు) విత్తనాలువేసే చాలు ; ఒక పైరు చాళ్ళ మధ్య వేసిన రెండోపైరు చాళ్ళ మధ్య వేసిన రెండోపైరు (కో. 10, 12, 30-32; తె. 3, 9, 41; రా. 4-6, 10--12, 14, 16-18, 21-28); **-కట్టె** పర్యా అట్టడిబుర్ర, కూరె, చాలుముంత, తిప్పన్, మొగుడ, సర్తె. అక్కిడలో విత్తనాలువేసే కొయ్యపరికరం; దీన్ని నాగలికిగాని గొర్రుకుగాని వెనకవైపు కట్టి ఎద(వెద) బెడతారు. చూ. చిత్రం 8 క. చ (కో. తె. రా.); **-కొళివి** ఉ. కొళివె. చూ. -లొట్ట (రా.) ; **-గిన్నె** అక్కిడికి అమర్చిన కొయ్యగిన్నె చూ. చిత్రం. 8 క, చ. 1 (రా); **-గుంటుక** అక్కిడి పైరులో తోలే పలుగుగల చిన్న గుంటక (రా.); **-గొట్టం** చూ. -లొట్ట (రా.); **-జడ్డిగం** చూ. అక్కిడిగిన్నె (రా.); **-పంతె** చూ. అక్కిడిగిన్నె (తె.); **-పిడత, -బుర్ర** చూ. అక్కిడిగిన్నె (రా.); **-ముంత** చూ. అక్కిడిగిన్నె (తె.): **-లొట్ట** పర్యా. -కొళివి, -గొట్టం. అక్కడి పిడత కిందిబెజ్జంలో బిగించే గొట్టం. చూ. చిత్రం 8 క, చ. 2 (కో. తె. రా.).

**అంకెండ్లకట్టె** ఉ. అంకొండ్లకట్టె; రూ. అనికెలకట్టె పర్యా. చూ. దండెగాడి. ఎదుగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (రా. 5, 15-17, 22, 24, 25).

**అంకెతాడు** చూ. అంకెనతాడు (కో. 3).

**అంకెన** ( బహు. అంకెన్లు, అంకెండ్లు ); ఉ. అంకండ్లు, అంకిండ్లు; పర్యా. అంకెనమొల, అంకెమాను, వంకెన, మెలుగు, మెలుము. గొర్రుభాగం; దండెగాడి తాడుకుకట్టి గొర్తిచెక్కపైఉన్న కొక్కెనికి తగిలించే ఇనప వంకీ. చూ. చిత్రం 7 క. 8 (కో. 1, 3, 8-13, 15, 18, 24, 25; తె. 5, 26, 37, 39, 42; రా. 1, 5, 6, 9, 15, 16, 24-26). **-కొండి** చూ. అంకెనమొల (రా.): **-తాడు** రూ. అంకెతాడు, అంకెపుతాడు ; పర్యా. చూ. మెలుముతాడు. గొర్తిచెక్కలకు దండెగాడి పట్టెకు కలిపి కట్టేతాడు లేక వారు. చూ. చిత్రం 7 క. 9 (కో. రా.) ; **-వాసు** చూ. అంకెనతాడు (కో. తె.): **-పీట** రూ. అంకెప్పీట; పర్యా. చూ. దండిగాడి. ఎదుగొర్రు నొగల మీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (తె. రా.): **-మొల** (1) చూ. అంకెన (కో. తె.): (2) పర్యా. అంకెనకొండి, కొండి, చిరతకొండి, దాసరికొండి. మొల. గొర్రుభాగం; అంకెన తగిలించే ఇనపకొండి ; ఇది గొర్తి కొయ్యమీద ఉంటుంది. చూ. చిత్రం 7 క. 7 (కో.).

**అంకెపుతాడు** చూ. అంకెనతాడు (కో. 15, 29, 32 ; తె. 40, 41).

**అంకెప్పీట** చూ. అంకెనప్పీట (కో. 32).

**అంకెమాను** ?పర్యా. చూ. అంకెన. ఇది పూర్వ కాలంలో కొయ్యదికావచ్చు; గొర్రుభాగం; దండెగాడి తాడుకు గట్టి గొర్తిచెక్కపైఉన్న కొక్కెనికి తగిలించే వంకీ. చూ. చిత్రం 7 క. 8 (తె. 24).

**అంకొండి** (<అంకె+కొండి): పర్యా. చూ. అంకెన. గొర్రుభాగం; దండెగాడి తాడుకుగట్టి గొర్తిచెక్కపై ఉన్న కొక్కెనికి తగిలించే ఇనపవంకీ. చూ. చిత్రం 7 క. 8 (తె. 1-6, 21, 22, 25; రా. 15, 16, 21-23, 28).

**అచ్చు** (-తోలు); పర్యా. చూ. అడ్డ. (1) దున్నిన పొలం చదునుచేసే కొయ్యమొద్దు; (2) పర్యా. చూ. అచ్చు గుంటక. మిరప పొగతోటలల్లో నాట్లు వెయ్యటానికి ముందు తోలే గుంటక; దీనికి కొయ్యపలుగులే ఉంటాయి. చూ. చిత్రం 10 ట (కో. 12, 14, 15, 17, 21, 25, 32; తె. 2, 5, 35, 37, 38); **-గుంటుక** ఉ. -గుంటికె; పర్యా. అచ్చు, పొట్టిగుంటక, చాళ్ళగుంటక. చూ. అచ్చు (2) (కో. తె.); **-మాను** పర్యా. చూ. చేదంతె. మిరప. తోటలో ''కయ్య'' లేక "మడి'' ఏర్పరచటానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 11 (కో.).

**అచ్చుకట్టు** (క్రి.) మాగాణిలో మడి కట్టటం (వి.). మాగాణిలో గట్టు కట్టిన నలచదరపు ముక్క; మడి (కో. 1, 5, 8, 9; తె. 1, 13, 16, 20, 22, 25-27, 38); **-దంతె** పర్యా. చూ. చేదంతె. మాగాణిలో మళ్ళు చేనుకోటానికి ఉపయోగించే కొయ్యపరికరం. చూ. చిత్రం 11 (కో. తె.).

---

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విణ = విశేషణం; హిం. = హిందుస్తానీ.

**అట్టడి** పర్యా. చూ. అక్కడి. ఒక పైరు చాలు; ముఖ్యంగా పత్తి, ఆముదాలు ఇలా వేస్తారు: ఆ విధంగా వేసిన పైరు (కో. 12); -బుర్ర పర్యా. చూ. అక్కడికట్టె. అక్కడి పైరుకు విత్తనాలువేసే కొయ్య పరికరం; దీన్ని గొర్రుకుగాని. నాగలికిగాని వెనకవైపు కట్టి ఎదబెడతారు. చూ. చిత్రం 8 క. (కో.).

**అడుసుదుక్కి** నీళ్ళుబెట్టి దున్నిన మాగాణి పొలం; మాగాణిలో దమ్ముచేయటం (రా. 6, 8).

**అడుసునాగేలి** పర్యా. చూ. బురదనాగలి. మాగాణిలో దున్నే చిన్నసైజు నాగలి. చూ. చిత్రం 6. ట (కో. 1; రా. 1).

**అడుసుమడక** పర్యా. చూ. బురదనాగలి. మాగాణి నేల దున్నే చిన్నసైజు నాగలి. చూ. చిత్రం 6. ట (రా. 5, 6, 8).

**అడ్డ** (1) పర్యా. అచ్చు, తుంతు, దిండు, దొలుపు, పట్టె, పరందిండు, మాను. దున్నిన పొలాన్ని చదునుచేసే కొయ్యమొద్దు (కో. 9, 10, 15, 18, 24, 31; తె. 41); (2) పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9–12, 1 (కో. 4–19, 21, 25, 29, 31–33, 35, 41, 43; తె. 1, 6, 26, 32, 34–42).

**అడ్డగచాలు** చూ. అడ్డచాలు (కో. 51).

**అడ్డగుంటువ** విత్తులు చల్లిన పైరులో గడ్డిపోపటానికి తోలే గుంటక; దీని దిండు (అడ్డ)కు పది లేక పన్నెండు మేకులుంటాయి (రా. 4).

**అడ్డచాలు** రూ. అడ్డగచాలు: పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నినతరవాత అడ్డంగా దున్నిన చాలు (కో. 15–17, 20–23, 40, 44, 45, 47, 48, తె. 16, 18).

**అడ్డదుక్కి** అడ్డంగా దున్నటం (కో. 48).

**అడ్డపదుగుచాలు** పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నినతరవాత అడ్డంగా దున్నిన చాలు( తె. 9).

**అంటుపనకం** దున్నేటప్పుడు కాడికి ఏడికోలకు కలిపి కట్టే కట్టు. చూ. పన్నకం (రా. 23, 25, 26).

**అండగొట్టు** (క్రి.) మాగాణి గట్లను పారతో చెక్కి బాగుచెయ్యటం (కో. 39).

**అండమలుపు** ? నాలుగోసారి దున్నటం (రా. 26).

**అని** పొలంలో అడ్డచాలు నిలువుచాలు, కలిసే చోటు (తె. 1).

**అనికెలకట్టు** చూ. అంకెండ్లకట్టె (రా. 8).

**అరక** ఉ. అర్క; పర్యా. చూ. ఏరు. సామాన్లన్నీ అమర్చి ఎడ్లను కట్టి దున్నటానికి సిద్ధంచేసిన సాగు పనిముట్టు (కో. 8, 11–20, 24, 25; తె. 10, 13, 14, 21, 23–26); **-పీట** పర్యా. చూ. వారిణెపీట. ఎలువు నలువులకు, ఏడికోల కాడి కలిపే చోట వారిణె దూర్చిన చిన్న కొయ్యగొట్టం. చూ. చిత్రం 6. చ. 9 (తె).

**అలుకుజాలు** ఉ. అలుకుసాలు; రూ. అల్క(డు)చాలు; పర్యా. ఊడ్పుచాలు. మాగాణిలో విత్తనం చల్లే ముందుగాని, నాటువేసే ముందుగాని దున్నిన చాలు (కో. 9; తె. 4, 8–12, 33).

**అలుకుడుపట్టె** ఎద(పెద)పెట్టక ముందు పొలం చదును చెయ్యటానికి తోలే కొయ్య మొద్దు (తె. 35).

**అలుగు** పర్యా. చూ. పలుగు. గుంటక గుజ్జులకు తగిలించిన ఇనపబద్దె. చూ. చిత్రం 9. 3 (రా. 1).

**అల్క(డు)చాలు** ఉ. అల్క(డు)జాలు, అల్క(డు)సాలు; చూ. అలుకుచాలు (తె. 17, 19, 25, 27).

**ఆకుమొల** పర్యా. చూ. కర్రుమొల. గొర్రుచెక్క(కొయ్య)కు కర్రు బిగించే ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 6 (కో. 15).

**ఆటగొర్రు** పర్యా. ఉసిగొర్రు, ఎడగొర్రు, బీటిగొర్రు, మట్టిగొర్రు, వట్టిగొర్రు, వాటుగొర్రు, వాయిగొర్రు, వాలుగొర్రు. భూమి దున్నే గొర్రు; నాగలితో దున్నినతరువాత విత్తటానికి ముందు పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు నుంచి ఎనిమిది దాకా దీని చెక్కలు (కొయ్యలు) ఉంటాయి. చూ. చిత్రం 7 చ. (కో. 12, 17, 20–23; తె. 39),

**ఆరగట్టు** ఉ. ఆర్గట్ట(సామాను), ఆర్గట్టు (సామాను). చూ. ఏరగట్టు (తె. 17, 19,25).

**ఆరు** ఉ. అర్ర, ఆరి, ఆరె, ఓరు, ఓరె(నాగటోరు, నాగటోరె), వారు, వాల, వాలు; పర్యా. ముకుదూల, ముకుదొల, మొన. కర్రు బిగించే నాగలి చివరిభాగం. చూ. చిత్రం 6 క. 5 (కో. 1–25, 31–36, 40–43; తె. 1-4, 6-9, 11, 12, 14, 29, 31–35, 37-42; రా. 1, 4, 6–11, 14-18, 20-28); **-పొది** పర్యా. చూ. దోని. ఆరులో కర్రు బిగించటానికి తొలిచిన గాడి (తె.).

**ఇంగలీచిల్ల** పర్యా. చూ. షిర్రచీల. ఏడికోలను వణతలో దూర్చి ఊడకుండా చివర కొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (రా 16).

**ఇడుగువాలు** ఉ. ఇడ్గువాలు; పర్యా. చూ. ఇరవాలు. పొలంలో రెండోసారి దున్నటం; నిలువు దున్నిన తరువాత అడ్డంగా చాళ్ళు దున్నటం; కొద్దిచోట్ల మొదటిసారి దున్నటం (తె. 17, 19–23, 31).

**ఇనమారు(చాలు)** ఉ. ఇనమాలుసాలు, ఇనుమారు సాలు, ఎనిమారుసాలు; పర్యా. చూ. ఇరవాలు. పొలం రెండోసారి దున్నటం (కో. 27, 29, 32–34, 36, 39, 40, 41, 46, 49–51; తె. 35).

**ఇనమారుదుక్కి** రెండోసారి దున్నటం (కో. 46).

**ఇరచాలు** ఉ. ఇరసాలు, ఇర్సాలు; పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నిన తరవాత అడ్డంగా దున్నిన చాలు; ఆ విధంగా దున్నే పద్ధతి (తె. 36; రా. 4, 5, 17, 18, 21, 24, 25, 28).

**ఇరవాయి** ఉ. ఇర్వాయి; చూ. ఇరవాలు (తె. 9, 12, 33, 34; రా. 8, 22, 26, 27).

**ఇరవాలు** ఉ. ఇర్వాలు; రూ. ఇరవాయి; పర్యా. అడ్డచాలు, అడ్డగచాలు, అడ్డపమగుచాలు, ఇడుగువాలు, ఇనమారుచాలు, ఇరచాలు, ఎగదున్నకం, ఎడచాలు, తిరుగుదున్నకం, దుగదున్నకం, దుగం, పేకచాలు, మలిచాలు, మల్లజాలు, మారుజాలు. నిలువు దున్నినతరవాత అడ్డంగా దున్నినచాళ్ళు; ఆ విధంగా దున్నేపద్ధతి (కో. 8–14, 19, 24, 25, 30; తె. 1, 2, 6–8, 11–32, 35–42; రా. 26, 27); **-దుక్కి** రెండోసారి దున్నటం (రా.).

**ఈడి** ఉ. ఈటి; రూ. ఈడిక; పర్యా. చూ. చెక్కుడ. గుంటక తోలేటప్పుడు పలుగుకు చుట్టుకున్న గడ్డీగాదం (రా. 23, 25–28).

**ఈడిక** ఉ. ఈటికె; చూ. ఈడి (రా. 18, 25).

**ఈడుగుచాలు** మొదట దున్నినచాలు (తె. 11).

**ఈదు** పర్యా. గది. గొర్రుచెక్కుల మధ్య ఉండే ఎడం (రా. 16-18).

**ఈసు** ఉ. ఈస. (1) పర్యా. చూ. ఏడికర్ర. నాగటి కాడినీ, పణతనీ కలిపే పొడుగు కొయ్య. చూ. చిత్రం 6 క. 2 (రా. 16, 17); (2) పర్యా. చూ. నొగ(లు). గొర్రు, గుంటక. మొదలైనవాటి దిండుకు బిగించి కాడిమీద మోపే పొడుగుకొయ్యలు. చూ. చిత్రాలు 7, 9, 10, 12.2 (రా. 16, 17).

**ఉక్కుడం** పర్యా. చూ. తీపుతాడు. జడ్డిగపుపిడత కదలకుండా బిగింపుకు వేసేతాడు. చూ. చిత్రం 7 చ. 4 (రా. 16).

**ఉగ్గు** పర్యా. చూ. బిళ్ళ. జడ్డిగపు తాళ్ళు బిగించటానికి అమర్చిన కొయ్యపలక. చూ. చిత్రం 7 చ. 3 (కో. 12).

**ఉంగరం** పర్యా. చూ. పొన్ను. గుంటక గుజ్జుల మూతిచుట్టూ వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 9 క. 5 (రా. 21, 22).

**ఉసిగొర్రు** పర్యా. చూ. అటగొర్రు. భూమిదున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడునుంచి ఎనిమిది దాకా చెక్కులుంటాయి. చూ. చిత్రం 7 చ (రా. 15, 19).

**ఊడ్పుచాలు** పర్యా. చూ. అలుకుజాలు. మాగాణిలో విత్తనం చల్లేముందుగాని, నాటువేసే ముందుగాని దున్నిన చాలు (కో. 41).

**ఊడ్పుదమ్ము** విత్తనం వెయ్యటానికి ముందు మాగాణిలో దున్నటం (కో. 43).

**ఊతాని** పర్యా. చూ. పిర్రచీల. పణతలో దూర్చి ఏడికోలకు చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (రా. 3).

**ఊబ(గడ్డ)** పర్యా. చూ. కొమురు. గుంటక, దంతె తోలేటప్పుడు రెండు వాళ్ళమధ్యకోసుగా తేలినమట్టి (రా. 5, 17, 18, 21).

**ఎగదున్నకం** పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నినతరవాత అడ్డంగా దున్నిన చాలు; ఆ విధంగా దున్నే పద్ధతి (తె. 35).

**ఎట్టెం** (-గొట్టం) గుబురుగాఉన్న కొమ్మ; సాధారణంగా చింతకొమ్మ; దీంతో విత్తనపుచాళ్ళు పూడుస్తారు (తె. 27).

**ఎడగుంటక** రూ. ఎరగుంటక. గడ్డి, కలుపు మొ. తియ్యటానికి పైరులోతోలే మూడు పలుగుల గుంటక. చూ. చిత్రం 10 క, చ (కో. 13; తె. 3; రా. 22, 25).

**ఎడగొర్రు** పర్యా. చూ. అటగొర్రు. భూమి దున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కులుంటాయి. చూ. చిత్రం 7 చ (తె. 3).

**ఎడచాలు** ఉ. ఎడ్సాలు; పర్యా. చూ. ఇరవాలు. రెండోసారి దున్నకం కొన్నిచోట్ల మాగాణిలో మూడో సారి దున్నకం. (కో. 9, 24; తె. 1–4, 10, 13, 23, 28; రా. 19, 26, 27); **-దుక్కి** రెండోసారి ఎడదుక్కి ఎండాకాలంలో (తొలకరికిముందు దున్నటం (తె. 3).

**ఎడసేద్యం** రూ. ఎరసేద్యం; పర్యా. చూ. పైరుసేద్యం. కలుపు పోవటానికీ, నేల గుల్లబారటానికి పైరులో చేసే సాగు (రా. 17, 22, 25).

**ఎద** పర్యా. చూ. చంక. పణతకూ అరుకూ మధ్యనున్న వంపు లోపలివైపు. చూ. చిత్రం 6 క. 4 (రా. 12, 15, 16, 18, 19, 21, 22). **-పేడు** పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చేచోట అవసరాన్నిబట్టి పైనగాని కిందగాని ఎలువు నలువులకు కొట్టే పేడు. చూ. చిత్రం 6 క. 10 (రా.).

**ఎదగొర్రు** (<వెదగొర్రు); పర్యా. విత్తుగొర్రు. ఎద (విత్తనాలు) బెట్టే జడ్డిగం మొదలైనవి అమర్చిన గొర్రు. చూ. చిత్రం 7 క (కో. 8, 12–14, 17–25, 32, 33; తె. 1, 3–6, 9, 10, 14, 28, 31–33, 35–42).

**ఎదురుదుక్కి** మూడోసారి దున్నటం (తె. 15).

**ఎరగుంటక** చూ. ఎడగుంటక (రా. 12, 23, 24).

**ఎరసేద్యం** చూ. ఎడసేద్యం (రా. 12, 23, 24).

**ఎలగటిపగ్గం** పర్యా. చూ. పగ్గం. ఎడ్ల కొమ్ములకూ మేడికీ కలిపికట్టి ఎడ్లను మలపటానికి ఉపయోగించే తాడు (తె. 42).

**ఎలి(గట్టు)దుక్కి** ఉ. ఎలిగెట్టుదుక్కి, ఎల్దుక్కి; రూ. ఎలిగడదుక్కి. దున్నిన మెట్టపొలం; మెట్టదున్నకం (తె. 3, 10-12, 29, 33, 42; రా. 4, 6, 8, 23, 26, 27).

**ఎలిగట్టునాగలి** (<వెలిగట్టు-); ఉ. ఎలిగెట్టు-; రూ. ఎలిగడ-; పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (తె. 8, 11, 12, 16, 20, 26, 29, 32-38, 42).

**ఎలిగడగుంటక** పర్యా. చూ. బీటిగుంటక. పైరు వెయ్యకముందు మెట్టలో గడ్డి మొ. పోవటానికి తోలే గుంటక. చూ. చిత్రం 9 క (రా. 11).

**ఎలిగడదుక్కి** చూ. ఎలి (గట్టు) దుక్కి (రా. 11).

**ఎలిగడనాగలి** ఉ. ఎలిగడి-; చూ. ఎలిగట్టు నాగలి (కో. 7, 24).

**ఎలిదినాగేలి** ఉ. ఎల్ది- పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (కో. 1; రా. 1).

**ఎలిదుక్కినాగేలి** పర్యా. చూ. మెట్టనాగలి. మెట్ట దుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (కో. 2-5, 15; తె. 3).

**ఎలిదుక్కిమడక** పర్యా. చూ. మెట్టనాగలి. వెలి (మెట్ట) దుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (రా. 6).

**ఎలినాగేలి** (<వెలి-); పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి; "వెలి" అంటే మెట్ట. చూ. చిత్రం 6 క (రా. 27, 28).

**ఎలిమడనాగేలి** పర్యా. చూ. మెట్టనాగలి. మెట్ట దుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క (రా. 11).

**ఎలుగు** చూ. ఎలువు (కో. 30; తె. 23, 24, 27).

**ఎలువు** రూ. ఎలుగు, ఎల్గు. నాగలి, గొర్రు, గుంటక మొ. వాటి కర్రు లేక పలుగు నేలలో లోతుగా దిగటం; దున్నేటప్పుడు నేల లోతుగా తెగటం (కో. 6, 8-13, 15-17, 19, 23, 24, 26-30, 32-35, 37, 40, 44, 46-51; తె. 1, 3, 41; రా. 1, 9, 23, 25); **-పీట** రూ. ఎల్గుపీట; పర్యా. చూ. వారిణె.- ఎలువు నలువులకు ఏడికోల, కాడికలిపేచోట వారిణె- దూర్చిన చిన్న కొయ్యగొట్టం. చూ. చిత్రం 6 చ. 9 (తె.); **-పేడు** రూ. ఎల్గుపేడు; పర్యా. చూ. చవ్వ. ఏడికోలను పణతలో దూర్చేచోట కిందివైపు కొట్టే పేడు; నాగలి భూమిలో లోతుగా దిగటానికి (ఎలువుకు) ఇలాచేస్తారు. చూ. చిత్రం 6 క. (కో. రా.).

**ఎల్గు** చూ. ఎలువు (తె. 15-17, 19-28); **-పీట** చూ. ఎలువుపీట (తె.); **-పేడు** చూ. ఎలువుపేడు (తె.).

**ఎసగొంగ్ర** ఉ. ఎసగంగ్ర; పర్యా. చూ. కుని. కోంగ్రవేసిన తరవాత పొలంలో మిగిలినమూల (కో. 25).

**ఏట** (-కట్టడం, -పెట్టడం); పర్యా. చూ. పన్నకం. (1) దున్నేముందు మోకును పణతచుట్టూ తిప్పి కాడికి కట్టేకట్టు; (2) పర్యా. చూ. అరక (కో. 25, 39-45; తె. 2, 16, 21, 23); **-తాడు** చూ. ఏరతాడు (తె.); **-తాళ్ళు** పర్యా. చూ. ఏరగట్ట. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెంట్లు, మోకు, వారిణె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట (తె.); **-సామాను** చూ. ఏట తాళ్ళు (కో.).

**ఏటికర్ర** చూ. ఏడికర్ర (కో. 28, 29, 33-37, 39-50; తె. 37, 38, 42).

**ఏటుకోంగ్ర** మొదటి కోంగ్ర పక్కన వేసే రెండో కోంగ్ర; కొన్నిచోట్ల మొదటి కోంగ్ర (కో. 25, 30, 33, 34; తె. 24-27, 29, 37, 39-41).

**ఏడికర్ర** రూ. ఏటికర్ర, ఏణికర్ర; పర్యా. ఈసు, ఏడికోల, ఒంటేలకట్టి, కోల, నగ, నొగ. కాడనీ పణతనీ కలిపే పొడుగు కర్ర; ఏడికోల. చూ. చిత్రం 6 క. 2 (కో. 11, 13-19, 22-24, 26, 27, 30-32, 51; తె. 30, 39, 41).

**ఏడికోల** పర్యా. చూ. ఏడికర్ర. నాగటి కాడినీ పణతనీ కలిపే పొడుగు కర్ర. చూ. చిత్రం 6 క. 2 (కో. 1, 8, 20, 21; తె. 1, 2; రా. 1-3, 23); **-తాప** పర్యా. చూ. కొమ్ము. కోసేరు వేసినప్పుడు ఏడికోల చివర అరిగిపోకుండా వేసిన ఇనపరేకు చూ. చిత్రం 6 క. 1 (కో. రా.).

**ఏడె** ? నిలువుగా అడ్డంగా దున్నటం (తె. 22).

**ఏణికర్ర** ఉ. ఏనికర్ర; చూ. ఏడికర్ర (కో. 25; తె. 40).

**ఏనాదిచాలు** దున్నటంలో ఆఖరిచాలు; సాధారణంగా ఇక్కడ ఐదుసార్లు దున్నుతారట (కో. 6).

**ఏరగట్ట** రూ. అరగట్ట, ఏరుకట్ట పర్యా. ఏటతాళ్ళు, ఏటసామాను, ఏర్మట్టు (సామాను), కర్రుజోడు, గుత్తికట్ట, తాళ్ళకట్ట, తాళ్ళగుత్తి. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట (కో. 6, 9-11, 13-15, 17-20, 22, 25; తె. 6, 9, 12, 35, 37-39, 42).

**ఏరగాడి** (<ఏర + కాడి); నాగటికి కట్టే కాడి; చూ. ఏరు (రా. 28).

**ఏరతాడు** రూ. ఏటతాడు; పర్యా. ఏరమోకు. దున్నేటప్పుడు నాగలికి కట్టే మోకు. చూ. చిత్రం. 6 చ. 7 (తె. 4).

**ఏరదుక్కి** మెట్టలో దున్నటం; దున్నిన మెట్టపొలం (రా. 11).

**ఏరనాగలి** పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టనేలలు దున్నే పెద్దనాగలి. చూ. చిత్రం 6 క (రా. 11).

**ఏరమోకు** పర్యా. ఏరతాడు, ఏటతాడు. దున్నేటప్పుడు నాగలికి కట్టె మోకు. చూ. చిత్రం 6 చ. 7 (కో. 8; రా 23, 26).

**ఏరసేద్యం** ఉ. ఏరసేద్దెం; పర్యా. చూ. ఓటిసేద్యం. తొలకరికి ముందు పొలంలో గుంటకతో దున్నటం; మొదటిసాగు (రా. 11).

**ఏరు** పర్యా. అరక, ఏట. సామాన్లన్నీ అమర్చి ఎడ్లను కట్టి దున్నటానికి సిద్ధంచేసిన సాగుపనిముట్టు; ముఖ్యంగా నాగలి (కో. 5, 40-51; తె. 18, 21-23); **-కట్ట** ఉ. ఎరకట్ట; చూ. ఏరగట్ట; (తె.); **-ముట్టు(సామాను)** పర్యా. చూ. ఏరగట్టు. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట (కో.).

**ఒంచె** ఉ. ఒంచి. ఎదబెట్టె మనిషి వీపుకు కట్టుకున్న విత్తనాలమూట (రా. 16, 18).

**ఒడి** ఎదబెట్టెటప్పుడు మనిషి ముందువైపున నడుముకు కట్టుకొనే విత్తనాలమూట (తె. 1-5, 10-12, 14, 20-29, 42; రా. 16-18, 24, 25).

**ఒంటెక్కిడి** (<ఒంటి + అక్కిడి) ఒకటిమాత్రమే లొట్ట (గింజలుజారే వెదురు బొంగు) వేసిన అక్కిడికట్టె. చూ. చిత్రం 8 క. (రా. 17, 21, 23).

**ఒంటేలకట్టి** పర్యా. చూ. ఏడికర్ర. నాగటికాడినీ పణతనీ కలిపే పొడుగుకర్ర. చూ. చిత్రం 6 క. 2 (రా. 21.).

**ఒంటేలునాగలి** ఉ. ఒంటాల-; పర్యా. ఒంటేలు మడక. ఒక కాడిమాత్రమే కట్టి దున్నే మెట్టనాగలి (తె. 3; రా. 22, 27).

**ఒంటేలుమడక** పర్యా. చూ. ఒంటేలునాగేలి. ఒక కాడికట్టి దున్నే మెట్టనాగలి (రా. 7, 21, 23).

**ఒత్తుగట్టె** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగల మీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (తె. 4).

**ఒత్తుడుచాలు** నాగటితో ఎదబెట్టిన చాలు పూడటానికి పక్కనే తోలిన చాలు (కో. 17, 21).

**ఒది** పర్యా. చూ. దోని. ఆరులో కర్రు బిగించటానికి తొలిచిన గాడి (కో. 18, 23, 25).

**ఒదిచీల** పర్యా. చూ. పిర్రచీల. ఏడికోలను పణతలో మార్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (కో. 13, 15).

**ఒదివాటు** ఉ. ఒదోటు (-వెయ్యటం); పర్యా. టాక. ఏడికోలను పణతలో దూర్చి బిగవటానికి ఎత్తికొట్టటం (కో. 22).

**ఒరజాలు** ఉ. ఒరసాలు, వార్సాలు. మొదటిసారి దున్నిన చాలు (కో. 25; తె. 7; రా. 21).

**ఒరదాడు** పర్యా. ఒరపగ్గం. ఒక ఎద్దుకు పెట్టె పగ్గం (రా. 18).

**ఒరపగ్గం** పర్యా. ఒరదాడు. ఒక ఎద్దురు పెట్టె పగ్గం (రా. 22).

**ఒరుపుగుంటక** పైరులో గడ్డి దీసే మూడు పలుగుల గుంటక. చూ. చిత్రం 10 (కో. 8).

**ఒల్లంతు** పర్యా. చీలుపునొగ, పంగలినొగ. గొర్రు, గుంటక మొదలైన వాటికి నొగగా వేసిన పంగలకొయ్య (కో. 1, 2, 4, 6; రా. 1).

**కట్టు** (1) గొర్రు, గుంటక మొ. వాటి అడ్డకు బిగువు కోసం వేసే ఇనపకట్టు; ఇటువంటివి నాలుగు నుంచి పద్నాలుగుదాకా వేస్తారు. (కో. 4-6, 9-13, 15, 17, 18, 23, 25, 29, 32; తె. 1-3, 5,9; రా. 12, 16-18, 20); (2) పర్యా. చూ. పొన్ను. గుంటక గుజ్జు మూతిచుట్టూ వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 9 క, చ. 5 (రా. 5, 6).

**కట్టుచాలు** ఉ. కట్టుజాలు, కట్టుసాలు; పర్యా. కప్పు చాలు. కోంఁడ్ర కలిపే చివరి చాలు (కో. 12, 13, 16. 22, 24, 25, 27-36; తె. 31, 37, 39-41).

**కడచాలు** ఉ. కడజాలు, కడసాలు. చివరిసారి దున్నటం (కో. 40, 43, 46-48; రా. 5).

**కడెం** పర్యా. చూ. పొన్ను. గుంటక గుజ్జు మూతి చుట్టూ వేసిన ఇనప కట్టు. చూ. చిత్రం 9 క, చ. 5 (తె. 12).

**కత్తెరపట్టె** నాలుగు సార్లుదున్నిన తరవాత చదును చెయ్యటానికి ఉపయోగించే మొద్దు (కో. 51).

**కప్పుచాలు** పర్యా. కట్టుచాలు. కోంఁడ్ర కలిపే చివర చాలు (తె. 31).

**కంప** పర్యా. చూ. తొడుగు. వెదపెట్టిన తరవాత గింజలు పూడి పోవటానికి తోలే కంప; కొమ్మలు, ముళ్ళ కంచెలు కుప్పగావేసి లాగుతారు (కో. 34).

**కరిగట్టె** ఉ. కరిగెట్టు, కరిగేటు. మాగాణి; పల్లపునేల (కో. 24; తె. 1-10, 15, 16, 31, 33, 35, 37-39, 42); **-చాలు** విత్తనం వెయ్యటానికి ముందు మాగాణిలో

తోలిన చాలు (కో. తె.); **-గొర్రు** ఉ. కరిగెట్లగొర్రు; పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికీ, విత్తినతరవాత కలుపు, గడ్డిపోవటానికీ తోలే పరికరం. చూ. చిత్రం 12 (తె.); **-దమ్ము** మాగాణిలో విత్తనం వెయ్యటానికి ముందు దున్నటం (తె.); **-దుక్కి** మాగాణిలో నీళ్ళుపెట్టి దున్నటం; మాగాణి దుక్కి (తె.); **-దున్నకం** చూ. -దుక్కి (తె.); **-నాగలి** పర్యా. చూ. బురదనాగలి. మాగాణి నేలలో దున్నేది; దంపనాగలి. చూ. చిత్రం 6 ట. (తె.).

**కర్తిమొల** చూ. కర్రుమొల (తె. 38).

**కర్రనాంగలి** పెద్దరకం మెట్టనాగలి (కో. 50).

**కర్రు** ఉ. కరు (బహు. కర్లు). (1) రూ. కారు; పర్యా. మల, మళ. గొర్రు చెక్కలకు బిగించిన ఇనప ముక్క; దున్నేటప్పుడు నేలలో దిగే భాగం. చూ. చిత్రం 7 క. 5 (కో. 1-15, 18-25, 31-33, 35-42; తె. 1-9, 11, 20-27, 31-33, 35-42; రా. 1, 11, 15, 17, 21, 22, 25-28); (2) రూ. కారు; పర్యా. చూ. పన్ను. పండ్లమాను, కార్లపొలికి, మొదలగువాటి దిండుకు వేసిన కొయ్యపన్ను; కొన్నిచోట్ల ఇనపది. చూ. చిత్రం 12.3 (కో. 1, 3, 5, 8, 9; రా. 1, 2); (3) రూ. కారు; పర్యా. కర్రుకోల, నక్కు. నాగటి అరుకు అమర్చే పొడుగాటి ఇనపముక్క; చూ. చిత్రం క. 6 (కో. 1-27, 29-35, 39; తె. 1-17, 19, 20, 22-42; రా. 1, 2, 11, 18, 20, 28); **-కాలు** పర్యా. చూ. కొండి. కర్రును ఆరుకు బిగించే ఇనపకొండి. చూ. చిత్రం 6 క. 7 (కో.); **-కొండి** (1) చూ. కర్రుకాలు (తె.); (2) చూ. కర్రుమొల (కో. తె. రా.); **-కోల** చూ. కర్రు (కో.); **-మొల** రూ. కర్తిమొల; పర్యా. ఆకుమొల, కర్రుకొండి, చిన్నమొల, పిచ్చికెమొల, పిల్లకొండి. గొర్రుచెక్క (కొయ్య)కు కర్రుబిగించే ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 6 (కో. తె.).

**కర్రుజోడు** పర్యా. చూ. ఏరుగట్ట. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట (తె. 26-28).

**కర్లమాను** (<కర్రులమాను). మెట్టపైరులో కలుపు తీసే గుంటక; దీనిదింటుకు పది పన్నెండు మేకులు గొడతారు. చూ. చిత్రం 12 (రా. 2).

**కలకచాలు** చివరిసారి దున్నిన చాలు (రా. 13).

**కలికలిచేయు** (క్రి.). మాగాణి నీళ్ళలో దున్నటం (తె. 28).

**కలుపుకోంద్ర** ఉ. కలుపుకొంద్ర, కలుపుగోంద్ర. మొదటిఅరక ఒకసారి చుట్టివచ్చేటప్పటికి నడిమి ఎడం మిగిలిన అరకలు పూర్తిగా కలిపేట్టు వేసిన కోంద్ర; అరకలన్నీ ఒకసారి చుట్టి వచ్చేటప్పటికి కలిసిపొయ్యే కోంద్ర (కో. 18, 20, 21, 24, 26, 29, 30, 33-35; తె. 12, 19, 20, 24, 27. 29, 38, 39).

**కలుపుగడ్డ** పొలంలో కోంద్ర ఇంకా కలుపుకోవలసిన భాగం (కో. 12, 24; తె. 42).

**కలుపుగుంటక** పైరులో కలుపుతీసే రెండు మూడు పలుగుల గుంటక. చూ. చిత్రం 9 చ. 10 (రా. 16).

**కలుపుచాలు** ఉ. కలుపుజాలు, కలుపుసాలు; రూ. కల్పుజాలు. (1) కోంద్ర కలిపే చాలు; (2) నాటు వెయ్యటానికి ముందు మాగాణిలో దున్నిన ఆఖరిచాలు (కో. 37, 40, 41, 44, 48).

**కలుపుదంతె** పైరులో కలుపు పోవటానికి చేత్తో లాగే పళ్ళదంతె (రా. 3).

**కలుపుసేద్యం** పర్యా. చూ. పైరుసేద్యం. కలుపు పోవటానికి, నేల గుల్లబారటానికి పైరులో పాపటం; గుంటక మొదలైనవి లాగటం (రా. 16).

**కల్పుజాలు** చూ. కలుపుచాలు (తె. 15, 24, 26).

**కాడ** పర్యా. చూ. కామ. చేత్తో పట్టుకొని లాగటానికి వీలుగా చేదంతెకు వేసిన కర్ర. చూ. చిత్రం 11.2 (తె. 6).

**కాడి** రూ. కాణి, కాండె, కాని, కావడి; పర్యా. కాడిమాకు, కాడిమాను, దుక్కిపూజు, పూజు. నాగలి, మోట, బండి మొదలైనవి లాగటానికి ఎడ్ల మెడలమీద మోపే అడ్డకొయ్య. చూ. చిత్రం 6 చ. 1 (కో. 1-4, 6, 9-24, 26-36, 39, 40, 45; తె. 1. 5, 7, 8, 20, 35, 36; రా. 1-19, 22, 28); **-కుంటెన** ఉ. కాడికుంటిని; పర్యా. చూ. వారిణె. నొగలు, కాడి కలిపి కట్టే తోలు లేక తాడు. చూ. చిత్రం 6 చ. 6 (తె.); **-తమ్మె** పర్యా. చూ. బొట్టె. కాడికి తగిలించే పట్టెండ్ల కొసతాడు. చూ. చిత్రం 6 చ. 5 (రా.); **-తాడు** పర్యా. చూ. పలుపు. పట్టెండ్లు లేనప్పుడు వాటికి బదులు ఎద్దుల మెడకిందుగా తీసి కాడికి కట్టే తాడు (కో.); **-పట్టె** పొలం చదును చెయ్యటానికి ఉపయోగించే పొడుగాటి మొద్దు (కో.); **-పలుపు** చూ. కాడితాడు (కో.).

**కాడిమాకు** రూ. కాడిమాను; పర్యా. చూ. కాడి. నాగలి, మోట, బండి మొదలైనవి లాగటానికి ఎడ్ల మెడ మీద మోపే అడ్డకొయ్య. చూ. చిత్రం 6 చ. 1 (తె. 1-3, 5-9).

**కాడిమాను** చూ. కాడిమాకు (కో. 7, 9-12; రా. 2-6, 8, 10-12, 15, 18, 19, 21-24, 26-28).

**కాణి** చూ. కాడి (కో. 25, 26; తె. 10-13, 15, 24-26, 42); **-గొలుసు** పర్యా. చూ. వారిణె. నొగలు, కాడికి కలిపి కట్టే తోలు లేక తాడు. చూ. చిత్రం 6 చ. 6 (తె.); **-తల** చూ. -గొలుసు (తె.).

**కాండీ** చూ. కాడి (తె. 16-23).

**కాని** చూ. కాడి (కో. 31, 33; తె. 11-15, 17, 19, 20, 24, 28, 29, 31-34, 37-39, 42).

**కామ** పర్యా. కాడ, కోల, నడుందబ్బ, సిడికట్టె. చేత్తో పట్టుకొని లాగటానికి వీలుగా చేదంతెకు వేసిన కర్ర. చూ. చిత్రం 11 క. 2 (తె. 4, 5, 7).

**కాయిదమ్మ** మాగాణిలో నీళ్ళు పెట్టి మొదటిసారి దున్నటం (కో. 43).

**కారు** చూ. కర్రు రా. 4-10, 14-17).

**కార్లగూటవ** మూడుపలుగుల గుంటక: పైరులో కలుపు తీసేది. చూ. చిత్రం 10 క (రా. 5, 14).

**కార్లపొలికి** ? పర్యా. చూ. పలుగొర్రు. పైరులో కలుపు పోవటానికి తోలే ఇనపమేకుల పరికరం. చూ. చిత్రం 12 (రా. 15).

**కావడిమాను** పర్యా. చూ. కాడి. నాగలి, మోట, బండి మొ. లాగటానికి ఎద్దుల మెడమీద మోపే అడ్డపట్టె. చూ. చిత్రం 6 చ. 2 (రా. 16, 17).

**కుంటెన** (1) పర్యా. చూ. వారితె. కాడిని ఏడికోలకు నొగలకు కలిపి కట్టే వార లేక తోలు తాడు. చూ. చిత్రం 6 చ. 6 (రా. 5); (2) మోకు చివర చాలకపోతే అతుకు వేసే తాడుముక్క (కో. 14, 25); (3) పర్యా. చూ. చిట్టె. నాగటి మోకు చివర వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 3, 4).

**కుని** పర్యా. ఎసగొంద్ర, మొల్లి. దున్నేటప్పుడు చేలో మూలగా వచ్చిన భాగం; చేలో కోసుగాఉన్న భాగం (కో. 9, 11-21, 23, 24, 27, 29, 31; తె. 3, 40, 41; రా. 22); **-చాలు** పర్యా. కునిపట్టె, మొల్లిచాలు. కునిలో దున్నిన చాలు, వంకరగా వచ్చిన చాలు (కో. తె.); **-చుట్టు** పర్యా. కునిమలుపు. కునిలో దున్నటానికి అరక తిరిగే చుట్టు (రా.); **-పట్టె** చూ. కునిచాలు (కో.); **-మలుపు** చూ. కునిచుట్టు (కో.).

**కూరె** (1) పర్యా. చూ. గొర్రు. దున్నటానికి, విత్తటానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 7 క, చ (తె. 18, 19); (2) పర్యా. చూ. అక్కిడికట్టె. ఒక పైరు విత్తిన చాళ్ళమధ్య ఆముదాలు, పత్తి మొ. వాటి విత్తనాలు వేసే కొయ్యపరికరం. దీన్ని నాగలికి గాని గొర్రుకుగాని వెనకవైపు కట్టి ఎద (వెద) బెడతారు. చూ. చిత్రం 8 క, చ (తె. 19).

**కైతచాలు** మడిలో నీళ్ళుపెట్టి దున్నటం (తె. 11).

**కైలు** విత్తనం వెయ్యటానికి సిద్ధంచేసిన మాగాణి (తె. 24, 25, 36); **-చాలు** ఉ. కైలుసాలు, కైల్సాలు; మాగాణిలో నాలుగోసారి దున్నటం; కొన్నిచోట్ల మూడో సారి దున్నటం (తె.).

**కొంకికట్టె** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (రా. 17).

**కొంకిరిమళ** పర్యా. చూ. తమిరె. కాడిమధ్య పైవైపు కొట్టిన ఇనపమేకు. చూ. చిత్రం 6 చ. 2 (రా. 17).

**కొడతం** (1) ఉ. కొణతం, కొంతం; పర్యా. చూ. చిలుకొయ్య. ఏరకట్ట సామాను తగిలించే కొంకికర్ర (తె. 7, 34); (2) పర్యా. గుజ్జు, తుంకు, దబ్బ, లక్కిడి, లగిడి. ఒంటి పలుగు దంతెకు నొగలబదులు అమర్చిన రెండడుగుల పొడుగున్న కర్రముక్క. చూ. చిత్రం 9 ట. 2 (రా. 14).

**కొడిదాడు** పర్యా. గొడితె. నాగటి మోకుచివర పురి ఊడకుండా వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 5, 7).

**కొండి** ఉ. కుండి; పర్యా. కర్రుకాలు, కర్రుకొండి, కొండికర్రు, కొండికల్లు, కొండికారు, కొండికాలు, కొండి మొల, చిక్కు, పన్ను, మొల, మొలకట్టు, మొలకాలు, మొల్ల. కర్రును ఆరుకుబిగించే ఇనపకొక్కెం. చూ. చిత్రం 6 క. 7 (కో. 7-9, 30; తె. 3-19, 24-30, 33, 34, 36; రా. 1, 2, 4-11, 15-18, 23-28); **-కర్రు** చూ. కొండి (తె.); **-కల్లు** చూ. కొండి (తె. రా.); **-కారు** చూ. కొండి (రా.); **-కాలు** చూ. కొండి (కో. రా.); **-మొల** చూ. కొండి (తె. రా.).

**కొండికారు** చూ. కొండికాలు (తె. 1; రా. 5, 11, 25).

**కొండికాలు** రూ. కొండికారు; పర్యా. చూ. కొండి మొల గొర్రు చెక్కపైఉన్న ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 7; కొన్నిచోట్ల కర్రుబిగించటానికి వేసిన ఇనప కొండి. చూ. చిత్రం 7 క, 6 (కో. 7; రా. 1, 18-20).

**కొండిమళ** చూ. కొండిమొల (రా. 16).

**కొండిమొల** రూ. కొండిమళ, గొండెమొల; పర్యా. కొండికారు, కొండికాలు. గొర్రుచెక్కపైఉన్న ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 7; కొన్నిచోట్ల కర్రుబిగించటానికి వేసిన ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 6 (కో. 31-33; తె. 20-22, 31, 32, 40-42).

**కొంద్ర** చూ. కోంద్ర (కో. 15, 16, 20, 27, 28, 34, 35, 38; రా. 13, 23).

**కొప్పు** పర్యా. చూ. కొముర. గుంటక, దంతె తోలే టప్పుడు రెండుచాళ్ళమధ్య కోసుగా తేరిన మట్టిచాలు (తె. 37).

**కొముర** (1) (-పడు) ఉ. కొమర, కొమరి. దున్నే టప్పుడు సరిగా కలవని రెండుచాళ్ళ నడిమిగడ్డ; చాళ్ళు పూడ్చేటప్పుడు కలవని (పూడని) భాగం (కో. 40, 41); (2) ఉ. కముర, కొమిరి, కొమిరె; రూ. కొమ్మ; పర్యా.

ఊబగడ్డ, కొప్పు, వై. గుంటక, దంతె తోలేటప్పుడు రెండుచాళ్ళమధ్య కోసుగాతేరిన మట్టిచాలు (రా. 10, 17, 18, 22, 24, 28).

**కొమ్ము**[1] పర్యా. ఏడికోలతావ, నొగచీల, బంద కొయ్య, మంబె. కోచేరు వేసినప్పుడు ఏడికోల (నొగ) కొన అరిగిపోకుండా అతుకువేసిన కొయ్యముక్కగాని ఇనపముక్కగాని. చూ. చిత్రం 6 క. 1 (కో. 6, 10, 11, 13-15; రా. 10); **-చీల** చూ. కొమ్ము (రా.).

**కొమ్ము**[2] చూ. కొమురు (తె. 3; రా. 23, 26).

**కొమ్ముదుక్కి** చాలువెంట చాలుబట్టి దున్నటం; ఆ విధంగా దున్నినపొలం (తె. 22-24, 26).

**కొమ్ముపగ్గం** పర్యా. చూ. పగ్గం. ఎడ్లకొమ్ములకు మేడికి కలిపి కట్టి ఎడ్లను మలపటానికి ఉపయోగించే తాడు (కో. 32).

**కొయిదు** ఉ. కొయ్దు-. కుని. కోండ్రలో దున్నగా మిగిలిన కోసుభాగం (కో. 39, 40; తె. 42); **-చాలు** కునిచాలు. కునిలో దున్నినచాలు; దున్నేటప్పుడు వంకరగా వచ్చిన చాలు (కో.); **-మూర** కునిమూరు; చూ. కొయిదు (తె.).

**కొయ్య** పర్యా. చూ. చెక్క. గొర్రు, గుంటక మొదలగువాటి దిండులో దూర్చిన కొయ్యముక్క. చూ. చిత్రం 7 క. 4 (కో. 1, 12, 13, 15, 20, 24; తె. 1–15, 18-29, 31-36, 42; రా. 5, 15, 17-22); **-మట్టు** పర్యా. చూ. మట్టుదొలి. విత్తనాలు పడటానికి గొర్రుచెక్కలకు వేసిన బెజ్జం. చూ. చిత్రం 7 క. 12 (కో. రా.).

**కొరడా** పర్యా. చూ. చెలకోల. తోలుతాడు కట్టిన కర్ర; కాడికి గట్టిన ఎద్దుల్ని తోలటానికి ఉపయోగించేది. చూ. చిత్రం 13 (కో. 32, 37, 39-41, 45, 48, 50; తె. 39).

**కొర్న** చూ. కోండ్ర (కో. 48).

**కొర్రుదున్నకం** మొదటిసారి దున్నకం; మొదటి చాలు (కో. 39).

**కొలకడ** ఉ. కొలికిడి; చూ. కొలికి (తె. 32, 33, 38).

**కొలికి** రూ. కొలకడ, కొలికిడి; పర్యా. చిట్టె, చిలకటు, పట్టంజు, పిల్లిచ్చె, పెద్దిచ్చె, గుంటక, గొర్రు, నాగలి మొదలయినవాటి మోకు మొదటికొన; దీన్ని మేడికి తగిలిస్తారు. చూ. చిత్రం 6 చ. 8 (తె. 1–6, 8-12, 14, 34; రా. 9, 14, 17, 18, 21, 24–27).

**కోటారు** ఉ. కొటారు, కొడారు; చూ. కోచేరు (రా. 3, 5, 10, 13, 19,20; తె. 23).

**కోచేరు** రూ. కోటారు, కోచేలు. ఉపయోగించనప్పుడు తలకిందుగాచేసి కాడిపై మోపే నాగలి; పొలానికి వెళ్ళేటప్పుడు, పొలంనుంచి వచ్చేటప్పుడు నాగలిని ఇలాచేసి తెస్తారు (కో. 2, 7, 8, 11, 17, 20-22, 25, 46; రా. 4, 7, 9, 11, 14, 15-18, 21-23, 26).

**కోచేలు** ఉ. కొచేలు, కొదేలు. చూ. కోచేరు (కో. 10, 16, 23, 26-28, 32, 35, 44; తె. 41).

**కోండ్ర** (-కొట్టు, -నేయు, -పట్టు, -పొడుచు,-పోయు, -వేయు); ఉ. కోండ్రి, కోండ్రు, కోర్న; రూ. కొర్ను, కోర్న. దున్నేటప్పుడు ఎడం వదలి మొదటి అరకతో వేసిన చుట్టుచాలు; ఆ విధంగా వదలిన ఎడం (కో. 6, 8–14, 17–19, 21, 23–26, 29-32; తె. 1, 2, 7, 10, 12-18, 20-29, 31, 34, 36-42; రా. 11, 18, 21, 25-28); **-గడ్డ** ఉ. కోండ్రిగడ్డ, కోండ్రుగడ్డ, కోర్నగడ్డ. కోండ్రలో దున్నగా మిగిలిన భాగం, కోండ్ర వేయవలసిన భాగం (కో. తె.); **-దుక్కి** కోండ్రవేసి దున్నటం (తె.); **-మలుపు** నాగళ్ళు ఒక కోండ్ర కలిపి అవతలి కోండ్రలోకి తిరగటం (కో.).

**కోపు** గొర్రు, గుంటక మొ. వాటి దిండుకొన (రా. 18, 22, 23, 25).

**కోర్న** చూ. కోండ్ర (రా. 22).

**కోల** (1) పర్యా. చూ. ఏడికర్ర. నాగటికాడినీ పణతనీ కలిపే పొడుగుకొయ్య (కోల). చూ. చిత్రం 6 క. 2 (తె. 4, 5, 7-9, 12, 13, 15-28, 31-33; రా. 22); **-చీల** పర్యా. చూ. పిర్రచీల. ఏడికోలను పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (తె.); (2) పర్యా. చూ. కామ. చేత్తో పట్టుకొని లాగటానికి వీలుగా చేదంతెకు వేసిన కర్ర. చూ. చిత్రం 11 క. 2 (తె.).

**గడకుప్పె** పర్యా. చూ. గొడికట్టె. ఎడ్లు కాడి లోవైపుకు రాకుండా కాడి కన్నంలో దిగవేసిన కర్ర. (తె. 31).

**గడప** పర్యా. చూ. గడ్డ. నాగటితో దున్నిన రెండు చాళ్ళ మధ్య కలవని భాగం; గొర్రు మొ.వి ఒకసారి చాళ్ళు దున్ని మలుపు తిరిగిన తరవాత, మొదటిచాళ్ళకు, రెండోసారి వేసే చాళ్ళకు మధ్య మిగిలిపోయిన ఎడం (కో. 26, 32, 43).

**గడ(లు)** ఉ. గెడ(లు); పర్యా. చూ. నొగలు. గొర్రు, గుంటక మొ. వాటి దిండుకు బిగించి కాడిమీద మోపే పొడుగు కొయ్యలు. చూ. చిత్రం 7, 9, 10 క. 2 (కో. 26).

**గడెం** పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చేచోట అవసరాన్నిబట్టి పైనగాని కిందగాని ఎలువు సలువులకు కొట్టేపేడు. చూ. చిత్రం 6 క. 10 (తె. 7).

**గడ్డ** (-పడు); రూ. గొడ్డ; పర్యా. గడప, గేర,

చాలుగడ్డ, దుక్కిటిగడ్డ. నాగటితోదున్నిన రెండుచాళ్ళమధ్య కలవని భాగం; గొర్రు మొ. ఒకసారి చాళ్ళుదున్ని మలుపు తిరిగిన తరవాత, మొదటిచాళ్ళకు రెండోసారివేసే చాళ్ళకు మధ్య మిగిలిపోయిన ఎడం (తె. 34, 42; రా. 23, 27).

**గడ్డగొర్రు** పర్యా. చూ. పెద్దగొర్రు. నాలుగు మొదలు ఆరువరకూ చెక్కలు (కర్రుబిగించే కొయ్యలు) ఉన్న పెద్ద గొర్రు. చూ. చిత్రం 7 క. (రా. 17-19).

**గది** ఉ. గెది; పర్యా. ఈదు. గొర్రుచెక్కలమధ్య ఉండే ఎడం (కో. 18).

**గనిమారు** (-వేయు). పారతోచెక్కి మడికి వేసిన గనెం (కో. 1).

**గరపనాగలి** గరప (మెట్ట) నేలలు దున్నే నాగలి (కో. 18).

**గాజు** పర్యా. చూ. పొన్ను. గుంటకగుజ్జు మూతిచుట్టూ వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 9 క. 5 (తె. 14).

**గాజుముడి** పర్యా. చూ. చిట్టె. నాగలి మోకుచివర వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 12, 32, 34).

**గాడిపొడు** పర్యా. చూ. దోని. ఆరులో కర్రు బిగించటానికి తొలిచిన గాడి (తె. 36).

**గిన్నెవారు** పర్యా. చూ. తీపుతాడు. ఎదగొర్రుకు అమర్చిన జడ్డిగపుపిడత కదలకుండా బిగింపుకు వేసేతాడు. చూ. చిత్రం 7 ట. 4 (తె. 3, 10).

**గిరకపూట** పర్యా. అంటుపనకం. దున్నేటప్పుడు కాడికి ఏడికోలకు కలిపి కట్టేకట్టులో ఒకరకం (రా. 22).

**గుజ్జు** (1) పర్యా. చూ. చెక్క. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో దూర్చిన కొయ్యముక్క. చూ. చిత్రం 7 క. 4, 9. 4 (కో. 5, 6, 12–18, 22-25, 29, 32; తె. 1, 35–42; రా. 7); (2) పర్యా. చూ. కొడతం. ఒంటిపలుగు గుంటకకు నొగలబదులు అమర్చిన రెండ దుగుల పొడుగున్న కర్రముక్క. చూ. చిత్రం 9 ట. 3 (రా. 18).

**గుత్తికట్టు** పర్యా. చూ. ఏరగట్ట. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట (తె. 3).

**గుంటక** ఉ. గుంటిక, గుంటికి, గుంటికె, గుంటుక; రూ. గుంటవ, గూటవ. భూమిని చదునుచెయ్యటానికి పైరులో కలుపు తియ్యటానికి, విత్తనపుచాళ్ళు పూడ్చటానికి తోలే పరికరం. చూ. చిత్రం 9 క-ట (కో. 1-25, 29; 32; తె. 1-20, 22-29, 31-42; రా. 1, 7–28); **-చాలు** పర్యా. -పట్టె. గుంటకతో తోలినచాలు (తె.); **-పట్టె** చూ. గుంటకచాలు (తె. రా.).

**గుంటచ్చు** అడ్డంగా నిలువుగా తోలిన చాళ్ళు (తె. 38).

**గుంటవ** చూ. గుంటక (రా. 4, 6).

**గుంటికోంద్ర** పొలం పొడుగైనప్పుడు మధ్యనుంచే మలిపివేసే కోంద్ర (కో. 35, 36; తె. 30).

**గుంటిచాలు** గుంటుబెట్టి దున్నే చాలు; చూ. గుంటు (కో. 28; తె. 38, 40).

**గుంటిమలుపు** చేనునిడివిలో సగందూరంమాత్రం చాలు దున్ని వెనక్కు తిరగటం (కో. 27).

**గుంటు** (-పెట్టు,-వేయు) చతురస్రంగా లేని పొలంలో కొంతవరకు (సగంమేర మాత్రమే) కోంద్ర వెయ్యటం (కో. 47).

**గుంపు** పర్యా. చూ. మట్టుదొలి. విత్తనాలు పడటానికి గొర్రు చెక్కలకు వేసిన బెజ్జం. చూ. చిత్రం 7 క. 11 (తె. 9).

**గూకాలు** (బహు. గూకాళ్ళు). జడ్డిగం తాళ్ళు తగిలించటానికి గొర్రు దిండుకు రెండు చివరల దిగగొట్టిన ఇనప కొండి (రా. 14, 16).

**గూటం** పర్యా. చూ. చిలుక్కొయ్య. ఏరగట్టసామాను తగిలించే కొంకికర్ర (తె. 3).

**గూటవ** చూ. గుంటక (రా. 5, 14).

**గూటవగుంటక** పైరులో గడ్డి, కలుపు తీసే గుంటక. ?చూ. చిత్రం 7 చ, ట (రా. 15).

**గూబపలుగు** ఉ. గువపలుగు, గూపపలుగు; పర్యా. చూ. పలుగు. దంతెగుజ్జులను దాటి పక్కలకు వచ్చిన ఇనపపలుగు. చూ. చిత్రం 9 చ, ట. 10 (రా. 17, 18, 28).

**గెడెం** చూ. గెళెం (రా. 23).

**గెళెం** ఉ. గెలెం; రూ. గెడెం. పొలంలో దున్నే పరికరం ఏదైనా; సాగు పనిముట్టు (రా. 16–18).

**గేర** పర్యా. చూ. గడ్డ. నాగలితోదున్నిన రెండుచాళ్ళ మధ్య కలవనిభాగం; గొర్రు మొ. వి ఒకసారి చాళ్ళు దున్ని మలుపుతిరిగిన తరవాత, మొదటిచాళ్ళకు రెండోసారి వేసే చాళ్ళకు మధ్య మిగిలిపోయిన ఎడం (కో. 45).

**గొడికట్టె** పర్యా. గడకుప్పె, గొడిగుజ్జు, లోగాడిచిల్ల. ఎద్దు కాడిలోపైపుకు జరగకుండా కాడి కన్నంలో దిగవేసిన కర్ర (రా. 21, 25).

**గొడిగుజ్జు** పర్యా. చూ. గొడికట్టె. ఎద్దు కాడి లోపైపుకు జరగకుండా కాడి కన్నంలో దిగవేసిన కర్ర (రా. 4).

**గొడితె** ఉ. గుణితి, గొణితి; పర్యా. చూ. కొడిదాడు. నాగటి మోకు చివర పురి ఊడకుండా వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (కో. 46-51).

**గొడీదబ్బ** ఉ. గొరిదబ్బ. మోటలాగే ఎద్దుల మెడకింద పట్టెడ బదులు వేసే కొయ్యబద్ద (రా. 16,17).

**గొడివారు** పర్యా. చూ. దావారు, బొట్టె. పట్టెడ చివర కాడికికట్టే వారు (తోలుతాడు). చూ. చిత్రం 6 చ. 5 (రా. 17).

**గొడ్డ** చూ. గడ్డ (కో. 46-48, 50).

**గొండెమొల** చూ. కొండిమొల (కో. 1; రా. 1).

**గొనపనాగేలి** ఉ గనప-. అరిగిపోయిన మెట్టనాగలి; మాగాణి దున్నటానికి ఉపయోగిస్తారు. చూ. గొనం (కో. 2, 5, 8, 10, 11).

**గొనం** ఉ. గొనెం; విణ. గొనప-. అరిగిపోయిన మెట్టనాగలి, ఇది మాగాణి సాగుకు ఉపయోగిస్తారు. (కో. 45; నా. 1).

**గొప్పు** (క్రి.) మాగాణి తప్పు కోలతో తవ్వటం; వాడుక 'గొప్పుటం' (కో. 39).

**గొరుమట్టు** పర్యా. చూ. మట్టుదొలి. విత్తనాలు పడటానికి గొర్రు చెక్కలకు వేసిన బెజ్జం. చూ. చిత్రం 7 క. 11 (రా. 18-20).

**గొరుముంత** పర్యా. చూ. జడ్డిగంపిడత. జడ్డిగాని కమర్చిన కొయ్యగిన్నె; దీనిలోపోసిన గింజలు కింది వెదురు గొట్టాలగుండావచ్చి చాళ్ళలోపడతాయి. చూ. చిత్రం 7 ట. 1 (తె. 1. 6).

**గొర్తిగిన్నె** పర్యా. చూ. జడ్డిగంపిడత. జడ్డిగాని కమర్చిన కొయ్యగిన్నె: దీనిలోపోసిన గింజలు కింది వెదురుగొట్టాలగుండా జారి చాళ్ళలో పడతాయి. చూ. చిత్రం 7 ట. 1 (తె. 5).

**గొర్తిపట్టె** పర్యా. గొర్రుమొలక. నేలలో గొర్రుతో దున్నిన చాలు (రా. 9, 10, 18, 22-25, 27, 28).

**గొర్రు** (1) (కొట్టు, -రొప్పు); పర్యా. చూ. పలు (1) గొర్రు. మాగాణిలోతోలే పలుగొర్రు; చంటె. చూ. చిత్రం 12 (తె. 14, 33, 34, 38). (2) ఉ. గొరు; పర్యా. కూరె. దున్నటానికి, విత్తటానికి పనికివచ్చే పరికరం. భూమి బాగా పదునైనప్పుడు నాగలితోను, కొద్దిగానే పదునై సులువుగా తెగేట్టుఉంటే గొర్రుతోను దున్నుతాడు; నాగలితో ఒకచాలే దున్నటానికి వీలవుతుంది; గొర్రుతో మూడునుంచి ఎనిమిదిదాకా చాళ్ళు పడతాయి; శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల్లోతప్ప ఇది తెనుగుదేశమంతటా ఉపయోగిస్తారు. చూ. చిత్రాలు 7 క, చ (కో. 1-15, 17-20, 23-25, 30-33; తె. 1-6, 8, 12-14, 16, 18-42; రా. 1, 4-6, 8-28); **-కారు** చూ. -మల (రా.); **-కొయ్య** పర్యా. పట్టె. గొర్రు దిండులోదూర్చి బిగించిన కొయ్య; ఇవి మూడునుంచి ఎనిమిదిదాకా ఉండవచ్చు; కొలతలు: 1½′ పొడవు, 2-½″ వెడల్పు, 1½″ మందం; దీనిచివర కర్రు పైభాగంలో రంధ్రంవేసి జడ్డిగపు గొట్టం దాంట్లో దూరుస్తారు. చూ. చిత్రం 7 క. 4 (కో. తె. రా.); **-మల** రూ. మళ; పర్యా. చూ. కర్రు. గొర్రు చెక్కలకు బిగించిన ఇనపముక్క, దున్నేటప్పుడు నేలలోదిగేభాగం. చూ. చిత్రం 7 క. 5 (తె. రా.); **-మొలక** పర్యా. చూ. గొర్తిపట్టె. నేలలో గొర్రుతోలిన చాలు (రా.).

**గోడిచెక్క** చూ. గోరచెక్క (కో. 40).

**గోడిపట్టె** ఉ. గోడీపట్టె, గోలిపట్టె; చూ. గోడుపట్టె (కో. 38, 41, 51).

**గోడు** (-కొట్టు, -పొత్తు)? మాగాణిలో తోలే గోర చెక్క (కో. 39, 41).

**గోడుపట్టె** రూ. గోడిపట్టె. రెండుపొర్లు దున్నిన తరవాత మాగాణిలో చదును చెయ్యటానికి ఉపయోగించే పరికరం; దీనికి దిండు, పలక, మేడి, ఏడికర్ర ఉంటాయి. చూ. చిత్రం 9 త (కో. 34, 36, 39).

**గోరచెక్క** ఉ. గోర్చెక్క; రూ. గోడిచెక్క; పర్యా. గోడు, గోరపలక, పట్టిచెక్క. మాగాణిలో దున్నినతరవాత చదునుచేసే సాధనం; కొన్నిచోట్ల గోడుపట్టెకే ఈపేరు. చూ. చిత్రం 9 త (కో. 1, 2, 4; రా. 1-3, 8, 13, 15, 17).

**గోరపలక** పర్యా. చూ. గోరచెక్క. మాగాణిలో దున్నిన తరవాత చదునుచేసే సాధనం; కొన్నిచోట్ల గోడు పట్టెకే ఈపేరు. చూ. చిత్రం 9 ప (రా. 16, 19).

**చంక** పర్యా. ఎద, చంకమడత, చెంకె, రొమ్ము. పణతకూ అరుకూ మధ్యనున్న వంపు లోపలివైపు. చిత్రం 6 క. 4 (కో. 13, 14, 18, 24; తె. 6, 7, 12, 32, 34, 37-39, 41); **-నాటు** పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చే చోట (దుంప సందులో) అవసరాన్నిబట్టి ఎలువు సలువులకు కొట్టే పేడు. చూ. చిత్రం 6 క. 10 (తె.); **-మడత** చూ. చంక (తె).

**చదునుపట్టె** దున్నిన పొలం చదునుచెయ్యటానికి ఉపయోగించే అడ్డపట్టె (కో. 41, 51).

**చప్ప** (1) పర్యా. చూ. చెక్క. గొర్రు, గుంటక మొదలగువాటి దిండులో దూర్చే కొయ్యముక్క. చూ. చిత్రం 7, 9.4 (కో. 9; తె. 33). **-గొర్రు** పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో విత్తక ముందు చదును చెయ్యటానికి, విత్తిన తరవాత కలుపు, గడ్డిపోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 12 (కో.); (2) పర్యా. ఎదపేడు, ఎలువుపేడు, ఎల్గుపీట, ఎల్గుపేడు, గడెం, జీబు, పత్తెరిక, బెడెం, చంకనాటు, సలుగుపీట, సలువుపేడు, సల్గుపేడు, రొమ్ముపేడు, ఏడికోలను పణతలో దూర్చేచోట దుంప సందులో అవసరాన్నిబట్టి ఎలువు సలువులకు కొట్టే పేడు. చూ. చిత్రం 6 క. 10 (కో. 6, 25, 33, 37-41, 43, 45-48, 50); **-పేడు** చూ. చప్ప (కో.).

**చల్లకంచాలు** విత్తనం చల్లేముందు తోలినచాలు (రా.

9, 13).

**చాయచాలు** ఉ. సాయిసాలు. చక్కగా (వంకర లేకుండా) వేసే చాలు (కో. 27-29, 35, 36).

**చాలు** (-పట్టు, -పోయు, -వేయు) పర్యా. పట్టె. నాగలి మొదలైన పరికరాలతో దున్నినప్పుడు నేల తెగిన పొడుగు; దున్నటం, దుక్కి (కో. 6, 9-37, 39-41, 43-51; తె. 1-12, 14-31, 33-42; రా. 2, 4, 5, 7, 9, 11, 13, 16-20, 22-28); **-కోండ్ర** రూ. చాలుకోర్న. కోండ్ర వేయకుండా (ఎడం వదలకుండా) పక్క పక్కగా వచ్చేట్టు దున్నిన చాప్ను (రా.); **-కోర్న** చూ. చాలుకోండ్ర (రా.); **-గట్టు** (క్రి.) నాగలి లోతుగా తెగకుండా ఉండటానికి మోకు బిగించి కట్టటం (కో.); **-గడ్డ** పర్యా. చూ. గడ్డ. నాగలితో దున్నిన రెండు చాళ్ళమధ్య కలవని భాగం; గొర్రు మొ.వి ఒకసారి చాళ్ళు దున్ని మలుపుతిరిగిన తరువాత, మొదటి చాళ్ళకు రెండోసారి వేసే చాళ్ళకు మధ్య మిగిలిపోయిన ఎడం (రా.); **-దుక్కి** ఉ. చాల్దుక్కి. మెట్టలో మొదటిసారి దున్నటం; కొన్నిచోట్ల రెండోసారి దున్నటం (కో. తె. రా.); **-ముంత** పర్యా. చూ. అక్కిడి కట్టె. ఒకపైరు విత్తిన చాళ్ళమధ్య ఆముదాలు, పత్తి మొ. వాటి విత్తనాలు వేసే కొయ్య పరికరం; దీన్ని నాగలికి గాని గొర్రుకుగాని వెనకవైపు కట్టి ఎద(వెద) బెడతారు. చూ. చిత్రం 8 క, చ (తె.); **-విడుచు** (క్రి.) ఉ. సాలిడవటం, సాలిడచటం. నాగలి లోతుగా తెగటానికి మోకు వదలు చెయ్యటం (కో. తె.).

**చాళ్ళగుంటక** (1) పర్యా. చూ. అచ్చుగుంటక మిరప పొగ తోటల్లో నాట్లు వెయ్యటానికి తోలే గుంటక, దీనికి కొయ్య పలుగులే ఉంటాయి. చూ. చిత్రం 10 ట (కో. 25); (2) రూ. చాళ్ళగుంటవ, చాళ్ళగూటవ. విత్తిన తరవాత చాప్ను పూడ్చే గుంటక. చూ. చిత్రం (తె. 33; రా. 8, 10, 18, 21, 23–25).

**చాళ్ళగుంటువ** చూ. చాళ్ళగుంటక (రా. 6).

**చాళ్ళగూటువ** చూ. చాళ్ళగుంటక (రా. 14).

**చాళ్ళసేద్యం** పర్యా. చూ. పైరుసేద్యం. కలుపు పోవటానికి, నేల గుల్లబారటానికి పైరులో చేసే సాగు (రా. 14, 15).

**చిక్కు** పర్యా. చూ. కొండి. కర్రను అరుకు బిగించే ఇనపకట్టు. చూ. చిత్రం (తె. 15, 16).

**చిట్టికట్టు** బురదమడక (నాగలి) కట్టేటప్పుడు మోకు బదులు వారిణెకు పణతకు తగిలించే కర్ర (రా. 5, 6).

**చిట్టె** (1) పర్యా. ఇచ్చె, పిల్లిచ్చె, మోకిచ్చె, కుంటెన, గాజుముడి, చులకర, చెరుగు, జులుకు, ములక, సురుకు, సుర్థవ, సూదుకర్ర. నాగటిమోకు చివరవేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 9; రా. 18, 21); (2) పర్యా. చూ. కొలికి. నాగటి మోకు మొదటికొస మెలితిప్పి వేసిన ముడి. దీన్ని మేడికి తగిలిస్తారు. చూ. చిత్రం 6 చ. 8 (రా. 21, 22).

**చిడత** పర్యా. చూ. తీపుతాడు. జడ్డిగపు పిడత కదలకుండా బిగింపుకువేసే తాడు. చూ. చిత్రం 7 ట. 4(తె. 4).

**చిన్నగొర్రు** పర్యా. తొలిగొర్రు, పొట్టిగొర్రు, బుడ్డగొర్రు. పొగ, మిరప, వేరుసెనగ మొ. చేలలో తోలే చిన్నసైజు గొర్రు; దీని అడ్డ చిన్నది, మూడు కొయ్యలుంటాయి (కో. 11; తె. 24; రా. 5, 6, 10, 14, 17–19, 22, 23, 25, 28).

**చిన్నమొల** పర్యా. చూ. కర్రుమొల. గొర్రుచెక్క (కొయ్య)కు కర్రుబిగించే ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 6 (కో. 10-13, 19, 24; తె. 37, 39).

**చిరతకట్టె** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగల మీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (తె. 1, 2; రా. 28).

**చిరతకొండి** పర్యా. చూ. అంకెనమొల. గొర్రుభాగం, అంకెన తగిలించే ఇనపకొండి; ఇది గొర్తి కొయ్యమీద ఉంటుంది. చూ. చిత్రం 7 క. 7 (రా. 28).

**చిలకట** ఉ. చిలకడ; పర్యా. చూ. కొలికి. నాగటి మోకు మొదటి కొస మెలితిప్పి వేసిన ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 35, 37, 39, 42; రా. 23).

**చిలుకొయ్య** పర్యా. కొడతం, గూటం. ఏరకట్ట సామాను తగిలించే కొంకికర్ర (తె. 8, 10, 12).

**చిల్ల** ఉ. జిల్ల; రూ. చీల; పర్యా. చూ. పన్ను. పండ్ల మాను, కార్లపొలిక మొదలగువాటి దిండుకు వేసిన కొయ్య పన్ను; కొన్నిచోట్ల ఇనపది. చూ. చిత్రం 12.3 (కో. 3; రా. 5, 7, 27).

**చీల** ఉ. సీల; చూ. చిల్ల (కో. 33).

**చీలుపునొగ** పర్యా. చూ. ఒల్లంతు. గొర్రు, గుంటక మొదలైనవాటికి నొగగా వేసిన పంగలకొయ్య (కో. 5, 12).

**చుట్టుకోండ్ర** రూ. చుట్టుకోర్న. పొలంచుట్టూ వచ్చేట్టు వేసిన కోండ్ర; దున్నటం పూర్తిఅయితే కోండ్ర కలుస్తుంది (కో. 20, 35; తె. 40; రా. 18).

**చుట్టుకోర్న** చూ. చుట్టుకోండ్ర (రా. 22).

**చులకర** రూ. జులుకు, సురుకు; పర్యా. చూ. చిట్టె. నాగటి మోకుచివర వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8. (తె. 34).

**చెక్క** (1) పర్యా. కొయ్య, గుజ్జు, చప్ప, పన్ను. గొర్రు, గుంటక మొదలగువాటి దిండులో దూర్చిన కొయ్యముక్క. చూ. చిత్రం 7 క, 9.4 (కో. 1-15, 18, 24, 29, 32; తె. 23, 31, 37-39, 42; రా. 1, 5, 6,

8-11, 14-16, 23-28); (2) పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొదలగువాటి నిర్మాణంలో వేసిన అడ్డ పట్టె. చూ. చిత్రాలు 7 క, 9—12.1 (కో. 22, 43-45, 48; తె. 5, 24, 33; రా. 2).

**చెక్కుడ** ఉ. చిక్కుడ; పర్యా. ఈడి, ఈడిక, తట్టుడు, తెండి. గుంటక తోలేటప్పుడు పలుగుకు చుట్టుకున్న గడ్డీ గాదం (రా. 2, 3, 16, 17, 22).

**చెంగొత్తు** (క్రి.) మాగాణిగట్లు పారతో తవ్వి బాగు చేయటం (కో. 4-6, 9, 15).

**చెంచెలపోత** గట్టుదగ్గర నాలుగునుంచి ఎనిమిదివరకు చాళ్ళుదున్నటం; మందలచాళ్ళు (కో. 31).

**చెంద్రకోల** చూ. చెరణాకోల (కో. 10, 13; తె. 9, 14, 37, 42).

**చెయిదంతె** పైరులో కలుపు పోవటానికి లాగే ఒంటి పలుగు పరికరం (రా. 14).

**చెరణాకోల** ఉ. శరణాకోల, చెర్నాకోల; రూ. చెంద్రకోల, చెర్లకోల; పర్యా. చూ. చెలకోల. కాడికికట్టిన ఎద్దుల్ని తోలే కర్ర; దీనికి వాయతో అల్లినతాడు కడతారు. చూ. చిత్రం 13 (కో. 16, 19, 20, 22, 25, 37, 40, 48, 50; తె. 39, 40).

**చెరుగు** (1) చేలో ఒకమూల; పొలం మూల (తె. 31); (2) పర్యా. చూ. చిట్టె. నాగటి మోకు చివరవేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 37).

**చెర్లకోల** ఉ. సెర్లకోల, సెర్రకోల; చూ. చెరణాకోల (తె. 5, 7, 8, 10).

**చెలకదుక్కి** ఉ. చెల్కదుక్కి. మెట్టపొలంలో దున్నటం; 'చెలక' అంటే ఇక్కడ 'మెట్ట' (తె. 1, 2, 22).

**చెలకదున్నకం** మెట్టదుక్కి, మెట్టసాగు (తె. 5).

**చెలకనాగలి** ఉ. చెలికె-; పర్యా. చూ. మెట్టనాగలి. చెలక (మెట్ట)నేలలు దున్నేది. చూ. చిత్రం 6 క (తె. 5, 7, 9).

**చెలకసేద్యం** ఉ. సెలకసేద్దెం; పర్యా. చూ. బీటి సేద్యం. తొలకరికి ముందు పొలంలో గుంటకతో దున్నటం; మొదటిసాగు (తె. 8, 12).

**చెలకోల** ఉ. సెలకాల; సెలకోలి, సెలకోల; పర్యా. కొరడా. చెంద్రకోల, చెరణాకోల, చెర్లకోల, జాటి. కాడికి కట్టిన ఎద్దులను తోలే కర్ర; దీనికి తోలుతాడు కడతారు; తాడు చివరలు రెండు నాలికల్లాగా చీలిఉంటాయి. ఈ భాగానికే 'చెల' అని పేరు. చూ. చిత్రం 13 (కో. 8, 9, 13, 14, 16, 19, 20; తె. 3, 4; రా. 5-7, 14, 21, 23—28).

**చేదంతె** పర్యా. అచ్చు(కట్టు)దంతె, అచ్చుమాను, దంతె, దంతెన, లద్దిబిల్ల. పొలాన్ని చిన్నచిన్న మళ్ళుగా చేసుకోవటానికి ఉపయోగించే కొయ్యపరికరం. చూ. చిత్రం 11 (తె. 1).

**చేడ** ఉ. శాడ; పర్యా. దమ్ము. మాగాణికి నీళ్లుపెట్టి మొదటిసారి దున్నటం (రా. 4, 5, 8, 13, 19, 26); **-చాలు** ఉ. శాడసాలు. మాగాణికి మొదటిసారి దమ్ముపెట్టి దున్నిన చాలు (రా.);**-దుక్కి** దంపదుక్కి (రా.).

**చేనిమడక** పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టనేలలు (చేలు) దున్నేది. చూ. చిత్రం 6 క (రా. 5).

**చేనుదుక్కి** మెట్టదుక్కి (రా. 4).

**చౌకనాగలి** పర్యా.చూ. మెట్టనాగలి. చౌకనేలలు దున్నేది; మెట్టనాగలి; ఆకృతి భేదంలేదు (తె. 13, 15, 27).

**జడ్డిగపుకర్ర** చూ. జడ్డిగంకర్ర (కో. 2, 4; 10-13, 15, 17-20, 22).

**జడ్డిగప్పిడత** చూ. జడ్డిగంపిడత (కో. 1. 9-12, 14, 23; తె. 37; రా. 26).

**జడ్డిగం** ఉ. జడిగెం, జడిగం, జడెగం, జడ్డిగెం, జణిగెం; రూ. దడ్డిగం. ఎదగొర్రుకు అమర్చిన విత్తే పరికరం. చూ. చిత్రం 7 ట (కో. 1—15, 17-20, 22-25, 31-33; తె. 2-4, 5, 9—11, 15; 18, 21-23, 26-28, 32, 35, 37—42; రా. 1, 5, 6, 8-11; 14-28); **-కట్టె** జడ్డిగప్పిడత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి వీలుగా అమర్చిన వెదురుగొట్టం. చూ. చిత్రం 7 ట. 2 (కో. రా.); **-కర్ర** రూ జడ్డిగపుకర్ర. చూ. -కట్టె (కో. తె.); **-కొమిరె** చూ. -బొడ్డు (కో.); **-కొళవి** ఉ. -గొళవి; చూ. -కట్టె (రా.); **-కోవి** చూ. -కట్టె (కో. రా.); **-గిన్నె** చూ. -పిడత (తె. రా.); **-గిలక** చూ. -బిళ్ళ (కో. రా.); **-గుబ్బ** చూ. -బొడ్డు (కో. రా.); **-గొట్టం** చూ. -కట్టె (తె.); **-చిప్ప** చూ. -పిడత (రా.); **-చిలక** చూ. -బిళ్ళ (కో.); **-పంతె** చూ. -గిన్నె (తె.); **-పిడత** రూ. జడ్డిగప్పిడత, దడ్డిగంపిడత; పర్యా. గొరుముంత, గొర్రిగిన్నె; (జడ్డిగం)గిన్నె, -పంతె, -పీట, -బిళ్ళ. -బుడ్డి, ముంత, -చిప్ప, -బుర్ర. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె; దీనిలోపోసిన గింజలు కింది వెదురు గొట్టాలగుండావచ్చి చాళ్ళలో పడతాయి. చూ. చిత్రం 7 ట. 1 (కో. తె. రా.); **-పీట** చూ. -పిడత (తె.); **-బిళ్ళ** (1) పర్యా. ఉగ్గు, జడ్డిగంగిలక, జడ్డిగంచిలక. జడ్డిగపు తాళ్ళు బిగించటానికి అమర్చిన కొయ్యపలక. చూ. చిత్రం 7 ట. 3 (కో. తె. రా.); (2) చూ. జడ్డిగంగిన్నె (కో. రా.); **-బుడ్డి** చూ. -పిడత (తె.); **-బుర్ర** చూ. -పిడత (కో.); **-బొంగు** చూ. -కట్టె (కో. తె.); **-బొడ్డు** జడ్డిగప్పిడతలో విత్తనాలు పోయే రంధ్రాల మధ్య ఎత్తుగా

చెక్కిన భాగం; దీనివల్ల పోసిన విత్తులు అన్ని రంధ్రాల్లోకి సమానంగా పోతాయి. చూ. చిత్రం 7 ట. 5 (కో. రా.); **-బొర్ర** చూ. -కట్టె (రా.); **-ముంత** చూ. -గిన్నె (తె.); **-ముల్లు, -మొగ్గ** చూ. -బొడ్డు (కో.); **-లడె** చూ. -కట్టె (తె.); **-లొట్ట** చూ. -కట్టె (తె. రా.).

**జంటక్కిడి** పర్యా. జోడక్కిడి. రెండు లొట్టలు గింజలు జారే వెదురుబొంగులు వేసిన అక్కిడి. చూ. చిత్రం 8 చ. (రా. 17, 24).

**జంతె** చూ. దంతె (రా. 17).

**జంతెగుంటక** చూ. దంతెగుంటక (రా. 17).

**జంపుగుంటక** గొర్రుతో విత్తిన చాళ్ళు పూడ్చే పెద్ద పలుగుగుంటక (తె. 1; రా. 10).

**జంబు** (-గొట్టు)ఉ. జమ్ము; పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో నీళ్ళు పెట్టింతరవాత చదును చెయ్యటానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 12 (కో. 33; తె. 6–9, 11, 13, 20, 22–26, 29, 40).

**జలువు** ? తేలిగ్గా (సులువుగా) తెగే నాగలి, మొ. వ్యవసాయ పరికరం (తె. 3).

**జలువుబిళ్ళ** ఉ. జలువుబిల్ల. నాగలి, గుంటక, గొర్రు, మొ. సాధనాలు తోలేటప్పుడు నేల లోతుగా తెగటానికి వారిజెకువేసే కొయ్యబిళ్ళ (కో. 7–9; రా. 12, 19, 21, 23).

**జల్లుదున్నకం** చివరిసారి దున్నటం; ఆఖరి చాలు (కో. 39).

**జాటి** చెలకోల. పర్యా. చూ. కాడికికట్టిన ఎద్దులను తోలే కర్ర; దీనికి వారు(తోలు)తో అల్లిన కొసలు కడతారు చూ. చిత్రం 13 (రా. 2).

**జీబు** పర్యా. చూ. చప్ప, ఎలువుసలువులకు ఉపయోగించే తాటిమట్ట పేడు. చూ. చిత్రం 6 క. 10 (కో. 22).

**జులుకు** రూ. చులకర, సురుకు; పర్యా. చూ. చిట్టె. నాగటిమోకు చివరవేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 36).

**జొత్తికె** ఉ. జతికె, జొత్తికె; రూ. దొత్తె; పర్యా. చూ. పట్టెడ. ఎద్దులను కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలు లేక నార పట్టా. చూ. చిత్రం 6 చ. 4 (కో. 11; తె. 1, 3-5, 12; రా. 17, 22, 23, 28). **-చిట్టె, -తమ్మె** పర్యా. చూ. బొట్టె. కాడికి తగిలించే పట్టెండ్ల కొసతాడు. చూ. చిత్రం 6 చ. 5 (రా.); **-పలుపు** పర్యా. చూ. పలుపు. జొతికెలకు బదులు ఎద్దుల మెడ కిందుగా దీని కాడికి కట్టేతాడు (రా.).

**జోడక్కిడి** పర్యా. జంటక్కిడి. రెండు లొట్టలు (గింజలు పొయ్యే వెదుళ్ళు) వేసిన అక్కిడికట్టె. చూ. చిత్రం 8 చ (రా. 17).

**జోడు** పర్యా. చూ. పట్టెడ. ఎద్దులను కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలు పట్టాలజత. చూ. చిత్రం 6 చ. 4 (తె. 13, 14, 15, 19, 20).

**టాక** (-వెయ్యటం) పర్యా. ఒదివాటు. ఏడికోలను పణతలో దూర్చి బిగవటానికి ఎత్తికొట్టటం (కో. 8; రా. 18).

**టాప** చూ. తాప (కో. 13, 18).

**టెంకె** పర్యా. చూ. చంక. పణతకూ ఆరుకూ మధ్య నున్న వంపు లోపలివైపు. చూ. చిత్రం 6 క. 4 (కో. 10).

**తగిరె** ఉ. తగిర, తగిరి; చూ. తమిరె (తె. 4–7, 9, 12, 33, 34, 36, 38; రా. 11, 18, 22–26, 28).

**తట్టుడు** పర్యా. చూ. చెక్కడ. గుంటక తోలేటప్పుడు పలుగుకు చుట్టుకున్న గడ్డీగాదం (తె. 39).

**తండుజీల** (1) పర్యా. చూ. పిర్రచీల. ఏడికోలను పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13; (2) పర్యా. చూ. నొగచీల. గొర్రు గుంటక మొదలగువాటి దిండులో నొగలు దూర్చి వెనక వైపు కొట్టే మేకు (కో. 17).

**తమిరె** ఉ. తమిర, తమిరి, తమెరి; రూ. తగిరె, తైర; పర్యా. కొంకిరిమళ, పనకంచీల, పరిసీల, పూజుమేకు, పూజుమొల్లం, బొడ్డుచీల, మొల్ల. కాడిమధ్య పైవైపుకొట్టిన ఇనపమేకు. చూ. చిత్రం 6 చ. 2 (కో. 6, 7, 9–15, 17, 20, 22-25; తె. 31, 37, 39, 42; రా. 9, 27).

**తరపుకర్ర** మాగాణిలో పెళ్ళలు చితకటానికి తోలే అడ్డపట్టె. చూ. తరం (కో. 21).

**తరపుసేద్యం** ఉ. తరపుసేద్దెం, తరిపిసేద్దెం; పర్యా. చూ. బీటిసేద్యం. తొలకరికి ముందు పొలంలో గుంటకతో దున్నటం; మొదటిసాగు (రా. 16, 17).

**తరం** ఉ. తురం (-తొక్కు-, -లాగు). దున్నినప్పుడు మెదగనిగడ్డలు; వీటిని నిచ్చెనకుగాని, కొయ్యకుగాని తాడు గట్టి లాగి చదరంచేస్తారు (కో. 13, 20, 22–24).

**తరినాగలి** పర్యా. చూ. బురదనాగలి. తరి (మాగాణి) నేల దున్నేనాగలి; దంపనాగిలి. చూ. చిత్రం 6 ట (తె. 16).

**తరిపిగుంటక** విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి తియ్యటానికి మెట్టలో తోలే గుంటక. చూ. చిత్రం 9 చ. ట (రా. 16).

**తల** పర్యా. చూ. పణత. ఏడికోలదూర్చే కొయ్య మొద్దు. నాగటివంపు పైభాగం. చూ. చిత్రం 3 క. 3 (తె. 3-5, 7, 9, 12, 31, 36; రా. 4, 5, 14–18, 20, 21, 23, 28).

**తలచాలు** ఉ. తల్సాలు; పర్యా. చూ. మందలచాలు.

గట్టుదగ్గర దున్నిన చాలు.(కో. 20; తె. 5).

**తలబోదు** రెండుగట్ల వెంబడి ఎద (వెద)బెట్టినచాలు (కో. 21).

**తలేటికాణి** మెట్టదుక్కిలో ఒక కాడికి ముందువైపు కట్టిన మరొకకాడి (తె. 10).

**తలేటిగుంటక** పర్యా. చూ. పెద్దగుంటక. వేరుశెనగ కాయలు పైకి పెళ్ళగించటానికి తోలే పెద్దగుంటక; దీనికి రెండుకాండ్లు, నాలుగుగెద్దులు కట్టి దున్నుతారు (రా. 10).

**తలేటినాగేలి** పర్యా. తలేటి(రు)మడక. ఒకటికంటె ఎక్కువ కాండ్లుకట్టి దున్నే పెద్ద మెట్టనాగలి (తె.3).

**తలేటిమడక** రూ. తలేరు-; పర్యా. తలేటినాగేలి. ఒకటికంటె ఎక్కువ కాండ్లు కట్టి దున్నే పెద్ద మెట్టనాగలి (రా. 21).

**తలేటిమోకు** పర్యా. దండెడ. నాగలినుంచి తలేటి కాడికి కట్టే మోకు (రా. 21).

**తలేరుమడక** చూ. తలేటిమడక (రా. 17).

**తల్లికోంద్ర** మొదటి కోంద్ర; చూ. కోంద్ర (కో. 23; 26-36; తె. 30).

**తల్లిచాలు** (-బోయి) కోంద్రవేసే మొదటిచాలు; తల్లికోంద్ర (కో. 37, 39, 43, 44, 48-50).

**తాడు** పర్యా. చూ. మోకు. (1) నాగలి, గొర్రు, గుంటక మొ. వ్యవసాయ పరికరాల్లో కాడి, నొగలు కలిపి కట్టే మోకు; (2) ఏదైనా సన్నని మోకు. చూ. చిత్రం 6 చ. 7 (కో. 3, 30, 51; తె. 4, 8-12, 14, 15, 17, 19, 25, 29, 32-34; రా. 3, 18, 21, 23).

**తాప** రూ. టాప. గొర్రు, గుంటక మొ. వాటి అడ్డ మీద బిగువుకు పరిచిన ఇనపరేకు (కో. 10, 11).

**తాళ్ళకట్ట** పర్యా. చూ. ఏరకట్ట. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల, మొదలైన తాళ్ళగుది లేక కట్ట (కో. 45; తె. 1, 2, 7, 8, 11, 29, 32, 34, 36).

**తాళ్ళగుత్తి** పర్యా, చూ. ఏరగట్ట. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల, మొదలైన తాళ్ళగుది లేక కట్ట (తె. 4).

**తిప్పన్** ? పర్యా. చూ. అక్కిడికట్టె. గొర్తి వెనక జొన్నలువిత్తే మూడు గొట్టాల అక్కిడి. (పోలికకు) చూ. చిత్రం 8 క, చ (తె. 9).

**తిమ్మె** ఎడ్ల మెడకింద వేసే పట్టెడ తాడు చివరిముడి (తె. 39).

**తిరుగుదున్నకం** : పర్యా. చూ. ఇరవాలు. రెండో సారి దున్నటం; కొన్నిచోట్ల మాగాణిలో మూడోసారి దున్నటం (తె. 38).

**తీగెచాలు** పొలంలో చుటూరా కోంద్రవేసి కలుపు కుంటూ వచ్చిన చాలు (కో. 18, 23).

**తీపుతాడు** పర్యా. ఉక్కడం, గిన్నెవాడు, చిడత, బిగువుతాడు, బిగువునులక, మెలుగుతాడు, సరదాడు. జడ్డిగపు పిడత కదలకుండా బిగింపుకువేసేతాడు. చూ. చిత్రం 7 ట. 4 (తె. 35, 37-39, 42).

**తుండు** (1) పర్యాచూ. అడ్డ. మడిలో గడ్డ నలగ టానికి తోలే కొయ్యమొద్దు. (రా. 2); (2) పర్యా. చూ. కొడతం. ఒంటి పలుగు దంతెకు నొగలు బదులు అమర్చిన రెండడుగుల పొడుగున్న కర్రముక్క. చూ. చిత్రం 9 ట. 2 (రా. 13); (3) పర్యా. చూ. పణత. ఏడికోల దూర్చే కొయ్యమొద్దు, నాగటి పంపు పైభాగం. చూ. చిత్రం 8 క. 3 (రా. 2).

**తూట** పర్యా. చూ. పణత. ఏడికోల దూర్చే కొయ్య మొద్దు, నాగటివంపు పైభాగం. చూ. చిత్రం 6 క. 3 (కో. 39).

**తెండి** పర్యా. చూ. చెక్కడ. గుంటక తోలేటప్పుడు పలుగుకు చుట్టుకున్న గడ్డిగాదం (రా.5)

**తెరచాలు** మూడోసారి దున్నిన చాలు; మూడోసారి దున్నటం (తె. 20).

**తైర** ఉ. తైరె; చూ. తమిరె (తె. 1, 8, 35).

**తొడుగు** ఉ. తొడవు, (-కొట్టు,-లాగు); పర్యా. కంప. వెదపెట్టిన తరవాత గింజలు పూడిపోవటానికి తోలే కంప; కొమ్మలు, ముళ్లకంచెలు కుప్పగా లాగుతారు (కో. 8, 27, 33, 34, 36, 39, 41, 45; రా. 17–18).

**తొడ్మె** పర్యా. చూ. సోగ. మేడిపైన పట్టుకోటానికి బిగించిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6క. 12 (తె. 16).

**తొరిగొర్రు** పర్యా. చూ. చిన్నగొర్రు. పొగ, మిరప, వేరుసెనగ, మొదలయిన చేలలో తోలే చిన్నసైజు గొర్రు. దీని అడ్డ చిన్నది (కో. 12; తె. 39).

**తొలి** ఉ. తొళి; రూ. తొల్ల, దొల; పర్యా. బొక్క, రంధ్రం. నాగటిపణత, కాడి, మొదలయినవాటిలో తొలిచిన రంధ్రం. చూ. చిత్రం 6 చ. 3 (కో. 5; తె. 30, 31, 39, 41, 44, 45; రా. 1).

**తొలిచాలు** మొదటిసారి దున్నినచాలు; నిలువుచాలు (కో. 6, 26–28, 31, 32, 35, 36, 41, 45; తె. 40, 41; రా. 28).

**తొల్ల** చూ. తొలి (కో. 20).

**తోకనాగలి** నాగలి తలకు రంధ్రం గొట్టి దానిలో మేడి దూర్చి కట్టిన మెట్టనాగలి (కో. 41).

**తోకమేడి** సోగ అమర్చకుండానే పట్టుకోటానికి వీలుగా చివర వంపు తిరిగిన మేడి (కో. 26, 28, 33).

**తోడిరువాలు** ఇరవాలు తరవాత దున్నటం; మూడో చాలు (తె. 37, 42).

**తోడెనమూరు** ఇరవాలు తరవాత దున్నినచాలు; మూడోసారి దున్నటం (కో. 39).

**దడ్డిగం** చూ. జడ్డిగం (కో. 21); **-పిడత** చూ. జడ్డిగంపిడత (కో.).

**దంకె** ఎద్దు ముడ్డిమీద ములుగర్రతో పొడవటంవల్ల ఏర్పడ్డగుర్తు (కో. 27).

**దండకట్టు** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగల మీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (కో. 1; తె. 1; రా. 6).

**దండకర్ర** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగల మీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (కో. 4).

**దండగ(ల)పట్టె** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (కో. 8, 9; రా. 27).

**దండిగమాను** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (రా. 1).

**దండె(లు)** పర్యా. నొగలు. గొర్రు, గుంటక, మొ. వాటి దిండుకు బిగించి కాడిమీద మోపే పొడుగు కొయ్యలు. చూ. చిత్రం 7, 9, 10 క. 2 (కో. 15, 39, 40, 45–49).

**దండెగడ** చూ. దండెగాడి (కో. 12, 18, 24; తె. 29; రా. 1, 9).

**దండెగాడితాడు** పర్యా. చూ. మెలుముతాడు. గొర్తి చెక్కలకు దండెగాడి పట్టెకు కలిపి కట్టే తాడు లేక వారు. చూ. చిత్రం 7 క. 9 (కో. 12, 13, 18).

**దండెగాడి(పట్టె)** ఉ. దండగాడి-, దండిగాడు-; రూ. దండెగడ, దండెగాణి; పర్యా. అంకెండ్లకట్టె, అంకెనపీట, అంకెప్పీట, అనికెలకట్టె, ఒత్తుగట్టె, కొంకిణికట్టె, చిరత కట్టె, దండకట్టు, దండకర్ర, దండగ(ల)పట్టె, దండిగ మాను, దండెబడెపట్టె, దండెనిమాకట్టె, మిలువార్లదబ్బ, మెలుగుపీట, మెలుము(ల)కట్టె. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (కో. 5, 6, 10-15, 17-19; రా. 1, 9).

**దండెగాణి** ఉ. దండెగాని(పట్టె); చూ. దండెగాడి (కో. 22, 23, 25; తె. 24, 25, 37-42); **-వారు** పర్యా. చూ. మెలుముతాడు. దండగాడిపట్టెను బిగించికట్టే తోలు. చూ. చిత్రం 7 క. 9 (తె.).

**దండెబడెగట్టె** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (రా. 14).

**దండెమానికట్టె** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (రా. 12).

**దంతె** (1) ఉ. దంతి; రూ. జంతె; పర్యా. చూ. పాపటం. పైరులో గడ్డి, గాదం, కలుపు మొ.వి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 10 క, చ (కో. 7, 10-13; 24, 25; తె. 1-3, 5, 7, 9, 11, 12, 31, 33, 37-42; రా. 3, 4, 13, 14, 18, 21, 22); (2) ఉ. దంతి, రూ. దంతెన; పర్యా. చూ. చేదంతె. పొలాన్ని చిన్నచిన్న మళ్ళుగా చేసుకోవటానికి ఉపయోగించే కొయ్యపరికరం. చూ. చిత్రం 11 (కో. 1, 12, 23, 50; తె. 13, 15-28).

**దంతెగుంటక** రూ. జంతెగుంటక; పర్యా. చూ. పాపటం. పైరులో కలుపుతీసే రెండుమూడు పలుగుల గుంటక. చూ. చిత్రాలు 9 చ, 10 క, చ (కో. 7, 8, 10-13, 24, 25; తె. 1, 2, 7, 31, 33-42; రా. 20, 21, 26-28).

**దంతెన** ఉ. దంతిని; చూ. దంతె (కో. 43, 45, 46, 48).

**దంతెసోగ** పర్యా. చూ. పాపటం. పైరులో గడ్డి, గాదం, కలుపు, మొ. పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 10 క, చ (తె. 9, 11, 40, 41; రా. 17, 18, 22, 23).

**దందెడ** పర్యా. తలేటిమోకు. నాగలినుంచి తలేటి కాడికి కట్టే మోకు (తె. 10).

**దబ్బ** పర్యా. చూ. కొడతం. ఒంటిపలుగు దంతెకు నొగలబదులు అమర్చిన రెండడుగుల పొడుగున్న కర్ర ముక్క. చూ. చిత్రం 9 ట. 2 (రా. 21).

**దంపదుక్కి** నీళ్ళుపెట్టి దున్నిన మాగాణిపొలం; మాగాణిలో నీళ్ళుపెట్టి దున్నటం (రా. 27).

**దంపనాగలి** రూ. దమ్మ–; పర్యా. చూ. బురద నాగలి. దమ్ముచెయ్యటానికి మాగాణి నేలల్లో దున్నే నాగలి. చూ. చిత్రం 6 ట (కో. 20, 21, 23, 25, 27, 28, 32–37, 44).

**దమ్ము** (-చేయు); పర్యా. చేడ. మాగాణిలో నీళ్ళు పెట్టి దున్నటం (కో. 17–23, 25, 30, 40-48, 50, 51; తె. 39, 42); **-గొఱవ** ఉ. –గొనవ; పర్యా. చూ. బురదనాగలి. మాగాణినేలల్లో ఉపయోగించే అరిగిపోయిన మెట్టనాగలి (కో.); **-చాలు** మాగాణికి నీళ్ళుపెట్టి మొదటిసారి దున్నటం (కో.); **-నాగలి** చూ. దంపనాగలి (కో. తె.).

**దావారు** ఉ. దావారు, దావార; పర్యా. గొడివారు, పట్టెడవారు. పట్టెడ రెండవచివర కాడికికట్టే వారు (తోలు తాడు) (రా. 18, 21, 22).

**దాసరికొండి** పర్యా. చూ. అంకెనమొల. గొర్రుభాగం; అంకెనతగిలించే ఇనపకొండి; ఇది గొర్తికొయ్యమీద

ఉంటుంది. చూ. చిత్రం 7 క. 7 (రా. 23).

**దిండు** (-గొట్టు): (1) పర్యా. చూ. అడ్డ. మడిలో పెళ్ళలు నలగటానికి తోలే కొయ్యమొద్దు (కో. 8; తె. 10, 11, 14; రా. 7, 15, 25); (2) పర్యా. అడ్డ, చెక్క, పట్టె, పలక, బల్ల, బెండు, మట్టు, మండెగం, మాను, మొద్దు. గుంటక, గొర్రు, మొ.వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7 క, 9-12. 1(కో. 1-5, 7-18, 20-25; తె. 1-10, 14, 27; రా. 1, 2, 4-9, 11, 13-28):**-సోగ** పర్యా. చూ. రుంబెన. గొర్రు, గుంటక మొ. వాటి దిండుమీద అమర్చిన మేడి. చూ. చిత్రాలు 7 క, 10, 9. 6 (తె).

**దిన్నెగుంటక** విత్తనంవెయ్యకముందు మొలిచిన గడ్డి పోవటానికి మెట్టలో తోలే గుంటక (రా. 15).

**దుక్కి** దున్నిన పొలం; దున్నటం; మెట్టసాగు (కో. 8-11, 15, 16, 24, 46, 48, 50; తె. 1-6, 10-16, 18, 21, 26, 29, 33, 35, 37, 39, 42; రా. 4-6, 8, 11, 15, 18, 21-23, 26-28):**-కోల** ఉ. దుక్కాల (కట్టె), దుక్కేల(బర్ర); పర్యా. చూ. ములుకోల. దున్నేటప్పుడు ఎడ్లను తోలే ముల్లుగర్ర. చూ. చిత్రం 14 (రా.):**-నాగెల** (రూ.)-దుక్కలి, పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి (తె.):**-పూజు** పర్యా. చూ. కాడి. సాగు పనిముట్టుకు కట్టే కాడి. చూ. చిత్రం 6 చ. 1 (కో.):**-మడక** చూ. దుక్కినాగెల (రా.).

**దుక్కిటిగడ్డ** పర్యా. చూ. గడ్డ. నాగటితో దున్నిన రెండుచాళ్ళ మధ్య కలవనిభాగం; గొర్రు మొ. ఒకసారి చాళ్లు దున్ని మలుపు తిరిగిన తరవాత మొదటి చాళ్ళకు, రెండోసారి వేసే చాళ్ళకు మధ్య మిగిలిపోయిన ఎడం (రా. 28).

**దుక్కిటినాగలి** చూ. దుక్కినాగెల (తె. 1, 2).

**దుగదున్నకం** పర్యా. చూ. ఇరవాలు. రెండోసారి అడ్డంగా దున్నటం (తె. 42).

**దుగం** పర్యా. చూ. ఇరవాలు. రెండోసారి దున్నటం (తె. 39).

**దున్నకం** ఉ. దునక్కం; రూ. దున్నటం, దున్నడం. నాగలి, గొర్రు, గుంటక మొదలైనవాటితో భూమిని ఒదులు చెయ్యటం (కో. 38, 39; తె. 3-12, 32-39, 42; రా. 5, 25).

**దున్నటం** చూ. దున్నకం (కో. 9, 10, 14, 16-19, 21-25, 50; తె. 31).

**దున్నడం** చూ. దున్నకం (కో. 46-51; తె. 16).

**దుబ్బనాగలి** తువ్వనేలలు దున్నే నాగలి. మెట్టనాగలికి బురదనాగలికి నడిమిరకం సైజు (తె. 28, 29).

**దుంప** పర్యా. చూ. పణత. (1) ఏడికోల దూర్చే కొయ్యమొద్దు. చూ. చిత్రం 6 క. 3; (2) ఇనపసామాను అమర్చిన నాగలి; (3) ఉపయోగంతీరిన నాగలి; (4) నాగలి చేయించటానికి తెచ్చిన కొయ్యమొద్దు (కో. 20-26, 30, 44; తె. 1, 8, 10, 11, 14-23, 25-28, 30, 34; రా. 8-10, 24, 26): **-సందు** పర్యా. మదంబొక్క. ఏడికోల దూర్చటానికి పణతలో కొట్టిన రంధ్రం (కో.).

**దుమ్మ్రగుంటక** విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి పోవటానికి మెట్టలో తోలే గుంటక (తె. 1, 2, 8, 34, 36; రా. 22).

**దుమ్మ్రపాపనం** పర్యా. చూ. బీటిసేద్యం. తొలకరికి ముందు పొలంలో గుంటకతో దున్నటం; మొదటి సాగు (రా. 22).

**దొత్తె** చూ. జొతికె (తె. 19, 21-23).

**దొన** చూ. దోని (కొ. 21).

**దొనుప** చూ. దోని (తె. 34).

**దొల** చూ. తొలి (కో. 38).

**దొలుపు** పర్యా. చూ. అడ్డ. మాగాణిలో చదునుచెయ్యటానికి ఉపయోగించే మొద్దు (రా. 11).

**దోని** రూ. దొన, దొనుప; పర్యా. ఆరుపొది, ఒది, గాడిపాడు, దోనిపల్లె, దోనిపొన్ను, దోనిపొల్లు. ఆరులో కర్రు బిగించటానికి తీసిన గాడి (కో. 49; తె. 1, 33, 35); **-పల్లె, -పొన్ను, -పొల్లు** చూ. దోని (తె.).

**దోనెనాగలి** ? ఒక రకం మెట్టనాగలి (కో. 47).

**దొరగుంటక** ఉ. దోరా-, దొలా-. పైరులో గడ్డితీసే గుంటక (తె. 17, 18, 31).

**నక్కు** పర్యా. చూ. కర్రు. నాగటి ఆరుకు అమర్చే పొడుగాటి ఇనపముక్క. చూ. చిత్రం 6 క. 6 (కో. 37, 38, 40-47, 49-51).

**నగ** చూ. నొగ (కో. 2-4, 6, 8-10; రా. 9-15, 18, 20, 24, 25, 27, 28); **-చీల** చూ. నొగచీల; పర్యా. చూ. పిర్రచీల. పణతలో దూర్చిన ఏడికోల ఊడకుండా చివర కొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (కో.).

**నగ(లు)** చూ. నొగలు (కో. 1-16, 18, 19, 21-25, 31; తె. 3; రా. 1, 8, 10, 11, 14, 15, 19-28).

**నడుందబ్బ** పర్యా. చూ. కామ. చేత్తో పట్టుకొని లాగటానికి వీలుగా చేదంతెకు వేసినకర్ర. చూ. చిత్రం 11. 2 (రా. 4).

**నవురుచాలు** మూడోచాలు; మూడోసారి దున్నటం. (రా. 18).

**నాగబంధం** పర్యా. చూ. పన్నకం. కాడికి నాగలికి కలిపి మోకు కట్టటం (కో. 13).

**నాగలి** రూ. నాగెల, నాగేలి, నాంగలి; పర్యా. మడక. దున్నే సాధనం; ఆకారాన్ని బట్టి, ప్రయోజనాన్ని బట్టి, దున్నే నేలను బట్టి విశేషణపదాలు చేరుతుంటాయి. ఉదా. తోకనాగలి, మెట్టనాగలి, బురదనాగలి, దబ్బనాగలి, మొదలైనవి. చూ. చిత్రాలు 6 క-ట (కో. 6, 7, 13, 14, 16–51; తె. 1–42; రా. 11, 12, 24).

**నాగవాసం** పర్యా. చూ. మెలుముతాడు. గొర్రి చెక్కలకు దండెగాడి పట్టెకు కలిపికట్టే తాడు లేక వాస. చూ. చిత్రం 7 క. 9 (రా. 1).

**నాగెల** చూ. నాగలి (తె. 4, 6).

**నాగేలి** ఉ. నాగేలు; చూ. నాగలి (కో. 1–11, 15; తె. 3; రా. 1, 11, 22, 23, 25–28).

**నాంకొండి** పర్యా. చూ. నొగచీల. గొర్రు, గుంటక మొదలయినవాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టే మేకు (రా. 21).

**నాంగలి** చూ. నాగలి (కో. 50, 51).

**నాంజిల్ల** పర్యా. చూ. పిర్రచీల. పణతలో దూర్చి ఏడికోలకు చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (రా. 21).

**నాటుదుక్కి** మాగాణి నాట్లకు ముందు దున్నటం (రా. 8).

**నాలిక** పర్యా. చూ. పలుగు. దంతె గుజ్జుకు బిగించిన ఇనప పలుగు. చూ. చిత్రం 10.3 (రా. 26).

**నిడిగొట్టుకం** (క్రి.) ఉ. నిడిగొట్కం. మొదటిసారి నిలువుచాళ్ళు దున్నటం (రా. 5).

**నుసుకు** (–తొక్క, -వేయు); రూ. నుసుము. మాగాణిలో నలగని మట్టిగడ్డ; ఇటువంటివాటిని తొక్కిగాని, చేత్తోగాని చదునుచేస్తారు (కో. 6, 14, 15).

**నుసుము** చూ. నుసుకు (కో. 1).

**నెండు** (క్రి.) లాగి బిగించటం; జడ్డిగం తాళ్ళను దండెగాడి పట్టెకి బిగించటం (కో. 7).

**నెత్తి** పర్యా. చూ. పణత. ఏడికోల దూర్చే కొయ్య మొద్దు. నాగటి వంపు పైభాగం. చూ. చిత్రం 6 క. 3 (తె. 2, 6).

**నొగ** రూ. నగ; పర్యా. చూ. ఏడికర్ర. నాగటికాడినీ పణతనీ కలిపే పొడుగు కర్ర; ఏడికోల. చూ. చిత్రం 6 చ. 1; చూ. నొగలు (కో. 7; రా. 1–8, 18, 23, 26); **-తంతు** పర్యా. చూ. మట్టు. రెండు ముక్కలు ఏడికోలగా అతికిన చోటు (రా.); **-చీల** (1) పర్యా. చూ. కొమ్ము. కోఉేరు వేసినప్పుడు అరిగిపోకుండా నొగ (ఏడికోల)చివర వేసిన ఇనపరేకు. చూ. చిత్రం 6 క. 1; (2) రూ. నగచీల; పర్యా. చూ. పిర్రచీల. నొగ(ఏడికోల) పణతలో దూర్చి ఊడకుండా కొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (రా.).

**నొగ(లు)** (బహు.) రూ. నగలు; పర్యా. ఈసు, గడ, దండె, వాసం, గొర్రు, గుంటక, మొ. వాటి దిండుకు బిగించి కాడిమీదమోపే పొడుగు కొయ్యలు. చూ. చిత్రం 7 క. 1 (కో. 1, 7, 31, 32, 39; తె. 1–15, 20–29, 31–42; రా. 1–7, 18, 20, 23, 25, 27, 28); -కమ్మి చూ. నొగచీల (రా.); **-చీల** (1) పర్యా. తంతుజీల, నాంకొండి, పిట్టుకొండి, పిట్టుచీల, బిడిచీల, మట్టుచీల, మింటెకొండి, గొర్రు, గుంటక మొదలయినవాటిదిండులో నొగలుదూర్చి వెనకవైపుకొట్టే మేకు (కో.); (2) పర్యా. నొగకమ్మి, నొగతగిరె, నొగమెట్టు, నొగమెండు. గొర్రు నిర్మాణంలో దండెగాడిపట్టె కిందికి జరగకుండా నొగల మీదవేసిన మేకు (తె. రా.); **-తగిరె** చూ. నొగచీల (2) (రా.); **-మెట్టు; -మెండు** చూ. నొగచీల (2) (తె.).

**నొల్ల** (-తోలు); ఉ. లొల్ల; పర్యా. గుంటక. మాగాణిలో దున్నినతరవాత చదను చెయ్యటానికి ఉపయోగించే పరికరం (కో. 36, 38–50).

**పగ్గం** పర్యా. ఎలగటిపగ్గం, కొమ్ముపగ్గం, పణతాడు, పణపగ్గం. ఎడ్లకొమ్ములకూ మేడికీ కలిపికట్టి ఎడ్లను మలపటానికి ఉపయోగించే తాడు (కో. 2, 3, 5, 6, 9–25, 30, 32, 43; తె. 1–15, 17–25, 29, 32–38, 41, 42; రా. 14, 17, 18, 21–23, 26–28).

**పంగలగొర్రు** పర్యా. చూ. పెద్దగొర్రు. నాలుగు మొదలు ఆరువరకూ చెక్కలు (కర్రుబిగించే కొయ్యలు) ఉన్న పెద్దగొర్రు; చెక్కలమధ్య ఎడం సుమారు ఇరవై అంగుళాలదాకా ఉంటుంది (రా. 23, 28).

**పంగలినొగ** పర్యా. చూ. ఒల్లంతు. గొర్రు, గుంటక మొదలైనవాటికి నొగగావేసిన పంగలకొయ్య (తె. 2, 22, 24, 27, 28).

**పచ్చిదుక్కి** నీళ్ళుబెట్టి దున్నిన మాగాణిపొలం (రా. 26).

**పట్టంజు** ఉ పటంజు, పటొంజె; పర్యా. చూ. కొలికి. నాగటిమోకు మొదటికొస మెలితిప్పివేసిన ముడి. చూ. చిత్రం 6 చ. 8 (కో. 41, 42, 46, 47, 49, 51; తె. 13).

**పట్టిచెక్క** పర్యా. చూ. గోరచెక్క. మాగాణిలో దున్నిన తరవాత చదునుచేసే సాధనం; గోరు ఆకారంలో ఉన్నపలకను ఒక కర్రకు అమరుస్తారు. చూ. చిత్రం 9 ప (కో. 43, 44).

**పట్టుకంబం** ఉ. పట్టుగంబం, పట్గంబం; పర్యా. చూ. సోగ. మేడిచివర పట్టుకోటానికి బిగించిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6 క. 12 (తె. 12, 18, 27).

**పట్టుగామ** ఉ. పట్గామ; పర్యా. చూ. సోగ, **మేడి**

చివర పట్టుకోటానికి బిగించిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6 క. 12 (తె. 10, 15).

పట్టుజెయ్య పర్యా. చూ. సోగ. మేడి చివర దున్నే టప్పుడు పట్టుకోటానికి బిగించిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6 క. 12 (తె. 20, 22, 23).

పట్టుసోగ ఉ. పటుసొవ, పటుసోగ, పట్టుజోగ, పట్టుసోవ, పట్సోబ, పడుసోగ; పర్యా. చూ. సోగ. దున్నేటప్పుడు పట్టుకోటానికి మేడి చివర అమర్చిన అడ్డ పుల్ల. చూ. చిత్రం 6 క. 12 (కో. 30, 31; తె. 1, 2, 5-8, 11, 14, 21, 23-26, 28-30, 32-36, 38).

పటె[1] (1) పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు, మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7 క, 9-12, 1 (కో. 34; తె. 30, 35, 40); (2) ?పర్యా. చూ. చెక్క. దిండులోదూర్చి బిగించిన కొయ్య; ఇవి మూడు నుంచి ఎనిమిదిదాకా ఉండవచ్చు; కొలత $1\frac{1}{2}'$ పొడవు, $2\frac{1}{2}''$ వెడల్పు, $1\frac{1}{2}''$ మందం; దీని చివర కర్రబిగిస్తారు; కర్ర పైభాగంలో రంధ్రంవేసి జడ్డిగపుగొట్టం దాంట్లో దూరుస్తారు. చూ. చిత్రం 7 క. 4 (కో. 17, 18, 21-23, 25, 31; తె. 40, 41).

పట్టు[2] పర్యా. చాలు. గొర్రు మొ. వాటితో దున్నిన చాలు (కో.).

**పట్టెచాలు** పర్యా. చూ. మందలచాలు. గట్టుదగ్గర దున్నిన చాలు; మందలచాలు (కో. 32).

పట్టెడ (బహు. పట్టెండ్లు, పట్టెళ్ళు); పర్యా. జోతికె, జోడు, దొత్తె, బేరడ, బేరడాకు. ఎద్దులను కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలు లేక నారపట్టా. చూ. చిత్రం 6 చ. 4 (కో. 3-23; తె. 3, 31, 39, 41; రా. 4, 6-9, 11, 14, 18, 21, 24-26);**-కొలికి** పర్యా. చూ. బొట్టె. కాడకి తగిలించే పట్టెండ్ల కొనతాడు. చూ. చిత్రం 6 చ. 5 (రా. తె.); **-చిలకట** చూ. పట్టెడ కొలికి (రా.); **-తాడు** చూ. కొలికి (రా.); **-పలుపు** చూ కొలికి (తె. రా.); **-వారు** పర్యా. చూ. దావారు. పట్టెడ రెండవ చివర కాడికి కట్టేవారు (తోలుతాడు) (తె. రా.).

పడత చూ. పణత (కో. 38, 42; తె. 23, 27).

పడుగు (-తోలు). ముఖ్యంగా తోటలో నిలువుచాళ్ళు దున్నే పద్ధతి (తె. 39); **-చాలు** మొదటిసార్ది దున్నిన నిలువుచాలు (తె.).

పణత ఉ. పనత, పంత, పొంత; రూ. పడత; పర్యా. తల, లుండు, తూట, దుంప, నెత్తి, బుర్రమట్టు, మదం, మాడు, మొద్దు. ఏడికోల దూర్చే కొయ్యమొద్దు; నాగటి వంపు పైభాగం. చూ. చిత్రం 6 క. 3 (కో. 1-22, 27, 33, 35; తె. 29, 31-33, 35, 36, 38-42; రా. 1, 6, 7, 11, 25, 27).

పణతాడు రూ. పనతాడు; పర్యా. చూ. పగ్గం. ఎడ్ల కొమ్ములకు, మేడికి కలిపికట్టి ఎడ్లను మలపటానికి ఉపయోగించే తాడు. (కో. 43; రా. 17).

పణపగ్గం ఉ. పనపగ్గం; పర్యా. చూ. పగ్గం. ఎడ్ల కొమ్ములకు, మేడికి కలిపికట్టి ఎడ్లను మలపటానికి ఉపయోగించే తాడు (రా. 17, 22).

పంటచాలు మాగాణికి నీళ్ళుపెట్టి దున్నిన మొదటిచాలు (తె. 6).

పంటదమ్ము మాగాణికి నీళ్ళుపెట్టి రెండుమూడుసార్లు దున్నటం (కో. 40, 46, 48).

పంటదుక్కి విత్తనం వెయ్యటానికి ముందు దున్నటం (కో. 43).

పండ్లగుంటక పర్యా. చూ. పంపటం. మూడు పలుగుల గుంటక; పైరులో గడ్డి, కలుపు పోవటానికి తోలేది. చూ. చిత్రం 10 క (రా. 12, 16, 17, 25).

పండ్లగొర్రు ఉ. పల్లగొర్రు, పళ్ళగొర్రు; చూ. పలుగొర్రు (కో. 27, 29, 35; తె. 20, 26, 34, 39; రా. 24).

పండ్లమాను ఉ. పళ్ళమాను; రూ. పలికిమాను; పర్యా. చూ. పలుగొర్రు. విత్తనం వేసినతరవాత గడ్డి, కలుపు మొదలైనవి పోవటానికి, మాగాణినేల దున్నిన తరవాత చదును చెయ్యటానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 12 (కో. 1-6, 14, 16; రా. 1).

పత్తెరిక పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చేచోట కిందగాని, పైనగాని ఎలువు నలువులకు కొట్టే పేడు. చూ. చిత్రం 6 క. 10 (కో. 21).

పదును దున్నటానికి అనువుగా నేల నానటం; ఏ పని ముట్టుతో దున్నటానికి వీలైతే దాని పేరుతో కలిపి వాడ తారు; ఉదా. గొర్తిపదును, నాగటిపదును, మొ. (కో. 6, 8, 10, 15).

పనకం చూ. పన్నకం (రా. 10, 18, 21, 23-26); **-చీల** పర్యా. చూ. తమిరె. కాడిమధ్య పైపైపు కొట్టిన ఇనపమేకు. చూ. చిత్రం 6 చ. 2 (రా.).

పన్నకం ఉ. పందకం; రూ. పనకం. పన్నుగడ; పర్యా. ఏట, చిలకట, నాగబంధం, పూత, పోపకం, మయం. దున్నేటప్పుడు మోకును కాడినుంచి పణతచుట్టూ తిప్పి కట్టిన కట్టు (కో. 7, 8, 10, 14, 15, 16, 18, 19, 23, 25).

పన్ను[1] (క్రి.) దున్నటానికి వీలుగా నాగలి మొ. వాటికి మోకు కట్టటం (కో. 1, 5, 7, 11, 13, 17, 20-22, 24, 25, 27-29, 32, 35; తె. 41); **-గడ** చూ. పన్నకం (కో.).

పన్ను[2] (1) ఉ. పండు, పల్లు (బహు. పండ్లు,

పళ్ళు): పర్యా. కఱ్ఱు, కారు, చిల్ల. పండ్లమాను, కార్లపొలికి మొ. వాటి దిండుకు వేసిన కొయ్యపన్ను; కొన్నిచోట్ల ఇనపది. చూ. చిత్రం 12.3 (కో. 1-9, 16, 18, 22-24, 26, 29, 30, 35, 44; తె. 2, 4-7, 9-15, 20, 22, 24, 28-36, 38, 40, 41; రా. 1, 6, 8, 22, 24, 25, 28); (2) పర్యా. చూ. కొండి. కఱ్ఱును అరుకు బిగించే ఇనపకట్టు. చూ. చిత్రం 6 క. 7 (కో. 44); (3) పర్యా. చూ. చెక్క. గొఱ్ఱు, గుంటక మొ. వాటి దిండులో దూర్చిన కొయ్యముక్క. చూ. చిత్రం 7. క. 4 (తె. 13); (4) చూ. పొన్ను (కో. 3, 13, 14, 18; తె. 41).

**పరగడమాను** పర్యా. చూ. పలుగొఱ్ఱు. విత్తనం వేసిన తరవాత గడ్డి, కలుపు మొదలైనవి పోవటానికి, మాగాణి నేల దున్నినతరవాత చదునుచెయ్యటానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 12 (కో. 13).

**పరందిండు** పర్యా. చూ. అడ్డ. పెళ్ళలు నలగటానికి తోలే కొయ్యమొద్దు (రా. 25).

**పరి** (-నెట్టు, -వేయు). ? కాడి; 'పరినెట్టటం', 'పరివేయటం' = ఒక ఎద్దువైపుకు నొగ నెట్టటం (కో. 27-29, 34, 35, 44); **-సీల** పర్యా. చూ. తమిరె. కాడిమధ్య పైపైపుకొట్టే మేకు. చూ. చిత్రం 6 చ. 2 (కో.).

**పర్కడచాలు** రోహిణికార్తెలో గుంటకతో దున్నిన చాలు (తె. 21).

**పలక** (1) పర్యా. చూ. దిండు. గుంటక, గొఱ్ఱు, మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9-12 క. 1 (తె. 1, 2, 6, 29, 36-39, 42; రా. 5); (2) చూ. పలుగు (రా. 13, 21).

**పలగొఱ్ఱు** చూ. పలుగొఱ్ఱు (కో. 18, 22-24).

**పలికిమాను** పర్యా. కార్లపొలికి, పండ్లగొఱ్ఱు. పైరులో కలుపు పోవటానికి తోలే ఇనపమేకుల పరికరం; పలుగొఱ్ఱులాగానే ఉంటుంది. చూ. చిత్రం 12 (రా. 3, 5, 6, 8).

**పలుగు** (1) ఉ. పొలుగు; రూ. పలక; పర్యా. గూబ పలుగు, నాలిక, పార, పీచు, మెట్టు, మెట్టుపలక. దంతె గుజ్జుకు బిగించిన ఇనపపలక. చూ. చిత్రం 10 క. 3 (కో. 5-13, 15, 18, 22-25; తె. 7, 32, 35, 37-42; రా. 18, 21, 22, 25, 26); **-దంతె** పర్యా. చూ. పాపటం. పైరులో గడ్డి, గాదం, కలుపు మొ. పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 10 క (తె.); (2) ఉ. పొల్లుగు; రూ. పల్లు; పర్యా. అలుగు, బద్దె. గుంటక గుజ్జులకు తగిలించిన ఇనపబద్ద. చూ. చిత్రాలు 9, 10. 3 (కో. 1-15, 17-19, 22-25; తె. 1-12, 14, 23, 24, 27, 28, 31-42; రా. 5-9, 11, 14-18, 20-28).

**పలుగొఱ్ఱు** రూ. పలగొఱ్ఱు, పండ్లగొఱ్ఱు; పర్యా. కరిగట్లగొఱ్ఱు, చప్పగొఱ్ఱు, జంబు, పండ్లమాను, పరగడమాను, బురదగొఱ్ఱు, మడికట్టుగొఱ్ఱు, మడిగొఱ్ఱు, ముళ్ళగొఱ్ఱు. మాగాణిలో విత్తకముందు చదునుచెయ్యటానికి, విత్తిన తరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 12 (తె. 1, 3-5, 16, 28, 32; రా. 22, 28).

**పలుపు** పర్యా. కాడితాడు, కాడిపలుపు, జోతికపలుపు, మెడపలుపు, సరదాడు. పట్టెండ్లు లేనప్పుడు వాటికి బదులు ఎద్దుల మెడకిందుగా తీసి కాడికికట్టే తాడు; చూ. పట్టెడ (కో. 2, 6, 8, 14, 23-27, 37, 38, 40, 41, 44, 46-49, 51; తె. 1, 2, 5, 8, 25, 29, 32-39, 42; రా. 2, 5, 9, 11, 22, 27).

**పల్లు** చూ. పలుగు (తె. 12, 15, 16, 21, 22, 25, 26, 28).

**పల్లపునాగలి** పర్యా. చూ. బురదనాగలి. పల్లపు (మాగాణి) నేలలుదున్నే చిన్ననాగలి. చూ. చిత్రం 6 ట (కో. 48).

**పాకమాను** మాగాణిలో దమ్ముచేసిన తరవాత నేల చదును కావటానికి తోలే పరికరం (కో. 7; రా. 16; 17, 19).

**పాపటుదంతె** పర్యా. చూ. పాపటం. పైరులో గడ్డి, గాదం, కలుపు మొ.వి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 10 క (కో. 4-6, 8, 15, 18, 22, 23).

**పాపటం** పర్యా. ఎదజంతె, జంతె, దంతె, దంతెగుంటక, దంతెసోగ, పలుగుదంతె, పాపటదంతె, పీచులదంతె, పీటదంతె, బోదెదంతె. పైరులో గడ్డి, గాదం, కలుపు మొ.వి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 10 క. (కో. 4-6, 15, 18, 20-23, 32).

**పార** పర్యా. చూ. పలుగు. దంతెగుజ్జుకు బిగించిన ఇనప పలుగు. చూ. చిత్రం 10 చ. 3 (తె. 28); **-నాగేలి** గరికె నేలను దున్నటానికి పార తగిలించి కట్టిన నాగలి (కో.).

**పాఱె** పర్యా. చూ. మేడి. దున్నేటప్పుడు అదిమి పట్టుకోటానికి వీలుగా నాగలి మొ. వాటి వెనక అమర్చిన నిలువుకొయ్య; మేడి. చూ. చిత్రం 6 క. 11 (కో. 30; తె. 8-35): **-సోగ** పర్యా. చూ. సోగ. మేడిపైన పట్టుకోటానికి బిగించిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6 క. 12 (తె.).

**పిచ్చికెమొల** పర్యా. చూ. కఱ్ఱుమొల. గొఱ్ఱుచెక్క (కొయ్య)కు కఱ్ఱుబిగించే ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 6 (కో. 14, 18).

**పిట్టు** చూ. పిఱ్ఱసీల. పిడికోలను పణతలో, దూర్చి

ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (కో. 3, 9, 14; రా. 7–9, 18, 23–25, 27; తె. 20); -చీల ఉ. -జిల్ల, -జీల; చూ. పిట్టు (కో. తె. రా.); -పేడు చూ. పిట్టు (రా.).

**పిట్టుకొండి** పర్యా. చూ. నొగచీల. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టే మేకు (రా. 16, 18, 20, 23).

**పిట్టుచీల** పర్యా. చూ. నొగచీల. దిండులో దూర్చిన నొగలు ఊడిరాకుండా వెనకవైపు కొట్టిన మేకు (కో. 34, 39, 42; తె. 42; రా. 18, 23).

**పిడి** పర్యా. చూ. సోగ. దున్నేటప్పుడు పట్టుకోటానికి మేడి చివర బిగించిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6 క. 12 (కో. 32, 42; తె. 13, 16; రా. 15); **-కట్టె** (తె.); **-చిల్ల** చూ. పిడి (రా.).

**పిడికట్టె** పర్యా. చూ. కామ. చేత్తో పట్టుకొని లాగటానికి వీలుగా చేదంతెకు వేసిన కర్ర. చూ. చిత్రం 11.2 (తె. 13).

**పిడిచీల** పర్యా. చూ. పిర్రచీల. ఏడికోల పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (కో. 18–23, 25, 32, 37, 38, 40, 41; తె. 39; రా. 2, 3).

**పిర్ర** పర్యా. పిర్రిగంటు, మడత, మడిమె, ముడ్డి, వెన్ను. పణత దిగువ వంపుతిరిగిన వెలుపలివైపు. చూ. చిత్రం 6 క. 8 (కో. 4–7, 42, 45, 46, 48; తె. 5; రా. 4–6, 9, 11, 14); **-చీల** ఉ. పిరసీల, పిర్రజిల్ల; పిర్రసిల్ల; పర్యా. ఇంగల్‌చిల్ల, ఒదిచీల, కోలచీల, తండుజీల, నగచీల, నాంజిల్ల, నొగచీల, పట్టుజీల, పిట్టు, పిట్టుచీల, పిట్టుపేడు, పిడిచీల, పొక్కుజీల, పొత్తాదు, మట్టుచీల, మెడెంచీల, మంపె, రాంజీల. ఏడికోల పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (కో. తె. రా.).

**పిర్రిగంటు** చూ. పిర్ర (రా. 14).

**పిల్లకొండి** పర్యా. చూ. కర్రుమొల. గొర్రుచెక్క (కొయ్య)కు కర్రు బిగించే ఇనపకొండి. చూ. చిత్రం 7 క. 6 (కో. 8).

**పిల్లకోండ్ర** రెండో కోండ్ర (కో. 26–33; తె. 30).

**పిల్లిచ్చె** పర్యా. చూ. కొలికి, చిట్టె. నాగటిమోకు మొదటగాని చివరగాని వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (రా. 23–28).

**పీచు** పర్యా. చూ. పలుగు. దంతెగుజ్జుకు బిగించిన ఇనప పలుగు. చూ. చిత్రం 10 క. 3 (తె. 1, 2, 7, 36).

**పీచులదంతె** పర్యా. చూ. పాపటం. పైరులో గడ్డి, గాగం, కలుపు మొ.వి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 10 క (తె. 2, 7).

**పీట** పర్యా. చూ. వారిజెపీట. ఎలువు సలువులకు కాడి, ఏడికోల కలిసిచోట వారిజె దూర్చిన చిన్న కొయ్య గొట్టం. చూ. చిత్రం 6 చ. 9 (కో. 4, 6, 15, 17, 32, 34).

**పీటదంతె** పర్యా. చూ. పాపటం. పైరులో గడ్డి, గాదం, కలుపు మొ.వి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 10 క, చ (తె. 11).

**పీటపనకం** ఒకరకం పన్నకం; చూ. పన్నకం (రా. 24).

**పుండు** పర్యా. మట్టు. ఏడికోలగా రెండు కర్ర ముక్కలు అతికినచోటు (తె. 31).

**పులకదుక్కి** నీళ్ళుపెట్టి దున్నిన మాగాణిపొలం; మాగాణి దమ్ముచెయ్యటం (రా. 11).

**పులకనాగేలి** పర్యా. చూ. బురదనాగలి. మాగాణి నేలలు దున్నేది. 'పులక' అంటే 'బురద, దమ్ము'. (రా. 11).

**పూజు** (1) రూ. పూదు; పర్యా. చూ. కాడి. నాగలి, బండి మొ. వాటికి కట్టి లాగటానికి ఎడ్ల మెడలమీద మోపే అడ్డకొయ్య. చూ. చిత్రం 6 చ. 1 (కో. 39, 42–49); **-మేకు** పర్యా. చూ. తమిరె. కాడికి మధ్య పైవైపుకొట్టే ఇనపమేకు. చూ. చిత్రం 6 చ. 2 (కో.); **-మొల్ల** మొల్లం. చూ. పూజుమేకు (కో.); (2) (క్రి.) నాగలిని దున్నటానికి సిద్ధంచెయ్యటం; ఎద్దులను కాడికి పూన్చటం (కో.).

**పూటపనకం** పర్యా. కత్తెరపనకం. ఒక రకం పన్నకం; చూ. పన్నకం (రా. 28).

**పూటమోకు** పర్యా. చూ. ఏరమోకు. దున్నేటప్పుడు నాగలికి కట్టేతాడు. చూ. చిత్రం 6 చ. 7 (రా. 17).

**పూత** పర్యా. చూ. పన్నకం. దున్నేటప్పుడు మోకును పణతచుట్టూ తిప్పి పూది (కాడి)కి కట్టటం (కో. 43).

**పూదు** ఉ. పూది; చూ. పూజు (కో. 38, 40–42, 47, 49, 50, 51).

**పెడచాలు** కోండ్ర పక్కచాలు (కో. 39, 43).

**పెద్దకొండి** పర్యా. చూ. అంకెనమొల. గొర్రుభాగం; అంకెన తగిలించే ఇనపకొండి; ఇది గొర్రికొయ్యమీద ఉంటుంది. చూ. చిత్రం 7 క. 7 (కో. 8, 9; తె. 3; రా. 9, 18).

**పెద్దగొర్రు** పర్యా. గడ్డగొర్రు, పంగలిగొర్రు, బారగొర్రు. నాలుగు మొదలు ఆరు వరకూ చెక్కలు (కర్రు బిగించే కొయ్యలు) ఉన్న పెద్దగొర్రు. చూ. చిత్రం 7 క (కో. 11; తె. 24; రా. 5, 6, 10, 14, 18, 22).

**పెద్దమొల** పర్యా. చూ. అంకెనమొల. గొర్రుభాగం; అంకెన తగిలించే ఇనపకొండి; ఇది గొర్రి కొయ్యమీద ఉంటుంది. చూ. చిత్రం 7 క. 7 (కో. 10–12, 14, 17, 19; తె. 37, 39, 42).

**పెద్దిచ్చె** పర్యా. చూ. కొలికి. నాగటిమోకు మొదటి కొస మెలితిప్పి వేసినముడి; దీన్ని మేడికి తగిలిస్తారు. చూ. చిత్రం 6 చ. 8 (రా. 24, 28).

**పెనకపనకం** అరక కట్టటంలో ఒక రకం మోకు పన్నకం; చూ. పన్నక (రా. 24).

**పెనుప్పూట** ఒక రకం పన్నకం; చూ. పన్నకం, పూట (రా. 22).

**పేకచాలు** పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నిన తరవాత అడ్డంగా దున్నిన చాలు; ఆ విధంగా దున్నేపద్ధతి (తె. 38).

**పైచాలు** ఉ. పైసాలు. విత్తిన తరవాత మూడు రోజులవరకు గుంటకతో పాయటం (చాళ్ళు పూడవటం) (కో. 11, 14; రా. 16–20).

**పైపాటు** పర్యా. చూ. పైరుసేద్యం. కలుపు పోవటానికి, నేల గుల్లబారటానికి పైరులో చేసే సాగు (కో. 24).

**పైరుసేద్యం** పర్యా. ఎడసేద్యం, ఎరసేద్యం, కలుపు సేద్యం, చాళ్లసేద్యం, పైపాటు. కలుపు పోవటానికి, నేల గుల్లబారటానికి పైరులో చేసే సాగు (రా. 5, 6, 8, 13, 18–21).

**పొక్కుజీల** పర్యా. చూ. పిర్రచీల. ఏడికోలను పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (కో. 16).

**పొట్టిగుంటక** పర్యా. చూ. అచ్చుగుంటక. మిరప, పొగతోటల్లో నాట్లువెయ్యటానికి తోలే గుంటక; దీనికి కొయ్యపలుగులే ఉంటాయి. చూ. చిత్రం 10 ట (కో. 36).

**పొట్టిగొర్రు** పర్యా. చూ. చిన్నగొర్రు. పొగ, మిరప, వేరుసెనగ మొ. చేలలోతోలే చిన్నసైజు గొర్రు; దీనిఅడ్డ చిన్నది (కో. 17, 18, 25; రా. 26).

**పొట్టె** పర్యా. చూ. మోకు, నాగలి, గొర్రు, గుంటక, మొ. వ్యవసాయ పరికరాల్లో కాడికి నొగలుకు కలిపికట్టే మోకు. చూ. చిత్రం 6 చ. 7 (తె. 23, 24).

**పొడిదుక్కి** దున్నిన మెట్టపొలం; మెట్టలో దున్నటం (తె. 22).

**పొత్తారు** పర్యా. చూ. పిర్రచీల. ఏడికోల పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (రా. 2).

**పొత్తెం** చెలకోల కర్రకు వేసిన పొన్ను. చూ. చిత్రం 13 (తె. 6).

**పొన్ను** రూ. పన్ను; పర్యా. ఉంగరం, కట్టు, కడెం, గాజు, బల, బళ. గుంటకగుజ్జు మూతిచుట్టూ వేసిన ఇనప కట్టు. చూ. చిత్రం 9 క. 5 (కో. 1, 2, 8–12, 17, 22–25, 29; తె. 11, 20–29, 31–33, 37–40, 42; రా. 7, 11, 20, 26).

**పోపకం** పర్యా. చూ. పన్నకం. దున్నటానికి ముందు మోకును పణతచుట్టూ తిప్పి కాడికి కట్టటం (కో. 41).

**బండకొయ్య** పర్యా. చూ. కొమ్ము. కోసేరు వేసినప్పుడు ఏడికోల కొస అరిగిపోకుండా అతుకువేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 6 క. 1 (కో. 8).

**బద్దగట్టునాగలి** పర్యా. చూ. బురదనాగలి. ఒకరకం వంపనాగలి; మాగాణినేలలు దున్నేది (తె. 18).

**బద్దలకాణి** నాగలి, బండి, మోట, మొ. వాటన్నిటికీ పనికివచ్చే కాడి (తె. 13).

**బద్దె** పర్యా. చూ. పలుగు. గుంటకగుజ్జుల్లో దిగేసిన ఇనపపలుగు. చూ. చిత్రం 9 క. 3 (కో. 21, 29, 33; తె. 30).

**బయల్నాగెల** పర్యా. చూ. మెట్టనాగలి. బయలు (మెట్ట)నేలల్లో దున్నేనాగలి. చూ. చిత్రం 6 క (తె. 4).

**బల** రూ. బళ; పర్యా. చూ. పొన్ను. గుంటకగుజ్జు మూతిచుట్టూ వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 9 క. 5 (తె. 1–10, 34–36; రా. 8, 9, 14, 16, 18, 23–25, 27, 28).

**బల్ల** పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9–12 క. 1 (కో. 38, 40, 41, 46–49, 51; తె. 7, 22, 23).

**బళ** ఉ. బొళ. చూ. బల (రా. 15, 17, 21, 22).

**బారకాడిమాను** పర్యా. బారాగాడి. పెద్దగొర్రుకుకట్టే కాడి (రా. 21, 23, 24, 26, 28).

**బారగుంటక** ఎద(వెద)బెట్టిన తరవాత రెండోసారి చాళ్ళు పూడ్చే పెద్దగుంటక; దీని పలుగు రెండుగజాల పొడవుంటుంది (తె. 3; రా. 10, 18, 20, 23–25).

**బారగొర్రు** పర్యా. చూ. పెద్దగొర్రు. ఆరుకొయ్యల గొర్రు; కొయ్యకూ కొయ్యకూ మధ్య తొమ్మిదంగుళాల ఎడం ఉంటుంది (రా. 12, 17–24, 26).

**బారాగాడి** పర్యా. బారకాడిమాను. ఆరుచెక్కల గొర్రుకు కట్టేకాడి (కో. 13).

**బారిమాను** దున్నిన పొలంలో పెళ్ళ నలగటానికితోలే పెద్దమొద్దు. చూ. మాను (కో. 3).

**బిగువుతాడు** పర్యా. చూ. తీపుతాడు. జడ్డిగపుపిడత కదలకుండా బిగింపుకు వేసే తాడు. చూ. చిత్రం 7 ట. 4 (రా. 10, 18).

**బిగువునులక** పర్యా. చూ. తీపుతాడు. జడ్డిగపుపిడత

కదలకుండా బిగింపుకువేసే తాడు. చూ. చిత్రం 7 ట. 4 (రా. 17).

**బిడిచీల** పర్యా. చూ. నొగచీల. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టే మేకు (కో. 34, 39, 41).

**బిర్రుపలక** జంటక్కిడి లొట్టలు దూర్చే పలక. చూ. చిత్రం 8 చ. 3 (రా. 18).

**బీటిగుంటక** పర్యా. ఎడగుంటక, ఎలిగడగుంటక, కత్తెరగుంటక, చాళ్ళగుంటక, తరిపిగుంటక, దిన్నెగుంటక, దుమ్ముగుంటక, బోద్దెంగుంటక, సానెగుంటక. విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి మొ.వి పోవటానికి, నేల ఒదులుకావటానికి మెట్టలో తోలే గుంటక. చూ. చిత్రం 9 క (తె. 9, 32, 35; రా. 18).

**బీటిగొర్రు** పర్యా. చూ. ఆటగొర్రు. భూమిదున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కలుంటాయి. చూ. చిత్రం 7 చ (తె. 2; రా. 18, 26-28).

**బీటిచాలు** మొదటిసారి గుంటకతో దున్నినచాలు; గుంటకతో దున్నటం (కో. 33; తె. 1, 2, 8-10, 14, 29, 34, 35, 37, 39; రా. 4, 25, 27).

**బీటిచేను** పర్యా. చూ. బీటిపొలం. దున్నవలసిన పొలం (కో. 9, 15).

**బీటిదున్నకం** నీళ్ళు పెట్టక ముందు మాగాణిలో దున్నటం (తె. 7, 10).

**బీటినేల** పర్యా. చూ. బీటిపొలం. దున్నవలసినపొలం. (కో. 10).

**బీటిపొలం** పర్యా. చూ. బీటిచేను, బీటినేల. దున్నవలసిన చేను (కో. 16, 24).

**బీటిమడక** (1) మెట్ట(బీడు)నెలలు దున్నేనాగలి (రా. 9); (2) పొలాన్ని మొదటిసారి దున్నటం (కో. 15).

**బీటిసేద్యం** ఉ. బీటిసేద్దెం; పర్యా. ఎరసేద్యం, ఎలిగడసేద్యం, చెలకసేద్యం, తరవుసేద్యం, దుమ్మపావనం. తొలకరి ముందు పొలంలో గుంటకతో దున్నటం; మొదటి సాగు (రా. 12, 18, 20).

**బీసుగుంటక** వెదబెట్టిన చాళ్ళు పూడ్చిన తరవాత తోలే గుంటక (రా. 17).

**బుడ్డగొర్రు** పర్యా. చూ. చిన్నగొర్రు. పొగ, మిరప, రుసెనగ మొ. చేలలో తోలే చిన్నసైజు గొర్రు; దీని అడ్డన్నది (రా. 18, 21).

**బురదగొర్రు** పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికి, విత్తిన తరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 12 (కో. 29, 35; తె. 12, 29-31, 35-38, 40-42).

**బురదచాలు** ఉ. బురచ్చాలు. మాగాణికి నీళ్ళుబెట్టి దున్నిన చాలు (కో. 13, 16, 24).

**బురదదుక్కి** ఉ. బురదుక్కి, బుర్దదుక్కి. నీళ్ళుబెట్టి దున్నిన మాగాణిపొలం; మాగాణిలో దున్నటం (కో. 8; తె. 3, 12, 22, 39, 42; రా. 22, 23).

**బురదనాగలి** పర్యా. అడుసు-, కరిగట్టు-, తరి-, దంప-, దమ్మ-, పల్లపు-, మడికట్టు-, మడిమడక, రొంపి-. బురద(మాగాణి)నేలలు దున్నేనాగలి. చూ. చిత్రం 6 ట (కో. 12, 13, 16, 17, 24, 29, 31; తె. 12, 21, 30, 31, 33, 34-36, 38, 40-42).

**బురదనాగేలి** చూ. బురదనాగలి (కో. 4, 6, 14; రా. 22, 23, 26, 28).

**బురదమడక** పర్యా. చూ. బురదనాగలి. బురదనేల (మాగాణి)లో దున్నే నాగలి. చూ. చిత్రం 6 ట (రా. 13, 14, 17-20).

**బుర్ర** పర్యా. చూ. పణత. ఏడికోల దూర్చే కొయ్యమొద్దు; నాగటివంపు పైభాగం. చూ. చిత్రం 6 క. 2 (కో. 41, 43).

**బెడెం** పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చేచోట అవసరాన్నిబట్టి ఎలువు సలువులకు కొట్టేపేడు. చూ. చిత్రం 6 క. 10 (తె. 6).

**బెడ్డదుక్కినాగలి** ఎండాకాలం దుక్కికుపయోగించే నాగలి (కో. 47).

**బెండు** పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9-12 క. 1 (తె. 13).

**బేరడ** ఉ. బేరడు; బహు. బేరండ్లు, బేరల్లు, బేరళ్ళు, బేరాల్లు; పర్యా. చూ. పట్టెడ. ఎద్దులను కాడికికట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలుపట్టా. చూ. చిత్రం 6 చ. 4 (కో. 12, 24, 25; తె. 1, 6, 7-12, 17, 18, 24, 25, 29, 32-39, 42); **-వారు** ఉ. బేరటవారు, బేరడోరు; పర్యా. చూ. దావారు. బేరడ చివర కాడికి తగిలించేవారు (తోలుతాడు) (కో. తె.); **బేరడాకు** ఉ. బారడాకు, బేరటాకు; చూ. బేరడ (తె.).

**బొక్క** పర్యా. చూ. తొలి. రంధ్రం; కాడి, పణత మొ. వాటికి వేసిన రంధ్రం. చూ. చిత్రం 6 చ. 3 (కో. 33).

**బొంగరంచాలు** వేరుసెనగ వెయ్యటానికి గుండ్రంగా వేసినకోండ్ర (కో. 37, 40, 43, 45, 48-50).

**బొట్టె** ఉ. బొద్దె; పర్యా. కాడితమ్మె, జొతికెతమ్మె, జొతికెలచిట్టె, పట్టెడకొలికి, పట్టెడతాడు, పట్టెడచిలకట, పట్టెడపలుపు, వెలిగొలికి. కాడికి తగిలించే పట్టెండ్ల కొస

తాడు. చూ. చిత్రం 6 చ. 5 (తె. 35-37, 42).

**బొడ్డుచీల** పర్యా. చూ. తమిరె. కాడి మధ్యవైపు కొాట్టేమేకు. చిత్రం 6 చ. 2 (రా. 8).

**బొడ్డు** తమిరె వెయ్యని కాడికి మధ్య పైపైపు ఉబ్బుగా చెక్కినభాగం; చూ. తమిరె (రా. 4, 8).

**బొడ్డుపురిపగ్గం** సాదాపురితోకట్టిన పగ్గం; చూ. సప్పురి పగ్గం (రా. 18).

**బోజలకాడి** రూ. బోదెలకాణి. నాగలి, గుంటక, గొర్రు మొ. వాటికి కట్టే ఒకరకం కాడి; చివరలు వంపు తిరిగి ఉంటాయి (తె. 31).

**బోడ్డెంగుంటక** విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి పోవటానికి మెట్టలో తోలే గుంటక (రా. 12, 17, 19, 20, 23-25).

**బోదు** (-తోలు) నీళ్ళు పారటానికి మడిలో నాగటితో తోలిన చాలు (తె. 32).

**బోదె** (1) ఉ. బోది. చాళ్ళు విడివిడిగా దూరదూరంగా దున్నటం (కో. 16); (2) ఉ. బోదు. రెండుచాళ్ళ మధ్య భాగం; కోసుగాలేచిన చాలు గడ్డ (కో. 4, 19-21, 29; తె. 39).

**బోదెదంతె** పైరులో తోలే పెద్దదంతె; దీని పలుగు పన్నెండంగుళాలుంటుంది. చూ. (కొలికకు) చిత్రం 10 చ (రా. 18).

**బోదెలకాణి** చూ. బోజలకాణి (తె. 13).

**మట్టిగొర్రు** పర్యా. చూ. ఆటగొర్రు. భూమిదున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కలుంటాయి. చూ. చిత్రం 7 చ (తె. 40).

**మట్టు**[1] పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9-12 క. 1 (కో. 30).

**మట్టు**[2] పర్యా. చూ. మదం. మేడి బిగించే ఏడికోల కొన; దిండుదూర్చిన నొగల కొన. చూ. చిత్రం 6 క. 9 (కో. 31; తె. 8, 10-12, 14, 24, 27, 29-38, 42); **-చీల** ఉ. మట్టుజిల్ల, మట్టుజీల, మట్టుసీల; పర్యా. చూ. పిర్రచీల. ఏడికోల పణతలోదూర్చి ఊడకుండా చివర (మట్టకు)కొాట్టే చీల. చూ. చిత్రం 6 క. 13 (కో. తె.); (2) పర్యా. చూ. నొాగచీల. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొాగలుదూర్చి వెనకవైపు కొాట్టే మేకు (తె.).

**మట్టు**[3] పర్యా. నొాగకంటు, పుండు. ఏడికోల రెండు ముక్కలుగా అతికినచోటు (తె. 7).

**మట్టుదొాలి** పర్యా. కొాయ్యమట్టు, గొర్రుమట్ట, గుంపు. విత్తనాలు పడటానికి గొర్రుచెక్కలకు వేసిన బెజ్జం. చూ. చిత్రం 7 క. 11 (కో. 10, 11, 13, 15, 24, 25).

**మడక**[1] పర్యా. చూ. నాగలి. దున్నేసాధనం, నాగలి. చూ. చిత్రాలు 6 క-ట (రా. 2–10, 13, 21).

**మడక**[2] రూ. మడుపు. ఒకసారి నిలువు, అడ్డం దున్నటం (కో. 6, 15).

**మడత** పర్యా. చూ. పిర్ర. పణత వంపు తిరిగిన వెలుపలి తట్టు. చూ. చిత్రం 6 క. 8 (తె. 7, 9).

**మడతదుక్కి** ఉ. మడద్దుక్కి. కోండ్ర వెయ్యకుండా వరసగా దున్నటం; అలా దున్నిన పొలం (తె. 1, 2).

**మడం** చూ. మడమ (కో. 45, 48).

**మడమ** రూ. మడం; పర్యా. చూ. గడ్డ. కోండ్రలో దున్నగా కలవక మిగిలిపోయినభాగం (కో. 37, 39, 41, 43, 46, 47, 49-51); **-గడ్డ** రూ. మడిమెగడ్డ: పొలంలో కోండ్రకలిసిన తరవాత మిగిలిపొయ్యే కొాన (కో.).

**మడికట్టుగొర్రు** పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో విత్తకముందు చదునుచెయ్యటానికి, విత్తినతరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 12 (తె. 13, 26).

**మడికట్టుదుక్కి** మాగాణికి నీళ్ళుపెట్టి దున్నటం (తె. 29).

**మడికట్టునాగలి** పర్యా. చూ. బురదనాగలి. మాగాణి నేలలు దున్నేది; దంపనాగలి. చూ. చిత్రం 6 ట. (తె. 11, 13, 19, 20, 23-29, 32).

**మడిగొర్రు** పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికి, విత్తిన తరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 12 (తె. 27).

**మడిమడక** పర్యా. చూ. బురదనాగలి. మాగాణినేలలు దున్నేది; దంపనాగలి (రా. 15).

**మడిమె** పర్యా. చూ. పిర్ర. పణత వంపుతిరిగిన వెలుపలి తట్టు. చూ. చిత్రం 6 క. 8 (తె. 38).

**మడిమెకోండ్ర** వంకర తిరిగిన కోండ్రను కలిపే కోండ్ర (తె. 37).

**మడిమెగడ్డ** చూ. మడమగడ్డ (తె. 35, 36).

**మడుపు** చూ. మడక (కో. 9, 14).

**మండెగం** పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు, మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9–12 క. 1 (కో. 26).

**మదం** ఉ. మదాం; పర్యా. గడ్డ, మట్టు. మేడి బిగించే ఏడికోల కొాన. చూ. చిత్రం 6 క. 9 (కో. 3, 21-25, 32; తె. 39, 41); **-బొొక్క** పర్యా. దుంపసందు. ఏడికోల దూర్చటానికి పణతలో కొట్టిన రంధ్రం (కో.).

**మందల** (-పట్టు, -చేయు). పొలంగట్టు పొడవునా దున్నవలసిన మేర; ఒక నిలువు, అడ్డం దున్నినతరవాత

మందలచాళ్ళు వేస్తారు (కో. 6, 8-17, 24-27, 29, 33-35; తె. 31, 41, 42; రా. 18, 23, 25, 27, 28); **-చాలు** ఉ. మందలిసాలు, మందల్చాలు, మందల్సాలు. పొలంగట్టుపక్కన దున్నిన చాలు (కో. తె. రా.); **-పట్టె** గట్టుదగ్గర దున్నినచాలు; ఎదబెట్టిన మందలచాలు (కో.రా.); **-మలుపు** చూ. -మొలక (కో. రా.); **-మొలక** చేనిగట్టు దగ్గర దున్నటం (రా.).

**మయం** పర్యా. చూ. పన్నకం. దున్నేముందు మోకును పణతచుట్టూ తిప్పి కాడికి కట్టటం (కో. 39).

**మరచాలు** ఉ. మర్సాలు. మూడోసారి దున్నటం; ఇరచాలు తరవాతది; కొన్నిచోట్ల రెండోసారి దున్నటం (తె. 10; రా. 17, 18, 25, 28).

**మరవాయి** మూడోసారి దున్నటం (రా. 22).

**మలక** (1) పర్యా. చూ. చిట్టె. నాగటిమోకుచివర వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 1, 2); (2) చూ. మలుపు (తె. 6; రా. 18); **-చాలు** మొదటిసారి దున్నటం (రా.).

**మలిచాలు** పర్యా. చూ. ఇరవాలు. నిలువుదున్నిన తరవాత అడ్డంగా దున్నిన చాలు; ఆ విధంగా దున్నే పద్ధతి (కో. 6, 26, 31; రా. 13).

**మలుపు** రూ. మలక. సాగుపనిముట్టు ఒక చాలు దున్ని తిరిగి రావటం (కో. 27, 29; రా. 18, 26).

**మల్లజాలు** పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నిన తరవాత అడ్డంగా దున్నిన చాలు; ఆ విధంగా దున్నే పద్ధతి (తె. 15).

**మళ** చూ. మొల (రా. 17).

**మాగిదుక్కి** రూ. మాగిలిదుక్కి. మాఘమాసంలో దున్నటం; మెట్టదుక్కి (తె. 3).

**మాగినాగలి** మాఘమాసంలో (ఎండాకాలంలో)దున్నే పెద్ద మెట్టనాగలి (తె. 36).

**మాగిలిదుక్కి** చూ. మాగిదుక్కి (తె. 39).

**మాడు** పర్యా. చూ. పణత. ఏడికోల దూర్చే కొయ్య మొద్దు; నాగటి వంపు పైభాగం. చూ. చిత్రం 6 క. 3 (కో. 27, 31, 36; తె. 40).

**మాను** (1) పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9-12 క. 1 (కో. 1, 8, 10, 44; తె. 36, 39; రా. 2, 19); (2) పర్యా. చూ. అడ్డ. దున్నిన పొలాన్ని చదును చేసే కొయ్యమొద్దు; మామూలుగా మాగాణిలో పెళ్ళలు నలగటానికి ఉపయోగిస్తారు (కో. 1-9, 12-16, 26, 27, 32; రా. 1-7, 9, 11, 14-19).

**మారు** పొలం చివర; గట్టుదగ్గరి ప్రాంతం; మేర (కో. 22-25); **-గడ్డ** పొలంగట్టుదగ్గర మెదగని భాగం (కో.).

**మారుగడ** జడ్డిగపు కర్రలలో ఎడమవైపుది. చూ. చిత్రం 7 ట. 2 (కో. 12).

**మారుజాలు** పర్యా. చూ. ఇరవాలు. నిలువు దున్నిన తరవాత అడ్డంగా దున్నిన చాలు; ఆ విధంగా దున్నేపద్ధతి (తె. 15, 30).

**మారుదుక్కి** కోండ్ర వెయ్యకుండా వరసగా దున్నటం; అలా దున్నిన పొలం (తె. 13, 15, 24, 29).

**మారుదున్నకం** చాలు వెంబడి చాలు దున్నటం; కోండ్ర వెయ్యకుండా దున్నటం (తె. 6, 8, 9, 11, 12, 14).

**మింటెకొండి** పర్యా. చూ. నొగచీల. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొగలుదూర్చి వెనకవైపుకొట్టే మేకు (రా. 25).

**మిలువార్లదబ్బ** పర్యా. చూ. దండెగాడి. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (రా. 23).

**ముకుదూల** రూ. ముకుదొల; పర్యా. చూ. అరు. కర్రు బిగించే నాగలి చివరిభాగం. చూ. చిత్రం 6 క. 5 (కో. 45).

**ముకుదొల** చూ. ముకుదూల (తె. 17).

**ముంగిడి** మాగాణిలో పెళ్ళలు నలగగొట్టేకొయ్యమొద్దు (తె. 10).

**ముచ్చాలింపు** మూడోసారి దున్నటం (కో. 15).

**ముచ్చాలు** మూడోసారి దున్నటం (కో. 6, 15; తె. 3, 6, 33; రా. 4); **-దుక్కి** చూ. ముచ్చాలు (తె.).

**ముడిదుక్కి** మొదటిసారి దున్నటం (తె. 10).

**ముడ్డి** పర్యా. చూ. పిర్ర. పణత వంపుతిరిగిన వెలుపలి తట్టు. చూ. చిత్రం 6 క. 8 (కో. 35; తె. 34, 35, 37).

**మునకాలకర్ర** చూ. ములుకోల (కో. 37, 40, 41, 45-48, 50).

**మునుము** నాగటిచాలు మలుపు (తె. 4): **-దున్నకం** కోండ్ర వెయ్యకుండా చాలు వెంబడి చాలు దున్నటం (తె.).

**ములుకోల** ఉ. ములుకాల(కట్టె), ములుగోల(కట్టె-బర్ర), మొలకాల(కర్ర); రూ. మునకాల(కర్ర); పర్యా. దుక్కికోల, ముల్లుగట్టె, ముల్లుగర్ర, ముల్లుబర్ర. అరకకు కట్టిన ఎడ్లనుతోలే పొడుగుకర్ర; దీని చివర చిన్న ముల్లు (మేకు)వేస్తారు. చూ. చిత్రం 14 (కో. 9; తె. 1, 2, 39; రా. 17, 23, 27, 28).

**ముల్లుగట్టె** ఉ. ములుకట్టె, ములుగట్టె, ముల్లుకట్టె, ముల్గట్టె; పర్యా. చూ. ములుకోల. అరకకుకట్టిన ఎడ్లను తోలే పొడుగుకర్ర; దీని చివర చిన్నముల్లు(మేకు) వేస్తారు. చూ. చిత్రం 14 (కో. 11, 32, 34, 36; తె. 1, 6-8,

13, 16, 17, 19–24, 29, 32, 36, 42; రా. 7, 9, 24).

**ముల్లుగర్ర** ఉ. ములుగర్ర, ముల్గర్ర; పర్యా. చూ. ములుకోల. అరకకుకట్టిన ఎడ్లను తోలే పొడుగుకర్ర; దీని చివర ముల్లు(మేకు) కొట్టి ఉంటుంది. చూ. చిత్రం 14 (కో. 10, 13, 15, 20–25, 33; తె. 9, 12, 15, 34, 35, 37, 38, 40; రా. 2).

**ముల్లుబర్ర** ఉ. ములుబర్ర; పర్యా. చూ. ములుకోల. అరకకుకట్టిన ఎడ్లనుతోలే పొడుగుకర్ర; దీనిచివర చిన్న ముల్లు(మేకు) కొట్టి ఉంటుంది. చూ. చిత్రం 14 (తె. 3; రా. 9, 18, 21).

**ముళ్ళగొర్రు** పర్యా. చూ. పలుగొర్రు. మాగాణిలో విత్తకముందు చదును చెయ్యటానికి, విత్తిన తరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. చూ. చిత్రం 12 (కో. 27).

**ముష్టి** పర్యా. చూ. సోగ. దున్నేటప్పుడు పట్టుకోటానికి మేడిచివర అమర్చిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6 క. 12 (తె. 17).

**మూలకోండ్ర** మూలగావేసిన కోండ్ర (తె. 29).

**మూలచాలు** ఉ. మూల్చాలు. మూలగా దున్నటం; మూడోసారి ఇలా దున్నుతారు (కో. 6, 9–11, 13–24, 27–29, 31–33, 35, 36, 48; తె. 32, 33, 35–41).

**మూలమూరు** ? దున్నినచేలలో మూలగా గుంటక తోలటం (రా. 18, 25).

**మెట్టదుక్కి** మెట్టలో దున్నటం; దున్నిన మెట్టపొలం (కో. 8; తె. 4).

**మెట్టనాగలి** రూ. మెట్టునాగలి; పర్యా. ఎలి–, ఎలిగట్టు–, ఎలిగడ–, ఎలిది–, ఎలిదుక్కి–, ఎర–, గరప–, చౌక–, దుక్కిలి–, దుబ్బ–, దోనె–, బయలు–, బెద్దదుక్కి–, మెరక–, మొరాల్–, రాగిటి–, పట్టిదుక్కి–, వెలిమడక. మెట్ట లేక కుష్కి నేలలు దున్నేది (కో. 6, 12–14, 17, 20, 22, 23, 25, 27–29, 31–36; తె. 31, 39).

**మెట్టు** పర్యా. చూ. పలుగు. దంతెనగుజ్జుకు బిగించిన ఇనప పలుగు. చూ. చిత్రం 10 క. 3 (తె. 3; రా. 8, 18–22).

**మెట్టునాగలి** చూ. మెట్టనాగలి (కో. 37, 38, 40, 45, 46, 48, 49).

**మెట్లగుంటక** (చూ. మెట్టు) పైరులో కలుపు తియ్యటానికి తోలే రెండు మూడు పలుగుల గుంటక. చూ. చిత్రం 10 క, చ (తె. 3; రా. 8, 18–22).

**మెట్లదంతె** పర్యా. చూ. మెట్లగుంటక. మూడు పలుగుల గుంటక; పైరులో గడ్డి,కలుపు పోవటానికి తోలేది. చూ. చిత్రం 10 క, చ. (తె. 1, 36–39, 42).

**మెడపలుపు** పర్యా. చూ. పలుపు. పట్టెండ్ల బదులు ఎద్దుల మెడ కిందుగాతీసి కాడికి కట్టే తాడు (కో. 34, 36).

**మెడెంచీల** పర్యా. చూ. పిరచీల. ఏడికోల పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే మేకు. చూ. చిత్రం 6 క. 13 (కో. 10, 11).

**మెంటె** (1) పర్యా. చూ. కొమ్ము; కోటేరు వేసినప్పుడు ఏడికోలకొన అరిగిపోకుండా అతుకువేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 6 క. 1 (కో. 14); (2) పర్యా. చూ. పిరచీల. ఏడికోల పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (రా. 23).

**మెండు** ఇనపచీల. గొర్రుకు కట్లువేసి బిగించే మేకు (రా. 18).

**మెరకనాగలి** పర్యా. చూ. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి (కో. 41).

**మెలుగు** రూ. మెలుము; పర్యా. చూ. అంకెన. గొర్రు భాగం; దండెగాడి తాడుకు గట్టి గొర్తిచెక్కపై కొక్కానికి తగిలించే ఇనపవంకీ. చూ. చిత్రం 7 క. 8 (తె. 9, 10, 14, 27, 35); **-తాడు** పర్యా. చూ. తీపుతాడు. జడ్డిగపు పిడత కదలకుండా బిగింపుకు వేసే తాడు. చూ. చిత్రం 7 క. 9 (తె.); **-పీట** పర్యా. చూ. దండెగాడి; ఎద గొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (తె.).

**మెలుము** చూ. మెలుగు (కో. 4, 5, 7, 8; తె. 9, 10; రా. 11, 18, 20, 24); **-కట్టె** పర్యా. చూ. దండెగాడి; ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 7 క. 3 (రా.); **-తాడు** రూ. మెలుగుతాడు; పర్యా. అంకెతాడు, అంకెనతాడు, అంకెనవారు, అంకెపుతాడు, దండెగాడితాడు, దండెగానివారు, నాగవాసం. గొర్తి చెక్కలకు దండెగాడి పట్టెకు కలిపికట్టే తాడు లేక వారు. చూ. చిత్రం 7 క. 9 (కో. తె. రా.).

**మేడి** ఉ. మేకు; పర్యా. పాలె, మేడికర్ర, మేడితోక, రిమ్మెన, రుమడి, రుంబ, రొంబడి. దున్నేటప్పుడు అదిమి పట్టుకోటానికి వీలుగా నాగలి మొదలయినవాటి వెనక మదం మీద అమర్చిన నిలువుకొయ్య. చూ. చిత్రం 6 క. 11 (కో. 1–51; తె. 34–42; రా. 1–11, 14–18, 21, 23, 25–28); **-కర్ర** చూ. మేడి (కో.); **-కోల** చూ. మేడి (కో. తె.); **-చిల్ల** ఉ. మేడిజిల్ల; పర్యా. చూ. సోగ. దున్నేటప్పుడు పట్టుకోటానికి మేడిచివర అమర్చిన అడ్డపుల్ల. చూ. చిత్రం 6 క. 12 (రా.); **-సోగ** చూ. పర్యా. సోగ; చూ. మేడిచిల్ల (కో. తె. రా.).

**మేడితోక** ఉ. మేడితాక; పర్యా. చూ. మేడి. దున్నేటప్పుడు అదిమి పట్టుకోటానికి వీలుగా నాగలి మొ. వాటి వెనక అమర్చిన నిలువుకొయ్య. చూ. చిత్రం 6 క. 11

(కో. 11; తె. 1-8, 12, 35, 36; రా. 10, 18-28).

**మొగుడ** పర్యా. చూ. అక్కిడికట్టె. గొర్రు వెనక జొన్న ఎద(వెద) బెట్టటానికి కట్టే రెండుబెజ్జాల అక్కిడి పనిముట్టు. చూ. చిత్రం 8 చ. (తె. 19).

**మొద్దు** పర్యా. చూ. దిండు. గుంటక, గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె. చూ. చిత్రాలు 7, 9-12 క. 1 (కో. 26, 31, 35; తె. 10-13, 15, 17, 20, 21, 24, 27-29, 34; రా. 19).

**మొన** పర్యా. చూ. ఆరు. కర్రు బిగించే నాగలికొన. చూ. చిత్రం 6 క. 5 (రా. 5).

**మొరాల్‌నాగలి** ఎర్రనేలలు దున్నేది; మెట్టనాగలికి, బురదనాగలికి నడిమిరకం సైజులో ఉంటుంది (తె. 9).

**మొల** రూ. మొల్ల; పర్యా. చూ. కొండి. కర్రును ఆరుకు బిగించే ఇనపకొండి. చూ. చిత్రం 6 క. 7 (కో. 1-6, 10-20, 22-27, 29, 31-33, 35, 36; తె. 22, 23, 37-42); **-కట్టు, -కాలు** చూ. మొల (కో.).

**మొల్ల** చూ. మొల (కో. 38, 40-42).

**మొల్లి** పర్యా. చూ. కుని. దున్నేటప్పుడు చేలో మూలగా వచ్చిన భాగం; చేలో కోసుగాఉన్న భాగం (కో. 19, 21-25); **-చాలు** పర్యా. చూ. కునిచాలు. వంకరగా వచ్చిన చాలు (కో.).

**మోకిచ్చె** రూ. పిల్లిచ్చె; పర్యా. చూ. చిట్టె. నాగటి మోకు చివరవేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 39).

**మోకు** పర్యా. తాడు, పొట్టె. నాగలి, గొర్రు, గుంటక మొ. వ్యవసాయ పరికరాల్లో కాడి, నొగలు కలిపికట్టే లావాటితాడు. చూ. చిత్రం 6 చ. 7 (కో. 1, 5, 7, 9-25, 31, 41, 44, 46; తె. 3, 6, 11, 19, 21, 22, 24, 27, 29, 30, 35, 36, 38, 39, 42; రా. 1, 2, 5-9, 11, 14, 17, 18, 21-28).

**మోటునాగలి** కర్రులేని నాగలి; మునుపు కొన్నిచోట్ల బురదదుక్కికి దీన్ని ఉపయోగించేవారట (కో. 16).

**రాగిటినాగలి** రేగడినేలలు దున్నే మెట్టనాగలి; నిర్మాణభేదం లేదు. చూ. చిత్రం 6 క (కో. 20; తె. 13, 17, 29).

**రాంజీల** పర్యా. చూ. పిరచీల. ఏడికోల పణతలో దూర్చి ఊడకుండా చివర కొట్టే కొయ్యమేకు. చూ. చిత్రం 6 క. 13 (తె. 4).

**రాసెన** చిన్నసైజు గుంటక. చూ. గుంటక (తె. 22-26).

**రెక్కలగుంటక** పైరులో కలుపు తియ్యటానికి తోలే రెండు మూడు పలుగుల గుంటక. చూ. చిత్రం 9 చ. (రా. 19).

**రెక్కలదంతె** పర్యా. చూ. మెట్లగుంటక. మూడు పలుగుల గుంటక; పైరులో గడ్డి, కలుపు పోవటానికి తోలేది. చూ. చిత్రం 10 క, చ (తె. 11).

**రిమ్మెన** చూ. రుంబెన (తె. 23, 24, 31).

**రుమడి** చూ. రుంబెన (తె. 33).

**రుంబ** ఉ. రొంబ; చూ. రుంబెన (తె. 14, 15).

**రుంబెన** ఉ. రుమ్మెన; రూ. రిమ్మెన, రుమడి, రుంబ, రొంబడి; పర్యా. దిండుసోగ. గొర్రు, గుంటక మొ. వాటి దిండుకు అమర్చిన మేడి. చూ. మేడి. (తె. 20, 21-23, 25-29, 32, 39).

**రొప్పు** (క్రి. వాడుక 'రొప్పుడు, రొప్పటం')మాగాణిలో పలుగొర్రు తోలటం. చూ. చిత్రం 12 (తె. 8-10, 12, 13,15, 16, 19, 21).

**రొంపిదుక్కి** మాగాణికి నీళ్ళుబెట్టి దున్నటం; దున్నిన మాగాణిపొలం (రా. 11).

**రొంపినాగేలి** పర్యా. చూ. బురదనాగలి. రొంపి (మాగాణి) నేలలు దున్నేది; దంపనాగలి. చూ. చిత్రం 6 ట. (కో. 2, 15; రా. 11).

**రొంబడి** చూ. రుంబెన (తె. 11, 33).

**రొమ్ము** పర్యా. చూ. చంక. పణతకు, ఆరుకు మధ్య నున్న వంపు లోపలివైపు. చూ. చిత్రం 6 క. 4 (రా. 23); **-పేడు** పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చేచోట ఎలువు సలువులకుకొట్టే పేడు. చూ. చిత్రం 6 క. 10 (రా).

**లక్కిడి** రూ. లగిడి; పర్యా. చూ. కొడతం. ఒంటి పలుగుదంతెకు నొగల బదులు అమర్చిన రెండడుగుల పొడుగున్న కర్రముక్క. చూ. చిత్రం 9 ట. 2 (రా. 22).

**లగిడి** చూ. లక్కిడి (తె. 4).

**లంకెగుంటక** పైరులో కలుపు తియ్యటానికి తోలే రెండు పలుగుల గుంటక. చూ. చిత్రం 9 చ. (రా. 18).

**లద్దిబిల్ల** పర్యా. చూ. చేదంతె. పొలాన్ని చిన్నచిన్న మళ్ళుగా చేసుకోటానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 11 (తె. 1-7).

**లంబతాడు** ఉ. లంబుతాడు. పర్యా. లుంగతాడు. తలేటిమోపును వెనకకాడికి కలిపి కట్టేతాడు (రా. 18, 21,22).

**లుంగతాడు** పర్యా. చూ. లంబతాడు. తలేటిమోకును వెనక కాడికి కట్టేతాడు (రా. 23).

**లోగాడిచిల్ల** పర్యా. చూ. గొడికట్టె. ఎడ్లు కాడిలోపలి వైపుకు రాకుండా దాని కన్నంలో దిగవేసిన కర్ర (కో. 4).

**వంకెన** ఉ. వంకన; పర్యా. చూ. అంకెన. గొర్రు భాగం; దండెగాడి తాడుకు గట్టి గొర్రిచెక్కపైఉన్న కొక్కానికి తగిలించే ఇనపవంకీ. చూ. చిత్రం 7 క. 8 (తె. 32).

**వంకెం** పర్యా. చూ. అంకెన. గొర్రుభాగం; దండెగాడి తాడుకు గట్టి గొర్తిచెక్కపై ఉన్న కొక్కేనికి తగిలించే ఇనప వంకీ. చూ. చిత్రం 7 క. 8 (కో. 4, 5).

**వట్టిగొర్రు** పర్యా. చూ. ఆటగొర్రు. మెట్టనేలలు దున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కలుంటాయి (తె. 31).

**వట్టిదుక్కినాగేలి** పర్యా. మెట్టనాగలి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. చూ. చిత్రం 6 క. (రా. 26).

**వరిమడినాగేలి** పర్యా. చూ. బురదనాగలి. మడి (పల్లపు)నేలలు దున్నే నాగలి. చూ. చిత్రం 6 ట (కో. 3, 7-9; రా. 27).

**వసలా** అతుకుపెట్టిన ఏడికోల (కో. 21).

**వాటుగొర్రు** పర్యా. చూ. ఆటగొర్రు. భూమి దున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కలుంటాయి. చూ. చిత్రం 7 చ. (తె. 38, 42).

**వార్నె** ఉ. అర్న, అర్నె; చూ. వారిణె (తె. 1-4, 6-8, 20, 22, 26, 35-38).

**వాయిగొర్రు** పర్యా. చూ. ఆటగొర్రు. భూమి దున్నే గొర్రు; నాగలితో దున్నిన తరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కలుంటాయి. చూ. చిత్రం 7 చ. (తె. 37).

**వారిణె(ణ)** ఉ. ఆర్నె, ఓర్నె, వారెన, వార్ని, వార్నె; రూ. వార్నె; పర్యా. కాడికుంటెన, కాణితల, కాణిగొలుసు, కుంటెన. అరక కట్టినప్పుడు కాడిని నొగలపై చేర్చి కట్టే వారు (తోలుతాడు); మోకు దూర్చటానికి వీలుగా కట్టిన తాడు. చూ. చిత్రం 6 చ. 6 (కో. 1-9, 11-25, 27, 29, 30, 32, 34, 36, 44; తె. 5, 9, 11-14, 16-23, 28, 29, 31-35, 39-42; రా. 1-3, 5, 7, 11, 14, 16-19, 21-28); **-పీట** ఉ. ఆర్నెపీట, వాన్నెపీట, వార్నెపీట, వారినపీట, వారినెపీట, వార్నిపీట, వార్నెపీట; పర్యా. అరకపీట, ఎలువుపీట, జలువు బిళ్ల, పీట, వారిణెబుర్ర, సలువుపీట. ఎలువుసలువులకు కాడి ఏడికోల కలిపేచోట వారిణె దూర్చిన చిన్న కొయ్య గొట్టం. చూ. చిత్రం 6 చ. 9 (కో. తె.); **-బుర్ర** చూ. వారిణెపీట (కో.).

**వారెడచాలు** మాగాణిలో చివరసారి దున్నటం. చూ. ఎదచాలు (తె. 7, 9).

**వాలుగొర్రు** పర్యా. చూ. ఆటగొర్రు. భూమి దున్నే గొర్రు; నాగలితో దున్నినతరవాత పెళ్ళలు నలగటానికి దీంతో దున్నుతారు; మామూలుగా మూడు చెక్కలుంటాయి. చూ. చిత్రం 7 చ. (రా. 9).

**వాసం** పర్యా. చూ. నొగలు. గొర్రు, గుంటక మొ.వి దిండుకు బిగించి కాడిమీద మోపే పొడుగుకొయ్యలు. చూ. చిత్రం 9 క, చ. 2; 10 క, చ. 2 (కో. 20, 21; రా. 6, 9).

**విత్తుగొర్రు** పర్యా. చూ. ఎదగొర్రు. ఎద (విత్తనాలు) బెట్టే జడ్డిగం మొ.వి అమర్చిన గొర్రు. చూ. చిత్రం 7 క. (రా. 15).

**వెన్ను** ఉ. ఎన్ను; పర్యా. చూ. పిర్ర. పణతకు, ఆరుకు వెలుపలివైపు. చూ. చిత్రం 6 క. 8 (కో. 13, 18, 21-24).

**వెలిగొలికి** ఉ. ఎలిగొలికి; పర్యా. చూ. బొట్టె. కాడికి తగిలించే పట్టెండ్ల కొనతాడు. చూ. చిత్రం 6 చ. 5 (రా. 9).

**వెలిమడక** పర్యా. చూ. మెట్టనాగలి. వెలిదుక్కి (మెట్టదుక్కి)కి ఉపయోగించే నాగలి (రా. 8).

**వేవిలిదుక్కి** పంటకోత అయినవెంటనే దున్నటం (తె. 39).

**వై** పర్యా. చూ. కొముదు. గుంటక, దంతె, మొ.వి తోలేటప్పుడు రెండుచాళ్ళమధ్య కోసుగా తేరిన మట్టివాలు (తె. 1, 2, 4, 26; రా. 16); **-గొట్టుడు** (-కొట్టుడు) (క్రి.) నాలుగోసారి దున్నటం (తె.); **-దోలకం**(-తోలకం) (క్రి.). మూలగా దున్నటం (తె.); **-జాలు** (-చాలు) మూలగా పొలందున్నటం (తె.).

**సప్పురిపగ్గం** జమిలిపురి వేసిన పగ్గం (రా. 18).

**సమసందు** ఉ. సౌసందు. గొర్రుచాళ్ళమధ్య సమంగా ఉన్న ఎడం (రా. 18, 20).

**సరదాడు** (1) పర్యా. చూ. తీపుతాడు. జడ్డిగపుపిడత కదలకుండా బిగింపుకువేసే తాడు. చూ. చిత్రం 7 చ. 4 (రా. 15); (2) పర్యా. చూ. సలుపు. పట్టెండ్ల బదులు ఎద్దుల మెడకిందుగా తీసి కాడికి కట్టే తాడు. చూ. చిత్రం 7 ట. 4 (రా. 16, 17).

**సర్తె** పర్యా. చూ. అక్కడికట్టె. గుంటకకు కట్టి ఎద (వెద) బెట్టే సాధనం (తె. 18).

**సలుగు** చూ. సలువు (కో. 30; తె. 23, 24, 27); **-పీట** చూ. సలువుపీట (తె.).

**సలువు** ఉ. జలువు; రూ. సలుగు, సల్గు. దున్నేటప్పుడు నేల తెల్లిగ్గా పైపైన తెగటం (కో. 6, 9-13, 15-17, 19, 23, 24, 26-30, 32-35, 37, 40, 44, 46-51; తె. 41; రా. 1); **-పీట** రూ. సలుగుపీట; పర్యా. చూ. వారిణెపీట. ఎలువుసలువులకు ఏడికోల కాడి కలిపేచోట వారిణె దూర్చిన చిన్న కొయ్యగొట్టం. చూ. చిత్రం 6 చ. 9 (కో.); **-పేడు** ఉ. జలువుపేడు, సలువుపేడు; రూ. సల్గు పేడు; పర్యా. చూ. చప్ప. ఏడికోలను పణతలో దూర్చే

సందులో పైవైపు కొట్టేపేడు; దీనివల్ల నేల తేలిగ్గా తెగుతుంది. చూ. చిత్రం 6 క. 10 (కో. రా.).

**సల్లు** చూ. సలువు (తె. 15-17, 19-22, 24-28); **-పేడు** చూ. సలువుపేడు (తె.).

**సానెగుంటక** పర్యా. చూ. బీటిగుంటక. విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి పోవటానికి మెట్టలో తోలే గుంటక. చూ. చిత్రం 9 క. (తె. 3).

**సాయిలి** పునాసపంట వెయ్యటానికి ముందు మూడు సాళ్లు దున్నిన పొలం (తె. 27).

**సాలదిండు** రెండు బద్దె (పలుగు) ల గుంటక; పైరులో కలుపుతీసే పరికరం. చూ. చిత్రం 9 చ. (రా. 14).

**సురుకు** చూ. జులుకు (తె. 35, 38, 42).

**సువర** పర్యా. చూ. చిట్టె. నాగటిమోకు చివర వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె. 32)

**సూదుకర్ర** పర్యా. చూ. చిట్టె. వేసే ముడి. చూ. చిత్రం 6 చ. 8 (తె.

**సూరుగడ** జడ్డిగపు కర్రలలో కు

**సోగ** పర్యా. తొడ్మె, పట్టుకంబ జెయ్య, పట్టుసోగ, పాతసోగ, పిడి, మేడిచిల్ల, మేడిసోగ, సోగచీల, సోగపు పట్టుకోటానికి మేడి చివర బిగించిన అడ్డ 6 క. 12 (కో. 1, 2, 4, 5, 8, 1 21–23, 29–35; తె. 9, 11, 39 7, 8, 10, 11, 14, 18, 21, 23, చూ. సోగ (కో.); **-చీల** సోగ మే మేకు (తె).

చిత్రం 6 క. మెట్టనాగలి



1. కొమ్ము
2. ఏడికర్ర
3. పణత
4. చంక (ఎద)
5. ఆరు
6. కర్రు
7. కొండి
8. పిర్ర
9. మదం
10. చప్ప
11. మేడి
12. సోగ
13. పిర్రచీల

చిత్రం 6 చ. నాగలి



1. కాడి
2. తమిరె
3. తొలి
4. పట్టెడ
5. బొట్టె
6. వారిణె
7. మోకు
8. కొలికి, చిట్టె
9. వారిణెపీట

చిత్రం 6 ట. బురదనాగలి

(భాగాలు : చూ. చిత్రం 6 క.)



చిత్రం 7 క. ఎడ(వెడ)గొర్రు (జడ్డిగంఅమర్చిన గొర్రు)



1. దిండు
2. నొగలు
3. దండెగాడి (పట్టె)
4. గొర్రుకొయ్య
5. కర్రు
6. కర్రుమొల (కొండిమొల)
7. అంకెనమొల
8. అంకెన
9. మొలముతాడు
10. మేడి(రుంబెన)
11. మట్టుదోలి
12. జడ్డిగం

చిత్రం 7 చ. ఆటగొర్రు లేక ఖీటగొర్రు (జడ్డిగంలేని గొర్రు)

(భాగాలు : చూ. చిత్రం 7 క.)



చిత్రం 7 ట. జడ్డిగం




1. పిడత
2. కట్టె (లొట్ట)
3. బిళ్ళ
4. రెపుతాడు




5. బెజ్జం
6. బొడ్డు



చిత్రం 8 క. అక్కిడికట్టె
(ఒంటెక్కిడి)

1. గిన్నె
2. లొట్ట



చిత్రం 8 చ. జంటక్కిడి

1. గిన్నె
2. లొట్ట
3. బిర్రుపలక



చిత్రం 9 క. బీటిగుంటక

1. దిండు
2. నాగ(లు)
3. పలుగు
4. కొయ్య
5. పొన్ను
6. మేడి (రుంబెన)
7. పోగ



చిత్రం **9** చ. కలుపుగుంటక

1. దిండు
2. నొగ(లు)
3. పలుగు
4. కొయ్య
5. పొన్ను
6. మేడి (రుంబెన)
7. పోగ



చిత్రం **9** ట. గుంటక
(ఒంటిపలుగు గుంటక)

1. దిండు
2. కొడతం
3. పలుగు
4. కొయ్య (గుజ్జు)
5. మేడి (రుంబెన)
6. పోగ

చిత్రం 9 త. గోడుపట్టె (చదును పనిముట్టు)



చిత్రం 9 ప. గోరచెక్క



చిత్రం 10 క. పాపటం (దంతె)




చిత్రం 10 చ. మెట్లగుంటక (పాపటం)




1. దిండు
2. నొగ(లు)
3. పలుగు
4. మేడి (రుంజెన)
5. సోగ

చిత్రం 10 ట. అచ్చుగుంటక




1. దిండు 2. నొగ(లు) 3. పన్ను (పల్లు) 4. మేడి 5. పోగ

చిత్రం 11 చేదంతె (అచ్చుకట్టుదంతె)




1. దిండు 2. కాను 3. పన్ను

చిత్రం 12 పలుగొర్రు (పండ్లమాను)




చిత్రం 13 చెరణాకోల



చిత్రం 14 ములుగర్ర



# 5. ఎరువులు : చిల్లరపనిముట్లు

**అంచు** పర్యా. చూ. పొన్ను. కొడవలి, గుద్దలి మొ. వాటి పిడికి పలుగు బిగింపుకోసం వేసిన ఇనపపట్టు. చూ. చిత్రాలు 15 క. 2, 19 చ. 3 (తె. 1, 4-7, 9-12, 33-35, 37).

**అంచె** పర్యా. మట్టితట్ట. ఎరువు, మట్టి, మొ. వి మోయటానికి పనికొచ్చే వెదురుబద్దలతో అల్లిన పళ్ళిక (తె. 25).

**అడ్డ** పర్యా. తల, దుంప. గుద్దలి, చెట్లడ్డ, మొ. వాటి పలుగు దూర్చే మొద్దు. చూ. చిత్రం 19 చ. 2 (కో. 10, 14; తె. 1, 2, 4, 7, 29, 32, 34-39, 42; రా. 18, 22); **-గుద్దలి** పర్యా. చూ. చెట్లగుద్దలి. దున్నటానికి ముందు పొలంలో చిన్నచెట్లను కొట్టే సాధనం. చూ. చిత్రం 19 చ. (రా.); **-నకలు** పర్యా. అడ్డరేవు. గుద్దలి అడ్డకు పలుగు (పల్లు) బిగించే భాగం. చూ. చిత్రం 19 చ. 3 (తె.); **-రేవు** చూ. అడ్డనకలు (రా.).

**అరగంప** పేడతట్ట (కో. 7).

**అరిసిక** పర్యా. చూ. ఈడికమాను. పొలంలో మట్టి పెళ్ళలు నలగటానికి లాగే పంగలమాను; పొలంలో ఉన్న పెద్ద బండలు మొ. వి వీటిమీద వేసి ఎడ్లతో వెలుపలికి లాగిస్తారు. చూ. చిత్రం 27 (రా. 16).

**అలుగు** (1) పర్యా. చూ. తొలుకు. తొల్లికకు వేసిన రేకుపార (కో. 17, 42; రా. 18); (2) కొడవలికి పదును లేనివైపు. చూ. చిత్రం 15, క. 5 (రా. 27); (3) గడ్డపార చివరఉన్న వెడల్పు పలుగు (కో. 14, 17).

**అలుగుగడ్డపార** ఉ. అలుగ్గడ్డపార; పర్యా. బొరిగ గునపం, సావగడ్డపార, చిమ్మెగడ్డపార. చివర వెడల్పు పలుగున్న గడ్డపార. చూ. చిత్రం 21 క. (కో.).

**ఆకు** పర్యా. చూ. వాయిదార. కొడవలి మొదలైన వాటి పదును. చూ. చిత్రం 15 క. 4 (తె. 5, 7).

**ఆరు** పర్యా. చూ. పల్లు, గుద్దలి మొ. వాటికి వేసిన ఇనపపలుగు. చూ. చిత్రాలు 19 క. 3, 19 చ. 4 (తె. 41).

**ఇరుదలగుద్దలి** పర్యా. చూ. పికాసి. ఒకవైపు సూదిలాగా, రెండోవైపు వెడల్పుగా పలుగులున్న పనిముట్టు; చేలల్లో గడ్డిదుబ్బలు కొట్టటానికి, గట్లుపొయ్యటానికి పని కొస్తుంది. చూ. చిత్రం 19 త (రా. 18).

**ఈడికమాను** ఉ. ఈటికెమాను; రూ. ఈడ్చుమాను, ఈరికెమాను; పర్యా. అరిసిక. పొలంలో మట్టిపెళ్ళలు నలగటానికి లాగే పంగలమాను; పొలంలో ఉన్న పెద్ద బండలు మొ. వి వీటిమీదవేసి ఎడ్లతో వెలుపలికి లాగిస్తారు. చూ. చిత్రం 27 (రా. 13, 18, 21).

**ఈడికెలిక్కి** ఉ. ఈటికె-; రూ. ఈడిలిక్కి; పర్యా. ఈడికొడేలి, కలపర, కురిసికె, తట్టుడులిక్కి. ఒకరకం లిక్కి; గుంటక తోలేటప్పుడు పలుగుకు అంటిన చెత్తను తీసే పరికరం. చూ. చిత్రాలు 16 ట, 16 త. (రా. 18).

**ఈడికొడేలి** పర్యా. చూ. ఈడికెలిక్కి. ఒకరకం లిక్కి. గుంటక తోలేటప్పుడు పలుగుకు అంటిన చెత్తను తీసే పరికరం. చూ. చిత్రాలు 16 ట, 16 త. (రా. 24, 25).

**ఈడిలిక్కి** చూ. ఈడికెలిక్కి (రా. 26, 27).

**ఈడ్చుమాను** చూ. ఈడికమాను (రా. 19)

**ఈతకొడవలి** పర్యా. కత్తికొడవలి, కంపకొడవలి. ఈతమట్టలుకోసే పొడుగాటి కొడవలి. చూ. చిత్రం 15 త (రా. 17-20).

**ఈదరకత్తి** పర్యా చూ. మచ్చుగత్తి. కంప మండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రం 17 త (కో. 1).

**ఈరికెమాను** చూ. ఈడికమాను (రా. 24, 25).

**ఉలి** కలుపుతీసే పరికరం (కో. 6, 19).

**ఉల్లారి** పర్యా. కలుపుగుద్దలి, కలుపుచీల, పుత్తెలి, కొంకి, తొనిక్కట్టు. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపుతీసే పనిముట్టు. చూ. చిత్రం 23 ట (రా. 2, 15).

**ఊచ** (1) ఉ. ఊస; పర్యా. చూ. ఏను. కొడవలి, గుద్దలి, నెలగపార మొ. వాటి పార(పలుగు)ను కామ (కర్ర)తో కలిపే ఇనపకొండి లేక కాడ. చూ. చిత్రం 15 క. 3 (తె. 27, 29); (2) తుంగకలుపు తీసే ఇనపకాడ (కో. 18).

**ఎడమంద** పర్యా. వెలిమంద. వేసవికాలం తోలించే మంద; చూ. మంద (తె. 38).

**ఎరువు** ఉ. ఎర్వు(-కొట్టు,- చల్లు,- చిమ్ము,- తోలు). పర్యా. గెత్తం, నై, పెంట, పెండ, పేడ, సత్తువ. (1) జంతువులపెంట; (2) భూమికివేసే సత్తువ (కో. 1,

---

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విణ = విశేషణం; హిం. = హిందుస్తానీ.

4, 6, 8-15, 18-21, 25, 26, 28, 35, 36, 40, 44; తె. 1, 3-10, 12-15, 17-20, 22-24, 26, 27, 31, 32, 34, 37, 39-42; రా. 2-28); **-కుప్ప** రూ. ఎరువుకువ్వ. పొలాలకు తోలిన చిన్న ఎరువుపోగు (తె. రా.); **-కువ్వ** ఉ. ఎరువుకువ; చూ. ఎరువుకుప్ప (కో. రా.); **-జల్ల** రూ. -దొల్ల; పర్యా. -పనక, -పొనక. ఎరువుబండి జల్ల (తె. రా.): **-దంతె** పర్యా. చేదంతె. ఎరువులాగే పరికరం. చూ. చిత్రం 26 (కో. తె);**- దిబ్బ** పేడ మొ. వి వేసిన కుప్ప (రా.); **-దొల్ల** చూ. ఎరువుజల్ల (రా.); **-పనక** చూ. ఎరువుజల్ల (రా.); **-పార** పర్యా. చూ. నెలగపార. ఎరువు చిమ్మటానికి ఉపయోగించే వెడల్పు రేకున్న పనిముట్టు. చూ. చిత్రం 20 చ (రా. 11, 12); **-పుటక** పేడ ఎత్తే తట్ట (రా.); **-పొనక** రూ. ఎరువు పనక; చూ. ఎరువుజల్ల (తె.); **-పోగు** చూ. ఎరువుకుప్ప (కో. తె.): **-బండి** ఎరువుతోలేబండి (కో. తె. రా.): **-మండె** పర్యా. ఎరువుమదర. పొలంలో నిలవచేసిన పెద్ద ఎరువుకుప్ప (రా.); **-మదర** చూ. ఎరువుమండె (రా.); **-సామెన** రూ. ఎరువుసామెర. పొలంలోతోలిన ఎరువు కుప్పల వరస (తె. రా.); **-సామెర** చూ. ఎరువుసామెన (రా.).

**ఏను** పర్యా. ఈచ, కాడ, కుసి, కూలు, కొండినాగలి, మట్టాం, మట్టు, మల, కొడవలి, గుద్దలి, నెలగపార మొ. వాటి పార(పలుగు)ను కామ (కర్ర)తో కలిపే ఇనపకొండి, లేక కాడ. చూ. చిత్రాలు 15 క. 3, 20 క. 2 (కో. 10, 11, 13, 14, 26; తె. 39, 41).

**ఒడ్డెరపార** పర్యా. నెలకపార. ఎరువు చిమ్మటానికి, మట్టితట్టల కెత్తటానికి, గనిమలు చెక్కటానికి ఉపయోగించే పార; ఒడ్డెవాళ్ళుపయోగించేది కాబట్టి ఈ పేరువచ్చి ఉండవచ్చు. చూ. చిత్రం 20 చ. (తె. 32).

**కక్కు-(లు)** కక్కుల కొడవలికి రంపపుపళ్ళలాగ ఉండే పదును నొక్కులు. చూ. చిత్రం 15 ట. 3 (కో. 43, 45; రా. 3-5).

**కక్కులకొడవలి** పర్యా. తూరుపుకొడవలి. పదును వైపు నొక్కులునొక్కులుగా ఉన్న కొడవలి; మెత్తటికాడ ఉన్న పైర్లు కొయ్యటాని కుపయోగిస్తుంది. చూ. చిత్రం 15 ట (కో. 16, 19, 20, 22, 23, 26-29, 35; రా. 3-5, 7, 14, 15).

**కంక** (1) పర్యా. చూ. పికాసి. ఒక వైపు సూది లాగాను, రెండోవైపు వెడల్పుగాను, పలుగులున్న పనిముట్టు; చేలల్లో గడ్డిదుబ్బలు కొట్టటానికి, గట్లు పొయ్యటానికి పనికొస్తుంది. చూ. చిత్రం 19 త (కో. 51); (2) కొండ ప్రాంతాల్లో కలుపుతీసే పనిముట్టు; ఉల్లారిలాగా ఉంటుందేమో (కో. 49).

**కట్టు** పర్యా. చూ. పొన్ను. కొడవలి, గుద్దలి మొ. వాటిపిడికి పలుగు బిగింపుకోసం వేసిన ఇనపకట్టు. చూ. చిత్రాలు 15 క. 2, 19 చ. 3 (తె. 8, 34).

**కట్టె** ఉ. కట్టి; పర్యా. చూ. కామ. గుద్దలి, గొడ్డలి, పార మొదలగువాటి పార (పలుగు) బిగించినకర్ర. చూ. చిత్రాలు 18 చ. 1, 19 క. 1, 19 చ. 1 (కో. 26, 28, 29, 36; తె. 28, 29, 33, 36, 39, 41; రా. 8, 9, 14, 19, 25, 27).

**కట్టెపార** కళ్ళంలో గింజలు పోగుచేసే కొయ్యపార (తె. 14).

**కత్తవ** కాలువలో మట్టితీసే సాధనం; కొన్నిచోట్ల పూర్తిగా కొయ్యతోనే ఉంటుంది. చూ. చిత్రం 24 (కో. 4-6, 46, 49, 50).

**కత్తి** కోత పనిముట్టు. చూ. చిత్రాలు 17 క, చ, ట, త, ప (కో. 31, 37, 40, 46-48, 51; రా. 2, 3 7, 9, 26).

**కత్తికొడవలి** పర్యా. చూ. ఈతకొడవలి. కంపనరికే కొడవలి. చూ. చిత్రం 15 త (తె. 41).

**కంపకొడవలి** పర్యా. చూ. ఈతకొడవలి. కంప, కలబందపట్టలు మొ. వాటిని కోసే కొడవలి. చూ. చిత్రాలు 15 త, ప (కో. 3).

**కంపగుద్దలి** పర్యా. చూ. చెట్లగుద్దలి. దున్నటానికి ముందు పొలంలో చెట్లనుకొట్టే సాధనం. చూ. చిత్రాలు 19 క, చ (తె. 4, 7).

**కొంపగొడ్లి** పర్యా. చూ. చెట్లగుద్దలి. దున్నటానికి ముందు పొలంలో చెట్లనుకొట్టే సాధనం. చూ. చిత్రం 19 క (తె. 6).

**కమ్మకత్తి** పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రం 17 ట (కో. 41-45; తె. 1, 14, 33, 41).

**కరుగోల** పర్యా. చూ. టంకారు. చేలోని చెట్లను వేళ్ళతోకూడా పెళ్ళగించే పనిముట్టు (తె. 32).

**కర్ర** పర్యా. చూ. కామ. గుద్దలి, గొడ్డలి, నెలగ పార మొ. వాటి పార (పలుగు) బిగించినకర్ర. చూ. చిత్రాలు 18 చ. 1, 19 క. 1, 19 చ. 1 (కో. 39, 41-43, 45; తె. 3, 32, 33, 37, 39, 40, 42).

**కర్రు** పర్యా. సలాకా. చివర వెడల్పుగాఉన్న చిన్న గడ్డపార; ఉల్లిగడ్డలు, చెట్లపాదులు తవ్వటానికి ఉపయోగం. చూ. చిత్రం 22 ట (రా. 18).

**కర్రుగుద్దలి** పెంటపోగులు కదల్లాగటానికి, గట్లు వేయటానికి ఉపయోగించే పనిముట్టు. చూ. చిత్రం 19 ట (కో. 21).

**క్రుతంగోల** మట్టి తవ్వే పరికరం; అలుగు పొడుగ్గా

ఉంటుంది. (కో. 21).

కలపర పర్యా. చూ. ఈడికెలిక్కి. ఒకరకం లిక్కి; గుంటక తోలేటప్పుడు పలుగుకు అంటిన చెత్తను తీసే పరికరం. చూ. చిత్రాలు 16 ట, త (తె. 5).

కలవారు(రి) ఉ. కల్వరం, కల్వారు; పర్యా. చూ. లిక్కి. గడ్డికోయటానికి, పైరులో కలుపుతీయటానికి పని కొచ్చే కొడవలి; గడ్డి దోకటానికి వీలుగా పై అంచుకు గూడా పదునుంటుంది (తె. 1, 2, 5-11, 14).

కలుపుగుద్దలి పర్యా. చూ. ఉల్లారి. కలుపుతీసే పని ముట్టు; కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపు పనిముట్టు. చూ. చిత్రం 23 ట (రా. 17).

కలుపుచీల పర్యా. చూ. ఉల్లారి. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపుతీసే పనిముట్టు. చూ. చిత్రం 23 ట (తె. 35, 41).

కసువు ఉ. కస్వు. ఇల్లూడ్చగా వచ్చిన చెత్త, దుమ్ము మొ. వి; పశువుల తొక్కుడు బడ్డ గడ్డి మొ. వి; ఎరువు దిబ్బలో వేస్తారు (కో. 10, 11, 13, 24; తె. 13, 17-21, 29, 36, 39; రా. 4).

కాడ (1) పర్యా. చూ. ఏను. కొడవలి, గుద్దలి, నెలగపార మొ. వాటి పార (పలుగు)ను కామ (కర్ర)తో కలిపే ఇనపకొండి, లేక కాడ. చూ. చిత్రం 15 క. 3 (తె. 1, 26, 42; రా. 3, 14, 18, 27); (2) పర్యా. చూ. కామ. గుద్దలి, గొడ్డలి, నెలగపార మొదలయినవాటి పార (పలుగు) బిగించిన కర్ర. చూ. చిత్రాలు 18 చ. 1, 19 క. 1, 19 చ. 1 (తె. 1, 2, 6).

కామ ఉ. కాము; పర్యా. కట్టె, కర్ర, కాడ, కొయ్య. గుద్దలి, గొడ్డలి, పార మొదలయినవాటి పార(పలుగు)బిగించిన కర్ర. చూ. చిత్రాలు 18 చ. 1, 19 క. 1, 19 చ. 1, 26. 2 (తె. 3-9, 11, 12, 17, 19, 21-23, 26-28, 33-36, 38; రా. 15, 17, 18, 21, 22).

కామపార ఉ. కాంపార; పర్యా. కొండిపార, కొయ్యపార. కర్రలో కూలు (ఇనపరేకు కుసి)దిగేసిన నెలగపార. చూ. చిత్రం 20 ప (కో. 16, 35, 50).

కారు (1) పర్యా. చూ. పల్లు. గుద్దలి మొ. వాటికి వేసిన ఇనపపలుగు. చూ. చిత్రాలు 19 క. 3, 19 చ. 4 (రా. 17); (2) ఉల్లారికి వేసిన ఇనపకొండి (రా. 7, 15).

కుంచం పర్యా. చూ. తూము. గుద్దలి, గొడ్డలి, నెలగపార మొదలైన పనిముట్ల, పారకు గాని, పలుగుకు గాని కర్రదూర్చే కన్నం. చూ. చిత్రాలు 18 చ. 2, 19 క. 2 (రా. 3).

కుత్తెలి ఉ. కుత్తలి (బహు. కుత్తెండ్లు); పర్యా. చూ. ఉల్లారి. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపు పనిముట్టు. చూ. చిత్రం 23 ట (రా. 5).

కురిసికె (1) ఉ. కుర్సక, కుర్సికె; పర్యా. చూ. ఈడికెలిక్కి. ఒకరకం లిక్కి; గుంటక తోలేటప్పుడు పలుగుకు అంటిన చెత్తనుతీసే పరికరం. చూ. చిత్రాలు 16 ట, 16 త (తె. 3; రా. 17, 19, 21, 22); (2) ఉ. కుర్సికి, కుర్సికె; పర్యా. చూ. లిక్కి. గడ్డి కోయటానికి వీలుగా పై అంచుకు గూడా పదునుంటుంది (కో. 8; తె. 3, 4; రా. 16, 17, 19, 21, 22).

కుర్పె ఉ. కురిపి, కురిపె, కుఱపి. కలుపుతీసే సాధనం (తె. 1, 2, 17, 19, 20, 26).

కుసి పర్యా. చూ. ఏను. కొడవలి, గుద్దలి, నెలగపార మొ. వాటి పార (పలుగు)ను కామ (కర్ర)తో కలిపే ఇనపకొండి లేక కాడ. చూ. చిత్రాలు 15 క. 3, 20 క. 2 (కో. 39).

కూలు ఉ. కూలి; పర్యా. చూ. ఏను. కొడవలి, గుద్దలి, నెలగపార మొ. వాటి పార (పలుగు)ను (కర్ర)తో కలిపే ఇనపకొండి, లేక కాడ చూ. చిత్రం 15 క. 3 (కో. 4, 6, 38, 39, 42).

కొంకి (1) పర్యా. చూ. ఉల్లారి. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపుతీసే పనిముట్టు. చూ. చిత్రం 23 ట (తె. 13, 14); (2) ఎరువు పెళ్ళగించే సాధనం (కో. 17, 20).

కొడతకొయ్య పర్యా. చూ. దోకుడుదార. గడ్డిచెక్కే పార. చూ. చిత్రం 22 క (తె. 13).

కొడవలి రూ. కొడలి, కొడేలి, కొడ్వలి. పైరుకోసే వంపు పదునున్న సాధనం. చూ. చిత్రం 15 క (కో. 1, 3, 9-12, 15-37, 39, 40-51; తె. 1-14, 17, 18, 20, 29-42; రా. 2-9, 15-20, 28); భేదాలు: ఈత-, ఏట-, కక్కుల-, కత్తి-, కంప-, గడ్డ-, తూరుపు-, మచ్చు-, మొసలికట్టు-, సాన-.

కొడవలిలిక్కి ఉ. కొడవల్లిక్కి; పర్యా. చూ. లిక్కి. గడ్డి దోకటానికి పై అంచునగూడా పదునున్న చిన్న కొడవలి (కో. 15, 21; తె. 12; రా. 13, 14, 18-20, 26, 28).

కొడలి చూ. కొడవలి (తె. 13, 15-19, 24, 26).

కొడేలి చూ. కొడవలి (కో. 8; రా. 11, 25).

కొడ్వలి చూ. కొడవలి (తె. 16, 20-28).

కొండి పర్యా. చూ. ఏను. కొడవలి, గుద్దలి, నెలగపార మొ. వాటి పార (పలుగు)ను కామ (కర్ర)తో కలిపే ఇనపకొండి లేక కాడ. చూ. చిత్రాలు 15 క. 3, 20 క. 2 (తె. 1, 2).

కొండిపార పర్యా. చూ. కామపార. కర్రలో పార రేకు కుసి దిగేసిన నెలగపార. చూ. చిత్రం 20 ప (తె. 35, 36).

**కొయ్య** పర్యా. చూ. కామ. గుద్దలి, గొడ్డలి, నెలగ పార మొదలయినవాటి పార(పలుగు)ను బిగించిన కర్ర. చూ. చిత్రాలు 18 చ. 1, 19 క. 1, 19 చ. 1 (తె. 17, 21).

**కొయ్యపార** పర్యా. చూ. కామపార. కర్రలో పార రేకు కుని దిగేసిన నెలగపార. చూ. చిత్రం 20 ప (కో. 50).

**కొసిగుద్దలి** ఒకరకం తవ్వుపనిముట్టు (రా. 14).

**కోలపార** పర్యా. చూ. తొలుకు. తొల్లికకు వేసిన రేకు (రా. 9).

**గడారు** చూ. గడ్డపార (రా. 5, 12-16, 18-21).

**గడ్డకొడవలి** పర్యా. మొసలికట్టుకొడవలి. ఒకరకం కోతకొడవలి. చూ. చిత్రం 15 జ (రా. 17, 18, 20).

**గడ్డపలుగు** ఉ. గెడ్డపలుగు; పర్యా. చూ. గడ్డపార. మట్టితవ్వే పొడుగాటి ఇనపపనిముట్టు. చూ. చిత్రం 21క (కో. 16-23; తె. 16).

**గడ్డపాగడ** ఉ. గడ్డపావడ; పర్యా. చూ. గడ్డపార. మట్టితవ్వే పొడుగాటి ఇనపపనిముట్టు. చూ. చిత్రం 21 క (తె. 10).

**గడ్డపార** ఉ. గెడ్డపార; రూ. గడారు, గడ్డారు; పర్యా. గడ్డపలుగు, గడ్డపాగడ, గునపం. మట్టితవ్వే పొడుగాటి ఇనప పనిముట్టు. చూ. చిత్రాలు 21 క, 21 చ (కో. 1-15, 17, 19, 24, 25, 51; తె. 1-3, 6-9, 11-13, 15-28, 32-39, 41, 42; రా. 2-12, 16, 20, 22-28).

**గడ్డారు** చూ. గడ్డపార (తె. 4).

**గడ్డికొడవలి** పర్యా. చూ. లిక్కి. గడ్డికోయటానికి, పైరులో కలుపుతీయటానికి పనికొచ్చే కొడవలి; గడ్డిదోక టానికి వీలుగా పై అంచుకుగూడా పదునుంటుంది (రా. 13, 14, 23, 25).

**గనెంపార** పర్యా. చూ. నెలగపార. మామూలు నెలగపార; గనిమలు చెక్కటానికి ఉపయోగించేది. చూ. చిత్రం 20 చ (రా. 3).

**గన్ను** పర్యా. చూ. సమ్మెట. రాళ్ళను పగులకొట్టే పెద్దసుత్తె (తె. 36).

**గమిటిదురగం** పర్యా. చూ. చెట్లగుద్దలి. దున్నటానికి ముందు పొలంలో చిన్నచెట్లనుకొట్టే సాధనం. చూ. చిత్రాలు 19 క, చ (కో. 20).

**గసిక** ఉ. గసికె,గెసిక. చివర సన్నగాఉండి కొయ్యతో గాని, ఇనుముతోగాని చేసిన కలుపుతీసే మేకు; కొన్నిచోట్ల ఉల్లారినిగూడా ఇలా అంటారు (కో. 6, 13, 16, 19, 21; తె. 32).

**గాజు** పర్యా. చూ. పొన్ను. కొడవలి, గుద్దలి మొ. వాటి పిడికి పలుగు బిగింపుకోసం వేసిన ఇనపకట్టు. చూ. చిత్రాలు 15 క. 2, 19 చ. 3 (తె. 14).

**గిద్ద** ఉ. గిద్దె; పర్యా. చూ. లిక్కి. గడ్డి కోయటానికి, పైరులో కలుపుతీయటానికి పనికొచ్చే కొడవలి; గడ్డి దోక టానికి వీలుగా పై అంచుకుకూడా పదునుంటుంది (కో. 37, 42, 44, 46-49, 51).

**గుజ్జలిపార** పర్యా. చూ. పికాసిపార. మన్ను తవ్వ టానికి, చెట్లు నరకటానికి ఉపయోగించే పనిముట్టు. చూ. చిత్రం 20 గ (కో. 46).

**గుద్దలి** ఉ. గుద్దిలి; రూ. గుద్దెల, గుద్దేలి(లు). పొలంలో ఏటేటా పెరిగే ఉంద్ర, రేగి, రేల, తుమ్మ మొదలైన చెట్లను దున్నటానికిముందు కొట్టే సాధనం; పొగ, మిరప తోటలకు పాదులు కొట్టటానికిగూడా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 19 చ (కో. 12, 14, 15, 17-25, 29, 45; తె. 1, 2, 4, 6-9, 27-29, 32, 34-38, 40-42; రా. 4-8, 10, 12, 14, 15, 17, 18, 20-23).

**గుద్దెల** చూ. గుద్దలి (తె. 3, 4; రా. 28).

**గుద్దేలి(లు)** చూ. గుద్దలి (కో. 2, 6-13; తె. 33, 39; రా. 11, 24, 26).

**గునపం** ఉ. గునపాం; పర్యా. గడ్డపార. మట్టితవ్వే పొడుగాటి ఇనప పనిముట్టు. చూ. చిత్రం 21 క, 21 చ (కో. 37-41, 43, 46-51; తె. 15, 18, 20, 21).

**గులక** రూ. గొలుకు; పర్యా. గుల్లదంటు, దంటు-దడమ. పశువులు తినగా మిగిలిన చొప్ప; దీన్ని ఎరువు దిబ్బలో వేస్తారు (రా. 22).

**గుల్లదంటు** పర్యా. చూ. గులక. పశువులుతినగా మిగిలిన చొప్ప; దీన్ని ఎరువుదిబ్బలో వేస్తారు (రా. 18).

**గెత్తం** ఉ. గెత్త, గెత్రాం; పర్యా. చూ. ఎరువు. అయిదడుగుల లోతుగల గుంటలో కుళ్ళబెట్టిన పశువుల పేడ, తొక్కుడుగడ్డి, మొ.వి; ఎరువు(కో. 37-51);**-పోగు** ఎరువుపోగు (కో.).

**గొడలి** ఉ. గొడ్లి; చూ. గొడ్డలి (తె. 8, 35, 38; రా. 3, 6, 14-18, 21, 22).

**గొడ్డలి** రూ. గొడ్డెలి, గొడ్డేలి(లు), గొడలి. చెట్లు, కర్రలు, చొప్ప మొ. వి నరికే సాధనం. చూ. చిత్రం 18 త (కో. 2, 3, 5, 6, 9, 11-14, 16-20, 22-25, 30, 33, 36, 37, 39-41, 43, 45-51; తె. 1, 3, 5, 7, 9, 11-29, 34-36; రా. 7, 9); **-మాడు** గొడ్డలి వెనక భాగం (కో.).

**గొడ్డలికత్తి** పర్యా. చూ. మడ్డుగత్తి. రెండువైపులా పదునున్న పొటకత్తివంటిది; కొమ్మలు నరకటానికుపయోగిస్తుంది (కో. 45).

**గొడ్డెలి** చూ. గొడ్డలి (తె. 17).

**గొడ్డేలి(లు)** చూ. గొడ్డలి (కో. 7, 8, 10; రా. 26).

**గొద్దిక** చూ. గొద్దె (కో. 51).

**గొద్దె** రూ. గొద్దిక. మేకలు, పందులు మొ.వాటి పెంట (తె. 12).

**గొబ్బరం** ఉ. గొబ్రం. ఎరువుదిబ్బలో కుళ్ళిన పేడ; పచ్చిపేడ (రా. 17).

**గొరసకత్తి** పర్యా. చూ. మడ్డుగత్తి. కొడవలికన్న వంపు తక్కువగా ఉన్న కత్తి; సన్న కొమ్మలు నరకటాని కుపయోగిస్తుంది. చూ. చిత్రం 17 త (కో. 2, 4, 5).

**గొర్రెరువు** గొర్రెల పెంట (కో. 1, 4, 6, 9, 14, 15, 19, 20, 40; తె. 34, 40; రా. 3, 4, 15, 16).

**గొలుకు** చూ. గులక (తె. 3).

**గొల్లగొడ్డలి** ఒకరకం గొడ్డలి (తె. 5).

**చిన్నపార** గడ్డి దోక్కానే చిన్న రేకుపార (తె. 12).

**చిప్పగుద్దలి** పర్యా. చూ. పికాసి. ఒకవైపు సూది లాగా, రెండోవైపు వెడల్పుగా పలుగులున్న పనిముట్టు; చేలల్లో గడ్డిదుబ్బులు కొట్టటానికి, గట్లు పొయ్యటానికి పనికొస్తుంది. చూ. చిత్రం 19 త (కో. 21; రా. 14).

**చిప్పగొడ్డలి** ఉ. సిప్పగొడ్లి. చెరుకుగడలు మొ. వి నరకటానికి ఉపయోగించే వెడల్పు పదునుగల గొడ్డలి. చూ. చిత్రం 18 ట (తె. 1, 32).

**చిప్పతంగోల** పర్యా. చూ. దోకుడుబార. గడ్డిచెక్కే పార. చూ. చిత్రం 22 క (కో. 21).

**చిమ్మెగడ్డపార** పర్యా. అలుగుగడ్డపార. చివర వెడల్పు పలుగున్న గడ్డపార. చూ. చిత్రం 21 క (కో. 15).

**చురకత్తి** ఒకరకం చిన్నకత్తి (తె. 40).

**చెక్కుడుపార** ఉ. సెక్కరపార. గడ్డి చెక్కే పార. చూ. చిత్రం 20 ట (తె. 1, 17, 35; రా. 14, 27).

**చెట్లగుద్దలి** రూ. చెట్లగుద్దెల, చెట్ల గుద్దేలి(లు); పర్యా. అడ్డగుద్దలి, కంపగుద్దలి, కంపగొడ్లి, గమిటిదురగం, చెట్లడ్డ, చెట్లగొడ్లి, పెద్దతొలిక. దున్నటానికి ముందు పొలంలో చిన్న చెట్లను కొట్టే సాధనం. చూ. చిత్రం 19 క (కో. 12, తె. 2, 6, 9, 27-29, 32, 34, 35, 37, 40-42; రా. 8, 14, 15, 21, 23).

**చెట్లగుద్దెల** చూ. చెట్లగుద్దలి (తె. 3, 4; రా. 28).

**చెట్లగుద్దేలి(లు)** చూ. చెట్లగుద్దలి (కో. 6, 8, 10, 11, 13; తె. 33, 39; రా. 11, 24-26).

**చెట్లగొడ్లి** పర్యా. చూ. చెట్లగుద్దలి. దున్నటానికి ముందు పొలంలో చిన్నచెట్లను కొట్టే సాధనం చూ. చిత్రం 19 క (రా. 5).

**చెట్లడ్డ** పర్యా. చూ. చెట్లగుద్దలి. దున్నటానికి ముందు పొలంలో చిన్నచెట్లను కొట్టే సాధనం. చూ. చిత్రం 19 క (రా. 10, 12, 13, 16–20).

**చెత్త** పశువుల తొక్కుడి, పశువులుతొక్కిన గడ్డి గాదం, మొ. వి; దీన్ని ఎరువుదిబ్బలో వేస్తారు (కో. 13, 17, 20; తె. 11, 25, 32, 33, 37, 41).

**చెలికెపార** ఉ. సెలికెపార; చూ. నెలగపార (తె. 1, 35, 39).

**చెల్కపార** చూ. నెలగపార (తె. 19, 21, 27).

**చేదంతె** పర్యా. చూ. ఎరువుదంతె. కుప్పనుంచి ఎరువు లాగే పరికరం. చూ. చిత్రం 26 (తె. 32, 42).

**చేపార** మట్టితవ్వే చిన్నపార (కో. 28, 36).

**చేయిగుద్దలి** తోటల్లో కలుపుతీసే గుద్దలివంటి చిన్న పరికరం (రా. 6).

**చేయుల్లారి** పర్యా. చూ. తొల్లిక. దాదాపు అడుగున్నర పొడవు కొయ్యకు చివర రేకుపార అమర్చిన తవ్వే పనిముట్టు (రా. 15).

**టంకారు** పర్యా. కరుగోల, బండకర్ర, మడ్డికర్ర. చేలోని చెట్లను వేళ్ళతోకూడా పెళ్ళగించే పనిముట్టు (రా. 7).

**డెక్కకత్తి** పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రం 17 క (తె. 43).

**డొల్ల** ఉ. డొల; పర్యా. చూ. తూము. గుద్దలి, గొడ్డలి, నెలగపార మొదలైన పనిముట్ల పారకుగాని, పలుగుకుగాని కర్రదూర్చే కన్నం. చూ. చిత్రాలు 18 చ. 2, 19 క. 2 (కో. 39, 41).

**తగుడు** పర్యా. చూ. రేకు. నెలగపార రేకు. చూ. చిత్రం 20 క. 3 (రా. 17).

**తట్టుడులిక్కి** పర్యా. చూ. ఈడికెలిక్కి. ఒకరకం లిక్కి; గుంటక తోలేటప్పుడు పలుగుకు అంటిన చెత్తను తీసే పరికరం. చూ. చిత్రాలు 16 ట, త (తె. 39).

**తల** పర్యా. చూ. అడ్డ. గుద్దలి, చెట్లడ్డకర్ర. చూ. చిత్రం 19 చ. 2 (రా. 17).

**తవుగోలు** పర్యా. చూ. దోకుడుబార. గడ్డిచెక్కే పార. చూ. చిత్రం 22 క (కో. 19).

**తవ్వుకోల** కలుపుతీసే పరికరం. చూ. చిత్రం 23 క (రా. 9).

**తిపిలం** పర్యా. చూ. లిక్కి. గడ్డికోయటానికి, పైరులో కలుపుతీయటానికి పనికొచ్చే కొడవలి; గడ్డి దోకటానికి వీలుగా పై అంచుకుగూడా పదునుంటుంది (తె. 15).

**తూము** పర్యా. కుంచం, డొల్ల, తొలి, బుర్ర, బొక్క, గుద్దలి, గొడ్డలి, నెలగపార మొదలైన పనిముట్లపారకు గాని, పలుగుకుగాని కర్రదూర్చే కన్నం. చూ. చిత్రాలు 18 చ. 2, 19 క. 2 (కో. 43; తె. 1-4, 7-12, 17, 21-28, 32-39, 41, 42; రా. 8, 14, 17–19, 27).

**తూముపార** పర్యా. మట్టంపార. మట్టుపార రేకు

కున్న తూములో కఱ్ఱదిగేసిన నెలగపార. చూ. చిత్రం 20 త (కో. 16).

**తూరుపుకొడవలి** పర్యా. కక్కులకొడవలి. పదును వైపు నొక్కులు నొక్కులుగా ఉన్న కొడవలి; మెత్తటికాడ ఉన్న పైర్లు కొయ్యటాని కుపయోగం; తూరుప్రాంతాలవా రుపయోగించేవారట. చూ. చిత్రం 15 ట (కో. 21, 22).

**తొక్కుడు** పశువుల కాళ్ళకింద నలిగిన మేత; దీన్ని ఎరువుదిబ్బలో వేస్తారు (కో. 10, 18, 24, 29, 35; తె. 12, 27, 28, 38); **-గడ్డి** చూ. తొక్కుడు (కో. తె.); **-దంటు** చూ. తొక్కుడు (కో.).

**తొడి** పర్యా. చూ. పొన్ను. కొడవలి, గుద్దలి మొ. వాటి పిడికి పలుగు బిగింపుకోసం వేసిన ఇనపకట్టు. చూ. చిత్రాలు 15 క. 2, 19 చ. 3 (కో. 38, 39, 42–45).

**తొనిక్కట్టు** పర్యా. చూ. ఉల్లారి. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపుతీసే పనిముట్టు. చూ. చిత్రం 23 ట (రా. 13, 14).

**తొలి** పర్యా. చూ. తూము. గుద్దలి, గొడ్డలి, నెలగ పార మొదలైన పనిముట్ల పారకుగాని, పలుగుకుగాని కఱ్ఱ దూర్చేకన్నం. చూ. చిత్రాలు 18 చ. 2, 19 క. 2 (కో. 45; తె. 34, 35; రా. 17, 18).

**తొలికె** చూ. తొల్లిక (కో. 3, 7, 40, 45; రా. 6, 8, 11, 20).

**తొలుకు** పర్యా. అలుగు, కోలపార. తొల్లికకు వేసిన రేకుపార. చూ. చిత్రం 23 చ (కో. 39).

**తొల్లిక** రూ. తొలికె, తొళికె; పర్యా. చేయుల్లారి, పారకోల. దాదాపు అడుగున్నర పొడుగు కొయ్యకు చివర రేకుపార అమర్చిన తవ్వుపనిముట్టు (కో. 4, 7, 8, 41, 43; రా. 3, 10, 12).

**తొళికె** చూ. తొల్లిక (కో. 1).

**దంటు-దడమ** పర్యా. చూ. గులక. పశువులు తినగా మిగిలిన చొప్ప; దీన్ని ఎరువుదిబ్బలో వేస్తారు (తె. 10).

**దంతె** చూ. (ఎరువు) దంతె. ఎరువులాగే పరికరం. చూ. చిత్రం 26 (కో. 8, 10, 11, 13, 14, 18, 24, 25; తె. 1, 9, 11, 26, 37, 39, 42).

**దారు** పర్యా. చూ. వాయిదార. కొడవలి మొదలైన వాటి పదును. చూ. చిత్రం 15 క. 4 (కో. 44).

**దుంప** పర్యా. చూ. అడ్డ. గుద్దలి, చెట్లడ్డకఱ్ఱ. చూ. చిత్రం 19 చ. 2 (రా. 18).

**దేకిసపార** ఉ. దేగిసపార; పర్యా. దోకుడుబార, గడ్డి చెక్కేపార. చూ చిత్రం 22 క (తె. 24, 27, 28, 32).

**దోకారి** వెడల్పైన అలుగున్న ఉల్లారివంటి కలుపు పనిముట్టు. చూ. చిత్రం 23 త (రా. 2, 15, 21, 22).

**దోకుడుకొడవలి** పర్యా. చూ. లిక్కి. గడ్డికోయ టానికి, పైరులో కలుపుతీయటానికి పనికొచ్చే కొడవలి; గడ్డిదోకటానికి వీలుగా పై అంచుకుగూడా పదునుంటుంది (తె. 2).

**దోకుడుబార** ఉ. దోకడబార, దోకరపార, దోకు పార, దోకురుపార, దోకులుబార; పర్యా. కొడతకొయ్య, చిప్పతంగోల, తవుగాలు, దేకిసపార, బొరిగె, ములిగిలి పార. గడ్డిచెక్కే పార. చూ. చిత్రం 20 క, 22 క (కో. 3–7, 9, 10, 12–15, 17, 18, 24, 25; తె. 35, 37, 38, 40, 41; రా. 3, 4, 11, 14, 26, 27).

**దోకుడులిక్కి** ఒకరకం లిక్కి. చూ. లిక్కి. చూ. చిత్రాలు 16 క, 16 చ (రా. 18).

**నట్టుగుద్దలి** ఒకవైపే పొడుగాటి పలుగున్న గుద్దలి. చూ. చిత్రం 19 ట (రా. 17, 18).

**నాగలి** పర్యా. చూ. ఏను. నెలగపారను కఱ్ఱతో కలిపే ఇనపకాడ. చూ. చిత్రాలు 15 క. 3, 20 క. 2 (కో. 41).

**నాగలిపార** పర్యా. చూ. పికాసిపార. మన్ను తవ్వ టానికి, చెట్లు నరకటానికి ఉపయోగించే పనిముట్టు (కో. 38).

**నై** పర్యా. చూ. ఎరువు. భూమికి వేసే సత్తువ; పశువుల పేడ, తొక్కిడి, మొ. వి ఒకచోట ఎత్తుగా వేసిన కుప్ప (కో. 6, 14, 15, 17–19, 24, 25, 27–29, 31, 35, 36); **-దిబ్బ** ఎరువుదిబ్బ (కో.); **-పోగు** చిన్న పెంటకుప్ప (కో.).

**పంగలకట్టె** ఉ. పంగాలకట్టె; పర్యా. చూ. రాగోల. రెండుగా చీలిన చివరున్న కట్టె; రేగు వంటి సన్న కంప మండలు తీసుకురావటానికి ఉపయోగించేది. చూ. చిత్రం 25 (కో. 2–4, 7, 50).

**పచ్చి(క)మంద** వానాకాలంలో పొలంలో తోలించే మంద; చూ. మంద (తె. 14, 33).

**పదును** (1) పర్యా. వాయిదార. కొడవలి మొదలైన వాటి పదును. చూ. చిత్రం 18 చ. 4 (తె. 41); (2) పర్యా. చూ. రేకు. నెలగపార రేకు. చూ. చిత్రం 15 క. 4 (కో. 36).

**పదునుకత్తి** పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరికే మొద్దు కత్తి. చూ. చిత్రం 17 క (కో. 16).

**పందివంటు** ఉ. పందొంట. ఎండిన పంది పెంట. (కో. 16).

**పందెరువు** పందిపెంట (కో. 6, 20, 21, 26, 28, 35, 44; తె. 41).

**పన్ను** చూ. పొన్ను (తె. 41).

**పలుగు** (1) పర్యా. చూ. పల్లు. గుద్దలి మొదలగు వాటికి వేసిన ఇనప పలుగు. చూ. చిత్రాలు 19 క. 3, 19

చ. 4 (తె. 32, 33, 38, 40); (2) పర్యా. చూ. రేకు. నెలగపార రేకు. చూ. చిత్రం 20 క. 3 (కో. 28).

పల్గర పలుగు చివర చెక్కిన కర్ర (తె. 15).

పల్లిచెక్క పర్యా. పల్లిపిండి. నూనె తియ్యగా మిగిలిన వేరుసెనగ పిట్టు; దీన్ని ఎరువుగా ఉపయోగిస్తారు (తె. 20).

**పల్లిపిండి** ఉ. పల్లెపిండి, పిల్లిపిండి; పర్యా. పల్లి చెక్క (హిం. పల్లీ=వేరుసెనగ) నూనె తియ్యగా మిగిలిన వేరుసెనగ పిట్టు; దీన్ని ఎరువుగా ఉపయోగిస్తారు (తె. 13, 23-27, 29, 31).

పల్లు పర్యా. ఆరు, కారు, పలుగు, పీచు. గుద్దలి మొ. వాటికి చేసిన ఇనపపలుగు. చూ. చిత్రాలు 19 క. 3, 19 చ. 4 (తె. 1, 4, 6-8, 34-37; రా. 16, 18).

పసరుమంద ఉ. పసురుమంద; చూ. పసికెమంద, పసిరికెమంద, పైరమంద. వానాకాలంలో పొలంలో తోలించే మంద; చూ. మంద (కో. 45; రా. 19).

పసికెమంద చూ. పసరుమంద (తె. 4, 10, 12, 29).

**పసిరికమంద** చూ. పసరుమంద (తె. 32, 34, 38).

పార పర్యా. పావడా, పౌడా, నెలగపార. (1) ఏదైనా తవ్వే సాధనం; (2) నెలగపార. చూ. చిత్రం 20 చ (కో. 1-7, 9-26, 28-43, 45-51; తె. 1-9, 11-16, 18, 20-42; రా. 1-4, 6-28).

పారకోల పర్యా. చూ. తొల్లిక. దాదాపు అడుగున్నర పొడుగు కొయ్యకు చివర రేకుపార అమర్చిన తవ్వు పనిముట్టు (రా. 9, 25).

పావడా ఉ. పాగడా; చూ. పౌడా (తె. 10).

పికాసి రూ. పిక్కాసి, పిరకాసి; పర్యా. ఇరుదల గుద్దలి, కంక, చిప్పగుద్దలి. ఒకవైపు సూదిలాగా, రెండో వైపు వెడల్పుగా పలుగులున్న పనిముట్టు; చేలల్లో గడ్డి దుబ్బలు కొట్టటానికి, గట్లు పొయ్యటానికి పనికొస్తుంది. చూ. చిత్రం 19 త (తె. 2, 10, 21; రా. 3, 9, 10, 23-25, 28).

**పికాసిపార** (1) పర్యా. గుజ్జలిపార, నాగలిపార, రోగలిపార. మన్నుతవ్వటానికి, చెట్లునరకటానికి ఉపయోగించే పనిముట్టు (కో. 38; తె. 21); (2) రెండు తవ్వే ఇనపపలుగులున్న పనిముట్టు (తె. 22, 23, 25, 26, 28).

పిక్కాసి చూ. పికాసి (కో. 50, 51).

. పిచ్చగొడ్డలి వెడల్పు పదునుగల చిన్నగొడ్డలి. చూ. చిత్రం 18 క (కో. 43; రా. 6, 18).

పిడి కొడవలి మొదలైన పనిముట్లకు పట్టుకోటానికి వీలుగా ఉండే కొయ్యభాగం. చూ. చిత్రాలు 15 క. 1, 15 ట. 1 (కో. 26, 29, 38, 39, 42, 43-45, 50; తె. 1, 4-12, 14, 17, 19, 21, 33-35 42; రా. 4, 14, 18, 27).

పిండెరువు ఎరువుగా ఉపయోగించే మొ. వి (రా. 3, 5, 7, 9, 11, 19, 2

పిరకాసి చూ. పికాసి (కో. 46).

**పీచు** పర్యా. చూ. పల్లు. గుద్దలి ఇనపపలుగు. చూ. చిత్రాలు 19 క. (తె. 2).

పునాసమంద పర్యా. చూ. వెలిమం పొలానికి తోలించేమంద; చూ. మంద (తె

పెంట పర్యా. చూ. ఎరువు. పశువు సత్తువగావేసే కుళ్ళిన పేడ (కో. 2, 3, 16, 18, 19, 21, 23, 24, 26-28, 39, 41-43, 45, 46; తె. 1, 4-16, 23, 24, 25, 27, 29, 30-39, 41 25-27): -కుప్ప ఎరువుగా నిలవచేసి కుప్ప (కో. తె.); -గడ్డ చూ. పెంట **-గుంత** పెంట ఎరువుగా నిలవచేసే గుంట చూ. పెంటగుంత (కో.): దిబ్బ పశువు ఒకచోట ఎత్తుగా వేసిన కుప్ప (తె. రా.) బండి జల్ల; చూ. ఎరువుజల్ల (తె.): -పొ చీపురు (తె.); -పోగు చూ. పెంటకుప్ప చూ. పెంటగుంత (తె.); -సొమెర ఎరువుకుప్పల వరస (తె.).

పెంటికె ఉ. పెంటిక; రూ. పెం గొర్రెలు, మేకలు మొ. వి చేసిన పెంటఉం

పెంట్రుక చూ. పెంటిక (రా. 17)

పెండ చూ. పేడ (కో. 38, 39, 5-14, 16-29, 32-36, 38-40, 42 పేడకుప్ప (తె.); -గుల్ల పేడఎత్తే త పెండగుల్ల; -దిబ్బ పేడదిబ్బ (తె.); -బ చేసే గొయ్యి (తె.); -సిబ్బి చూ. పెండ **-అంచె** పేడఎత్తే తట్ట; చూ. పెండగుల్ల

పెంద్రిక చూ. పెంటికె (కో. 42,

పెద్దకొడవలి పర్యా. సానకొడవలి పైర్లుకోసే పెద్దసైజు కొడవలి. చూ. చి 18; తె. 15-28; రా. 13).

పెద్దగొడ్డలి మొద్దులు మొ. వి నరకే గించే పెద్దసైజు గొడ్డలి. చూ. చిత్రం 1 38; రా. 17, 18).

పెద్దతొలిక పర్యా. చూ. చెట్లగుద్ద ముందు పొలంలో చిన్నచెట్లను కొట్టే చిత్రం 19 చ (రా. 3).

పెద్దపార పర్యా. చూ. సెలగపార. పొలాలగట్లు గనిమెలుచెక్కే పెద్ద సెలగపార. చూ. చిత్రం 20 చ (రా. 26).

పెనక్కత్తి పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రం 17 ట (కో. 20).

పేడ రూ. పెండ; పర్యా. చూ. ఎరువు. పశువుల పెంట; పొలాలకు దీన్ని ఎరువుగా వేస్తారు (కో. 1–10, 13–15, 18–23, 25, 29, 31-37, 40, 41, 43-47, 49, 51; తె. 30, 37, 41; రా. 1, 9, 16, 18); -కడి పేడముద్ద (కో.); -కుప్ప రూ. పెంటకుప్ప, పెండ కుప్ప. పశువుల మలం ఒకచోట ఎత్తుగా వేసిన కుప్ప (కో.); -గెత్తాం ఎరువుగా వేసే పేడ (కో.); -పల్లిక పశువులపేడ ఎత్తేతట్ట (కో.).

పైరమంద చూ. పసరుమంద (కో. 43).

పొంకం చెరువులోపలి మట్టి; దీన్ని ఎరువుగా ఉపయోగిస్తారు (కో. 50).

పొన్ను రూ. పన్ను; పర్యా. అంచు, కట్టు, గాజు, తొడి, బల. కొడవలి, గుద్దలి మొ. వాటి పిడికి పలుగు బిగింపుకోసం వేసిన ఇనపకట్టు. చూ. చిత్రాలు 15 క. 2, 15 ట. 2, 19 చ. 3 (తె. 32, 33, 37–39, 42; రా. 4, 14, 27).

పోటకత్తి పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రం 17 ప (కో. 23).

పోడుకత్తి పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రం 17 చ (కో. 39).

ఫౌఢా రూ. పావడా; పర్యా. చూ. పార (హిం. ఫౌఢా). (1) ఏదైనా తవ్వేసాధనం; (2) సెలగపార. చూ. చిత్రం 20 చ (తె. 17, 19, 20).

బండకర్రు పర్యా. చూ. టంకారు. చేలోని చెట్లను వేళ్ళతోగూడా పెళ్ళగించే పనిముట్టు (తె. 1).

బరిసెపార మొక్కలు నరికేపార (కో. 32).

బల ఉ. బల్ల; పర్యా. చూ. పొన్ను. కొడవలి, గుద్దలి మొ. వాటి పిడికి పలుగు బిగింపుకోసం వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 15 క. 2, 19 చ. 3 (తె. 1–3, 5–7, 34–36; రా. 17–20).

బాడె మేకలపెంట (కో. 30).

బుర్ర పర్యా. చూ. తూము. గొద్దలి, సెలగపార మొదలైనవాటి తూము. చూ. చిత్రాలు 18 చ. 2, 19 క. 2 (కో. 43, 45).

బుర్రపార పర్యా. చూ. సెలగపార. ఎరువు చిమ్మటానికి, మట్టి తట్టల కెత్తటానికి, గనిమలు చెక్కటానికి ఉపయోగించే వెడల్పురేకు అమర్చిన తవ్వుపనిముట్టు. చూ. చిత్రం 20 ట (కో. 38).

బెరికిలిక్కి ఒకరకం లిక్కి. చూ. చిత్రం 16 ప (రా. 18).

బొక్క పర్యా. చూ. తూము. గుద్దలి తూము. చూ. చిత్రాలు 18 చ. 2, 19 క. 2 (తె. 4).

బొడ్డె పొలంలో చాలుగాపోసిన ఎరువుకుప్ప(లు) (తె. 4, 6–8).

బొరిగగునపం ఉ. బొరిగ్గునపం; పర్యా. చూ. అలుగు గడ్డపార. చివర వెడల్పు పలుగున్న గడ్డపార. చూ. చిత్రం 21 క (కో. 43).

బొరిగె ఉ. బొరిగి, బొరుగు; పర్యా. చూ. దోకుడు బార. గడ్డిచెక్కేపార. చూ. చిత్రం 22 క (కో. 37–51; తె. 13, 15, 17, 18).

మచ్చుకత్తి పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రం 17 క (కో. 3, 7; రా. 1–5, 7, 9, 11, 16, 18).

మచ్చుకొడవలి చెరుకుగడలు, కట్టెలు మొ. నరికే కొడవలి. చూ. చిత్రం 15 గ (రా. 6, 18).

మట్టాం చూ. మట్టు (కో. 42).

మట్టాంపార చూ. మట్టుపార (కో. 38).

మట్టిగుల్ల పర్యా. చూ. మట్టితట్ట. మోయటానికి పనికొచ్చే వెదురుబద్దలతో అల్లిన పళ్ళిక (తె. 10, 16, 19).

మట్టితట్ట పర్యా. అంచె, మట్టిగుల్ల, మట్టిబుట్ట, వద్దె గంప. మట్టిమోయటానికి పనికొచ్చే వెదురుబద్దలతో అల్లిన పళ్ళిక (కో. 4, 5; తె. 1, 11, 20, 24, 33-39; రా. 9-23, 24, 28).

మట్టిబుట్ట పర్యా. చూ. మట్టితట్ట. మోయటానికి పనికొచ్చే వెదురు బద్దలతో అల్లిన పళ్ళిక (రా. 3, 26).

మట్టు రూ. మట్టాం; పర్యా. చూ. ఏను. కొడవలి, గుద్దలి, సెలగపార మొ. వాటి పార(పలుగు)ను కామ (కర్ర)తో కలిపే ఇనపకొండి, లేక కాడ. చూ. చిత్రం 15 క. 3 (తె. 6, 8, 9, 27, 32, 34–39, 42).

మట్టుపార రూ. మట్టాంపార; పర్యా. చూ. తూము పార. రేకుకున్న తూములో కర్రదిగేసిన సెలగపార. చూ. చిత్రం 20 త (తె. 14, 35, 36).

మడవపార పర్యా. చూ. సెలగపార. మడవలు (కాలవ మొదళ్ళు) ఏర్పరచటానికి ఉపయోగించే సెలగ పార. చూ. చిత్రం 20 చ (రా. 9).

మడ్డికర్రు పర్యా. చూ. టంకారు. చేలోని చెట్లను వేళ్ళతో కూడా పెళ్ళగించే పనిముట్టు (రా. 18).

మడ్డుగత్తి పర్యా. ఈదరకత్తి, కమ్మకత్తి, గొడ్డలి కత్తి, గొరసకత్తి, డెక్కుకత్తి, పదునుకత్తి, పెనక్కత్తి, పోటకత్తి, పోడుకత్తి, మచ్చుకత్తి, మొద్దుకత్తి. కంప

మండలు నరికే మొద్దుకత్తి. చూ. చిత్రాలు 17 క, చ, ట, త, ప (కో. 2, 5, 6, 8, 15, 17, 20, 27, 35, 36; తె. 40, 41).

**మంద (-ఆవు, -ఆయు, -తోలు, -వేయు).** పొలాలకు సత్తువకోసం తోలించే గొర్రెల గుంపు; కొన్నిచోట్ల ఆవులమంద కూడా (కో. 1, 4, 20, 22, 24, 37, 43, 45, 48-50; తె. 1, 3-5, 10-14, 16, 26, 29, 32-35, 38; రా. 19).

**మల** పర్యా. చూ. ఏను. ఉల్లారికి వేసిన ఇనపకొండి. చూ. చిత్రాలు 15 క. 3, 20 క. 2 (రా. 14).

**ములిగిలిపార** పర్యా. చూ. దోకుడుపార. గడ్డిచెక్కే పనిముట్టు. చూ. చిత్రం 20 క (రా. 7).

**మేతెరువు** మేకల పెంట (కో. 40; తె. 1, 31, 40; రా. 2, 4).

**మొద్దుకత్తి** పర్యా. చూ. మడ్డుగత్తి. కంపమండలు నరకటాని కుపయోగించే పిడి లేని కత్తి (కో. 5).

**మొసలికట్టుకొడవలి** పర్యా. గడ్డకొడవలి. ఒకరకం కోత కొడవలి. చూ. చిత్రం 15 జ (తె. 6, 18).

**రాగాల(లు)** చూ. రాగోల(లు) (కో. 10, 11, 13, 14, 18, 21-25; తె. 10; రా. 17, 18).

**రాగోల(లు)** రూ. రాగాల(లు), రోగాల, రోగోలు; పర్యా. పంగలకట్టె. చివర పంగలున్న పొడుగు కట్టె; ముళ్ళకంపలను తెచ్చి వెలుగువెయ్యటానికి ఉపయోగించే పనిముట్టు. చూ. చిత్రం 25 (కో. 6; తె. 4, 18, 38, 42).

**రేకు** పర్యా. తగుడు, పదును, పలుగు. నెలగపార రేకు. చూ. చిత్రం 20 క. 3 (కో. 2, 32, 41-45; తె. 1-6, 12, 28, 29, 32-39, 42; రా. 8, 14, 18, 19, 27).

**రేపటిమంద** పగటిపూట పొలంలోకి తోలిన గొర్రెల మంద (రా. 19).

**రొట్ట** రూ. రొడ్డ. పందులపెంట (కో. 49).

**రొడ్డ** చూ. రొట్ట (కో. 40).

**రోగలిపార** పర్యా. చూ. పికాసిపార. మన్ను తవ్వటానికి, చెట్లు నరకటానికి ఉపయోగం. చూ. చిత్రం 20 గ (కో. 26).

**రోగాల** చూ. రాగోల(లు) (కో. 9).

**రోగోలు** చూ. రాగోల(లు) (తె. 41).

**లద్దె** గాడిదలు, గుర్రాలు మొ. వాటి పెంట (రా. 18).

**లిక్కి** రూ. లుక్కి; పర్యా. కలవారు(రి), కురిసికె, కొడవలిలిక్కి, గడ్డికొడవలి, గిద్ద, గిద్దె, తిపిలం, దోకుడు కొడవలి, లిక్కికొడవలి. గడ్డికోయటానికి, పైరులో కలుపు తీయటానికి పనికొచ్చే కొడవలి; గడ్డి దోకటానికి వీలుగా పై అంచుకుగూడా పదునుంటుంది (కో. 3, 9-14, 17-20, 22, 23, 31, 32, 35; తె. 18, 19, 37, 38, 40; రా. 1, 5, 8-10, 12).

**లిక్కికొడవలి** పర్యా. చూ. లిక్కి. గడ్డికోయటానికి, పైరులో కలుపుతీయటానికి పనికొచ్చే కొడవలి; గడ్డి దోకటానికి వీలుగా పై అంచుకు గూడా పదునుంటుంది (కో. 29; తె. 6, 41).

**లుక్కి** చూ. లిక్కి (రా. 15).

**వడ్డెగంప** పర్యా. చూ. మట్టితట్ట. మోయటానికి పనికొచ్చే వెదురుబద్దలతో అల్లిన పళ్ళిక (రా. 18, 25, 27).

**వాదర** చూ. వాయిదార (కో. 8; రా. 27).

**వాయి** పర్యా. చూ. వాయిదార. కొడవలి మొదలయిన వాటి పదును. చూ. చిత్రం 15 క. 4 (కో. 18).

**వాయిదార** రూ. వాదర; పర్యా. అకు, దారు, పదును, వాయి. కొడవలి మొదలైనవాటి పదును. చూ. చిత్రం 15 క. 4 (రా. 17-19).

**వెలిమంద** పర్యా. ఎడమంద, పునాసమంద. వేసవి కాలం తోలించేమంద; చూ. మంద (తె. 5).

**వేసగిమంద** ఉ. ఏసకి-, ఏసికి-, వేసంగి-. ఎండాకాలం ఎరువుకోసం పొలంలోకి తోలించే గొర్రెలమంద (కో. 43, 45; తె. 4, 10, 12, 14, 29, 32, 33, 35).

**శాయిపోగు** (1) పొలంలో చాలుగాపోసిన ఎరువు కుప్ప (తె. 39); (2) ? ఎరువుకుప్ప (తె. 39).

**సత్తువ** ఉ. సత్తవ. భూమికివేసే సత్తువ; ఎరువు (కో. 7).

**సనికిపార** చూ. నెలగపార (రా. 4).

**సమ్మెట** ఉ. సమ్మిట; పర్యా. గన్ను. రాళ్ళను పగుల గొట్టే పెద్దసుత్తె (రా. 5, 18, 21).

**సలాకా** చివర వెడల్పుగాఉన్న చిన్నగడ్డపార; ఉల్లిగడ్డలు, చెట్లపాదులు తవ్వటానికి ఉపయోగం. చూ. చిత్రం 22 ట (కో. 8).

**సానకొడవలి** పర్యా. పెద్దకొడవలి. జొన్న మొ. పైర్లుకోసే పెద్దసైజు కొడవలి. చూ. చిత్రం 15 చ (కో. 23).

**సామెన** రూ. సామెర. పొలంలో చాలుగా పోసిన ఎరువుకుప్ప(లు) (తె. 29, 37; రా. 18, 20, 25).

**సామెర** చూ. సామెన (రా. 25).

**సావగడ్డపార** పర్యా. చూ. అలుగుగడ్డపార. చివర వెడల్పు పలుగున్న గడ్డపార. చూ. చిత్రం 21 క (కో. 19).

**సీమపార** చూ. నెలగపార. కూలుతోకూడా పోత పోసిఉన్న నెలగపార. చూ. చిత్రం 20 చ (కో. 5).

**సూదిగునపం** పర్యా. సోగగడ్డపార. చివర కోసుగా

ఉన్న గడ్డపార. చూ. చిత్రం 21 చ (కో. 43).

**సెలకపార** ఉ. సలకపార, సెలికెపార. చూ. సెలగపార (కో. 11, 24; తె. 4-6, 18, 22, 24, 34, 39; రా. 4, 15-18, 22-28).

**సెలగపార** ఉ. చెలగపార ; రూ. చెలికెపార, చెల్కపార, సనికిపార, సెలకపార, సెలంకపార ; పర్యా. ఎరువుపార, ఒడ్డెరపార, గనెంపార, పావడా, పెద్దపార, ఫౌడా, బుర్రపార, మడవపార. ఎరువు చిమ్మటానికి, మట్టి తట్టల కెత్తటానికి, గనిమలు చెక్కటానికి ఉపయోగించే వెడల్పురేకు అమర్చిన తవ్వుపనిముట్టు. చూ. చిత్రం 20 చ (కో. 2-14, 17, 18 ; రా. 1, 7) ; రకాలు : కామపార, కొండిపార, కొయ్యపార, తూముపార, మట్టాంపార, మట్టుపార, సీమపార.

**సెలంకపార** చూ. సెలగపార (రా. 5, 8, 10).

**సోగగడ్డపార** పర్యా. చూ. సూదిగునపం. చివర కోసుగాఉన్న గడ్డపార. చూ. చిత్రం 21 చ (కో. 2).

చిత్రం 15 క. కొడవలి




1. పిడి 2. పొన్ను 3. ఏను
4. పదును 5. అలుగు

చిత్రం 15 గ. మచ్చుకొడవలి



చిత్రం 15 చ. పెద్దకొడవలి



చిత్రం 15 జ. మొసలికట్టు కొడవలి



చిత్రం 15 ట. కక్కు-లకొడవలి



1. పిడి 2. పొన్ను 3. కక్కు-(ఱ)

చిత్రం 15 త. ఈతకొడవలి





చిత్రం 15 ప. కంపకొడవలి



చిత్రం 16 క. దోకుడులిక్కి



చిత్రం 16 చ. దోకుడులిక్కి



చిత్రం 16 ట. ఊడికెలిక్కి

చిత్రం 16 త. ఈడికెలిక్కి



చిత్రం 16 ప. బెరికిలిక్కి



చిత్రం 17 క. మచ్చుకత్తి



చిత్రం 17 చ. పోడుకత్తి





చిత్రం 17 ట. పెనక్కత్తి



చిత్రం 17 త. ఈదరకత్తి



చిత్రం 17 ప. పోటకత్తి

చిత్రం 18 క.
పిచ్చుగొడ్డలి



చిత్రం 18 ట.
చిప్పగొడ్డలి



చిత్రం 18 చ.
పెద్దగొడ్డలి



1. కామ
2. తూము
3. అలుగు
4. పదును

చిత్రం 18 త.
గొడ్డలి



చిత్రం 19 క. చెట్లగుద్దలి



1. కామ 2. తూము 3. పల్లు

చిత్రం 19 చ. అడ్డగుద్దలి



1. కామ 2. అడ్డ 3. పొన్ను 4. పల్లు

చిత్రం 19 ట. కర్రుగుద్దలి



చిత్రం 19 త. పికాసి



చిత్రం 20 క. దోకుడుపార
1 కాము 2. ఏను 3. రేకు

చిత్రం 20 చ. సెలగపార




చిత్రం 20 ట. చెక్కుడుపార

చిత్రం 20 త. తూముపార

చిత్రం 20 గ. రోగలిపార



చిత్రం 20 ప. కామపార



చిత్రం 21 క. అలుగుగడ్డపార





చిత్రం 21 చ. సూదిగునపం



చిత్రం 22 క.
దోకుడుబార



చిత్రం 22 చ.
తొల్లిక



చిత్రం 22 ట.
సలాకా



చిత్రం 23 క.
తవ్వుకోల



చిత్రం 23 చ.
తొల్లిక



చిత్రం 23 ట.
ఉల్లారి



చిత్రం 23 త.
దోకారి



చిత్రం 24 కత్తవ

చిత్రం 25 రాగోల



చిత్రం 26. ఎరువుదంతె




1. దిండు
2. కామ
3. పన్ను

చిత్రం 27. ఈడికమాను



# 6. బండి: భాగాలు

**అచ్చు** పర్యా. చూ. ఇరుసు. బండి అక్షం. చూ. చిత్రాలు 28 వ. 1, 29 చ. 1, 30 చ. 1 (రా. 4, 5, 16).

**అడకట్టె** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరం(చట్రం) లోని అడ్డపట్టె (రా. 17).

**అడిగంపట్టె** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (రా. 16).

**అడిగె** పర్యా. చూ. పారు. బండి చట్రంలో నిలువు పట్టె. చూ. చిత్రం 29 చ. 6 (రా. 17).

**అడుసుగట్టు** (క్రి.) పర్యా. చూ. పారుగట్టు. బండిని ఒక ఎద్దు బాగా లాగలేనప్పుడు ముందుబోయే ఎద్దువైపు కాడిని వెనక్కి లాగి పరానికి కట్టటం (కో. 24).

**అడ్డ** (1) పర్యా చూ. దొలుపు. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రాలు 28 చ. 5, 29 చ. 2, 30 చ. 2 (కో. 2, 4, 12); **-పట్టె** చూ. అడ్డ (కో.); (2) పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (కో. 17–23, 35, 37; తె. 8, 10, 11, 15, 20, 40, 41): **-కట్టు** పర్యా. చూ. కుండకట్టు. బండికుండకు వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 2 (కో.; తె).

**అడ్డకమ్మి** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరం (చట్రం)లోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (కో. 2, 17, 18, 20–23; తె. 39).

**అడ్డదబ్బ** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరం(చట్రం) లోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (తె. 1, 4, 7; రా. 17).

**అడ్డపట్టె** పర్యా. అడకట్టె, అడ్డకమ్మి, అడ్డదబ్బ, అడ్డపారు, అడ్డబద్దె, కురకమ్మి, కురచకమ్మి, కురచపట్టె, కురప్పట్టె, గోడుపట్టె, తట్టకర్ర, దబ్బ, వరప్పట్టె, పరంపట్టె, పిల్లపట్టె, పిల్లపారు, పీట, ముసలాయిపట్టె, బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (కో. 3, 5, 13, 15, 16, 19, 29, 32, 34; తె. 30, 31, 36, 38, 42; రా. 3, 4, 9, 11, 12, 17, 18, 22, 24–26, 28).

**అడ్డపారు** ఉ. అడ్డపార; పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరం(చట్రం)లోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (తె. 32, 33).

**అడ్డపోల్లు** ఉ. అడ్డవపోళ్లు; పర్యా. చూ. పెడదబ్బ. రెండు నొగలబండి నొగలను వెనకవైపున బంధించినకర్ర. చూ. చిత్రం 28 చ. 8 (రా. 22).

**అడ్డబద్దె** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (తె. 37).

**అంపసన్నపట్టె(లు)** పర్యా. నక్క(లు), లగుబడె(లు), సితికట్టె. బండి దొలుపుకింద నొగ(ల)ను బిగించిన కర్ర(లు). చూ. చిత్రం 28 చ. 10 (రా. 18).

**అరకపీట** పర్యా. చూ. ముక్కుపీట. బండి పోలుగర్రకు కాడిగట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 29 చ. 5 (రా. 23, 28).

**అల్లకంతాడు** పర్యా. చూ. పురిబిసి. ఒసికర్రలపై వేసిన సర్నాలను పారుపట్టెకు కట్టేతాడు. చూ. చిత్రం 28 క. 2 (రా. 21).

**అల్లు** పర్యా. చూ. గడిచీల. బండి దొలుపు కిరువైపుల బిగువుకోసం కొట్టిన మేకు(లు) (రా. 3).

**ఆకు** పర్యా. అరె, కల్లు, కొయ్య, రేకు, లాక. బండి కుండను, పూటీ (వంపు)ని కలిపే కొయ్య; ఒక్కొక్క పూటీకి రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 2 (కో. 1-25, 27-36; తె. 1-6, 8, 9, 11-16, 18, 34-42; రా. 1-6, 8, 11, 15-18, 20-28).

**ఆటార్నె** పర్యా. చూ. వార్నెతాడు. బండి పోలుతాడును జువ్వాయిమోకుకు అతికేతాడు (తె. 17).

**ఆనుగట్టె** పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగలకింద ఎత్తుగా పెట్టిన కొయ్య. చూ. చిత్రాలు 28 క. 7, 31.5, 32.2 (తె. 5).

**ఆనుగర్ర** పర్యా. అనుగట్టె, అనుగుంజ, అనుగూటం, అనుదబ్బ, కత్తిరిగాలు, కత్తిరిగెడ, కుద్దాం, కోణవాటా, గుడం, గుద్దాం, తన్నుగర్ర, నక్కకట్టె, నక్కగూటం, బండిగూటం, బంతిగూటం, బుద్దారి, సిపాయి, సిపాయికర్ర, సిపాయిగుంజ. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగ(ల)కింద ఎత్తుగాపెట్టిన కొయ్యల పరికరం. చూ. చిత్రాలు 28 క. 7, 31.5, 32.2 (కో. 24; తె. 14, 29, 32, 35, 36).

**ఆనుగుంజ** పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను

---

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విశ. = విశేషణం; హిం. = హిందుస్తానీ.

విడిచినపుడు దించకుండా నొగ(ల)కింద ఎత్తుగా పెట్టిన కొయ్య (తె. 6, 7).

**అనుగూటం** పర్యా. చూ. అనుగఱ్ఱ. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగ(ల)కింద ఎత్తుగా పెట్టిన కొయ్య. చూ. చిత్రాలు 28 క. 7, 31.5, 32.2 (తె. 2).

**అనుదబ్బ** పర్యా. చూ. అనుగఱ్ఱ. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగ(ల)కింద ఎత్తుగా పెట్టిన కొయ్య. చూ. చిత్రాలు 28 క. 7, 31.5, 32.2 (తె. 8).

**అమ్మానబండి** పర్యా. ఏగెబండి, చెకడాబండి, తోకబండి, వంకాలబండి. రెండు నొగలబండి. (తె. 7-9).

**ఆరె** పర్యా. చూ. ఆకు. బండికుండను పూటీ (వంపు)ని కలిపే కొయ్య. చూ. చిత్రం 28 ట. 2 (కో. 30; తె. 7, 10, 20-33).

**ఇందె** బండి పరాన్ని దోనెకు బిగించే చీల (తె. 4).

**ఇరుసు** ఉ. ఇర్సు; పర్యా. అచ్చు, గడారు. బండి అక్షం. చూ. చిత్రాలు 29 చ. 1, 30 చ. 1 (కో. 1-7, 9-13, 15, 17-24, 26-37, 39-45, 47, 48, 51; తె. 1-13, 15-27, 29-42; రా. 1-3, 6, 8, 9, 11, 15-18, 21-27).

**ఈసు** పర్యా. నగ, నొగ. రెండు నొగలబండి కమర్చిన పొడుగు కొయ్య చూ. చిత్రం 28 చ. 1 (రా. 16-18).

**ఉండ** పర్యా. చూ. చెక్రం. బండి నడవటానికి ఆకులతో ఉన్న చెక్రం. చూ. చిత్రం 28 ట (కో. 37-39, 41-51).

**ఉద్దు(లు)** పరంలో పట్టె(లు) (కో. 38, 40-43, 45, 46, 48, 51).

**ఉప్పకారి** పర్యా. చూ. ఎత్తుగఱ్ఱ. కందెన వెయ్యటానికి బండిచెక్రం ఊడదీసినప్పుడు ఇరుసుకింద ఎత్తుపెట్టిన కఱ్ఱ (తె. 29, 32).

**ఉలవ** చూ. ఉలవాయి (కో. 46, 47, 50); **-పొద్దు** చూ. ఉలవ. (కో.).

**ఉలవాయి** రూ. ఉలవ, ఉళువాయి; పర్యా. చూ. లక్కాకు. చెక్రంకుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త 1. (కో. 15; రా. 1, 3-9, 16).

**ఉలాల్లేపు** (క్రి). బండి వెల్లికిలా వెయ్యటం (తె.8).

**ఉళువాయి** చూ. ఉలవాయి (కో. 1, 2; రా. 17).

**ఎత్తుగఱ్ఱ** పర్యా. ఉప్పకారి, ముట్టుగఱ్ఱ. కందెన వెయ్యటానికి బండిచెక్రం ఊడదీసినప్పుడు ఇరుసుకింద ఎత్తు పెట్టినకఱ్ఱ (కో. 6, 19, 21-25).

**ఎత్తుపీట** (1) పర్యా. చూ. ముక్కుపీట. బండి పోలుగఱ్ఱకు కాడికట్టేవైపు అడుగునవేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 29 చ. 5 (కో. 16); (2) పర్యా. చూ. కోడిపీట. ఒకరకం రెండు నొగలబండికి దొంకిమొద్దుకింద వేసిన పట్టె (కో. 40, 47, 48).

**ఎదకట్టు** పర్యా. చూ. కుండకట్టు. బండికుండకువేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 2 (తె. 5, 6).

**ఎద్దానుదబ్బ** చూ. ఎద్దానుబద్ద (తె. 6).

**ఎద్దానుబద్ద** రూ. ఎద్దానుదబ్బ; పర్యా. చూ. ఎద్దులపట్టె. ఒకరకం నొగలబండి పరానికి ముందున్న పట్టె. చూ. చిత్రం 28 చ. 3 (తె. 7).

**ఎద్దు(ల)పట్టె** పర్యా. ఎద్దానుదబ్బ, ఎద్దానుబద్ద, ఎద్దుపీట, ఎద్దుమోపుపట్టె, కడప, పిరాదికట్టె, పిర్రకట్టె, ముడ్డిపీట, మెలుగుపీట. ఒకరకం రెండునొగలబండి పరానికి ముందున్న పట్టె. చూ. చిత్రాలు 28 క. 11, 28 చ. 3 (కో. 3, 7; రా. 12, 13, 16, 18, 20, 21, 24, 25).

**ఎద్దుపీట** పర్యా. చూ. ఎద్దులపట్టె. ఒకరకం రెండు నొగలబండి పరానికి ముందున్న పట్టె. చూ. చిత్రాలు 28 క. 11, 28 చ. 3 (తె. 9; రా. 8, 17).

**ఎద్దుమోపుపట్టె** పర్యా. చూ. ఎద్దులపట్టె. ఒకరకం నొగలబండి పరానికి ముందున్న పట్టె. చూ. చిత్రాలు 28 క. 11, 28 చ. 3 (రా. 7, 9).

**ఏగెబండి** పర్యా. చూ. అమ్మానబండి. రెండునొగల బండి (రా. 13).

**ఏటవార్నె** పర్యా. చూ. వార్నెతాడు. బండి పోలు తాడును జువ్వాయిమోకుకు అతికేతాడు (తె. 29).

**ఏడికోల** చూ. ఏరుకోల (రా. 18).

**ఏడె** ఉ. ఏడి; పర్యా. ఏడెకట్ట, ఏడెతడికె, గూడ, జేడె, జేడెకట్ట, జేడెతడక, తెట్టె, దొరికట్ట, దొరితడికె, దొరువు, నాడె, నాలికెతడిక, మోలెం, లేడె, లేడెతడికె, నేడి, నేడికట్ట. (1) బండిజల్ల తెరచిఉన్నవైపు. చూ. చిత్రం 30 క. 3; (2) ఎరువు, కంకులు తోలే బండిజల్ల తెరచిఉన్నవైపు అడ్డంపెట్టిన తడిక లేక చొప్పకట్ట(లు). చూ. చిత్రం 30 క. 3; (3) ఎక్కువ కంకులు పొయ్యటానికి బండిజల్ల అంచుల్ని నిలవేసిన చొప్పకట్ట(లు). (కో. 8, 9; రా. 11, 20, 23, 24, 26, 28); **-కట్ట**, **-తడికె** చూ. ఏడె (రా.); **-తాడు** పర్యా. జేడెతాడు, మొత్తతాడు, లేడెతాడు, నేడితాడు. బండిజల్ల తెరచిఉన్న వైపు అడ్డంకట్టే తాడు (రా.).

**ఏరుకోల** రూ. ఏడికోల; పర్యా. చూ. పోలు. బండి దొలువుకు అమర్చిన పొడుగాటి పలకలకొయ్య. చూ. చిత్రం 29 చ. 4, 29 ట. 2 (రా. 16, 17); **-మాను** చూ. ఏరుకోల (రా.).

**ఏరుకోలబండి** పర్యా. చూ. పోలుగఱ్ఱబండి. ఒంటి నొగ బండి. చూ. చిత్రాలు 29 క, చ (రా. 3, 18).

**ఒగ్గె** పర్యా. బూరెక్కట్టు. బండి దొలుపుకువేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 29 చ. 3 (కో. 13).

**ఒంగు** బండి జల్లపైన ఒంపుగావేసిన కర్ర (కో. 21, 37, 51).

**ఒట్టు** పర్యా. చూ. పూటీ. బండిచెక్రం నిర్మాణంలో వంకరకొయ్య పలక; ఒక్కొక్క చెక్రానికిటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (రా. 15).

**ఒడ్డెబండి** పర్యా. దొల్కబండి, దొగ్గుడుబండి, దొబ్బడబండి. ఆకులేని కర్రచెక్రాలబండి. చూ. చిత్రం 33 (తె. 1, 3; రా. 5, 6, 18).

**ఒల్చె** సందుపలక(ల)కు బదులు వేసే సన్నటి కర్ర(లు); చూ. సందుపలక (కో. 1).

**ఒసి** పర్యా. ఒసికర్ర, ఒసికొయ్య, కొమిరె, గడిగొయ్య, గడిగొర్రు, గడిచీల, గదిగె, గుజ్జు, గుంజ, గూటం, జనుగొయ, నాటు, నాటుకొయ్య, నాటుగూటం, సనగొయ్య, సన్నగొయ్య. బండిజల్ల పక్కకు తొలగకుండా ండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. . చిత్రాలు 28 క. 3, 4, 5, 30 క. 4 (కో. 18, , 31, 34; తె. 37, 40); -కర్ర చూ. ఒసి (కో.); ొయ్య చూ. ఒసి (కో. తె.).

**కచటం** చూ. కచ్చడం (తె. 15, 16, 19).

**కచరం** ఉ. కచ్చరం, కసరం; చూ. కచ్చడం (తె. 7, 29).

**కచలం** ఉ. కస్లం; చూ. కచ్చడం (తె. 21).

**కచ్చడ** పర్యా. చూ. గుడిసె. ప్రయాణపు బండి (గూడు బండి)మీద వేసే కప్పు. చూ. చిత్రం 32 . 1 (తె. 34).

**కచ్చడం** రూ. కచటం, కచరం, కచలం; పర్యా. చూ. గూడుబండి. పైన గూడుఉన్న ప్రయాణపు బండి. చూ. చిత్రం 32 (కో. 24; తె. 35-37, 39).

**కంజీల** పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. 51).

**కడచిల్ల** చూ. కడచీల (రా. 15).

**కడచీల** ఉ. కడజీల, కడసీల; రూ. కడచిల్ల, కడాని చీల; పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. 1, 2, 5; తె. 1, 3, 6, 17; రా. 1, 2, 4, 9).

**కడప** పర్యా. చూ. ఎద్దులపట్టె. ఒకరకం నొగలబండి పరానికి ముందున్న పట్టె. చూ. చిత్రాలు 28 క. 11, 28 చ. 3 (తె. 28, 29, 32-34).

**కడపట్టె** పర్యా. చూ. పెడదబ్బ. రెండునొగల బండి నొగల వెనకవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (రా. 25).

**కడానిచీల** చూ. కడచీల (రా. 17).

**కడుతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలు గర్రకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో.40).

**కణెం** ఉ. కణం (బహు. కణేలు) చూ. కనం (తె. 27, 29, 32, 34).

**కంతె** బండికి కందెనవేసే స్థలం (తె. 5).

**కత్తిరిగాలు** పర్యా. చూ. అనుగర్ర. మీద బరువున్న బండిని దించకుండా నిలబెట్టటానికి పోలుకర్ర కింద ఎత్తు పెట్టే కర్రలపరికరం. చూ. చిత్రాలు 28 క. 7, 31.5, 32.2 (కో. 23).

**కత్తిరిగెడ** పర్యా. చూ. అనుగర్ర. మీద బరువున్న బండిని దించకుండా నిలబెట్టటానికి పోలుగర్రకింద ఎత్తుపెట్టే కర్రల పరికరం. చూ. చిత్రాలు 31.5, 32.2 (కో. 24).

**కదురువాసం** ఉ. కదురోసం; పర్యా. చూ. గోసినొగ. కోడిపీటలబండి (ఒకరకం బండి)కి దొంకిపట్టెనుంచి కాడి వరకు ఉన్ననొగ (కో. 4).

**కనం** ఉ. కన (బహు. కనాలు); రూ. కణెం, కనెం. బండి కాడిచివర(ల) చిరత(లు) వెయ్యటానికి చేసిన బెజ్జం (కో.32; తె. 19, 21-23, 25, 28, 31, 33).

**కనెం** (1) పర్యా. చూ. పూటీ. బండిచెక్రం నిర్మాణంలో వంకర కొయ్యపలక; ఒక్కొక్క చెక్రాని కిటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (తె. 30); (2) (బహు. కనేలు); చూ. కనం (కో. 30; తె. 17, 20, 26).

**కందెన** పర్యా. తారు. బండి ఇరుసులో వేసే గడ్డి, మసి మొ. వి కలిపిన ఆముదం (కో. 16, 27, 30, 37, 40, 44, 46-49; తె. 3, 24, 40); -చీల ఉ. కందెన జీల; పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకువేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. తె).

**కమ్మి** పర్యా. చూ. పట్టా. బండిచెక్రం చుట్టూ బిగించిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 ట. 4 (కో. 3, 4, 7, 37-49, 51; తె. 18, 20, 21, 23-26, 29-33; రా. 6, 7, 9, 11, 18, 22, 28); -పట్టా చూ. కమ్మి (తె).

**కరిడీకర్ర** పర్యా. చూ. బిడిగర్ర. దింపులో వెళ్ళే బండి వేగాన్ని తగ్గించటంకోసం చెక్రాలకు ఆనేట్టు వెనక పరంకింద అమర్చిన కర్ర. చూ. చిత్రం 31.2 (కో.45).

**కరిడీతాడు** పర్యా. చూ. బిడితాడు. కరిడీకర్రకు కట్టిన తాడు; ఇది పోలుతాడువరకు ఉంటుంది. చూ. చిత్రం 31.3 (కో. 45).

**కల్లు** (బహు. కండ్లు) పర్యా. చూ. ఆకు. బండి కుండను పూటీ (వంపు)ని కలిపేకొయ్య. చూ. చిత్రం 28

ట. 2 (తె. 40).

కసైతాడు పర్యా. చూ. బిగుదాడు. బండికి చొప్ప వేసిబిగించే తాడు (తె. 8).

కాట్రబద్ద పర్యా. చూ. పెడదబ్బ. రెండునొగల బండి నొగలను వెనకవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (తె. 24).

కాడి రూ. కాణి, కాండి, కాని, కావడి; పర్యా. కాడి మాను, కాడిమాను, కావడిమాను, పూజు, పూది. బండిలాగే ఎద్దుల మెడలపై మోపే కొయ్య; పోలుకు కట్టిఉంటుంది. చూ. చిత్రాలు 29 ట. 1, 30.6 (కో. 1, 2, 4, 5, 9, 12, 18, 20, 22, 28, 33, 34, 36, 37, 39, 40; తె. 1, 2-9, 33-36, 39, 43; రా. 1-7, 9-11, 15, 18, 21, 24, 27); -కట్టుతాడు పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టేతాడు చూ. చిత్రం 29 ట. 9 (తె. రా); -తాడు పర్యా. చూ. పట్టెడ. బండికాడికి ఎద్లను కట్టేతాడు లేక తోలు పరికరం (కో.); -పలుపు పర్యా. చూ. పట్టెడ. బండికాడికి ఎద్లను కట్టేతాడు లేక తోలుపరికరం. చూ. చిత్రం 29 ట. 10 (కో. తె. రా.); -పీట పర్యా. పైపీట. బండి పోలుగర్రకు కాడికట్టే పైవైపున అతికిన పీట (కో. రా.); -మాకు చూ. కాడి (తె.); -మాను రూ. -మాకు, చూ. కావడిమాను; చూ. కాడి (కో. తె. రా).

కాడిమానుకొండి పర్యా. చూ. తమిరె. కాడిమధ్యన వేసిన చీల. చూ. చిత్రం 29 ట. 3 (రా. 2).

కాణి చూ. కాడి (తె. 10, 25-28).

కాండి చూ. కాడి (కో. 30; తె. 16-23, 31).

కాని చూ. కాడి (తె. 12-15, 24, 25, 29, 31-34, 37, 39).

కాళీబిళ్ళ పర్యా. చూ. చెక్రం (2). బండి కుండకు, సాయిమేసప మధ్యనున్న సందులో ఇరుసుకు వేసిన ఇనప బిళ్ళ. చూ. చిత్రం 28 ప. 3 (కో. 12, 13, 16, 20, 23).

కావడి చూ. కాడి (రా. 16, 17); -చిల్ల బుడ్డబండి కాడిని నొగలకు కలిపికొట్టిన మేకు. చూ చిత్రం 33.7 (రా.); -మాను చూ. కాడి (రా.).

కుక్క(లు) తొట్టిపీటకు బదులు వేసే కర్ర(లు) (కో. 23, 25).

కుక్కదొల్ల ఎరువుతోలే జల్ల. (రా. 6).

కుక్కి పర్యా. చూ. జల్ల. ఎరువు, ధాన్యం, మొ. వి తోలటానికి బండిమీద వేసే (వెదురు, ఈత) పేళ్ళతో అల్లిన గూడువంటి సాధనం. చూ. చిత్రం 30 క. 1 (రా. 4).

కుంచం పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (కో. 29, 33, 34, 37-48, 50; -కట్టు పర్యా. చూ. కుండకట్టు. బండి కుండకు కట్టిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 2 (కో.).

కుడ్దాం రూ. గుడం, గుద్దాం; పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగ(ల)కింద ఎత్తుగా పెట్టిన కొయ్యలు. చూ. చిత్రాలు 28 క. 7, 31.5, 32.2 (కో. 45).

కుంతెనమోకు పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి పోలుగర్ర కిందగా డొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రం 28 క. 6 (రా. 10, 18, 21).

కుండ పర్యా. అద్ద, కుంచం, కుంభం, తూము, బొడ్డు, బిళ్ళద్ద, బుడ్డి, ముంత. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (కో. 1-11, 13-16, 19, 23-25, 27, 28, 32, 36; తె. 1-6, 9, 18; రా. 1-9, 11, 18, 20-28); -కట్టు పర్యా. అద్దకట్టు, ఎదకట్టు, కుంచంకట్టు, కుండపట్టీ, కుంభకట్టు, తూముకట్టు, బిళ్ళద్దకట్టు, బుడ్డికట్టు, బుడ్డిబందు, బొడ్డుకట్టు, ముంతకట్టు. బండికుండకు వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 38 త. 2 (కో. తె. రా.); -పట్టీ చూ. కుండకట్టు (తె.).

కుతికేట పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (తె. 3).

కుంభం ఉ. కుంబం; పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్య నున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (రా. 15-17, 22); -కుంభకట్టు ఉ. కుంబకట్టు; పర్యా. చూ. కుండకట్టు. బండి కుండకు వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 2 (రా.).

కుయ్య ఉ. కుయ; పర్యా. చూ. లక్కాకు. చెక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 24; తె. 8, 10-12, 14, 24-29, 32-35, 37-39, 42).

కురకమ్మి చూ. కురచకమ్మి (కో. 24, 25).

కురచకమ్మి రూ. కురకమ్మి; పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (తె. 40).

కురచపట్టె రూ. కురప్పట్టె; పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (కో. 35).

కురప్పట్టె చూ. కురచపట్టె (కో. 24; తె. 35).

కువ్వ ఉ. కొవ్వ; పర్యా. చూ. లక్కాకు. చెక్రం

కుండ అరగకుండా ఉండటానికి ఇరుసునుదూర్చే రంధ్రానికి వెలివైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 25; తె. 18, 24, 25, 27).

**కుసాలపట్టె** పర్యా. చూ. దొంకిపట్టె. కోడిపీటలబండి (ఒకరకం బండి)కి ఉన్న రెండో దిండు. చూ. చిత్రం 28 చ. 4 (రా. 23).

**కూటతాడు** పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి పోలుగర్ర కిందగా దొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (కో. 8).

**కైమేకు** చూ. కైలమేకు (కో. 18).

**కైలచీల** పర్యా. చూ. కైలమేకు. బండి దొలుపుకు పోలుగర్రను బిగించి కొట్టిన మేకు (కో. 10, 17).

**కైలమేకు** రూ. కైమేకు; పర్యా. కైలచీల. బండి పరాన్ని పోలుగర్రను కలిపి కొట్టే మేకు (కో. 1, 19, 21 25; తె. 39).

**కొడెం** (1) పర్యా. చూ. పారు. బండి చట్రంలోని నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 9, 14); (2) పర్యా. చూ. పరంకొమ్ము. జంటనొగలబండి నొగ(ల) వెనకభాగం. చూ. చిత్రం 28 చ. 9 (రా. 17, 18).

**కొండపట్టె** పర్యా. మునలంపట్టె, మునలాయంపట్టె. కోడిపీటలబండి (ఒకరకం బండి)కి ఎద్దులపట్టె కింద నొగలను కలిపే కర్ర (కో. 7).

**కొంతం** బండికి వెనకవైపున వేసే ఒసికర్ర (తె. 33).

**కొమిరె** పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగ కుండా ఉండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5, 30 క. 4 (తె. 29, 32).

**కొమ్ము** పర్యా. చూ. పారు. బండి చట్రంలో నిలువు పట్టె. చూ. చిత్రం 29 చ. 6 (తె. 1-3, 5).

**కొయ్య** పర్యా. చూ. ఆకు. బండి కుండను, పూటీ (వంపు)ని కలిపే కొయ్య. చూ. చిత్రం 28 ట. 2 (కో. 50).

**కొలుప్పట్టె** పర్యా. చూ. నాలికబల్ల. కోడిపీటల బండి (ఒకరకం బండి)ని తోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోసినొగ దగ్గర వేసిన చెక్క; చూ. గోసినొగ. చూ. చిత్రం 28 క. 8 (తె. 41).

**కోడిపట్టె** పర్యా. చూ. కోడిపీట. ఒకరకం నొగల బండికి దొంకిమొద్దు కింద వేసిన పట్టె. చూ: చిత్రం 28 చ. 6 (కో. 4).

**కోడిపీట** ఉ. కోడిపిట్ట, కోడిపెట్ట; పర్యా. ఎత్తుపీట, కోడిపట్టె, గుర్రప్పీట, మండసంపీట. ఒక రకం రెండు నొగల బండికి దొంకిమొద్దుకింద వేసిన పట్టె. చూ. చిత్రం 28 చ. 6 (కో. 3, 4, 7, 10, 50; తె. 7, 8; రా. 7-11, 17, 18, 20, 24, 25).

**కోణవాటా** పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగ(ల) కింద ఎత్తుగా పెట్టిన పంగల కొయ్య. చూ. చిత్రాలు 28 క. 7, 31. 5, 32. 2 (రా. 2).

**కోపు** పర్యా. చూ. వారు. బండి చట్రంలోని నిలువు పట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 6).

**గడగు** బండి పరాన్ని దోనె (అడ్డ)కు బిగించిన చీల (తె. 4).

**గడారు** పర్యా. చూ. ఇరుసు. చూ. చిత్రాలు 29 చ. 1, 30 చ. 1 (రా. 8, 16, 20).

**గడిగొయ్య** ఉ. గడగొయ్య. గడిగొయ, గడుగొయ, గడుగొయ్య, గడుగ్గొయ్య. గడెగొయ, గడ్గొయ్య; పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5; 30 క. 4 (కో. 37–45, 47, 49; తె. 1-3, 6-8, 11, 13, 15, 16, 18, 30, 35, 36, 38).

**గడిగొర్రు** పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5; 30 క. 4 (కో. 36).

**గడిచీల** (1) పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండి చట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5; 30 క. 4 (రా. 11); (2) పర్యా. అల్లు, నెమ్ము. బండి దొలుపు కిరువైపుల బిగువుకోసం కొట్టిన మేకు (రా. 1); (3) పరానికి దోనెమొద్దును బిగించే చీల (రా. 9, 12, 18, 20, 24, 25).

**గడ్డ** ఒడ్డెబండి చెక్రం మధ్యవేసే చెక్క (తె. 4).

**గడ్డం** (1) ఉ. గెడ్డం, గెడ్డాం; పర్యా. చూ. ముక్కుపీట. పోలుగర్ర నేలకు ఆనేవైపు అడుగున వేసిన కొయ్య. చూ. చిత్రం 29 చ. 5 (కో. 11, 12, 14, 17-23); (2) బండితోలే మనిషి కూర్చోటానికి పోలుగర్రమీద వేసే బల్ల (కో. 35).

**గదిగె** పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగ కుండా ఉండటానికి బండిచట్రపు పట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5; 30 క. 4 (తె. 9).

**గాజు** పర్యా. చూ. చక్రం (2). బండి కుండకు, సాయిమేకుకు మధ్యనున్న సందులో ఇరుసుకు వేసిన ఇనప బిళ్ళ. చూ. చిత్రం 28 ప. 3 (కో. 37).

**గాడిబండి** పర్యా. చూ. పోలుగర్రబండి. ఒంటినొగ బండి. చూ. చిత్రాలు 29 క, చ (కో. 46; తె. 11, 13).

**గాడెం** బండిఇరుసు వెయ్యటానికి దొలుపుకు తొలిచిన గాడి (తె. 35, 36).

**గాత** పర్యా. చూ. చిరత. బండికి కట్టిన ఎద్దుల లోవైపున కాని, వెలుపలివైపునకాని కాడికున్న రంధ్రంలో వేసిన కొయ్యముక్క; దీనికి కాడి పలుపులు తగిలిస్తారు. చూ. చిత్రం 29 ట. 7 (తె. 4, 5, 7–9); **-కట్టె, -కొయ్య** గాత (తె.).

**గాను** ఉ. గోను; రూ. గాలు; పర్యా. చూ. చెక్రం. బండి నడవటానికి ఆకులతోఉన్న చెక్రం. చూ. చిత్రం 28 ట (కో. 8, 9, 11, 13, 18; తె. 3; రా. 9, 11, 16, 23-25, 27, 28).

**గారె** పర్యా. చూ. చెక్రం. బండి నడవటానికి ఆకులతో ఉన్న చెక్రం. చూ. చిత్రం 28 ట (తె. 17–20, 22, 29).

**గాలు** చూ. గాను (కో. 3, 4, 6, 7, 16, 19; తె. 4; రా. 6, 21, 22).

**గిడ్డబండి** పర్యా. చూ. పొట్టిబండి. చిన్నబండి (రా. 18).

**గిర్ర** ఉ. గిర, గిరె; చూ. గీర (కో. 24; తె. 2, 6, 9, 31-33, 38, 41).

**గిల్ల** చూ. గీర (తె. 1, 35, 36).

**గీర** ఉ. గీరె; రూ. గిర్ర, గిల్ల; పర్యా. చూ. చెక్రం. బండి నడవటానికి ఆకులతో ఉన్న చెక్రం. చూ. చిత్రం 28 ట (తె. 12, 14, 15, 21, 23-28, 30).

**గుజ్జు** పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3,4,5, 30 క. 4 (కో. 1-5, 7; తె. 3, 12, 19, 21-23; రా. 1, 7-12, 18, 21, 23-28); **-బొంద** ఒసికర్ర వెయ్యటానికి పారుపట్టెకు తొలిచిన బెజ్జం. చూ. చిత్రం 29 చ. 11 (కో.).

**గుజ్జులపట్టె** పర్యా. చూ. దొంకిపట్టె. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి ఉన్న రెండో దిండు. చూ. చిత్రం 28 చ. 4 (రా. 8, 24).

**గుజ్జులపీట** పర్యా. చూ. దొంకిపట్టె. కోడిపీటలబండి (ఒకరకం బండి)కి ఉన్న రెండో దిండు. చూ. చిత్రం 28 చ. 4 (రా. 7, 18, 20, 21).

**గుంజ** పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5, 30 క. 4 (తె. 3, 4, 17, 18, 20, 21, 24, 34).

**గుడం** చూ. కుద్దాం (కో. 43).

**గుడిసె** పర్యా. కచ్చడ, గూడు, సవారి(రు). ప్రయాణపు బండి (గూడుబండి) మీదవేసే కప్పు. చూ. చిత్రం 32.1 (తె. 33); **-బండి** పర్యా. చూ. గూడుబండి. పైన గూడుఉన్న ప్రయాణపు బండి. చూ. చిత్రం 32 (తె. 33).

**గుద్దాం** చూ. కుద్దాం (కో. 48).

**గుండగొయ్య** పర్యా. చూ. తొట్టికర్ర. తొట్టిఅల్లకం కోసం బండి చట్రంనుంచి తొట్టిపీటవరకు ఉన్న పొడుగాటి కర్ర(లు). చూ. చిత్రాలు 29 క. 1, 29 ట. 5 (తె. 40).

**గుండుజల్ల** ఒక రకం ఎరువుజల్ల (తె. 4, 6).

**గుదిచీల** ఉ. గుచ్చీల; పర్యా. చూ. సాయిమేకు. బండి చెక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. 37).

**గుదిమోకు** పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడి నుంచి పోలుగర్ర కిందగా దొలుపు వరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31.4 (రా. 4).

**గుర్ద** పర్యా. చూ. లక్కాకు. చెక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసునుదూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (తె. 18).

**గుర్రం** పర్యా. చూ. ముక్కుపీట. పోలుగర్రకు కాడి కట్టెవైపున పైన గాని, కింద గాని వేసే పీట. చూ. చిత్రం 29 చ. 5 (కో. 1, 30, 32; తె. 24, 30; రా. 2, 21); **-పీట** బండి పోలుగర్రకు కాడికట్టెవైపు అడుగున వేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 29 చ. 5 (రా.); **-గుర్రప్పీట** పర్యా. చూ. కోడిపీట. ఒక రకం రెండునొగల బండికి దొంకిమొద్దుకింద వేసిన పట్టె. చూ. చిత్రం 28 చ. 6 (రా.).

**గూటం** పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5, 30 క. 4 (రా. 3, 4, 16, 17, 22).

**గూడ** (1) పర్యా. చూ. ఏడె. ఎరువు, కంపలు తోలే బండిజల్ల తెరచిఉన్నవైపు అడ్డంపెట్టిన తడికె లేక చొప్ప కట్టలు. చూ. చిత్రం 30 క. 3; (2) బండిజల్ల ముందరి భాగం. చూ. చిత్రం 30 క. 2 (కో. 31; తె. 41; రా. 6).

**గూడు** పర్యా. గుడిసె. ప్రయాణపుబండిమీద వేసే కప్పు. చూ. చిత్రం 32.1 (కో. 1, 2, 29, 31, 32, 35, 36, 39, 41, 43, 44, 50; తె. 31, 41; రా. 1); **-బండి** ఉ. గూడబండి; పర్యా. కచటం, కచరం, కచ్చడం, గుడిసెబండి, చెక్కడబండి, రింగిబండి, సవారి కచలం, సవారి కచ్చడం, సవారి కచ్చరం, సవారి(రు) బండి, సోపాబండి. పైనగూడుఉన్న ప్రయాణపు బండి చూ. చిత్రం 32 (కో. తె. రా.).

**గూడక్క** ఎరువు తోలటానికి ఒడ్డెబండిమీద వేసే జల్ల చూ. చిత్రం 33.9 (తె. 11).

**గెరచెక్క** పర్యా. చూ. చిప్ప. ఒడ్డెబండి చెక్రాని కిరువైపుల అమర్చిన కొయ్యపలక(లు) (రా. 18).

**గొడిదబ్బ** పర్యా. చూ. చిరత. ఎద్దులు పూన్చిన బండి కాడిలోవైపునున్న బెజ్జంలో వేసిన కొయ్యముక్క; దీనికి కాడివలుపులు తగిలిస్తారు (రా. 18).

**గోడుపట్టె** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (కో. 36).

**గోసినగ** చూ. గోసినొగ (రా. 11, 25).

**గోసినొగ** రూ. గోసినగ; పర్యా. కదురువాసం, దూరపుకట్టె, దోపుడుకట్టె, నడిమీసు, బిర్రుకట్టె, మెండుకట్టె. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి దొంకిపట్టె నుంచి కాడివరకు ఉన్న నొగ. చూ. చిత్రాలు 28 క. 9, 28 చ. 2 (రా. 12, 18).

**చంకచెక్క** పర్యా. చూ. చిప్ప. ఒడ్డెబండిచెక్రాని కిరువైపుల అమర్చిన కొయ్యపలక (తె. 11).

**చంకతాడు** పరంలో ముందు పట్టెకు నొగలను బిగించే తాడు (కో. 16).

**చంకపట్టె** పర్యా. చూ. తొట్టికర్ర. తొట్టి అల్లకం కోసం బండి పరం (చట్రం) నుంచి తొట్టిపీటవరకు ఉన్న పొడుగాటి కర్ర. చూ. చిత్రాలు 29 క. 1, 29 ట. 5 (కో. 14, 15).

**చట్టం** చూ. చట్రం (కో. 2, 24; తె. 13, 34, 35, 37-39, 42).

**చట్రం** ఉ. సట్రాం; రూ. చట్టం; పర్యా. చూ. పరం బండి. అడ్డ లేక దొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చట్రం. చూ. చిత్రం 29 చ. (కో. 23, 26, 29, 31, 32, 35; తె. 40, 41; రా. 18).

**చిట్టె** పర్యా. చెరుగుబిళ్ళ. తోపు (బండిమీద వేసిన చొప్ప)ను సులువుగా బిగించటానికి బిగుదాడుకు వేసిన చెక్కబిళ్ళ (తె. 4).

**చిడత** చూ. చిరత (కో. 17, 18, 22, 23, 28; తె. 20, 25, 26).

**చిప్ప** (1) పర్యా. గెరచెక్క, చంకచెక్క. ఒడ్డె బండి చెక్రానికిరువైపుల అమర్చిన కొయ్యపలక(లు). చూ. చిత్రం 33.2 (తె. 4, 6, 9); (2) పర్యా. చూ. పూటీ. బండి చెక్రం నిర్మాణంలో వంకర కొయ్యపలక; ఒక్కొక్క చెక్రాని కిటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (కో. 46-51).

**చిరత** ఉ. చిర్త, సిరత, సిర్త; రూ. చిడత, చిర్ర; పర్యా. గాత, గాతకట్టె, గాతకొయ్య, గొడిదబ్బ, లోగాడిపుల్ల, లోగానిపుల్ల, లోబుల్ల. బండికి కట్టిన ఎద్దుల లోవైపున కాని, వెలుపలివైపునకాని కాడికున్న రంధ్రంలో వేసిన కొయ్యముక్క; దీనికి కాడిపులుపులు తగిలిస్తారు. చూ. చిత్రం29 ట. 7 (కో. 19-21, 24, 25, 29, 34; తె. 17, 22, 23).

**చిర్ర** చూ. చిరత (కో. 24, 25; తె. 34-37, 39, 42).

**చుట్టు** పర్యా. చూ. పూటీ. బండిచెక్రం నిర్మాణంలో వంకర కొయ్యపలక; ఒక్కొక్క చెక్రాని కిటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (కో. 3, 30; తె. 12, 20-29, 31-34; రా. 7-9).

**చెకడాబండి** ఉ. చెకొడాబండి, చెక్కడబండి, చెక్కబండి, సెకటాబండి, సెక్కడబండి. సెక్డాబండి, సెగడాబండి, సొగటాబండి. (1) పర్యా. చూ. గూడుబండి. పైన గూడుఉన్న ప్రయాణపుబండి. చూ. చిత్రం 32; (2) పర్యా, చూ. పరంబండి. పైన పరంఉన్న బండి; చూ. పరం; (3) పర్యా. చూ. అద్దూనబండి. రెండు నొగలబండి (కో. 3, 8, 9, 11, 13, 18; తె. 1-6, 10, 14, 17-19, 21, 22; రా. 12, 24).

**చెక్కపరుపు** అద్దూనబండి మీద పరిచే చెక్కలు (తె. 32-34).

**చెక్కి** ఉ. సక్కి, సెక్కి; పర్యా. చూ. చెక్రం (2). బండి కుండకు సాయిమేకుకు ఉన్న సందులో ఇరుసుకువేసిన ఇనపబిళ్ళ. చూ. చిత్రం 28 ప. 3 (కో. 21, 39, 41-45).

**చెక్రం** (1) పర్యా. ఉండ, గాను, గారె, గాలు, గిర్ర, గిల్ల, గీర, పయ్యె, రోజా, రోదా. బండి నడవటానికి ఆకులతో ఉన్న చెక్రం. చూ. చిత్రం 28 ట (కో. 1, 5, 10, 12, 14-21, 23, 26-29, 31-36; రా. 1-10, 12, 14-18, 20); (2) పర్యా. కాశీబిళ్ళ, గాజు, చెక్కి, డక్కాబిళ్ళ, సాయిబిళ్ళ. బండికుండకు, సాయిమేకుకు మధ్యనున్న సందులో ఇరుసుకు వేసిన ఇనపబిళ్ళ. చూ. చిత్రం 28 ప. 3 (కో. 22, 24, 25, 27; తె. 13, 19-22, 24-29, 32, 33, 37, 42).

**చెరుగుబిళ్ళ** పర్యా. చూ. చిట్టె. తోపు (బండిమీద వేసిన చొప్ప)ను సులువుగా బిగించటానికి బిగుదాడుకు వేసిన చెక్కబిళ్ళ (కో. 12).

**చెవులేట** పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడి నుంచి పోలుగర్ర కిందగా దొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (తె. 3).

**జంజెపుకాడి** రూ. జంజెరకాడి; పర్యా. తలారిగాడి, తలేరుగాణి, తల్లేరుకాడి. ఒక జత ఎద్దులు బండిని లాగలేనప్పుడు రెండోజత ఎద్దులతో కట్టే కాడి (కో. 17, 20-23).

జంజెరకాడి చూ. జంజెపుకాడి (కో. 24).

జనుగొయ్య చూ. పనగొయ్య (రా. 14).

జల్ల ఉ. జల్లె; రూ. జొల్ల, డొల్ల, దొల్ల; పర్యా. కుక్క, పనక, పొణక, పొనక, పొనికె, మక్కిరి, మక్కెర, మంకిరి. ఎరువు, ధాన్యం మొ. వి తోలటానికి బండిమీద వేసే (వెదురు, ఈత) పేళ్ళతో అల్లిన గూడు వంటి సాధనం. చూ. చిత్రం 30 క. 1 (కో. 1, 2, 5, 8-12, 14-20, 23-25, 28, 29, 31; తె. 1, 4, 6, 21, 35-37, 39-41; రా. 1, 2, 10-12, 16, 22, 24, 25, 27).

జులాయి పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడి నుంచి పోలుగర్ర కిందగా డొలుపు వరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (కో. 11, 18-20); -తాడు, -మోకు చూ. జులాయి (కో.).

జుల్మాయితాడు ఉ. జులుమాయితాడు; పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి పోలుగర్ర కిందగా డొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రం 28 క. 6 (తె. 36).

జువాయితాడు పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి పోలుగర్ర కిందగా డొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (తె. 11, 42).

జువ్వాయికర్ర పర్యా. చూ. తొట్టికర్ర. తొట్టి అల్లకం కోసం బండి చట్రంనుంచి తొట్టిపీటవరకు ఉన్న పొడుగాటి కర్ర చూ. చిత్రాలు 29 క. 1, 29 ట. 5 (కో. 34).

జువ్వాయిమోకు ఉ. జువాయిమోకు; పర్యా. కుంటెన మోకు, కూటతాడు, గుదిమోకు, చెవులేట, జులాయి, జులాయితాడు, జులాయిమోకు, జుల్మాయితాడు, జువాయి తాడు, డురాయిమోకు, దోనిమోకు, పనకంమోకు, పందకం, పన్నకం, పన్నకం మోకు, పంబకంతాడు, పూట, పూటతాడు, పూటమోకు, సిపాయిమోకు. బండికాడినుంచి పోలుగర్ర (నొగల) కిందగా డొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (కో. 17, 21-25; తె. 39).

జేడె పర్యా. చూ. ఏడె. (1) బండిజల్ల తెరచిఉన్న వైపు; (2) ఎరువు, కంకులు తోలేబండి జల్ల తెరచిఉన్న వైపు అడ్డం పెట్టిన తడిక లేక చొప్పకట్టలు. చూ. చిత్రం 30 క. 3; (3) ఎక్కువ కంకులు పొయ్యటానికి బండి జల్ల అంచుల్ని నిలవేసిన చొప్పకట్టలు (రా. 18); -కట్టు చూ. జేడె (రా.); -తడక చూ. జేడె (రా.); -తాడు పర్యా. చూ. ఏడెతాడు. బండిజల్ల తెరచి ఉన్నవైపు అడ్డం కట్టేతాడు (రా.).

జొత్తె రూ. జోత, దొత్తె; పర్యా. చూ. పట్టెడ. బండి కాడికి ఎడ్లనుకట్టే తాడు లేక తోలు పరికరం. చూ. చిత్రం 30 క. 7 (తె. 1, 4, 5).

జొల్ల చూ. జల్ల (కో. 6, 7).

జోత చూ. జొత్తె (తె. 8-9, 34).

డక్కాబిళ్ళ పర్యా. చూ. చెక్రం (2). బండికుండకు, సాయిమేకుకు మధ్యనున్న సందులో ఇరుసుకు వేసిన ఇనప బిళ్ళ. చూ. చిత్రం 28 ప. 3 (రా. 6).

డొంకిపట్టె పర్యా. కుసాలపట్టె, గుజ్జులపట్టె, గుజ్జుల పీట. డొంకిపీట, డొల్లపట్టె, నడింపట్టె. (1) రెండు నొగల (ఒకరకం బండి)కి ఉన్న రెండో దిండు; దీనికి నొగలు వేస్తారు; (2) కోడిపీటల బండికిఉన్న రెండోదిండు (కో. 7; రా. 11, 25).

డొంకిపీట పర్యా. చూ. డొంకిపట్టె. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి ఉన్న రెండోదిండు. చూ. చిత్రం 28 చ. 4 (రా. 10, 12, 18).

డొంకిమొద్దు పర్యా. చూ. దుంప. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి ఉన్న రెండో అడ్డమొద్దు (కో. 3).

డొలుపు ఉ. డొల్పు; రూ. దొలుపు; పర్యా. అడ్డ, అడ్డపట్టె, దోని, దిండు, దిండుమాను, దూలగనెం, దోని, దోనికర్ర, దోనిగ, దోనిగమొద్దు, దోనిమొద్దు, దోనుకర్ర, దోనె, దోనెమొద్దు, దోన్గ, పరపుదోనె, మండిగం, మండిగం బల్ల, మండిగంమొద్దు, మనికట్టుదిండు, మనికితం, మనిగం, మనిగంమొద్దు, మలకట్టెదిండు, మైకట్టుదిండు. బండి ఇరుసు మీదవేసే అడ్డమొద్దు; దీనిమీదే పరంఉంటుంది. చూ. చిత్రాలు 28 చ. 5, 29 చ. 2, 30 చ. 2 (కో. 6, 8-32, 34-36, 38; తె. 24, 29-42; రా. 26); -చీల పర్యా. దిండుమానుచీల, నెరిమెచీల, బొడ్డుచిల్ల, బొడ్డు చీల, మండాపచీల, మనిగెంచీల. బండి డొలుపును పోలు గర్రకు కలిపే మేకు. చూ. చిత్రం 29 చ. 8 (కో. 11, 16, 18-20, 26, 27, 29, 35).

డొల్కబండి పర్యా. చూ. ఒడ్డెబండి. ఆకుల్లేని కర్ర చెక్రాల బండి (తె. 11).

డొల్ల చూ. జల్ల (రా. 7, 23).

డొల్లపట్టె పర్యా. చూ. డొంకిపట్టె. కొడిపీటల బండి (ఒక రకం బండి)కి ఉన్న రెండో దిండు. చూ చిత్రం 28 చ. 4 (రా. 26).

డోని చూ. దోనె (తె. 22).

తగిరె చూ. తమిరె (తె. 4, 6, 33; రా. 11, 18, 24, 25).

తంజీల బండి ఇరుసును మండిగానికి రెండు వైపుల బిగించి పట్టే మేకు(లు) (తె. 19-28, 30).

తట్టు పర్యా. చూ. పరం. బండి అడ్డ లేక డొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చట్రం. చూ. చిత్రం 29 చ (కో. 39); -కర్ర పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరం లోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (కో.).

**తడికె** ఉ. తడిక; పర్యా. చూ. పరం. బండి అడ్డ లేక దౌలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చట్రం. చూ. చిత్రాలు 28 చ, 29 చ, 30 చ (కో. 18-23, 25); **-చీల** బండి పరాన్ని పోలుగర్రకి కలిపే మేకు (కో.).

**తన్నుగర్ర** ఉ. తన్నెగర్ర; పర్యా. చూ. అనుగర్ర; బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగ(ల)కింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం. చూ. చిత్రాలు 31. 5, 32. 2 (కో. 39, 41, 43, 45).

**తన్నుచీల** ఉ. తన్నుజీల. బండి నొగలకింద పీటలు బిగించే చీల(లు) (తె. 12, 32).

**తమిరె** ఉ. తమెర; రూ. తగిరె, తరిమి; పర్యా. కాడిమానుకొండి, పనకంకొండి. బండి కాడిమధ్యన వేసిన ఇనపచీల. చూ. చిత్రం 29 ట. 3 (కో. 19, 24; తె. 31, 34; రా. 9, 27).

**తరంగట్టు** (క్రి.) పర్యా. చూ. పారుగట్టు. బండిని ఒక ఎద్దు బాగా లాగలేనప్పుడు ముందుబోయే ఎద్దువైపు కాడిని వెనక్కిలాగి పరానికి కట్టటం (కో. 21, 23).

**తరిమి** చూ. తమిరె (కో. 22).

**తలారిగాడి** చూ. తల్లేరుకాడి (కో. 18).

**తలేరుగాణి** చూ. తల్లేరుకాడి (కో. 25).

**తల్లేరుకాడి** రూ. తలారిగాడి, తలేరుగాణి; పర్యా. చూ. జంజెపుకాడి. ఒక జత ఎద్దులు బండిని లాగలేనప్పుడు రెండోజత ఎద్దులతో కట్టేకాడి (కో. 10, 11, 23, 24).

**తారు** పర్యా. చూ. కందెన. బండి ఇరుసులో వేసే గడ్డి, మసి, మొ.వి కలిపిన ఆముదం (కో. 11, 19, 21-25; తె. 13, 26).

**తీగతాడు** పర్యా. చూ. పురిబిసి. ఒనికర్రలపై వేసిన సర్నాలను పారుపట్టెకు కట్టేతాడు (కో. 12).

**తీడవ** పర్యా. చూ. పెడదబ్బ. రెండు నొగలబండి నొగలను వెనకవైపున బంధించిన కర్ర (తె. 8).

**తీతాడు** చూ. తీపుతాడు (తె. 12).

**తీపుతాడు** రూ. తీతాడు; పర్యా. చూ. బిగుదాడు. బండికి చొప్పవేసి బిగించేతాడు (తె. 33, 38).

**తీసికట్టుతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో. 47).

**తూము** పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (కో. 47, 51); **-కట్టు** పర్యా. చూ. కుండకట్టు. బండి కుండకు కట్టిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 2 (కో.).

**తెట్టె** పర్యా. చూ. ఏడె. ఏరువు, కంకులు తోలే బండి జల్ల తెరచి ఉన్నవైపు అడ్డంపెట్టిన తడిక లేక చొప్ప కట్టలు. చూ. చిత్రం 30 క. 3 (రా. 15).

**తేలు** బండి పోలుగర్ర వెనకకొట్టిన వంకరమేకు; చొప్పతోలేటప్పుడు బిగించిన తాడు దీనికి కడతారు. చూ. చిత్రం 29 చ. 9 (తె. 5).

**తొగజల్ల** ఒకరకం బండిజల్ల (తె. 6).

**తొట్టి** ఉ. తొట్టె; పర్యా. పలకట్టు, మంచం, మొత్తా. బండితోలేమనిషి కూర్చోటానికి వీలుగా పరం (చట్రం) నుంచి కాడివరకున్న తావు, అల్లాదం. చూ. చిత్రం 29 ట (కో. 4-6, 11-14, 16-29, 32, 35-38; తె. 5, 11-13, 27, 34-37, 39-42); **-కట్టె** చూ. -కర్ర (కో.); **-కర్ర** ఉ. -గర్ర; పర్యా. చంపపట్టె, కట్టె, -గడ, -గూటం, -గెరకట్టె, -బదితె, -బారు. తొట్టిఅల్లకం కోసం బండిచట్రంనుంచి తొట్టిపీటవరకు ఉన్న పొడుగాటి కర్ర(లు). చూ. చిత్రాలు 29 క. 1, 29 ట. 5 (కో. తె.); **-కొస** చూ. తొట్టితాడు. తొట్టికి అల్లిన తాడు; చూ. తొట్టి (తె.); **-గడ** ఉ. -గెడ. చూ. -కర్ర (కో. తె.); **-గుర్రం** చూ. పీట- (కో.); **-గూటం, -గెరకట్టె** చూ. -కర్ర (తె.); **-గొలుసుతాడు** చూ. తొట్టితాడు (తె.); **-తాడు** పర్యా. తొట్టికొస, తొట్టిగొలుసుతాడు. తొట్టికి అల్లినతాడు. చూ. చిత్రాలు 29 క. 3, 29 ట. 6 (తె.); **-పీట** పర్యా. -గుర్రం, -బిళ్ళ, -బొంత, బండుపీట, లంకెపీట, సిపాయి పీట. తొట్టికర్రలు దూర్చే కొయ్య (లేక ఇనప) పీట; ఇది కాడివైపు నుంటుంది. చూ. చిత్రాలు 29 క. 2, 29 ట. 4 (కో. తె.); **-బడితె** చూ. -కర్ర (తె.); **-బారు** చూ. -కర్ర (కో.); **-బిళ్ళ, -బొంత** చూ. -పీట (కో.).

**తొడతాడు** రెండు నొగలబండి నొగలను పరం ముందు భాగం కలిపికట్టేతాడు. చూ. చిత్రాలు 30 క. 5, 30 చ. 4 (కో. 8, 13).

**తొడప** పర్యా. చూ. అక్కాపు. చక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసునుదూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 37, 38, 45, 51).

**తొడుకు** పర్యా. చూ. అక్కాపు. చక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 44).

**తొకచెరుగు** తోపు (బండిముందువేసిన చొప్ప) మొ. బిగించే మోకు (కో. 12).

**తొకబండి** పర్యా. చూ. ఆష్టానబండి. రెండు నొగల బండి (రా. 14).

**దబ్బ** పర్యా. చూ. అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (కో. 4; తె. 2, 3, 6).

**దిగుగరతాడు** పర్యా. చూ. విడితాడు. దిగుడుకర్రకు

కట్టినతాడు; ఇది పోలుగర్ర వరకు ఉంటుంది. చూ. చిత్రం 31.3 (కో. 43).

దిగుడుకర్ర పర్యా. చూ. బిడిగర్ర. దింపులో వెళ్ళే బండివేగాన్ని తగ్గించటంకోసం చెక్రాలకు ఆనేటట్టు వెనక పరంకింద అమర్చిన కర్ర. చూ. చిత్రం 31. 2 (కో. 43, 47).

దిండు పర్యా. చూ. డొలుపు. బండి ఇరుసుమీదవేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రాలు 28 చ. 5, 29 చ. 2 (కో. 1; రా. 1); -మాను చూ. దిండు (రా.).

దిండుమానుచీల పర్యా. చూ. డొలుపుచీల. బండి డొలుపును పోలుగర్రకు కలిపే మేకు. చూ. చిత్రం 29 చ. 8 (కో. 1; రా. 1).

దిద్దు చూ. దిద్దె (తె. 9).

దిద్దె రూ. దిద్దు; పర్యా. చూ. లక్కాకు. చెక్రంకుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (తె. 1, 2, 6, 7).

దిబ్బె పర్యా. చూ. లక్కాకు. చెక్రం కుండ అరగకుండా ఉంచటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (తె. 36).

దుంప పర్యా. దొంకిమొద్దు. కోడిపీటల బండి (ఒక రకం బండి)కి ఉన్న రెండో అడ్డమొద్దు (కో. 4).

దురాయిమోకు పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడి నుంచి పోలుగర్ర కిందుగా డొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (కో. 12, 16).

దూపతాడు పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (తె. 25).

దూపుకట్టె పర్యా. చూ. గోసినొగ. కోడిపీటల బండి (ఒక రకం బండి)కి దొంకిపట్టెనుంచి కాడివరకు ఉన్న నొగ (కో. 7).

దూలకస రెండు నొగలబండికి నొగలను కలిపికొట్టిన చీల (తె. 24).

దూలగనెం పర్యా. చూ. డొలుపు. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రం 30 చ. 2 (తె. 30).

దూలచీల బండి నొగలకు కాడి తగిలించటానికి కొట్టిన మేకు (తె. 29).

దొగ్గుడుబండి పర్యా. చూ. ఒడ్డెబండి. ఆకుల్లేని కర్ర చెక్రాల బండి చూ. చిత్రం 33 (తె. 1, 2).

దొంగచీల పర్యా. చూ. నక్కచీల. ఆద్మానబండి పరాన్ని దోనెమొద్దుకు బిగించే చీల (తె. 8).

దొంగతాడు పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (తె.33).

దొత్తె ఉ. దుత్త; చూ. జోతికె (తె. 25–29).

దొబ్బడబండి పర్యా. చూ. ఒడ్డెబండి. ఆకుల్లేని కర్ర చెక్రాలబండి. చూ. చిత్రం 33 (4, తె. 6).

దొరికట్ట పర్యా. చూ. ఏడె. ఎరువు, కంకులు తోలే బండి జల్ల తెరచిఉన్నవైపు అడ్డంపెట్టిన తడిక లేక చొప్పకట్టలు. చూ. చిత్రం 30 క. 3 (రా. 28).

దొరితడికె పర్యా. చూ. ఏడె. ఎరువు, కంకులుతోలే బండి జల్ల తెరచి ఉన్నవైపు అడ్డంపెట్టిన తడిక లేక చొప్పకట్టలు. చూ. చిత్రం 30 క. 3 (రా. 28).

దొరువు పర్యా. చూ. ఏడె. ఎరువు, కంకులు తోలే బండి జల్ల తెరచిఉన్నవైపు అడ్డంపెట్టిన తడిక లేక చొప్పకట్టలు. చూ. చిత్రం 30 క. 3 (రా. 27).

దోలుపు ఉ. దొల్పు; చూ. డొలుపు (కో. 37; తె. 28; రా. 27).

దొల్ల చూ. జల్ల (కో. 3; రా. 6, 8, 9).

దోని చూ. దోనె (కో. 3, 9, 40–43; తె. 11, 25, 27; రా. 7-12, 16-18, 20, 21, 23-25); -కర్ర చూ. దోనె (తె.); -మొద్దు చూ. దోని (తె. రా.).

దోనిగ రూ. దోనుగు, దోన్గ; పర్యా చూ. డొలుపు. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రాలు 29 చ. 2, 30 చ. 2(తె. 12); -మొద్దు చూ. దోనిగ (తె.).

దోనిమోకు పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి నొగల కిందగా డొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (రా. 25).

దోను చూ. దోనె (తె. 10, 14); -కర్ర ఉ. దోనుగర; చూ. దోనె (తె.).

దోనుగు చూ. దోనిగ (తె. 26).

దోనె రూ. దోని, దోని, దోను; పర్యా. చూ. డొలుపు. బండి ఇరుసుమీదవేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రం 29 చ. 2 (కో. 4, 5, 7, 41, 45, 49); -మొద్దు చూ. దోనె (కో.).

దోన్గ చూ. దోనిగ (తె. 5, 7-9).

దోన్నగబండి (<దోనె+నగ+బండి) రెండు అడ్డలున్న రెండు నొగల బండి (కో. 4).

దోపుడుకట్టె పర్యా. చూ. గోసినొగ. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి దొంకిపట్టెనుంచి కాడివరకు ఉన్ననొగ. చూ. చిత్రాలు 28 క. 9, 28 చ. 2 (రా. 7).

నక్క(లు) పర్యా. చూ. అంపసన్నకట్టె(లు). బండి డొలుపుకింద నొగ(ల)ను బిగించిన కర్ర(లు). చూ. చిత్రం

28 చ. 10 (తె. 29).

**నక్కకట్టె** పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగ(ల) కింద ఎత్తుగాపెట్టిన కొయ్య. చూ. చిత్రాలు 31. 5, 32. 2 (తె. 10).

**నక్కగూటం** పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగ(ల) కింద ఎత్తుగాపెట్టిన కొయ్యల పరికరం. చూ. చిత్రాలు 28 క. 7, 31. 5, 32. 2 (రా. 24, 25).

**నక్కచీల** పర్యా. దొంగచీల. ఆడ్మానబండి పరాన్ని దోని మొద్దుకు బిగించే చీల (తె. 33, 34).

**నగ** చూ. నొగ (కో. 1-5, 7-10, 13, 14, 32; తె. 3, 31; రా. 8-11, 14, 15, 18, 20-22, 24, 25, 27, 28); **-చీల** చూ. నొగచీల (కో.); **-మాను** చూ. నొగ (రా.).

**నడిచీల** బండి దొలుపుకింద కొట్టినమేకు. చూ. చిత్రం 29 చ. 8 (కో. 4).

**నడిమీసు** పర్యా. చూ. (<నడిమి + ఈసు) గోసి నొగ. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి దొంకిపట్టెనుంచి కాడివరకుఉన్న నొగ (రా. 17).

**నడింపట్టె** పర్యా. చూ. దొంకిపట్టె. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి ఉన్న రెండోదిండు. చూ. చిత్రం 28 చ. 4 (రా. 25).

**నడుపుగొయ్య** పర్యా. చూ. మానికంకొయ్య. బండి పరం జారకుండా ఇరుసుమీద అడ్డంపెట్టిన కొయ్య (కో. 37).

**నాటు** (బహు. నాట్లు) పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువు పట్టెలకు బిగించిన కర్ర. చూ. చిత్రాలు 28 క. 3, 4, 5, 30 క. 4 (కో. 7, 9-12, 14, 24; తె. 41; రా. 10, 12, 17, 18, 21-28); **-కొయ్య** చూ. నాటు (తె.); **-గూటం** చూ. నాటు (రా.).

**నాడె** పర్యా. చూ. ఏడె. బండిజల్ల తెరచిఉన్నవైపు (కో. 6).

**నాలికబద్ద** ఉ. నాల్కెబద్ద; పర్యా. చూ. నాలికబల్ల. కోడిపీటల బండి (ఒకరకం బండి)ని తోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోసినొగదగ్గర వేసిన చెక్క; చూ. గోసి నొగ (తె. 24, 33).

**నాలికబల్ల** ఉ. నేల్కబల్ల; పర్యా. కొలువుపట్టె, నాలికబద్ద, పెండబల్ల. మోటబల్ల, కోడిపీటల బండి (ఒక రకం బండి)ని తోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోసినొగ దగ్గర వేసిన చెక్క; చూ. గోసినొగ. చూ. చిత్రం 28 క. 8 తె. 18, 29, 32).

**నాలికెతడిక** పర్యా. చూ. ఏడె. ఎరువు, కంకులుతోలే బండిజల్ల తెరచిఉన్నవైపున అడ్డంపెట్టిన తడిక లేక చాప్పకట్టలు. చూ. చిత్రం 30 క. 3 (కో. 10, 12, 15).

**నిడిపట్టె** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువు పట్టె. చూ. చిత్రం 29 చ. 6 (తె. 38, 42; రా. 18, 25, 26).

**నిడిబద్ద** పర్యా. చూ. పారు. బండి చట్రంలో నిలువు పట్టె. చూ. చిత్రం 29 చ. 6 (తె. 3).

**నిలువుగమ్మి** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 20-23, 35; తె. 39).

**నిలువుపట్టె** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువు పట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 16, 24).

**నెమ్మి(లు)** (1) బండి పరంలోని అడ్డపట్టెలమధ్య వేసే ఇనపబద్దె(లు). చూ. చిత్రం 29 చ. 10 (కో. 1, 6; రా. 1); (2) పరం అమర్చటానికి దొలుపుమీద కొట్టిన మేకు(లు) (కో. 10, 11); (3) జంటనొగల బండి నొగ(ల)కు దొలుపుకు బిగించే మేకు(లు) (తె. 7); (4) పర్యా. చూ. గడిచీల. బండి దొలుపు కిరువైపుల బిగింపు కోసం కొట్టిన మేకు(లు). చూ. చిత్రం 28 చ. 7 (రా. 22).

**నెరిమెచీల** పర్యా. చూ. దొలుపుచీల. బండి దొలుపును పోలుగర్రకు కలిపే మేకు. చూ. చిత్రం 29 చ. 8 (రా. 26, 27).

**నొగ** రూ. నగ; పర్యా. చూ. పోలు. (1) ఒంటినొగ బండికి దొలుపుకు అమర్చిన పొడుగాటి కొయ్య; (2) పర్యా. చూ. ఈసు. రెండు నొగలబండి దొలుపుమీద చెక్రానికి (లకు) దగ్గరగా దొలుపునకు అడ్డంగా బిగించిన గుర్రప్పీట(ల)మీద వేసిన పొడుగాటి కొయ్య(లు); దీని పొడుగు 12′ దాకా ఉంటుంది. చూ. చిత్రాలు 28 చ. 1, 31. 1 (కో. 27, 30; తె. 1, 4, 10-8, 12-29, 31-34, 38, 41; రా. 1-7, 18;) **-చీల(లు)** రూ. నగచీల. పోలుగర్రకు దొలుపుకు బిగించే చోటగాని, చివరల గాని కొట్టిన మేకు(లు) (తె. రా.); **-తాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టే తాడు (రా.). **-మాను** చూ. నొగ (రా.).

**పక్కతాడు** పర్యా. చూ. పురిబిసి. ఒసికర్రలపై వేసిన సర్నాలను పారుపట్టెకు కట్టే తాడు (తె. 29, 31-33, రా. 11).

**పగ్గం** ఎద్దుల ముగుదాళ్ళకు గాని, కొమ్ముల మొదళ్ళకు గాని కట్టి బండితోలే మనిషి పట్టుకొనే తాడు; ఇది బండిని మలుపుకోటానికి, కావలసినప్పుడు ఆపటానికి అవసరం (తె. 2, 25, 26).

**పట్టా** రూ. పట్టీ; పర్యా. కమ్మి, కమ్మిపట్టా, బండి

కట్టు. బండిచెక్రం చుట్టూ బిగించిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 ట. 4 (కో. 2, 5, 8-24, 26, 29, 31-36; తె. 2, 6, 9, 10, 13-15, 35-37, 40-42).

**పట్టీ** చూ. పట్టా (తె. 5, 7, 8).

**పట్టెగట్టు** (క్రి.) పర్యా. చూ. పారుగట్టు. బండిని ఒక ఎద్దు బాగా లాగలేనప్పుడు ముందుబోయే ఎద్దు వైపు కాడిని వెనక్కిలాగి పరానికి కట్టటం (కో. 25).

**పట్టెచీల** పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. 32).

**పట్టెడ** పర్యా. కాడితాడు, కాడిపలుపు, జోతికె, జోత, దొత్తె, బేరడ, సర్లపలుపు. బండి కాడికి ఎడ్లను కట్టేతాడు లేక తోలు పరికరం. చూ. చిత్రం 30 క. 7 (రా. 18, 27).

**పనక** చూ. పొణక (రా. 18, 21).

**పనకంకొండి** పర్యా. చూ. తమిరె. కాడిమధ్యన చీల. చూ. చిత్రం 29 ట. 3 (రా. 10).

**పనకంచిల్ల(లు)** పర్యా. పూటచిల్ల. జువ్వాయి మేకుపు తగిలించే కర్ర(లు) (రా. 28).

**పనకమ్మోకు** చూ. పన్నకమ్మోకు (కో. 12; రా. 7, 9, 18, 27, 28).

**పందకం** చూ. పన్నకం (కో. 3, 10).

**పన్నకం** రూ. పందకం; పర్యా. చూ. జువ్వాయి మోకు. బండి కాడినుంచి పోలుగర్ర (లేక నాగల) కిందగా దొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (కో. 5-7, 11, 13, 14, 36; రా. 7, 27); **-మోకు** రూ. పనకమ్మోకు; చూ. పన్నకం (కో.).

**పంబకంతాడు** పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి పోలుగర్ర కిందగా దొలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (రా. 14).

**పయ్యె** ఉ. పయె, పయ్య (<హిం. పహియా = చెక్రం) పర్యా. చూ. చెక్రం (1). బండి నడవటానికి ఆకులతోఉన్న చెక్రం. చూ. చిత్రం 28 ట (తె. 5, 7-11, 13, 34).

**పరపుకొమ్మి** రూ. పరంకొమ్మి; పర్యా. చూ. పారు. బండి చట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 8, 10-12, 15).

**పరపుదోనె** పర్యా. చూ. దొలుపు. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రం 29 చ. 2 (కో. 4).

**పరప్పట్టె** రూ. పరంపట్టె; పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 9 చ. 7 (కో. 4, 6, 8-11, 14, 27, 28).

**పరం** రూ. పర్రాం; పర్యా. చట్టం, చట్రం, తట్ట, తడికె, పలగడ, మంచం, సాటవ, సాటా. బండి అడ్డ లేక దొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చదరం (కో. 1, 2, 4-18, 27, 28, 42; తె. 1, 24, 28, 36; రా. 1, 52, 18, 7-12, 20-28); **-కొమ్మి** పర్యా. కొడెం. జంట నొగలబండి నొగ(ల) వెనకభాగం (రా.); **-పట్టె** చూ. పరప్పట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (తె. రా.); **-బదె** పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒనికర్రలపై పొడుగ్గా వేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (రా.); **-బండి** పర్యా. పలగడబండి. అడ్డమీద పరంఉన్న బండి (రా.).

**పరిగట్టు** చూ. పారుగట్టు (కో. 17).

**పరింగట్టు** చూ. పారుగట్టు (కో. 22).

**పరుపుకమ్మి** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం (కో. 13, 24).

**పర్రాం** చూ. పరం (కో. 37, 38, 40, 41, 43, 45-50).

**పలకట్టు** పర్యా. చూ. తొట్టి. బండితోలే మనిషి కూర్చోటానికి వీలుగా పరం (చట్రం) నుంచి కాడివరకున్న తాడుఅల్లకం. చూ. చిత్రం 29 ట (కో. 40).

**పలకట్టుతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో. 38, 41, 42).

**పలగడ** పర్యా. చూ. పరం. బండి అడ్డ లేక దొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చదరం. చూ. చిత్రం 29 చ (తె. 1-3, 6, 7; రా. 6, 15, 18, 21, 22); **-కొమ్మి** ఉ. -గొమ్మి; పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (రా.); **-బండి** పర్యా. చూ. పరంబండి. అడ్డమీద పరంఉన్న బండి; చూ. పరం (తె. రా.).

**పాక** పర్యా. చూ. అడ్డపట్టె. బండిపరం (చట్రం)లోని అడ్డపట్టె (కో. 48, 50, 51).

**పాకబద్ద** పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒనికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (తె. 32, 33).

**పాట్రబద్ద** పర్యా. చూ. పోలు. బండి దొలుపుకు అమర్చిన పొడుగాటి పలకల కొయ్య. చూ. చిత్రం 29 చ. 4 (తె. 30).

**పాదు** పర్యా. చూ. లక్కాకు. చెక్రం ఊడ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 33, 39-41, 43).

**పారు** పర్యా. అడిగంపట్టె, అడిగె, కొడెం, కొమ్మి, కోపు, నిడిపట్టె, నిడిబద్ద, నిలువుగమ్మి, నిలువుపట్టె,

పసుపుకొమ్ము, పసుపుకమ్మి, పలగడకొమ్ము, పారుపట్టె, పారుబద్ద, బారుకమ్మి, బారుపట్టె, మంకెనకొమ్ము, సాటకొమ్ము. బండి చట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 1.2; తె. 11, 13-15, 32-34; రా. 1-3, 5, 6); **-పట్టె** చూ. పారు. (కో. రా.); **-బద్ద** చూ. పారు (తె.).

**పారుగట్టు** (క్రి.) రూ. పరిగట్టు, పరింగట్టు; పర్యా. అసుసుగట్టు, తరంగట్టు, పట్టెగట్టు. బండిని ఒక ఎద్దు బాగా లాగలేనప్పుడు ముందుబోయే ఎద్దువైపు కాడిని వెనక్కిలాగి పరానికి కట్టటం (కో. 16, 18, 21).

**పాస్త** పర్యా. చూ. పెడదబ్బ. రెండునాగలబండి నాగలను వెనకవైపున బంధించిన కర్ర (తె. 25).

**పిట్టమేకు** పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకువేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. 50).

**పిడారి** రూ. పిరాది; పర్యా. చూ. పెడదబ్బ. రెండునాగలబండి నాగలను వెనకవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (తె. 33).

**పిడారుబద్ద** చూ. పిరాటుబద్ద (తె. 17).

**పిడిజీల** పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకువేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (రా. 24, 25).

**పిరాటుదబ్బ** పర్యా. చూ. పెడదబ్బ. రెండు నాగల బండి నాగలను వెనకవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (తె. 7).

**పిరాటుబద్ద** రూ. పిడారుబద్ద, పిరిటిబద్ద; పర్యా. చూ. పర్నం. పంగలగా ఉన్న ఒసికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (తె. 15, 27, 28).

**పిరాడకట్టె** పర్యా. చూ. పెడదబ్బ. రెండునాగల బండి నాగలను వెనకవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (తె. 29).

**పిరాది** చూ. పిడారి (తె. 13).

**పిరాదికట్టె** పర్యా. చూ. ఎద్దులపట్టె. ఒక రకం నాగల బండి పరానికి ముందున్న పట్టె (తె. 14).

**పిరిటిబద్ద** చూ. పిరాటుబద్ద (తె. 5).

**పిర్రకట్టె** ఉ. పిర్రకట్టె; పర్యా. చూ. ఎద్దులపట్టె. ఒకరకం రెండునాగలబండి పరానికి ముందున్న పట్టె (తె. 5, 10).

**పిల్లపట్టె** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (రా. 14).

**పిల్లపారు** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (రా. 5, 6).

**పీట** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరంలోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (తె. 34).

**పుచ్చెకట్టుతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో. 21).

**పురిబిసి** (బహు. పురిబిసులు) పర్యా. అల్లకంతాడు. ఒసికర్రలపై వేసిన సర్నాలను పారుపట్టెకు కట్టేతాడు. చూ. చిత్రం 28 క. 2 (కో. 11).

**పురిటీ** చూ. పూటీ (తె. 3).

**పుల్లిరుసు** పర్యా. చూ. పెడదబ్బ. రెండునాగల బండి నాగలను వెనకవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (తె. 12).

**పుస్తికట్టుతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో. 47, 48).

**పూజు** రూ. పూది; పర్యా. చూ. కాడి. బండి లాగే ఎద్దుల మెడలపై మోపే కొయ్య; ఇది పోలుకు కట్టి ఉంటుంది. చూ. చిత్రాలు 29 ట. 1, 30. 6 (కో. 43–49).

**పూట** పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి పోలుగర్ర (లేక నాగల) కిందగా దోలుపువరకు అమర్చిన తాడు. చూ. చిత్రాలు 28 క. 6, 31. 4 (తె. 6, 7; (రా. 21); **-చిల్ల** పర్యా. చూ. పన్నెతంచిల్ల. జువ్వాయి మోకుకు తగిలించే కర్ర(లు) (రా.): **-తాడు** చూ. పూట (తె.): **-మోకు** చూ. పూట (రా.): భేదాలు: **-చిల్ల** కొయ్యచిల్లలు పెట్టి వేసిన పూట (రా.); పెద్ద చిల్లలు లేకుండా వేసిన పూట (రా.).

**పూటీ** ఉ. కూటీ; రూ. పురిటీ; పర్యా. ఒట్టు, కనెం చిప్ప, చుట్టు, పేరె, వంకె, వంపు. బండి చెక్రం నిర్మాణంలో వంకర కొయ్యపలక; ఒక్కొక్క చెక్రానికి ఇటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (కో. 2, 4–6, 8-29, 31–36, 38, 39, 41-45; తె. 1, 2, 4-11, 13, 15, 35-39, 42; రా. 22, 26–28).

**పూది** చూ. పూజు (కో. 41).

**పూపడంతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 19 ట. 9 (కో. 37).

**పెట్టెబండి** పెట్టెలాగ ఉండే ప్రయాణపు బండి; ఒక రకం గూడుబండి (కో. 33, 39; తె. 40).

**పెట్టెమొద్దు** పర్యా. చూ. దోలుపు. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రం 28 చ. 5 (రా. 22).

**పెడచీల** పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. 4, 6-11, 14, 15; రా. 7, 11).

**పెడదబ్బ** పర్యా. అడ్డపొల్లు, కడకట్టె, కాట్రబద్ద, తీడవ, పాస్త, పిడతాఠి, పిరాటదబ్బ, పిరాడకట్టె, పిరాది, పుల్లిరుసు. ముసలాయం, ముసలాయంపట్టె, ముసలాయి పట్టె, వెనకపొల్లు. రెండునొగలబండి నొగలను వెనక వైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (రా. 8, 18, 20).

**పెండబల్ల** పర్యా. చూ. నాలికబల్ల. కోడిపీటలబండి (ఒకరకం బండి)ని తోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోసినొగదగ్గర వేసిన చెక్క: చూ. గోసినొగ. చూ. చిత్రం 28 క. 8 (తె. 17, 18).

**పెద్దబండి** సాధారణంగా పోలుగర్రబండి; కొన్నిచోట్ల జంట నొగల బండికూడా (కో. 1, 39; తె. 10, 11, 28, 30, 35–37, 39, 42; రా. 15, 16).

**పేరె** పర్యా. చూ. పూటీ. బండిచెక్రం నిర్మాణంలో వంకర కొయ్యలపలక: ఒక్కొక్క చెక్రాని కిటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (తె. 16, 18).

**పైపొరుబద్ద** పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (తె. 10).

**పైపీట** పర్యా. చూ. కాడిపీట. బండి పోలుగర్రకు కాడి కట్టే పైవైపున అతికిన పీట (కో. 1; రా. 1, 17).

**పొట్టిబండి** పర్యా. గిడ్డబండి, మట్వాదబండి. చిన్న బండి (కో. 6, 13, 27; తె. 41).

**పొణక** రూ. పనక, పొనక, పొనికె; పర్యా. చూ. జల్ల. ఎరువు, ధాన్యం మొ. వి తోలటానికి బండిమీద వేసే వెదుర, ఈత పేళ్ళతో అల్లిన గూడువంటి సాధనం. చూ. చిత్రం 30 ర. 1 (కో. 48, 51).

**పొనక** చూ. పొణక (కో. 30, 51; తె. 3, 7, 30, 32, 38, 42; రా. 28).

**పొనికె** చూ. పొణక (తె. 34).

**పోపకంతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టేతాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో. 38).

**పోలు** పర్యా. ఏడికోల, ఏరుకోల, ఏరుకోనుమాను, నగ, నగమాను, నొగ, నొగమాల, పాట్రబద్ద, మోకమాను. బండి దొలుపుకు అమర్చిన పొడుగాటి పలకల కొయ్య. చూ. చిత్రాలు 29 చ. 4, 29 ట. 2 (కో. 6, 10–25, 27–29, 31–36; తె. 11, 13, 33–37, 39–42); **-కర్ర** ఉ. -గర్ర చూ. పోలు (కో. తె.); **-తాడు** ఉ. పోల్తాడు; పర్యా. కడుతాడు, కాడికట్టుతాడు, కుతికేట, తీసికట్టుతాడు, దూరుతాడు, దొంగతాడు, నొగతాడు, పల కట్టుతాడు, పుచ్చెకట్టుతాడు, పుస్తికట్టుతాడు, పూపడంతాడు, పోపకంతాడు, బండేట, బండేటతాడు, ముగదాడు, మొదటి మోకు, సొప్పుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టేతాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో.); **-మాను** చూ. పోలు (కో.).

**పోలుగరచీల** బండి పరాన్ని దొలుపుకు, పోలుగర్రకు కలిపే మేకు (తె. 37).

**పోలుగర్రబండి** ఉ. పోలుగరబండి; పర్యా. ఏరు కోల బండి, గాడిబండి, మోకుమానుబండి. ఒంటినొగబండి. చూ. చిత్రాలు 29 క, చ (కో. 6, 10; తె. 33, 34, 38).

**బడెలసబ్బు** పర్యా. చూ. పురిదిని. ఒసికర్రలపై వేసిన సర్నాలను పారుపట్టెకు కట్టే తాడు. చూ. చిత్రం 28 క. (రా. 2, 18).

**బండి** ఎరువు తోలటానికి, ధాన్యం తీసుకుపోవటానికి ఉపయోగించే వాహనం (కో. 1–6, 8–13, 18, 19, 21, 24–33, 35–37, 39, 44, 46, 48, 50; తె. 1–42; రా. 1–28); **-కట్టు** పర్యా. చూ. పట్టా. బండిచెక్రం చుట్టూ బిగించిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 ట. 4 (కో. రా.); **-గూటం** పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగ(ల) కింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం. చూ. చిత్రాలు 28 క. 7, 31.5 (కో. రా.); **-చెరుగు** పర్యా. చూ. బిగుదాడు. బండికి చొప్ప వేసి బిగించేతాడు (కో. తె.); **-నాగేలి** పర్యా. చూ. ముక్కుపీట. బండి పోలుగర్రకు కాడికట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క: ఇది నాగలిని పోలి ఉంటుంది. చూ. చిత్రం 29 చ. 5 (కో. రా.).

**బండేట** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 29 ట. 9 (తె. 2, 5); **-తాడు** చూ. బండేట (తె.).

**బంతిగూటం** పర్యా. చూ: అనుగర్ర. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగ(ల)కింద ఎత్తుగా పెట్టిన కొయ్య. చూ. చిత్రాలు 28 క. 7, 31.5, 32.2 (రా. 24, 25).

**బందపీట** పర్యా. చూ. తొట్టిపీట. తొట్టికర్రలు దూర్చే కొయ్య (లేక ఇనప) పీట; ఇది కాడివైపు ఉంటుంది. చూ. చిత్రాలు 29 క. 2, 29 ట. 4 (తె. 39).

**బరేటుకట్టె** పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గా వేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (కో. 11).

**బల** రూ. బల్ల, బల్లా; పర్యా. చూ. లక్కాకు. చెక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 8–10; తె. 3–5; రా. 8, 11, 18, 21–28).

**బల్ల** చూ. బల (కో. 2–6, 14, 27, 28; తె. 41).

**బల్లా** చూ. బల (కో. 11).

**బారుకమ్మి** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 17, 18; తె. 40).

**బారుపట్టె** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువు పట్టె. చూ. చిత్రం 29 చ. 6 (కో. 19, 35).

**బిగుదాడు** పర్యా. కన్నైతాడు, తీతాడు, తీపుతాడు, బండి చెరుగు, బిళ్ళదాడు. బండికి చొప్పవేసి బిగించే తాడు (తె. 4, 34).

**బిడిగర్ర** ఉ. బిడుగర్ర; పర్యా. కరిడీకర్ర, దిగుడు కర్ర. దింపులో వెళ్ళే బండి వేగాన్ని తగ్గించటంకోసం చక్రాలకు ఆనేటట్టు వెనక పరంకింద అమర్చిన కర్ర. చూ. చిత్రం 31.2 (కో. 39, 41).

**బిడితాడు** పర్యా. కరిడితాడు, దిగుగరతాడు, బిడి మోకు. బిడిగర్రకు కట్టిన తాడు; ఇది పోలుగర్ర వరకు ఉంటుంది. చూ. చిత్రం 31. 3 (కో. 41).

**బిడిమోకు** పర్యా. చూ. బిడితాడు. బిడిగర్రకు కట్టిన తాడు; ఇది పోలుగర్రవరకు ఉంటుంది. చూ. చిత్రం 31.3 (కో. 39).

**బిడుతాడు** పరాన్ని నొగలకు బిగించేతాడు (కో. 40).

**బిరుతాడు** పర్యా. చూ. పురిబిసి. ఒసికర్రలపై వేసిన సర్నాలను పారుపట్టెకు కట్టేతాడు. చూ. చిత్రం 28 క. 2 (రా. 7).

**బిర్రుకట్టె** పర్యా. చూ. గోసినొగ. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి దొంకి పట్టెనుంచి కాడివరకు ఉన్న నొగ (తె. 5, 7, 10).

**బిళ్ళడ్డ** ఉ. బిల్లడ్డ; పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (కో. 26); -కట్టు పర్యా. చూ. కుండకట్టు. బండి కుండకు కట్టిన ఇనపకట్టు చూ. చిత్రం 28 త. 2 (కో.).

**బిళ్ళతాడు** పర్యా. చూ. బిగుతాడు. బండికి చొప్ప వేసినపుడు బిగించేతాడు (తె. 5).

**బుట్టిగుంజ** పెండబల్లమీద నిలువుగుంజ (తె. 17).

**బుడ్డాం** ఉ. బొడ్డాం; పర్యా. చూ. అనుగర్ర. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగలకింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం. చూ. చిత్రాలు 31. 5, 32. 2 (కో. 39, 41).

**బుడ్డి** పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (కో. 30, 31; తె. 7, 8, 12, 13, 16, 20-38); -కట్టు పర్యా. చూ. కుండకట్టు. బండికుండకు కట్టిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 2 (కో. తె.); **-బందు** చూ. -కట్టు (తె.).

**బూరెక్కట్టు** పర్యా. చూ. ఒగ్గె. బండి దొలుపుకు వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 29 చ. 3 (కో. 18).

**బూలగనం** కాడిని బండినొగలకు కలిపే చీల (కో. 30).

**బెట్టుతాడు** పర్యా. చూ. మెట్టుగుది. బండి పరాన్ని దొలుపుకు బిగించేతాడు. చూ. చిత్రం 30 చ. 3 (కో. 43).

**బెట్టుమోకు** పర్యా. చూ. మెట్టుగుది. బండిపరాన్ని దొలుపుకు బిగించే తాడు. చూ. చిత్రం 30 చ. 3 (కో. 37).

**బేరడ** పర్యా. చూ. పట్టెడ. బండి కాడికి ఎడ్లను కట్టే తాడు లేక తోలు పరికరం. చూ. చిత్రం 30 క. 7 (తె. 12, 27).

**బొడ్డు** పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (తె. 14); **-కట్టు** పర్యా. చూ. కుండకట్టు. బండికుండకు కట్టిన ఇనప కట్టు. చూ. చిత్రం 28 త. 2 (తె.).

**బొడ్డుచిల్ల** చూ. బొడ్డుచీల (రా. 14).

**బొడ్డుచీల** ఉ. బొడ్డుజీల; రూ. బొడ్డుచిల్ల; పర్యా. చూ. దొలుపుచీల. బండి దొలుపును పోలుగర్రకు కలిపే మేకు. చూ. చిత్రం 29 చ. 8 (కో. 14; తె. 1, 3, 17, 18, 20, 22-2. 29, 35, 36, 38; రా. 1, 3, 5, 6).

**బొడ్డుమల** ఉ. బొడ్డుమళ. బండి పరానికి, దొలుపుకు బిగించిన చీల (రా. 15-17).

**బొమ్మకట్టె(లు)** బండి పరానికి ముందువైపు వేసే ఒసికర్ర(లు) (రా. 9).

**బొమ్ము** పర్యా. చూ. మదగంపలక. ఒడ్డెబండి చెక్రానికి అమర్చిన నడిమిచెక్క (తె. 6, 9, 11).

**బోరెం** ధాన్యం తోలటానికి బండిజల్లమీద వేసే జనప నారపట్టా (తె. 32, 36, 38).

**మక్కిరి** రూ. మక్కెర, మంకిరి; పర్యా. చూ. జల్ల. ఎరువు, ధాన్యం మొ.వి తోలటానికి బండిమీద వేసే వెదురు, ఈత పేళ్ళతో అల్లిన గూడువంటి సాధనం. చూ. చిత్రం 30 క. 1 (రా. 5).

**మక్కెర** చూ. మక్కిరి (రా. 3).

**మంకిరి** చూ. మక్కిరి (రా. 15, 16).

**మంకెనకొమ్ము** పర్యా. చూ. పారు. బండిచట్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (తె. 6, 7).

**మంచం** (1) పర్యా. చూ. తొట్టి. బండితోలే మనిషి కూర్చోటానికి వీలుగా పరం (చట్రం) నుంచి కాడివరకున్న తాడు అల్లకం. చూ. చిత్రం 29 ట (కో. 47, 49);

(2) పర్యా. చూ. పరం. బండి అడ్డ లేక దొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చదరం తడికె (తె.36).

**మటింకొయ్య** పర్యా. చూ. మానికంకొయ్య. బండి పరం జారకుండా ఇరుసుమీద అడ్డంపెట్టిన కొయ్య (కో. 49).

**మట్వాడబండి** పర్యా. చూ. పొట్టిబండి. చిన్నబండి (తె. 13).

**మడిగలకొయ్య** పర్యా. చూ. మానికంకొయ్య. బండి పరం జారకుండా ఇరుసుమీద అడ్డంపెట్టిన కొయ్య (కో. 45).

**మడెం** పర్యా. చూ. ముక్కుపీట. పోలుగర్ర నేలకు అనేవైపు అడుగున వేసిన కొయ్య. చూ. చిత్రం 29 చ. 5 (కో. 25).

**మండసంపీట** పర్యా. చూ. కోడిపీట. ఒకరకం రెండునొగల బండికి దొంకిమొద్దుకింద వేసిన పట్టె. చూ. చిత్రం 28 చ. 6 (తె. 42).

**మండాపగొయ్య** పర్యా. చూ. మానికంకొయ్య. బండి పరం జారకుండా ఇరుసుమీద అడ్డంపెట్టిన కొయ్య (కో. 38).

**మండాపచీల** పర్యా. చూ. దొలుపుచీల. బండి దొలుపును పోలుగర్రకు కలిపే మేకు. చూ. చిత్రం 29 చ. 8 (కో. 41).

**మండిగం** ఉ. మడిగెం, మండిగెం, మండెగం, మంగ్గం; రూ. మనిగం; పర్యా. చూ. దొలుపు. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరంఉంటుంది. చూ. చిత్రాలు 29 చ. 2, 30 చ. 2 (కో. 3, 6; తె. 6, 9, 15–17, 19–26, 30–34, 36; రా. 22, 25); **-బల్ల** ఉ. మంగ్గంబల్ల; చూ. మండిగం (తె.); **-మొద్దు** చూ. మండిగం (రా.).

**మదగంపలక** పర్యా. బొమ్మ. ఒడ్డెబండిచెక్రం మధ్య అమర్చిన చెక్క. చూ. చిత్రం 33.1 (రా. 16).

**మనికట్టుదిండు** పర్యా. చూ. దొలుపు. బండిఇరుసుమీద వేసే అడ్డమొద్దు; దీనిమీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రం 28 చ. 5 (రా. 6).

**మనికితం** పర్యా. చూ. దొలుపు. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు. దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రం 28 చ. 5 (రా. 9).

**మనిగం** ఉ. మనిగెం; చూ. మండిగం (తె. 1-4, 7, 8, 29; రా. 8, 28); **-చీల** పర్యా. చూ. దొలుపుచీల. బండి దొలుపును పోలుగర్రకు కలిపే మేకు. చూ. చిత్రం 29 చ. 8 (తె.); **-మొద్దు** చూ. మనిగం (రా.).

**మందసగొయ్య** పర్యా. చూ. మానికంకొయ్య. బండిపరం జారకుండా ఇరుసుమీద అడ్డంపెట్టిన కొయ్య (కో. 40).

**మలకట్టెదిండు** పర్యా. చూ. దొలుపు. బండి ఇరుసు మీద వేసే అడ్డమొద్దు; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రం 28 చ. 5 (రా. 5).

**మానికంకొయ్య** పర్యా. నడుపుగొయ్య, మటింకొయ్య, మడిగల కొయ్య, మండాపగొయ్య, మందసగొయ్య. బండిపరం జారకుండా ఇరుసుమీద అడ్డంపెట్టిన కొయ్య (కో. 48, 50, 51).

**ముక్కటిచీల** పర్యా. చూ. ముక్కుచీల. జంటనొగల బండి నొగలను ముందువైపు కలిపే ఇనప (లేక కొయ్య) మేకు (తె. 18).

**ముక్కరచీల** ఉ. ముక్కెరచీల జంటనొగల బండి నొగలను ముందువైపు కలిపి కొట్టిన మేకు (తె. 12, 25, 27, 28, 32, 33).

**ముక్కానిపీట** ఉ. ముక్కనిపీట, ముక్కినపీట; చూ. ముక్కుపీట (రా. 3-6, 14).

**ముక్కుచీల** ఉ. ముక్కుజీల; పర్యా. ముక్కటిచీల, ముక్కెర చీల. ముక్కెరకనం. జంటనొగలబండి నొగలను ముందువైపు కలిపే ఇనప లేక కొయ్య మేకు (తె. 20).

**ముక్కుపీట** రూ. ముక్కానిపీట; పర్యా. అరకపీట, ఎత్తుపీట, గడ్డం, గుర్రం, గుర్రంపీట, మడెం, బండినాగేలి, పోలుగర్రకు కాడికట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క. చూ. చిత్రం 29 చ. 5 (కో. 15).

**ముక్కెరకనం** ఉ. ముక్కెరకన. జంటనొగలబండి నొగలను ముందువైపు కలిపే కొయ్యమేకు (తె. 17, 18, 21–23, 26).

**ముగదాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపి కట్టేతాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో. 43).

**ముట్టుగర్ర** పర్యా. చూ. ఎత్తుగర్ర. కందెన వెయ్యటానికి బండిచెక్రం ఊడదీసినపుడు ఇరుసుకింద ఎత్తుపెట్టిన కర్ర (తె. 13).

**ముడ్డిపీట** పర్యా. చూ. ఎద్దులపీట. ఒకరకం రెండు, నొగలబండి పరానికి ముందున్న పట్టె (రా. 6).

**ముత్తెం** ఉ. మొత్తం. జంటనొగలబండి నొగలు ముందువైపు కలిసే చోటు (తె. 29, 32).

**ముంత** పర్యా. చూ. కుండ. ఆకులు వెయ్యటానికి ఇరుసు దూర్చటానికి బండిచెక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. చూ. చిత్రాలు 28 ట. 1, 28 త, ప (తె. 39, 42); **-కట్టు** పర్యా. చూ. కుండకట్టు. బండి కుండకుకట్టిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 2 (తె.).

**ముసలప్పట్టె** రూ. ముసలాయంపట్టె; పర్యా. చూ. కొండపట్టె. కోడిపీటలబండి (ఒకరకం బండి)కి ఎద్దుల

పట్టెకింద నొగలను కలిపే కర్ర (కో. 3).

**ముసలాయం** ఉ. ముసలం, ముసలాయ్; పర్యా. చూ. పెడదబ్బ. రెండునొగలబండి నొగలను వెకనవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (రా. 7, 9-12); **-పట్టె** (1) చూ. ముసలాయం (రా.); (2) చూ. ముసల ప్పట్టె (రా.).

**ముసలాయిపట్టె** పర్యా. చూ. అడ్డపట్టె. బండి పరం లోని అడ్డపట్టె. చూ. చిత్రం 29 చ. 7 (రా. 10, 12, 23).

**మెట్టుగుది** పర్యా. బెట్టుతాడు, బెట్టుమోకు, మెట్టుగుది తాడు, మెట్టుగుదిమోకు, మెట్టుతాడు, మెట్టుమోకు, మెండి మోకు. బండి పరాన్ని దొలుపుకు బిగించేతాడు. చూ. చిత్రం 30 చ. 3 (కో. 5, 8-10, 13); **-తాడు, -మోకు** చూ. మెట్టుగుది (కో.).

**మెట్టుతాడు** పర్యా. చూ. మెట్టుగుది. బండి పరాన్ని దొలుపుకు బిగించేతాడు. చూ. చిత్రం 30 చ. 3 (కో. 40, 42, 45, 47, 49, 50).

**మెట్టుమోకు** పర్యా. చూ. మెట్టుగుది. బండిపరాన్ని దొలుపుకు బిగించేతాడు. చూ. చిత్రం 30 చ. 3 (కో. 48).

**మెంటిచీల** బండి పరాన్ని దోనెమొద్దుకు కలిపే చీల (రా. 24).

**మెండిమోకు** పర్యా. చూ. మెట్టుగుది. బండిపరాన్ని దొలుపుకు బిగించేతాడు. చూ. చిత్రం 30 చ. 3 (కో. 51).

**మెండుకట్టె** పర్యా. చూ. గోసినొగ. కోడిపీటల బండి (ఒకరకం బండి)కి దొంకిపట్టెనుంచి కాడివరకు ఉన్న నొగ (తె. 12).

**మెలుగుపీట** పర్యా. చూ. ఎద్దులపట్టె. ఒకరకం నొగలబండి పరానికి ముందున్న పట్టె (తె. 34).

**మెకట్టుదిండు** పర్యా. చూ. దొలుపు. బండి ఇరుసు మీద వేసే అడ్డపట్టె; దీనిమీదే పరం ఉంటుంది. చూ. చిత్రాలు 28 చ. 5, 30 చ. 2 (రా. 2-4).

**ముత్తతాడు** పర్యా. చూ. ఏడెతాడు. బండిజల్ల తెరచిఉన్నవైపు అడ్డంకట్టే తాడు (కో. 24).

**ముత్తా** పర్యా. చూ. తొట్టి. బండితోలే మనిషి కూర్చో టానికి వీలుగా పరం (చట్రం) నుంచి కాడివరకున్న తాడు అల్లకం. చూ. చిత్రం 29 ట (కో. 40, 44, 49).

**మొదటిమోకు** ఉ. మొదటిమోకు; పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలుగర్రకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 28 క. 10 (రా. 10, 18, 23-25).

**మోకమాను** పర్యా. చూ. పోలు. బండి దొలుపుకు అమర్చిన పొడుగాటి పలకలకొయ్య చూ. చిత్రం 29 చ. 4 (రా. 16, 22); **-బండి** పర్యా. చూ. పోలుగర్రబండి. ఒంటినొగబండి. చూ. చిత్రాలు 29 క, చ (రా.).

**మోటుబల్ల** పర్యా. చూ. నాలికబల్ల. కోడిపీటల బండి (ఒకరకం బండి)ని తోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోసినొగ దగ్గర వేసిన చెక్క; చూ. గోసినొగ (తె. 22).

**మోలెం** పర్యా. చూ. ఏడె. బండిజల్ల తెరచిఉన్న వైపు (తె. 40).

**రింగిబండి** పర్యా. చూ. గూడుబండి. పైన గూడు ఉన్న ప్రయాణపు బండి. చూ. చిత్రం 32 (తె. 22).

**రింగు** పర్యా. చూ. లక్కాకు. చక్రం కుండ అరగ కుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 30-32, 38).

**రెక్కపట్టె** రూ. రెక్కానిపట్టె. బండిపరం బిగువు కోసం దొలుపు కొననుండి పోలుగర్ర వరకు అడుగున వేసిన పట్టె; ఇటువంటివి రెండుపక్కలా రెండుంటాయి (కో. 2, 4, 5).

**రెక్కానిపట్టె** చూ. రెక్కపట్టె (కో. 1; రా. 1).

**రేక** ఉ. రాక; పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒనికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (కో. 30; తె. 19-30); **-తాడు** పర్యా. చూ. పురిబిసి. ఒనికర్రలపై వేసిన సర్నాలను పారుపట్టెకు కట్టేతాడు (తె.); **-బద్ద** చూ. రేక (కో. తె.).

**రేకు** పర్యా. చూ. ఆకు. బండికుండను, పూటీ (వంపు)ని కలిపే కొయ్య. చూ. చిత్రం 28 ట. 2 (కో. 37-51).

**రోజా** రూ. రోదా; పర్యా. చూ. చక్రం. బండి నడవ టానికి ఆకులతో ఉన్న చక్రం. చూ. చిత్రం 28 ట (కో. 21-24; తె. 37, 39, 40, 42).

**రోదా** చూ. రోజా (కో. 25).

**లక్కాకు** పర్యా. ఉలవ, ఉలవపాదు, ఉలవాయి, ఉసవాయి, కయ్య, కువ్వ, గుర్ద, తొడప, తొడుకు, దిద్దు, దిద్దె, దిబ్బె, పాదు, బల, బల్ల, బల్లా, రింగు, లోగట్టు. చక్రంకుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 12, 13, 16-23, 25, 26, 29).

**లగుబడె(లు)** పర్యా. చూ. అంపసన్నకట్టె(లు). బండి దొలుపుకింద నొగలను బిగించిన కర్ర(లు). చూ. చిత్రం 28 చ. 10 (రా. 12, 23-25).

**లంకెపీట** పర్యా. చూ. తొట్టిపీట. తొట్టికర్రలు దూర్చే కొయ్య (లేక ఇనప)పీట; ఇది కాడివైపు ఉంటుంది. చూ. చిత్రాలు 29 క. 2, 29 ట. 4 (కో. 18, 19).

**లాక** పర్యా. చూ. ఆకు. బండికుండను, పూటీ (వంపు)ని కలిపే కొయ్య. చూ. చిత్రం 28 ట. 2 (కో. 3; రా. 7, 9).

**లేడె** పర్యా. చూ. ఏడె. (1) బండిజల్ల తెరచిఉన్న వైపు ; (2) ఎరువు. కంకులుతోలే బండిజల్ల తెరచిఉన్న వైపు అడ్డంపెట్టిన తడిక లేక చొప్పకట్టలు. చూ. చిత్రం 30 క. 3 ; (3) ఎక్కువ కంకులు పొయ్యటానికి బండి జల్ల అంచుల్ని నిలవేసిన చొప్పకట్టలు (కో. 14, 18, 19, 24); **-తడికె** చూ. లేడె (కో.); **-తాడు** పర్యా. చూ. ఏడె తాడు. బండిజల్ల తెరచిఉన్నవైపు అడ్డంకట్టే తాడు (కో.).

**లోగట్టు** పర్యా. చూ. లక్కాకు. చెక్రం కుండ అరగ కుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలి వైపునా లోవైపునా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 28 త. 1 (కో. 34-36).

**లోగాడిపుల్ల** రూ. లోగానిపుల్ల ; పర్యా. చూ. చిరత. ఎద్దులు పూన్చిన బండికాడి లోవైపునున్న బెజ్జంలో వేసిన కొయ్యముక్క; దీనికి కాడి పలుపులు తగిలిస్తారు (కో. 5; రా. 1, 6).

**లోగానిపుల్ల** చూ. లోగాడిపుల్ల (రా. 1).

**లోఖుల్ల** పర్యా. చూ. చిరత. ఎద్దులు పూన్చిన బండి కాడిలోవైపునున్న బెజ్జంలోవేసిన కొయ్యముక్క ; దీనికి కాడి పలుపులు తగిలిస్తారు (కో. 16).

**వంకరతీగ** పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గా వేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (రా. 28).

**వంకాలబండి** పర్యా. చూ. అమ్దానబండి. రెండు నొగలబండి (తె. 10).

**వంకె** పర్యా. చూ. పూటీ. బండిచెక్రం నిర్మాణంలో వంకర కొయ్యపలక ; ఒక్కొక్క చెక్రాని కిటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (రా. 20, 23-25).

**వంపు** (1) పర్యా. చూ. పూటీ. బండిచెక్రం వంకర కొయ్యపలక ; ఒక్కొక్క చెక్రానికిటువంటివి ఆరు ఉంటాయి. చూ. చిత్రం 28 ట. 3 (కో. 1, 7; రా. 1-6, 11, 17, 18, 21) ; (2) పర్యా. చూ. సర్నం. పంగలగా ఉన్న ఒసికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (రా. 26, 27).

**వంపుడుబడితె** పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (రా. 11).

**వంపుడువాసం** ఉ. వంపుడోసం; పర్యా. చూ. సర్నం. పంగలగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (రా. 7, 9).

**వారిణతాడు** చూ. వార్నెతాడు (కో. 17).

**వారింతాడు** చూ. వార్నెతాడు (కో. 24).

**వారెనతాడు** చూ. వార్నెతాడు (రా. 3).

**వార్నెతాడు** రూ. వారిణతాడు, వారింతాడు, వారెన తాడు; పర్యా. ఆటార్నె, ఏటవార్నె. బండి పోలుతాడును జువ్వాయి మోకుకు అతికే తాడు. (కో. 18, 22, 36 ; తె. 24).

**వెనకతొల్లపట్టె** ఉ. ఎనికితొల్లపట్టె. బండి వెనక భాగంలో పెడదబ్బపైన గుజ్జులు వెయ్యటాని కమర్చిన పట్టె (రా. 10).

**వెనకపొల్లు** ఉ. ఎనికిపొల్లు ; పర్యా. చూ. పెడదబ్బ. రెండునొగలబండి నొగలను వెనకవైపున బంధించిన కర్ర. చూ. చిత్రం 28 చ. 8 (రా. 17, 21).

**శాయిచీల** పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (తె. 8, 10, 11, 34, 36, 38, 42).

**శాయిమొల** పర్యా. చూ. సాయిమేకు. బండిచెక్రం ఊడకుండా ఇరుసుకువేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (తె. 35).

**సంజీల** (1) బండి దొలుపును మండిగానికి కలిపే చీల (కో. 30); (2) చూ. తంజీల (తె. 17, 18, 26, 29, 31, 32).

**సంద్ర** చూ. సర్నం (తె. 8, 9).

**సనగొయ్య** రూ. జనుగొయ, సన్నుగొయ్య ; పర్యా. చూ. ఒసి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువుపట్టెలకు బిగించిన కర్ర (కో. 8, 24 ; తె. 39, 42 ; రా. 11).

**సందుపలక** బండిపరంలో పోలు కిరుపక్కలా ఉండే చెక్క (కో. 1; రా. 1).

**సన్నుగొయ్య** చూ. సనగొయ్య (కో. 3, 6, 15).

**సరవడి** చూ. చూ. సలుగుడు (రా. 6).

**సర్నం** ఉ. సర్న, సర్నె ; రూ. సంద్ర ; పర్యా. పరంబడె, పాకబద్ద, పిఢారుబద్ద, పిరాటుబద్ద, పిరిటిబద్ద, పైపారుబద్ద, రేక, రేకబద్ద, వంకరతీగె, వంపు, వంపుడు బడితె, వంపుడువాసం. పంగలగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. చూ. చిత్రం 28 క. 1 (తె. 7, 11-15, 34-36).

**సర్లపలుపు** పర్యా. చూ. పట్టెడ. బండి కాడికి ఎడ్లను కట్టేతాడు లేక తోలు పరికరం. చూ. చిత్రం 30 క. 7 (కో. 24).

**సలుగుడు** రూ. సరవడి. చెక్రాలు లేని లాగుడుబండి (కో. 19, 25).

**సవారి(రు)** పర్యా. చూ. గూడు. ప్రయాణపుబండి (గూడుబండి) మీద వేసేకప్పు చూ. చిత్రం 32. 1 (కో. 18, 19, 21, 25, 27, 28, 30-32, 35, 36, 39, 44 ; తె. 1, 19, 24, 25, 28-30, 40-42); **-కవటం**

చూ. సవారికచ్చడం (తె.); **-కచలం** చూ. సవారికచ్చడం (తె.); **-కచ్చడం** రూ. -కచ్చటం, -కచలం, -కచ్చరం; పర్యా. చూ. గూడుబండి. పైన గూడుఉన్న ప్రయాణపు బండి. చూ. చిత్రం 32 (తె.); **-కచ్చరం** చూ. సవారి కచ్చడం (తె.); **-బండి** ఉ. సవ్వారిబండి; పర్యా. చూ. గూడుబండి. పైన గూడుఉన్న ప్రయాణపుబండి. చూ. చిత్రం 32 (కో. తె.).

**సాటకొమ్ము** పర్యా. చూ. పాయ. బండిచక్రంలో నిలువుపట్టె. చూ. చిత్రం 29 చ. 6 (తె. 4).

**సాటవ** రూ. సాటా; పర్యా. చూ. పరం. బండి అడ్డ లేక డొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చదరం (తె. 10, 14, 32, 33); **-పెట్టె** గూడుబండిపై పెట్టెమాదిరి వేసిన చెక్కల చట్రం (తె.); భేదాలు: **కిరికిల-** చెక్కలతో నిర్మించిన సాటవ (తె.); **కిస్తీల-** వెదురుబద్దలతో అల్లిన సాటవ (తె.); **పురి-** పురితో అల్లినసాటవ (తె.).

**సాటా** చూ. సాటవ (తె. 4, 5).

**సాతిపీట** పర్యా. చూ. ఎద్దులపీట. ఒకరకం నాగల బండి పరానికి ముందున్నపట్టె (తె. 8).

**సాయిబిళ్ళ** పర్యా. చూ. చెక్రం బండికుండకు సాయి మేకుకు మధ్యనున్న సందులో ఇరుసుకు వేసిన ఇనపబిళ్ళ చూ. చిత్రం 28 ప. 3 (కో. 11; తె. 39).

**సాయిమేకు** ఉ. చాయిమేకు; పర్యా. కంజీల, కడ చిల్ల, కడచీల, కడానిచీల, కందెనచీల, గుదిచీల, పట్టెచీల, పిట్టమేకు, పిడిజీల, పెడచీల, శాయిచీల, శాయిమొల. బండి చెక్రం ఊడకుండా ఇరుసుకువేసిన మేకు. చూ. చిత్రం 28 ప. 2 (కో. 16-25, 37, 40, 46, 49, 50; తె. 13, 16, 18-28, 37, 39).

**సితికట్టె** పర్యా. చూ. అంపసన్నకట్టె(లు). బండి డొలుపుకింద నాగ(ల)ను బిగించిన కఱ్ఱ. చూ. చిత్రం 28 చ. 10 (రా. 14).

**సిపాయి** పర్యా. చూ. ఆనుగఱ్ఱ. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నాగ(ల)కింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం. చూ. చిత్రాలు 31. 5, 32. 2 (కో. 24, 25; తె. 5-8, 10-14, 18, 35-37, 42); **-కఱ్ఱ** (1) చూ. సిపాయి (కో. తె.); (2) చొప్పదోలే బండి తొట్టిమీద ఎత్తుగా నిలబెట్టిన కఱ్ఱ (కో.); **-గుంజ** చూ. సిపాయి (తె.); **-గొలుసు** పోలుగఱ్ఱ ఉంచటానికి రెండు సిపాయికఱ్ఱలను కట్టినతాడు. చూ. సిపాయికఱ్ఱ (తె.); **-పీట** పర్యా. చూ. తొట్టి పీట. తొట్టికఱ్ఱలు దూర్చే కొయ్య (లేక ఇనప) పీట; ఇది కాడివైపు ఉంటుంది. చూ. చిత్రాలు 20 క. 2, 29 ట. 4 (తె.); **-మోకు** పర్యా. చూ. జువ్వాయిమోకు. బండి కాడినుంచి పోలుగఱ్ఱ కిందగా డొలుపువరకు అమర్చిన తాడు (తె.).

**సేడి** ఉ. సీడ, సీడె; పర్యా. చూ. ఏడె. (1) బండి జల్ల తెరచిఉన్నవైపు; (2) ఎరువు, కంకులు తోలే బండి జల్ల తెరచిఉన్నవైపు అడ్డంపెట్టిన తడిక లేక చొప్పకట్ట. చూ. చిత్రం 30 క. 3; (3) ఎక్కువ కంకులు పొయ్య టానికి బండిజల్ల అంచుల్న నిలవేసిన చొప్పకట్ట (కో. 31; తె. 41; రా. 21); **-కట్టు** చూ. సేడి (రా.); **-తాడు** పర్యా. చూ. ఏడెతాడు. బండిజల్ల తెరచిఉన్నవైపు అడ్డం కట్టే తాడు (రా.).

**సొప్పుతాడు** పర్యా. చూ. పోలుతాడు. కాడిని పోలు గఱ్ఱకు కలిపి కట్టేతాడు. చూ. చిత్రం 29 ట. 9 (కో. 18).

**సోపాబండి** పర్యా. చూ. గూడుబండి. పైన గూడు ఉన్న ప్రయాణపుబండి. చూ. చిత్రం 32 (తె. 41).

చిత్రం 28 క. రెండునొగల(కోడిపీటల)బండి



1. సర్నం(లు) 3-5. ఒసికర్ర(లు) 7. ఆనుగర్ర 9. గోసినొగ 11. ఎద్దులపట్టె
2. పురిబిసి 6. జువ్వాయిమోకు 8. నాలికబల్ల 10. పోలుతాడు

చిత్రం 28 చ. రెండునొగల(కోడిపీటల)బండి చట్రం



1. నొగ(లు) 3. ఎద్దులపట్టె 5. డొలుపు 7. నెమ్ము(లు) 9. కొడెం(లు)
2. గోసినొగ 4. దొంకిపట్టె 6. కోడిపీట(లు) 8. పెడదబ్బ 10. అంపసన్నకట్టె(లు)

చిత్రం 28 ట. చక్రం




1. కుండ 2. ఆకు(లు) 3. పూటీ(లు) 4. పట్టా

చిత్రం 28 త. కుండ




1. ఉలవాయి
2. కుండకట్టు

చిత్రం 28 ప. కుండ




1. ఇరుసు
2. సాయిమేకు
3. చక్రం
4. కుండకట్టు




చిత్రం 29 క. పోలుగర్రబండి

1. తొట్టికర్ర
2. తొట్టిపీట
3. తొట్టితాడు

చిత్రం 29 చ. పోలుగర్రబండి చట్రం (అడుగువైపు)




1. ఇరుసు
2. డోలుపు
3. ఒగ్గ
4. పోలుగర్ర
5. ముక్కుపీట
6. పారుపట్టె(లు)
7. అడ్డపట్టె(లు)
8. డోలుపుచీల
9. తేలు
10. నెమ్ము(లు)
11. గుజ్జుబోంద(లు)



చిత్రం 29 ట. తొట్టి

1. కాడి
2. పోలుగర్ర
3. తమిరె
4. తొట్టిపీట
5. తొట్టికర్ర(లు)
6. తొట్టితాడు
7. చిరత(లు)
8. కొక్కెం
9. పోలుతాడు
10. కాడిపలుపు(లు)

చిత్రం 30 క. రెండునొగల బండి



1. జల్ల
2. గూడ
3. ఏడె
4. ఒనికొయ్య(లు)
5. తొడతాడు
6. కాడి
7. పట్టెడ(లు)

చిత్రం 30 చ. రెండునొగల బండిచట్రం (అడుగువైపు)




1. ఇరుసు
2. డొలుపు
3. మెట్టుగుదితాడు
4. తొడలు
5. నొగ(లు)

చిత్రం 31 రెండునొగల బండి




1. నొగ(లు)
2. బిడిగర్ర
3. బిడితాడు
4. జువ్వాయి మోకు
5. ఆనుగర్ర

చిత్రం 32 గూడుబండి



1. గూడు 2. ఆనుగర్ర 3. కాడి

చిత్రం 33 ఒడ్డెబండి



1. మదగం పలక
2. చిప్ప(గెరచెక్క)(లు)
3. ఇరుసు
4. నెమ్ము(లు)
5. నొగ(లు)
6. కాడి
7. కావడిచిల్ల
8. జల్లకు ఆధారంగా ఇరుసుపై వేసే కుదురుచుట్ట
9. గూడక

# 7. పైరు

## పెరుగుదల, కలుపు, కాపు

**అటుకులు** (బహు.) పర్యా. చూ. పిసికిళ్ళు. తినటానికి అనువుగా ఉండే ముదిరీముదరని గింజలు; జొన్న, సజ్జ మొ. వాటి పాలుపట్టిన గింజలు (కో. 21, 22).

**అట్ట** పర్యా. చూ. చిప్ప. వడిసెలలో రాయిపెట్టే చోటు. చూ. చిత్రం 38.1 (కో. 24).

**అట్టడి** చూ. అట్టవ (కో. 3).

**అట్టవ**1 రూ. అట్టడి, ఎట్టం. బండిమీద పేర్చిన తుమ్మ, రేగు, మొ. వాటి కంపపోగు (కో. 2, 5–9).

**అట్టవ**2 పర్యా. చూ. పందిరి. తీగెలు అల్లుకోటానికి కట్టే దోహదం (రా. 15).

**ఆడప** కొన్ని కంపమండలు కలిపి తొక్కిన కట్ట (రా. 26).

**అడ్డపచ్చ(న)** (-అగు, -కమ్మ, -కొను, -పడు) రూ. అడ్డపసుపు; పర్యా. బొమ్మపైరు. విత్తులు చల్లిన పదిరోజులకు మొలకలెత్తి చాళ్ళు పచ్చగా కనబడటం (కో. 13–15, 18, 19, 24-26; తె. 30, 36-39).

**అడ్డపసుపు** (-అగు, -కొను) చూ. అడ్డపచ్చ(న) (కో. 11-13; రా. 17–28).

**అంటు** (-అతుకు, -ఊడ్చు, -కట్టు, -నాటు) పర్యా. కల్మ. నాటిన అరటి, నారింజ మొ. వాటి కొమ్మ (కో. 4-51; తె. 2, 6–9, 15, 25, 28, 39; రా. 3, 7, 23, 25).

**అంటుకొను** (క్రి.) పర్యా. చూ. ఏనుకొను. మాగాణిలో గాని, తోటలోగాని నాటిన నారు వేరుబట్టి బతకటం (తె. 15, 28).

**అద్ద** పర్యా. చూ. తోపు. బండిమీద పేర్చిన కంప మండలు, కందికట్టె, చొప్ప మొ. వాటి కుప్ప; చూ. అట్టవ (కో. 25).

**అనగొమ్మ** (-వేయు) పక్కకొమ్మ (కో. 23).

**అరకబియ్యం** పర్యా. చూ. పిసికిళ్ళు. పాలుపట్టి తినటానికి అనువుగా ఉండే ముదిరీ ముదరని (జొన్న, సజ్జ మొ. వాటి) గింజలు (తె. 30).

**అరగడి** పర్యా. చూ. జల్లికంకి. రెళ్ళలు వదులుగా ఉన్న కంకి (తె. 22).

**అరప** పర్యా. చూ. మంచె. పైరురక్షణకు చేలో గుంజలుపాతి పైన తడికవేసి కట్టిన అరుగు; మంచె (కో. 38, 44–46, 48, 51).

**అర్రు** (-వంచు) పర్యా. ఎన్ను, కదురు, గొలుసు, తల. కంకులతో గూడిన పైరు పైభాగం (కో. 1-25; తె. 8, 16, 25, 29-42; రా. 6, 7, 19, 25, 27).

**అర్లు** చూ. అల్లవ (రా. 13, 14).

**అలం** (-పీకు) పర్యా. చూ. గడ్డి. పైరులో మొలిచిన గడ్డిమొక్కలు; వీటిని తీసివేస్తేగాని పైరుకు సత్తువ ఉండదు (తె. 7).

**అలవ** చూ. అల్లవ (కో. 25; రా. 21).

**అలుకు** (క్రి.) వాడుక: అలకటం, అలకడం, అల్కటం, అల్కడు. గింజలుగాని, వరిమొలకలుగాని చల్లటం; నారునాటటం; చాలాచోట్ల చేత్తో చల్లటానికే ఈ పదం వాడుతారు; గొర్రుతో చల్లినప్పుడు 'ఎదబెట్టటం' అంటారు (తె. 1, 2, 7, 8, 12, 14–21, 23-30, 32-38, 42).

**అల్లవ** రూ. అర్లు, అలవ, అల్లు; పర్యా. ఏడె, జీబు, పబ్బు, బోదె3, సుల్లె, సిగరజంబు. తీగెలు అల్లుకోటానికి దోహదంగా పెట్టే దడిగాని, నిలువుకొయ్యలుగాని (రా. 18-20).

**అల్లు** చూ. అల్లవ (రా. 5, 27).

**అంశం** పర్యా. చూ. పైరు. పచ్చగా మొలిచిన మొక్కలు; పచ్చపొలం (తె. 22).

**ఆకు** (1) (-పోయు) పర్యా. చూ. నారు. తిరిగి నాటటానికి వీలుగా పెంచిన 'వరి' మొ. వాటి మొలకలు; వరినారు; చాలాచోట్ల వరినారుకే 'ఆకు' అనీ, వంగ, మిరప మొలకలకు 'నారు' అనీ వాడుక (కో. 21, 22, 33, 37-51; తె. 34, 37, 39); **-బట్టి**, **-మడి** పర్యా. చూ. నారుమడి. నారుపోసిన భూభాగం (కో.) (2)(-జాగు, -సాగు, -విడుచు, -వేయు) పర్యా. -గర, గరి, రవిదె, రెక్క, రేకు, రొట్ట, రొద్ద, వగుడు, వగ్గు. పైరు పెరుగుదలలో ఒకదశ; మొక్క తలెత్తినతరవాత విస్తరిల్లే పచ్చటిభాగం (కో. 1, 3-29, 31-39, 41, 43-45,

---

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విశ. = విశేషణం; హిం. = హిందుస్తానీ.

51 ; తె. 1, 3-12, 14-42 ; రా. 3, 6–10, 12, 13, 16-26) : **-పొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఆకు విడవకుండా ఎన్నులేర్పడే మొదటిదశ (కో. తె.); (3) (-పీకు) పర్యా. చూ. గడ్డి. పైరులో మొలిచిన ఆకూ అలం; దీన్ని పీకివేస్తారు (తె. 29, 37, 38 ; రా. 5).

**ఆద** పర్యా. చూ. పైరు. పచ్చగా ఎదిగిన పైరు (తె. 19, 20).

**ఆదిపొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఆకు విడవకుండా ఎన్నులేర్పడే మొదటిదశ (కో. 33, 36).

**ఆరం** (-పట్టు) పర్యా. చూ. సుంకు. కంకి గింజల మీద నూగునూగుగాపట్టిన పూత (కో. 40, 43, 45, 46, 48).

**ఇగురు** (-పెట్టు, -వేయు) చూ. చిగురు. లేతాకు (తె. 10, 33, 42 ; రా. 9, 21-28).

**ఇండీలుబద్ద** చూ. ఉండేల్‌దబ్బ. చూ. చిత్రం 39 (కో. 8–10, 38).

**ఇరకాలకట్టె** పర్యా. చూ. రాగోల (కట్టె). ముళ్ళ కంపలు ఎత్తటానికి ఉపయోగించే పంగలకర్ర (ఇర = రెండు ; కాల = కాళ్లగల) (రా. 8).

**ఇరుక్కంత** ఉ. ఇరుగ్గంత; (ఇరుకు + కంత) పర్యా. ఇరుక్కొయ్య. పొలంచుట్టూ కంచెవేసి పంగటికొయ్యతో ఒక మనిషిమాత్రమే పోవటానికి ఏర్పరచిన దారి (కో. 5, 6, 11, 23, 24).

**ఇరుక్కొయ్య** పర్యా. ఇరుక్కంత. పొలంచుట్టూ కంచెవేసి మనిషి దూరటానికి మాత్రం పంగటికొయ్యతో కట్టిన ఇరుకు దారి (కో. 18, 19, 25).

**ఇలారం** పర్యా. చూ. దడి. పైరు రక్షణకు చేనిచుట్టూ తడికెలతో కట్టిన కంచె (కో. 41).

**ఈను** (క్రి.) పైరు పూర్తిగా ఎన్నులు విడవటం (కో. 11-29, 33-51; తె. 1-3, 6, 8, 10–12, 14-16, 18, 23-28, 33-37, 40–42 ; రా. 26, 27); **-పొట్ట** పర్యా. నిండుపొట్ట, పగులుపొట్ట, పిగులుపొట్ట, పెద్దపొట్ట, బడిపొట్ట, బిగిపొట్ట, బిర్రుపొట్ట, ముదురుపొట్ట, సరిపొట్ట. ఆకులు విడబడి కంకివేళ్ళే ముందున్న పైరుదశ ; ఏపుకు వచ్చిన ఎన్ను (కో. తె. రా.).

**ఈనె** పర్యా. పొలికె. దంటుపైన గట్టిగాఉన్న భాగం (కో. 3, 8, 11, 15, 19, 20, 23-25, 31, 32; తె. 3, 4, 6, 40-42 ; రా. 17-26).

**ఈరదాడు** పర్యా. చూ. చెటాల్‌మోకు. 'చెటాలున' మోగించి పొలంలో పిట్టలనుతోలే మోకు (కో. 13).

**ఉడుచు(పు)** (క్రి.) చూ. ఊడ్చు (కో. 38–40, 45-47).

**ఉడ్డబెట్టు** (క్రి.) కోసిన ఆకుల్ని మొదళ్ళు పైకివచ్చేటట్టు నిలబెట్టటం (కో. 18).

**ఉండేల్‌దబ్బ** రూ. ఇండీలుబద్ద. ఉండేలు లేక ఉండవిల్లు ; ఉండ (రాతిగుండు)తో పిట్టల్నికొట్టే విల్లు. చూ. చిత్రం 39 (కో. 14).

**ఉనుచు** ఉ. ఉనుపు ; చూ. ఊడ్చు (కో. 51 ; తె. 13).

**ఉభా** వరి, మిరప మొ. వాటి నారు చాళ్ళలో పాతటం; ఊడ్పు (కో. 37, 38, 46).

**ఉరిగింజలు** పర్యా. చూ. పిసికిళ్ళు. దోరగా పండిన జొన్న, గోధుమ మొ. వాటి గింజలు (రా. 21).

**ఉలవరింపు** 'తడి' పెట్టిన నేల పదునుగాఉన్న స్థితి ; ?పదును (కో. 4).

**ఉల్లడి** ఉ. ఉల్లడ ; పర్యా. చెలప(నాటు.) వాలిపోయిన మొక్కల్నిగాని, ఒకచోటనే ఎత్తుగాఉన్న మొక్కల్నిగాని తీసి ఎడ ఎడంగా మళ్ళీ నాటటం (కో. 20, 21).

**ఉల్లెడ** ఉ. ఉల్లడ, ఒల్లెడ. (-వేయు) చేనికి కంచె వేసేటప్పుడు ఒక వరస పెద్ద కంపమండలు పాతిన తరవాత మధ్యసందుల్లో వేసే సన్నముళ్ళకంప (కో. 18, 21, 25 ; తె. 36).

**ఉసురునీళ్ళు** (మిరప) నారు నాటింతరవాత బతకటానికి పోసే నీళ్ళు (కో. 1, 2).

**ఊచ** (1) పర్యా. ఏను, కాడ. జొన్న, సజ్జ మొ. వాటి కంకికి ఆధారంగా ఉన్నకాడ (కో. 3-8, 11-14, 19-24, 46 ; తె. 1-12, 14, 15, 17, 32-39, 42 ; రా. 18-21) ; (2) అరటిబోదె లోపల మెత్తగాఉండే భాగం ; దీంతో కూర వండుకుంటారు (కో. 5–20).

**ఊచపొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. విప్పారని ఎన్ను (కో. 12).

**ఊచబియ్యం** పర్యా. చూ. పిసికిళ్ళు. పాలుపట్టి ఇంకా ముదరని గింజలు ; తినటానికి రుచిగాఉంటాయి (కో. 3-6, 9-14, 16-21, 23-32, 36 ; తె. 29, 32, 33, 35, 37-42) ; **-పరువు** ఊచబియ్యం ఏర్పడేస్థితి (కో. తె.).

**ఊడ** ఉ. ఓడ, వాడ ; పర్యా. చట్ట. వేరుసెనగ కొమ్మలకు పుట్టి నేలలో పాతుకొనే వేరు ; దీనికి కాయలు కాస్తాయి (కో. 23, 24, 41, 43, 45 ; తె. 1-12, 14, 29–39, 42; రా. 3-27).

**ఊడ్చు(డ్పు)** (క్రి.) రూ. ఉడుచు, ఉనుచు; పర్యా. చూ. నాటు. వరి, మిరప మొ. వాటి నారు చాళ్ళలో నాటటం (కో. 21-23, 34, 37, 41-44, 48, 49).

**ఊలదంటు** పర్యా. పీలదంటు, బెండుదంటు. చప్పగా ఉండే జొన్నదంటు (రా. 17-21).

**ఎట్టం** చూ. అట్టవ (తె. 10, 16 ; రా. 16, 18, 26).

**ఎడగాడికలుపు** పర్యా. చూ. మలికలుపు. పైరు కొంత పెరిగి, 'పొట్ట' బెట్టినప్పుడు తీసే కలుపు ; రెండో కలుపు (తె. 41).

**ఎడగింజ** కంకిలో దూరదూరంగా పట్టిన గింజ(లు) (కో. 14).

**ఎన్ను** ఉ. -వెన్ను (-ఈడు, -ఒదులు, -తీయు, -పోవు, -విడుచు, -వెళ్ళు) పర్యా. ఎల్ల, కంకి, లొంబ. మొక్కపై కొనగింజలు పట్టే భాగం ; కొన్నిచోట్ల కంకి (కో. 1-13, 16, 17, 24, 25, 34, 35, 39, 41, 43-47, 50 ; తె. 3-5, 7-11, 14, 23, 24, 36, 42 ; రా. 1-14, 16-20, 24, 27).

**ఎరగంప** (<వెరగంప) పంటపొలంలో క్రపాతి బోర్లించిన దిష్టిగంప ; దీనికి తెలుపు నలుపు పట్టెలు తీరుస్తారు (రా. 8).

**ఎలికలకుండ** ఎలికలు పట్టటానికి పంటపొలంలో గుంటతీసి పెట్టిన పేడనీళ్ళ కుండ (రా. 3).

**ఎలుగు** ఉ. ఎనుగు ; (<వెలుగు) పర్యా. చూ. కంచె. పైరురక్షణకు పొలంచుట్టూ కంపమండలతో గాని, తీగెతో గాని కట్టిన ఆవరణం (కో. 1, 37, 38, 41, 45-48, 50 ; తె. 10, 27, 28, 35 ; రా. 1, 28).

**ఎల్ల** (-ఈను, -పెట్టు, -వేయు) పర్యా. చూ. ఎన్ను. మొక్క పైకొన గింజలుపట్టే భాగం ; ఎన్ను (తె. 6, 7, 38 ; రా. 2) : **-పైరు** ఎన్నులు పూర్తిగా విడిచిన పైరు (తె.).

**ఏజీపుగాడు** ఉ. ఏజీపుగోడు ; పర్యా. చూ. దిష్టిబొమ్మ. పంటలకు దిష్టితగలకుండా పొలంలో నిలబెట్టిన గడ్డిబొమ్మ (కో. 5).

**ఏడె** పర్యా. చూ. అల్లవ. తీగెలు అల్లుకోటానికి దోహదంగా పెట్టిన వెదురుబద్దల దడి (రా. 23).

**ఏను** పర్యా. చూ. ఊచ. కంకికి ఆధారంగాఉన్న కాడ (కో. 32).

**ఏనుకొను** (క్రి.) పర్యా. అంటుకొను, కారుకొను, నాటు, నాటుకొను, వేరుబట్టు, వేటబెట్టు. మాగాణిలో గాని తోటలోగాని నాటిన నారు వేరుబట్టి బతకటం (కో. 25; తె. 1, 2, 24, 27-29, 32, 38).

**ఒడప** పర్యా. పట్ట, రేకు. అరటిచెట్టు బోదెకున్న పొర (కో. 17).

**ఒది** పర్యా. చూ. గాతం. చేనిచుట్టూ కంప పాతటానికి తీసిన గాడి (కో. 19, 22, 23, 25).

**ఒల్లిగం** పొలానికి కంచెవెయ్యటానికి పేర్చిన రేగి కంపల పోగు; చూ. తుప్పె (కో. 9).

**కంతర** పర్యా. చూ. గగ్గి. గింజపట్టని కంకి ; తాలు కంకి (కో. 31).

**కంకి** (-వెళ్ళు) పర్యా. ఎన్ను, గొలుసు. గింజపట్టిన ఎన్ను ; జొన్న, సజ్జ మొ. వాటి గింజలగుత్తి (కో. 3-6, 8-15, 18-25, 28, 30-51 ; తె. 1-4, 12, 13, 15-21, 23-38, 40, 41; రా. 15-28).

**కంచె** ఉ. కంచి ; పర్యా. ఎలుగు, కర. పశువులు మొ. వాటి నుంచి రక్షించటానికి పొలంచుట్టూ నాటిన ముళ్ళ కంప (కో. 13, 14, 16-25, 40, 47, 48 ; తె. 6, 9, 35, 38 ; రా. 17-19).

**కటుకు** విరిస్తే ఎర్రగాఉన్న పచ్చిపసుపుకొమ్ము (కో. 22).

**కట్టాకు** నాటు (ఊడ్పు)కు సిద్ధమైననారు ; చూ. ఆకు (2) (కో. 37, 40, 46, 48).

**కండె** (1) రూ. గండె. ముదిరిన మొక్కజొన్న కంకి (కో. 32 ; తె. 41) ; (2) పర్యా. చూ. బెండు. చెరకు, జొన్న మొ. వాటి దంటులోపలి భాగం (కో. 19, 20).

**కదురు** (1) ? మొక్క పూతబెట్టినదశ (తె. 29) ; (2) (-వాలు) ? పర్యా. చూ. అర్రు. కంకితోగూడిన పైరు పైభాగం (రా. 3).

**కదురుపిందె** పరా. చూ. చట్ట. కంది, పెసర మొ. వాటి లేతకాయ (తె. 29).

**కనుపు** (-వేయు) చూ. గనుపు (కో. 19-21, 23, 27, 29, 38 ; తె. 9).

**కన్ను** చూ. గనుపు (కో. 41, 45).

**కన్నెకలుపు** పర్యా. చూ. తొలికలుపు. నారుమడిలో తీసేకలుపు ; కొన్నిచోట్ల నారు నాటింతరవాత తీసే మొదటి కలుపు ; చూ. కలుపు (కో. 34, 35, 40 ; తె. 41 ; రా. 13, 15, 17).

**కయ్య** ఉ. కయ ; పర్యా. చూ. మడి. నారుపోసిన నలచదరపు భూభాగం (కో. 1-3, 22; రా. 7, 25-27).

**కర** (-నాటు, -పెట్టు, -వేయు) పర్యా. చూ. కంచె. పైరురక్షణకు పొలంచుట్టూ మండలతోగాని, ముళ్ళకంపతో గాని కట్టిన ఆవరణం (కో. 3-6, 8-11, 14-17, 23 ; రా. 1) ; **-గోడ** రూ. కరపగోడ; పర్యా. తెట్టెగోడ. చేని చుట్టూ కాపుగా పెట్టినగోడ (కో.).

**కరదు** చూ. కరుకు (రా. 17).

**కరపగోడ** చూ. కరగోడ (కో. 6).

**కరాకు** పొడుగాటి పొగచెట్టు ఆకు (కో. 14).

**కరుకు** (-ఎక్కు, -తేలు, కరుక్కువచ్చు) చూ. కరదు, కరుగు, కరువు, గరుకు; పర్యా. పొట్టకరుకు, పొట్ట గర. పైరు పొట్టపెట్టటానికి ముందరిదశ ; గనుపువేసే దశ; సామాన్యార్థం 'ఏపు' (కో. 1-4, 6-10, 14, 15, 17 ; తె. 3-15, 29, 33-39, 42 ; రా. 1, 3-8, 11, 14-

18, 21–23); -పొట్ట ఉ. గరుగుపొట్ట; పర్యా. చూ. చిరిపొట్ట. ఎన్నులు పొటమరించే దశ (తె.).

కరుగు చూ. కరుకు (తె. 16, 20, 28).

కరువు (-మోపు, -వేయు) చూ. కరుకు (కో. 2; రా. 1).

కర్ర ఉ. కర (-విరియు) పర్యా. చూ. దంటు. వరి, జొన్న, సజ్జ, మొ. పైరుమొక్కలకాడ; నేలనుంచి ఎన్ను దాకాఉన్న మొక్కభాగం (కో. 1, 4, 20, 39, 41, 43; తె. 1, 2, 12, 16, 20–28, 31; రా. 22, 24, 26).

కలక చూ. కలగర (కో. 4).

కలగర రూ. కలక, కలగలి. నారుమడికి పెట్టే మొదటి తడి; చూ. పులకతడి (కో. 2, 4–6).

కలగలి చూ. కలగర (కో. 1).

కలుపు ఉ కల్పు: (-తీత, -తీయు) పర్యా. గాబు. పైరులో మొలిచిన గడ్డిమొక్కలు; వీటిని పీకివేస్తేనేగాని పైరుకు సత్తువ ఉండదు (కో. 12, 26, 29, 31, 32, 34, 35, 40, 51; తె. 1, 2, 4–9, 11–21, 24, 25, 27, 28, 31–33, 35–39, 41; రా. 2, 3, 6, 8, 11, 13, 15–17, 19, 25, 26, 28); -పైరు ఉ. కలుప్పైరు; పర్యా. గొప్పుపైరు. కలుపుతీయటానికి వీలైనంత ఎత్తుగా పెరిగిన పైరు (తె.).

కలుసు (వాడుక: కల్వటం, కల్పడం, కల్పుడు) (క్రి.) కలుపుతీయటం; చూ. కలుపు (తె. 2, 12, 18–25, 27, 28, 34; రా. 5).

కల్మ ఉ. కలం, కల్మ (<హిం. ఖలమ్=అంటు) (-కట్టు,-చేయు); పర్యా. అంటు. అరటి, నారింజ మొ. వాటి అంటు; కొమ్మకు కట్టే అంటు (తె. 13, 15, 20, 21, 26, 28).

కల్ల (-నాటు) కంచెగా వేసిన ముళ్ళకంపలు (రా. 1–4, 7, 8).

కళ్ళేకు ఉ. కల్లేకు (<కళ్ళి + ఆకు) లేత తమలపాకు; చూ. పాపటాకు (కో. 22; రా. 23).

కవకట్టె రూ. కవరకట్టె; పర్యా. చూ. రాగోల (కట్టె). ముళ్ళకంపలు ఎత్తటానికి ఉపయోగించే పంకల కర్ర (రా. 13).

కవటాకు ఉ. కవట. ఆకుకు, తీగె గనుపుకు మధ్య పుట్టిన తమలపాకు; లేత తమలపాకు (కో. 4, 14–17, 22; రా. 9).

కవరకట్టె చూ. కవకట్టె (రా. 18).

కవుటు ఉ. కవట, కొటు; (గిల్లు, -తీయు) రూ. కవురు; పర్యా. గొండ, గొల, చెండు, తలగొమ్ము, తల పూత, పాల, పిలక, మొగ్గ. (పొగమొక్క) చెట్టుకు, ఆకు మధ్య వేసే పిలకలు పొగచెట్టు పూత; వీటిని గిల్లితేనేగాని ఆకు బాగా పెరగదు (కో. 6, 10, 13–15, 29, 35).

కవురు (-వేయు) చూ. కవుటు; తలకొమ్మ గిల్లిన తరవాత పుట్టే చిగురు (రా. 23, 28).

కసె (-తీయు, -వేయు) పర్యా. చంకనం, చిగురు, నల, పిలక, పిల్ల, రెక్క, రిల్ల, రెళ్ళ, లిటాకు, సని. తలకొమ్మ గిల్లింతరవాత పుట్టే చిగురు; పొగాకు మొగ్గ; కొన్నిచోట్ల పొగచెట్టు వేసే తలకొమ్మ (తె. 3, 35; రా. 17, 18, 24, 26).

కాడ పర్యా. చూ. ఊచ. జొన్న మొ. వాటి కంకికి ఆధారంగాఉన్న కర్ర (కో. 44, 46; తె. 20–28).

కాత చూ. కాపు (తె. 10, 11, 14, 22, 29, 33).

కాపిళ్ళు (-అగు) పర్యా. చూ. పిసికిళ్ళు. పాలుపట్టి తినటానికి అనువుగాఉండే గింజలు (తె. 4, 5, 8, 10–12, 14, 34).

కాపు[1] (-దిగు, -పట్టు, కాపుకువచ్చు) రూ. కాత. పైరు పూర్తిగా పండినదశ; కోతకు ముందరిదశ (కో. 1, 4, 5, 12–18, 23–25, 43; రా. 7, 21, 23); -గొప్పు పైరు కాపుకువచ్చేముందు కలుపు మొక్కలు తవ్వటం (కో.).

కాపు[2] చూ. కావలి (కో. 39, 41, 43, 45).

కారుకొను (క్రి.) పర్యా. చూ. ఏనుకొను. మాగాణిలో గాని, తోటలోగాని నాటిననారు వేరుబట్టి బతకటం; నాటు కొన్న మొక్కలతో పైరు ముదురాకు పచ్చగా కనబడటం (కో. 37, 40, 41, 43, 45–50).

కావలి ఉ. కాయిలి. కావిలి; రూ. కాపు. పైరును జంతువులనుంచి, దొంగలనుంచి రక్షించటం (కో. 27, 35, 36; తె. 1, 11, 20, 32, 34–37, 42; రా. 16–23, 26).

కుట్టు (క్రి.) పర్యా. చూ. నాటు. నేలలో చిన్న రంధ్రాలుపొడిచి నారునాటటం (రా. 15–17).

కుడక పర్యా. చూ. చిప్ప. వడిసెలలో రాయిపెట్టే చోటు. చూ. చిత్రం 38. 1 (తె. 1, 7).

కుడమకట్టు (క్రి.) రాగిపైరు గింజ (పట్టటం) (రా. 9).

కుండ (-కట్టు) పర్యా. చూ. పాదు. నాటిన మొక్క చుట్టూ చదునుచేసి నీళ్ళు నిలవటానికి కట్టినమేర (తె. 9).

కుతికెపొట్ట పర్యా. చూ. చిరిపొట్ట. ఏర్పడుతున్న ఎన్ను (తె. 40).

కురిమొలుపు పర్యా. చూ. కోరమొక్క. నేల చీల్చుకొని అప్పుడే పైకివచ్చిన చిన్న మొలక (తె. 30).

కువిదపోవు (క్రి.) పర్యా. చూ. తారిపోవు. పండిన గింజలు ఎండటం (కో. 30).

కుసం పర్యా. చూ. సుంకు. జొన్న, సజ్జ, మొ. వాటి కంకిమీద పట్టే పూత లేక నూగు (కో. 29, 32, 35).

కుసి పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం; వరి, జొన్న మొ. వాటి మొలక (కో. 30).

క్రొటేకు పర్యా. చూ. కోటేకు. పైరుపొట్టపై నిటారుగా వేసిన ఆకు (కో. 40; తె. 5).

కొడిపెదంటు ఈనని (ఎన్నువేయని) జొన్న మొ. వాటి దంటు; దీన్ని గొడ్లమేతకు ఉపయోగిస్తారు (కో. 24).

కొడ్డేకు (<కొడి+ఆకు) చూ. కోటేకు (తె. 9-11).

కొమ్మ (-విడుచు, -వేయు, -సాగు) పర్యా. తమరు. కంది, పత్తి మొ. చెట్లకు వేసే పక్కకొమ్మ (కో. 13, 14, 18, 23, 26, 39, 41, 43, 45; తె. 1-3, 6, 7, 11, 12, 33, 37-42; రా. 2, 6-8, 10-12, 15-19, 22-28).

కోటేకు (-వేయు) రూ. కొడ్డేకు; పర్యా. క్రొటేకు, పొటాకు, పొట్టపీక, పొట్టాకు, పొరాకు, బల్లెపాకు, మిడిగర, వరాకు. పైరు పొట్టమీద నిటారుగా మొలిచిన ఆకు (కో. 21, 45; తె. 6, 7; రా. 6, 7, 25, 28).

కోరడ (1) చేనిచుట్టూ గుబురుగా ఉండే మొక్కలతో వేసిన కంచె; (2) పర్యా. తాళ్ళకట్టవ. చేనిచుట్టూ వేసిన తాటిచెట్ల కంచె (కో. 21, 23, 38).

కోరమొక్క పర్యా. కురిమొలుపు, సూదిమొక్క. నేల చీల్చుకొని పైకివచ్చిన చిన్న మొలక (తె. 40).

గగ్గి పర్యా. కంకర, పీప. గింజలులేని కంకి; గింజలు రాలిన కంకి (కో. 11, 32, 35; తె. 41).

గడమంచె ఉ. గెడమంచి; పర్యా. చూ. మంచె. పైరుకు కావలికాచే మనిషి నిలబడటానికి గుంజలుపాతి పైన తడికవేసి కట్టిన కట్టడం. చూ. చిత్రాలు 35 క, ట, త (కో. 24).

గడ్డి (-తీయు, -పీకు) పర్యా. అలం, ఆకు, ఇగురు, గాదం, నలి, రొడ్డ. పైరులో మొలిచిన గడ్డి గాదం; దీన్ని పీకేస్తారు (తె. 9, 10, 12, 29, 38; రా. 25, 27, 28).

గంట (-అగు, -కట్టు, -చీలు, -పగులు) రూ. గుంట; పర్యా. గుదుం, చిల్ల, దిమ్మె, దుబ్బ, పన్నె, బొందె, ముక్కర. కొర్ర, రాగి, వరి, సజ్జ మొ. పైరుమొక్క చుట్టూ గుబురుగా మొలిచిన పిలకలు (కో. 1-8, 10, 14, 15, 24, 25, 35; తె. 1-3, 12, 14, 39; రా. 1, 5, 9, 18, 19, 21-26).

గంట(లు) (-తీయు) పైరులో మొలిచిన కలుపు మొక్క(లు) (తె. 16).

గంటు (-వేయు) చూ. గనుపు (తె. 5, 12).

గండె చూ. కండె (తె. 12).

గనమ(చట్టు) రూ. గల్వ. కంచెవేసి మనిషి దూరటానికి ఏర్పరచిన చిన్నదారి (తె. 1, 35, 36).

గని (-తిరుగు) చూ. గనుపు (తె. 40).

గనికె ఉ. గెనిక, గెనికె (-వేయు) చూ. గనుపు (తె. 3, 4, 29).

గనుపు (-పట్టు, -పెట్టు, -వేయు) ఉ. గనపు, గెనపు, గెనుపు; రూ. కనుపు, కన్ను, గని, గనికె, గనె, గన్నె, గనువు; పర్యా. గుడ్డు, పిచ్చ, పూస, రాగి, సజ్జ, జొన్న, చెరకు మొ. మొక్కలదంటుకు అక్కడక్కడ ఉండే హద్దు; పర్వం (కో. 1, 3, 5, 15-17, 22, 24, 26-32, 34-36; తె. 1, 2, 5-9, 36, 37, 39, 41, 42; రా. 6, 18-23, 25, 26, 28).

గనె ఉ. గెనె (-వేయు) చూ. గనుపు (కో. 3, 25, 30; తె. 13, 16-29, 31-35, 38).

గన్నె ఉ. గెన్ను, గెన్నె; చూ. గనుపు (తె. 12, 32; రా. 16).

గయిను పొలంకంచెకు ఏర్పరిచినదారి (కో. 47).

-గర చూ. గరి. మిడిగర (తె. 32).

గరి ఉ. గెరి; రూ. -గర; పర్యా. చూ. ఆకు. మొక్క తలెత్తినతరవాత విస్తరిల్లే పచ్చటిభాగం; ఆకు (రా. 15, 16).

గరుకు (-వచ్చు); చూ. కరుకు (రా. 21).

గరేకు (<గరి+ఆకు) (గరేక్కువచ్చు, -కోయు, -పెంచు) పర్యా. చూ. చుక్కాకు. ఎన్ను గుదిగా ఆవరించిఉన్న ఆకు; ఈ ఆకులు కోసేస్తారు (కో. 6, 8-10, 13-15, 18, 19, 24, 39; రా. 7).

గర్భం (-ఆను) పర్యా. చూ. పొట్ట. ఏర్పడుతున్న ఎన్ను; ఆకులు ఆవరించి ఉబ్బెత్తుగా కనబడే ఎన్ను (రా. 28).

గల్వ చూ. గనమ (తె. 34).

గాడి పర్యా. చూ. గాతం. చిల్లకంప నాటటానికి చేనిచుట్టూ తీసినగాడి (కో. 17, 19).

గాత చూ. గాతం (కో. 20-22, 42).

గాతం రూ. గాత; పర్యా. ఒది, గాడి, నూటు. చేనిచుట్టూ కంప పాతటానికి తీసినగాడి లేక గొయ్యి (కో. 1, 2-13, 15, 18; రా. 1).

గాదం ఉ. గేదం (-తీయు) పర్యా. చూ. గడ్డి. పైరులో మొలిచిన గడ్డి; కలుపు (తె. 8, 41; రా. 27).

గాబు (-ఏరు, -తీయు, -పీకు) పర్యా. చూ. కలుపు. పైరులో మొలిచిన గడ్డిమొక్కలు; వీటిని తీసివేస్తేనేగాని పైరుకు సత్తువఉండదు (కో. 37-51).

గింజ ఉ. గింజె (-కట్టు, పట్టు, -పోసుకొను, -మోయు, -వేయు); పర్యా. గొడిదె, బొండ. పాలు గట్టిపడి ఏర్పడ్డ బీజం (కో. 1–51; తె. 12, 40, 41; రా. 25).

గుడాలపంగి పర్యా. మెదగింజ. దోరబండిన గింజ (తె. 9).

గుడ్డు (-పోయు) పర్యా. చూ. గనుపు. రాగి, సజ్జ, జొన్న మొ. మొక్కల దంటుకు అక్కడక్కడ ఉండే హద్దు; పర్వం (తె. 10, 14).

గుంట (-పోయు) చూ. గంట (తె. 15, 26).

గుండు (-ఆడు) పర్యా. గుదేకు. ఎన్నును గుదిగా ఆవరించిఉన్న ఆకు (తె. 32; రా. 4).

గుదిమె పూతకురాని మామిడి, నారింజ మొ. చెట్టు (తె. 9).

గుదుం (-కట్టు) పర్యా. చూ. గంట. పిలకలు వేసి మొక్క గుబురుగా పెరిగి రావటం (కో. 8).

గుదేకు ఉ. గూదేకు (-వేయు) పర్యా. గరేకు, గుండు, గొడ్డు, సూడ్డకు. ఎన్నును గుదిగా ఆవరించిఉన్న ఆకు (కో. 6, 8, 29; తె. 40–42; రా. 9, 10, 12, 17–25).

గునుపు ఉ. గుంపు; చూ. గనపు (కో. 38, 41).

గున్న కొంచెం నలుమూలలా విప్పారిన మొక్క (రా. 23).

గుబురు (-కట్టు) పర్యా. చూ. మండ. నాటుకొన్న చెట్టు ఆకులు దట్టంగా వేసి ఏపుకువచ్చే దశ (తె. 29, 42).

గుబ్బ (-కట్టు, -వేయు) పర్యా. చూ. మండి. నాటుకొన్న చెట్టు ఆకులు దట్టంగా వేసి ఏపుకువచ్చే దశ (కో. 45; తె. 35, 36).

గుంపు (-కట్టు) పర్యా. చూ. మండ. నాటుకొన్న చెట్టు ఆకులు దట్టంగా వేసి ఏపుకువచ్చే స్థితి (తె. 10).

గుమ్మటం (-అగు) పర్యా. చూ. మండ. నాటుకొన్న చెట్టు ఆకులు దట్టంగా వేసి గుబురుగా కనబడే స్థితి (కో. 8; తె. 37).

గుమ్మిడిదల (-కు వచ్చు) పర్యా. చూ. మండ. టుకొన్న చెట్టు ఆకులు దట్టంగా వేసి గుబురుగాఉండే స్థితి తె. 14).

గుమ్మె (-కట్టు) చెరకు పొదలాగా పెరిగే స్థితి (కో. 12).

గుమ్మె(లు) (-ఏయు) పర్యా. చూ. పిలక(లు). అరటిచెట్టు చుట్టూ మొలిచే పిలక(లు) లేక చిన్న అరటి మొక్క(లు) (రా. 26).

గురుజ ఉ. గురిజె (-పట్టు) రూ. గొరిసె; పర్యా. చూ. సుంకు. కంకిమీద ఏర్పడుతున్న నూగు; పాలు గట్టిపడి ఏర్పడే విత్తనం (తె. 8, 10, 11).

గెల (-వదులు, -వేయు) రూ. గొండి, గొల. అరటి, అలచంద, పెసర మొ. వాటి కాయల గుది (కో. 4, 5, 43; తె. 34, 39).

గేగు (-అగు) గజమెత్తు పెరిగిన తాటి, కొబ్బరి, అరటి మొ. చెట్టు (రా. 8, 9).

గొడిదె (-పట్టు) పర్యా. చూ. గింజ. పాలు గట్టిపడి కంకిలో ఏర్పడుతున్న విత్తనం (తె. 6).

గొడ్డు (-వేయు) పర్యా. చూ. గుదేకు. ఎన్నును గుదిగా ఆవరించిఉన్న ఆకు (కో. 43).

గొండ (-వేయు, తీయు) ? పొగచెట్టుతలపైన వేసే పూత; దీన్ని గిల్లివేస్తారు; చెట్టుకు, ఆకుకు మధ్యవేసిన పిలకలు (తె. 11).

గొండి పర్యా. చూ. గెల. అరటి, అలచంద, పెసర మొ. వాటి కాయల గుది (తె. 11).

గొప్పు (-తవ్వు) పర్యా. తవ్వకం. మిరప, వంగ మొ. తోటల్లో కలుపుమొక్కలు తవ్వటం (కో. 39, 41, 43–49); -పైరు పర్యా. కలుప్పైరు. కలుపు తీయటానికి వీలైనంత ఎత్తుగా పెరిగిన పైరు (కో.).

గొరిసె చూ. గురుజ (తె. 4, 6).

గొల[1] (-వేయు) చూ. గెల (కో. 10, 43; తె. 1, 6–12, 29, 32–38; రా. 9, 16, 21, 25–28).

గొల[2] పర్యా. చూ. కవుటు. పొగచెట్టు ఆకులు పెరగటానికి తుంచిన తలపూత (తె. 22).

గొలుసు (-వంచు) పర్యా. చూ. కంకి. జొన్న, సజ్జ మొ. వాటి గింజలగుత్తి లేక కంకి (తె. 24, 25).

గోడపిందె (-వేయు) పర్యా. చూ. పూపిందె. పెసర, వేరుసెనగ మొ. వాటి లేతకాయ (కో. 12).

చంక (-వెళ్ళు) మొక్కజొన్నదంటు కణుపు; ఒక్కొక్క కణుపుకు ఒక్కొక్క 'పొట్ట' ఏర్పడుతుంది (కో. 18, 19, 21, 24, 25; తె. 10, 11, 22, 24, 27, 29, 39); -పాప (-పెట్టు) మొక్కజొన్న దంటు కణుపుదగ్గర పెట్టే పొట్ట; చూ. పొట్ట (కో. తె.); -పిల్ల (-వేయు) చూ. -పాప (తె.); -పీచు (-వెళ్ళు) చూ. -పాప (కో. తె.).

చంకనం ఉ. సంకనం (-పెట్టు); పర్యా. చూ. కనె. పొగమొక్క తలచెండు గిల్లిన తరవాత పుట్టే చిగురు; కాడకు, ఆకుకు మధ్యపుట్టే పిలక (తె. 6, 7, 10).

చట్టు[1] (-పట్టు, -పడు, -వేయు) ఉ. జట్టు, సట్టు; రూ. తట్టు; పర్యా. కదురుపిందె, తోలుకాయ, పలుపు. అలచంద, కంది మొ. వాటి గింజపట్టనికాయ; తోలుకాయ (తె. 1, 2, 5, 7, 14, 29, 31, 32, 36, 38; రా. 9).

చట్టు[2] నూరు తమలపాకుల బొత్తి (రా. 17, 23).

చట్టు[3] (-దిగు) పర్యా. ఊడ. వేరుసెనగ మొ. వాటి

కొమ్మలకు పుట్టి నేలలో పాతుకొనే వేరు; దీనికి కాయలు కాస్తాయి (రా. 28).

**చప్పరం** పర్యా. చూ. పందిరి. తీగెలకు అల్లుగా పెట్టిన కప్పు; మంచెపైన వర్షం పడకుండా వేసిన కప్పు. చూ. చిత్రం 35 ట. 1 (కో. 31).

**చాకేకు** (<చాకి+ఆకు) మంచిరకం తమలపాకు (కో. 3).

**చాటి** పర్యా. చూ. చెటాల్‌మోకు. మొదలు లావుగాను, చివర సన్నంగాను ఉండే మోకు; దీన్ని మోగిస్తే ఆ చప్పుడుకు పైరుతినే పిట్టలు పారిపోతాయి (రా. 15).

**చిగురు** (1) (-పెట్టు, -వేయు) రూ. ఇగురు. పొట మరించే ఆకు; లేతాకు (కో. 16, 17, 20, 21, 25; తె. 11; రా. 4, 5, 7, 22, 25); **-పొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఆకువిడవకుండా ఎన్నులేర్పడే దశ; పైకి కనబడని ఎన్ను (కో.); (2) (-మోపు) పర్యా. చూ. పొట్ట. ఏర్పడుతున్న ఎన్ను (కో. 21); (3) పర్యా. చూ. కసె. పొగచెట్టు 'చెండు' గిల్లిన తరవాతవేసే చిగురు (కో. 43, 44).

**చిత్త** (-పట్టు) పర్యా. చూ. సుంకు. కంకిమీద నూగు నూగుగా పట్టిన పూత (కో 50).

**చిప్ప** పర్యా. అట్టి, కుడక. వడిసెలలో రాయిపెట్టే చోటు చూ. చిత్రం 38. 1 (రా. 18, 21, 28).

**చిరిపొట్ట** పర్యా. ఆకుపొట్ట, ఆదిపొట్ట, ఈచపొట్ట, కరుకుపొట్ట, కుతికెపొట్ట, చిగురుపొట్ట, నారుపొట్ట, ముల్లుపొట్ట, మొనపొట్ట, సన్నపొట్ట, సూదిపొట్ట. ఆకు విచ్చకుండా ఎన్నులేర్పడే మొదటిదశ; గర్భస్థమైన ఎన్ను (కో. 13, 14, 19, 22, 26-29, 32, 33, 35-37, 40, 44-51; తె. 41).

**చిలిపిడత** (<చిలిపి+పిడత) పర్యా. చూ. దిష్టికుండ. పంటకు దిష్టితగలకుండా ఉండటానికి సున్నపుబొట్లుపెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ (కో. 38, 46).

**చిలిపిబొమ్మ** పర్యా. చూ. దిష్టిబొమ్మ. పంటకు దిష్టి తగలకుండా పొలంలో నిలబెట్టిన గడ్డిబొమ్మ (కో. 15).

**చిల్ల** (1) (-ఊరు, -ఏరు) పర్యా. పన్నె. నేలలో వేరు నంటుకొని పెరిగే పసుపుకొమ్ము (కో. 19, 22); (2) (-వేయు) పర్యా. చూ. గంట. పక్కపిలక; మొక్క చుట్టూ మొలిచే పిల్ల(లు) (తె. 40).

**చుక్కాకు** పర్యా. చూ. గరేకు. ఒత్తుగా పెరిగిన ఆకు(లు); వీటిని కోస్తేనేగాని మొక్క బాగా పలించదు (కో. 17, 21-23).

**చూడి** ఉ. సూడి; పర్యా. చూ. పొట్ట. ఏర్పడుతున్న ఎన్ను; ఆకులు ఆవరించి ఉబ్బెత్తుగా కనబడే ఎన్ను (కో. 30).

**చెటాల్‌మోకు** ఉ. చిటాలుమోకు, చిపేలుమోకు, సిటాల్‌మోకు, సిపేల్‌మోకు, సెటాల్‌మోకు; పర్యా. ఈరదాడు, చాటి, చెండు², పెటకోల, పెటాకోల, పెటాల, పెటాల్‌మోకు, పెపేల్‌మోకు, పెడీలు. మొదలు లావుగాను, చివర సన్నంగాను ఉండేమోకు; దీన్ని మోగిస్తే ఆ చప్పుడుకు పైరుతినే పిట్టలు పారిపోతాయి (కో. 14, 15, 18, 23, 29, 35; తె. 40).

**చెట్టుగట్టు** (-కట్టు, క్రి.) మొక్కపక్క కొమ్మలతోను, పిలకలతోను గుబురుగా రావటం (కో. 6, 18, 21-24, 29; తె. 33; రా. 3, 4, 21-23, 26, 28).

**చెండు**[1] (1) (-వేయు) వేరుసెనగకాయల గుత్తి (రా. 21, 24); (2) (-కట్టు, -కొట్టు, -వెయ్యు) పర్యా. చూ. కవుటు. పొగాకుమొక్క తలమీద పూచే పూత; తలకంకి; దీన్ని గిల్లి వేస్తారు (కో. 9-12, 29, 32, 35, 39; తె. 3, 35, 36; రా. 21).

**చెండు**[2] పర్యా. చూ. చెటాల్‌మోకు. చెటాలున మోగించి పొలంలో పిట్టలను తోలే మోకు (కో. 21, 22).

**చెలప(నాటు)** ఉ. సలప; పర్యా. ఉల్లడి. వాలిపోయిన మొక్కల్నిగాని, ఒత్తుగాఉన్న మొక్కల్నిగాని తీసి అక్కడక్కడ తిరగనాటటం; ఒకచోట 'చెలప'అంటే కయ్యలోఉన్న పల్లపుభాగం (కో. 2, 4-6, 9, 25; రా. 17, 27).

**చేతేత** (<చేతి+వేత) నాగటిచాళ్ళలో గింజలు చేత్తో చల్లటం (కో. 29, 33, 43, 45; తె. 1, 2, 5, 7, 8, 11, 14, 16, 20, 24-27, 29, 32-34, 36-40, 44; రా. 9).

**జల్లికంకి** పర్యా. అరగడి, రెళ్ళకంకి. రెళ్ళు (గింజలకు ఆధారంగాఉన్న సన్నటి కాడలు), వదులుగాఉన్న కంకి (కో. 9, 11, 14, 18-20, 23-25; తె. 17, 20, 21, 23-28, 30, 31, 40).

**జల్లు** (-విడుచు) పర్యా. చూ. దాసరెన్ను. మొక్కజొన్నకంకి నెత్తిపైవేసే పీచు (తె. 22, 24, 28).

**జాడు** కంకివెయ్యని జొన్న మొ. వాటి దంటు; దీన్ని పశువుల మేతగా ఉపయోగిస్తారు (కో. 3, 6, 13, 14, 30, 32, 36; తె. 10); **-జాడాకు** పర్యా. వగుదాకు, ఎండిన జొన్న ఆకు (కో.).

**జిష్టికుండ** చూ. దిష్టికుండ (కో. 25).

**జిష్టిబొమ్మ** ఉ. జిట్టిబొమ్మ; చూ. దిష్టిబొమ్మ (కో 25; తె. 24).

**జీబి** అరటిగెలలోఉన్న కాయల పెడ (కో. 5).

**జీబు** పర్యా. చూ. అల్లవ. తీగెలు అల్లుకోటానికి దోహదంగా పెట్టే దడి (రా. 16, 17).

**జోబడి** పర్యా. చూ. మంచె. పైరురక్షణకు చేలో గుంజలుపాతి పైన తడికెవేసి కట్టిన అరుగు; కూర్చోటానికి మాత్రమే కట్టిన చిన్న మంచె. చూ. చిత్రం 35 చ (రా. 3).

**తటుంగి** చప్పుడుచేసి జంతువులను బెదరగొట్టటానికి టొంగుచీల్చి కట్టినయంత్రం. చూ. చిత్రం 37 (తె. 42).

**తట్టు** (-పట్టు, -వేయు) చూ. చట్టు[1] (తె. 9-11, 14; రా. 8, 17, 18) ; **-కాయ** చూ. తట్ట (రా.).

**తండు** (-వేయు)? పర్యా. చూ. తీగె. ఉలవ, వేరు సెనగ, అలచంద, అనుము, పెసర మొ. పైర్లువేసే తీగె (కో. 23).

**తన్నీరు** ? పర్యా. చూ. పులక (తడి). గింజలుచల్లిన తరవాత ఒకపూట మాత్రమే పెట్టేనీరు (తె. 27).

**తమరు** (-సాగు) పర్యా. చూ. కొమ్మ. చెట్టుకువేసే పక్కకొమ్మ ; పంగ (రా. 3-5); **-కట్టె** ఉ. తమిరకట్టె; పర్యా. చూ. రాగోల (కట్టె). ముళ్ళకంపలు ఎత్తటానికి ఉపయోగించే పంగలకర్ర (రా.).

**తల** (-కొట్టు, -వంచు) పర్యా. చూ. అర్రు, కవుటు. (1) కంకితోగూడిన పైరు పైభాగం; (2) పొగచెట్టు తలపై పూచేపూత; దీన్ని గిల్లివేస్తారు (కో. 37, 47-51 ; తె. 1, 4-6, 9, 13, 24, 27-29, 35-39, 42 ; రా. 5, 8) ; **-గొమ్మ** (-కొమ్మ) ఉ. తలగొమ్మ ; పర్యా. చూ. కవుటు. పొగచెట్టు ఆకులు పెరగటానికి తుంచిన తలపూత (తె.) ; **-జుట్టు** పర్యా. చూ. దాసరెన్ను. మొక్కజొన్న కండెపై పీచు ఏర్పడటానికి మూలమైన ఎన్ను (తె.) ; **-పూత** చూ. తలగొమ్మ (తె.) ; **-సుడి** (-పెంచు) చూ. -జుట్టు (తె.) ; **-తలెన్ను** (-వేయు) చూ. -జుట్టు (తె.).

**తవ్వకం** ఉ. తవకం, తొవ్వకం, తోకం; (-పెట్టు) (వాడుక: తవ్వటం, తవ్వడం, తవ్వుటం) రూ. తవ్వాటం; పర్యా. గొప్పు. మిరప, జొన్న మొ. తోటల్లో గడ్డిగాదం పోవటానికి, భూమి గుల్లగా ఉండటానికి పారతో తవ్వటం (కో. 5, 8; తె. 29, 32-34 ; 37, 38, 42 ; రా. 8).

**తవ్వాటం** ఉ. తొవ్వాటం; చూ. తవ్వకం (కో. 1, 2).

**తానకం** చూ. తానం (కో. 16, 22).

**తానం** (-చేయు) రూ. తానకం ; పర్యా. చూ. పాదు. మొక్కనాటి నీళ్ళు నిలవటానికి చుట్టూరాకట్టిన పళ్ళెం (రా. 9).

**తారిపోవు** (క్రి.) పర్యా. కువిదపోవు. పండి ముదిరిన గింజలు ఎండటం (కో. 15 ; తె. 13 ; రా. 1, 17, 18, 20).

**తాళ్ళకట్టువ** పర్యా. చూ. కోరడ. చేనిచుట్టూ వేసిన ఈటిచెట్లకంచె (కో. 21).

**తినగాయ** (-అగు) పండబారినకాయ (వేరుసెనగ, ఉలవ, పెసర, అలచంద, కంది మొ. పైర్లనుగురించి చెప్పేటప్పుడు) (తె. 3, 4, 6, 12, 29, 32, 37 ; రా. 3, 9, 12, 15, 18, 21-25, 27, 28).

**తినగింజలు** పర్యా. చూ. పిసికిళ్ళు. తినటానికి అనువుగాఉండే (జొన్న మొ. వాటి) పాలగింజలు ; ముదిరీ ముదరని గింజలు (రా. 7, 27).

**తిరగబడు** (క్రి.) మాగాణిలోగాని, తోటలోగాని నాటిన నారు (మొలకలు) వేరుబట్టి బతకటం (కో. 26-28, 34, 35 ; తె. 6, 40).

**తిరగబారు** (క్రి.) పర్యా. చూ. పండు. పైరు పూర్తిగా ఫలించటం (కో. 16 ; రా. 7).

**తీగె** ఉ. తీగ (-పాకు, -వచ్చు, -వెళ్ళు, -వేయు) పర్యా. తండు, రీట. ఉలవ, వేరుసెనగ, అలచంద, పెసర, మొ. పైర్లువేసే తీగె (కో. 1-51 ; తె. 1-7, 9-12, 14, 20-26, 29-39, 42 ; రా. 2, 3, 6-28) ; **-తీగైకు** ఉ. తీగాకు ; పర్యా. పాపటాకు. కణుపులదగ్గర పుట్టే తమలపాకు (కో. రా.).

**తుకం** (<హిం. తుఖమ్, తుఖ్మ = గింజ, జీవాణువు) (-పోయు) పర్యా. చూ. నారు. నాటటానికి పోసిన వరి, మిరప మొ. వాటి మొలకలు ; కొన్నిచోట్ల నారుమడికి గూడా 'తుకం' అనే వాడుక (తె. 1, 2, 5, 7, 8, 10-16, 20, 35, 36 ; **-మడి** పర్యా. చూ. నారుమడి. నారు పోసిన భూభాగం (తె.).

**తుట్టె** కొన్ని రేగితుప్పలు చేర్చి పెట్టినపోగు (కో. 8, 9).

**తురాయి** (-విడుచు) పర్యా. చూ. దాసరెన్ను. మొక్కజొన్న తలపైఉండే పీచుకు మూలమైన ఎన్ను ; మొక్కజొన్న కండెపై పీచు (తె. 10, 11).

**తెట్టె(గోడ)** పర్యా. మదురు. చేనిచుట్టూ రక్షణకు రాళ్ళుపేర్చి పెట్టినగోడ (కో. 8-11, 24 ; తె. 37 ; రా. 8, 9, 14, 18).

**తొడుగు** ఎద్దులు లాక్కురావటానికి వీలుగా పేర్చిన రేగు, తుమ్మ మొ. ముళ్ళకంపలపోగు (కో. 1, 3, 6-9, 11, 14, 18-25, 28 ; తె. 38 ; రా. 1).

**తొండముక్కువారు** (క్రి.)? పర్యా. చూ. పండు. కంకి కొస గింజలు ముదరటం (తె. 5).

**తొలికలుపు** రూ. తొల్తకలుపు ; పర్యా: కన్నెకలుపు, తొలిగాబు, దోరకలుపు, పారకలుపు, ముందుకలుపు, లేత కలుపు, దూటం, సవుటం. నారుమడిలో తీసే కలుపు ; కొన్నిచోట్ల నారునాటుకొన్న తరవాత తీసే మొదటికలుపు ; చూ. కలుపు (కో. 26 ; రా. 2, 3, 5, 6, 13, 26).

**తొలిగాబు** పర్యా. చూ. తొలికలుపు. నారుమడిలో తీసే కలుపు ; చూ. కలుపు (కో. 44, 48).

తొలిగొప్పు పర్యా. పరగ్గొప్పు. మిరప, వంగతోటల్లో మొదటిసారిగా కలుపు మొక్కలు మొ. వాటి తవ్వకం (కో. 39, 44, 45).

తొొల్తకలుపు చూ. తొలికలుపు (తె. 25).

తోకాకు సన్నగా పొడుగ్గాఉండే పొగాకు (కో. 10, 11).

తోపు బండిమీద పేర్చిన కంపమండలపోగు ; కంది కట్టె, చొప్ప మొ. వాటి కుప్ప (కో. 8).

తోలుకాయ (-పెట్టు) పర్యా. చట్ట. ఆలమంద, కంది మొ. వాటి గింజపట్టని కాయ (కో. 43, 45).

దడి (-కట్టు, -పెట్టు) పర్యా. అలవ, ఇలారం. పొలంచుట్టూ రక్షణకుకట్టిన వెదురుబద్దల కంచె (కో. 16 ; తె. 20-26).

దంటు ఉ. దొంట (-కట్టు) పర్యా. కఱ్ఱ, దబ్బ, దవ్వ, మోదు, లొట్ట. జొన్న, సజ్జ, రాగి మొ. పైరు మొక్క కాడ ; నేలనుంచి ఎన్నుదాకా ఉన్న మొక్కభాగం (కో. 1, 3-5, 7, 8, 11-14, 23, 25, 27, 28, 30, 31 ; తె. 3-11, 14, 29, 30, 32-42 ; రా. 3, 16-22, 24, 26).

దబ్బ (-కట్టు) చూ. దవ్వ (రా. 15, 21, 25).

దవర (-కు వచ్చు)? చూ. దోర (కో. 30).

దవురాకు మేతకు సరిపడే ఎత్తుపెరిగిన పైరు (కో. 47, 48).

దవ్వ రూ. దబ్బ ; పర్యా. చూ. దంటు. జొన్న, సజ్జ, రాగి మొ. పైరుమొక్కలకాడ ; నేలనుంచి ఎన్నుదాకాఉన్న మొక్కభాగం (కో. 38).

దాసరెన్ను (-వెళ్ళు) పర్యా. జల్లు, తలజుట్టు, తల సుడి, తలెన్ను, తురాయి. మొక్కజొన్న పైరులో కండె నెత్తిపైమొలిచే పీచుకు మూలమైన ఎన్ను (కో. 14, 18-24 ; తె. 10, 12, 32, 37).

దిమ్మె (-కట్టు) పర్యా. చూ. గంట. పక్కకొమ్మలు వేసి మొక్క గుబురుగావచ్చే స్థితి (కో. 6).

దిష్టికుండ ఉ. దిట్టికుండ, దిస్టికుండ, దుష్టికుండ ; రూ. జిష్టికుండ ; పర్యా. చిలిపిడత, బలిపిడత, బెదురు కుండ, సీతకుండ, సీతపుకుండ, సీతవకుండ. పంటకు దిష్టితగలకుండా ఉండటానికి సున్నపుబొట్లు పెట్టి కఱ్ఱకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ (కో. 7, 9, 17-19, 22-25, 40, 41, 43, 45, 48, 51 ; రా. 7-9).

దిష్టిబొమ్మ ఉ. దిట్టిబొమ్మ, దుష్టబొమ్మ ; రూ. జిష్టి బొమ్మ ; పర్యా. ఏజీపుగాడు, చిలిపిబొమ్మ, బెదురుబొమ్మ. పైరుకు దిష్టితగలకుండా పంటపొలంలో నిలబెట్టిన గడ్డి బొమ్మ ; దీన్నిచూసి కొన్నిజంతువులు బెదురుతాయికూడా (కో. 6, 8-14, 16-20, 22-24, 37, 40, 43, 45, 46, 48, 50, 51 ; తె. 26 ; రా. 2, 22).

దుక్కిచాలుపైరు చాళ్ళ పొడుగునా తలెత్తిన పైరు (రా. 9).

దుబ్బు ఉ. దుబ్బ (-కట్టు, చిట్లు, -చేయు) పర్యా. చూ. గంట. పక్కకొమ్మలు, పిలకలువేసి మొక్క గుబురుగా వచ్చే స్థితి (కో. 13-19, 21-23, 25-29, 36, 40, 44, 46-50 ; తె. 39-41).

దూటం ఉ. దూట (-కొట్టించు) పర్యా. చూ. తొలి కలుపు. నారుమడిలో తీసే కలుపు; చూ. కలుపు (తె. 12, 17, 27).

దొయ్య పర్యా. చూ. మడి. నారుపోసిన నలచదరపు భూభాగం (తె. 23, 24).

దోనేకు వెడల్పుగాఉండే పొగచెట్టు ఆకు; చూ. తోకాకు (కో. 10).

దోర (-పడు) రూ. దవర. కాయ పండబారిన దశ ; గింజలు ముదిరీ ముదరని స్థితి ; (విణ.) లేత- (కో. 24; 26, 27, 29, 32, 35, 36, 41, 43, 45 ; తె. 3, 8, 11, 12, 31, 33, 40, 42; రా. 10, 23, 25); -కలుపు పర్యా. చూ. తొలికలుపు. నారుమడిలో తీసే కలుపు ; నాట్లు వేసిన తరవాత తీసే మొదటికలుపు (కో.) ; -గాయ (-కాయ) (-అగు) పర్యా. తినగాయ, పల్లగాయ, ముఱ్ఱు గాయ, మొవ్వకాయ. పండబారిన (వేరుసెనగ, అలచంద, కంది, పెసర మొ. వాటి) కాయ (కో. తె. రా.).

దోరు (-పెట్టు) రేగు, తుమ్మ మొ. ముళ్ళకంపలతో పెట్టే అడ్డం (తె. 50).

నఖరె ఉ. నకిరె (-కు వచ్చు) పర్యా. పూత. కాయ లేర్పడటానికి ముందుపూచే పూలు (తె. 18, 22, 23, 27).

నన (-వేయు) తమలపాకు తీగవేసిన ఇగురు (కో. 3).

నలి[1] ఉ. నల (-ఏరు) పర్యా. చూ. గడ్డి. పైరులో మొలిచిన గడ్డి, కలుపు, మొక్కలు, ఎండుపుల్లలు మొ. వి; వీటిని తీసివేస్తేనేగాని పంటకు సత్తువఉండదు. (కో. 12 ; తె. 11, 20).

నలి[2] (-వేయు) పర్యా. చూ. కనె. పొగచెట్టు తల పైని చెండు (పూత) గిల్లిన తరవాత పుట్టే చిగురు (తె. 9).

నవురు పర్యా. చూ. పొట్ట. ఏర్పడుతున్న ఎన్ను(లు); ఆకులు ఆవరించి ఉబ్బెత్తుగా కనబడే ఎన్ను (కో. 47, 50).

నాగటిపోత పర్యా. నాగఛేత. నాగలి వెంటనే చాళ్ళలో పడేట్టు విత్తనాలు చల్లటం (తె. 21, 22, 28).

నాగఛేత పర్యా. నాగటిపోత. నాగలివెంటనే చాళ్ళలో పడేట్టు విత్తనాలు చల్లటం (కో. 27, 28, 34-36 ; తె. 31).

**నాటు** (క్రి. వి. విణ.) పర్యా. ఉడుచు, ఉనుచు. ఉభా, ఊడ్చు. వరి, మిరప మొ. వాటి నారు (మొలకలు) చాళ్ళలో నాటటం; నాటుపని; నాట్లకు సంబంధించిన- (కో. 1-3, 5, 6, 8, 9, 11, 13, 19-21, 24, 26-29, 33, 39, 41, 43, 45; తె. 1, 2, 5-8, 11-16, 20, 24-27, 29-39; రా. 1-11, 13, 19-28); **-కలుపు** నారు నాటుకొన్న తరవాత తీసే మొదటికలుపు; కొన్నిచోట్ల మూడోకలుపు(తె. రా.); **-కొను** పర్యా. చూ. ఏనుకొను. మాగాణిలాగాని, తోటలోగాని నాటిననారు వేరుబట్టి బతకటం (కో. రా.).

**నాము**[1] (-వచ్చు) మోకాటిఎత్తున పెరిగిన జొన్న; జొన్న యిగురు; దీన్ని మేస్తే పశువులకు 'ఉంగిడి' అనే వ్యాధివస్తుంది (కో. 6, 9, 14, 25, 27, 29, 31, 32; తె. 40, 41).

**నాము**[2] (-వెళ్ళు) అప్పుడే పైకివస్తున్న మొలక (తె. 24).

**నార** (-చల్లు, -పీకు, -పోయు) చూ. నారు (తె. 5, 19; రా. 1, 3, 14).

**నారపొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఎన్ను లేర్పడుతున్న దశ (కో. 3, 5, 6, 15).

**నారు** (-కట్టు, -నాటు, -పోయు) రూ. నార, నేరు; పర్యా. ఆకు. తుకం, మొలక, ససి. పొలంలో నాటటానికి పెంచినవరి, మిరప మొ. వాటి మొలకలు; కొన్నిచోట్ల వంగ, మిరప, పొగ మొలకలకు 'నారు' అనీ, వరి మొలకలకు 'ఆకు' అనీ వాడుకలో భేదం; మరికొన్నిచోట్ల 'నారు, ఆకు' పూర్తిగా పర్యాయపదాలు (కో. 1-3, 5, 6, 8, 9, 11-14, 18-22, 24-33, 35, 36, 39, 41, 43-45, 51; తె. 7, 9, 11, 13, 19, 20, 23-29, 31-33, 37-40, 42; రా. 7, 8, 11, 15, 25-27); **-నారడుగు** చూ. -మడి (కో.); **-కయ్య** చూ. -మడి (కో. రా.); **-దొయ్య** రూ. నేరుదొయ్య చూ. -మడి (తె.); **-మట్టు** చూ. -మడి (కో.); **-మడి** పర్యా. ఆకుబట్టి, ఆకుమడి, తుకంమడి, నారడుగు, నారుకయ్య, నారుదొయ్య, నారుమట్టు. నారుపోసిన నలుచదరపు భూభాగం (కో. తె.);

**నిండుపొట్ట** పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులు విడబడి ఎన్నులు పైకికనబడే ముందున్నదశ; ఈనటానికి సిద్ధమైన పొట్ట; చూ. పొట్ట (కో. 43).

**నీక్షేకు** వెడల్పుగాఉండే పొగాకు (కో. 14).

**నూగు** పర్యా. చూ సుంకు. కంకిమీద నూగునూగుగా పట్టినపూత (కో. 28, 29, 32, 33, 35; తె. 41; రా. 17-21).

**నూటు** పర్యా. చూ. గాతం. చేనిచుట్టూ రక్షణకు కంప పాతటానికి తీసినగాడి (కో. 16, 24).

**నెగడి** (బహు. నెగళ్ళు) పైరు పాడుచేసే జంతువులు బెదిరిపోవటానికి పెట్టేమంట (కో. 30).

**నెరగోలకట్టె** పంగలుగా రెండుపుల్లలు కట్టిన వెదురు కర్ర; కంపమండలుతీసి కంచెగా వెయ్యటానికి ఉపయోగిస్తారు; చూ. రాగోల(కట్టె) (రా. 12).

**నేరు** చూ. నారు (తె. 22); **-దొయ్య** చూ. నారుదొయ్య (తె.).

**పగిరె** చూ. పైరు (రా. 2, 4-8, 14).

**పగులుపొట్ట** పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులు విడబడి కంకివెళ్ళే ముందున్న పైరుదశ; ఈనటానికి సిద్ధమైన పైరు (కో. 2, 21, 22, 25).

**పంగ** (-పగులు) పర్యా. పాయ. చెట్టుకువేసే పక్కకొమ్మ (కో. 24; తె. 2-11, 14, 29, 32-36; రా. 18, 21).

**పంగలకట్టె** ఉ. పంగాలకట్టె; పర్యా. చూ. రాగోల (కట్టె). ముళ్ళకంప ఎత్తటానికి ఉపయోగించే పంగలకర్ర (కో. 2, 3; రా. 9, 14).

**పట్టు** పర్యా. చూ. ఒడప. అరటిచెట్టు బోదెకున్న పొర (రా. 9).

**పట్టా ?** అంటుబతికి చిగిర్చిన మొక్క (రా, 23).

**పండు** (క్రి.) పర్యా. తిరగబారు, తొండముక్కువారు, పండుబారు, మక్కు, మాగు, ముగ్గు, ముదురు. గింజ గట్టిగా ముదిరి పైరు కోతకు సిద్ధంకావటం; పైరు ఫలించటం (కో. 18, 21, 22, 29, 39, 41, 43, 45, 47; తె. 1-3, 9, 31, 32, 35; రా. 4-6, 8, 10, 21, 23-27); **-బారు** చూ. పండు (కో. తె. రా.).

**పనబారు** (క్రి.) అల్లం, చేమ, పసుపు మొ. మొక్కలు పెరిగేటప్పుడు నేలలో దుంప ఊరటం; పన=కొమ్మ (కో. 3).

**పందిరి** ఉ. పందిరె; రూ. పందిలి; పర్యా. అట్టవ[2], చప్పరం. తీగెలకు అల్లుగా పెట్టిన కప్పు (కో. 50; తె. 25, 26, 28; రా. 11, 14, 19, 21, 22, 28).

**పందిలి** చూ. పందిరి (తె. 16, 23, 24, 27; రా. 7-9, 12, 18, 23-27).

**పన్నె** (-కట్టు)? పర్యా. చూ. గంట. పక్కకొమ్మలు, పిలకలువేసి మొక్క గుబురుగావచ్చే స్థితి (కో. 8).

**పప్పు** పర్యా. చూ. మొవ్వ. మెత్తగాఉండే ఎన్నుపై కొన (రా. 18-25); **-పిందె** పర్యా. చూ. పూపిందె. లేత కాయ (రా.).

**పబ్బు** పర్యా. చూ. ఆల్లవ. తీగెలు అల్లుకోటానికి దోహదంగాపెట్టే ఏదడిగాని, నిలువుకొయ్యలుగాని (తె. 1, 23-28, 32, 36).

**పయురు** ఉ. పయర; చూ. పైరు (రా. 7).

**పరగ్గొప్పు** (? పరక + గొప్పు) పర్యా. చూ. తొలి గొప్పు. తోటల్లో కలుపుమొక్కల మొదటితవ్వకం (కో. 43).

**పలగడ** ఉ. పలగడి; పర్యా. చూ. పెండెం. పొలం చుట్టూ వేసిన కంచెకు కొయ్యలతో అమర్చిన ద్వారం; ఇటువంటిది ఇంటికి, దొడ్డికిగూడా ఉండవచ్చు (కో. 19; తె. 1).

**పలుపు** (-కట్టు) పర్యా. చూ. చట్ట. అలచంద, కంది, పెసర మొ. వాటి గింజపట్టని కాయ (తె. 4).

**పల్లగాయ** ఉ. పల్లకాయ(-అగు); పర్యా. దోరగాయ. వేరుశెనగ, అలచంద, ఉలవ మొ. పైర్ల పండబారినకాయ (రా. 23, 26, 28).

**పాదు** ఉ. పాది (-కొట్టు, -చేయు) పర్యా. కుండ, తానకం, తానం, బోదె. చెట్టుచుట్టూ నీళ్ళు నిలవటానికి నేల గుల్లచేసి కట్టిన పళ్ళెం (కో. 1-14, 26-29; తె. 7, 19, 23-28; రా. 2, 7).

**పాపటాకు** ఉ. పాపడాకు; పర్యా. తీగ్గేకు. (1) కణుపులదగ్గర పుట్టిన తమలపాకు; (2) ముదురాకు (కో. 3, 22, 32; రా. 23, 24).

**పాపనం** పైరులో మొలిచిన గడ్డి, కలుపుపోవటానికి 'పాపటం' తోలటం (రా. 18, 21, 25).

**పాయ** (-విడుచు) పర్యా. పంగ. చెట్టుకువేసే పక్కకొమ్మ (తె. 4).

**పారకలుపు** ? పర్యా. చూ. తొలికలుపు. నారుమడిలో తీసే కలుపు; మొదటికలుపు (రా. 16, 19).

**పాల** (-తీయు) పర్యా. చూ. కవుటు. పొగచెట్టు కాడకు, ఆకుకు మధ్యవేసే పిలక; దీన్ని గిల్లితేనేగాని ఆకు బాగా పెరగదు (కో. 9).

**పాలకొన** నాటిన తమలపాకు తీగెకు పుట్టే చిగురు (కో. 3, 16, 17, 22).

**పాలు** (-కట్టు, -కొను, -తాగు, -పోసుకొను, పాలకు ఉరుకు) పర్యా. ముర్రు. గట్టిపడక ముందుగింజలో ఏర్పడుతున్న సారం (కో. 1-38, 40-51; తె. 5-42; రా. 2-6, 8-12, 16-28); **-పాలుబ్బలు** పర్యా. చూ. పిసికిళ్ళు. పాలుపట్టి ఇంకా ముదరని గింజలు; ఇవి తినటానికి రుచిగా ఉంటాయి (కో. తె.).

**పిగులుపొట్ట** ఉ. పిగురుపొట్ట; పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులువిడబడి కంకి వెళ్ళేముందున్న స్థితి; ఈనటానికి సిద్ధమైన పైరు (కో. 21, 22, 25, 37, 40, 46-51).

**పిచ్చ** (-వేయు) పర్యా. చూ. గనుపు. చెరకుగడకు అక్కడక్కడ ఏర్పడే హద్దు; పర్వం (రా. 3, 6, 15).

**పిందె** ఉ. పింజె (-వేయు) అలచంద, కంది, పెసర మొ. వాటి లేతకాయ; పరువుకురాని కాయ (కో. 2, 3, 6-8, 11, 12, 14, 23, 24, 41, 43, 45; తె. 3, 6, 11, 12, 28, 32, 37, 38, 42; రా. 2, 3, 7, 8, 10, 12, 15, 18, 22-28).

**పిలక** (1) (-తీయు, -పెట్టు, -విడుచు) రూ. పిల్ల; పర్యా. చూ. కవుటు. పొగచెట్టుకాడకు, ఆకుకు మధ్యవేసే చిగురు; దీన్ని గిల్లితేనేగాని ఆకు సరిగా పెరగదు (కో. 11, 13, 17, 18, 20, 23-25); (2) (-వేయు) రూ. పిల్ల; పర్యా. చూ. కనె. తలకొమ్మగిల్లిన తరవాత పుట్టే ఒగురు (కో. 21, 29, 35); (3) (-పెట్టు, -పొడుచు) చూ. పిల్ల (కర్ర). చెట్టుకర్ర (బోదె, కాడ)కు వేసే పక్కకొమ్మ; మొక్కచుట్టూ మొలిచే చిన్నమొక్క (కో. 4, 21, 23); (4) (-వేయు) పర్యా. గుమ్మె, మోపు. అరటిచెట్టు చుట్టూ మొలిచే పిల్లమొక్క (కో. 3, 19, 20, 43).

**పిల్ల** (1) (-కొట్టు, తీయు, -విడుచు) చూ. పిలక (1) (తె. 1, 33, 35-39, 42); (2) (-వేయు) చూ. పిలక (2) (కో. 39; తె. 32, 33, 37, 38, 42); (3) (కొన్నిచోట్ల 'పిలకర్ర' అనికూడా వాడుక) (-వేయు) చూ. పిలక (3) (కో. 1, 21; తె. 17); (4) (-నాటు) పర్యా. చూ. అంటు. అరటి, నారింజ మొ. వాటి కొమ్మలకు కట్టిన అంటు (తె. 1, 2, 34).

**పిసికిళ్ళు** ఉ. పిసికెళ్ళు (-అగు); పర్యా. అటుకులు, అరకబియ్యం, ఉరిగింజలు, ఊచబియ్యం, కావిళ్ళు, తిన గింజలు, పాలుబ్బలు, పులిగింజలు. పాలుపట్టి ఇంకా ముదరని జొన్న, సజ్జ, మొ. వాటి గింజలు; ఇవి తినటానికి రుచిగా ఉంటాయి (తె. 1-3, 19; రా. 10, 12, 14-20, 22-25, 28).

**పీప** పర్యా. చూ. గగ్గి. గింజపట్టని జొన్న మొ. వాటి కంకి (తె. 13).

**పీలదంటు** పర్యా. చూ. ఊలదంటు. చప్పగాఉన్న (జొన్న)దంటు (రా. 24, 25).

**పుట్టుకలగర** పర్యా. చూ. పులక (తడి). నారుమడిలో మొదటిసారి పెట్టే తడి; చూ. కలగర (కో. 2, 5).

**పుట్టుకలుపు** పర్యా. చూ. మలికలుపు. పైరు పొట్ట బెట్టినప్పుడు తీసే కలుపు (తె. 11).

**పున్నీరు** ? పర్యా. పులక (తడి). గింజలు చల్లినతరవాత ఒకపూటమాత్రమే పెట్టే నీరు (తె. 27).

**పుబ్బం** (-విడుచు) అరటిచెట్టు వేసేపూత లేక ఎన్ను (రా. 9).

**పులక** (-పారు, పెట్టు) పర్యా. ?తన్నీరు. పుట్టుకలగర, ?పున్నీరు, పులకతడి, పులకనీళ్ళు. నారువేసిన

మూడోరోజు పెట్టే తడి; చల్లకం వరికి నాలుగోనాడో, అయిదోనాడో పెట్టే తడి (కో. 3-9, 14, 17, 21, 22, 25 ; రా. 26, 27); **-తడి, -నీళ్ళు** చూ. పులక (కో.).

**పులిగింజలు** పర్యా. చూ. పిసికిళ్ళు. పాలుపట్టి ఇంకా ముదరని గింజలు; తినటానికి రుచిగా ఉంటాయి (రా. 21).

**పులితడి** పర్యా. చూ. పులకతడి. నారు మొలిచిన తరవాత పెట్టే తడి; నారుమడిలో పెట్టే రెండో తడి (రా. 23; తె. 34).

**పుల్లపోటు** మిరప, వంగ మొ. తోటల్లో కలుపు మొక్కలు తవ్వటం (తె. 2).

**పువ్వు** ఉ. పూ, పూవు (-ఎక్కు, -ఏయు, -తొడుగు) పర్యా. చూ. సుంకు. కంకిమీద నూగునూగుగా పట్టిన పూత (కో. 37-44, 46-49 ; తె. 10, 11, 29, 31, 32; **-పువ్వారం** ఉ. పూవారం (<పువ్వు+ఆరం) (-పట్టు) చూ. పువ్వు (కో.).

**పూత** పర్యా. సఖరె. కాయ లేర్పడటానికి ముందు పూచే పూలు (కో. 1-11, 15, 20, 23-26 ; తె. 2-12, 14, 17-29, 32, 39, 42 ; రా. 2-28).

**పూన్చు** (క్రి.) మామిడిపెంకె, చింతవిత్తులు, మొ.వి నేలలో పూడ్చటం (తె. 6; రా. 6).

**పూపిందె** (-వేయు): పర్యా. గోదపిందె, పప్పుపిందె. లేతపిందె; పసరుపిందె (తె. 42).

**పూస** (-కట్టు) పర్యా. చూ. గనుపు. చెరకు, జొన్న, సజ్జ, మొ. మొక్కల దంటుకు అక్కడక్కడ ఏర్పడే అతుకు లేక హద్దు (కో. 18, 22 ; రా. 6, 12, 18).

**పెటకోల** ఉ. పెట్టకోల; రూ. పెటాకోల, పెటాల, పెడీలు; పర్యా. చూ. చెటాల్‌మోకు. చెటాలున మోగించి పొలంలో పిట్టలను తోలేమోకు (కో. 8, 9, 11, 12).

**పెటాకోల** చూ. పెటకోల (రా. 14).

**పెటాల** చూ. పెటకోల (తె. 32, 34).

**పెటాల్‌మోకు** ఉ. పెఛేల్‌మోకు; పర్యా. చూ. చెటాల్‌మోకు. చెటాలున మోగించి పిట్టలను తోలే మోకు (కో. 6, 22; తె. 37, 39, 42).

**పెట్లగొయ్య** పర్యా. చూ. పెట్లదిమ్మె. పంటచేలో పిట్టల్ని తోలటానికి మందుపెట్టి పేల్చే కొయ్యయంత్రం చూ. చిత్రం 36 (రా. 10).

**పెట్లదిమ్మె** రూ. మెట్లదిమ్మె; పర్యా. పెట్లగొయ్య. పంటచేలో పిట్టల్ని తోలటానికి మందుపెట్టి పేల్చే కొయ్య యంత్రం. చూ. చిత్రం 36 (కో. 11, 13, 18-22 ; తె. 2 ; రా. 8, 11, 18, 19).

**పెడీలు** చూ. పెటకోల (తె. 1, 7, 35, 36).

**పెండెం** ఉ. పెండె (-కట్టు) పర్యా. పలగడ, పెనగాడి. పొలంచుట్టూ వేసిన కంచెకు కొయ్యలతో అమర్చిన ద్వారం (కో. 18, 21, 44 ; రా. 2, 7).

**పెద్దపొట్ట** పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులు విడబడి కంకి వెళ్ళే ముందున్నదశ; ఈనటానికి సిద్ధమైన ఎన్ను (కో. 32, 49 ; తె. 23).

**పెనగాడి** ఉ. పెనగడి; పర్యా. చూ. పెండెం. పొలంచుట్టూ వేసిన కంచెకు కొయ్యలతో అమర్చిన ద్వారం (తె. 35, 42).

**పెన్నె** (-ఊరు) పర్యా. చిల్ల(1). నేలలో వేళ్ళను బట్టి పెరిగే పసుపుకొమ్ము (రా. 26).

**పైరు** రూ. పగిరె, పయర; పర్యా. అంశం, ఆద, సస్యం. పచ్చగా పొలమంతటా లేచిన మొక్కలు; పచ్చి పొలం (కో. 1-51 ; తె. 3, 4, 7-9, 30, 37, 41 ; రా. 1, 3, 9-13, 15-28).

**పైచాలు** ఉ. పైసాలు (-తోలు) పైరులో కలుపు మొక్కలు గుంటకతో తీయటం (తె. 3, 4, 33 ; రా. 9, 18, 25).

**పొటాకు** ఉ. పుటాకు: రూ. పొట్టాకు; పర్యా. చూ. కోటాకు. పైరు పొట్టపై నిటారుగా మొలిచిన ఆకు (కో. 9-20, 22-25 ; తె. 3, 37, 39, 40).

**పొట్ట** (-తగులు, వేయు) పర్యా. గర్బం, చిగురు, చూడి, నవురు. ఏర్పడుతున్న ఎన్ను; ఆకు మరుగున ఉబెత్తుగా కనబడే ఎన్ను (కో. 1-20, 22-46, 48, 49, 51 ; తె. 4-42 ; రా. 1-6, 9-12, 14-18, 21-28); **-కరుకు** పైరు పొట్టపెట్టే దశ (రా.): **-కలుపు** ఉ. పొట్ట గలుపు. పైరు పొట్టపెట్టిన తరవాత తీసే కలుపు; రెండో కలుపు (తె. రా.): **-కారు, -తైపు, -గర** చూ. -కరుకు (కో. తె.): **-పొట్టాకు** చూ. పొటాకు (కో. తె.).

**పొడ** (-పారు,/-బారు,-వేయు) పొగచెట్టు కోతకువచ్చే ముందు ఆకుమీద పుట్టేమచ్చ; ఇది పచ్చగాను, ఎర్రగాను ఉండవచ్చు (కో. 10, 11, 18, 20, 21, 23, 24 ; తె. 9, 32, 33, 35, 37, 38, 42 ; రా. 23, 24; తె. 9, 32, 33, 35, 37, 38, 42 ; రా. 23, 24, 26, 28).

**పొరాకు** పర్యా. చూ. కోతైకు. పైరు పొట్టపై నిటారుగా పుట్టిన ఆకు (తె. 29, 31).

**పొలిక** పర్యా. ఈనె. దంటుపై పొర (గట్టిగాఉన్న భాగం) (తె. 10, 11).

**బడిపొట్ట** పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులు విడబడి కంకివెళ్ళే ముందున్న పైరుదశ; ఈనమోపిన మొక్క దశ; ఆకులమరుగున ఉబ్బెత్తుగా కనబడే ఎన్ను (కో. 23).

**బడ్డీ** పర్యా. చూ. మంచె. పైరురక్షణకు పంటచేలో గుంజలపాతి పైన తడికవేసి కట్టిన అరుగు. చూ. చిత్రాలు 35 క, ట, త (కో. 33, 37, 45).

బలిపిడత పర్యా. చూ. దిష్టికుండ. పంటకు దిష్టి తగలకుండా ఉండటానికి సున్నపుబొట్లు పెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టినకుండ (కో. 46).

బలె (-పట్టు) పెసర, అలచంద మొ. వాటి ముదురు గింజ (తె. 27).

బల్ల పర్యా. చూ. మడి, నారుపోసిన భూభాగం (తె. 28).

బల్లెపాకు పర్యా. చూ. కోశేకు. పైరుపొట్టపై బల్లెం లాగా (నిటారుగా) మొలిచిన ఆకు (తె. 35, 36).

బిగిపొట్ట పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులమరుగున ఉబ్బెత్తుగాఉన్న కంకి (తె 28).

బిర్రుపొట్ట పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులమరుగున ఉబ్బెత్తుగా కనబడే కంకి; ఈనటానికి సిద్ధమైన పైరుదశ (కో. 5-7, 12, 14-17, 19, 24; తె. 1, 2, 6, 8, 11, 12, 14, 39; రా. 17-23, 25).

బిళ్ళ (-కట్టు) ? పర్యా. చూ. మండ. నాటుకొన్న చెట్టు ఆకులు, పిలకలు దట్టంగావేసి గుబురుగాఉన్న స్థితి (రా. 10).

బురదకలుపు పర్యా. మడికలుపు. మాగాణిలో తీసే కలుపు; చూ. కలుపు (కో. 29).

బూగర పర్యా. చూ. సుంకు. జొన్న మొ. వాటి కంకి మీద నూగునూగుగా పుట్టిన పూత (కో. 31).

బూసి (<హిం. భూస్. భూసా = సన్నటి దువ్వ) (-పట్టు, -పోయు) ఉ. బుసి; పర్యా. చూ. సుంకు. కంకి మీద నూగునూగుగా పట్టినపూత (తె. 1, 2, 4, 7, 8).

బూసె మొక్కజొన్నకండె నెత్తిపై మొలిచే పీచు (తె. 31).

బెచ్చుటిక (<బెచ్చు + అటిక) పర్యా. చూ. దిష్టి కుండ. పంటకు దిష్టితగలకుండా ఉండటానికి సున్నపుబొట్లు పెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టేకుండ; కన్నడంలో బెచ్చు = బెదురు (రా. 15).

బెండు పర్యా. కండె. రొంది. చెరకు, జొన్న మొ. వాటి దంటులోపలిభాగం (కో. 28, 31, 32; తె. 4, 10, 40-42; రా. 18, 21-23, 25); -దంటు ఉ. బెండు దొంట; పర్యా. చూ. ఊలదంటు. చప్పగాను, పీలగాను ఉన్న జొన్న మొ. వాటి దంటు; చూ. దంటు (రా. 22).

బెదురు (-పెట్టు) ఉ. బెద్రు (వి. విశ.) జంతువులను, మనుషులను భయపెట్టటానికి, పంటకు దిష్టితగలకుండా ఉండటానికి పొలంలో నిలబెట్టే గడ్డిబొమ్మ, దిష్టికుండ మొ. వి; సామాన్యార్థం 'భయం' (కో. 7, 30, 37, 39; తె. 1, 2, 15-18, 20, 22-28, 40; రా. 2-6, 11, 13, 14, 19, 23, 25, 27, 28); -కుండ పర్యా. చూ. దిష్టికుండ. పంటకు దిష్టితగలకుండా ఉండటానికి, జంతువుల బెదురుకు, సున్నపుబొట్లు పెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టినకుండ (కో. రా.); -బొమ్మ ఉ. బెద్రుబొమ్మ; పర్యా. చూ. దిష్టిబొమ్మ. జంతువులు బెదిరిపోవటానికి పంటపొలంలో నిలబెట్టిన గడ్డిబొమ్మ. (కో. తె. రా).

బొంగ(లు) ? పైరులో మొలిచే కలుపుమొక్క(లు) (కో. 49).

బొండ (-పట్టు) పర్యా. చూ. గింజ. పాలు గట్టిపడి ఏర్పడుతున్న విత్తనం (తె. 27).

బొంతు జొన్న. మొక్కజొన్న మొ. వాటి కంకిలో గింజలుండే అర లేక గూడు (కో. 8, 11, 19, 23, 24, 28, 29, 31-36; తె. 41).

బొందుకలుపు ? నారుమడిలో పెరిగిన చిల్లర మొక్కల్ని పీకివేయటం (కో. 51).

బొండె (-కట్టు) పర్యా. చూ. గంట. పక్కకొమ్మలు వేసి మొక్క గుబురుగా పెరిగే స్థితి (కో. 9).

బొమ్మపైరు (-అగు); పర్యా. చూ. అడ్డపచ్చ(న). విత్తులు చల్లిన పదిరోజులకు మొలకలెత్తి చాళ్లు పచ్చగా కనబడే పైరు (కో. 23).

బోదు (-తీయు) మొక్కలకు నీళ్లు పెట్టటానికి తీసిన చిన్నకాలవ (కో. 19-21, 23).

బోదె[1] మిరప మొ. మొక్కలచుట్టూ పాదుచేసి ఎత్తుగా పోసిన మట్టికట్ట (కో. 3, 5, 19, 21, 41).

బోదె[2] (-కట్టు) తాటి, కొబ్బరి, అరటి మొ. చెట్ల ప్రకాండం (రా. 3, 26).

బోదె[3] పర్యా. చూ. అల్లవ. తీగెలు అల్లుకోవటానికి దోహదంగా పెట్టిన దడి (రా. 22, 26).

మక్కు (క్రి.) పర్యా. చూ. పండు. పైరు పూర్తిగా పరిణతి పొందటం; ఫలించటం (తె. 15, 33, 38).

మచ్చు ఉ. మొచ్చు; చూ. మంచె (రా. 19, 22).

మచ్చె చూ. మంచె (తె. 3).

మంచం చూ. మంచె; పడుకోటానికి గూడా వీలైన పెద్దమంచె (రా. 3).

మంచిక చూ. మంచె (రా. 15, 17).

మంచె ఉ. మంచి, మణిసె, మనిసె, మంచె; రూ. మచ్చు, మచ్చె, మంచం, మంత; పర్యా. అరప, గడమంచె, జోబిడి, బడ్డి. పైరురక్షణకు పంటచేలో గుంజలుపాతి పైన తడికవేసి కట్టిన అరుగు; కావలిమనిషి దీనిమీద కూర్చొని పంటను చూస్తుంటాడు. చూ. చిత్రాలు 35 క, ట, త (కో. 1-15, 18-25, 27, 29-33, 35-37; తె. 1, 3-12, 14, 20, 21, 23, 42; రా. 1, 2, 7-15, 17, 18, 20, 21, 23-28).

మట్టు పర్యా. చూ. మడి. నారుపోసిన (నలచదరపు) భూభాగం (కో. 24, 25).

**మడి** పర్యా. కయ్య, దొయ్య, బల్ల, మట్టు. నారు పోసిన (నలచదరపు) భూభాగం (కో. 6, 13, 14, 18-21, 25; తె. 6, 19, 25-27, 33, 38).

**మడికలుపు** పర్యా. బురదకలుపు. మాగాణిలో తీసే కలుపు; నారుమడిలో తీసే కలుపు (తె. 6).

**మండ** (-కట్టు, / -గట్టు) పర్యా. గుబురు, గుబ్బ, గుంపు, గుమ్మటం, గుమ్మడిదల, బిళ్ళ, రొడ్డ. నాటుకొన్న చెట్టు వేసే పక్కకొమ్మలు, ఆకులు మొ. వాటి గుబురు లేక సమూహం (తె. 26; రా. 18, 21, 24).

**మదురు** ఉ. మొదురు; పర్యా. చూ. తెట్టె (గోడ) చేనిచుట్టూ రాళ్ళు పేర్చి కాపుగా పెట్టిన గోడ.

**మంత** చూ. మంచె (కో. 40).

**మరుకలుపు** చూ. మారుకలుపు (రా. 3, 6).

**మరుగొప్పు** పర్యా. మలిగొప్పు. మిరప, వంగ మొ. తోటల్లో రెండోసారి కలుపుమొక్కలు తవ్వటం (కో. 45).

**మలక** పర్యా. మలితడి. నారుమడితో పెట్టిన రెండో తడి; చూ. కలుపు (కో. 9).

**మలికలుపు** పర్యా. ఎడగాడికలుపు, పుట్టుకలుపు, మరుకలుపు. మలిగాబు, మ్రలకలుపు, ముతక్కలుపు, ముదురుకలుపు. పైరు ముదిరి పొట్ట కరుక్కువచ్చినప్పుడు తీసే కలుపు; చూ. కలుపు (రా. 2, 5, 26; కో. 26).

**మలిగాబు** పర్యా. చూ. మలికలుపు. పైరు ముదిరి పొట్టకరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు; చూ. కలుపు (కో. 44, 48, 49).

**మలిగొప్పు** పర్యా. మరుగొప్పు. మిరప, వంగ మొ. తోటల్లో రెండోసారి కలుపుమొక్కలు తవ్వటం (కో, 39, 44).

**మలితడి** పర్యా. మలక. నారుమడిలో పెట్టే రెండో తడి (రా. 23).

**మ్రలకలుపు** (<మరలకలుపు) పర్యా. చూ. మలికలుపు. పైరుపొట్ట కరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు (తె. 11, 14, 15).

**మల్లె** పర్యా. చూ. అల్లవ. తీగెలు అల్లుకోటానికి దోహదంగా పెట్టే దడి (రా. 23-25).

**మాగు** (క్రి.) పర్యా. చూ. పండు. పైరు పూర్తిగా ఫలించటం; కంకులు ముదిరినదశ (రా. 15-17, 23).

**మారాకు** (-వేయు) పర్యా. మొక్కాకు, వేరాకు. మొదట వేసిన ఆకుగాక, మళ్ళీవేసే ఆకు; మొక్కను గుర్తించటానికి అనువైన ఆకు (కో. 25; తె. 6-12, 28-39, 42; రా. 4, 7, 8, 11, 16-18, 21-26).

**మారుకలుపు** రూ. మరుకలుపు; పర్యా. చూ. మలికలుపు. మొక్క పొట్ట కరుక్కు వచ్చినతరవాత తీసే కలుపు; రెండోకలుపు (తె. 4, 14; రా. 13).

**మిడిగర** (<మిడి = నిటారుగా లేచిన గర = ఆకు) పర్యా. చూ. కోతేకు, పైరు పొట్టపై నిటారుగా మొలిచిన ఆకు; చూ. గరి (తె. 32).

**మీట** పంటచేలో తిరిగే ఎలుకలను పట్టటానికి పెట్టే ఒకరకం బోను. చూ. చిత్రం 40 (కో. 45).

**ముక్కుర్ర** (-పొడుచు) ఉ. ముక్కుర మొక్కచుట్టూ వేసే మొదటి పిలకలు (కో. 2, 7, 14, 17, 18, 39; రా. 18).

**ముగ్గు** (క్రి.) పైరు పరిణతికి రావటం; పూర్తిగా కంకులు ముదిరి ఫలించటం (కో. 20-25).

**ముచ్చు** మూడునుంచి అయిదు గణుపులవరకూ ఉన్న చెరకుగడ భాగం (కో.).

**ముతక్కలుపు** పర్యా. చూ. మలికలుపు. పైరు పొట్ట కరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు; రెండోకలుపు (రా. 8).

**ముదుగలుపు** చూ. ముదురుకలుపు (తె. 19).

**ముదురు** (క్రి.) పర్యా. చూ. పండు. కంకులలోని గింజలు పూర్తిగా ముదరటం; తోలుకాయలో గింజలు బలిసి గట్టిపడటం (అలచంద, కంది, పెసర మొ. పైర్లలో); విశ.) ముదిరిన- (కో. 1-15, 17-21, 25-35, 43; తె. 3, 6, 12, 13, 17, 19, 27, 28. 30, 40, 41; రా. 2-5, 7, 10, 11, 24, 26-28); **-కలుపు** ఉ. ముదరకలుపు, ముదురుగల్పు; రూ. ముదుగలుపు; పర్యా. చూ. మలికలుపు. పైరుపొట్ట కరుక్కు వచ్చినప్పుడు తీసే కలుపు; రెండోకలుపు; కొన్నిచోట్ల మూడోకలుపు (కో. తె. రా.); **-గొప్పు** తోటల్లో మూడోసారి పెట్టే కలుపు తవ్వకం (కో.); **-బొట్ట** (పొట్ట) పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులు విడబడి కంకి పైకివెళ్ళే ముందున్నదశ; పైరు ఈనమోసిన స్థితి (కో.).

**ముద్దకంకి** ఉ. ముద్దగంకి. రెళ్ళలు (గింజలకు ఆధారమైన కాడలు) దగ్గరదగ్గరగాఉన్న కంకి; చూ. జల్లికంకి (కో. 3, 9, 11, 13, 19, 20, 23-25, 28, 48; తె. 15, 20, 22-25, 27, 28, 30, 31, 40).

**ముందుకలుపు** ఉ. ముందుగల్పు; పర్యా. చూ. తొలికలుపు. నారుమడిలో తీసే కలుపు; మొక్క నాటుకొన్న తరవాత తీసే మొదటికలుపు (కో. 18; తె. 31).

**మ్రురు** (ఎక్కు) పర్యా. చూ. పాలు. గింజలో ఏర్పడి గట్టిపడుతున్న పాలు (రా. 14; 15).

**మ్రురుగాయ** (-దిగు) పర్యా. చూ. దోరగాయ. పండబారిన వేరుసెనగ, అలచంద, పెసర మొ. వాటికాయ (కో. 5).

**ముల్లుబొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఆకు విడవకుండా ఎన్ను లేర్పడుతున్న మొక్కదశ; గర్భస్థమైన ఎన్ను (కో. 34).

**మూను** ? ఉ. మాను, మూన, మోన. పైరు మొత్తంగా కనిపించే రంగు; మొక్క కాడకుపట్టిన వన్నె; వాడుక: "పైరు ఎర్రమూనుకొచ్చింది". "నల్లమూనుకొచ్చింది". "పచ్చమూనమీదుంది" మొ. (కో. 10, 19, 21-23, 25; తె. 39).

**మెట్టదిమ్మె** ఉ. మెట్టదిమ్మె; చూ. పెట్లదిమ్మె. చూ. చిత్రం 36 (కో. 17-22; తె. 2).

**మెడకవ** చేనిపట్టూ కొయ్యలు పాతి కంపకూర్చటం; చూ. మెడుగు (కో. 46).

**మెడుగు** (క్రి.) కొయ్యలు రెండువైపులా పాతి వాటి మధ్య ముళ్ళకంప దూర్చటం; కంప అల్లటం (కో. 46, 50).

**మెదగింజ** పర్యా. గుడాలపంగి. ముదిరీ ముదరని గింజ; మెత్తటిగింజ (కో. 14).

**మేడ** (-వేయు) నేలలో పెరిగే వేరుసెనగకాయల గుత్తి (రా. 17, 18, 21, 24).

**మొక్క** (-అగు) చూ. మొలక (కో. 20, 27, 41, 45, 50); **-గాబు** పర్యా. బొందుకలుపు. ఆకు మడిలో తీసే కలుపు (కో.); **-మొక్కాకు** (-వేయు) పర్యా. చూ. మారాకు. మొదటవేసిన ఆకుగాక మళ్ళీవేసే ఆకు; మొక్కను గుర్తించటానికి వీలైన ఆకు (కో.);

**మొగి** (-తెలియు) పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం (కో. 25).

**మొగ్గ** (1) (-పట్టు, / -బట్టు) పైరు పూతకువచ్చే ముందు దశ; విప్పారని పువ్వు (తె. 31-33, 38; రా. 3, 9, 21-23, 27; (2) పర్యా. చూ. కవుటు. పొగ మొక్క తలపైనవేసే పూత; దీన్ని తుంచివేస్తారు (తె. 29).

**మొన** (-దేరు, / -తేరు) ఉ. మోన పర్యా. చూ. మొలక. భూమిలోనాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం, (కో. 27, 34, 35, 39, 41).

**మొనపు** (-పారు) ఉ. మొనాపు; పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం; చిన్న మొలక (కో. 26, 35, 39).

**మొనపొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఆకుల మరుగున ఉన్న ఎన్ను; ఆకు విడవని ఎన్ను (కో. 35).

**మొల** (-కట్టు) ఉ. మల; చూ. మొలక (కో. 37, 40, 42, 46-48; రా. 15, 16).

**మొలక** (1) (-వచ్చు, వేయు) ఉ. మలక; రూ. మొక్క, మొల, మొల్క; పర్యా. కుసి, మొగి, మొన, మొనపు, మొలుపు, మొల్వాట, మోటికె, మోసు, లాక, ససి. నటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం; చిన్న మొక్క (కో. 5-19, 23-25, 37-51; తె. 3, 6-8, 10, 12, 14, 33, 37-39, 41; రా. 3-5, 7-10, 18-28); (2) (-కట్టు, -చల్లు -పోయు) పర్యా. చూ. నారు. వరి మొలకలు; వరినారు (రా. 19, 22, 23, 25, 27, 28).

**మొలుచు** (క్రి.) విత్తిన గింజ మొక్కగా పరిణమించటం (కో. 5-9, 14, 15, 17, 19, 23-25; తె. 1, 2, 34, 35).

**మొలుపు** (-ఎత్తు, -చూపు) ఉ. మలుపు; పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం; మొక్క (కో. 4; రా. 14, 15, 19).

**మొల్క** (-ఎత్తు, -వెళ్ళు) చూ. మొలక (కో. 31; తె. 16-28).

**మొల్వాట** పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం; మొలక (తె. 11).

**మొవ్వ** మృదువుగాఉండే ఎన్నుపై కొన (కో. 43).

**మొవ్వకాయ** (-అగు) పర్యా. చూ. దోరగాయ. పండబారిన అలచంద, పెసర, ఉలవ మొ. వాటి కాయ (కో. 43, 45).

**మోటికె** (-ఎత్తు); ఉ. మొటిక, మోటుక; పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చేభాగం (కో. 21, 22, 26).

**మోడు** పర్యా. చూ. దంటు. జొన్న, సజ్జ, రాగి మొ. పైరుమొక్కల కాడ; నేలనుంచి ఎన్నుదాకఉన్న మొక్క భాగం (కో. 32, 36).

**మోవు** (1) (-వచ్చు, -విడుచు, -వేయు) ఉ. మోవి; పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం; మొక్క (కో. 3, 4, 8, 26, 27, 32, 35; రా. 3, 11); (2) (-విడుచు, -వేయు) చుట్టగా వచ్చే లేత ఆకు; ముఖ్యంగా అరిటాకు (కో. 4, 5, 17, 20, 44; రా. 9, 11).

**మోసు** (-ఎత్తు) పర్యా. చూ. మొలక. భూమిలో నాటుకొన్న గింజ పగిలి పైకివచ్చే భాగం; చిన్నమొక్క; కొన్నిచోట్ల లేత చిగురు (కో. 15, 22, 32; తె. 9, 36; రా. 5, 6, 9, 15, 17, 26).

**రవిదె** (-పగులు) ఉ. రవిది, రొవిది, రొవిదె; పర్యా, చూ. ఆకు, జొన్న, మొక్కజొన్న మొ. పైర్ల ఆకు (తె. 4; రా. 17, 21, 22).

**రాగోల(కట్టె)** ఉ. రాగాల(కట్టె), రాగోలు, రోగాలు, రోగాళ; పర్యా. ఇరకాలకట్టె, కవకట్టె, కవరకట్టె, తమరుకట్టె, పంగలకట్టె, రేవకర్ర, కంచె వేసేటప్పుడు ముళ్ళకంపలు ఎత్తటానికి ఉపయోగించే పంగలకర్ర (కో. 5, 8-14; తె. 9, 34-36; రా. 11-13, 18, 20, 24, 26).

**వరాకు** పర్యా. చూ. కోతేకు. పైరు పొట్టపై నిటారుగా మొలిచిన ఆకు (తె. 20, 23).

**వేరాకు** ఉ. ఏరాకు (-వేయు) పర్యా. మారాకు. మొదటవేసిన ఆకుగాక మళ్ళీవేసే ఆకు; మొక్కను గుర్తించటానికి అనువైన ఆకు (తె. 6).

**వేరుబట్టు** (క్రి.) పర్యా. చూ. ఏనుకొను. మాగాణిలో గాని, తోటలోగాని నాటిననారు వేరుపాతుకొని బతకటం (కో. 34).

**వేరుబెట్టు** (క్రి.) పర్యా. చూ. ఏనుకొను. మాగాణిలో గాని, తోటలోగాని నాటిననారు వేరుపాతుకొని బతకటం (కో. 11, 19, 25).

**సన్నపొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఆకుల మరుగున ఉన్న ఎన్ను; ఏర్పడుతున్న ఎన్ను (కో. 2; తె. 23).

**సరిపొట్ట** పర్యా. చూ. ఈనుపొట్ట. ఆకులు విడబడి కంకి వెళ్ళేముందున్న పైరుదశ (కో. 26).

**సవుటం** ఉ. సవటం, సౌటం; పర్యా. చూ. తొలికలుపు. పల్లపుభూమిలో తీసే మొదటికలుపు; నారునాటిన పదిహేను రోజులకు తీస్తారు (తె. 13-15, 20).

**ససి** (-కుట్టు) పర్యా. చూ. నారు. వరి, మిరప మొ. వాటి చిన్న మొలకలు; నారు; కొన్నిచోట్ల ఎదిగినపైరు (రా. 11, 16, 17, 19, 22); **-కలుపు** పర్యా. చూ. తొలికలుపు. పైరు గుదేకుతోఉన్నప్పుడు తీసేకలుపు; కన్నెకలుపు (రా.).

**సస్యం** పర్యా. చూ. పైరు. పొలమంతటా పచ్చగా ఆవరించిఉన్న ధాన్యాదుల మొక్కలు; పచ్చపొలం (తె. 26).

**సిగరజంబు** పర్యా. చూ. అల్లవ. తీగెలు అల్లుకోటానికి పాతే నిలువుకొయ్య (రా. 6).

**సిడు** (-ఉడుగు) తాటి, కొబ్బరి మొ. వాటి గెల సాగి రాలిన పూత (రా. 3).

**సీతకుండ** ఉ. శీతకుండ; చూ. సీతవకుండ (కో. 5, 6, 8, 15).

**సీతపుకుండ** ఉ. సీతపుకుండు; చూ. సీతవకుండ (కో. 24).

**సీతవకుండ** రూ. సీతకుండ; సీతపుకుండ, సీతాయకుండ; పర్యా. చూ. దిష్టికుండ. పంటకు దిష్టితగలకుండా సున్నంతోగాని, మసితోగాని బొట్లుపెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ; పంట చలవకు నిలిపినకుండ (కో. 9-11).

**సీతాయకుండ** చూ. సీతవకుండ (కో. 13, 14, 16).

**సుంకు** ఉ. సింకు (-పట్టు, -పోయు, -ముసురు, -మోపు, -మోయు) పర్యా. ఆరం, కుసం, గురుజు, గొరిసె, చిత్త, నూగు, పువ్వారం, పువ్వు, బూగర, బూసి. కంకిమీద నూగునూగుగా పట్టిన పూత (కో. 1-25, 27, 29, 31-33, 35, 36, 39; తె. 3, 5, 12, 14, 28, 31, 33-38, 40-42; రా. 1-11, 14, 16-28).

**సుడి** (-పగులు) గుబురుగా పెరిగే పైరుమొక్కల ఆకు (రా. 21).

**సుడెం** ఉ. జుడెం. రాగోలతో ఎత్తటానికి వీలుగా అంటొత్తిన ముళ్ళకంప; ఉదా: రేగిజుడెం (కో. 18).

**సూదేకు** (-వేయు) ఉ. సుదేకు. పర్యా. చూ. గుదేకు. ఎన్నును గుదిగా ఆవరించిఉన్న ఆకు (కో. 30; తె. 31).

**సూదిపొట్ట** పర్యా. చూ. చిరిపొట్ట. ఆకుల మరుగున ఏర్పడుతున్న ఎన్ను (కో. 24; తె. 1, 2, 5, 26, 31, 36, 39; రా. 7).

**సూదిమొక్క** పర్యా. చూ. కోరమొక్క. నేల చీల్చుకొని పైకివచ్చిన చిన్న మొలక (కో. 44; తె. 31).

**సూదిమొన** పర్యా. చూ. కోరమొక్క. నేల చీల్చుకొని పైకివచ్చిన చిన్న మొలక (కో. 26-29, 31, 35, 44).

**సెమిరె** (< ? చెమిరె) వరి నాటినతరవాత మూడోరోజు పెట్టిన నీరు (కో. 5).

చిత్రం 34 క. కావలిగుడిసె (గుండుగుడిసె)



చిత్రం 34 చ. కావలిగుడిసె



చిత్రం **35** క. మంచె




1. మంచె ఎక్కే మెట్లు

చిత్రం **35** చ. జోబడి



చిత్రం 35 ట. చప్పరంమంచె



1. చప్పరం 2. మెట్లు

చిత్రం 36 పెట్లదిమ్మె



1. చెక్కదిమ్మె
2. మందు దూరే ఇనపగొట్టం
8. నిప్పంటించే వత్తి
4. పొన్ను
5. వెదురుగడ

చిత్రం 35 త. గుదులమంచె



చిత్రం 37 తటంగి



చిత్రం 39 ఉండేల్ దబ్బ



చిత్రం 38 వడిసేల




1. చిప్ప (కడక)

2. వడిసేలవారు



చిత్రం 40 మీట (కత్తెరబోను)

1. రాతిబండ
2. ఎర
3. బిర్రుపుల్ల
4. తాడు
5. తమరుకట్టె
6. కత్తెరబిల్ల



చిత్రం 41
ఊదరపొగ

1. ఊదుతిత్తి
2. కడవమూతి
3. ఊదరకడవ
4. పొగవచ్చే కన్నం
5. ఎలక కన్నం

చిత్రం 42 ఎలికలకుండ



# మొక్కలు : చెట్లు

**అగ్గంటిపాకు** ఒకరకం కలుపుమొక్క; ? *Striga species* (కో. 37).

**అగ్గిమల్లె** పైరు తెగుళ్ళలో ఒకటి; వరి, జొన్న, చెరకు, పొగాకు మొ. పైర్లల్లో ఎక్కువగా పడుతుంది; ఇది ఆ పైరుమొక్కలోనుంచే పుట్టి దాని సారాన్ని తీసుకొని పెరుగుతుంది; వృక్షశాస్త్ర పరిభాషలో దీన్ని 'పరాన్న భుక్కు' (Parasite) అని అంటారు; *Striga species* (కో. 30 ; తె. 22, 23, 31).

**అగ్నివేండ్రం** ఉ. అగినాండ్రం, అగినేండ్రం. ఒక కలుపుమొక్క; నాలుగు పలకల కాడ; ఎర్రటిపూలు పూస్తుంది; *Ammania vesicatoria*, Roxb., *Ammania beccifera*, Linn. (కో. 42, 46-48, 50).

**అంకుడు** పర్యా. కొడిసె, పాలకొడిసె. తుప్పగా పెరిగే అడవిచెట్టు; తెల్లటిపూలు పూస్తుంది; రెండేసి కాయలు గుత్తిగాఉండి, చివరల్లో ఒకదానితో ఒకటి కలిసిఉంటాయి; దీనికొయ్యతో దువ్వెనలు, కొమ్మలు తయారుచేస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Holarrhena antidysenetrica*, Wall. (కో. 39, 47).

**అచ్చింత** ఒకరకం కలుపుమొక్క; *Solanum species* (కో. 20).

**అచ్చెలక** ఒకరకం కలుపుమొక్క; దీనికాయలు గలగల మోగుతాయి (రా. 28).

**అటికిమామిడి** గలిజేరు జాతికిచెందిన ఒకరకం కలుపు మొక్క; రోడ్లపక్కను, బంజరు నేలల్లోను పెరుగుతూంటుంది; *Boerhaavia diffusa*, Linn. (కో. 9).

**అట్లెలగంట(లు)** వరిపైరులో పెరిగే కలుపుమొక్క (తె. 24).

**అట్టింత** ఒకరకం కలుపుమొక్క; పశువులమేతకు ప్రశస్తం; *Alysicarpus rugosus*, DC (కో. 36).

**అడవిబెండ** ఒకరకం కలుపుమొక్క; బెరడు, వేరు వైద్యంలో వాడతారు. *Abutilon indicum*, G. Don. (కో. 23).

**అడవేముదం** ఉ. అడవాయదం (< అడవి + ఆముదం) పెద్ద నేపాళపు చెట్టు; సన్నటి ఆకుపచ్చపూలు పూస్తుంది; దీని నల్లటిగింజలనుంచి తీసిన నూనెను చమురుగా వాడేవాళ్ళు; దీని ఆకులు, బెరడు, పాలు చర్మరోగాలకు వాడతారు; కంచెగానూ వేస్తారు; *Jatropha curcas*, Linn. (తె. 5, 9).

**అడ్డసారం** అడ్డసరం చిన్న పొదగా 8-10 అడుగులెత్తు పెరుగుతుంది; నీలిజీరల తెల్లటి పూలు చలికాలంలో పూస్తుంది; మేకలుతప్ప మరేవీ ఈ ఆకును తినవు; ఎండిన మొక్కను వైద్యంలో వాడతారు; ఆకెరువుగాను వాడతారు; *Adhatoda vasica*, Nees (కో. 46).

**అత్తపత్తి** ఉ. అత్తపిత్త, అత్తపుత్తి, అత్తాపుత్తి; రూ. అత్తి. నిద్రగన్నిక; ఒకరకం కలుపుమొక్క; చేయి తగిలితే దీని ఆకులు ముడుచుకుపోతాయి; బ్రెజిల్‌నుంచి తెచ్చింది; *Mimosa pudica*, Linn. (కో. 9, 22, 27 ; తె. 41).

**అత్తి** చూ. అత్తపత్తి (కో. 13).

**అనాసపట్టు** ఒకరకమైన కంచెమొక్క; ? కిత్తలి; *Agave americana*, Linn. రా. 14).

**అనప(తీగె)** ఏటా సాగుచేసే పప్పుదినుసు మొక్క; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Phaseolus species* (తె. 26).

**అమడకాయ** రూ. ఆమడకాయ. గోళ్ళగొండి తెగకు చెందిన ఒకరకం కలుపుమొక్క; నీలిరంగు పూలు పూస్తుంది; కణుపుల్లో కాయలుంటాయి; మాగాణిలో ఎక్కువగా మొలుస్తుంది; *Cyanotis cucullata*, Kunth (కో. 14, 18, 21).

**అమర్తకాడ** ? అమృతకాడ; మెట్టపొలాల్లో పెరిగే కలుపుమొక్క; మేతగానూ ఉపయోగిస్తుంది; *Commelina benghalensis*, Linn. (కో. 37).

**అమిడిద** చిక్కుడు కుటుంబానికిచెందిన కలుపుమొక్క; పచ్చికబయళ్ళలో పెరుగుతుంది; వానాకాలంలో పుష్పిస్తుంది; పశువుల మేతగానూ ఉపయోగిస్తుంది; ? *Alysicarpus monififer*, DC. (కో. 48, 49).

**అమిరితి** ఒకరకం కలుపుమొక్క; ? అమృతకాడ (కో. 50).

**అంబటికాడ** పర్యా. అంబటిగెట్టాకు, అంబటిమోదు. పంటలకు హానికరమైన కలుపుమొక్క; రోడ్లపక్కను, బంజరునేలల్లోను పెరుగుతుంది; ప్రతి కణుపులోనూ పళ్ళం

---

ఉ. = ఉచ్చారణభేదం(-భేదాలు) ; కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విశ. = విశేషణం; హిం. = హిందుస్తానీ.

టాయి; *Trianthema protulacastrum*, Linn. (కో. 40).

**అంబటిగెట్టాకు** పర్యా. చూ. అంబటికాడ. పంటలకు హానికరమైన కలుపుమొక్క; రోడ్లపక్కను బంజరు నేలల్లోను పెరుగుతుంది; ప్రతికణుపులోనూ పళ్ళుంటాయి; *Trianthema portulacastrum*, Linn. (రా. 1).

**అంబటిమోడు** పర్యా. చూ. అంబటికాడ. పంటలకు హానికరమైన కలుపుమొక్క; రోడ్లపక్కను, బంజరు నేలల్లోను పెరుగుతుంది; ప్రతికణుపులోనూ పళ్ళుంటాయి; *Trianthema portulacastrum*, Linn. (కో. 42).

**అయిలు** ఒకరకం కంచెమొక్క (తె. 9).

**అయ్యగడ్డం** గడ్డిజాతిలో నాసిరకం కలుపుమొక్క; తుంగలాగా ఉంటుంది; *Fimbristylis species* (తె. 20).

**అలం** రూ. అలము. తీగలావిస్తరించే కలుపుమొక్క; (కో. 9, 12, 18; తె. 1, 3-5, 8-10, 12, 13, 16, 17, 20, 21, 23, 24, 26-28, 31; రా. 2, 8, 12, 14, 17, 21).

**అలందొక్కుడు** (<అలం + తొక్కుడు) పర్యా. పొర్కదొక్కుడు. వెంపలి, నీలి, జనుం, సీతాఫలం, కానుగు మొ. వాటి ఆకులు ఎరువుగా మడిలో తొక్కటం (తె. 19).

**అలుము** చూ. అలం (కో. 8, 9, 18, 25).

**అల్లి** గుబురుగా పెరిగే ఒకరకం కలుపుమొక్క; లేత గోధుమవన్నె బెరడు, నీలిరంగు పూలు, ఎర్రటి పళ్ళు ఉంటాయి; *Memecylon edule*, Roxb. (కో. 17, 21, 34).

**అవిసె** మెట్టపొలాల్లో 30-35 అడుగుల ఎత్తుపెరిగే కలుపుచెట్టు; కంచెగానూ నాటతారు; నీలిరంగు పూలు పూస్తుంది; దీని లేతఆకును, పూలను కూరల్లో వాడతారు; 'లినెన్' గుడ్డల తయారీలో దీని నార ప్రశస్తం; *Sesbania grandiflora*, Pers. (కో. 37).

**అవురు(దుబ్బు)** పర్యా. ఆబోడు, ఆబోరు, రెల్లుగడ్డి తెగకుచెంది మెట్టలో పెరిగే కలుపుమొక్క; a variety of *Saccharum spontaneum* (కో. 37).

**ఆకు (-తొక్కు)** పర్యా. కట్టి, రొట్ట. ఊడ్పులకును, విత్తనం చల్లటానికి ముందు మళ్ళల్లో ఎరువుగావేసి తొక్కే చెట్లఆకు (కో. 3-6, 8-15, 18, 20, 21, 24, 26, 32, 37, 40, 42, 48, 50; తె. 1, 7, 12, 20, 22, 28, 29, 31, 32, 37, 39, 41; రా. 1, 3, 4, 6, 8, 12, 14, 16--20, 23, 26).

**ఆబోడు** చూ. ఆబోరు (కో. 50).

**ఆబోరు** రూ. ఆబోడు; పర్యా. చూ. అవురు (దుబ్బు). రెల్లుగడ్డి తెగకుచెంది మెట్టలో పెరిగే కలుపుమొక్క; a variety of *Saccharum spontaneum* (కో. 49).

**ఆముదకాయ** చూ. అముదకాయ (కో. 15; తె. 30).

**ఆముదం** లేత ఊదారంగుగల గుండ్రటి బోలుకాడ, పెద్దఆకులు, ముళ్ళతోనిండిన కాయలుఉండి 8-10 అడుగుల ఎత్తు పెరిగే నూనెగింజల చెట్టు; ఆకులను పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు. *Ricinus communis*, Linn. (కో. 26).

**ఆయింట** బంజరునేలల్లో ఏటా లేచిపెరిగే ఎత్తైన కలుపుమొక్క; తెల్లటి పూలు పూస్తుంది; *Gyanandropsis pentaphylla*, DC (తె. 25).

**ఆరిక(గడ్డి)** ఉ. అరిగ్గడ్డి. నీటారిక?; పశువుల మేతకు ప్రశస్తం; *Paspalum scrobiculatum*, Linn. (కో. 20).

**ఇంగిలాయి** ఒకరకం కలుపుమొక్క (రా. 12).

**ఇచ్చింత** ఒకరకం కలుపుమొక్క; ? అచ్చింత (కో. 20).

**ఇప్ప** దళసరి దూదెదరంగు బెరడు, గోధుమవన్నె కలపఉండి దట్టమైన అడవుల్లో పెరిగే పెద్దచెట్టు; దీని పూలనుంచి సారాయం తయారుచేస్తారు; ఆకుపచ్చటి పళ్ళల్లోని బీజదళాలనుంచి చమురుతీస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Bassia latifolia*, Roxb. (రా. 14).

**ఇల్లాయి** ఒకరకం కలుపుమొక్క (రా. 12).

**ఇసకదాసరి** ఇసుకదాసరికూర; పచ్చికబయళ్ళల్లో సాధారణంగా పెరిగే కలుపుమొక్క; ఆకును కూరగా వండుకుంటారు; దీన్నే ఇసకదొంతికూర అనీ అంటారు; *Gisekia pharnaceoides*, Linn. (కో. 32).

**ఇసకబెండ** ఇసకనేలల్లో పెరిగే కలుపుమొక్క (రా. 12).

**ఇసకారి** ఉ. ఇసకేరి, ఇసికేర. మెట్టపొలాల్లో పెరిగే కలుపుమొక్క (రా. 12, 18, 24).

**ఇసిరికె** ఉ. ఇసిరికె; చూ. ఉసిరిక (రా. 18, 23).

**ఈత** ఈతచెట్టు; ఒకరకమైన కంచెమొక్క; దీని ఆకుమట్టలు పూరిళ్ళకప్పులకు వాడతారు; *Phoenix sylvestris*, Roxb. (కో. 43; రా. 18, 25).

**ఈరుమాండ్లగడ్డి** ఉ. ఇరుమాండ్లగడ్డి. మాగాణిలో పెరిగే కలుపుమొక్క (రా. 14, 26).

**ఉట్టి** పొదగా పెరిగే కంచెమొక్క; *Ferreola buxifolia*, Roxb. (రా. 7).

**ఉట్టిసేర్లగడ్డి** తుప్పగా పెరిగే గడ్డిమొక్క (తె.19).

**ఉట్ల** ?ఊటాకు; ? *Digitaria marginata.* Linn. (తె. 3, 4, 11; రా. 8, 14, 24).

**ఉండ్రంచి** ఒకరకం కలుపు మొక్క (కో. 22).

**ఉత్తరేని** ఉ. ఉత్తరేణి. ఉత్తరేనుచెట్టు; 3-4 అడుగుల ఎత్తుపెరిగే కలుపు మొక్క; *Achyranthes aspera,* Linn. (తె. 42; రా. 17-19).

**ఉత్తసెల్ల** ఒకరకం కలుపు మొక్క (తె. 12).

**ఉప్పి** మెట్టనేలల్లో పెరిగే గడ్డిమొక్క: దీని ఎన్ను నాలుగు రెక్కలుగా ఉంటుంది; ? *Hackelochloa granularis,* O. Ktz. (రా. 18, 20, 21, 24).

**ఉప్పుగడ్డి** ఉ. ఉప్పగడ్డి. మాగాణిలో వరికోసిన తరవాత మొలిచే కలుపుమొక్క; నల్లరేగడినేలల్లో ఎక్కువగా మొలుస్తుంది; *Chloris virgata,* Sw. (కో. 9, 12, 13, 21, 24, 27, 29, 35).

**ఉమ్మెత్త** ఏటాలేచి పెరిగే దత్తూరిమొక్క; *Dhatura genus* (తె. 1).

**ఉమ్మెనగడ్డి** ఒకరకం కలుపు మొక్క (కో. 29).

**ఉర్రంకి** ఉ. ఉర్రింకి, ఉర్రెంక; రూ. ఉర్లంక; పర్యా. చూ. కుందుప. మెట్టలోను, మాగాణిలోను మొలిచి తీగలాగా పరచుకునే గడ్డి; నేలలో దుంప ఉంటుంది; పశువులకు మేతకూడా; *Ischaemum pilosum,* Hack. (కో. 1, 6, 18, 19, 21, 24, 29).

**ఉర్లంక** చూ. ఉర్రంకి (కో. 31, 32).

**ఉలారం** ఒకరకం కలుపుమొక్క (కో. 30).

**ఉల్లింద్ర** ఉ. ఉలింద్ర, ఉల్లిందర; రూ. ఉల్లెందు. ఒకరకమయిన కంచెచెట్టు; చిన్నముళ్ళుంటాయి. *Diospyros capitulata,* W. (కో. 2, 7, 8; రా. 1).

**ఉల్లెందు** ఉ. ఉల్లింద; చూ. ఉల్లింద్ర (తె. 7, 8).

**ఉవ్వ(గడ్డి)** చూ. ఊబ (తె. 3).

**ఉసంగి** ఒకరకం కలుపు మొక్క (తె. 11).

**ఉసిరిక** ఉ. ఉసిరికి; రూ. ఇసిరికె. మెట్టనేలల్లో పెరిగే కలుపుమొక్క; దీనిపళ్ళు తోళ్ళు పదునుచెయ్యటంలో ఉపయోగిస్తారు; *Phyllanthus emblica,* Linn. (కో. 9-11, 21).

**ఊక(తుప్ప)** ? (< వాక(తుప్ప), వాక < ఓక) పర్యా. కలివె. పలవల కొమ్మలతో గుబురుగా పెరిగే వాడి ముళ్ళమొక్క; కంచెగాను నాటతారు; కొమ్మలను కంచెగా వాడతారు; తెల్లటి పూలు పూస్తుంది; కాయలు ఎర్రగా, పళ్ళు నల్లగా ఉంటాయి; పళ్ళల్లోని గుజ్జు రుచిగాఉంటుంది; కొయ్యతో దువ్వెనలు, గరిటెలు చేస్తారు; దీని కాయలను, వేళ్ళను వైద్యంలో ఉపయోగిస్తారు; *Carissa carandas,* Linn. (కో. 45).

**ఊటాకు** రూ. ఊట్లాకు; పర్యా. ఊట్లలం. నాటువేసిన తరవాత వరిపైరు వెంబడే పెరిగే కలుపుమొక్క; పశువుల మేతకు ప్రశస్తం; ? *Ipomaea repens,* Lamk. (కో. 21; రా. 1, 18, 28).

**ఊటి** ఉ. ఊటె, ఊతి. ఒకరకం కంచెమొక్క; ముళ్ళుండవు (కో. 9; రా. 1).

**ఊట్లలం** పర్యా. చూ. ఊటాకు. నాటువేసిన తరవాత వరిపైరువెంబడే పెరిగే కలుపు మొక్క. పశువులమేతకు ప్రశస్తం; ? *Ipomaea repens,* Lamk. (రా. 21).

**ఊట్లాకు** చూ. ఊటాకు (రా. 26).

**ఊడుగు** ఉ. ఊడిగ, ఊడిగె, ఊటుగ. మెట్టనేలల్లోను, రోడ్ల పక్కను పొదగా పెరిగే చెట్టు; తెలుపు, పసుప్పచ్చ కలిసిన రంగులో సువాసనగల పూలు పూస్తుంది; వెగటుగా ఉండే దీని పళ్ళను పేదలు తింటారు; కంచెమొక్కగా నాటతారు; కలప పనిముట్లకు ప్రశస్తం; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Alangium decapetalum,* Lamk., *Alangium salvifollum,* Wang. (కో. 23; తె. 31, 40, 42; రా. 3, 25).

**ఊద** కలుపు మొక్క; పశువుల మేతకు ప్రశస్తం; *Paspalidium flavidum,* A. Camus., *Panicum flavidum,* Reiz (కో. 15, 21, 23, 25-27; తె. 26-29, 33, 34, 36, 39); **భేదాలు:** **ఎర్రూద** ఊదగడ్డిలో ఎరుపురంగు కలుపు మొక్క; *Ischaemum aristatum,* Hk. (కో.); **-తెల్లూద** ఊదర గడ్డిలో తెలుపురంగు కలుపు మొక్క; *Echinochloa species* (కో.); **నల్లూద** ఊదగడ్డిలో నలుపురంగు కలుపు మొక్క పశువులమేతకు ప్రశస్తం; *black variety of Echinochloa* (కో.).

**ఊదర** ఉ. ఊదరి; రూ. ఊసర. మాగాణిపైరులో పెరిగే కలుపు మొక్క; వరిలాగే ఉంటుంది; *Eragrostis unioloides,* Nees. (కో. 3-6, 12, 13, 15, 20, 37, 42, 44, 49; రా. 1, 12, 18); **భేదాలు:** **చిట్టూదర** (<చిట్టి + ఊదర) ఊదరలో ఒకరకం కలుపు మొక్క (రా.); **నల్లూదర** (<నల్ల + ఊదర) ఊదరలో ఒకరకం కలుపు మొక్క (కో.); **పెద్దూదర** (<పెద్ద + ఊదర) ఊదరలో ఒకరకం కలుపు మొక్క; ఎన్ను కొర్రకంకిలా ఉంటుంది (కో. రా.).

**ఊబ** ఉ. ఊప; రూ. **ఉవ్వ** (గడ్డి). ముళ్ళఎన్నులుండి మెట్టలో పెరిగేకలుపు మొక్క; ఎర్ర నేలల్లో ఎక్కువగా మొలుస్తుంటుంది; *Heteropogon contortus,* Beauv. (కో. 8-10, 12, 13, 24; రా. 8, 12, 18, 21, 23, 26); భేదాలు: చిన్నూబ ఉ. సన్నూబ (<చిన్న + ఊబ) ఊబ తెగకుచేరిన ఒకరకం కలుపు మొక్క; *Heteropo-*

*gon contortus,* Beauv. (కో.); డొల్లూబ (<డొల్ల + ఊబ) ఊబతెగకు చేరిన ఒకరకం కలుపు మొక్క; *Heteropogon species* (కో.); తెల్లూబ (<తెల్ల + ఊబ) తెల్లటి ఎన్నులుగల ఊబగడ్డి; *Heteropogon species* (రా.); నల్లూబ (నల్ల + ఊబ) నల్లటి ఎన్నులుగల ఊబగడ్డి; *Heteropogon species* (రా.); పందూబ (పంది + ఊబ) లావాటి ఎన్నులుగల ఊబగడ్డి; *Heteroprgon species* (రా.); పెద్దూబ (<పెద్ద + ఊబ) ఉప్పుగడ్డి; Ginger grass (కో.).

ఊఁసడం మాగాణిలో ఒత్తుగా మొలిచి పెరిగే సన్నటి కలుపు మొక్క; *Panicum crusgalli,* Linn. (కో. 23, 25).

ఊఁసర చూ. ఊదర (తె. 5).

ఎంద్రకాయాకు బొంతజెముడులా ఉండే కలుపు మొక్క (కో. 4, 5; రా. 1).

ఎత్తిమట్టె చూ. ఎద్దుమట్టె (రా. 10).

ఎద్దుకొమ్ము(గడ్డి) రూ. ఎద్దుగుమ్మ. ఒకరకం కలుపు మొక్క (రా. 8).

ఎద్దుగుమ్మ చూ. ఎద్దుకొమ్ము(గడ్డి) (రా. 17).

ఎద్దుచ్చాకు ఒకరకం కలుపు మొక్క (కో. 18).

ఎద్దునాలుక గోజిహ్వ; ఎద్దునాలుకలాటి ఆకులుండి చెట్లనీడల్లో పెరిగే కలుపు మొక్క; దీన్నే ఏనుగుబీర అనీ అంటారు; *Elephantopus scaber,* Linn. (తె. 13).

ఎద్దుమట్టె రూ. ఎత్తిమట్టె. ఒకరకం కలుపు మొక్క (రా. 12, 18).

ఎద్దొరి (<ఎద్దు + వరి) ఒకరకం కలుపు మొక్క (కో. 1; రా. 1).

ఎనుమ్మోకాలు (<ఎనుము + మోకాలు) ఒకరకం కలుపు మొక్క; ? చూ. మోకాలు (కో. 34, 36).

ఎన్నూద్దులగడ్డి జేనెడెత్తుంటుంది; ఆకు సీతాఫలం ఆకు మాదిరిగా ఉంటుంది; ? చూ. వెన్నిద్దలకాడ (తె. 18).

ఎరగోల నేరేడుగడ్డి; *Ischaemum laxum,* R. Br. (తె. 42).

ఎర్రగడ్డి పరాగ. ఎర్రతీగలగడ్డి. ఎర్రనేలల్లో ఎత్తుగా పెరిగే కలుపుమొక్క (కో. 31; రా. 17, 18).

ఎర్రతీగలగడి పర్యా. చూ. ఎర్రగడ్డి. ఎర్రనేలల్లో ఎత్తుగా పెరిగే కలుపుమొక్క (రా. 8).

ఎర్రబెండ ఒకరకం కలుపుమొక్క; *Hibiscus species* (కో. 10).

ఎర్రోమిట ఎర్రవామిటాకు; *Cleome pentaphylla* (కో. 6).

ఎలికచెవి ఉ. ఎనకసెవ్వు, ఎలకచెవ్వు, ఎలికసెవి, ఎలికజెవ్వు, ఎలికెసెవ్వు, ఎల్కచెవ్వు; పర్యా. ఎలికజెముడు, ఎలికజేడు, చెవలకాడ, చెవలాకు. ఎలుకచెవ్వాకు; చెమ్మనేలల్లోను నల్లరేగడినేలల్లోను మొలిచి పసుప్పచ్చటి పూలు పూసే పాకుడు కలుపుమొక్క; ఆకును కూరగా వండుకొంటారు; *Ipomaea reniformis,* Chois. (కో. 1, 39, 46; తె. 24, 31, 32; రా. 1, 10, 18).

ఎలికజెముడు ఉ. ఎలికజీమిడి; రూ. ఎలికజేడు; పర్యా. చూ. ఎలికచెవి. ఎలుకచెవ్వాకు; చెమ్మనేలల్లోను, నల్లరేగడి నేలల్లోను మొలిచి పసుప్పచ్చటి పూలు పూసే పాకుడు కలుపుమొక్క; ఆకును కూరగావండుకుంటారు; *Ipomaea reniformis,* Chois. (కో. 5, 6, 10–12, 17–19).

ఎలికజేడు రూ. ఎలికజెముడు; పర్యా. చూ. ఎలికచెవి. ఎలుకచెవ్వాకు; చెమ్మనేలల్లోను, నల్లరేగడి నేలల్లోను మొలిచి పసుప్పచ్చటి పూలు పూసే పాకుడు కలుపు మొక్క; ఆకును కూరగా వండుకొంటారు; *Ipomaea reniformis,* Chois. (కో. 29).

ఎలికబీర బీరజాతికి చేరిన ఒకరకం కలుపుమొక్క; *Hemicyclia species* (రా. 28).

ఎల్లిపాయలగడ్డి (ఎల్లిపాయల<వెల్లుల్లిపాయల) ఒకరకం కలుపు మొక్క (తె. 3).

ఏడతర (ఎడతర<కన్నడ ఎడతరి) చూ. వెల్తురు (రా. 16, 17).

ఏడె(గడ్డి) బల్లపరపుకాడ గల కలుపుమొక్క; పశువుల మేతకు ప్రశస్తం; పూరిళ్ళ కప్పులకు వాడతారు; దుబ్బకాసిరి, కాసిరిగడ్డి అనీ అంటారు; *Heteropogon contortus,* Beauv. (తె. 7, 9, రా. 8).

ఏనుగమాంసం(గడ్డి) ఒకరకం కలుపుమొక్క (కో. 37.)

ఏపి బూడిదరంగు గరుకు బెరడు, ఎర్రటి గట్టికలప, పసుపుపచ్చటిపూలుగల పెద్దచెట్టు; దీని ఆకును పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు; కొమ్మలను కంచెగా వేస్తారు; *Hardwickia binata,* Roxb. (కో. 39, 41, 43; రా. 11).

ఒడిపేలు ఉ. ఒడిపిలి; చూ. వరిపిలి (కో. 31; తె. 13).

కంచెగడి మెట్టనేలల్లో మొలిచే కలుపుమొక్క. ? *Aplud aristata,* Linn. (తె. 7. 9, 10).

కట్టజెముడు జెముడులో ఒకరకం; *Euphorbia caducifolia,* Haines. (రా. 12, 13, 15).

కట్టి పర్యా. చూ. ఆకు. ఊడ్పులకును, విత్తనం చల్లటానికిని ముందు మళ్లల్లో ఎరువుగా వేసి తొక్కే చెట్లఆకు

(కో. 47; తె. 7, 31).

**కట్లకాడ** ఒకరకం కలుపుమొక్క; *Carpopogon pruriens* (కో. 4, 25).

**కట్లతీగె** రూ. కట్లలం. మెట్టలో మొలిచే తెల్లటి నూగు నిండిన పాకుడుతీగ; నీలపుప్పి: ఉమ్మెత్త పూల వంటి పూలు పూస్తుంది; పశువులు ఇష్టపడవు; *Andropogon aciculatus*, Retz. (తె. 13, 33, 36).

**కట్లలం** చూ. కట్లతీగె (తె. 34).

**కత్తాళి** చూ. కర్తాళి (రా. 15).

**కద్రుక** ఉ. కదుర్కా. సన్నటి కదురులాటి కాడ గల కలుపుమొక్క (తె. 15, 25).

**కనకటిత్తనం** ? సదనపు వెదురు; కలుపుమొక్క: ? *Bambos stricta*, Roxb. (తె. 4).

**కనప** కనుముగడ్డి; పశువుల మేతకు ప్రశస్తం; *Sorghum halepense*, Pers. (కో. 29, 39, 39, 41).

**కన్నికొమ్మ** ఒకరకం కలుపుమొక్క (తె. 31).

**కందికేర** ఉ. కందికార, కందికారి. ఒకరకం కలుపు మొక్క (కో. 12; రా. 18, 27).

**కందిచెక్క** జొన్న, సజ్జ మొ. పైర్లతో కలిపి అక్కడి పైరుగా సాగుచేసే పప్పుదినుసు మొక్క: దీని ఆకును పచ్చి ఎరువుగాను, పశువుల మేతగాను ఉపయోగిస్తారు; *Cajanus indicus*, Spreng. (తె. 4).

**కందుతుమ్మెద** ఒకరకం కలుపుమొక్క (తె. 30).

**కప్పరద్దు** కప్పరొదగడ్డి; పశువుల మేతకు ప్రశస్తం; దీని గింజలు బీదలు తింటారు; ***Panicum* Colonum**, Linn. (కో. 47).

**కంప** ముళ్ళమండ (కో. 2, 5, 11, 13, 16-18, 20, 24; తె. 9, 11; రా. 9, 12, 25, 26): -**కరసాలు** పర్యా. కల్లచాలు. వామిదొడ్డి, పొలం మొదలగువాటిచుట్టూ ఆవరణగా కంపను పాతిన చాలు (రా.).

**కర్తాళి** రూ. కర్తాళి; పర్యా. చూ. కలబంద. నాలు గయిదడుగుల పొడుగూ, నాలుగయిదంగుళాల వెడల్పుగల దళసరి మట్టలవంటి ఆకులూ, వీటి అంచుల్లో వాడిముళ్ళూ ఉండి నారగా ఉపయోగపడే మొక్క: కంచెమొక్కగానూ వేస్తారు; *Aloe barbadensis* (రా. 16, 17).

**కలబంద** ఉ. కలమంద; పర్యా. కత్తాళి, కర్తాళి, తట్టాయి, దయ్యంమట్ట, నాగరమట్ట. నాలుగయిదడుగుల పొడుగూ, నాలుగయిదంగుళాల వెడల్పుగల దళసరి మట్టల వంటిఆకులూ, వీటిఅంచుల్లో వాడిముళ్ళూఉండి నారగా ఉపయోగపడే మొక్క; కంచెమొక్కగానూ వేస్తారు; *Aloe barbadensis* (రా. 2–9, 18, 25): **భేదాలు**: ఎర్ర-లేత ఆకుపచ్చటి ఆకుల అంచుల్లో వాడిముళ్ళు, లేత ఎరుపురంగుపూలు గల కలబంద; దీన్నే చిన్నకలబంద అని అంటారు; దీని సొననుంచి సిరా తయారు చేస్తారు; కరువుతో బీదలు ఈ సొనను తింటారు; *Aloe indica*. (రా.): సీమ - అమెరికానుంచి తెచ్చిన ఒకరకం కలబందమొక్క: దీని నారతో కంటళ్ళు, చాపలు తయారు చేస్తారు; *Aloe litoralis* (రా.).

**కలిగి** చూ. కలివి (రా. 1).

**కలిమి** ఉ. కలమె; చూ. కలివి (తె. 7, 8).

**కలివి** ఉ. కలవి, కలవె, కలివె; రూ. కలిగి, కలిమి, కళివె; పర్యా. కలేకంప. పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క; నల్లటికాయలు కాస్తుంది; పళ్ల తింటారు; దీని కొయ్యతో దువ్వెనలు, గరిటెలు చేస్తారు; *Carissa carandas*, Linn. (కో. 23; తె. 38; రా. 7).

**కలేకంప** పర్యా. చూ. కలివి. పొదగా పెరిగే ముళ్ళ కంచెమొక్క; నల్లటికాయలు కాస్తుంది; పళ్ళుతింటారు; దీని కొయ్యతో దువ్వెనలు, గరిటెలు చేస్తారు; *Carissa carandas*, Linn. (కో. 5, 8, 10, 11; రా. 9).

**కల్పగంటు** జొన్నకాడలా ఉండే కలుపుమొక్క (తె. 25).

**కల్లచాలు** ఉ. కల్లపాలు; పర్యా. చూ. కంపకరసాలు; వామిదొడ్డి, పొలం మొ. వాటి చుట్టూ ఆవరణగా కంపను పాతిన చాలు (రా. 18).

**కళివె** చూ. కలివి (రా. 17).

**కళ్ళి** ఉ. కల్లి; పర్యా. సన్నజెముడు. పొదగా పెరిగే ఒకరకంకంచెమొక్క; *Euphorbia tirucalli*, Linn. (రా. 3–6, 8, 14-18): **భేదాలు**: ఊరి- ఉ. -గళ్ళి. చుట్టుపట్ల పెరిగే కళ్ళిచెట్లు: వామి దొడ్లకును ఊరి దగ్గరి చేలకును కంచెగా నాటతారు: ? *Euphorbia nivulai*, B. Ham. (రా.): పాల - ఎక్కువగా పాలతో నిండిన కాడలుకల కళ్ళి; *Euphorbia species* (రా.): సన్న - కళ్ళిలో ఒకరకం; *Euphorbia species* (రా.): సీమ - కంచెమొక్క: దీని ఆకులు నారికురుపు (Guinea-worm) చికిత్సలో వాడతారు (రా.).

**కవాలగడ్డి** చూ. కవ్వాలగడ్డి (తె. 42).

**కవ్వాలగడ్డి** రూ. కవాలగడ్డి. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క: పశువుల మేతకు ప్రశస్తం; *Eleusine degyptiaca*, Desf. (కో. 7, 9, 11, 13).

**కసికింద** చూ. కసింద (కో. 47).

**కసింద** రూ. కసికింద, కసివెంద. రోడ్లపక్కను, బంజరునేలల్లోను ఏటా లేచి తుప్పగా పెరిగే మొక్క; పసుపుపచ్చటి పూలు పూస్తుంది; పడమటి ఇండియాదీవుల నుంచి తెచ్చింది; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు

*Cassia occidentilas* Linn. (కో. 25, 27, 45).

కసివెంద చూ. కసింద (కో. 41).

కాకిబరపట కాకిగడ్డి ; ఒకరకం కలుపుమొక్క (తె. 1).

కాకిబుడ్డాకు ఒకరకం కలుపుమొక్క ; *Cardiospermum* (రా. 18).

కాకిరెక్కాకు వెడల్పాటి ఆకులుండే కలుపుమొక్క (కో. 3).

కాగు చూ. కానుగు (కో. 48).

కాచి ఏటా లేచి 3 అడుగుల ఎత్తుదాకా పెరిగే గడ్డి మొక్క ; తెల్లటి పూలు పూస్తుంది ; నల్లటిపళ్ళు, మెత్తటి ఆకులు ఉంటాయి ; *Solanum nigrum*, Linn. (రా. 18).

కాజగడ్డ ఒకరకం కలుపుమొక్క (కో. 22).

కాటికాకు (<కాటుక + ఆకు) ఒకరకం కలుపు మొక్క (కో. 9).

కాడరాగి నాలుగు రెక్కల ఎన్నులుండే ఒకరకం కలుపుమొక్క. ?*Eleusine aegyptiaca*, Desf. (రా. 17).

కాద్ర(గడ్డి) ఒకరకం కలుపుమొక్క (కో. 27).

కాంద్రేగు ఉ. కాన్రేగు ; రూ. కామరేము. పొదగా 6 అడుగుల ఎత్తుపెరిగే ఒకరకం ముళ్ళచెట్టు ; ఆకుపచ్చటి పూలు పూస్తుంది ; దీనికొమ్మలు కంచెకు వాడతారు ; పళ్ళు తింటారు ; ఆకు పశువుల మేతగా ఉపయోగిస్తుంది; *Flacourtia sapida*, Roxb., *or Flacourtia ramontchi*, L'Her. (కో. 23).

కానుగు ఉ. కానగ, కానిగె, కానుగ, కాన్గ, కాన్గు, కాన్గె; రూ. కాగు, గానుగ. సముద్ర తీరపు అడవుల్లోను, ఏటిగట్లను, కొండలమీదను పెరిగే చెట్టు ; ఆకును పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు ; దీని గింజలనుంచి తీసిన చమురు వైద్యంలో ఉపయోగిస్తుంది ; ఆకును పశువులు తింటాయి ; *Pongamia glabra*, Vent. (కో. 15; తె. 5-8, 11, 12, 14, 15, 24, 26, 32-36; రా. 2-6, 8, 10, 11, 14, 15, 17, 18, 22, 23, 25-28).

కామరేము చూ. కాంద్రేగు (కో. 42).

కామాకు (<కాము + ఆకు,? కాము<కాను, కానుగు) చూ. కానుగు (కో. 42).

కారు చూ. గార (రా. 16).

కారుకంది ఉ. కారకంది. కారెకంది. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలచే కలుపుమొక్క (కో. 9-11, 13 ; తె. 1, 12, 27, 29, 34, 36).

కారుబెండ ? అడవిబెండ ; *Hibiscus species* (కో. 50).

కారె(గడ్డి) ఉ. కారి(గడ్డి). ఇసకనేలల్లోను, చవిటి నేలల్లోను బాగా పెరిగే కలుపుమొక్క; పశువుల మేతకు ప్రశస్తం ; చిన్నకారె, పెద్దకారె అని రెండు రకాలు ; *Panicum repens*, Linn. (కో. 8, 12, 37 ; తె. 1, 33, 34, 36, 37, 39 ; రా. 8, 18).

కాంసి చూ. కాసె (రా. 17).

కాసె రూ. కాంసి. కామంచిగడ్డి ; పూరిళ్ళ కప్పులకు వాడతారు ; లేతగా ఉన్నప్పుడు పశువులు తింటాయి ; *Cymbopogon caesius*, Stapf. (తె. 1, 29).

కిత్తలి కలబందలో ఒకతెగ ; కిత్తనార మొక్క; ఆవరణాకు, అందంకోసమున్నూ కంచెగావేస్తారు ; *Agave americana*, Linn. (కో. 42 ; రా. 26).

కుక్కతులసి ఉ. కుక్కతొలసి. తులసిలో ఒకరకం ; బంజరునేలల్లో ఎక్కువగా పెరుగుతుంది; ఆకును వైద్యంలో ఉపయోగిస్తారు ; *Ocimum canum*, Sim. (కో. 23; 26; తె. 1, 37, 41).

కుక్కపొగాకు అడవిపొగాకు ; ఏటా మొలిచే చిన్న కలుపుమొక్క; *Blumea densiflora* (కో. 13 ; తె. 1).

కుంచికార కాడ ఎర్రగాఉండే చిప్పరగడ్డి రకం; *Panicum species* (రా. 21).

కుమ్మలలం (<కుసుముల + అలం) ఒక రకం; కలుపుమొక్క (తె. 17).

కుంటగలగర చూ. గుంటగలగర (తె. 1).

కుందిరిపి చూ. కుందురు (రా. 17).

కుందు ఒకరకం కలుపుమొక్క ; ? కుందురుగడ్డి (కో. 32).

కుందురు ఉ. కుందరి, కుందురి; రూ. కుందిరిపి; పర్యా. ఉర్రంకి. మెట్టలోను, మాగాణిలోను, మొలిచి తీగలాగా పరచుకునే గడ్డి ; నేలలో దుంప ఉంటుంది; పశువులకు మేతకూడా ; *Ischaemum pilosum*, Hack. (కో. 9, 14, 24, 25 ; తె. 13, 17, 18, 20, 21, 29 ; రా. 18, 21).

కుందేటిగడ్డి ఏటా మొలచే ఒకరకం కలుపుమొక్క; *Aristida funiculata*, Trin. & Rupr. (కో. 10).

కుందేటిమెరుగు ? చూ. కుందేటిగడ్డి (రా. 8).

కుప్పసోడి ఒకరకం కలుపుమొక్క; ? *Eleusine aegyptiaca*, Desf. (తె. 40).

కుసుమచెట్టు ? ఒకరకం కలుపుమొక్క (కో. 51; తె. 30; రా. 17).

కేశి(కంప) పర్యా. చూ. చిల్ల. ఒకరకమైన కంచె మొక్క ; *Commiphora berryi*, Jacq. (కో. 18).

కొడిసె పాల్చె - చూ. అంకుడు. గుబ్బగా పెరిగే అడవి ... : తెల్లటిపూలు పూస్తుంది; రెండేసి కాయలు గుత్తిగా ... చివర్లో ఒకదానితో ఒకటి కలిసి ఉంటాయి; దీని ... కర్రతో ముచ్చెసలు, బొమ్మలు తయారుచేస్తారు; ఆకును ...ఎక్కువగా ఉపయోగిస్తారు: *Holarrhena antidysenterica*, Wall. (తె. 11, 12, 14; రా. 15).

కొండమిరప కొండమిరప; ఒకరకం కలుపు మొక్క; ...రికారుండి తెచ్చింది; *Croton sparsiflorus*, ...r. (కో. 38).

కొండలం (< కొండ + అలం) ఒకరకం కలుపు ...క్క (కో. 9, 18).

కొనిగడ్డి ? గినిగడ్డి; ఒకరకం కలుపు మొక్క; పశు మేతకు ప్రశస్తం: *Panicum maximum* Jacq. ... 38).

కొరికి ? చూ. గురుగు (కో. 41, 48).

కోడికాడ చూ. కోడికాలు (కో. 36).

కోడికాలు చూ. కోడికాడ. కోడికాలు లాటి కాడలు ...నెల్లటిపూలు; పశువులమేతకు ప్రశస్తం; చూ. పిట్టకాలు; ...*eusine aegyptiaca*, Desf. (కో. 27, 37, 39, 44, 48; తె. 22, 25, 32, 36).

కోడిజుట్టు పెటా లేచి పెరిగే ఒకరకం కలుపు మొక్క; ...ం అందమైన ఎన్ను వేస్తుంది: ?*Celosia cristata*, ...nn. (తె. 1, 32).

కోడిముచ్చు తుంగలాటి ఒకరకం కలుపు మొక్క; ...సికాలు (తె. 18).

కోణంగి ఒకరకం కలుపు మొక్క (రా. 23).

కోరింద ముళ్లుగోరింట; రోడ్లపక్కను, బంజరునేల ...ను పెరిగే ముళ్ళకలుపు మొక్క; పూలు గరాటిలా ...టాయి; ...ంచెగాను వేస్తారు: *Acacia intsia*, ... & A. (కో. 11; తె. 10); భేదాలు: రిచ్చ-...రిందలో ఒక రకం (కో. తె.); -సీమ కోరిందలో ఒక ...ం (తె.).

కోర(గడ్డి) ఒకరకం కలుపు మొక్క; *Rotteoellia* (తె. 21).

కోలజెముడు బొంతజెముడు; బొమ్మజెముడు; కత్తి ...ందు చెట్టు: *Euphorbia antiquorum*, Linn. ...తె. 6).

క్రిష్ణకాంత ఉ. కిష్టకాంత. ఒకరకం కలుపు మొక్క ...కో. 27).

గంగరేను చూ. గంగరేవాకు (రా. 2).

గంగరేవాకు రూ. గంగరేను. పసుప్పచ్చటి పూలు. ...గుమ్మచెట్టు ...దుకు బెరడుగల చెట్టు; ఆకును పచ్చి ...డుపుగా ఉపయోగిస్తారు: *Thespesia populnea*, Corr. (కో. 4).

గచ్చ గుబురుగా పెరిగే ఒకరకం ముళ్ళమొక్క; పసుప్పచ్చటి పూలు పూస్తుంది; లేత బూడిదరంగుగల గుండ్రటి కాయలు ఉంటాయి; *Caesalpinia bonducella*, Flem. (కో. 45; రా. 25).

గజ్జెలకాడ పర్యా. చూ. గజ్జెలాకు. గిలిగిచ్చచెట్టు; *Crotalaria sericea*, Retz., *Crotalaria verrucosa*, Linn. (కో. 36).

గజ్జెలాకు పర్యా. గజ్జెలకాడ. గిలిగిచ్చచెట్టు; *Crotalaria sericea*, Retz., *Crotalaria verrucosa*, Linn. (రా. 18).

గంజేరు చూ. గలజేరి (తె. 39).

గడ్డి ఒకరకం కలుపు మొక్క; కొర్రఎన్నులాటి, ఎన్ను వేస్తుంది; పశువులమేతకు ప్రశస్తం; దీన్నే నక్క-కొర్ర, నక్కతోకగడ్డి అనికూడా అంటారు: *Setaria glauca*, Beauv. (తె. 17).

గంటకాకు పర్యా. గంటలగడ్డి, గంటలలం, గంటిగినలం, గంటె. మెట్టలో పెరిగే కలుపు మొక్క; పశువుల మేతకు ప్రశస్తం; *Eleusine indica*, Gaertn. (రా. 8, 14, 18, 28).

గంటలగడ్డి పర్యా. చూ. గంటకాకు. మెట్టలో పెరిగే కలుపుమొక్క; పశువులమేతకు ప్రశస్తం; *Eleusine indica*, Gaertn. (తె. 7, 10, 38).

గంటలలం పర్యా. చూ. గంటకాకు. మెట్టలో పెరిగే కలుపు మొక్క; పశువులమేతకు ప్రశస్తం; *Eleusine indica*, Gaertn. (తె 8, 9).

గంటిగినలం పర్యా. చూ. గంటకాకు. మెట్టలో పెరిగే కలుపు మొక్క; పశువులమేతకు ప్రశస్తం; *Eleusine indica*, Gaertn. (రా. 17).

గంటె పర్యా. చూ. గంటకాకు. మెట్టలో పెరిగే కలుపు మొక్క; పశువుల మేతకు ప్రశస్తం; *Eleusine indica*, Gaertn. (రా. 10).

గద్దగోడి ఉ. గెద్దగోడి. ? గద్దగోరు; గద్దగోరులాటి వాడియైన వంకరముళ్ళుగల కలుపు మొక్క; మల్లెచెట్టులా ఉంటుంది; ?*Scutia indica*, Brongn. (కో. 51).

గన్నేర గన్నేరు; కంచెగా వేస్తారు: *Plumeria acutifolia*, Poir., *or Nerium odorum*, Soland. (కో. 42).

గబ్బు రూ. గర్బ. ఆకుదోటల్లో ఎక్కువగా మొలిచే కలుపు మొక్క; నడుమెత్తు పెరుగుతుంది (కో. 3, 4; తె. 4).

గరిక ఉ. గరక, గరికి, గరికె, గరెక, గెరిక, గెరికి; రూ. గర్క. నేలలో లోతుగా వేళ్ళుపాతుకుని పెరిగే

కలుపు మొక్క; పశువులకు ముఖ్యంగా గుర్రాలకు మేతగా అతిప్రశస్తం; *Cynodon dactylon*, Pers. (కో. 1, 4–7, 10–13, 17, 21, 25–29, 32, 34–39, 44–46, 48–51; తె. 1, 5, 7, 8, 10, 12, 20, 21, 26, 29, 31, 32, 36, 37, 40–42; రా. 1, 8, 18, 21, 26); **భేదాలు**: **ఉప్పు-** గరికలో ఒకరకం (కో.); **-సీమ** సన్నగరికె; పశువుల మేతకు ప్రశస్తం; *Eragrotis plumosa*, Link (కో.).

గర్కు ఉ. గర్కె; చూ. గరిక (తె. 13, 15–19, 27, 28).

గర్బ చూ. గబ్బు (కో. 19).

**గలజేరి** ఉ. గలజరి, గలిజర; రూ. గంజేరు. రోడ్ల పక్కను, బంజరునేలల్లోను పెరిగే తెల్లటిపూల, నల్లటి విత్తుల కలుపు మొక్క; ఆకును కూరగా వండుకొంటారు; *Trianthema monogyna*, Linn. (కో. 40, 43, 47, 48).

**గలరి** ? గలిజేరు; మెట్టనేలల్లో మొలిచే కలుపు మొక్క (కో. 44).

**గలిబి** ఒకరకం కలుపు మొక్క (కో. 31).

**గాడితట్ట** ? గాడిదగడపరాకు; ఆకెరువుగా ఉపయోగిస్తారు; ? *Aristolochia bracteata*, Retz. (రా. 9).

**గాడిదపర్రాకు** ? గాడిదగడపర; మాగాణిలో ఎక్కువగా మొలిచే కలుపు మొక్క; ? *Aristolochia bracteata*, Retz (కో. 20, 21).

**గాడిదేకు** ? గాడిదగడపర; నల్లరేగడి నేలల్లో ఎక్కువగా మొలిచే మొండిరకం కలుపు మొక్క; *Aristolochia bracteata*, Retz. (రా. 18, 23).

**గానుగ** చూ. కానుగు (కో. 51).

**గాబ** ఉ. గాబు. నల్లరేగడి నేలల్లోను, మాగాణిలో గనిమలమీదను ఎక్కువగా మొలుస్తుంది; భూమిలో అల్లుకుపోయి కణుపులదగ్గర పైకిలేచి తీగగా పాకుతుంది; మోకాలెత్తు పెరుగుతుంది (కో. 3, 13, 16; రా. 1).

**గార** రూ. కారు. నల్లరేగడినేలల్లో 20 అడుగుల ఎత్తు ఎదిగే ఒకరకం కంచె మొక్క; సువాసనగల పచ్చటి పూలు పూస్తుంది; *Balanites aegyptiaca*, W. (కో. 8, 9; రా. 14).

**గాలివానమొక్క** ఒకరకం కలుపు మొక్క; *Croton species* (కో. 47, 48).

**గిట్టు** మాగాణిలో మొలిచే కలుపు మొక్క; వరిలాగ ఉంటుంది; కాడ తెలుపు; *Polytoca species* (కో. 15; రా. 17, 18).

**గుజ్జంగి** రూ. గొజ్జెంగ. సుగంధతైలంకోసం పెంచే ఒకరకం గడ్డిమొక్క; దీన్నే నిమ్మగడ్డి, వాసనగడ్డి అని అంటారు: *Cymbopogon citratus*, Stapf. (కో. 40, 42, 43, 46, 49, 50).

**గుంజర** తుంగలో చాల మొండిరకం కలుపు మొక్క; వరి మొక్కలాగే ఉంటుంది; వేళ్ళు లోతుగా ఉంటాయి; జేనెడెత్తు ఎదుగుతుంది (తె. 10, 12, 15–18).

**గుడ్డిపూలాకు** ఒకరకం కలుపు మొక్క; సెనగపూల మాదిరి ఆకు ఉంటుంది (రా. 14).

**గుడ్లలం** ఉ. గుడ్లలుం. ఒకరకం కలుపు మొక్క (కో. 9, 12; తె. 4).

**గుంటకలవర** చూ. గుంటగలగర (కో. 37).

**గుంటగలగర** రూ. కుంటగజ్జెర, గుంటకలవర, గుంటగింజేర. రోడ్లపక్కను, బంకమట్టి నేలల్లోను, పచ్చిక బయళ్ళలోను ఏటా మొలిచే మొక్క; తెల్లటిపూలు పూస్తుంది; *Eclipta alba*, Hassk. (రా. 1).

**గుంటగింజేర** చూ. గుంటగలగర (కో. 5, 6).

**గుండపోరాకు** ఒకరకం కలుపు మొక్క (కో. 20).

**గునుకు** ఉ. గుణక; చూ. గునుగు (కో. 7–11; తె. 3–5, 7, 9, 10, 32, 36; రా. 1, 27).

**గునుగు** ఉ. గునిగి, గున్గు; రూ. గునుకు. పశువుల మేతకు ప్రశస్తమైన గడ్డిమొక్క; *Panicum maximum*, Jacq. (కో. 13, 23–25, 29, 31; తె. 1, 7, 8, 10, 19, 20, 22, 23, 25–27, 32, 34, 38, 39).

**గుమ్ముడు** పల్చటి గోధుమవన్నె బెరడు, చిన్న ముళ్ళు, చిన్న ఆకులు, పెద్దసైజు పసుప్పచ్చటి పూలు, రేగుపళ్ళసైజు నల్లటి పళ్ళు ఉండి నిస్సారమైన నేలల్లో అక్కడక్కడ గుబురుగా పెరిగే ఒకరకం కంచెమొక్క *Gmelina asiatica*, Linn. (కో. 8).

**గురుగు** ఉ. గురిగి; రూ. గురుం, గురువు, గొరిగె. జనపమొక్క లాటి కలుపు మొక్క; తెల్లటి కంకి, నల్లటి విత్తనాలు ఉంటాయి; *Chrozophora rottleri*, Klotzsch (కో. 9, 10, 12–15, 18, 22, 23, 26–28, 35–39; తె. 3, 28, 40, 41; రా. 14, 18, 23).

**గురుం** చూ. గురుగు (కో. 46, 49, 50).

**గురువు** చూ. గురుగు (కో. 29, 37, 51; రా. 1).

**గులుగు** చూ. గొలుగు (కో. 43).

**గువ్వగుత్తి** ఉ. గువగుత్తి, గూగుర్తి; రూ. గూగుత్తి, గోవుగుత్తి. మెట్టలోను, ఎర్రనేలల్లోను ఎక్కువగా పెరిగే కలుపు మొక్క; పగడపు తీగె; *Arum colocosta* (కో. 10, 22, 31; తె. 22, 30).

**గూగుత్తి** ఉ. గూగుత్తిక; చూ. గువ్వగుత్తి (కో. 12, 21).

గొజ్జంగ చూ. గుజ్జంగి (కో. 39, 41).

గొంగి ఒకరకం ఆకెరుపు మొక్క (కో. 3, 5).

గొటికె పర్యా. చూ. గొట్టి. పొదగా పెరిగే ముళ్ళచెట్టు; పసుప్పచ్చ పూలు పూస్తుంది; కంచెగాను వేస్తారు; తోళ్ళను పదును చెయ్యటానికి గొడారివాళ్ళు దీని పళ్ళను ఉపయోగిస్తారు: *Zizyphus xylopyrus*, Willd., ? *Rhamnus xylopyrus* (రా. 18).

గొట్టి ఉ. గొట్టె; పర్యా. గొటికె. పొదగా పెరిగే ముళ్ళచెట్టు; పసుపచ్చ పూలు పూస్తుంది; కంచెగా వేస్తారు; తోళ్ళను పదును చెయ్యటానికి గొడారివాళ్ళు దీని పళ్ళను ఉపయోగిస్తారు: *Zizyphus xylopyrus*, Willd., ? *Rhamnus xylopyrus* (కో. 2, 5, 7, 8, 10; తె. 10; రా. 1, 7).

గొడ్డలిచిప్ప ఉ. గొడ్డల్చిప్ప. చిన్న కంచెమొక్క (రా. 1).

గొండెలలం ఒకరకం కలుపుమొక్క (తె. 1, 4).

గొబ్బి రూ. గొబ్బు; పర్యా. చూ. గొలిమిడి. నీరుగొబ్బిచెట్టు; చిత్తడినేలల్లోను, వరిచేలల్లోను, చెరువుగట్లమీదను మొలిచే కలుపుమొక్క: *Asteracantha longifolia*, Nees. (కో. 18, 21, 22).

గొబ్బు చూ. గొబ్బి (కో. 39).

గొరిగె చూ. గురుగు (కో. 42).

గొర్రెగడ్డం బంజరునేలల్లోను, రోడ్లపక్కను మొలిచే కలుపుమొక్క; కింద గుబురుగా, మీద సన్నగా ఉంటుంది; *Portulaca quadrifida*, Linn. (తె. 16, 23).

గొర్రెచీమిడి ఉ. గొర్రెసీమిడి. మెట్టనేలల్లో ఏటా లేచి పెరిగే ఒకరకం కలుపుమొక్క; నల్లటిపొడల తెల్లటి పూలు పూస్తుంది: *Andrographis echioides*, Nees., *Justicia eiliaris* (తె. 1).

గొలమె ఒకరకం కంచెమొక్క; ? చూ. గొలిమిడి (కో. 42).

గొలిమి ఉ. గొల్మి; చూ. గొలిమిడి (కో. 46; తె. 26).

గొలిమిడి ఉ. గొలివిడి; రూ. గొలిమి; పర్యా. గొబ్బి, గొబ్బు. నీరు గొబ్బిచెట్టు; చిత్తడి నేలల్లోను, వరిచేలల్లోను, చెరువుగట్లమీదను మొలిచే కలుపుమొక్క: *Asteracantha longifolia*, Nees (కో. 50; తె. 24).

గొలుగు రూ. గులుగు. తుప్పగా పెరిగే ఒకరకం కలుపుమొక్క; తెల్లటిపూలు పూస్తుంది; దీని ఎర్రటి పళ్ళు తింటారు; వైద్యంలో వాడే మూలిక; *Careya arborea*, Roxb., ? *Salvadora persica*, Linn., ? *Glycosmis pentaphylla*, Dalz. (కో. 37).

గోగడ ఉ. గోకడ, గోగట, గోగడి. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క: *Chrysopogon montanus*, Trin. (కో. 9, 10, 13, 25-27; తె. 41; రా. 8); భేదాలు: ఎర్ర- ఎర్రటి ఎన్నులువేసే గోగడ; *Chrysopogon species* (కో. రా.); దబ్బ- కాడలు దబ్బలాగా ఉండే గోగడ; *Chrysopogon species* (రా.); పాల- తెల్లటి ఎన్నులువేసే గోగడ; *Chrysopogon species* (రా.); పెద్ద- గోగడలో ఒకరకం; *Chrysopogon species* (కో.).

గోర్లాకు పర్యా. చూ. గోళ్ళగొండి. మెట్టలో మొలిచి తీగగా పాకే కలుపుమొక్క; నీలిరంగు పూలు పూస్తుంది; కరవుకాలాల్లో దీని గింజలను బీదలు ధాన్యం బదులు వాడతారు: *Cyapotis axillaris*, R. & S., *Tradescantia axillaris*, Roxb. (రా. 18, 23).

గోలోన ? పుల్లపావెల; *Portulaca species* (కో. 45).

గోళ్ళగొండి ఉ. గోలగొండి, గోల్లగొండి; పర్యా. గోర్లాకు, గోళ్ళలం. మెట్టలో మొలిచి తీగగా పాకే కలుపు మొక్క; నీలిరంగు పూలు పూస్తుంది; కరువుకాలాల్లో దీని గింజలను బీదలు ధాన్యం బదులు వాడతారు: *Cyanotis axillaris*, R. & S., *Tradescantia axillaris*, Roxb. (కో. 1, 3-5, 7, 8, 10-12, 15, 24; తె. 29; రా. 26).

గోళ్ళలం ఉ. గోల్లలం; పర్యా. చూ. గోళ్ళగొండి. మెట్టలో మొలిచి తీగగా పాకే కలుపుమొక్క; నీలిరంగు పూలు పూస్తుంది; కరువుకాలాల్లో దీని గింజలను బీదలు ధాన్యం బదులు వాడతారు; *Cyanotis axillaris*, R & S., *Tradescantia axillaris*, Roxb. (రా. 8).

గోవుగుత్తి ఉ. గోగుత్తి, గోగిత్తు; చూ. గువ్వగుత్తి (కో. 13, 23, 30).

చక్కులాకు ఒకరకం ఆకెరుపు మొక్క (తె. 31).

చండ్ర ఉ. సండ్ర. ఒకపాటి ఎత్తైన ముళ్ళచెట్టు; కంచెకు వేస్తారు; దీని కర్రతో రోకళ్ళు తయారుచేస్తారు: *Acacia sundra*, DC., *Mimosa sundra*, Roxb. (కో. 8, 24; తె. 7, 8, 38; రా. 9, 14, 18).

చందమామలం (<చందమామ + అలం) జొన్న మొ. పైర్లలో మొలిచి తీగగా పాకే చిన్న ఆకులుగల కలుపుమొక్క (తె. 16, 23, 24).

చమకు(లు) ? (<చవుకుమాను) ఒకరకం కలుపు మొక్క; ? *Casuarinaceae* (తె. 31).

చవిటిపుల్లగడ్డి ఉ. సౌటపుల్లగడ్డి. ఉప్పుగడ్డిలో ఒక రకం; *Chloris species* (తె. 3).

చాగనార(మట్ట) పర్యా. చూ. చాగ (మట్ట). కలబందలో ఒకరకం కంచెమొక్క; బాగా ముదిరిన తరవాత మధ్య గడలాటి కాండం పుడుతుంది; చాలాఎత్తు పెరుగుతుంది. *Sansevieria roxburghiana,* Schult. (తె. 40).

చాగపట్టు పెద్దకలబందలో ఒకరకం మొక్క; దీని మట్టలనుంచి నార తీస్తారు; *Sansevieria zeylanica* Roxb. (తె. 11).

చాగ(మట్ట) పర్యా. చాగనార (మట్ట). కలబందలో ఒకరకం కంచెమొక్క; బాగా ముదిరినతరవాత మధ్య గడలాటి కాండం పుడుతుంది; చాలాఎత్తు పెరుగుతుంది. *Sansevieria roxburghiana,* Schult. (తె. 6, 10).

చామ(గడ్డి) పశువుల మేతకు ప్రశస్తం; కలుపు మొక్క; *Panicum crus-galli,* Linn. (కో. 36).

చాయాకు ఉ. సాయాకు. నల్లటి ఆకుల కలుపు మొక్క (తె. 20).

చిక్కుడు(తీగె) ఆకెరువుగా ఉపయోగిస్తారు; *Dolichos lablab,* Linn. (కో. 22).

చిగిరింత ఉ. చికిరెంత, చిగురంత, సిగిరింత. మెట్టనేలల్లో ఎక్కువగా మొలిచే చికిలింత గడ్డి; కలుపు మొక్క; ఎన్ను వెయ్యక ముందు పశువులు తింటాయి; ఎన్ను గుడ్డలకంటుకొంటుంది; *? Setaria verticillata,* Beauv., *?Panicum verticillatum,* Linn. (కో. 7, 8; తె. 1, 4, 8, 10, 12, 21, 22, 28, 34; రా. 9, 14, 27).

చించాకల చెంచలి; ఆకెరువుగా ఉపయోగిస్తారు (రా. 7).

చిట్టింటు రూ. చిట్టింత. మెట్టనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క; దీని ఆకును కూరగా వండుకొని తింటారు (కో. 15, 18-20).

చిట్టింత చూ. చిట్టింట (కో. 17).

చిప్పతట్టాకు చూ. చెప్పుతట్టాకు (తె. 31).

చిప్పతట్లలం (<చిప్పతట్ల+అలం) పర్యా. చూ. చెప్పుతట్టాకు. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే పాకుడు కలుపుమొక్క; *Cissus pedala* (తె. 31).

చింత కొమ్మలు కంచెగా, ఆకు పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Tamarindus indica,* Linn. (కో. 3, 17, 20, 39, 40, 42, 45; తె. 29, 31; రా. 1, 16, 18); భేదం: సీమ- కంచెమొక్కగా పెంచే నిటారైన కురచముళ్ళుగల చెట్టు; మెలికలు తిరిగిన దీని కాయలను పశువులు తింటాయి; ఆకును మేకలు తింటాయి; పళ్ళలోని గుజ్జును తింటారు; అమెరికానుంచి తెచ్చింది; *Pithecolobium dulce,* Benth. (కో.).

చిప్పనగడ్డి ఒకరకం కలుపుమొక్క; పశువుల మేతకు ప్రశస్తం; *? Panicum repens,* Linn., *Cymbopogon citratus,* Stapf. (తె. 28).

చిప్పర ఉ. చిప్పరి, చిప్పిరి, చిప్పెర, సిప్పర, సిప్పరి, సిప్పిరి, సిప్పిరె, సిప్పెర. పొడుగాటి ఆకులతో దుబ్బుగా పెరిగేకలుపు మొక్క; మెట్టలోను, మాగాణిలోను, మాగాణి గనిమలమీదను ఎక్కువగా మొలుస్తుంటుంది; పశువుల మేతకు ప్రశస్తం; *Panicum prostratum,* Lamk. (కో. 3, 6, 8-14, 16, 17, 19-24, 26-29, 35, 40, 44; తె. 1, 3, 12, 24, 25, 29, 31, 33, 34, 36, 37, 39, 41; రా. 10, 12, 14, 17, 18, 21, 23, 24, 26, 28); భేదాలు: ఆకు- చిప్పరగడ్డి జాతికిచెందిన ఒకరకం కలుపుమొక్క; a variety of *Panicum prostratum* (తె.); ఎర్ర- కాడ ఎర్రగాఉండే చిప్పర; a variety of *Panicum prostratum* (రా.); కాకి- చిప్పరలో ఒకరకం కలుపుమొక్క; a variety of *Panicum prostratum* (కో.); చీమ- చిప్పరలో ఒకరకం కలుపుమొక్క (కో.); పైరు- చిప్పరలో ఒక రకం కలుపుమొక్క (రా.); బొంత- లావాటి కాడలుండే చిప్పర; కలుపుమొక్క (రా.); సీమ- చిప్పరలో ఒక రకం కలుపుమొక్క (కో. తె.).

చిప్పె ఒకరకం కలుపుమొక్క; ? చిప్పగడ్డి; *? Cymbopogon citratus,* Stapf. (తె. 10, 12).

చిరపాల అడవిపాల; ఆకెరువుగా ఉపయోగిస్తారు; *Mimusops hexandra,* Roxb. (తె. 7).

చిర్రి ఉ. సిర్రి. గ్రంథిల; నేలమీద పాకిపెరిగే కలుపు మొక్క; ఆకు కూరగాను వాడతారు; *Amarantus campestria,* Willd. (కో. 10; తె. 1).

చిలక పర్యా. చిలకతోటకూర. ఆకుకూరగాను వాడే ఒకరకం కలుపుమొక్క; తోటకూరలో ఒకరకం; *Amarantus viridis,* Linn. (కో. 51).

చిలకతోటకూర పర్యా. చూ. చిలక. ఆకుకూరగాను వాడే ఒకరకం కలుపుమొక్క; తోటకూరలో ఒకరకం; *Amarantus viridis,* Linn. (కో. 37).

చిల్ల ఉ. సిల్ల; పర్యా. కేశికంప. ఒకరకమైన కంచె మొక్క; *Commiphora berryi,* Jacq. (కో. 6 17, 20, 24, 42; రా. 6, 17).

చిల్లి వేసవికాలంలో పూసే సువాసనగల పసుప్పచ్చటి పూలు, నిగనిగలాడే నల్లటి పళ్ళుగల చెట్టు; గింజలు వైద్యంలో ఉపయోగిస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Strychnos potatorum,* Linn. (రా. 14).

చీకినూగు ఉ. సీకినూగు; చూ. చీకునువ్వు (తె. 1,

8, 9, 34).

**చీకునువ్వు** ఉ. సీకినువ్వు; రూ. చీకినూగు. నువ్వు మొక్కలా ఉండే ఒకరకం కలుపుమొక్క (తె. 12, 21, 28).

**చీపురు** ఉ. సీపురు. రాతినేలల్లో ఎక్కువగా మొలిచే పొడుగాటికాడల గడ్డిమొక్క; దీని కాడలను చీపురుకట్టలకు ఉపయోగిస్తారు; *Aristida setacea*, Retz. (కో. 25, 46; తె. 11, 28); **భేదం : గుంట-** చీపురులో ఒకరకం కలుపుమొక్క; *Aristida species* (కో.).

**చీమకాయ** ఉ. సీమకాయ; రూ. చీమకాలు. చీమల్లాటి చిన్నకాయలుండే నల్లటి కలుపుమొక్క (తె. 18).

**చీమకాలు** ఉ. సీమకాలు; చూ. చీమకాయ (తె. 17, 21, 22, 29).

**చీలగడ్డి** తుంగలో ఒకరకం కలుపుమొక్క; *Cyperus species* (తె. 13).

**చుక్కబొట్లలం** నేలమీదపాకే కలుపుమొక్క; ? చుక్కకూర; ? *Rumex vesicarius*, Linn. (తె. 20).

**చూడబుత్తి** ఒకరకం కలుపుమొక్క (కో. 42).

**చెంగలి** ఉ. చెంగల; రూ. చెంగాలి. మాగాణిలో ఎక్కువగా మొలిచి పాకి పెరిగే కలుపుమొక్క; కొంచెం ఎరుపుగా ఉంటుంది: ఆకుల అంచుల్లో నూగు ఉంటుంది; పశువుల మేతకు ప్రశస్తం; *Iseilema laxum*, Hack. (కో. 10, 13, 14, 17-19, 21, 24, 27, 32, 34, 35, 37, 39, 41; తె. 11, 32); **భేదాలు :** ఎర్ర- చెంగలిలో ఒకరకం; పశువులమేతకు ప్రశస్తం; *Iseilema laxum*, Hack. (కో.); **గుడ్డి-** చెంగలిగడ్డిలో ఒకరకం కలుపుమొక్క; *Iseilema species* (తె.); **దుబ్బ-** చెంగలిలో ఒకరకం; *Iseilema species* (కో.); **నీరు-** నీటివారల మొలిచే చెంగలి; *Iseilema species* (కో.).

**చెంగాయి** ఉ. సెంగాయి. ఒకరకం కలుపుమొక్క (కో. 8, 9; రా. 1, 10, 12, 18, 26, 27); **భేదం : గుడ్డి-** చెంగాయిలో ఒకరకం (కో.).

**చెంగాలి** చూ. చెంగలి (కో. 42).

**చెంచలి** ఉ. సించల, సెంచలి, సెంచెల; పర్యా. చెంచలలం. మెట్టనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపు మొక్క; ఆకులు బల్లెపాకారంగా ఉంటాయి; ఎర్రటి పూలు పూస్తుంది; ఆకును కూరగా వాడతారు; *Digera arvensis*, Forsk. (కో. 7, 9-12, 14, 19, 22, 31, 37; తె. 4, 22, 30, 32, 33, 39, 40, 42; రా. 2, 18); **చెంచలలం** (<చెంచలి + అలం) పర్యా. చూ. చెంచలి. మెట్టనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపు మొక్క; ఆకులు బల్లెపాకారంగా ఉంటాయి; ఎర్రటిపూలు పూస్తుంది; ఆకును కూరగా వాడతారు; *Digera arvensis*, Forsk. (తె. రా.).

**చెంద్రకాంత** నిచ్చమల్లిచెట్టు; రంగురంగుల పూలు పూసే పూలమొక్క; విత్తనాలు నల్లగా ఉంటాయి; దీని ఆకులు కురుపుల చికిత్సలో వాడతారు; *Mirabilis jalapa*, Linn. (కో. 9).

**చెన్నంగి** ఉ. సెనింగి, సెన్నంగి. గోరింటజాతికి చెందిన కలుపుమొక్క; తెల్లటిపూలు పూస్తుంది; దీనినుంచి నార తీస్తారు; బెరడు తోళ్ళకు రంగులు వెయ్యటానికి పనికివస్తుంది; ఆకులు పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; కలపను అన్ని పనిముట్లకూ వాడతారు; ? *Lagerstroemia parviflora*, Roxb., *Legerstroemia lanceolatas*, Wall. (కో. 39, 41; తె. 5, 11, 12, 14-16; రా. 12, 18).

**చెప్పుతట్టాకు** ఉ. సెపట్టాకు, సెప్పుతట్టాకు; రూ. చిప్పతట్టాకు, చెప్పట్లాకు, చెప్పుటట్టాకు; పర్యా. చిప్పతట్లలం. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే పాకుడు కలుపు మొక్క; *Cissus pedata* (కో. 13; తె. 1, 22; రా. 12, 18).

**చెప్పట్లాకు** చూ. చెప్పుటట్టాకు (కో. 11).

**చెప్పుటట్టాకు** ఉ. సెప్పుతట్టాకు; చూ. చెప్పుతట్టాకు (కో. 10, 14, 24).

**చెవలకాడ** పర్యా. చూ. ఎలికచెవి. చెమ్మనేలల్లోను, నల్లరేగడి నేలల్లోను మొలిచి పసుప్పచ్చటి పూలు పూసే పాకుడుకలుపుమొక్క; ఆకును కూరగా వండుకొంటారు; *Ipomaea reniformis*, Chois. (కో. 39).

**చెవలాకు** పర్యా. చూ. ఎలికచెవి. చెమ్మనేలల్లోను, నల్లరేగడినేలల్లోను మొలిచి పసుప్పచ్చటిపూలు పూసే పాకుడు కలుపుమొక్క; ఆకును కూరగా వండుకొంటారు; *Ipomaea reniformis*, Chois. (రా. 23).

**చెవికాయాకు** ఉ. సెవుకాయాకు; పర్యా. చెవ్వాకు. ? ఎలుక చెవ్వాకు (తె. 29).

**చెవుకాయలం** ఒకరకం కలుపుమొక్క (తె. 21, 31).

**చెవ్వాకు** ఉ. సెవ్వాకు; పర్యా. చూ. చెవికాయాకు. ? ఎలుక చెవ్వాకు (తె. 32).

**చేనురేగు** పర్యా. కాండ్రేగు? ఒకరకం కంచెమొక్క; *Zizyphus oenopia*, Mill. (రా. 18).

**చోడి** మెట్టనేలల్లో సాగుచేసే 4 నెలలపంట; 3 అడుగుల ఎత్తు పెరుగుతుంది; గడ్డి పశువులమేతకు ప్రశస్తం; చోళ్ళు బీదలు అన్నంగా వండుకు తింటారు; *Eleusine*

*aegyptiaca*, Desf., *Eleusine coracana*, Gaertn. (కో. 46).

**జంగచాప** ఉ. జంగసాప. ఒకరకం కలుపుమొక్క (కో. 1).

**జనుం** ఉ. జనం. ఏటా సాగుచేసేపైరు; 5-10 అడుగుల ఎత్తు పెరుగుతుంది; 5 నెలల పంట; కాడలనుంచి తీసిన నార ప్రశస్తం; పచ్చిరొట్టగా మంచి ఎరువు; *Crotalaria juncea*, Linn., *Corchorus capsularis*, Linn. (కో. 5, 37, 40; తె. 9, 24, 26-32, 35-37, 39; రా. 2).

**జంతె** చూ. దంతె[2] (తె. 8).

**జబురు** ఒకరకం కలుపుమొక్క; ?*Cyperus pertenuis* (తె. 20).

**జంబి** చూ. జమ్మి (రా. 2).

**జంబె** జెముడులో ఒకరకం కంచెమొక్క; *Euphorbia species* (తె. 38).

**జమ్మి** రూ. జంబి. నల్లరేగడినేలల్లో పొదగా పెరిగే ఒకరకం ముళ్ళచెట్టు: ఆకు, కలప చండ్రచెట్టులోలాగే ఉంటాయి; దీనికొమ్మలు కంచెకు ఉపయోగిస్తారు; *Acacia suma*, Buck. Ham., or *Prosopis spicigera*, Linn. (కో. 13); **భేదాలు: అడవి-** జమ్మిలో ఒకరకం కంచెమొక్క; Wild type of *Mimosa suma* (కో.); **సీమ-** ఒకరకం కంచెమొక్క; ఈ మొక్కల కంచె ఆవరణకు అందంగా ఉంటుంది; *Prosopis juliflora* (కో.).

**జమ్మిడి** జెముడులో ఒకరకం; *Euphorbia species* (తె. 10).

**జమ్ము** చెమ్మనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపు మొక్క; *Typha angustata*, B. & Ch. (కో. 27, 28, 37, 41, 42); **భేదం: కక్కెరి-** జమ్ములో ఒకరకం; *Typhaceae species* (కో. 42).

**జాను** తుప్పగా ఉపయోగిస్తారు; *Grewia orbiculata*, Rottl. (కో. 9; రా. 9, 19, 27).

**జాల** ఉ. జాన; చూ. జాలి (కో. 2, 9, 11).

**జాలి** రూ. జాల; పర్యా. చూ. తుమ్మ. పొడుగాటి తెల్లటిముళ్ళుగల చెట్టు; దీని కొమ్మలు కంచెకంపగా, కలపగా ఉపయోగిస్తాయి; *Acacia arabica*, Willd. (కో. 4; రా. 15-17).

**జిగిలి** ఉ. జిగిళి. మొండిరకం కలుపుమొక్క; ?గోళ్ళగొండి (రా. 18, 21).

**జిట్టీదు** చిట్టీతచెట్టు; 2-3 అడుగుల ఎత్తు తుప్పగా పెరిగేచెట్టు; కంచె దట్టంగా ఉండటానికి చాలుగా నాటతారు; *Phoenix forinifera*, Roxb. (తె. 40).

**జిల్లేడు** ఉ. జిల్లడ, జిల్లడి, జిల్లెడి, జిల్లెడు. 6-10 అడుగుల ఎత్తు గుబురుగా పెరిగే మొక్క; పైభాగం మృదువుగాను, కిందిభాగం నూగుతోను నిండిన వెడల్పాటి ఆకులుండి ఇసకనేలల్లోను, నల్లరేగడి నేలల్లోను బాగా పెరుగుతుంది; దీని దూది దిండ్లకు వాడతారు; ఆకెరువుగా ప్రశస్తం; చాలా తొందరగా చీకుతుంది; పరిఆకుమడికి చాలా శ్రేష్ఠం; *Calotropis gigantea*, R. Br. (కో. 2-5, 8, 9, 13, 14, 16, 20, 22, 32, 46; తె. 1, 8, 23, 24, 26-28, 31, 35; రా. 6, 15-19, 23, 25-28).

**జీగు(గడ్డి)** ఉ. జీగ(గడ్డి); చూ. జీలుగు (కో. 31, 47, 50).

**జీంగ** చూ. జీలుగు (కో. 46, 48).

**జీనిగిరి** పర్యా. చూ. జీలుగు. బొందుబెండుచెట్టు; మెత్తటికలప, పసుప్పచ్చటిపూలు ఉండి తుప్పగా పెరిగే మొక్క; *Sesbania genus* (రా. 28).

**జీనుగు** ఉ. జీనిగ; చూ. జీలుగు (కో. 11, 34, 37; తె. 1, 4).

**జీలుగు** ఉ. జీలగ, జీలిగి, జీలుగ; రూ. జీగు(గడ్డి), జీంగ, జీనుగు; పర్యా. జీనిగిరి. బొందుబెండు చెట్టు; మెత్తటికలప, పసుప్పచ్చటిపూలు ఉండి తుప్పగా పెరిగే మొక్క: *Sesbania genus* (కో. 1, 5, 12, 17, 23, 34, 37, 39, 41, 43, 47, 48, 50, 51; తె. 37, 39; రా. 17, 18, 23); **భేదాలు: ఎర్ర-** జీలుగులో ఒకరకం. పసుప్పచ్చపూలు పూస్తుంది; 6-10 అడుగుల ఎత్తు పెరుగుతుంది; బెరడునుంచి తీసే నారతో తాళ్ళు, చేపలవలలు తయారుచేస్తారు; *Sesbania aculeata*, Pers. (కో.); **ముచ్చ-** జీలుగులో ఒకరకం; *Sesbania species* (కో.).

**జేగర** ఒకరకం కలుపుమొక్క (కో. 42).

**జేగడ్డి** (<జేగు+గడ్డి) ఒకరకం కలుపుమొక్క (కో. 43).

**జోడా** వరిచేలల్లో ఎక్కువగా పెరిగే కలుపుమొక్క; *Polytoca specis* (కో. 33, 39, 40, 45-48, 40).

**జోరీగాకు** ఒకరకం కలుపుమొక్క; ఆకును పచ్చి ఎరువుగాను ఉపయోగిస్తారు (కో. 8, 32; తె. 41).

**జోరుకబోదు** ? ఆకాశపల్లేరు; *Tribulus species* (తె. 1).

**తక్కలి** ఆకెరువుగా ఉపయోగిస్తారు; *Premna integrifolia*, Linn. (తె. 26, 31; రా. 17, 18).

**తగరపాకు** తుప్పగా 6-8 అడుగుల ఎత్తు పెరిగే ఒకరకం కలుపుమొక్క; సువాసనగల తెల్లటిపూలు పూస్తుంది; *Tabernaemontana genus*, R. Br. (కో. 11).

**తగిరింత** పర్యా. చూ. తగిరిసె. ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క; దుర్వాసన వేస్తూఉంటుంది; పసుపచ్చటి పూలు పూస్తుంది; దీని గింజలనుంచి నీలిరంగు తయారు చేస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cassiea tora or alata*, Linn. (తె. 4, 12, 42).

**తగిరిసె** ఉ. తగిరస, తగిరెసి, తగిర్సె; రూ. తగిలెస; పర్యా. తగిరింత, తట్టెపాకు, తంటి, తంటెపు(చెట్టు), తంటెం, తైలంచ. ఏటా మొలిచి పొదగాపెరిగే మొక్క; దుర్వాసన వేస్తూఉంటుంది; పసుపచ్చటిపూలు పూస్తుంది; దీని గింజలనుంచి నీలిరంగు తయారుచేస్తారు; ఆకును పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు; *Cassia tora or alata*, Linn. (తె. 5, 6, 23, 26, 27, 32, 40).

**తగిలెస** చూ. తగిరెస (తె. 20, 22).

**తంగ** పర్యా. చూ. తంగేడు. కొండకోనల్లోను, నల్లరేగడి నేలల్లోను చిట్టిపొదగా పెరిగే కలుపుమొక్క; కంచెగానూ వేస్తారు; పసుపచ్చటి పూలు పూస్తుంది; దీని బెరడును తోళ్ళు పదునుచెయ్యటంలోను, ఆకును పచ్చి ఎరువుగాను ఉపయోగిస్తారు; *Cassia auriculata*, Linn. (కో. 31).

**తంగెడు** చూ. తంగేడు (కో. 27, 39, 42; తె. 4, 7, 8, 10, 31, 35, 36; రా. 10, 16, 19, 22, 23, 25–28).

**తంగేడు** ఉ. తంగుడు; రూ. తంగెడు; పర్యా. తంగ. కొండకోనల్లోను, నల్లరేగడి నేలల్లోను చిట్టిపొదగా పెరిగే కలుపుమొక్క; కంచగానూ వేస్తారు; పసుపచ్చటిపూలు పూస్తుంది; దీని బెరడును తోళ్ళు పదునుచెయ్యటంలోను, ఆకును పచ్చిఎరువుగాను ఉపయోగిస్తారు; *Cassia auriculata*, Linn. (కో. 3, 4, 17, 20, 41, 46, 48; తె. 3, 15, 25, 27; రా. 3–6, 8, 11, 14, 15, 17, 18, 20); **భేదాలు**: నేల- పచ్చికపట్టుల్లో ఎక్కువగా పెరిగే తంగేడులో ఒకరకం; చిన్నతంగేడు; *Cassia obovata*, Collad. (కో.); పసిడి- పైడి తంగేడు; దీన్నే నూతికసింద అని అంటారు; రోడ్లపక్కను, బంజరునేలల్లోను ఏటాలేచి తుప్పగాపెరిగే మొక్క; పసుపచ్చటిపూలు పూస్తుంది; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cassia sophera*, Linn. (రా.); సీమ- 2 అడుగుల ఎత్తుగా పెరిగే ఆఫ్రికాదేశపు మొక్క; పసుపచ్చటి పూలు పూస్తుంది; దీన్నే కొండతంగేడు అని అంటారు; ఆకెరువుగా ప్రశస్తం; వంటచెరకుగాను ఉపయోగిస్తారు; *Cassia acutifolia*, Delile. (రా.).

**తట్టాయి** పర్యా. చూ. కలబంద. నాలుగయిదడుగుల పొడుగూ, నాలుగయి దంగుళాల వెడల్పూగల దళసరి మట్టలవంటి ఆకులూ, వీటి అంచుల్లో వాడిముళ్ళూ ఉండి నారగా ఉపయోగపడే మొక్క; కంచె మొక్కగానూ వేస్తారు: *Aloe barbadensis* (రా. 2, 3).

**తట్టెపాకు** (<తట్టెపు + ఆకు) పర్యా. చూ. తగిరిసె. ఏటా మొలిచి పొదగాపెరిగే మొక్క; దుర్వాసనవేస్తూ ఉంటుంది; పసుపచ్చటి పూలు పూస్తుంది; దీని గింజలనుంచి నీలిరంగు తయారు చేస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cassia tora or alata*, Linn. (కో. 50).

**తంటి** పర్యా. చూ. తగిరిసె. ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క; దుర్వాసన వేస్తూఉంటుంది; పసుపచ్చటి పూలు పూస్తుంది; దీని గింజలనుంచి నీలిరంగు తయారు చేస్తారు; ఆకును పచ్చిఎరువుగాను ఉపయోగిస్తారు; *Cassia tora or alata*, Linn. (తె. 41).

**తంటెపు(చెట్టు)** పర్యా. చూ. తగిరిసె. ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క; దుర్వాసన వేస్తూఉంటుంది; పసుపచ్చటి పూలు పూస్తుంది; దీని గింజలనుంచి నీలిరంగు తయారుచేస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cassia tora or alata*, Linn (కో. 32).

**తంటెం** ఉ. తంటిపి, తంటిము, తంటెం; పర్యా. చూ. తగిరిసె. ఏటా మొలిచి పొదగాపెరిగే మొక్క; దుర్వాసన వేస్తూఉంటుంది; పసుపచ్చటిపూలు పూస్తుంది; దీని గింజలనుంచి నీలిరంగు తయారుచేస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cassia tora or alata*, Linn. (కో. 20, 22, 23, 25, 36, 37, 40, 45–47, 50, 51).

**తంపర** ఒకరకం కలుపుమొక్క (తె. 11).

**తలిగెమారి** ఉ. తలగమరి. మెట్టనేలల్లో పెరిగే చిన్న కలుపుమొక్క (రా. 18, 26).

**తవిసె** ఒకరకం ఆకెరుపుమొక్క (రా. 6).

**తాటిగడ్డ** నేలతాడి చెట్టు; *Curculigo orchioides*, Gaertn. (తె. 32).

**తాటిమట్ట** చేలలో గుంటలు తవ్వితీసి, తాటిమట్టలు వేసి, మట్టికప్పి, కుళ్ళిన తరవాత పొలాలకు వేస్తారు; చవిటినేలలకు మంచిదత్తువ; *Borassus flabelliformis*, Linn. (రా. 2).

**తివ్వ** ఒకరకం కలుపుమొక్క (కో. 47).

**తీగెబెండ** పర్యా. చూ. నూగుబెండ. మెట్టనేలల్లో పెరిగే ఒకరకం కలుపుమొక్క; నూగు ఎక్కువగా ఉంటుంది; *Abutilon indicum*, G. Don (కో. 19).

**తీగెలగడ్డి** ఒకరకం కలుపుమొక్క (కో. 30).

**తీళ్ళాకు** ఒకరకం ఆకెరుపుమొక్క (రా. 5).

**తుక్కు** ఒకరకం కలుపుమొక్క; ఎరనెత్తగడ్డి (కో.

29).

**తుంగ** ఏటా మొలిచి పెరిగే కలుపుమొక్క ; కాడ 3 పలకలుగా ఉంటుంది ; దీన్ని ఏరివెయ్యటం చాలా కష్టం; *Cyperus genus* (కో. 1, 3-8, 10-12, 14-29, 31-36, 39, 41-44, 46, 47, 49, 50 ; తె. 1, 4, 5, 7-9, 12, 13, 19-29, 31-34, 36, 40, 41 ; రా. 1, 8, 18, 23, 26, 28); **భేదాలు : ఆకు-** *Cyperus species* (కో.) ; **ఇసక-** తడి ఇసకనేలల్లో పెరిగే తుంగ ; *Cyperus uncinatus*, Poir. (కో.) ; **ఏడాకుల-** *Cyperus species* (కో.) ; **కదురు-** నీటి వారల నాలుగయి దడుగులెత్తు పెరిగే తుంగ ; కాడ గట్టిగాను; ఆకులు గరుకుగాను ఉంటాయి ; పశువులు తినవు ; *Cyperus species* (కో.) ; **కనుపు-** కణుపులు దగ్గర దగ్గరిగాఉండే తుంగ ; *Cyperus species* (కో.); **గడ్డ-** ఉ. గెడ్డ- *Cyperus species* (కో. రా.); **గబ్బు-** *Cyperus species* (కో.) : **గొడ్డు-** చిన్న మొక్క ; పశువులు దీని ఆకును తినవు ; దీనితో చాపలు అల్లుతారు ; *Cyperus corymbosus*, Rottb. (రా.) ; **చలి-** ఉ. సలి-, నీటివారల బాగా ఎదిగే తుంగ ; వేళ్ళు నారలాగ సన్నగాఉంటాయి ; లేతాకుల చివరలు రంపంముళ్ళలా ఉంటాయి ; *Cyperus compressus*, Linn. (కో.); **చిల్ల-** చెమ్మనేలల్లో బాగా పెరుగుతుంది ; *Cyperus haspan*, Linn. (కో.); **చెక్క-** మస్తుకం; దీని వేళ్ళు లావుగా, గింజలు 3 పలకలుగా ఉంటాయి ; వీటిని అడవిపందులు తింటాయి ; *Cyperus species* (రా.) ; **జీబి-** దట్టంగా పెరిగే తుంగ ? *Cyperus species* (కో.) ; **తుసి-** ? పీచు తుంగ? ; *Fimbristylis* (రా.) ; **దబ్బ-** వరిచేలల్లో మొలిచే సన్నటికాడగల తుంగ ; ? జల్లెడ తుంగ ; కర్రతుంగ ; *Cyperus iria*, Linn. (కో.); **నల్ల-** తుంగలో నలుపురకం ; *Cyperus species* (కో.); **నాసర-** *Cyperus species* (కో.); **నీరు-** నీడ తడి ఉన్నచోట్లను, వరిచేలల్లోను బాగా పెరుగుతుంది ; *Cyperus procerus.*, Vahl., Rottb. (కో.); **పలకల-** వాడి అంచులున్న పలకల కాడలుగల తుంగ ; మంచినీటి గుంటల్లో అయిదారడుగుల ఎత్తు పెరుగుతుంది; ?*Cyperus iria*; ?*Fimbristylis* (కో.); **పీచు-** ? *Fimbristylis* (రా.); **పూరి-** ఇసక నేలల్లో బాగా పెరుగుతుంది ; దీని దుంపలు తింటారు ; *Cyperus bulbosus*, Vahl. (కో.); **పూల-** ? *Cyperus species or Fimbristylis* (రా.) ; **పెద్ద-** ? రక్కసతుంగ ; *Cyperus species* (కో.) ; **పేడ-** *Cyperus species* (కో. రా.) ; **బురద-** ? *Cyperus pubisquama*, Steud. (తె.) ; **బుర్ర-** బుడ్డలుగలతుంగ ; *Cyperus species* (తె.); **బొడ్డు-** మాగాణిలో మొలిచేతుంగ (కో. తె. రా.) : **బొర్ర-** లావాటి కాడలుగల తుంగ; *Cyperus species* (కో.); **మెట్ట-** ? మెట్టనేలల్లోమాత్రం మొలిచే తుంగ ; *Cyperus species* (కో.); **మెత్త-** *Cyperus species* (తె.); **శాక-** తుంగలో ఒకరకం; 4-6 అడుగులెత్తు పెరుగుతుంది; ఆకులు 2, 3 అడుగుల పొడుగుగా ఉంటాయి; *Cyperus umbellatus*, Burm. (కో.); **శాత-** తుంగలో ఒక రకం; *Cyperus species* (కో.); **సన్న-** మాగాణిలో పెరిగే తుంగ; ? *Cyperus difformis*, Linn. (కో.); **సౌరి-** తుంగలో ఒకరకం: *Cyperus species* (కో.).

**తుత్తెర** ఒకరకం కలుపుమొక్క (కో. 12).

**తునిక్కొమ్మ** (<తునికి + కొమ్మ) ఒకరకం కలుపు మొక్క (తె. 31).

**తుమ్మ** పర్యా. జాల, జాలి. పొడుగాటి తెల్లటి ముళ్ళు గల చెట్టు; దీని ఆకును, కాయలను మేకలు తింటాయి ; కొమ్మలు కంచెకంపగా, కలపగా ఉపయోగిస్తాయి; *Acacia arobica*, Willd. (కో. 2, 4, 6-11, 13, 14, 16, 18, 20, 22, 24, 41, 43 ; తె. 7-11, 38; రా. 1, 3-6, 8, 9, 11, 12, 14, 16-20, 23, 25, 26); **భేదాలు: అడవి-** ఒకరకం కంచెచెట్టు; దీని ఆకును మేకలుగూడా తినవు; కర్ర పనిముట్లకు పనికిరాదు; పరాయి సీమనుంచి ఇటీవల దిగుమతియైనది; a wild type of *Acacia* (కో.): **ఇంగ్లీషు-** కలుపుగా పెరిగే తుమ్మ మొక్క ; ? తెల్లతుమ్మ; *Acacia species* (కో.); **కర-** లోపల్నుంచి ముళ్ళు పొడుచుకువచ్చే తుమ్మ; *Acacia species* (కో.); **కస్తూరి-** పొదగా పెరిగే ముళ్ళకంచెమొక్క; సువాసన, పసుప్పచ్చరంగు గల దీని పూలనుంచి గంధద్రవ్యం తీస్తారు; *Acacia farnesiana*, Willd. (కో. రా.); **గబ్బు-** పర్యా. చూ. తెల్ల లావాటి ముళ్ళు, సన్నటి పసుప్పచ్చపూలు గల పొట్టి తుమ్మచెట్టు; కంచెగా వేస్తారు; *Acacia leucophloea*, Willd. (కో.); **గొడుగు-** తెరిచిపట్టిన గొడుగు ఆకారంగా కొమ్మలు విస్తరించి పెరిగే తుమ్మచెట్టు; కొమ్మలను కంచెకంపగాను, కలపగాను ఉపయోగిస్తారు ; *Acacia planifrons*, W. & A. (రా.); **జపాన్-** కంచెచెట్టు; *Parkinsonia species* (కో.): **తెల్ల-** పర్యా. గబ్బు-. లావాటి ముళ్ళు, సన్నటి పసుప్పచ్చ పూలుగల పొట్టి తుమ్మచెట్టు; కంచెగా వేస్తారు; *Acacia leucophloea*, Willd. (కో. రా.): **నల్ల-** తెల్లటి పొడుగాటి ముళ్ళు, పగుళ్ళుబారిన నల్లటి బెరడుగల చెట్టు; పసుప్పచ్చటి పూలు పూస్తుంది; నల్లరేగడి నేలల్లోను, చెరువుగర్భాల్లోను బాగా పెరుగుతుంది; బెరడును

తోళ్ళు పదునుచెయ్యటంలో ఉపయోగిస్తారు; కొయ్య కలపగా ప్రశస్తం; *Acacia arabica*, Willd. (కో. రా.); **పట్నం-** పర్యా. చూ. సీమ-. కంచెగా వేస్తారు; పచ్చటి పూలు పూస్తుంది; నల్లరేగడి నేలల్లో పెరుగుతుంది; *Parkinsonia aculeata*, Linn. (రా.); **పీకె-** ? పర్యా. బెంగుళూరు సీకి-. ముళ్ళెక్కువగా ఉండే తుమ్మ; కంచెమొక్క; పొట్టిగా ఉంటుంది; కొయ్య త్వరగా పుచ్చి పోతుంది; *?Acacia species* (కో.); **బుడ్డజాల-** ఉ. బుడజాల-. బుడ్డ (చిన్న) జాలితుమ్మ; కంచెమొక్క; పొదలాగ పక్కలకువిస్తరించి పెరుగుతుంది; లావాటి ముళ్ళుంటాయి; *Acacia roxburghii*, W. & A. (కో.); **బెంగుళూరు సీకి-** పర్యా. చూ. సీమ-. కంచెగా వేస్తారు; పచ్చటి పూలు పూస్తుంది; నల్లరేగడి నేలల్లో బాగా పెరుగుతుంది; *Parkinsonia aculeata*, Linn. (రా.); **సరాయి-** పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క; వంటసారాయంబట్టీలో ఈచెట్టు బెరడును వాడతారట; *Acacia leucophloea*, Willd. (రా.); **సీమ-** పర్యా. పట్నం-, బెంగుళూరు సీకి-. కంచెగా వేస్తారు; పచ్చటిపూలు పూస్తుంది; నల్లరేగడి నేలల్లో బాగా పెరుగుతుంది; *Parkinsonia aculeata*, Linn. (కో. రా.).

**తుమ్మి** రోడ్లపక్కను, బంజరునేలల్లోను ఏటా మొలిచి పెరిగే కలుపుమొక్క; తెల్లటిపూలు పూస్తుంది; ఆకును పచ్చిరొట్టగా ఉపయోగిస్తారు; *Leucas aspera*, Spreng (కో. 14, 27, 35, 47; తె. 3, 5; రా. 3, 11, 23, 25, 26); **తుమ్మలం** (<తుమ్మి + అలం) ఒకరకం కలుపుమొక్క: చూ. తుమ్మి (తె.).

**తూటి(కాడ)** చెరువుల్లోను, చెమ్మనేలల్లోను ఏటాలేచి పెరిగే కలుపుమొక్క; తీగ నీటిపై తేల్తుంటుంది; గులాబి రంగుపూలు పూస్తుంది; లేత చిగుళ్ళను, వేళ్ళను వండుకు తింటారు; *Ipomaea reptans*, Poir., *Ipomaea aquatica*, Forsk. (కో. 39).

**తూనంగి** చూ. తోడెంగ (రా. 28).

**తెల్లబెండ** ఒకరకం కలుపుమొక్క (కో. 15).

**తెల్లబొద్దు** రెమ్మకు రెండేసి ఆకులుండే తెల్లటి కలుపు మొక్క (తె. 16, 17).

**తెల్లసెత్త** ఒకరకం కలుపుమొక్క (కో. 27).

**తైదోసి** ఒకరకం కలుపుమొక్క (కో. 30).

**తైరేసి** ఒకరకం కలుపుమొక్క (కో. 30).

**తైలంచ** పర్యా. చూ. తగిరెసె. ఏటామొలిచి పొదగా పెరిగే మొక్క; దుర్వాసన వేస్తుంటుంది; పసుపచ్చటి పూలు పూస్తుంది; దీని గింజలనుంచి నీలిరంగు తయారు చేస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cassia tora or alata*, Linn. (తె. 13).

**తొండమలం** (తొండం + అలం) ఒకరకం కలుపు మొక్క (తె. 31).

**తోడెంగ** ఉ. తోడంగ; రూ. తూనంగి. మాగాణిలో పెరిగే కలుపుమొక్క (కో. 12, 30, 31; తె. 1, 11-13, 15, 16, 19, 20, 23-28, 31-34, 38); **భేదం:** బుర్ర- తోడెంగలో ఒకరకం (తె.).

**దనెపుకట్టె** కొత్తిమెర మొక్కల కాడ; పెంట దిబ్బల్లో తొక్కి మురగజేస్తారు; పొలాలకు మంచిసత్తువ; *Coriandrum sativum*, Linn. (తె. 9).

**దంతె**[1] చిన్న ముళ్ళచెట్టు; తెల్లటిపూలు పూస్తుంది; దీని గింజలనుంచి తీసిన చమురును వైద్యంలో ఉపయోగిస్తారు; ఆకును పశువులు తింటాయి; *Gymnosporia montana*, Benth. (తె. 9, 10, 31).

**దంతె**[2] ఉ. దంతి; రూ. జంతె; నల్లగింటెన; గిరికర్ణిక; ఒకరకం కంచెమొక్క; నీలిరంగుపూలు పూస్తుంది; *Clitoria ternatea*, Linn. (కో. 2, 7-9, 23; తె. 9, 11; రా. 1, 25).

**దబ్బాకు** ? దర్భ: *Eragrostis cynosuroides*, Retz., *Imperata arundinacea*, Cyr. (కో. 26).

**దయ్యపలం** (<దయ్యపు + అలం) ఒకరకం కలుపు మొక్క (తె. 20).

**దయ్యంమట్ట** పర్యా. చూ. కలబంద. నాలుగయిదడుగుల పొడుగూ, నాలుగయిదంగుళాల వెడల్పూగల దళసరి మట్టలవంటి ఆకులూ, వీటి అంచుల్లో వాడిముళ్ళూ ఉండి నారగా ఉపయోగపడే మొక్క; కంచెమొక్కగానూ వేస్తారు; *Aloe barbadensis* (తె. 5).

**దారక** ఒకరకం కలుపుమొక్క (కో. 12).

**దాసరిబుడ(తాడు)** ఒకరకం కలుపుమొక్క (కో. 32).

**దిందిగెం** చూ. దుండిగ (రా. 28).

**దిరిసెన** ఉ. దిర్సెన; రూ. దురిసెన, దూసెన. 30-40 అడుగుల ఎత్తు పెరిగే పెద్దచెట్టు; తెల్లటి చిన్నపూలు పూస్తుంది; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Albizzia lebbek*, Benth. (కో. 16; తె. 11, 12, 14; రా. 2).

**దుండిగ** రూ. దిందిగెం, దుండెపాకు. నల్లరేగడి నేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క; కాగితంలాటి పల్చటి బెరడు, పసుపచ్చటి పూలు ఉంటాయి; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Jatropha glandulifera*, Roxb. (కో. 17; తె. 3).

**దుండెపాకు** చూ. దుండిగ (కో. 6, 13, 24; తె. 31).

తోళ్ళ పదును చెయ్యటంలో ఉపయోగిస్తారు; కొయ్య కలపగా ప్రశస్తం: *Acacia arabica*, Willd. (కో. రా.); **పత్నం-** పర్యా. చూ. సీమ-. కంచెగా వేస్తారు; పచ్చటి పూలు పూస్తుంది; నల్లరేగడి నేలల్లో పెరుగుతుంది; *Parkinsonia aculeata*, Linn. (రా.); **పీకె-?** పర్యా. బెంగుళూరు సీకి-. ముళ్ళెక్కువగా ఉండే తుమ్మ; కంచె మొక్క; పొట్టిగా ఉంటుంది; కొయ్య త్వరగా పుచ్చి పోతుంది; ?*Acacia species* (కో.); **బుడ్డజాల-** ఉ. బుడజాల-. బుడ్డ (చిన్న) జాలితుమ్మ; కంచెమొక్క; పొదలాగ పక్కలకు విస్తరించి పెరుగుతుంది; లావాటి ముళ్ళుంటాయి: *Acacia roxburghii*, W. & A. (కో.): **బెంగుళూరు సీకి-** పర్యా. చూ. సీమ-. కంచెగా వేస్తారు: పచ్చటి పూలు పూస్తుంది; నల్లరేగడి నేలల్లో బాగా పెరుగుతుంది; *Parkinsonia aculeata*, Linn. (రా.); **సరాయి-** పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క: వంటుసారాయంబట్టీలో ఈచెట్టు బెరడును వాడతారట: *Acacia leucophloea*, Willd. (రా.); **సీమ-** పర్యా. పత్నం-, బెంగుళూరు సీకి-. కంచెగా వేస్తారు; పచ్చటిపూలు పూస్తుంది; నల్లరేగడి నేలల్లో బాగా పెరుగుతుంది; *Parkinsonia aculeata*, Linn. (కో. రా.).

**తుమ్మి** రోడ్లపక్కను, బంజరునేలల్లోను ఏటా మొలిచి పెరిగే కలుపు మొక్క; తెల్లటిపూలు పూస్తుంది; ఆకును పచ్చిరొట్టగా ఉపయోగిస్తారు; *Leucas aspera*, Spreng (కో. 14, 27, 35, 47; తె. 3, 5; రా. 3, 11, 23, 25. 26); **తుమ్మలం** (<తుమ్మి + అలం) ఒకరకం కలుపు మొక్క: చూ. తుమ్మి (తె.).

**తూటి(కాడ)** చెరువుల్లోను, నెమ్మనేలల్లోను ఏటాలేచి పెరిగే కలుపు మొక్క; తీగ నీటిపై తేల్తుంటుంది; గులాబి రంగుపూలు పూస్తుంది; లేత చిగుళ్ళను, వేళ్ళను వండుకు తింటారు: *Ipomaea reptans*, Poir., *Ipomaea aquatica*, Forsk. (కో. 39).

**తూనంగి** చూ. తోడెంగ (రా. 28).

**తెల్లబెండ** ఒకరకం కలుపుమొక్క (కో. 15).

**తెల్లబొద్దు** రెమ్మకు రెండేసి ఆకులుండే తెల్లటి కలుపు మొక్క (తె. 16, 17).

**తెల్లసెత్త** ఒకరకం కలుపుమొక్క (కో. 27).

**తైదోసి** ఒకరకం కలుపుమొక్క (కో. 30).

**తైరేసి** ఒకరకం కలుపుమొక్క (కో. 30).

**తైలంచ** పర్యా. చూ. తగిరెసె. ఏటామొలిచి పొదగా పెరిగే మొక్క; దుర్వాసన వేస్తుంటుంది; పసుప్పచ్చటి పూలు పూస్తుంది: దీని గింజలనుంచి నీలిరంగు తయారు చేస్తారు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cassia tora or alata*, Linn. (తె. 13).

**తొండమలం** (తొండం + అలం) ఒకరకం కలుపు మొక్క (తె. 31).

**తోడెంగ** ఉ. తోడంగ; రూ. తూనంగి. మాగాణిలో పెరిగే కలుపుమొక్క (కో. 12, 30, 31; తె. 1, 11-13, 15, 16, 19, 20, 23-28, 31-34, 38); **భేదం: బుర్ర-** తోడెంగలో ఒకరకం (తె.).

**దనెపుకట్టె** కొత్తిమెర మొక్కల కాడ; పెంట దిబ్బల్లో తొక్కి మురగజేస్తారు; పొలాలకు మంచిసత్తువ; *Coriandrum sativum*, Linn. (తె. 9).

**దంతె**[1] చిన్న ముళ్ళచెట్టు; తెల్లటిపూలు పూస్తుంది; దీని గింజలనుంచి తీసిన చమురును వైద్యంలో ఉపయోగిస్తారు; ఆకును పశువులు తింటాయి; *Gymnosporia montana*, Benth. (తె. 9, 10, 31).

**దంతె**[2] ఉ. దంతి; రూ. జంతె; నల్లగింజెన; గిరికర్ణిక; ఒకరకం కంచెమొక్క; నీలిరంగుపూలు పూస్తుంది; *Clitoria ternatea*, Linn. (కో. 2, 7-9, 23; తె. 9, 11; రా. 1, 25).

**దబ్బాకు** ? దర్భ: *Eragrostis cynosuroides*, Retz., *Imperata arundinacea*, Cyr. (కో. 26).

**దయ్యపలం** (<దయ్యపు + అలం) ఒకరకం కలుపు మొక్క (తె. 20).

**దయ్యంమట్ట** పర్యా. చూ. కలబంద. నాలుగయిదడుగుల పొడుగూ, నాలుగయి దంగుళాల వెడల్పాగల దళసరి మట్టలవంటి ఆకులూ, వీటి అంచుల్లో వాడిముళ్ళూ ఉండి నారగా ఉపయోగపడే మొక్క; కంచెమొక్కగానూ వేస్తారు; *Aloe barbadensis* (తె. 5).

**దారక** ఒకరకం కలుపుమొక్క (కో. 12).

**దాసరిబుడ(తాడు)** ఒకరకం కలుపు మొక్క (కో. 32).

**దిందిగెం** చూ. దుండిగ (రా. 28).

**దిరిసెన** ఉ. దిర్సెన; రూ. దురిసెన, దూసెన. 30-40 అడుగుల ఎత్తు పెరిగే పెద్దచెట్టు; తెల్లటి చిన్నపూలు పూస్తుంది; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Albizzia lebbek*, Benth. (కో. 16; తె. 11, 12, 14; రా. 2).

**దుండిగ** రూ. దిందిగెం, దుండెపాకు. నల్లరేగడి నేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క; కాగితంలాటి పల్చటి బెరడు, పసుప్పచ్చటి పూలు ఉంటాయి; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Jatropha glandulifera*, Roxb. (కో. 17; తె. 3).

**దుండెపాకు** చూ. దుండిగ (కో. 6, 13, 24; తె. 31).

దుంపతుత్తరి పర్యా. చూ. బంకతుత్తర. బెండలో ఒకరకం; ఆకులు మెత్తగా జిగటగా ఉంటాయి; ఇది గుడ్డల కంటుకొంటుంది (తె. 42).

దురిసెన చూ. దిరిసెన (కో. 13).

దుసర ఉ. దుసరి; చూ. దూసర (తె. 1; రా. 18).

దుసార చూ. దూసర (రా. 10, 18).

దుసే(తీగె) చూ. దూసర (తె. 31).

దుసేర(-తీగ, -తీవ) చూ. దూసర (తె. 29, 34, 38).

దూసర రూ. దుసర, దుసార, దుసే (తీగె), దుసేర (-తీగ, తీవ), ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపు మొక్క; కాడ ఉక్కుతీగలా ఉండి చీపుర్లకు, పసుల మూతిచిక్కాలకు పనికివస్తుంది: *Cocculus cardifolius*, DC., *Cocculus villosus*, DC. (కో. 9, 13, 14, 19; తె. 20).

దూసెన చూ. దిరిసెన (తె. 34).

దేవదారి పెద్దచెట్టు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Cedrus deodara*, Loud. (రా. 4).

దొగ్గలాకు (<దొగ్గలి+ఆకు) ఏటా మొలిచి పెరిగే కలుపు మొక్క; ఆకును కూరగా వండుకొంటారు; *Amarantus polygamus*, Linn. (కో. 20; తె. 32).

దొంతరాకు ఒకరకం కలుపుమొక్క (కో. 9).

దోమకాలు(గడ్డి) ఏటా మొలిచి పెరిగే కలుపు మొక్క; పశువులమేతకు కూడా; *Brachiaria eruciformis*, Griseb., *Panicum isachne*, Roth. (కో. 9, 11, 12, 14, 24, 25, 32; తె. 39, 41).

దోస ఏటా లేచి పెరిగే పాకుడుతీగ; ఆకును పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు; కాయలు తింటారు; కూర వండుతారు; *Cucumis melo*, Linn. (కో. 24; తె. 37, 39).

నకెరకేసరి ముళ్ళులేని ఒకరకం కంచెమొక్క; *Cordia obliqua*, Willd. (కో.).

నక్కతోక(గడ్డి) ఉ. నక్కతోగ్గడ్డి. పశువులమేతకు ప్రశస్తం; *Setaria pallidifusca*, Stapf & Hubb., *Setaria glauca*, Beauv. (కో. 6, 8; 9; తె. 10, 12, 18; రా. 17, 18, 26).

నక్కనరం పర్యా. వజ్రపునీలి. రోడ్లపక్కను, బంజరు నేలల్లోను 3 అడుగుల ఎత్తు గుబురుగా పెరిగే ఒకరకం కలుపుమొక్క; లేత ఎరుపురంగు పూలుపూస్తుంది. *Indigofera trita*, Linn. (కో. 17; తె. 28, 29, 31; రా. 1).

నక్కనేరేడి(కంప) నేలనేరేడు; చెమ్మనేలల్లో పొదగా పెరిగే కలుపుమొక్క; ఎర్రటిపూలు, నల్లటిపళ్ళు, గోధుమపన్నె బెరడు ఉంటాయి; *Ardisia humilis*, Cl. (కో. 20).

నక్కపూతిక ఎర్రచెక్కనేలల్లో బాగా పెరిగే కలుపు మొక్క; పశువుల మేతకు ప్రశస్తం: *Andropogon monticola*, Schult. (కో. 40).

నక్కపెంకాకు (<నక్కపెంటి + ఆకు) నక్కపీటాకు; నక్కపెంటిచెట్టు; చెట్టుమొదళ్ళు బుడిపెలుండి నేలను అంటుకొని పెరిగే కలుపుమొక్క; దీని వేళ్ళను చర్మరోగ చికిత్సలో వాడతారు (కో. 9).

నట్టు నేలలో లోతుగా వేళ్ళుతన్ని పెరిగే చాల మొండి రకం కలుపుమొక్క (కో. 14; తె. 10; రా. 8, 16-18).

నత్తివలం ఒకరకం కలుపుమొక్క (తె. 31).

నమ్మదుంప గొట్టిగడ్డ; మాగాణిలోను, నిలకడ నీటిలోను ఎక్కువగా మొలిచే కలుపుమొక్క; కలుపుతీస్తూ కూలీలు దీని దుంపలను తింటూఉంటారు: *Aponogeton natans*, Eng. & Kr., *Aponogeton monostachyon*, Linn. (కో. 24).

నల్లగోల(గడ్డి) ఒకరకం కలుపు మొక్క (కో. 24).

నల్లచెత్త పర్యా. చూ. నల్లలం. నేలపై పరచుకు పెరిగే నల్లటి కలుపుమొక్క (కో. 27).

నల్లపులిసె ఉ. నల్లపుల్సె. ఒకరకం ఆకెరువుమొక్క (రా. 4).

నల్లలం ఉ. నల్లాలం; పర్యా. నల్లచెత్త. నేలపై పరచుకు పెరిగే నల్లటి కలుపుమొక్క (తె. 1, 28; రా. 8, 14).

నల్లెంగ ఒకరకం కలుపుమొక్క (తె. 13).

నల్లేరు కణుపులదగ్గర నొక్కుకుపోయిన 4 పలకల కాడ, తెల్లటిపూలు ఉండి కొమ్మలు పొదలపైకి పాకి విస్తరించే మొక్క; ఆకెరువుగా ఉపయోగిస్తారు; *Vitis quadrangularis*, Wall. (కో. 6; రా. 11, 26).

నాగజెముడు పర్యా. నాగదాళి. చెప్పు అట్టల్లాటి దళసరి ఆకులు, వీటికి సూదుల్లాటి ముళ్ళుగల కంచెమొక్క; ఊదారంగు పళ్ళు ఉంటాయి: *Opuntia dillenii*, Haw (రా. 2).

నాగటిసాయల(గడ్డి) ఒకరకం కలుపుమొక్క; (తె. 13).

నాగదాళి పర్యా. నాగజెముడు. చెప్పు అట్టల్లాటి దళసరి ఆకులు, వీటికి సూదుల్లాటి ముళ్ళుగల కంచెమొక్క; ఊదారంగు పళ్ళుఉంటాయి; *Opuntia dillenii*, Haw. (రా. 14).

నాగరమట్టు పర్యా. చూ. కలబంద, నాలుగయిదడు

గుల పొడుగూ, నాలుగయి దంగుళాల వెడల్పూగల దళసరి మట్టలవంటి ఆకులూ, వీటి అంచుల్లో వాడిముళ్ళూ ఉండి నారగా ఉపయోగపడే మొక్క; కంచెమొక్కగానూ వేస్తారు; *Aloe barbabensis* (తె. 9).

నాగలసెవలలం ఒకరకం కలుపుమొక్క (తె. 10).

నాచు ఉ. నాసు. కాడలు లేకుండా పొడుగాటి ఆకు లుండి నిలకడనీటిలో పెరిగే నీటికలుపుమొక్క: *Blyxa octandra*, Pl., *Vallisneria octandra*, Roxb. (కో. 17, 26-28, 33, 35, 47, 48; తె. 40, 41); **భేదాలు: కప్పు**- నాచులో ఒకరకం (కో.); **గుర్రపు**- నాచులో ఒకరకం (కో.); **బుడత**- నాచులో ఒకరకం (కో.).

**నానబాల(గడ్డి)** ఉ. నానపాల (గడ్డి). ఎర్రనేల ల్లోను, వరిపైరులోను ఏటా మొలిచి పెరిగే కలుపుమొక్క; గింజలు వడ్లగింజల్లా ఉంటాయి; ఆకు పశువులకు చాలా ఇష్టం; కరువుకాలాల్లో బీదలు తింటారు; *Eriochloa procera*, Habbard., *Eriochloa ploystachya*, H. B. & K. (కో. 8-11, 13; తె. 37, 42; రా. 18, 27).

**నిరుపవలం** (<నిరుప + అలం) చూ. నెరపవలం. ? నీరుప్పి తె. 31).

**నీటారిక** ఉ. నీటిఅవిరిక, నీటోరిక; చూ. నీలారెక, నీళ్ళారికె. అరికగడ్డిలో ఒకరకం కలుపుమొక్క; పశువుల మేతకు ప్రశస్తం; *Paspalum scrobiculatum*, Linn. (కో. 26, 33, 46, 50).

**నీరలం** ఉ. నేరొలుం (<నీరు + అలం) నిలకడనీటిలో పెరిగే ఒకరకం కలుపుమొక్క (రా. 8, 14).

**నీరుబాయిలి** వరిపైరులోను, చెరువుగట్లమీదను పెరిగే కలుపుమొక్క; నీరు పావిలిచెట్టు; *Bergia verticillata*, Willd., *Bergia aquatica*, Roxb. (రా. 14).

**నీరొద్ది** ఉ. నీరుద్ది (<నీరు + వద్ది) తెల్లటిపూలు, గోధుమరంగు బెరడుగల ఒకపాటి ఎత్తయిన చెట్టు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Dolichandrone atrovirens*, Sprague. (రా. 9, 17).

**నీలారెక** చూ. నీటారిక (రా. 28).

**నీలి** సాగుచేసే మెట్టపంట; మొక్క 2-6 అడుగుల ఎత్తు తుప్పగా పెరుగుతుంది; దీని ఆకు పచ్చిఎరువుగా ప్రశస్తం; *Indigofera tinctoria*, Linn. (కో. 4, 5, 15, 17, 20, 24, 43; తె. 39; రా. 2).

**నీళ్ళారికె** ఉ. నీలారిగె; చూ. నీటారిక (కో. 4, 5; రా. 1).

**నూకలగడ్డి** గడ్డిజాతికిచెందిన ఒకరకంకలుపుమొక్క; *Panicum species* (కో. 39, 41).

**నూగు(కట్టె)** ఉ. నూగ్గకట్టె. నువ్వుకట్టె; సాగుపైరు; మొక్క 2-6 అడుగుల ఎత్తు పెరుగుతుంది; కాడలను కుళ్ళబెట్టి ఎరువుగా ఉపయోగిస్తారు; *Sesamum indicum*, Linn. (తె. 6, 7, 9).

**నూగుబెండ** పర్యా. తీగెబెండ. మెట్టనేలల్లో పెరిగే ఒకరకం కలుపుమొక్క; నూగు ఎక్కువగా ఉంటుంది; *Abutilon indicum*, G. Don., *Phyllanthus multiflorus*, Willd. (రా. 14, 18, 28).

**నెత్తురుగడ్డాకు** ఒకరకం కలుపుమొక్క; దీని ఆకులను నెత్తురుకురుపుల చికిత్సలో వాడటంవల్ల దీనికి పేరు వచ్చింది (రా. 1).

**నెమలి** ? నెమలి అడుగుచెట్టు; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Vitex pubescens*, Vahl. (కో.).

**నెమలివరి** ఉ. నెమిలొరి. వరిమొక్కలాటి కలుపు మొక్క (కో. 5).

**నెమ్మజుట్టు** తోటల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క; నెమలిజుట్టాకు; *Celosia cristata*, Linn. (తె. 1).

**నెరపలం** (<నెరప + అలం) చూ. నిరుపవలం (తె. 4).

**నెరిత** ఒకరకం కంచెమొక్క; *? Laurus involucrata* (కో. 42).

**నేంద్ర(గడ్డి)** నేరెడుగడ్డి; ఏటాలేచి పెరిగే కలుపు మొక్క; వరిమొక్కలాగా ఉంటుంది; మొదళ్ళు దుబ్బుగా ఉంటాయి; పశువులమేతకు ప్రశస్తం; *Ischaemum laxum*, R Br. (కో. 3; తె. 7, 9).

**నేతిబొడ్డ** ఒకరకం కంచెమొక్క; *Ficus species* (కో. 42).

**నేద** ఒకరకం కలుపుమొక్క (కో. 42).

**నేపాళం** చూ. మేపాళం. బూడిదరంగు బెరడు, పసుప్పచ్చటి పూలు, కాఫీగింజల్లాటి విత్తనాలుండి 15-20 అడుగుల ఎత్తు పెరిగే చెట్టు; చెట్టంతా మురికికంపువేస్తుంది; విత్తనాలను వైద్యంలో ఉపయోగిస్తారు; ఆకు పచ్చిఎరువుగా ఉపయోగిస్తుంది; *Jatropha curcas*, Linn., *? Croton tiglium*, Linn. (కో. 39).

**నేరడ** నేరేడుచెట్టు; కొమ్మలను కంచెగా వేస్తారు; *Eugenia Jambolana*, Lamk. (కో. 43).

**నేలుసకరాకు** పర్యా. చూ. నేలుసిరిక. తోటల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క; ఆకుపచ్చటిపూలు పూస్తుంది; అడుగు అడుగున్నర ఎత్తు పెరుగుతుంతు; ఆకును, వేళ్ళను వైద్యంలో ఉపయోగిస్తారు; *Phyllanthus niruri*, Miill., *Phyllanthus maderaspatensis*, Linn. (తె. 31).

**నేలుసిరి** (<నేల + ఉసిరి) చూ. నేలుసిరిక (తె. 1).

**నేలుసిరిక** (<నేల + ఉసిరిక) రూ. నేలుసిరి; పర్యా. నేలునకరాకు. తోటల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క; ఆకుపచ్చటి పూలు పూస్తుంది; అడుగు అడుగున్నర ఎత్తు పెరుగుతుంది; ఆకును, వేళ్ళను వైద్యంలో ఉపయోగిస్తారు; *Phyllanthus niruri*, Miill., *Phyllanthus maderaspatensis*, Linn. (కో. 35, 42, 47; తె. 1, 41).

**పంగల(గడ్డి)** ఉప్పుగడ్డి; మొదళ్ళ గుబురుగా పెరుగుతుంది; *Chloris virgata*, Sw. (తె. 34, 38).

**పచ్చబొట్టుకాడ** మెట్టనేలల్లో పెరిగే కలుపుమొక్క; ఈ ఆకు పసరుతో పచ్చబొట్టు పొడుస్తారేమో? (కో. 37).

**పట్టుసార** ఒకరకం కలుపుమొక్క; ? చాగనార; ? *Sanseviera zeylanica*, Roxb (రా. 6).

**పందిబలాల(గడ్డి)** రూ. పందిబెల్లం; పర్యా. పందిలేడు(గడ్డి). పందిముల్లుగడ్డి; దుబ్బుకాసిరిగడ్డి; పశువుల మేతకు ప్రశస్తం; పూరిళ్ళ కప్పుకువాడతారు; *Heteropogon contortus*, Beauv. (కో. 9).

**పందిబెల్లం** చూ. పందిబలాల(గడ్డి) (కో. 3).

**పందిలేడు(గడ్డి)** పర్యా. చూ. పందిబలాల(గడ్డి). పందిముల్లుగడ్డి; దుబ్బకాసిరిగడ్డి; పశువులమేతకు ప్రశస్తం; పూరిళ్ళ కప్పుకు వాడతారు; *Heteropogon contortus*, Beauv. (కో. 25).

**పప్పర** ఉ. పొప్పర. ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపుమొక్క (కో. 9, 13).

**పబ్బ** ? (<ప్రబ్బ) చెమ్మనేలల్లో ఏపుగా పెరిగే పేప మొక్క; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; *Calamus rotang*, Linn. (తె. 27).

**పరిగె**[1] ఉ. పరిక, పరికి, పరికె, పరిగి. నీళ్ళపైన తేల్తూ పెరిగే పొడుగాటి కాడల మొక్క; జలకంద; *Trapa bispinosa*, Roxb. (కో. 11, 23; తె. 10; రా. 7).

**పరిగె**[2] పొదగా పెరిగే ముళ్ళమొక్క; కొమ్మలను కంచెకు వాడతారు; దీని నల్లటిపళ్ళు తింటారు; *Zizyphus oenoplia*, Mill. (తె. 10).

**పరిమె(తుప్ప)** ? వాకతుప్ప; దీని పళ్ళు తింటారు; *Carissa species* (కో. 45).

**పర్రపసుపు** ఒకరకం ఆకెరువుమొక్క (కో. 6).

**పలకజెముడు** పలకల కొమ్మలుగల జెముడు; ...ంచెగా వేస్తారు; *Opuntia species* (తె. 36).

**పలప(తీగ)** ఉ. పలపు(తీగ); రూ. పలువ(తీగ). ...కరకం కలుపుమొక్క (కో. 15; తె. 24).

**పలవర** ఉ. పొలవరి; రూ. పలవరేగు, పలవరేని. ఒకరకం ఆకెరువుమొక్క (రా. 5, 6, 14, 17–19, 22).

**పలవరేగు** చూ. పలవరి (రా. 5).

**పలవరేని** చూ. పలవరి (రా. 6).

**పలువ(తీగ)** చూ. పలవ(తీగ) (తె. 31).

**పల్లేరు** ఉ. పల్లిరి, పల్లెర. కాయలకు అయిదైదు బొడిపెలు, బొడిపె బొడిపెకు ముళ్ళుఉండి తీగగా పాకే సన్నటి ఆకుల కలుపుమొక్క; సువాసనగల పసుప్పచ్చటి పూలు పూస్తుంది; దీన్ని చిన్నపల్లేరు అనీ అంటారు; *Tribulus terrestris*, Linn. (కో. 10, 13, 29–32, 35; తె. 1, 4, 12, 31, 40, 41; రా. 17, 18); **భేదాలు: గాడిద-** పర్యా. చూ. పెద్ద-. ఇసకనేలల్లో ఎక్కువగా మొలిచే పాకుడు కలుపుమొక్క; చిన్నపల్లేరు కంటె ఆకులు పెద్దవి; కాయలకు వాడియైన చిన్నముళ్ళుంటాయి; దీన్ని ఏనుగుపల్లేరు అనీ అంటారు; *Pedalium murex*, Linn. (తె.); **నేల-** నేలకు అంటుకుపొయ్యే పల్లేరు; *Tribulus species* (కో.); **పాప-** పల్లేరులో ఒకరకం ముళ్ళ కలుపుమొక్క; *Tribulus species* (తె.); **పెద్ద-** పర్యా. గాడిద-. ఇసకనేలల్లో ఎక్కువగా మొలిచే పాకుడు కలుపుమొక్క; చిన్నపల్లేరుకంటె ఆకులు పెద్దవి; కాయలకు వాడియైన చిన్న ముళ్ళుంటాయి; దీన్ని ఏనుగుపల్లేరు అనీ అంటారు; *Pedalium murex*, Linn. (కో.).

**పామురకూర** ఒకరకం కలుపుమొక్క (కో. 47).

**పాయలాకు** (<పాయల + ఆకు, పాయల<పావిలి) గోళికూర తెగలో తుప్పగా పెరిగే కలుపుమొక్క; కణుపులవద్ద పొడుగాటి నూగుఉంటుంది; ఆకును కూరగా వండుకొంటారు; *Portulaca meridiana* (కో. 6, 10, 14, 22; తె. 20; రా. 1, 14, 18); **భేదాలు: కుక్క-** పాయలాకులో ఒకరకం; మిరప చెట్టులాగా ఉంటుంది; *Trianthema crystallina*, W. & A. (కో.); **పెద్ద-** ఉ. -పాయల్లాకు; పర్యా. చూ. బొడ్డుపావలి. చెమ్మనేలల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క; పసుప్పచ్చటిపూలు పూస్తుంది; ఆకును, గింజలను వైద్యంలో ఉపయోగిస్తారు; ఆకును కూరగాను వాడతారు; కరువుకాలంలో బీదలు ఈ ఆకులను తింటారు; *Portulaca oleracea*, Linn. (రా.); **బంక-** జిగటగాఉండే ఆకులగల పాయలాకు *Portulaca crystallina* (రా.); **బొడ్డు-** ఉ.- బాయిలాకు; చూ. బొడ్డుపావలి (కో.); **సన్న-** ఉ. -పాయల్లాకు. చెమ్మనేలల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క; పగలంతా విచ్చి మాపటికి మూసుకుపోయే పసుప్పచ్చటిపూలు పూస్తుంది; ఆకును కూరగా వండుకొంటారు; కరువుకాలాల్లో బీదలు తింటారు; *Portulaca quadri-*

**జాజుతెవులు** ఉ. జాజి-. జొన్న, నువ్వు మొ. వాటికి వచ్చే పేను తెగులు; మొక్కంతా ఎర్రబడిపోతుంది (తె. 12, 24, 29, 31).

**జిగి(తెవులు)** జొన్నతెగులు; దంటుమీద తెల్లబంక పడుతుంది (తె. 3, 4, 10).

**జినక** దంటుకు బంక పట్టే తెగులు; చూ. బంక (తెగులు) (తె. 31).

**జీడ** ఉ. జీడి; చూ. చీడ (రా. 8, 13, 17-19, 21).

**జుంజురు(పురుగు)** ఉలవ, కంది, పెసర మొ. పైర్ల ఆకుతినిపోయే రెక్కలపురుగు; ఒకరకం మిడత(తె. 4,5).

**జుందర** రాగిపైరు గాలికి ఎండిపోయే తెగులు(కో. 8).

**జైద్యం** ఉ. జైడ్డెం; పర్యా. చూ. తెగులు. పురుగులు, మిడతలు, శిలీంధ్రాలు (fungi) మొ. వాటివల్ల పంటలకు వచ్చే వ్యాధి (కో. 41; రా. 4).

**డాంబరురోగం** గోధుమ తెగులు; ఆకుమీద నల్లటి పొడ లేర్పడతాయి. శిలీంధ్ర (fungus) జాతికి చెందిన జాడ్యం (rust) (తె. 17).

**తంగేడుపురుగు** (-పడు) పొగాకు మొక్క ఆకుతినే తెల్లటి, సన్నటి పురుగు (కో. 25).

**తట్టుకాయ** కంది, పెసర మొ. వాటి తెగులు; గింజలు లేని కాయ ఏర్పడుతుంది; చూ. చట్ట తెగులు (రా. 26).

**తండు** (-పడు) ఉలవ, పెసర మొ. వాటికి గింజలు లేని కాయ ఏర్పడే తెగులు; చూ. చట్టతెగులు (తె. 39; (రా. 8).

**తలతుట్టి** జొన్నతెగులు; తల (ఎన్ను) గుండా ప్రవేశించి పురుగు దంటును దొల్లచేస్తుంది; ఆకుతోటలకు ఈ తెగులు పడుతుంది (కో. 4).

**తలముడితెవులు** మిరపతెగులు; ఆకులు ముడుచుకుపోతాయి; *Thrips* (రా. 5).

**తలనట్టు** ఉ. తల్నట్టు; రూ. తలనత్త (రోగం). వరి, జొన్న, పొగాకు, మిరప మొ. పైర్లకు తగిలే తెగులు; పురుగు కొరకటంవల్ల తలకొమ్మ ఎండిపోయి పక్కపిలకలు పెరుగుతుంటాయి (కో. 6, 10, 11).

**తలనత్త(రోగం)** ఉ. తల్నత్త; చూ. తలనట్టు (కో. 24).

**తాటిమట్టతెగులు** పర్యా. తాటైకుతెగులు. సకాలంలో వానలులేక, ఆకులకొనలు తెల్లగా ఎండిపోయే తెగులు; చోడిపైరుకు దుబ్బు ఎక్కువగా వచ్చి చిన్నకంకి ఏర్పడుతుంది; దొలుపుడు పురుగు (stem borer) వల్ల కూడా ఆకులు తెల్లబడవచ్చు (కో. 9, 46, 49; రా. 27).

**తాటైకుతెగులు** పర్యా. తాటిమట్టతెగులు. వరి, జొన్న, పసుపు మొ. వాటి తెగులు; ఆకులు కొనలనుంచి ఎండి తెల్లబడతాయి; కాడకూడా ఎండిపోవచ్చు; సకాలంలో వానలులేక ఇలా అవుతుందట (కో. 13-19, 22, 23, 25, 27-30, 32, 33, 35, 36, 44; తె. 40, 41).

**తిక్కతెవులు** నువ్వు. కంది మొ. పైర్లు కాయకుండా పొయ్యే తెగులు; చెట్టు పెరుగుదల మామూలుగానే ఉండి కాపుమాత్రం ఉండదు; చూ. గొడ్డుతెగులు (తె. 34; రా. 18).

**తుట్టెతెవులు** నువ్వుచెట్టు తెగులు; కొమ్మమీద ఉండ లుండలుగా తుట్టె ఏర్పడుతుంది; కాపు కాయదు (రా. 24).

**తురకపురుగు** మిరపచెట్టుకు పట్టే నల్లటి కట్లపురుగు; చూ. గుర్రపుమూతిపురుగు (కో. 25).

**తెగులు** రూ. తెవులు; పర్యా. జైద్యం, రోగం. పురుగులు, మిడతలు, శిలీంధ్రాలు (fungi) మొ. వాటివల్ల పంటలకు వచ్చేవ్యాధి; కొన్ని ప్రాంతాల్లో కాటికతెగులు, తెల్లతెగులు మొ. ప్రత్యేకమైన తెగుళ్ళకుకూడా మామూలుగా 'తెగులు' అనే వాడుక (కో. 1-29, 32, 33, 35, 36, 40-42, 44, 46-51; తె. 39-41; రా. 1, 7, 10, 19-21, 24, 26, 27).

**తెండె** రాగితెగులు; మొక్కల మొదళ్ళు తెల్లబడిపోతాయి (రా. 15).

**తెల్లకొక్కెర** వరితెగులు; ఆకులు తెల్లబడి ఎండిపోతాయి; పెరుగు బియ్యం కలిపి చల్లుతారట (తె. 11, 22).

**తెల్లగంకి** పర్యా. చూ. వెలెన్ను. వరితెగులు; కంకి తెల్లబడిపోతుంది; గింజ తాలుపడుతుంది; దొలుపుడు పురుగుల (stem borers) వల్ల కావచ్చు (కో. 16, 23).

**తెల్లచిత్త** వరితెగులు; తెల్లటిచుక్కపడి ఆకులు ఎండిపోతాయి (కో. 37, 48, 51).

**తెల్లచీడ** తమలపాకులమీద, వరి ఆకులమీద పడే చిన్న తెల్లపురుగు; దీనివల్ల పచ్చదనం పోయి ఆకులు పాలిపోతాయి (కో. 15; రా. 8, 9, 14).

**తెల్లజిగి** ఒకరకం పేను (shoot bug) వల్ల జొన్నకు పట్టే తెల్లబంక తెగులు (తె. 3, 4; రా. 21).

**తెల్లతెగులు** ఉ. తెల్లదెగులు. వరి, జొన్న, మిరప మొ. వాటి తెగులు (mildew); ఆకులు, కాడ క్రమంగా పాలిపోతాయి; చూ. మజ్జిగతెగులు (కో. 1, 3-5, 20; రా. 1, 9, 19).

**తెల్లదూదర** వరితెగులు; ఆకుమీద తెల్లటి బూజు పడుతుంది; చూ. బూడిద తెగులు (రా. 15, 16).

**తెల్లపురుగు** వంకాయలోపడే తెల్లటి పురుగు (aphid or mealy bug) (కో. 20).

**తెల్లపొడ** పొగాకు, రాగి, జొన్న మొ. పైర్ల ఆకుమీద తెల్లటి పొడలేర్పడే తెగులు (mildew) (కో. 9, 11).

**తెల్లబంక** జొన్న తెగులు; ఆకుమీద పేను(aphids)

పడి తెల్లబంక ఏర్పడుతుంది (రా. 18, 24).

**తెల్లబొమ్మిడి** మొక్కజొన్నతెగులు: ఆకులమీద ఏర్పడే తెల్లచీడ (mildew): ఒకరకం శిలీంధ్రంవల్ల ఈ తెగు లేర్పడుతుంది (తె. 21, 24).

**తెల్లరోగం** సజ్జ, రాగి మొ. వాటి తెగులు; పైరంతా తెల్లబడిపోతుంది; చూ. తెల్లతెగులు (తె. 13, 15, 19; రా. 2).

**తెల్లలత్తిక** ఉ. తెల్లలతిక. వరి, జొన్న మొ. వాటి తెగులు; పచ్చపురుగువల్ల ఆకులకు, కాడకు తెల్లటి జిగట బంక పడుతుంది; కాపు బాగా కాయదు (రా. 23, 24).

**తెల్లవెంబడి** వరితెగులు; ఆకులు తెల్లబడిపోతాయి (తె. 23).

**తెవులు** చూ. తెగులు (తె. 1-14, 29, 31-39, 42; రా. 3, 5-14, 16-22, 24-28).

**తేనె(తెగులు)** జొన్న తెగులు; పేను (plant lice or mites) పడటంవల్ల దంటుమీద తేనె పూసినట్టు బంక ఏర్పడుతుంది (తె. 6-8, 18, 22, 32, 38).

**తేనెబంక** ఉ. తేనెమంక. జొన్న, పసుపు, మినుము, పెసర, పొగాకు మొ. పైర్లకు పట్టేచీడ; ఆకుమీద తేనె లాగా బంకబట్టి దోమలు (plant lice) ముసురుతాయి (కో. 12, 17-19, 38, 40, 51; తె. 39; రా. 26).

**తేనెమంచు** జొన్న తెగులు (honey dew); ఆకులు, కర్ర నల్లబడిపోయి కర్రకు తేనెవంటి బంకపట్టి సన్నటి దోమ *Aphis maidis* వాలుతుంది (కో. 37).

**తోడేలుపురుగు** మొదళ్ళలో చేరి వేరుసెనగకాయలు తినే ఒకరకం పురుగు: (seed sucking bug) *Aphanus sordidus* (రా. 21).

**తోలుకాయ** నువ్వు తెగులు; గింజలులేని కాయ ఏర్పడుతుంది; ఒకరకం గొంగళిపురుగు (leaf and pod caterpillar) *Antigastra Catalannalis* పడి ఇలా కావచ్చు (తె. 10).

**దావపోవు** (క్రి.) కంది, మినుము, పెసర, ఉలవ మొ. వాటి కాయల్లో గింజపట్టకపోవటం (తె. 24, 25).

**దాసరి(పురుగు)** పర్యా. ఆంజనేయపురుగు, నామాలగాడు, నామాలపురుగు. కొఱ్ఱ, కంది, పెసర, ఆముదం మొ. చెట్ల ఆకులుతిని పొయ్యే పురుగు; *Achoea janata* (తె. 1, 4, 6-9, 33, 35, 36).

**దుగ్గుపురుగు** ఆముదపు తెగులు; చిన్న నల్లటిపురుగు (shoot and capsule borer) పడిగెలలో గింజలు తింటుంది (రా. 5).

**దుంపకొయ్య** వరితెగులు; వేరుపురుగు పడి మొక్క ఎండిపోతుంది (తె. 9).

**దుంపతెగులు** ఉ. దొంపుతెగులు. ముఖ్యంగా వరి తెగులు; ఒకరకం పురుగు (root weevil) *Echinocnemis* పడి వేళ్ళు తింటుంది; చేలో అక్కడక్కడా ఐదు, పది మొక్కలు అలా చచ్చి ఎండిపోతాయి; డెల్టా ప్రాంతాల్లో ఎక్కువ (కో. 2-6, 12, 18, 19, 22-24, 29, 35, 50; తె. 5, 8, 24, 26-28, 31, 33, 37-42; రా. 10, 20, 26, 28).

**దూదర(తెగులు)** వరి, రాగి, సజ్జ, వేరుసెనగ మొ. పైర్ల తెగులు; తెల్లపొడలు, బూజుపట్టి ఆకులు ఎండిపోతాయి; పైరు లేతలో మిడత వచ్చినప్పుడుగూడా ఇలా కావచ్చు; చూ. బూడిదతెగులు (రా. 4-6, 13, 14, 19).

**దూసరతెవులు** ? ఒకరకం అవిసెతెగులు (తె. 10).

**దొండ్లచీడ** ఉ. దొణ్ణచీడ. ఆకుకోటల్లోపడే తెగులు; అక్కడక్కడా ఆకులకు బెజ్జాలు పడతాయి (కో. 3).

**దొంపు(తెగులు)** వరి, జొన్న మొ. వాటి తెగులు; మొక్కసుడి(తల) ఎండిపోతుంది; తలకొమ్మను పురుగు తినటంవల్ల పక్కపిలకలు ఏర్పడతాయి, కాని ఎన్ను పైకి రాదు (కో. 9, 15; రా. 25).

**దోమ** (-ఆడు, -ఆరు, -నాకు, -పట్టు, -పడు) వరి, జొన్న మొ. వాటి ఎన్నులమీద చేరి సుంకు తినిపొయ్యే చిన్న నల్లటి పురుగు(లు); పెసర, కంది మొ. పైర్లమీద మురిసితే కాయలో గింజ పట్టదు; (ear head bug) *Calacoris ungustatus* (కో. 9-13, 18, 19, 24, 26-29, 32, 33, 35, 47; తె. 3, 8, 26, 34; రా.28). **-కాటు** దోమలు కరవటం; ఎన్నుమీద దోమలు మురిసి సుంకు తినటం (కో.); **-ముసురు** ఉ. దోమ్ముసురు. చాలా దోమలు వచ్చి కంకిమీద వాలటం (కో. తె.).

**నక్కతెగులు** నక్కదెగులు (< ? లక్కతెగులు) వరి, సజ్జ, జొన్న మొ. వాటి తెగులు; ఆకులు, కాడ ఎఱ్ఱబడి కిందినుంచి ఎండుకుపోతాయి; *Helminthosporium* అనే ఒకబూజు తెగులువల్ల కాని, *Aphis* అనే పేనువల్ల గాని ఇలా కావచ్చు (కో. 5, 6, 9, 13, 14, 18, 33, 44; తె. 40, 41; రా. 16, 17, 26, 27).

**నక్కనెత్తురుతెగులు** వరితెగులు; ఆకులు ఎఱ్రబడతాయి (కో. 22).

**నట్టుతెగులు** ఉ. నట్లతెగులు. ఆరిక, వరి మొ. వాటి తెగులు; దంటుతొలిచే పురుగులవల్ల మొక్క ఎండిపోతుంది; తల, ఎన్ను ఎండిపోతాయి; కాపు కాయదు (తె. 3, 36; రా. 14, 19).

**నట్టుపిప్పి** వరి, జొన్న మొ. పైర్ల తెగులు; తలకొమ్మ ఎండిపోయి ఎన్ను వెళ్ళదు; దంటు తొలిచే పురుగు (stem borer) వల్ల ఇలా కావచ్చు (తె. 8, 32-35, 37, 38).

**నత్త(తెగులు)** జొన్న, మొక్కజొన్న మొ. వాటి దంటు తొలిచే పురుగు(నత్త) వల్ల ఎన్ను ఎండిపోతుంది;

దంటులోపలి బెండు ఎర్రగా పిప్పి అవుతుంది (కో. 6, 18, 22; తె. 39).

**నలికాయ** మిరప తెగులు; కాయలో నల్లటి పేను పడుతుంది (రా. 25).

**నల్లకంకి(తెగులు)** జొన్న, రాగి మొ. వాటి తెగులు; కంకి నల్లబడి గింజ పట్టదు; చూ. కాటిక (కో. 7, 37, 46; రా. 4).

**నల్లకట్టె** (-పడు) పత్తితెగులు; చెట్టుమొత్తం నల్లగా పోతుంది; పూత, కాయ పట్టదు (black arm disease) (కో. 11, 25; రా. 18, 23).

**నల్లచీడ** ఉ. నల్లజీడ. వరి, పొగాకు మొ. వాటి తెగులు; చెట్టంతా నల్లటి చిన్నపురుగు (*Aphis* or *Hispa*) పడుతుంది (రా. 14, 15).

**నల్లతెగులు** ఉ. నల్లదెగులు. ఆకుతోట తెగులు; తమలపాకు మొదళ్ళు నల్లగా మారి రాలిపోతాయి; ఒకరకం గొంగళిపురుగు (*Disphinctus politus*) వల్ల కావచ్చు (కో. 15).

**నల్లపురుగు** ఉ. నల్లబురుగు. వరి, వేరుసెనగ మొ. పైర్లకు పట్టే నల్లటి దోమ (తె. 1, 4, 5, 27, 31; రా. 22, 24).

**నల్లమచ్చతెగులు** ఆకుతోట తెగులు; తమలపాకు తీగ మీద నల్లటి చుక్కలేర్పడి కుళ్ళి రాలిపోతుంది (కో. 17).

**నల్లిపొడ** వరికిపట్టే పేనుతెగులు; ఆకులమీద నల్లుల్లాగా మచ్చలు పడతాయి; గింజలుకూడా నల్లబడి పోతాయి (కో. 6).

**నల్లిపొడరోగం** పత్తితెగులు; ఆకులమీద నల్లటి మచ్చలేర్పడి మొక్క కుంగిపోతుంది; *Anychus latus* అనే పురుగువల్ల ఇలా కావచ్చు (తె. 31).

**నవిసి** వరితెగులు; గింజలమీద ముళ్ళులాగా ఏర్పడతాయి; గింజరంగు మారిపోతుంది; చూ. కేళి (కో. 50).

**నాగజెముడుపురుగు** ఆకులకు, కొమ్మలకు పట్టే నల్లటి చిన్నపురుగు;( ? cochineal insect) (రా. 23.).

**నాగదారితెగులు** వంగతెగులు; ఆకులమీద గుడ్లు పోసినట్టు ఏర్పడుతుంది; (mealy bug)*Phenococcus* తెగకు చెందిన పురుగులవల్ల కలగవచ్చు (రా. 1).

**నాగూరితెగులు** ఆకుతోట తెగులు; తమలపాకుమీద నల్లటి చుక్కలు ఏర్పడతాయి (కో. 22).

**నాటుమల్లె** ? సజ్జతెగులు; వేళ్ళమీద ఒకరకం కలుపు మొక్క పుట్టి పంటపండదు; చూ. మల్లె (రా. 8).

**నాంద్రతెగులు** వరి తెవులు; మొక్క నిలువునా ఎండిపోయే తెగులు (?Virus); చూ. నేంద్ర గడ్డె (తె. 7).

**నామర** ఉ. నాబర (-ఆడు) మోసు, ఆకులు తినే మిడత; కొర్ర, వరి మొ. వాటి ఆకులు తింటుంది; తమలపాకుమీద నల్లటి చిల్లులు పడతాయి; చివళ్ళు ఎండిపోతాయి; పొగాకుమీద బంక ఏర్పడుతుంది (కో. 4, 9, 15-17; రా. 9, 10, 12, 13, 16, 18, 19, 23).

**నామాలగాడు** పర్యా. చూ; దాసరి (పురుగు). ఆముదపు ఆకులుతినిపొయ్యే కట్లపురుగు (రా. 21).

**నామాలపురుగు** పర్యా. చూ. దాసరి (పురుగు). ఆముదపు ఆకులు తినిపొయ్యే కట్లపురుగు (కో. 12; తె. 12, 29).

**నాము** (-పట్టు, -వేయు) వరితెగులు; ఆకుమీద నాము పూసినట్టు తెల్లటి రంగేర్పడుతుంది; కణుపుల దగ్గర పిలకలుపుట్టి ఎన్ను వెళ్ళదు (కో. 17, 20).

**నారచీడ** వరితెగులు; ఒకరకం సన్నటి పురుగు పడి ఆకు తెల్లబడిపోతుంది; ఆకులు చీల్చి గూడుకట్టుకునే పురుగు (*Nymphula depunctaeis*) వల్ల కలిగే తెగులు (కో. 6, 15).

**నారతెగులు** వరితెగులు; ఆకులు ఎర్రబడి చివళ్ళు చీలిపోతాయి; అగ్గి తెగులువల్ల కూడా ఇలా కావచ్చు; చూ. నారచీడ (కో. 13, 14).

**నార్వాకుతెవులు** రాగితెగులు; కంకులు తినే ఒకరకం మిడత; *Helopus* (రా. 5).

**నిక్కరుపురుగు** చూ. నిక్కుడుపురుగు (తె. 34).

**నిక్కుడుపురుగు** రూ. నిక్కరుపురుగు. ఆముదపు ఆకులు తినిపొయ్యే పురుగు (castor semilooper); చూ. దాసరిపురుగు (తె. 28).

**నిమ్మాకుతెగులు** మిరపతెగులు; ఆకులు ముడుచుకుపోతాయి; *Thrips* (తె. 3).

**నీరుచిచ్చు** (-పడు) వరితెగులు. వేళ్ళు కొట్టే పురుగువల్ల మొక్క మాడిపోతుంది. (కో. 26, 41, తె. 40).

**నీరుతాలు** ఉ. నీర్తాలు. కొర్రతెగులు; కంకి ఏర్పడేటప్పుడు వానలెక్కువగా కురవటంవల్ల తాలుగింజపడుతుంది (తె. 6, 9; రా. 18).

**నీరుమల్లె** కొర్ర, జొన్న మొ. పైర్ల వేళ్ళమీద పుట్టి మొక్కల ఆహారాన్ని హరించే ఒకరకం కలుపు మొక్క; (flowering parasite) *Striga sp.* (రా. 25).

**నురుజురోగం** జొన్నతెగులు; ఆకులమీద ఒకరకం తెల్లటి నురుగులాగా ఏర్పడుతుంది. మొక్క పెరగదు; పేను (plant lice, *Aphis maidis*) వల్ల కావచ్చు (కో. 24).

**నులితెవులు** ఆకులకు, కొమ్మలకు పట్టే నల్లటి పేను తెగులు (రా. 25, 26).

**నులిపురుగు** వంగ, కంది, మొ. చెట్ల ఆకులు తినే సన్నటి చీడపురుగు (రా. 24, 25).

**మసిపురుగు** వేపసెనగ కాయలు తొలిచే సన్న పురుగు; గింజలు బూజుపట్టిపోతాయి (తె. 4).

**మూనెరోగం** పత్తితెగులు; చెట్టంతా నల్లబడిపోతుంది; (? black arm) (రా. 21).

**నెత్తె** పత్తి, వేపసెనగ మొ. పైర్లవేరు తొలిచే పురుగు (రా. 18).

**నెత్తురుకళ్ళు** ఆకుతోటతెగులు; తమలపాకు అంచుల్న ఎర్రటిచుక్క లేర్పడుతాయి (కో. 4).

**నేంద్రగట్టె** వరితెగులు; మొక్క పూర్తిగా ఎండిపోతుంది; చూ. నాంద్రతెవులు (తె. 6).

**పచ్చతెగులు** మిరప, వరి మొ. పైర్లఆకు తినే పచ్చపురుగు తెగులు (కో. 1; రా. 9).

**పచ్చపురుగు** (-పారు) అన్నిరకాల పైర్లకు పట్టే పచ్చరంగు పురుగు(లు); ఈ రంగు పురుగులు ఎన్నో ఉన్నాయి; ఆకు, సుంకు, మోసు మొ. వి అన్నీ తినేస్తాయి. (కో. 4, 5, 16, 26, 29, 34; తె. 1, 3, 6–8, 10, 25, 27, 31, 32, 34, 37, 42).

**పచ్చబిళ్ళపురుగు** వరిగఆకులు తినే పచ్చపురుగు (కో. 13).

**పచ్చమిడత** ఆకుతినే పచ్చని చిలక (మిడత) (తె. 1).

**పండుతెగులు** ఉ. పండుదెగులు. జొన్న, వరి, మిరప మొ. వాటి తెగులు; మిరపఆకు పండి రాలిపోతుంది; వరి పొట్టపట్టేముందు ఉత్తరకార్తెలో అంకతా రాలిపోతుంది; *Helminthosporium* (కో. 1, 3–6, 20, 23).

**పందితెగులు** చాలా పైర్లకు వచ్చే తెగులు; మొక్కమీద బూజుగూళ్ళు కట్టుకొని ఆకులు, కాడ మొ. వి తినే గొంగళిపురుగుల (webbing caterpillar) వల్ల వచ్చేది (రా. 1).

**పందిరోగం** వరి తెగులు; పైరు ఎర్రబడి ఎండి పోతుంది (రా. 2, 16).

**పలగరం** (-పోవు) జొన్నతెగులు; గింజలులేని కంకు లేర్పడతాయి; దొలుపుడుపురుగు (stem borer) వల్ల కావచ్చు (రా. 10, 12).

**పల్లవారకం** (<పల్ల + పారు + అకం) జొన్న తెగులు; దంటు పాలిపోతుంది; చూ. బోదతెగులు (తె. 1).

**పల్లాకు** (-పడు) పొగాక్కు పట్టే ఒకరకం బూజు తెగులు (mildew); ఆకు తెల్లబడిపోతుంది; తుత్తునాగం లోపించటంవల్ల నిమ్మజాతులకు పట్టే ఒకరకం తెగులు; పళ్ళు బాగా కాయదు (కో. 15).

**పసుపుతెగులు** తమిద్దె, కొఱ్ఱ మొ. వాటి తెగులు; ఆకులు, కాడ పచ్చగా అయిపోతాయి; కంకివెళ్ళదు; క్రమంగా మొక్క ఎండిపోతుంది; బొగాకు పసుప్పచ్చగా అవుతుంది (కో. 9, 13, 32; తె. 9, 10; రా. 10).

**పిడికానతెగులు** మిరపతెగులు; కాయలకు సన్నటి బెజ్జాలుపడి రాలిపోతాయి (కో. 5).

**పిడికానపిప్పి** కందితెగులు; కాయకు బెజ్జాలు పడి గింజలు డొల్లలయిపోతాయి; ఒకరకం రెక్కపురుగు (plume moth, *Exalasets atomosa*) వల్ల ఇలా కావచ్చు (కో. 4, 9).

**పిండిచిత్త** వరితెగులు; ఆకులమీద పిండిపోసినట్టు తెల్లటి మచ్చలేర్పడతాయి; *Hispa* అనే పురుగువల్ల కావచ్చు (కో. 49, 51).

**పిండితెగులు** మిరపతెగులు; ఆకు తెల్లగా అయిపోతుంది; పేను (mealy bug) వల్ల కావచ్చు (కో. 48).

**పిప్పి(తెగులు)** ఉ. పిప్పి(దెగులు). వరి, జొన్న మొ. వాటి తెగులు; దొలుపుడు పురుగు *Chilo sp.* పడటం వల్ల దంటు లోపలి బెండు పుచ్చి ఎర్రబడుతుంది (కో. 4, 10, 11; తె. 42).

**పీకచావు** వరితెగులు; సుడి (తలకొమ్మ) ఎండిపోయి కంకి పైకిరాదు (రా. 7).

**పీకతెగులు** వరితెగులు; కంకి ఊచను పురుగు కొరుకుతుంది (కో. 4).

**పీకపట్టుతెగులు** జొన్నతెగులు; ఎన్ను వెళ్ళకుండానే కఱ్ఱ ఎండిపోతుంది (కో. 48).

**పీకపురుగు** వరికంకి ఊచను కొట్టే పురుగు; ఎన్ను చచ్చి వట్టి మోడే నిలుస్తుంది (కో. 46, 47).

**పీకరోగం** ఉ. పీకెరోగం. కంకికాడ పురుగు పడి విరిగిపోతుంది (కో. 24).

**పుచ్చుతెగులు** కంది, వంగ, మామిడి మొ. వాటి తెగులు; పురుగులు (shoot and fruit borers) పడి కాయ పుచ్చిపోతుంది; జొన్నకు దొలుపుడు పురుగులు *Chilo sp.* పడి దంటు పుచ్చిపోతుంది (కో. 48; తె. 4; (రా. 23–25).

**పుప్పి** (-పట్టు) దొలుపుడు పురుగులవల్ల ఏర్పడే పుచ్చుతెగులు; అలచంద, కంది మొ. వాటి కాయలు, చెరకు, జొన్న మొ. వాటి దంట్లు పుచ్చిపోతాయి; చాలా రకాల పురుగులవల్ల పుచ్చు ఏర్పడవచ్చు (కో. 46; తె. 24; రా. 8, 18).

**పురుగు** ఉ. పురువు, పులుగు (-తగులు, -నాకు, -పట్టు, -పడు) గొంగళిపురుగులు (caterpillars), కుమ్మరి పురుగులు (beetles), పేలు (lice) మొ. చాలా తెగలకు చెందిన రోగకారి క్రిములకు సామాన్యంగా 'పురుగు' అంటారు (కో. 8, 12, 31, 33, 34, 36, 40, 47, 49, 51; తె. 15, 16, 19–21, 23, 26, 28, 29; రా. 5, 9).

**పుల్లబట్టు** (క్రి.) ఎండలుగాని, వానలుగాని ఎక్కువైనప్పుడు (జొన్న)పైరు పడిపోవటం (కో. 46).

**పూతతెగులు** ఉ. పూత్తెగులు, కంది తెగులు; ఒక రకం పురుగు పడి పూత రాలుస్తుంది; చూ. గుర్రపుమూతి పురుగు (రా. 21, 23, 26, 28).

**పెంకపురుగు** ఉ. పెంకాపుర్గు. మొలక పైకి వచ్చి రాకముందే తినే పురుగు (తె. 24, 31).

**పేను** ఉ. పేని(-తగులు,-పట్టు-పడు)నువ్వు, జొన్న, పొగాకు, కంది మొ. చాలా రకాల పైర్లకు పట్టే నల్లటి చీడ పురుగులు (aphids) ; ఇవి పడితే కర్రకు, ఆకులకు జిగట బంక ఏర్పడుతుంది; కాపు కాయదు; కొన్ని పురుగులు కంకి మీద సుంకు తినిపోతాయి (కో. 6, 9-13, 23-26, 28, 31, 32, 35, 41, 43, 45, 46, 48; తె. 1, 5, 10, 26, 29, 31, 34–36, 38-42; రా. 10, 12, 27) ; **-తెగులు** వేరుసెనగకు పట్టే పేను చీడ; *Aphis laburni* (కో.) ; **-బంక** పేనుపట్టి ఆకుమీద, కాడమీద ఏర్పడే తేనె వంటి జిగురు; చూ. తేనెబంక; జొన్న, పత్తి మొ. వాటి కాడలు ఎర్రబడతాయి (కో. తె. రా.).

**పొగచూరుతెగులు** ఉ. పొగసూర్తెగులు. పసుపు తెగులు; ఆకుల కిందిభాగం పొగచూరినట్టు నల్లబడి పోతుంది (కో. 19, 20, 22).

**పొట్టతెగులు** వరి, జొన్న మొ. పైర్ల తెగులు; 'పొట్ట'లో పురుగుపడి ఎన్నును ఎక్కిరానియ్యదు (కో. 44, 51; తె. 32; రా. 26).

**పొడతెగులు** పొగచెట్టు తెగులు; ఆకులమీద తెల్లటి మచ్చ లేర్పడతాయి; ఒకరకం శిలీంధ్రం (mildew) వల్ల ఇలా కావచ్చు (కో. 4, 7; రా. 17, 28).

**పొదపురుగు** మిరపకొమ్మలు తినే ఒకరకం పురుగు (కో. 17).

**పొల్లెన్ను** ఉ. పొలెన్ను. వరితెగులు; కంకికాడ తొలిచే పురుగువల్ల తాలుగింజలు పడతాయి (కో. 37).

**బంక(తెగులు)** జొన్న, రాగి, పత్తి, అలచంద, కంది మొ. చాలారకాల పైర్లకుపట్టే పేనుతెగులు; ఆకులకు, కాడకు నల్లగాను, తెల్లగాను జిగురు ఏర్పడుతుంది; పంట బాగా పండదు; శిలీంధ్రాల (*Fungi*) వల్లకూడా బంక ఏర్పడవచ్చు (కో. 7, 25, 44; తె. 10, 12, 31, 36; రా. 10, 12, 18, 24, 28).

**బచ్చి** కొర్ర, సజ్జ, మొ. పైర్ల ఆకులుతినే మిడత (తె. 10).

**బండారురోగం** పసుపుతెగులు; ఆకులు ఎండిపోతాయి. (leaf spot, *Coletotrichum capsici*).

**బర్మాపురుగు** అవిసెతెగులు; ఆకు తోటల్లో వేసే అవిసె చెట్లకాండం తొలిచే కుమ్మరి పురుగు (beetle) ; 'బరుమా' తో వేసినట్టు రంధ్రాలు వేస్తుందట (కో. 17).

**బాపనరోగం** వరి, రాగి మొ. పైర్లతెగులు; మొదళ్ళు తెల్లబడిపోతాయి. దొలుపుడు పురుగువల్ల కావచ్చు (రా. 14).

**బింగి(తెగులు)** మిరప, పత్తి, వేరుసెనగ మొ. పైర్ల తెగులు; ఆకులు ముడుచుకు పోతాయి; కాయ పట్టదు; చెట్టు పెరగదు; పసరుతినే చిన్న పురుగులవల్ల వచ్చే తెగులు; *Scirtothrips ; dorsalis* (కో. 7, 9; తె. 6; రా. 13, 17-19, 25).

**బిమ్మిరితెగులు** మిరపతెగులు; ఆకులు ముడుచుకు పోతాయి; *Thrips* (కో. 10).

**బిళ్ళపురుగు** ఉ. బిల్లపురుగు (-పారు) జొన్న, సజ్జ, రాగి మొ. పైర్ల సుంకు తినిపొయ్యే గుండ్రటి పచ్చపురుగు; ఇది పడితే కంకికాయదు; ఆకులు, గింజలు కూడా తింటుంది (కో. 12, 28, 31-33, 35; తె. 3, 4, 41; రా. 10-12, 14, 17, 18, 21–23, 25).

**బుక్కాయితెగులు** మిరపతెగులు; ఆకులమీద బుక్కాపొడి చల్లినట్టు మచ్చ లేర్పడతాయి (powdery mildew) (కో. 21).

**బుడ్డ** (-పుట్టు, -పెట్టు, -వేయు) పొగాకుతెగులు; గొంగళిపురుగులు (*Gnorimoschema heliopa*) చెట్టుకాడ తొలుస్తాయి; మొదళ్ళదగ్గర బుడిపెలుచేరి అందులో పురుగులుంటాయి (కో. 10, 13, 14, 18, 21, 23, 25; తె. 39); **-తెగులు** పొగచెట్టుకు బుడిపె లేర్పడే తెగులు; చూ. బుడ్డ (కో.).

**బుడ్డపురుగు** వేరుసెనగ, ఉలవ, పెసర మొ. పైర్ల కాయల్లోపడి గింజలుతినే పురుగు (capsule borer) (తె. 27, 39; రా. 3, 4, 10, 18, 21, 25).

**బుర్రగాయ** ఉ. బురగాయ. దొలుపుడు పురుగుల (pod borers or seed sucking bugs) వల్ల కాయ పైర్లలో డొల్లకాయ ఏర్పడే తెగులు (తె. 6, 10).

**బుసిగారకం** జొన్న, సజ్జ మొ. పైర్లకు పట్టే బంక తెగులు; కర్రకు తేనెవంటి జిగురుబంక పడుతుంది (sugary disease) (తె. 1).

**బూజుతెవులు** నువ్వు, గోధుమ మొ. పైర్ల తెగులు; నువ్వుకాయ బూజుపట్టిపోతుంది: గోధుమపైరు ఎర్రరంగుకు తిరుగుతుంది (తె. 9, 36; రా. 19).

**బూడిద(తెగులు)** ఉ. బూడిదె-, బూద్ద-, బూద్ది-, బూద్దె-. వరి, మిరప, పత్తి, ఉలవ, పెసర, పొగాకు మొ. చాలా పైర్లకు వచ్చే ఒకరకం బూజు తెగులు (mildew); ఆకులు బూడిద చల్లినట్లు తెల్లబడిరాలిపోతాయి; క్రమంగా పైరంతా తెల్లబడుతుంది; చూ. చల్లతెగులు, మజ్జిగతెగులు (కో. 17-20, 24, 25; తె. 1, 3, 6, 8, 9, 12-16,

19, 20, 22, 24-29, 32, 33, 39, 41; రా. 5, 7, 9–12, 15, 18, 21, 24-26).

బూసంతెవులు ఉలవ, పెసర, ధనియాలు మొ. పైర్ల తెగులు; ఆకులు, కాడ తెల్లబడిపోతాయి; చూ. బూడిద (తెగులు) (తె. 9).

బూసితెగులు వరిగతెగులు; కొసాకు లెండిపోతాయి; ఒకరకం కుమ్మరి పురుగు (flea beetle, *Chaetocnema*) పడి ఇలా కావచ్చు (కో. 9).

బూసురంతెవులు పొగాకు తెగులు; చెట్టు బూడిద రంగుకు మారిపోతుంది; చూ. బూడిదతెగులు (తె. 5).

బెజన చీని(నారింజ) తెగులు; ఎక్కడన్నా ఒక కొమ్మకు ఆకులు వెడల్పుగా పుడతాయిట; ఆ కొమ్మ కొట్టేస్తారు (రా. 7).

బెండుపురుగు వంగచెట్టుకు పట్టే ఒకరకం గొంగళి పురుగు (shoot and fruit borer); వేళ్ళుతొలిచే పురుగు; ఇది పడితే కాయలు సరిగ్గా కాయవు (కో. 45).

బెల్లంతెవులు జొన్నతెగులు; పేనువల్ల కాడమీద ఎర్రటి బంక ఏర్పడుతుంది; దీనికోసం మొక్కచుట్టూ చీమలు పుట్టలు పెడతాయి; మొక్క క్రమంగా మాడిపోతుంది; చూ. తేనె బంక (తె. 5).

బైరుగుపురుగు మిరపపూత తినే గుండ్రటి పచ్చ పురుగు; చూ. బిళ్ళపురుగు.

బొట్లరోగం మిరప, నువ్వు మొ. వాటి తెగులు; ఆకులమీద చుక్కలు చుక్కలుగా మచ్చ లేర్పడతాయి (తె. 12, 23, 26).

బొడ్డె (-పోవు, -వేయు) పెసర, మినుము మొ. పైర్ల తెగులు; పూత ఎర్రబడి కాపుకాయదు; చెరకుగడ పెరగదు; పొగచెట్టు కాడకు బుడిపె లేర్పడే తెగులు; చూ. బుడ్డ (కో. 24; తె. 13, 26, 27).

బొంతతెగులు ఉలవ, కంది, పెసర మొ. పైర్ల తెగులు; మందమైన ఆకు (బొంతాకు) పడి కాపు తగ్గుతుంది (తె. 4, 7; రా. 21).

బొంతపురుగు ఉ. బొంతిపురుగు, బొంతుపురుగు. ఆకులు, పూత మొ. వి తినే గొంగళి పురుగు (shoot and capsule borer) తె. 1, 6–8, 11, 26, 31, 33, 35, 38).

బొందుపోవు (క్రి.) వానలు సరిగా లేక ఎన్ను పైకి రాకుండా పోవటం; గింజలులేని ఎన్ను ఏర్పడటం (కో. 18, 20, 24; రా. 17, 18).

బొప్పాయితెగులు పసుపు, మొక్కజొన్న మొ. పైర్ల తెగులు; ఆకులు బొప్పాయికాయరంగు (పసుపు రంగు)కు తిరుగుతాయిట; పచ్చపురుగు పడటంవల్ల ఇలా కావచ్చు (కో. 20).

బొబ్బ(తెగులు) పసుపు, పొగాకు మొ. వాటి తెగులు; పసుపుచెట్టు ఆకు నల్లగా కాల్చినట్టు అయిపోతుంది; పొగచెట్టు ఆకుమీద బొబ్బలులాగా ఏర్పడి అంతవరకు చిల్లులుపడతాయి; *Black shank* అనే శిలీంధ్రం (fungus) వల్ల ఆకులు నల్లబడి మొక్క ఎండిపోతుంది; పొగాక్కు దొలుపుడుపురుగు (*Gnorimoschema*) వల్ల ఆకుమీద, కాడమీద బొబ్బలు ఏర్పడతాయి (కో. 24; రా. 7).

బొర్రితెగులు మిరపతెగులు; కాయలకు రంధ్రాలు పడి రాలిపోతాయి (కో. 1).

బొల్లితెగులు వరితెగులు; ఆకుకొసలు తెల్లబడిపోతాయి; చూ. మజ్జిగతెగులు (కో. 21).

బోదతెగులు ఉ. బోత్తెగు(వు)లు. వరి, సజ్జ, గోధుమ, ధనియాలు మొ. పైర్ల తెగులు; ఆకులు, కాడ తెల్లబడి మొక్క ఎండిపోతుంది; దొలుపుడుపురుగుల (stem borers) వల్ల ఇలా కావచ్చు (కో. 3, 7; రా. 6-8, 10, 12, 17, 18, 20, 21, 26).

మకినెతెవులు నువ్వుతెగులు; కాయ తొలిచే ఒకరకం గొంగళిపురుగు (pod and leaf caterpillar, *Antigastra sp.*) వల్ల గింజపట్టదు (తె. 8).

మంకురు ఉ. మంకుర. మిరప తెగులు; చెట్టు ఈడుబోయి కాపుకాయదు; దొలుపుడుపురుగుల (pod borers) వల్ల ఇలా కావచ్చు (తె. 8, 9).

మంగు (-వేయు) ఆకుతోట తెగులు; ముదిరిన తమలపాకులకు సన్నటి బెజ్జాలు పడతాయి: నల్లితెగపురుగులవల్ల ఇలా అవుతుంది (కో. 22).

మచ్చరోగం పొగాకు తెగులు; ఆకులమీద మచ్చ లేర్పడతాయి; *Erysiphe cichoracearum* అనే శిలీంధ్రంవల్ల ఏర్పడే తెగులు (తె. 25, 26).

మజ్జిగతెగులు వరి, మిరప, వేరుసెనగ మొ. పైర్ల తెగులు; ఆకులమీద తెల్లటి మచ్చ లేర్పడి క్రమంగా పైరంతా బూజుపట్టినట్టు అవుతుంది; పంట కొద్దిగా పండుతుంది; చూ. చల్లతెగులు, బూడిదతెగులు (కో. 3, 4, 7; రా. 9, 11, 15-18, 20–22, 24-26, 28).

మంచుతెగులు నువ్వుతెగులు; మొక్క తెల్లబడిపోతుంది (? mildew) (కో. 42).

మట్ట(తెగులు) (1) చోడితెగులు; ఆకులు పొదగా పెరిగి ఎన్ను వెయ్యని తెగులు (కో. 37, 50); (2) ఉ. మట్టితెవులు. వరి, జొన్నలతెగులు; ఆకులు ఎండిపోయి మొక్క పెరగదు; వరిమొక్క నల్లబడి దుంప కుళ్ళిపోతుంది (కో. 1; రా. 26).

మట్టరోగం చెరకు, వరి, చోడి, సజ్జ మొ. పైర్ల తెగులు; ఆకులు రాటిమట్టల్లాగా ఎండి పైరంతా ఎర్రగా

దుంపకట్టుకుపోతుంది; తలకొమ్మ ఎండి చెరుకుగడ పెరగదు (కో. 45; రా. 3).

**మబ్బుకంకి** ఉ. మొబ్బుకంకి. జొన్న మొ. వాటికి గింజలులేని కంకి ఏర్పడే తెగులు (రా. 16, 18, 19).

**మల్లె** ఉ. మల్లి (-తీయు, -పడు, -పుట్టు, -పొడుచు, -పోవు, -బలియు). జొన్న, సజ్జ, కొఱ్ఱ, పొగాకు, చెరకు మొ. చాలా పైర్ల వేళ్ళనుంచి పెరిగే కలుపుమొక్క తెగ (*Orobanche, Lonanthus, etc.*); ఇవి చిన్న పూలమొక్కలులాగా ఉంటాయి (flowering parasites); మొక్క ఆహారాన్ని ఇవి హరించటంవల్ల పైరు పెరగదు (కో. 6, 9-14, 17, 18, 21, 25, 31, 32; తె. 1, 3-7, 13, 14, 29, 32-34, 37-39; రా. 5, 8, 10, 12, 15, 16, 18, 24, 26, 28).

**మసికంకి** జొన్నతెగులు; కంకి కాల్చినట్టు మసిఅవుతుంది; ఒకరకం శిలీంధ్రం (*Sphacelotheca sorghi*) వల్ల కలిగే తెగులు (grain smut) (కో. 21).

**మసిపేను** వేరుసెనగతెగులు; కాయల్లో నల్లటి పేలు (plant lice, *Aphis*) పడతాయి (తె. 12, 32).

**మసిరోగం** పత్తితెగులు; చెట్టు నల్లబడిపోతుంది (? black arm disease) (రా. 21).

**మాగుతెవులు** దోస (కర్బూజా), తమలపాకు, మొ. వాటికి పట్టే పేను బంకతెగులు (రా. 9).

**మాంకాళిచిత్త** వరితెగులు; ఆకులమీద పిండిచల్లినట్టు తెల్లటి చుక్కలు పడతాయి: చూ. చిత్త (కో. 38).

**మానుకా(గా)య** అక్కడక్కడా నల్లబడ్డ వరిగింజ (false smut) (కో. 13).

**మానుపళ్ళు** అక్కడక్కడా వరికంకికి నల్లటికాయలలాటివి అంటిఉంటాయి; ఇవి శిలీంధ్రపు విత్తనాలు కావచ్చు (false smut) (కో. 37).

**మిడత** (-ఆకు, కొట్టు, -పారాపు, -వాలు) చాలా పైర్లు లేతలో ఉన్నప్పుడు దండుగావచ్చి ఆకులు, ఎన్ను తినిపొయ్యే రెక్కలపురుగు(లు) (grass hoppers); వీటివల్ల ఆకులు ముడుచుకుపోతాయి; కంకి తెల్లబడి తాలుగింజ ఏర్పడుతుంది; చూ. నాముర (కో. 4, 5, 9, 24, 26, 28, 29, 31, 34-37, 40, 42, 44, 48, 51; తె. 4, 5, 8, 21, 23-29, 31, 33-36, 40, 41; రా. 3, 7, 21, 27).

**ముక్కిడిగాడు** కంది, పెసర, మొ. వాటి పూత (సుంకు) తినిపొయ్యే కుమ్మరిపురుగు; చూ. గుర్రపుమూతి పురుగు (రా. 22).

**ముక్కుజీరంగి** కంది, పెసర మొ. వాటి ఆకులు, కాయలు తినే పొడుగాటి ముక్కున్న రెక్కలపురుగు (రా. 10).

**ముడత(తెడులు)** ఉ. ముడతెగులు, ముడుత-, ముత్త- (-పట్టుకుపోవు, -పడు, -వేసుకుపోవు) మిరప, తమలపాకు, పత్తి మొ. పైర్ల ఆకు ముడుచుకుపోయ్యే తెగులు (*Thrips*); పేనువల్లగాని, దోమవల్లగాని ఇలా అవుతుంది (కో. 1-9, 11-15, 17, 20, 23-25; తె. 1, 10, 27-29, 32, 33, 36, 18, 19, 21, 23-25, 38, 39, 42; రా. 1, 3, 9, 28).

**ముడస(తెగులు)** వరి, మిరప మొ. పైర్ల ఆకు ముడుచుకుపోయ్యే తెగులు; చూ. ముడత(తెగులు) (కో. 8, 20).

**ముడసర** మిరపతెగులు; ఆకులు ముడుచుకుపోతాయి; మొక్కచుట్టూ తవ్వి నీళ్ళు ఎండగడితే తగ్గుతుందట; చూ. ముడత (కో. 48).

**మునగపొడ** తమలపాకుతెగులు; ఆకుమీద ఎర్రటి మచ్చలేర్పడతాయి (leaf spot) *Colletotrichum sp.* శిలీంధ్రాలవల్ల కలగవచ్చు (కో. 16).

**మునుంపురుగు** మొక్కమునుం (ఆకుకొనలు) తినే ఎర్ర గొంగళిపురుగు (కో. 15).

**మురికితెవులు** జొన్న, చెరకు మొ. పైర్లతెగులు; కణుపుల దగ్గర మొక్కవిరిగి పైరు కూలబడిపోతుంది; చూ. అగ్గితెగులు (తె. 1, 6-10, 13, 34, 35).

**ముడుగుడుతెవులు** ఉలవ, పెసర మొ. కాయపైర్ల తెగులు; పేనుపట్టి ఆకులు ముడుచుకుపోతాయి (తె. 6).

**ముసబు** ఒకరకం వరితెగులు (కో. 33).

**మూటుకాయ** పత్తికాయ పగలని తెగులు (రా. 23).

**మెడవిరుపు** ఉ. మెడిరుపు. జొన్న, కొఱ్ఱ మొ. పైర్ల తెగులు; ఊచ వంగిపోయి కంకికాయదు; అగ్గి తెగులులో చివరిదశ (కో. 1-7, 34; రా. 1-3, 7, 8, 11).

**మైలరోగం** పెసర, కంది, మొ. వాటికి పేనుపట్టి పూత రాలిపొయ్యే తెగులు (తె. 33).

**మొగిపురుగు** ఉ. మొగిపుర్గు. జొన్న, మొక్కజొన్న, మొ. పైర్ల కంకి ఊచకొరికే పురుగు (stem borer) (తె. 13, 26, 32, 33, 37).

**మొజ్జ** ఉ. మొజ్జ (-వేయు). వరి, చోడి, మొ. పైర్ల తెగులు; ఆకులు దట్టంగా పెరిగి ఎన్నుపైకి రాదు (కో. 47, 48).

**మొండితెగులు** ?చెట్టు ఇగురుపెట్టని తెగులు (కో. 3).

**మొనపోటు** తమలపాకు కొసలు ఎండిపొయ్యే తెగులు; రెక్కలమిడత ఆకుపసరు పీల్చటంవల్ల ఇలా అవుతుంది (కో. 16, 22).

**మొయిపురుగు** సుంకుతినే పురుగు; దీనివల్ల గింజలు లేని కంకి ఏర్పడుతుంది (తె. 11).

**మోటుపురుగు** జొన్న, మొక్కజొన్న మొ. పైర్ల

మోసుతినే పచ్చపురుగు; *Cirphis unipuncta* (కో. 26).

**మోవుపిప్పి** తమిద, జొన్న మొ. పైర్ల తెగులు; ఒక రకం ఈగ (*Antherigona*) తలకొమ్మ కొరకటంవల్ల ఎన్ను పైకిరాదు (కో. 1, 5, 15).

**మోవుపురుగు** వరి మోవు (తల) కొరికే పురుగు (? stem borer) (కో. 16).

**రాగికోల** ఉ. రాక్కోలు, రాగికోలు, రాయికోలు. వరితెగులు; దుంప ఎండిపోయి వట్టికంకి (తాలుకంకి) ఏర్పడుతుంది; చూ. దుంప తెగులు (తె. 28, 29).

**రాగిముచ్చు** రాగితెగులు; చీడ పురుగుల (aphidsor mites) వల్ల కాడ ఎర్రబడుతుంది (తె. 32).

**రావేకుతెగులు** ఉ. రాయాకు తెగులు. పొగాకు తెగులు; ఒకరకం పేను (*? Myzus percicae*) పడి ఆకుమీద మచ్చలు పడతాయి; ఆకు ముడుచుకు పోతుంది (కో. 23).

**రిక్కతెగులు** రాగితెగులు; కంకిలోని రెక్కలు విరిగి పడిపోతాయి; *Piricularia* అనే శిలీంధ్రం వల్ల ఇలా కావచ్చు (కో. 8).

**రెక్కలపురుగు** (సజ్జ) నుంకుతినే కుమ్మరి పురుగు (ear-head beetle): వేరుసెనగ కాయలు తొలిచే 'నల్లబల్లిపురుగు' (తె. 39; రా. 25).

**రెక్కవిరుపు** వరితెగులు; మిడత కొట్టటంవల్ల కంకి కాడ నల్లబడి మొదట్లో విరిగిపోతుంది (కో. 47).

**రెయ్యనాచు** వరితెగులు; వెంట్రుకలవంటి నాచు పుట్టి పైరు పెరుగుదల తగ్గిస్తుంది; నీళ్ళు ఎండగడితే తగ్గుతుందట (కో. 48).

**రెళ్ళతెగులు** ఉ. రిల్లతెగులు, రెల్లతెగులు. వరి, కొఱ్ఱ, రాగి మొ. పైర్ల తెగులు; ఎన్నులో గింజలున్న కాడ (రెళ్ళ)లు రాలిపోతాయి; కొరుకుడు పురుగులవల్ల గాని, దొలుపుడు పురుగులవల్లగాని (cut worms or borers) ఇలా కావచ్చు; వరికంకిని ఒకరకం గొంగళిపురుగు (*Cirphis albistigma*) కొరుకుతుంది (కో. 1-5, 7; రా. 1, 7, 9).

**రోగం** పర్యా. చూ. తెగులు. పురుగులు, మిడతలు, శిలీంధ్రాలు, కలుపుమొక్కలు మొ. వాటివల్ల పంటలకు వచ్చే వ్యాధి (కో. 13, 18, 24, 25, 43, 45; తె. 10, 12, 13, 15-20, 22-29, 31-34, 37, 39, 41, 42; రా. 2-4, 6, 21, 22, 24, 26).

**లక్కతెగులు** జొన్న. రాగి మొ. పైర్ల తెగులు; మొక్క అడుగునుంచి ఆకులు ఎర్రబడుతూ వస్తాయి; కర్రకు ఎర్రటి బంక పడుతుంది; పేను చీడ; చూ. నక్కతెగులు (కో. 41; రా. 4-6).

**లక్కాకుతెగులు** జొన్న, తమిద మొ. పైర్ల తెగులు; పసరుపీల్చే చిన్నపురుగుల (mites) వల్ల ఆకులు ఎర్రబడతాయి (కో. 1, 4; తె. 3; రా. 21).

**లత్తికరోగం** ఉ. లతిక-. జొన్నతెగులు; కంకిలో గింజలు నుసిగా మారి ముద్దగట్టుకు పోతాయి (రా. 23, 24).

**లద్దెగొడుగు** (-వేయు) నిమ్మ తెగులు; నేల కాను కొని ఉన్న కొమ్మమీద కుక్కగొడుగుల్లాటివి పుడతాయిట (కో. 17).

**లద్దెతెవులు** నువ్వుతెగులు; లద్దెపురుగుపడి కాయ ఉండగట్టుకు పోతుంది; చూ. లద్దెపురుగు (రా. 24).

**లద్దెపురుగు** ఉ. లద్దిపురుగు (-కొట్టు, -పట్టు, -మేయు) కంది, జొన్న, వేరుసెనగ మొ. వాటి వేళ్ళు కొరికే నల్లటి గొంగళిపురుగు; దంటు తొలుస్తుంది; పొగచెట్టు ఆకులు తింటుంది; కంకికి పడితే గింజలు నుసి అయి ముద్దగట్టుకు పోతాయి; ఈ పురుగులను leaf and pod caterpillars అంటారు (కో. 6, 17, 26-30, 34, 35; తె. 10, 11, 23, 27, 39, 42; రా. 11, 18, 23, 24).

**లంబాడితెగులు** ఉ. లంబడి-, లమ్మేడి-. వరి, జొన్న, పసుపు, పొగాకు మొ. వాటికి వచ్చే తెగులు; వరి ఈతకు వచ్చే సమయంలో ఆకుమీద ఎర్రటి మచ్చలు ఏర్పడతాయి; పొగాకు తెల్లబడుతుంది; జొన్న మొత్తం ఎర్రబడి పోతుంది; చూ. ఎర్రనక్కతెగులు (కో. 17, 19, 20; తె. 37-39, 42).

**వరిపళ్ళు** వరిపైరు ఈతకు వచ్చేటప్పుడు మంచు కురిస్తే అక్కడక్కడా నల్లబడే గింజలు (? false smut); చూ. మానుకాయ (కో. 50).

**వెండికిచ్చురోగం** పొగాకుపై తెల్లటి చుక్కలేర్పడే ఒకరకం బూజుతెగులు; (mildew) *Erysiphe cicoracearum* (తె. 34).

**వెర్రితల** (-ఎత్తు, -వేయు) సజ్జ, జొన్న మొ. పైర్ల తెగులు; గింజలు లేని కంకి వేస్తుంది (green ear disease) (కో. 8, 24, 25).

**వెలిగంకి** ఉ. ఎలిగంకి; పర్యా. చూ. వెలెన్ను. వరి తెగులు; ఎన్ను తెల్లబడిపోతుంది; చచ్చు గింజలు పుడతాయి (కో. 15).

**వెలిమువ్వ** ఉ. ఎలిమువ్వ. జొన్నతెగులు; మొక్క తెల్లబడి 'పొట్ట' పెట్టదు (కో. 45).

**వెలెన్ను** ఉ. ఎలెన్ను, ఎల్లెన్ను (-పడు,-పోవు) పర్యా. తెల్లగంకి, వెలిగంకి. వరితెగులు; దంటు తొలిచే పురుగుల (stem borers) వల్ల ఎన్ను (కంకి) తెల్లబడి చచ్చు గింజలేర్పడతాయి (కో. 2-4, 6-9, 12, 13, 37, 49; రా. 1).

**వేరుపురుగు** ఉ. ఏరుపురుగు, వేళ్ళు తినేవి; ఇవి చాలా

రకాలున్నాయి; ఇవిపడితే మొక్క ఈచబడి చచ్చిపోతుంది (కో. 6, 9, 11, 17, 43; తె. 4, 24, 35, 37–39; రా. 1, 5, 7, 11, 16, 17, 26).

సంకుతెగులు జొన్న, సజ్జ మొ. పైర్ల తెగులు; కంకి, ఆకులు, దంటు తెల్లబడిపోతాయి; సగం పంటే పండుతుంది (కో. 24; తె. 15; రా. 16, 18, 22).

సాలువిడుపు ఉ. సాలిడుపు. మొక్కజొన్న తెగులు; దొలుపుడుపురుగు పడి ఈతకు వచ్చే సమయానికల్లా మొక్క ఎండిపోతుంది (కో. 21).

సుడి(చచ్చు)తెగులు వరి, జొన్న మొ. పైర్ల కొసాకులు ఎండిపోతాయి; ఎన్ను వెళ్ళదు; గొంగళిపురుగుల వల్ల కావచ్చు (కో. 13, 26, 30, 36; తె. 1, 4, 7, 10, 18, 26, 30; రా. 16–18, 21, 23).

సీమపురుగు ?చెరకువేళ్ళు కొరికే పురుగు (తె. 10).

సౌలిపె జొన్నతెగులు; కంకి ఈచబోయి గింజపట్టదు (తె. 14).

# 10. పంట

## ఒడుపు, కళ్ళం, నిలవ

**అంతెన** (-తీయు) పర్యా. చూ. గగ్గి. కళ్ళంలో గింజలు రాలిన కంకి; చచ్చుకంకి (తె. 18).

**అంతెం** ఉ. అంకె. ధాన్యం నిలవచేసే నారసంచి; పైవైపునకొక్కెలుంటాయి (కో. 9-11, 24, 48, 50).

**అంచె** పర్యా. చూ. తట్ట. వెదురుబద్దలతో అల్లిన వెడల్పు బుట్ట; తూర్పారపొయ్యటానికి ఉపయోగించేది. చూ. చిత్రం 47 క. (తె. 23-25).

**అడ** సెనగ, ఉలవ, ధనియాలు, వేరుసెనగ మొ. పైర్లు కోసి పొలంలో వేసిన కుప్ప (రా. 23, 24).

**అడుగంట్లు** పాతర అడుగున ముక్కిపోయిన వడ్లు (రా. 18).

**అడుగు** పర్యా. చూ. కొయ్యకాలు. పైరు కోసిన తరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (తె. 29, 33; రా. 2-11, 26).

**అండ** (-పెట్టు) వామిగడ్డ; వామి (గడ్డికుప్ప) వేసేటప్పుడు అడుగున వేసే మొదటి మోపు (తె. 7).

**అండెం** (-కట్టు) ఎండు మిరపకాయలు పోసి కట్టిన ఈతచాప చుట్ట (తె. 23, 24, 27, 28).

**అద్ద** రూ. అర్ద. (1) పడుగుమీద ఎన్నులు లోపలికి, మొదళ్ళు బయటికి వచ్చేట్టు పేర్చిన వరి గడ్డి కట్టల వరపు; (2) పర్యా. మెట్టు?. గడ్డికుప్ప అడుగు; కోసుభాగం తీర్చని వామి. చూ. చిత్రం 49 క. 1; (3) చచ్చుగడ్డితో కళ్ళందగ్గర వేసిన కుప్ప (కో. 21, 23, 25, 32, 35; తె. 30, 39, 40).

**అంతిక** ? చోడి, కంది, పెసర మొ. మెట్టపైర్లు కోసి వేసినకుప్ప (కో. 51).

**అరగుమ్మి** చిన్నగాదె; ధాన్యం నిలవచేసుకోటానికి వెదురుబద్దలతో అల్లిన బుట్ట; చూ. గుమ్మి (తె. 1).

**అరికట్టు** (వి.) కళ్ళంలో పంటగడ్డి తొక్కించటానికి ఎడ్లను ఒకదానిపక్కన ఒకటి 'బంతి'గా కట్టే కట్టు; చూ. బంతి (తె. 19).

**అరివేనుబాన** ఉ. అరివేనబాన, అరివేనిబాన. పెండ్లిండ్లలో ఇచ్చే కుండ; ఇవి ధాన్యం నిలవ చేసుకోటానికి గూడా ఉపయోగిస్తారు (కో. 19, 23, 24).

**అర్ద** చూ. అద్ద (కో. 22).

**అలగం** ఉ. అల్గం (-వేయు) పర్యా. చూ. పడుగు. కళ్ళంలో ఎడ్లచేత తొక్కించటానికి పరచిన కంకి, గడ్డికట్టలు మొ. వి (తె. 7, 23, 24, 27-30, 34, 36).

**ఆబి** వర్షకాలంలో వేసిన వరిపంట; చూ. తాబి (తె. 13).

**ఆయి** ? ఖాళీపాతరలో ఉన్న విషవాయువు (రా. 18).

**ఇక్కిలి** ఉ. ఇక్కిరి; పర్యా. తాపస. రాగి, జొన్న మొ. పైర్లు కోసివేసినకుప్ప; చొప్పకుప్ప (రా. 18, 21).

**ఇనుకు** పర్యా. చూ. బొంతు. (1) జొన్న, సజ్జ మొ. వాటి కంకిపొట్టు; (2) కంకిపొట్టు (బొంతు) వదలని గింజలు (రా. 6, 12, 25).

**ఇల్లారు** ఇంటి పైభాగంలో ధాన్యం నిలవచేసుకోటానికి రాతితో కట్టినకొట్టు; ఒకరకం గరిసె (రా. 13, 14).

**ఇసుగోలెద్దు** పర్యా. చూ. కడెద్దు. 'బంతి' లో చివరి ఎద్దు; కుడివైపున్న ఎద్దు; 'బంతి' తిప్పే ఎద్దు (రా. 21).

**ఇసురెద్దు** (?<విసురెద్దు) పర్యా. చూ. కడెద్దు. 'బంతి' తిప్పే చివరిఎద్దు; చూ. బంతి (కో. 35).

**ఈటుబోవు** (క్రి.) పంటకోసి ఇంటికి తెచ్చిన తరవాత ఉన్న చేను స్థితినిగురించి చెప్పేటప్పుడు వాడే క్రియ; 'చేను ఈటుబోయింది' (కో. 3, 4, 7; రా. 17-26).

**ఈనుకట్టు** ఉ. ఈనకట్టు, ఈనికట్టు; పర్యా. చూ. దండెకట్టు. తూర్పార పోసేటప్పుడు మేలురాసి (ధాన్యపు రాసి) దగ్గర పడే పొట్టు, గింజలు కలిసిన భాగం; దీన్ని మళ్ళీ తూర్పార పోస్తారు; కొన్ని చోట్ల కళ్ళం ఊడ్చే కూలి మనిషికి వదులుతారు (కో. 41, 46, 48, 49).

**ఉడ్డ** కంది, ఉలవ, పెసర మొ. పైర్లు కోసివేసిన చిన్నకుప్ప (కో. 29, 32).

**ఉబక** ? గట్టిగింజ; మేలురకం గింజ (కో. 29).

**ఉబ్బాటం** పడుగుపీకిన తరవాత ధాన్యంమీద ఉన్న చెత్తను చీపురుతో తుడవటం; చూ. సప్పు (రా. 16).

**ఉబ్బు** పర్యా. చూ. బొంతు. కంకిపొట్టు వదలని (రాగి) గింజ; బొంతుగింజ (రా. 15).

**ఉలక్కులు** (బహు.) (? < ఉల్లక్కి + లు) చచ్చు

ఉ. = ఉచ్చారణభేదం(-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విశ. = విశేషణం; హిం. = హిందుస్తానీ.

గడ్డిలోని వడ్లు; మేలువడ్లకు తాలువడ్లకు నడిమిరకం (రా. 16).

**ఉనికంకి** పర్యా. చూ. గగ్గి. కళ్ళంలో గింజలు రాల్చిన కంకి; చచ్చుకంకి (రా. 14).

**ఉనికొట్టు** (క్రి.) పడుగు పీకిన తరవాత ధాన్యంమీద ఉన్న చెత్తను తీసివెయ్యటం; ? ఉని = చెత్త (రా. 14).

**ఉనిపడుగు** చచ్చుగడ్డి పడుగు; చాలా భాగం గింజలు రాలిన గడ్డితో వేసిన పడుగు (రా. 14).

**ఊదర** (-కొట్టు) పర్యా. చూ. సత్ప. ధాన్యంమీద ఉండే ఎండాకులు, చెత్త, మొ. వి; వీటిని 'పొలికట్టె' (చీపురు)తో తుడిచివేస్తారు (రా. 2, 3).

**ఎగబోయు** (క్రి.) పొల్లును వేరువెయ్యటానికి నూరిపిడి అయిన గింజలను చేటలతో ఎత్తునుంచి గాలికి పొయ్యటం; తూర్పార పట్టటం (తె. 11, 15-21, 35).

**ఎంటి** ఉ. ఎంటు, ఎంటె; రూ. ఎండు; పర్యా. తిక్క. గడ్డితో పేనిన లావుతాడు; పురిపెట్టిన గడ్డిపోచలమొత్తం; ఈ తాడుతో పాతర లోపల అంచు కట్టుకుంటూ వస్తారు; వామి (గడ్డికుప్ప) గాలికి లేవకుండా బిగించటానికి కూడా ఉపయోగించేది. చూ. చిత్రం 49 చ. 7, 8 (కో. 1, 3, 4, 8, 35; తె. 1, 32, 37, 38; రా. 1, 10, 12,-14, 18, 20, 21).

**ఎండు** చూ. ఎంటి (తె. 11, 29, 25).

**ఎదురు** (క్రి.) నూర్చిన ధాన్యంలో ఉన్న గడ్డి పరకలలను, ఎండాకులను పొలికట్టె (చీపురు)తో గాని, చేత్తోగాని తీసివెయ్యటం (తె. 35; రా. 10, 13, 18, 23-26, 28).

**ఎదురుచేట** (-వేయు) పర్యా. ఎదురేటు. గాలి అనువుగా లేనప్పుడు, ఒకడు తూర్పార పోస్తుంటే మరొకడు ఎదురుగా నిలబడి చేటతో విసిరే పద్ధతి (కో. 19, 46, 49).

**ఎదురేటు** పర్యా. చూ. ఎదురుచేట. గాలి అనువుగా లేప్పుడు, ఒకడు తూర్పార పోస్తుంటే, మరొకడు ఎదురుగా నిలబడి చేటతో విసిరే పద్ధతి (కో. 26, 28, 29, 40).

**ఎనిగుండు** (? < ఎన్ను + గుండు) పర్యా. చూ. గుండు. గింజలు రాల్చటానికి ఎడ్లకుకట్టి కళ్ళంలో పరచిన కంకులమీద లాగించే రాతిగుండు. చూ. చిత్రం 44 (రా. 5).

**ఎరుబంతి** పర్యా. చూ. కొర్రబంతి. తడిపిన కళ్ళం గట్టిపడటానికి తొక్కించే ఎడ్లవరస; చూ. బంతి (తె. 1).

**ఏగిలి** ఉ. ఏవిలి; పర్యా. చూ. కొయ్యకాలు. మెట్ట పంటలు కోసిన తరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (మోళ్ళు) (కో. 12; తె. 2-6, 9-12, 14, 15, 27, 29, 32-39, 42; రా. 9-28).

**ఒడ్డు** (-పెట్టు) వరి, పసుపు మొ. పైర్లు కోసి కట్టిన కట్టలు నాలుగైదు కలిపి నిలబెట్టిన చిన్నకుప్ప; చిన్నగూడు (రా. 4, 7).

**ఒబ్బిడి** పంటగింజలు స్వాధీనపరుచుకోటం (కో. 1).

**ఒరగారు** మిరపపంట మొదటికోత (రా. 1).

**ఓగిలి** పర్యా. చూ. కదెద్దు. 'బంతి' లో చివరిఎద్దు; బంతి తిప్పేఎద్దు; కుడివైపున ఉన్నది (కో. 43).

**ఓడ** ఉ. వాడ; పర్యా. గోలెం. ధాన్యం నిలవ చేసే పెద్ద మట్టికుండ; సుమారు $6^1$ ఎత్తు, $3^1$ మట్టం (వ్యాసం) ఉంటుంది; కొన్నిచోట్ల ఎంట్లు చుట్టగావేసి చుట్టూరా మట్టి పూసి కడతారు; ఒకరకం గరిసె. చూ. చిత్రం 50 త (రా. 5-9, 13-18, 20-22, 24, 25).

**ఓదె** ఉ. ఊదె, ఒది, ఓజ, వాది, వాదె; పర్యా. ఓపు, పన, పనన, పెంపు, మెద, సరిదె. (1) కోసినచోటనే కింద వేసే పంటగడ్డి కట్ట; (2) అటువంటి కట్టలవరస; (3) కొన్ని గడ్డికట్టలు కలిపి వేసిన కుప్ప (విరళం) (కో. 1-29, 33-36; తె. 1, 30, 39, 41; రా. 1-6, 8, 9, 11, 13, 14, 19, 20, 23-28); **-కోత** ఒక వరసలో వేసిన గడ్డికట్టలనుంచే కంకులు కొయ్యటం (రా.); **-పట్టె** చూ. -మునుము (రా.); **-మునుము** పర్యా. ఓదెపట్టె, మెదమునుము. ఇద్దరిమధ్య మరొక మనిషికి పైరు కొయ్యటానికి వదిలే చాళ్ళు (రా.).

**ఓపు** ఉ. ఒప్పు; పర్యా. చూ. ఓదె. కోసినచోటనే ఒక వరసలో వేసే పంటగడ్డి కట్ట (లు); వరిగడ్డి కుప్ప (కో. 39-51).

**కంకర** చూ. కంకెర (తె. 31).

**కంకి** (-నెరుచు, -నెరుపు) పర్యా. జుట్టు. జొన్న, సజ్జ, రాగి మొ. వాటి గింజల గుత్తి (కో. 3-6, 8-15, 18-25, 27-51; తె. 1-4, 7-21, 23, 31, 35, 36, 38, 40-42; రా. 2, 3, 12, 15-28); **-గుండు** పర్యా. చూ. గుండు. కళ్ళంలో గింజలు రాల్చటానికి ఉపయోగించే రాతిగుండు. చూ. చిత్రం 44 (తె. రా.); **-జల్ల, -డొల్ల** కంకులుపోసి తీసుకుపొయ్యే బండిజల్ల (వెదురు పేళ్ళతో అల్లింది) (రా.); **-దంతె** కళ్ళంలో కంకులు నెరిపే కొయ్యపనిముట్టు; దీనికి దిండు, పండ్లు మొ. వి ఉంటాయి. చిత్రం చూ. పుట 107 (కో. తె. రా.); **-పడుగు** కంకులు నెరిపిన కళ్ళం (రా.); **-పొనక** చూ. -జల్ల (తె. రా.); **-బొడ్డె** చిన్నకంకి (తె.); **-మండె** కంకులతో వేసిన నలచదరపు కుప్ప (కో. రా.).

**కంకెన** చూ. కంకెర (తె. 21, 24-26).

**కంకెర** రూ. కంకర, కంకెన; పర్యా. చూ. గగ్గి. కళ్ళంలో గింజలు రాల్చిన కంకి; మెదిగినకంకి (తె. 29, 31).

**కంకేళ్ళు** (బహు.) (? < కంకెర + లు) పర్యా. చూ.

గగ్గి. కళ్ళంలో గింజలు రాల్చిన కంకి; పిప్పికంకి (కో. 23, 25).

**కటానం** కంది, పెసర, మినుము. మొ. పప్పుధాన్యాలకు మొత్తంగా వాడే మాట (తె. 17, 21).

**కట్ట** (-కట్టు) పంట కోనివేసిన కొన్ని 'ఓదె' లు కలిపి కట్టే మోపు; ఉదా. కొర్రకట్ట (కో. 12, 15, 21, 22, 27, 29-32, 35, 39; తె. 1, 3-13, 15, 16, 19, 21-38, 41; రా. 4, 6, 8-15, 18-25).

**కట్టె** పర్యా. చూ. కొయ్యకాలు. పంట కోసిన తరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (రా. 21, 22, 24).

**కట్టెపొట్టు** పర్యా. కాయపొట్టు. పెసర, వేరుసెనగ మొ. కాయధాన్యాలపొట్టు (రా. 18).

**కడ** (-ఎగేయు) కళ్ళం అంచులకు చెదిరి పడ్డ గడ్డి; దీన్ని కొంకికర్రతో రోటికి (మధ్యకు) తోస్తారు: కళ్ళం చుట్టూరా ఉన్న హద్దు (తె. 29, 31, 32, 34, 36, 38).

**కడపఎద్దు** పర్యా. చూ. కడెద్దు. 'బంతి'లో చివరి ఎద్దు; బంతి తిప్పే ఎద్దు (తె. 5, 8).

**కడెద్దు** (<కడ+ఎద్దు) పర్యా. ఇనుగోలెద్దు, ఇనురెద్దు, ఓగిలి, కడపఎద్దు, తిప్పుడెద్దు, తిరగడగొమ్మెద్దు, వలపఎద్దు, వాగాలు, సురిఎద్దు. 'బంతి'లో చివరకట్టిన ఎద్దు; 'బంతి' తిప్పే ఎద్దు; చూ. బంతి (కో. 51; తె. 3, 4, 6, 7, 10, 12, 17, 29, 32, 36, 42).

**కడెం** ఉ. కదం (-దొబ్బు, -వేయు) రూ. కణెం; పర్యా. కోట. (1) కళ్ళంలో మెదిగిన గడ్డి తీసి చుట్టూరా వేసే కట్టు; (2) పర్యా. చూ. మదనం. పొట్టుతో కలిసి ఉన్న ధాన్యపురాసి (కో. 13, 15-19, 21-23; తె. 6, 23).

**కణజం** ఉ. కంజం, కనజం, కమజం; రూ. కణజనం; పర్యా. కందకం, కందనం. ధాన్యం నిలవ చేసుకోటానికి ఇంట్లో నేలలో కట్టిన కొట్టు; చూ. గరిసె (రా. 4, 6, 15, 16, 18, 20).

**కణజనం** చూ. కణజం (రా. 12).

**కణెం** ఉ. కనెం (-వేయు) చూ. కడెం (తె. 16).

**కనకట్టు** పర్యా. చూ. దండెకట్టు. తూర్పార పోసేటప్పుడు మేలురాని (మంచిగింజల రాని) పక్కన పడే పొట్టు, గింజలు కలిసిన భాగం (తె. 32, 38).

**కంత** వామిదొడ్డికి పెట్టిన దోవ లేక ద్వారం (రా. 12, 18, 21-23, 25, 28).

**కందకం** రూ. కందకం; పర్యా. చూ. కణజం. ధాన్యం నిలవచేసుకోటానికి ఇంట్లో నేలలో కట్టిన కొట్టు (రా. 19).

**కందనం** చూ. కందకం (రా. 10, 13).

**కరిజ** ఉ. గరిజ; (1) పర్యా. చూ. బొంతు, నూర్పినప్పుడు వచ్చే జొన్న, సజ్జ, మొ. వాటి కంకిపొట్టు (తె. 10): (2) పర్యా. చూ. దండెకట్టు. తూర్పార పోసేటప్పుడు మేలురాని పక్కనపడే గింజలు, పొట్టు కలిసినభాగం (తె. 14).

**కరుకు** (-వేయు) పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూవేసే గీత (తె. 10).

**కర్దం** పర్యా. చూ. కణజం. ధాన్యం నిలవచేసుకోటానికి ఇంట్లో నేలలో కట్టిన కొట్టు (రా. 11).

**కర్నకోల** ఉ. కర్నెకోల; పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో గడ్డిలాగే కర్ర; దీనికి ఒకకొన వంపు తిరిగి ఉంటుంది (తె. 23-25, 28).

**కలమాటు** (-పట్టు) ధాన్యంలో కలసిఉన్న గడ్డిపరకలు, చెత్త మొ. వి.; దీన్ని చేత్తో తీసివేస్తారు (కో. 8.).

**కలిమెడి** (? <కలం+అడి) పర్యా. చూ. చచ్చుగడ్డి. కళ్ళంలో మెదిగినగడ్డి: గింజలు రాలిన గడ్డి (రా. 1)

**కవ్వ** పర్యా. చూ. నూగు. దండెకట్టును (పొట్టు, ధాన్యం కలిసిఉన్న భాగాన్ని) తూర్పారపట్టగా వచ్చిన సన్నటినుసి; తూర్పార పోసినప్పుడు వేరుగా పడే సన్నటి పొట్టు; దీన్ని దంచి ఉడకబెట్టి గొడ్లకు వేస్తారు (కో. 45-47, 39, 50).

**కసువు** ఉ. కసవు; పర్యా. చూ. గడ్డి. కోసిన రాగి చామ మొ. మెట్టపైర్ల దంటు (రా. 4); **కసువామి** ఉ. కసవామి. గడ్డివామి; గడ్డికుప్ప (రా.).

**కళ్ళం** ఉ. కల్లం, కల్లాం, కళ్ళాం (-ఆకులు, -చెక్కు, -చేయు) పర్యా. కొటారు. పైర్లు కోసివేసిన కుప్పలు గొడ్లచే తొక్కించి గింజలు రాల్చటానికి (నురిపిడికి) ఏర్పరచిన చోట్లు; పొలంలోగాని, ఊరిబయటగాని వలయాకారంగా కొంతమేర చదునుచేసి, గొడ్లచే తొక్కించి, అలికి సిద్ధం చేస్తారు (కో. 1, 51; తె. 1-42; రా. 1-3, 7-28).

**కాకిగూడు** ఉ. కాగ్గూడు. జొన్న, సజ్జ మొ. మెట్టపైర్లు కోసివేసిన కట్టలు నాలుగైదు కలిపి నిలబెట్టి గుడిసె లాగా వేసిన కుప్ప. చూ. చిత్రం 43 ట. (రా. 6, 14, 19).

**కాగు** ఉ. కావు. ధాన్యం నిలవచేసుకొనే పెద్ద బాన; సుమారు ఏదుం గింజలవరకు పట్టేది (కో. 3; తె. 13, 17, 22, 34-38; రా. 6, 26).

**కాయతప్ప** పర్యా. చూ. కాయతాలు. కొంచెం పలుకున్న గింజ; చూ. తప్ప (తె. 26, 27).

**కాయతాలు** పర్యా. కాయతప్ప, తరక. (1) కొంచెం పలుకున్న ధాన్యపు గింజ; తాలుగింజకు, మేలుగింజకు నడిమిరకం; (2) అక్కడక్కడ మంచిగింజతో కలిసి ఉన్న తాలు; చూ. తాలు (కో. 2, 3, 25; తె. 22-25; రా. 28).

**కాయపొట్టు** పర్యా. కట్టెపొట్టు. పెసర, వేరుసెనగ మొ. కాయధాన్యాల పొట్టు (రా. 12).

**కాలిగూడు** కొర్ర, జొన్న, మొ. పైర్లు కోసి కట్టిన కట్టలు కొన్ని నిలబెట్టి గుడిసెలాగా వేసిన కుప్ప; చిన్నగూడు; చూ. గూడు (రా. 17, 18).

**కాలిపడుగు** ఒక బంతి ఎడ్లతో తొక్కించే పలచటి పడుగు; చూ. పడుగు (రా. 14).

**కాలు** పర్యా. చూ. కొయ్యకాలు. పంట కోసిన తరవాత పొలంలో మిగిలేవేళ్ళతో ఉన్న మోడు (కో. 12, 13, 39, 43; తె. 2, 3, 8, 10, 12, 29–33, 35, 36, 39; రా. 3, 6, 8, 12, 16–18, 20 22, 24).

**కిగ్గడ** పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (మంచిగింజలరాసి) పక్కన పడే పొట్టు, గింజలు కలిసిన కుప్ప (తె. 37).

**కింక** రూ. చింక; పర్యా. చూ. బొంతు. కంకి పొట్టు వదలని గింజలు; అక్కడక్కడ గింజలతో ఉన్న బొంతు (రా. 27).

**కీకట** (-కొట్టు)? పర్యా. చూ. సళ్ళు. పడుగు పీకిన తరవాత ధాన్యం మీద ఉండేగడ్డి పరకలు, చెత్త, పొల్లు మొ. వి (రా. 27); **-కుప్ప** పొల్లుతో గూడా పోగుచేసిన రాసి (రా.).

**కీగర** (<కీ+కర్ర) (-కొట్టు) పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో గడ్డిలాగే కర్ర; దీని ఒక కొస వంపు తిరిగి ఉంటుంది (కో. 11).

**కీడిసె(కట్టు)** చూ. కీలిసె (కో. 10, 15, 1).

**కీలిసె** ఉ. కీల్చి, కీల్చె; రూ. కేడిసె, చీలిసె; పర్యా. చూ. దండెకట్టు. తూర్పార పోసేటప్పుడు మేలురాసి (మంచి గింజలరాసి) పక్కన పడే పొట్టు, గింజలు కలిసిన భాగం (కో. 17, 20–23).

**కుచ్చు** (-పొడుచు) చూ. కుచ్చెల (కో. 22, 23).

**కుచ్చెల** ఉ. కుచ్చిలి, కుచ్చెలు (బహు. కుచ్చెండ్లు, కుచ్చెళ్ళు) (కట్టు, పెట్టు, పొడుచు) రూ. కుచ్చు; పర్యా. జూడు, జూడెం. (1) కళ్ళందగ్గర ఎన్నులు పైకి వచ్చేట్టు వేసిన పంటగడ్డికుప్ప; చిన్నగూడు; (2) పెద్దకుప్పవేసే ముందు, మొదట ఆధారంగా నాలుగైదు మోపులు నిలబెట్టి వేసిన చిన్నకుప్ప; (3) ఎన్నులు పైకి వచ్చేట్టు కళ్ళంలో పేర్చిన గడ్డికట్టలు (కో. 6, 14, 18, 21, 25, 31, 32, 35, 36, 38, 39, 43–45; తె. 18, 19, 22–24, 26–28, 31, 40, 41); **-కట్ట** పర్యా. జుట్టుకట్ట. గూడు (పెద్దగడ్డికుప్ప) వేసేటప్పుడు పైకొసన పెట్టే గడ్డికట్ట (కో. తె.); **-కోత** ముందు కుచ్చెల (కుప్ప) వేసి, తరవాత కంకులు కొయ్యటం (కో.).

**కుడుములదబ్బ** వామిపైన దిష్టికుండగాని, మనిగుడ్డ గాని తగిలేచ్చే కొయ్య. చూ. చిత్రం 49 క. 5 (రా. 18).

**కుండ** సుమారు నాలుగుబస్తాల వరకు ధాన్యం నిలవ చేసుకొనే బాన (కో. 32, 37, 46; తె. 1, 6, 8, 12, 24, 36).

**కుదప** ఉ. కుదెప; రూ. గుతప; పర్యా. నడ్డిబడె, బడితె. పెసర, కంది, అనుము మొ. వాటి కుప్పలు కొట్టి గింజలురాల్చటానికి ఉపయోగించే దుడ్డుకర్ర (కో. 27; తె. 41).

**కునుగు** రూ. గుని; పర్యా. చూ. నూగు. జొన్న కళ్ళంలో ధాన్యంతో కలిసిఉన్న సన్నటిపొట్టు; నుసి (రా. 13, 18).

**కుందం** పర్యా. చూ. గూడు. గుండ్రంగా వేసిన గడ్డి కుప్ప (కో. 37).

**కుప్ప** (-కొట్టు, -పెట్టు, -వేయు) రూ. కువ. కోసిన గడ్డి, నూర్చిన ధాన్యం మొ. వాటి రాసి; కొన్ని ఓదెలు కలిపి వేసిన పంటగడ్డి గూడు (కో. 2, 4, 6–8, 14, 16, 17, 19–21, 23, 26–29, 31, 34, 36, 45, 48; తె. 4–10, 13–17, 19–33, 36, 37, 41; రా. 2, 6, 9, 11, 13, 17, 18, 22, 38); **తొక్కుళ్ళు** రూ. కువ తొక్కుళ్ళు. చచ్చుగడ్డిలోని గింజలు (రా.).

**కువ** చూ. కుప్ప (రా. 8, 9, 11); **-తొక్కుళ్ళు** చూ. కుప్పతొక్కుళ్ళు (రా.).

**కుసం** పర్యా. చూ. నూగు. తూర్పార పట్టేటప్పుడు దువ్వపారుగా పోయే రాగి (ధాన్యం) పొట్టు; సన్నటినుసి (కో. 9, 14).

**కూగు** ఉ. కూగ; పర్యా. చూ. నూగు, బొంతు. (1) సజ్జ, రాగి మొ. వాటి గింజల నంటుకొని ఉండే సన్నటినుసి; తూర్పార పోసినప్పుడు ఇది వేరుగా పడుతుంది; (2) కంకి పొట్టు; బొంతు (తె. 9; రా. 5, 10, 12, 15–18).

**కూటు** చూ. గూడు (2) (కో. 1–6).

**కైలుగడ్డి** ఉ. కైలగడ్డి; పర్యా. మనిగర్ర. కళ్ళంలో సరిగ్గా నలగని గడ్డి; కొద్దిపాటి గింజలున్న గడ్డి (కో. 19–22).

**కైలుచేయు** (క్రి.) భూస్వామికి పంటగింజలు ఒప్ప చెప్పటం (కో. 19–21, 24, 25).

**కొంకి(కర్ర)** ఉ. కొంకర్ర; పర్యా. కర్నకోల, కీగర, కొంటికర్ర, కోలకట్టె, చిల్లకట్టె, చిల్లకర్ర, నెరగోలకట్టె, మెలగాంకర్ర, వంకె. కళ్ళంలో గడ్డి లాగటానికి వీలుగా ఒక కొస వంపుతిరిగి ఉన్న కర్ర (కో. 15, 19–23, 33, 36; తె. 34, 39).

**కొటారు** (1) పర్యా. చూ. కళ్ళం. కుప్పలు నూర్చే చోటు; దీన్ని పారతో చెక్కి, దిమ్మిసచేసి, అలికి శుభ్రం చేస్తారు (రా. 4–6); (2) పర్యా. చూ. కొట్టు. ధాన్యం,

పొట్టు, గడ్డి మొ. వి నిలవచేసుకోటానికి ఇంట్లో గచ్చుతో గాని, మట్టితోగాని కట్టిన గది; (కొన్నిచోట్ల) ధాన్యం నిలవ చేసుకొనే పెద్దబాన (తె. 17-23, 27, 29, 32, 35).

**కొట్టు** పర్యా. కొటారు. ధాన్యం, పొట్టు, కంకులు మొ. వి దాచటానికి ఇంట్లో కట్టిన చిన్నగది (కో. 1, 2, 4, 17, 19-23, 26-28, 35-37, 40, 44, 46-51; తె. 39, 42).

**కొట్టు(డు)బల్ల** వరికట్టలు కొట్టే కొయ్యమొద్దు; ముందు కట్టలు కొట్టి గింజలు రాలుస్తారు (కో. 21, 26, 28, 36, 37; తె. 41).

**కొట్టుడుకళ్ళం** ఉ. కొట్టుడుగళ్ళాం. వరిగడ్డి తొక్కించే ముందు కట్టలు బల్లకేసి కొట్టి గింజలు రాల్చటానికి ఏర్పరిచిన చోటు; చూ. పిడ్డేటు (కో. 21, 22).

**కొట్టుడురాసి** పిడ్డేటుతో రాల్చిన గింజల (వడ్ల) కుప్ప (కో. 17, 21).

**కొట్టె** ధాన్యం నిలవ చేసుకొనే పెద్దబాన; సుమారు రెండుబస్తాలదాకా పడుతుంది; చూ. ఓడ (తె. 1, 7, 27, 36; రా. 1).

**కొంటికర్ర** పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో వట్టి గడ్డిలాగే కర్ర; దీని అడుగుకొస వంపుతిరిగి ఉంటుంది (కో. 50).

**కొంటు** పొల్లును తూర్పారపట్టగా వచ్చిన సన్నపొట్టు; పేడతో కలిపి పిడకలు చెయ్యటానికి ఉపయోగిస్తారు (కో. 46-50).

**కొప్పి** ? గుండ్రంగా వేసిన గడ్డివామి (కో. 40).

**కొప్పెర** తూర్పారపోసే మనిషి నెత్తిన పొట్టు, దువ్వ పడకుండా వేసుకొనే గోనెగూడ; కొన్ని చోట్ల గూడలాగా మడతవేసిన కంబళి. చూ. చిత్రం 46 (రా. 12, 25, 28).

**కొయ్య** పర్యా. చూ. కొయ్యకాలు. పంట కోసినతరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (కో. 10, 11, 39, 43, 45; తె. 3, 5, 7, 17, 18, 20, 29; రా. 13-15, 19, 20, 24, 26, 27).

**కొయ్యకాలు** ఉ. కొయకాలు, కొయగాలు, కొయ్యగాలు; పర్యా. అడుగు, ఏగిలి, కట్టె, కాలు, కొయ్య, దుంప, మొద్దు, మొరనేడు, మోడు, మోడెం. పంట కోసినతరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (మోళ్ళు) (కో. 3, 6-10, 16, 21, 23, 25; తె. 2, 6-8, 11, 12, 14, 21-23, 32, 34-38, 42; రా. 9, 16-19, 21, 25, 28).

**కొర్రబంతి** ఉ. కోరబంతి, గొర్రుబంతి (-చేయు, -తోలు) పర్యా. ఎరుబంతి, పొడిబంతి, మూగబంతి. కళ్ళం తవిపి గట్టిపడేట్టు తొక్కించటానికి కట్టిన బంతి లేక ఎడ్ల వరస (తె. 18, 19, 31, 32).

**కొల్లాం** పెసరపొట్టు మొ. వి పోసుకొనే పెద్ద గంప (కో. 37, 40).

**కోట** (-కట్టు, -వేయు) పర్యా. చూ. కదెం. కళ్ళం చుట్టూ నలిగిన (మెదిగిన) గడ్డితో వేసే కట్ట (తె. 32, 39, 42).

**కోఠా** ఉ. కోటా; పర్యా. చూ. కొట్టు. ధాన్యం, పొట్టు మొ. వి నిలవచేసుకోటానికి ఇంట్లో గచ్చుతోగాని, మట్టితోగాని కట్టిన చిన్నగది (తె. 27, 31).

**కోత(లు)** పండిన పైరు కొడవళ్ళతో కొయ్యటం; పంట ఒడుపు (కో. 1-51; తె. 1-42; రా. 1-28).

**కోయు** (క్రి.) (వాడుక: కొయ్యటం, కొయ్యడం, కోసుటం, కోసుడు) వరి, జొన్న, నువ్వు, ఉలవ, గోధుమ, గంటి, చామ, చోడి మొ. పంటల గడ్డిని కొడవళ్ళతో తెంచటం (కో. 1-51; తె. 1, 4, 5, 7, 8, 10-16, 19-28, 30-42; రా. 3, 4, 7, 9, 10, 12-28).

**కోలకట్టె** పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో గడ్డి లాగే కర్ర; దీనికి ఒకవైపు వంపుతిరిగి ఉంటుంది (తె. 26).

**కోసు** పర్యా. చూ. చచ్చుగడ్డి. కళ్ళంలో మెదిగిన గడ్డి; గింజలు రాలిన గడ్డి (రా. 4).

**గగ్గి** (-తీయు, -పీకు) పర్యా. అంకెన, ఉనికంకి, కంకర, కంకెన, కంకెర, కంకేళ్ళు, చచ్చుకంకి, పిప్పి, పిప్పికంకి, పీరు. కళ్ళంలో గింజలురాలిన కంకి; చచ్చు కంకి (కో. 3-10, 13, 17, 18; తె. 1, 4, 8, 36, 39-42; రా. 5, 6, 9, 10, 12, 18, 20-28); **-గింజ** పర్యా. పిప్పిగింజ. గగ్గులనుంచి రాలిన తాలుగింజ (తె.); **-తొక్కుళ్ళు** గగ్గులను తొక్కించగా రాలిన గింజలు (తె.); **-దంతె** గగ్గులను లాగే కొయ్యపనిముట్టు; కంకిదంతె (రా.); **-పడుగు** కళ్ళంలో ఒకసారి తొక్కించిన కంకులను తిరగ తొక్కించటానికి పరవటం (తె.); **-రాసి** పర్యా. పిప్పి రాసి. గగ్గులకుప్ప; గగ్గులలోరాలిన గింజలకుప్ప (కో. తె.).

**గడంచె** ఉ. గడంచి, గడంచు, గడెంచ. (1) ధాన్యపు బస్తాలు ఇంట్లో వెయ్యటానికి నిలబెట్టిన బల్ల; గడమంచె. చూ. చిత్రం 51 (కో. 22; తె. 5, 18; రా. 18, 19, 24); (2) పర్యా. మెట్టు.[1] తూర్పారపోసే మనిషి నిలబడటానికి అమర్చిన ఎత్తుపీట. చూ. చిత్రం 45 క (తె. 16, 20).

**గడ్డ** (-పెట్టు) పర్యా. చూ. వామి. గింజలు రాల్చిన వట్టిగడ్డి (ముఖ్యంగా జొన్నగడ్డి)తో వేసిన పెద్దకుప్ప; చొప్పకుప్ప (తె. 18-27).

**గడ్డి** (-జులుపు, తీయు, -పీకు) పర్యా. కట్టె, కసువు, చొప్ప. కోసిన పైరు; గింజలు రాల్చగామిగిలిన దంటు

మొ. వి; వరిగడ్డి, జొన్నగడ్డి ఇత్యాది వ్యవహారం (కో. 2, 3, 7, 8, 17, 19-22, 27, 35, 36, 39-41, 45-51; తె. 1, 3-12, 14, 20, 24-27, 31-39; రా. 4-7, 9, 13, 16-19, 24-27); -పడుగు (-వేయు) తొక్కించటానికి కళ్ళంలో పరచిన గడ్డి (తె.); -పంజ వరిగడ్డి కట్ట; -వామి ఉ. గడ్డిఆము, గడ్డివాం, గడ్డివాము, గడ్డేమి, గడ్డోమి; పర్యా. చూ. వామి. గింజలు రాల్చిన గడ్డితో వేసిన పెద్దకుప్ప; చొప్పకుప్ప (కో. తె. రా.).

**గబ్బిడికట్ట** ఉ. గబ్బిలికట్ట. గుప్పెడు గడ్డికట్ట; వరి; రాగి మొ. పైర్లు కోసేటప్పుడు ఒక చేతికి సరిపడేట్టు పట్టు కొన్న గడ్డి (కో. 6, 8).

**గంప** కంకి, పొట్టు, ధాన్యం మొ. వి పోసుకొని నెత్తిన పెట్టుకుపోవటానికి ఉపయోగించే వెదురుపేళ్ళ బుట్ట; మూతి అడుగుకంటె విశాలంగా ఉంటుంది (కో. 11, 17, 20-22; తె. 1, 5, 9, 11, 13, 21, 33; రా. 2).

**గరగడం** (-పోయు) ధాన్యరాశిచుట్టూ గీచిన గీతమీద పోసే పేడనీళ్ళు; కుప్పలో, గింజలు ఎవరన్నా దొంగిలిస్తే తెలుసుకోటానికి ఇలా చేస్తారు (కో. 17, 19-23).

**గరిసె(శ)** ఉ. గరెస, గరెసె, గర్సి, గర్సె, గిరిసె, గెరిసె, గెర్సు. (1) ధాన్యం, పొట్టు మొ. వి నిలవచేసుకొనే పెద్దబుట్ట; అడుగులేకుండా అల్లిన వెదురుపేళ్ళ గాదె; దీన్ని నేలమీద పెట్టి, ధాన్యం మొ. వి పోస్తారు. చూ. చిత్రం 50 చ; (2) నేలలో గచ్చుతోకట్టిన కొట్టు; (3) ధాన్యం పోసుకొనే పెద్ద బాన; (4) ఇంట్లో ఒకమూల చెక్కకూర్పుతో ఏర్పరిచిన గది (కో. 2-4, 6, 7, 9, 13, 14, 16, 23, 24, 26, 28, 30-32, 35, 36, 39, 41, 43, 45; తె. 3, 7-9, 11, 13, 14, 19-27, 31, 33-38, 40-42; రా. 1, 3-5, 7-9, 11, 16-18, 20-22, 24-26, 28).

**గల్ల**[1] తూర్పారపోసిన ధాన్యంలో అక్కడక్కడ పడి ఉన్న ఆకుపొట్టు (కో. 15).

**గల్ల**[2] (<హిం. గల్లా=పంటధాన్యం) పర్యా. చూ. మేలురాసి. తూర్పారపట్టిన తరవాత పోసిన మంచిగింజల కుప్ప (తె. 5).

**గవ్వ** పర్యా. చూ. గులక. పత్తితీసిన వట్టికాయ లేక గుల్ల (రా. 21).

**గాజె** ఉ. గాజ, గాజి; చూ. గాదె (తె. 4, 6, 12, 32, 38; రా. 10, 11, 15-21, 24-26, 28).

**గాడికళ్ళం** ఉ. గాటికళ్ళం; పర్యా. గూడుకళ్ళం. (జొన్న, సజ్జ మొ. పైర్లు కోసి) కుప్పవేసినచోటనే కంకులు కొయ్యటానికి బాగుచేసిన చోటు; కంకులు కోసేచోటు (రా. 12, 21).

**గాదె** ఉ. గాది; చూ. గాజె; పర్యా. గుమ్మి. (1) ధాన్యం నిలవచేసుకోటానికి వెదురుపేళ్ళతో అల్లించిన గుండ్రటి బుట్ట; సుమారు 6' పొడవు 3' వ్యాసం ఉంటుంది; సందులు లేకుండా పూతపూసి ఎండనిస్తారు; (2) కొన్ని చోట్ల ఇంట్లోనే ఒక మూల చెక్కకూర్పుతోగాని, తడికెలతోగాని, ఏర్పరిచిన అర లేక గది (కో. 1, 7-9, 11-15, 18, 19, 22, 24, 27, 33, 37, 40-42, 45-51; తె. 1, 10, 15-19, 21, 26, 29, 37, 41; రా. 2-4, 6, 12-14).

**గాబారు** చూ. గాబు (1) (కో. 23).

**గాబు** (1) రూ. గాబారు; పర్యా. చూ. సబ్బు. పడుగు తీసినతరవాత 'పొలికట్టె'తో తుడిచే గడ్డిపరకలు, చెత్త (రా. 18); (2)? పర్యా. చూ. నూగు. జొన్నలరాసి తూర్పారపట్టగా వచ్చిన సన్నటిపొట్టు (తె. 11); (3) ధాన్యం నిలవచేసుకొనే పెద్దబాన (తె. 33).

**గారపోత** పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసే టప్పుడు మేలురాసి (మంచిగింజలకుప్ప) పక్కనపడే పొట్టు, గింజలు కలిసినభాగం; తాలుగింజలు (కో. 47, 49-51).

**గాలిగూడు** కంకులు పైవైపుకు వచ్చేట్టు కొన్ని కట్టలు కలిపివేసిన (జొన్న) గడ్డికుప్ప (తె. 38).

**గాలిపోత** (-పోయు) పర్యా. చూ. తూర్పార. ధాన్యం నుంచి పొల్లును వేరుచెయ్యటానికి కళ్ళంలో నూర్చిన గింజలను చేటలతో ఎత్తునుంచి గాలికి పోసేపద్ధతి (కో. 39-43, 45-49).

**గాలిమండె** కోసిన పొగాకును తోరణాలుగాగుచ్చి ఆరటానికివేసే కుప్ప; చూ. మండె (కో. 15).

**గాలిమేడెం** కంకులు పైకివచ్చేట్టు కోసుగాపేర్చిన జొన్నగడ్డి కుప్ప (కో. 9).

**గిరతట్ట** వెదురుపేళ్ళతో అల్లిన చిన్నబుట్ట; ధాన్యం పోసుకోనేది (తె. 32).

**గీటుకంప** చూ. గ్రీటుకంప (కో. 44).

**గ్రీటుకంప** రూ. గీటుకంప; పర్యా. చూ. పొలికట్టె. కళ్ళం ఊడ్చటానికి కందిమండలతో కట్టిన చీపురు (కో. 47, 48).

**గుండు** (-తిప్పు, -తోలు, -వేయు) పర్యా. ఎని గుండు, కంకిగుండు. గింజలు రాల్చటానికి పడుగుమీద తోలించే రాతిగుండు లేక 'రోలరు'. చూ. చిత్రం 44 (కో. 5, 8, 10, 11, 13, 32, 35; తె. 3, 29; రా. 5, 7-10, 18, 21, 23-28).

**గుండుకుప్ప** గుండ్రంగా వేసిన గడ్డికుప్ప; చూ. గూడు (రా. 17, 18).

**గుండురాసి** రూ. గుండ్రరాసి; పర్యా. చూ. మేలు రాసి. తూర్పారపట్టి గుండ్రంగాపోసిన మేలుగింజలకుప్ప

(కో. 7-11, 16; తె. 17, 20, 22, 25, 30, 40, 41).

**గుండ్రరాసి** చూ. గుండురాసి (కో. 13, 50; తె. 21).

**గుతప** ఉ. గుత్ప (-కొట్టు) చూ. కుదప (తె. 20, 24, 27, 28).

**గుని** చూ. కునుగు (రా. 18).

**గుబ్బ**[1] పర్యా. చూ. బొంతు. జొన్న, సజ్జ మొ. వాటి కంకిపొట్టు; (కొన్నిచోట్ల) పొట్టుతో కలిసిఉండే సన్నటి నుసి (రా. 3-5).

**గుబ్బ**[2] చూ. గుమ్మి (తె. 8).

**గుమ్మి** ఉ. గుమ్మి, గుమ్మె; రూ. గుబ్బ[1]; పర్యా. చూ. గాదె. ధాన్యం నిలవచేసుకోటానికి వెదురుబద్దలతో గాని, ఈతపేళ్ళతోగాని అల్లిన పెద్దగంప. చూ. చిత్రం 50 క (కో. 19, 24, 25, 30; తె. 1, 3-7, 9-12, 14-17, 19-27, 29-40, 42; రా. 17, 22).

**గుమ్మెత** ధాన్యం నిలవచేసుకొనే పెద్ద బాన (రా. 4).

**గులక** ఉ. గునక; పర్యా. గవ్వ, బుడ్డి, పత్తి తియ్యగా మిగిలిన వట్టికాయ లేక గుల్ల (రా. 23-26).

**గుల్ల**[1] పర్యా. చూ. తట్ట. తూర్పారపొయ్యటానికి ఉపయోగించే తట్ట; వెదురుబద్దలతో అల్లింది. చూ. చిత్రం 47 క (తె. 10, 18-21, 24, 32).

**గుల్ల**[2] పర్యా. చూ. పొల్లు. తూర్పారపట్టినప్పుడు దూరంగా పడే గడ్డినుసి, పొట్టు మొ. వి (కో. 6, 15, 21; తె. 32); **-పొట్టు** కంకిపొట్టు నుసి; తేలికపొట్టు (కో.).

**గూడ** పర్యా. మంకెనగంప. పొట్టు, కంకులు మొ. వి మోసుకు పోవటానికి ఉపయోగించే గంప (రా. 25).

**గూడు** (1) (-దించు, -పెట్టు, -వేయు) పర్యా. కుందం, బడిపె. అడుగున స్తూపకారంగాను, పైన కోసుగాను ఉండేట్టు పేర్చిన పెద్దగడ్డి కుప్ప; జొన్న, కొర్ర, సజ్జ మొ. పైర్లు కోసి ఒక చోట ఇలా కుప్ప వేస్తారు (కో. 7-15, 18, 22-25, 32; తె. 1, 3, 8, 12, 20-28, 31, 32, 34-36, 38, 39, 42; రా. 4-10, 12, 14, 15, 17-28); **-కళ్ళం** పర్యా. గాడికళ్ళం. కుప్ప (గూడు) దగ్గరనే కంకులు కొయ్యటానికి బాగుచేసిన చోటు (రా.); (2) రూ. కూటు; పర్యా. చూ. పురి. చుట్టూరా ఎంట్లు (గడ్డితాళ్ళు) పెట్టి, లోపల చాపలు వేసి, ధాన్యం, పొట్టు మొ. వి నిలవ చేసుకొనే చోటు (కో. 2, 6, 9, 13-15, 17-21, 23-25; తె. 40, 41).

**గూనపొట్టె** ?ధాన్యం నిలవచేసుకొనే పెద్ద బాన (తె. 35).

**గొండ** పర్యా. చూ. బొంతు. కంకిపొట్టు వదలని గింజలు; జొన్న, సజ్జ మొ. వాటి బొంతు (తె. 11, 14).

**గోతం** ఉ. గోతాం; పర్యా. గోనె, బస్తా, వళాసం, సంచి. సుమారు నూరు సేర్లదాకా ధాన్యం మొ. వి పట్టే నారసంచి (కో. 1, 3-8, 13, 15-17, 24, 32, 36, 41; తె. 25, 26, 40, 41; రా. 1, 7).

**గోదె** ధాన్యం నిలవచేసుకొనే చిన్నకాగు (తె. 39).

**గోనె(సంచి)** ఉ. గోని; పర్యా. చూ. గోతం. (1) సుమారు నూరుసేర్లదాకా ధాన్యం మొ. వి పట్టే నారసంచి; (2) బండికి సరిపడే ఒంత పెద్ద గోతం; చూ. బోరెం; (3) గాడిదమీద రెండు వైపులా బరువువచ్చేట్టు వేసిన సంచి (కో. 16-19, 21-23, 38, 44; తె. 3; రా. 2, 7).

**గోర** ధాన్యం కుప్పచేసే పనిముట్టు; చిత్రం. చూ. పుట 84 (రా. 16, 17).

**గోలెం** పర్యా. ఓడ. ధాన్యం నిలవచేసుకొనే పెద్ద బాన, లేక మట్టికాగు. చూ. చిత్రం 50 త (తె. 4, 6-11, 14, 15, 17, 18, 20, 22-24, 28, 34).

**చచ్చుకంకి** పర్యా. చూ. కంకెర. కళ్ళంలో గింజలు రాలినకంకి (కో. 21; రా. 16).

**చచ్చుకట్టె** పర్యా. చూ. చచ్చుగడ్డి. కళ్ళంలో మెదిగిన గడ్డి; గింజలురాలిన గడ్డి (రా. 18, 21).

**చచ్చుగడ్డి** పర్యా. కలిమెడి, కోసు, చచ్చుకట్టె, చిక్కుడుగడ్డి, తెండి, తేలడి, పిప్పికట్టె, పిప్పిగడ్డి, మోటు కసువు, మోటుగడ్డి, మోటుచొప్ప, సేగిగడ్డి. కళ్ళంలో మెదిగిన గడ్డి; గింజలురాలిన గడ్డి (కో. 21; తె. 4; రా. 9, 18, 24-26).

**చచ్చుపడుగు** (-తిప్పు) ఒకబంతి ఎడ్లతో గింజలు రాల్చిన తరవాత రెండోసారి తొక్కించే పడుగు; చచ్చుగడ్డితో వేసిన పడుగు (రా. 17, 18, 20, 22, 27).

**చట్టు** పర్యా. చూ. నూగు. జొన్నరాసి తూర్పార పట్టగా వచ్చిన సన్నటి పొట్టు (రా. 21).

**చిక్కు** (క్రి.) పర్యా. డెక్కు. చోడి, కొర్ర, గంటి, జొన్న మొ. వాటి ఎన్నులు కొయ్యటం (కో. 37, 40, 41, 44-48).

**చిక్కుడుగడ్డి** పర్యా. చూ. చచ్చుగడ్డి. కళ్ళంలో మెదిగిన గడ్డి; గింజలురాలిన గడ్డి (తె. 37).

**చింక** ఉ. సింక; చూ. కింక (కో. 10).

**చిల్లకట్టె** పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో గడ్డి లాగే కర్ర; ఒకకొన వంపుతిరిగి ఉంటుంది (తె. 32, 38).

**చిల్లకర్ర** పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో గడ్డి లాగే కర్ర; ఒకకొన వంపుతిరిగి ఉంటుంది (కో. 24, 25, 29; తె. 40).

**చీపురుకట్ట** పర్యా. చూ. పొలికట్టె. కళ్ళంలో ఊడ్చటానికి ఉపయోగించే కందిమండల చీపురు (తె. 8, 11, 12).

**చీలకట్టు** (1) పర్యా. చూ. దండగట్ట. కళ్ళంచుట్టూ ఎన్నులు బయటికి పోకుండా వేసే చొప్పకట్టల హద్దు (తె. 5); (2) వామి 'మొగవాయి'లో నిలువుగాను, అడ్డంగాను అమర్చే గడ్డికట్ట(లు) (తె. 3, 4, 7, 11, 32, 37, 39; రా. 10, 12, 18, 20-25, 28).

**చీలిసె** ఉ. చీల్పె (-కొట్టు) చూ. కీలిసె (కో. 19).

**చుట్టుకళ్ళం** ఉ. చుట్టుకళ్ళాం. కోసివేసిన పంటగడ్డి కుప్పచుట్టూ చేసే కళ్ళం; చూ. కళ్ళం (కో. 22, తె. 28).

**చుట్టుమండె** పర్యా. బిళ్ళమండె. గుండ్రంగా వేసిన పొగాకు తోరణాల కుప్ప; గుండ్రంగా వేసిన గడ్డికుప్ప (కో. 18; రా. 27).

**చుట్టుమేటు** గుండ్రంగా వేసిన గడ్డివామి; చూ. మేటు (కో. 37).

**చెలుకు** (క్రి.) పొగాకు ఒలవటం (తె. 32).

**చేటగొట్టు** (క్రి.) కళ్ళంలో నువ్వులు, పెసలు, మినుములు మొ.వి చేటలతో విసిరి పొల్లు వేరుచెయ్యటం (తె. 15, 18-20, 22, 24).

**చేదంతె** పరా. చూ. దంతె. కళ్ళంలో కంకులు, గగ్గులు లాగే కొయ్య పనిముట్టు; దీనికి దిండు, కొయ్య పండ్లు ఉంటాయి; చిత్రం. చూ. పుట 107 (తె. 36, 37, 39, 42,)

**చొప్ప** పర్యా. చూ. గడ్డి. (1) కోసిన జొన్న, మొక్కజొన్న మొ. పైర్లగడ్డి; (2) కళ్ళంలో తొక్కించిన తరవాత పశువులమేతకు నిలవచేసిన గడ్డి (కో. 13, 24, 25, 41, 46, 47; తె. 1, 4-12, 14, 16, 19-27, 29, 32-35, 37-39, 42; రా. 5, 6, 9, 10, 12, 14-20, 23-25, 27, 28); **-కుప్ప** గడ్డికుప్ప (కో. తె.); **-గడ్డ** చూ. కుప్ప (తె.); **-మెద, -వర్రె** చూ. -కుప్ప (రా.); **-వామి** ఉ. చొప్పోమి; చూ. కుప్ప (తె. రా.).

**చౌకం** నలచదరంగా వేసే వామి అడుగున మొదట పరచిన గడ్డికట్టలు; వామిగడ్డ (తె. 36).

**జటిక** కంకిలో గింజలున్న రెమ్మ; రెళ్ళ (రా. 16).

**జడ్డు** (-కొట్టు) పర్యా. చూ. సళ్ళు. పడుగుతీసిన తరవాత కళ్ళంలో ధాన్యంమీద ఉండే చెత్తా, చెదారం; దీన్ని పొరకతో తుడిచివేస్తారు (రా. 21).

**జల్ల** గట్టి వెదురుబద్దలతో అల్లిన పెద్దగంప: పొట్టు, కంకులు పోసి మోసుకుపోవటానికి ఉపయోగించేది; కొన్ని చోట్ల ధాన్యం నిలవచేసుకొనే పెద్దగంప (కో. 32; తె. 13, 31, 41; రా. 8, 18, 25).

**జళ్ళు** ఉ. జల్లి, జల్లు, జెల్ల, జొల్లు, జొళ్ళు(-కొట్టు); రూ. సళ్ళు; పర్యా. చూ. తాలు. పలుకులేని గింజ; గింజ పట్టని పొట్టు; చప్పటి తేలిక గింజ; నూర్చిన ధాన్యంతో కలిసిఉన్న చెత్త, గడ్డిపరకలు మొ.వి (రా. 2, 4, 5, 7, 8, 13, 14, 16, 17).

**జాడీ** ధాన్యం నిలవచేసుకొనే పెద్ద బాన (కో. 38, 39, 41, 42, 44, 46).

**జీడెం** పర్యా. చూ. మేడెం. కోసుగాపేర్చిన పంటగడ్డి కుప్ప; చిన్నగూడు. చూ. చిత్రం 43 త (తె. 35).

**జుట్టు** (-ఏరు, కోయు) పర్యా. చూ. కంకి. గింజలున్న పైరు పైభాగం; కంకి (తె. 29, 33, 38).

**జుట్టుకట్టు** పర్యా. కుచ్చెలకట్ట. 'గూడు' వేసినతరవాత పైకొనన పెట్టేకట్ట (కో. 21, 22).

**జుల్లడ** పర్యా. చూ. సళ్ళు. తూర్పారపొయ్యకముందు ధాన్యంతో కలిసిఉన్న పొల్లు, పొట్టు మొ.వి (రా. 15).

**జూడు** ఉ. జుడు, జూద; చూ. జూడెం (తె. 13, 16).

**జూడెం** (-పొడుచు) రూ. జూడు; పర్యా. కుచ్చెల. కంకులు పైకివచ్చేట్టు పేర్చిన మొక్కజొన్న గడ్డికుప్ప. చూ. చిత్రం 43 క (తె. 15).

**టెకి** పర్యా. చూ. మెట్టు[1]. తూర్పారపోసే మనిషి నిలబడటానికి కట్టే మూడుకాళ్ళ పీట. చూ. చిత్రం 45 క (తె. 8).

**డాకురు** పర్యా. ఇక్కిలి. జొన్నపైరు కోసివేసిన కుప్ప (తె. 21).

**డాకోడెద్దు** ఉ. డాగోడెద్దు (<డాకోటి+ఎద్దు) పర్యా. చూ. మేటెద్దు. 'బంతి'లో మొదటిఎద్దు; మేటికి (కళ్ళం మధ్య పాతిన గుంజకు) కట్టిన ఎద్దు; బంతిలో ఎడమవైపున్న ఎద్దు (కో. 48-51).

**డుల్లుగడ్డి** (-ఎగవేయు) నురిపిళ్ళప్పుడు కళ్ళం అంచుకుపడ్డ గడ్డి; దీన్ని మధ్యకుతోస్తారు (తె. 35).

**డెక్కు** పర్యా. చిక్కు. కంకులు కొయ్యటం (తె.14).

**డొలక** ధాన్యం నిలవచేసుకొనే వెదురుగంప; చిన్నగాదె (తె. 36).

**ఢేవ్ని** చొప్పకుప్ప; వామి (తె. 15).

**తట్ట** పర్యా. అంచె, గుల్ల[1], పళ్ళిక, పరెక. వెదురు బద్దలతో అల్లిన పనిముట్టు; తూర్పారపొయ్యటానికి ఉపయోగించేది; చూ. తూరుతట్ట (తె. 4, 12, 21, 24, 41; రా. 17, 18, 22).

**తడ** వామి కట్టుబడిలో అడుగుభాగం (తె. 9).

**తప్ప** పర్యా. చూ. తాలు. పలుకులేని గింజ; గింజ పట్టని పొట్టు; చప్పటి తేలికగింజ (కో. 20, 22; తె. 23, 24, 26, 27).

**తబక** పర్యా. చూ. తాలు. పలుకులేని (జొన్న)గింజ (రా. 13).

**తమిరెకట్టె** పర్యా. మెరగాలకట్టె. కళ్ళంలో గడ్డి విదిలించి వెయ్యటానికి ఉపయోగించే పంగలకర్ర (రా. 4).

**తరక** (1) పర్యా. చూ. పొల్లు. తూర్పారపట్టినప్పుడు వేరుగాపడే పొల్లు, పొట్టు, చెత్త మొ. వి; (2) పర్యా. చూ. కాయతాలు. కొంచెం పలుకున్న జొన్న, వరి మొ. వాటి గింజ; వట్టితాలుకంటె మంచిది (కో. 4-6, 29; తె. 40, 41).

**తరం** పర్యా. చూ. అద్ద. గడ్డివామి వేసేటప్పుడు అడుగునపరచిన కట్టలు; కోసుభాగం వెయ్యని వామి; వామి అడుగు (తె. 7; రా. 17, 21).

**తలుపు** తెలుగు; బంతి (కళ్ళంలో కట్టిన ఎడ్లవరస) కట్టే తాడు (కో. 47, 50).

**తాబి** ఎండాకాలంలో వేసే వరిపంట (తె. 13).

**తాలు** (-కొట్టు) పర్యా. జబ్బు, తప్ప, తబిక, తాలు గింజ, తాలుతబ్బ, ముర్రుగాయ, సబ్బు, సింక. పలుకులేని గింజ; గింజపట్టని పొట్టు; చప్పటి లేలిక గింజ (కో. 2, 3, 6, 8–20, 22–25, 27, 29, 35; తె. 22–25, 42; రా. 2, 3, 18, 23, 27); **-కట్టు** పర్యా. చూ. దండె కట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (ధాన్యపురాసి) దగ్గరపడే పొట్టు, గింజలు కలిసినభాగం (కో. తె.); **-కసువు** గింజలులేని గడ్డి (రా.); **-గింజ** చూ. తాలు. (కో. తె. రా.); **-తబ్బ** చూ. తాలు (కో.); **-దంటు** (-తీయు) గింజలులేని గడ్డి (రా.).

**తిక్క** పర్యా. చూ. ఎంటి. వామి (గడ్డికుప్ప) గాలికి లేవకుండా బిగించే గడ్డితాడు. చూ. చిత్రాలు 49 చ. 7, 8; 49 ట. 2, 3 (తె. 31).

**తిక్కడికట్టు** వామిపైకొసన పెట్టే గడ్డికట్ట (తె. 38).

**తిగుట** ఉ. తివుట; రూ. తీట, తెగిటె, తైట(పీట), సీటి(బల్ల); పర్యా. చూ. మెట్టు[1]. తూర్పారపోసే మనిషి కూర్చోటానికి కట్టే మూడుకాళ్ళ (కాండ్ల) పీట; మూడు కాడిమాకులు, పైకొసలు కలిసేట్టు నిలబెట్టి పైన గొంగళి గాని, చెక్కగాని వేస్తారు; దానిమీద తూర్పారపోసే మనిషి కూర్చుంటాడు. చూ. చిత్రం 45 చ (తె. 21, 25, 26).

**తిప్పుడెద్దు** పర్యా. చూ. కడెద్దు. 'బంతి' లో చివరి ఎద్దు; కుడివైపున్న ఎద్దు; బంతి తిప్పే ఎద్దు (రా. 23).

**తింపు** పొట్టు గలిసిన గింజలు చేటతో విసరటం; "చేటతింపుడు", "తింపటం" అని వాడుక (తె. 2, 3, 24).

**తిమ్మె** పర్యా. చూ. మదనం. చాలుగా పోసిన కుప్ప; ముఖ్యంగా తూర్పార పట్టని ధాన్యరాశి (బూగరరాసి)ని ఇలా పోస్తారు (తె. 23, 24).

**తిమ్మెనబల్ల** పర్యా. చూ. మెట్టు. తూర్పార పోసే మనిషి నిలబడటానికి కట్టే మూడుకాళ్ళ పీట. చూ. చిత్రం 45 క (తె. 22).

**తిరగడగొమ్మెద్దు** పరాం. చూ. కడెద్దు. 'బంతి'లో చివరి ఎద్దు; కుడివైపున్న ఎద్దు; బంతి తిప్పే ఎద్దు (రా. 22).

**తీటు** ఉ. తీటి; చూ. తిగుట (తె. 23, 24, 27, 32).

**తీర** (-వేయు) పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ వేసిన గీత; రాసి చుట్టూ కింద వైపు గీచే గీత (తె. 4).

**తూకరాసి** పర్యా. చూ. మదనం. చాలుగా పోసిన కుప్ప; ముఖ్యంగా తూర్పార పట్టని ధాన్యరాసి (బూగర రాసి) ని ఇలా పోస్తారు (తె. 31).

**తూగుపాల** (-పోయు) రూ. తూపాల; పర్యా. చూ. తూర్పార. కళ్ళంలో నూర్చిన ధాన్యం నుంచి పొల్లును వేరు చెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికిపోసే పద్ధతి (కో. 6).

**తూపాల** ఉ. తూపోల (-పోయు) చూ. తూగుపాల (కో. 26; తె. 31).

**తూరు** (క్రి.) రూ. తూరుపు; పర్యా. చూ. తూర్పార. కళ్ళంలో నూర్చిన ధాన్యంనుంచి పొల్లును వేరుచెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి పొయ్యటం; (వి., విశే.) తూర్పార పొయ్యటానికి సంబంధించిన (కో. 8, 11, 13, 17, 18, 22, 24, 25, 28; తె. 3, 14, 42; రా. 16-18); **-గడ** రూ. తూలుగడ; పర్యా. చూ. మదనం. తూర్పార పొయ్యక ముందు పొట్టుతో కలిసి ఉన్న ధాన్యపురాసి; పొట్టు, ధాన్యం కలిసి ఉన్న కుప్ప (కో. తె.); **-తట్ట** పర్యా. తూరుపు గుల్ల, తూరుపుటికె, తూరుపుబుట్ట. వెదులు బద్దలతో అల్లిన పనిముట్టు; తూర్పారపొయ్యటానికి ఉపయోగించే చేట(రా.); **-పుటికె** చూ. -తట్ట (రా.) **-పోత** ఉ. తూర్పాత, తూరోప్పత. పొల్లు వేరయ్యేట్టు గాలికి ఎత్తునుంచి పొయ్యటం (కో.).

**తూరుపు** ఉ. తూర్పు (వి., విశే.) (-ఎత్తు, -పట్టు, -పోయు) చూ. తూరు (కో. 7; తె. 5, 6, 10; రా. 4, 7-9, 11-13, 17-21, 23-28); **-గుల్ల** ఉ. తూర్పుగుల్ల; పర్యా. చూ. తూరుతట్ట. ధాన్యం తూర్పార పొయ్యటానికి ఉపయోగించే వెదురు పేళ్ళ తట్ట (తె.); **-పీట** ఉ. తూరుప్పీట; పర్యా. చూ. మెట్టు[1]. తూర్పారపోసే మనిషి నిలబడటానికి కట్టిన మూడుకాళ్ళ పీట. చూ. చిత్రం 45 క (తె.); **-బుట్ట** ఉ. తూరుబ్బుట్ట; చూ. -గుల్ల (తె.).

**తూర్పాన** (-ఎత్తు, -పోయు). చూ. తూర్పార (కో. 1-5; తె. 4, 12, 29, 33, 34, 37-39, 42, రా. 3).

**తూర్పార** (-ఎత్తు, -పట్టు, -పోయు) రూ. తూర్పాన, తూర్పాల; పర్యా. గాలిపోత, తూగుపాల, తూపాల, తూరు, తూరుపు. కళ్ళంలో నూర్చిన ధాన్యంతో ఉన్న పొల్లును వేరు చెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసే పద్ధతి (కో. 12, 15, 16, 18, 19, 24, 25; రా. 2).

**తూర్పాల** ఉ. తూరుపాల; చూ. తూర్పార (కో. 6, 14, 27).

**తూలుగద** చూ. తూరుగద (కో. 13, 18).

**తెగిసె** ఉ. తివిసె, తెవిసె; చూ. తిగుట. చూ. చిత్రం 15 చ (తె. 5, 7, 10, 15, 19, 34).

**తెండి** పర్యా. చూ. చచ్చుగడ్డి. కళ్ళంలో తొక్కిం చిన వరిగడ్డి కట్ట (రా. 15, 16).

**తేలడి** పర్యా. చూ. చచ్చుగడ్డి. కళ్ళంలో మెదిగినగడ్డి; గింజలు రాల్చిన గడ్డి (తె. 1).

**తైటు(పిట)** చూ. తిగుట (తె. 9, 14).

**తొక్కు** ఉ. తొక్క; పొల్లను తూర్పార పట్టగా వచ్చిన సన్నపొట్టు. దీన్ని పేడతో కలిపి పిడకలు కొడతారు (కో. 10, 43).

**తొంటి** చూ. సొంటె (తె. 35).

**తొండం** ఉ. తొండ; చూ. సొంటె (కో. 32, 35; తె. 29, 31, 40 ).

**తొత్తడి** (-కొట్టు) పర్యా. చూ. పొల్లు, సబ్బు. (1) కళ్ళంలో మెదిగిన గడ్డి; నురిపిడిలో చిన్నచిన్న పరక లుగా నలిగిన గడ్డి; (2) నూర్చిన ధాన్యంతో కలిసిఉన్న పొట్టు, చెత్త, నుసి (తె. 19, 25, 32, 38, 39, 42); **-ఇల్లు** నలిగిన గడ్డినుసి (తె.) ; **-పొల్లు** కళ్ళంలో ధాన్యంతో కలిసిఉన్న కంకిపొట్టు (తె.) ; **-రాసి** పర్యా. చూ. మదనం. తూర్పారపట్టని గింజలు, పొట్టు కలిసిఉన్న కుప్ప (తె.).

**తోపు** బండిమీద పేర్చిన చొప్పకుప్ప (తె. 37, 39, 42).

**తోరణం** ఉ. దోరణం, దోర్నం (-కట్టు, -కుట్టు) పొగాకు కోసి ఆరబెట్టటానికి తాడుకు గుచ్చి కట్టిన దండ (కో. 9, 14, 15, 20, 21; తె. 23, 24, 28, 29, 32).

**దంగు** (క్రి.) పర్యా. మెసుగు. గడ్డి, కంకులు మొ. వి కళ్ళంలో నలిగి గింజలు రాలటం (తె. 11, 12, 14, 34).

**దండగట్ట** (-కట్టు) రూ. దండగద; పర్యా. కడెం, చిలకట్ట, వాగట్టు, వాదండి. కంకులు చెదిరిపోకుండా కళ్ళం చుట్టూ వేసేకట్ట; ముఖ్యంగా మొక్కజొన్న కళ్ళానికి ఇలా చేస్తారు (కో. 21, 24).

**దండగద** చూ. దండగట్ట (కో. 18).

**దండసరుగు** పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసే టప్పుడు మేలురాసి (మంచిగింజల కుప్ప) పక్కనపడే పొట్టు, ధాన్యం కలిసిన భాగం; పొట్టుతో కలిసిపడే గింజలు (తె. 3).

**దండెకట్టు** ఉ. దండకట్ట, దండకట్టు, దండికట్టు, దండెకట్ట, దండెకట్టె; పర్యా. ఈనుకట్టు, కనకట్టు, కరిజ, కిగ్గద, కిదిసె, కిలిసె, గారపోత, చిలిసె, తాలుకట్ట, దండ సరుగు, పిరిసె, పిలిసె, పొత్తికట్ట, పొల్లుకట్టు, బొండకట్టు, మూనకుప్ప, వడరాసి, వాగట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (మంచిగింజల కుప్ప) పక్కనపడే పొట్టు, గింజలు కలిసినభాగం; దీన్ని మళ్ళీ తూర్పారపోస్తారు; కొన్నిచోట్ల కళ్ళం తుడిచే కూలిమనిషికి వదులుతారు (కో. 3, 6, 9; తె. 7, 27 ; రా. 2-4, 10-13, 16, 18, 20-28).

**దాగిలి** పర్యా. చూ. మేపెద్దు. 'బంతి'లో మొదటి ఎద్దు; మేటికి (కళ్ళంమధ్య పాతిన గుంజకు) కట్టిన ఎద్దు ; బంతికి ఎడమవైపున్న ఎద్దు ; చూ. ఓగిలి (కో. 43).

**దాపటెద్దు** పర్యా. చూ. మేపెద్దు. 'బంతి'లో మొదటి ఎద్దు; ఎడమవైపున ఉన్నది (తె. 9).

**దాయన** పర్యా. చూ. మేపెద్దు. 'బంతి'లో మొదటి ఎద్దు; మేటికి (కళ్ళం మధ్య పాతిన గుంజకు) కట్టిన ఎద్దు; ఎడమవైపున్నది (కో. 37).

**దుంకు** పర్యా. చూ. నూగు. కళ్ళంలో నూర్చిన ధాన్యంతో కలిసిఉన్న నుసి; తూర్పారపోసినప్పుడు దుమ్ము పారుగాపోయే సన్నపొట్టు (తె. 12).

**దుడీ** (-ఎత్తు) పంట కోసికట్టిన కట్టల్ని ఒక వరసలో పేర్చి వేసిన కుప్ప (తె. 34).

**దుంప** పర్యా. చూ. కొయ్యకాలు. పంటకోసిన తరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (కో. 25).

**దూగరరాసి** ఉ. దూగర్రాసి; పర్యా. చూ. మదనం. తూర్పారపొయ్యక ముందు పొట్టుతో కలిసి ఉన్న ధాన్యపు రాసి; పొట్టు, ధాన్యం కలిసి ఉన్న కుప్ప (కో. 21).

**దోర** పర్యా. వర్రె. కోసిన గడ్డిమోపులు కలిపి కళ్ళం దగ్గర వేసిన కుప్ప (రా. 1).

**దౌరాకు** పశువుల మేతకు సరిపడే అంత ఎత్తు పెరిగిన పైరు (కో. 37, 46, 48).

**నట్ట(గింజ)** జొన్నలో తాలుగింజ: చూ. నాప (రా. 18, 25).

**నడ్డిబడె** పర్యా. చూ. కుదప. కోసిన అనుములు, ఉలవ, పెసర, కంది మొ. వాటి కుప్పలు కొట్టి గింజలు రాల్చటానికి ఉపయోగించే మొద్దుకర్ర (రా. 18).

**నంద** ధాన్యం నిలవచేసుకొనే పెద్దబాన; సుమారు పది పుట్లదాకా పడుతుంది (కో. 38, 40-44, 46-48).

**నలుగు** (-పెట్టు) పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ గీత వెయ్యటం; రాసిచుట్టూ కిందవైపు గీచే గీత (కో. 44).

**నాప** జొన్నల్లో కొంచెం పలుకున్న గింజ; చూ. నట్ట (రా. 25).

**నిండుగడ్డి** పర్యా. చూ. మేలుగడ్డి. కళ్ళంలో ఇంకా తొక్కించనిగడ్డి; గింజలున్నగడ్డి (రా. 18).

**నిధి(రాశి)** ఉ. నిది; పర్యా. చూ. మదనం. తూర్పార పొయ్యకముందు పొల్లు, ధాన్యం కలిసిఉన్న కుప్ప (రా.

18, 22).

**నురిపిడి** రూ. నూర్పిడి; కోసినగడ్డిని కళ్ళంలో వేసి, పశువులతో తొక్కించి గింజలు రాల్చటం (కో. 2, 5, 10, 13, 15, 17, 19-21, 23-25; రా. 1).

**నుసి** పర్యా. చూ. నూగు. (1) తూర్పారపట్టని రాసిలో ధాన్యంతో కలిసిఉన్న సన్నటి పొట్టు; నూగు; (2) పొట్టురాని (మదనం) తూర్పార పట్టినప్పుడు వేరుగాపడ్డ సన్నటి దువ్వ (రా. 4, 8, 12, 18, 21, 23, 25, 26, 28).

**నూగు** పర్యా. కవ్వ, కసుగు, కుసం, కూగు, గాలు, గుని, చట్టు, దుంకు, నుసి, బుసక, బుసి (పొట్టు), బుసుగు, బూసి, సుంకు. (1) జొన్న, సజ్జ మొ. వి నూర్చిన కళ్ళంలో ధాన్యంతో కలిసిఉన్న నుసి; (2) తూర్పారపట్టినప్పుడు వేరుగాపడే సన్నటిపొట్టు (కో. 14, 18, 19, 21, 23-25; తె. 31, 40, 41, 33, 37, 39; రా. 4, 12, 14, 20, 23-25, 27).

**నూర్పిడి** చూ. నురిపిడి (కో. 17, 20, 22, 36; రా. 1).

**నెట్టుపలక** పర్యా. చూ. మెట్టు¹. తూర్పారపోసే మనిషి నిలబడటానికి కట్టే ఎత్తుపీట. చూ. చిత్రం 45 క. (రా. 12, 20).

**నెరగోలకట్టె** పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో నలిగినగడ్డిని లాగే కర్ర; దీని ఒక కొన వంపు తిరిగి ఉంటుంది (కో. 7-9).

**నేత** (-నేయు) గడ్డికుప్ప నేసేటప్పుడు 'పడుగు' అద్ద, మోటు -కట్టిన తరవాత అంతటినీ చొప్పతో కప్పుకుంటూ రావటం; కుప్పకట్టుబడి (కో. 21-23).

**నేలపాతర** నేలలో తవ్వికట్టిన పాతర (కో. 5; రా. 26).

**పంచగడ్డి** పర్యా. చూ. మేలుగడ్డి. కళ్ళంలో ఇంకా తొక్కించని గడ్డి; గింజలున్న గడ్డి (తె. 33).

**పంజకొట్టు** ఉ. పందకొట్టు; పర్యా. చూ. పిడేటు. చేత్తో వరిగడ్డి కట్టలు పట్టుకొని బల్లమీద గాని, బండిచక్రం మీద గాని కొట్టి గింజలు రాల్చటం; పంజ=?చెయ్యి, వరి గడ్డి కట్ట (కో. 24, 25; తె. 20, 23-25, 27-29, 37).

**పంజగడ్డి** ఉ. పందగడ్డి. పిడికొట్టుడు కొట్టి గింజలు రాల్చిన గడ్డి (కో. 24, 25).

**పట్టు** (క్రి.) తూర్పారపొయ్యటం; ''వడ్లుపట్టుడు,'' ''జొన్నలు పట్టుడు'' అని వాడుక (తె. 7, 18, 26, 27); **-రాసి** పర్యా. చూ. మేలురాసి. తూర్పారపట్టి గుండ్రంగా పోసిన మంచిగింజల కుప్ప (తె.).

**పడుగు** ఉ. పొడుగు (-అడు, -ఒడ్డు, -నెరుచు, -నెరుపు, -పొడుచు, -పోయు) పర్యా. అల్లగం, షులగం. (1) కళ్ళంలో తొక్కించటానికి పరచిన కంకులు, చొప్ప; (2) గడ్డిగూడు (కుప్ప) వెయ్యటానికి ముందు అడుగున పరచిన చొప్పకట్టలు; (3) గుండ్రంగా పేర్చిన గడ్డికుప్ప (కో. 3, 22-25, 39, 41, 42, 44, 45, 50; తె. 1, 3, 5, 6, 8-11, 14, 27, 29, 32, 36, 38, 39, 42; రా. 3, 4, 10-15, 17, 18, 20-27).

**పండవ** రూ. పండె; పర్యా. చూ. అద్ద. గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టలు; కోసుభాగం వెయ్యని వామి; వామి అడుగు (రా. 10, 14).

**పండె** ఉ. పండి; చూ. పండవ (రా. 7, 11, 15).

**పన** (-పెట్టు, -వేయు) రూ. పనస; పర్యా. చూ. ఓదె. (1) కోసినచోటనే కిందవేసిన పంటగడ్డి కట్ట; (2) అటువంటి చిన్నకట్టలు కొన్ని కలిపి కట్టిన మోపు (కో. 1, 2, 5, 6, 14, 15, 20, 23, 26-28, 32-39; తె. 39-41; రా. 1, 2); **-మోపు** కొన్ని పన (ఓదె)లు కలిపి కట్టిన మోపు (కో.).

**పనస** చూ. పన (కో. 44).

**పలగాడి** వామిదొడ్డి వాకిలికి తలుపులాగా పెట్టిన దడి (కర్రచట్రం) (రా. 12, 23, 25, 28).

**పళ్ళిక** ఉ. పల్లిక; పర్యా. చూ. తట్ట. తూర్పార పొయ్యటానికి ఉపయోగించే వెదురుబద్దల తట్ట (కో. 16, 17, 19, 21, 23; తె. 39).

**పాటు** గాదెకింద రాళ్ళుమర్చి పెట్టే ఎత్తు (తె. 21).

**పాతక** చూ. పాతర (రా. 24).

**పాతర** ఉ. పాతరి, పాత్ర; రూ. పాతక. (1) నేలలో బావిలాగా తవ్వి గడ్డితాళ్ళతో అంచు కట్టి ధాన్యం నిలవచేసే చోటు; (2) కొన్నిచోట్ల రాతితో నేలపైన కట్టిన గదికి కూడా ఈ పేరు వాడతారు (కో. 1, 2, 4-6, 8-26, 28, 33, 35-38, 41, 44, 45, 51; తె. 1, 7, 18, 21, 35, 37-42; రా. 5, 8, 10, 12, 14, 18, 20-22, 25, 26); **-కన్ను** పాతరమధ్య రంధ్రం (రా); **-దడి** పాతర లోపల గడ్డితాళ్ళతోకట్టే అంచు (రా.); **-బండ** పాతర పూడ్చేటప్పుడు 'కంటి'కి అడ్డంగా వేసే బండ (రా.); **పాతరంట్లు** (బహు.) పాతర అడుగున చెడిపోయిన గింజలు (రా.); **పాతరుబ్బులు** (బహు.) పాతరలో ముగ్గి పెద్దవైన గింజలు (రా).

**పాపు** (క్రి.) (1) పెరికిన చెట్లనుంచి వేరుశెనగ కాయలు (బుడ్డలు) కోయించటం; ''బుడ్ల పాపనం'' అని వాడుక; (2) గుంటకతోలి వేరుశెనగ చెట్లు పెళ్ళగించటం (తె. 3, 4; రా. 10, 12, 15, 18, 24, 25).

**పిడికట్ట** పర్యా. చూ. పొలికట్టె. కళ్ళంలో ఊడ్చటానికి ఉపయోగించే కందిమండల చీపురు (తె. 3; రా. 12, 18, 20, 21, 23, 25, 28).

**పిడికొట్టు** (-కొట్టు) పర్యా. చూ. పిడ్డేటు. చేత్తో గడ్డి కట్టలు పట్టుకొని బల్లకేసి కొట్టి గింజలు రాల్చే పద్ధతి (కో. 21–22, 28).

**పిడ్డేటు** (<పిడి + అటు) ఉ. పిడాట, పిడాటు, పిడ్డేట; పర్యా. పంజకొట్టు, పిడికొట్టు, సడెంకొట్టు. కొర్ర, వరి మొ. పైర్ల కట్టలను చేత్తో పట్టుకొని బల్లకేసి కొట్టి గింజలు రాల్చే పద్ధతి (కో. 1-7, 15, 16; తె. 6; రా. 1,11, 13, 14, 16).

**పిప్పి** పర్యా. చూ. గగ్గి. (1) కళ్ళంలో గింజలు రాలిన కంకి; చప్పుకంకి; (2) (విణ.) కళ్ళంలో మెదిగినది (తె. 7, 32, 34-36, 38; రా. 7, 18, 24); **-కంకి** (-తీయు) చూ. పిప్పి (1) (తె. రా.); **-కట్టె** పర్యా. చూ. చప్పుగడ్డి. కళ్ళంలో మెదిగిన గడ్డి; గింజలు రాలిన గడ్డి (రా.); **-గడ్డి** చూ. కట్టె (తె.); **-గింజ** పర్యా. గగ్గిగింజ. గగ్గులలో రాలిన గింజలు (తె.); **-పడుగు** పర్యా. గగ్గి పడుగు. మెదిగిన కంకుల కుప్ప (తె. రా.); **-రాసి** పర్యా. గగ్గిరాసి. గగ్గులకుప్ప; గగ్గిగింజల కుప్ప (తె.).

**పిరిసె** (-కొట్టు) రూ. పీలిసె; పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (ధాన్యపు రాసి) దగ్గరపడే పొట్టు, గింజలు కలిసిన భాగం (కో. 24).

**పీరు** పర్యా. చూ. గగ్గి. కళ్ళంలో గింజలు రాల్చిన కంకి; చప్పుకంకి (కో. 46).

**పీలిసె** ఉ. పీల్చె (-కొట్టు); చూ. పీరిసె (కో. 18).

**పుటికె** తూర్పారపొయ్యటానికి ఉపయోగించే వెదురు బద్దల బుట్ట (తె. 30, 36).

**పుఠెక** పర్యా. చూ. తట్ట. వెదురుబద్దలతో అల్లిన పనిముట్టు; తూర్పారపోసేటప్పుడు ఉపయోగించేది. చూ. చిత్రం 47 క (తె. 30).

**పునక** పేముతో అల్లిన గాదె; సుమారు పుట్టి వరకు ధాన్యం నిలవచేసుకోటానికి ఉపయోగించేది (కో. 16).

**పునాసపంట** తొలకరిలోవేసే పైరు; ముఖ్యంగా మొక్కజొన్న, పత్తి, కంది, పెసర, మినుము మొ. వి (తె. 12, 13, 19, 21, 25).

**పురి** ధాన్యం నిలవచేసుకోటానికి నేలమీద ఎంట్ల (పురిపెట్టినగడ్డి)తో గుండ్రంగాకట్టిన ఆవరణం; దీనిలోపల చాపలు వేసి ధాన్యం నిలవచేస్తారు (కో. 26-28, 33, 35, 36).

**పెంపు** పర్యా. చూ. ఓదె. కోసిన చోటనే కింద వేసిన పంట గడ్డికట్ట (తె. 5).

**పెనుగు** (క్రి.) బండిమీద చొప్పకుప్ప పేర్చటం (తె. 1).

**పేరుపు** ధాన్యం దాచుకోటానికుపయోగించే పెద్దబాన (తె. 1).

**పైపాతర** నేలమీద రాతితో కట్టిన పాతర; చూ. పాతర (కో. 5, 11; రా. 25).

**పొట్టు** (1) వేరు చేసిన కాయధాన్యాల తొక్కు; (2) నూర్చిన కళ్ళంలో ధాన్యంతో కలిసివున్న కంకిపొట్టు, గడ్డి, నుసి; (3) తూర్పారపట్టినప్పుడు వేరుగా పడే తేలికభాగం (కో. 2, 8-11, 13-21, 23-26, 29, 32, 50; తె. 19, 21, 23–28, 31, 32, 35, 41; రా. 9, 11, 12, 18, 20, 26); **-గూడు** పొట్టుకుప్ప; పొట్టు నిలవ చెయ్యటానికి కట్టిన కొట్టు (కో.); **-రాసి** పర్యా. చూ. మదనం. తూర్పారపట్టిన రాసి; పొట్టు, గింజలు కలిసిఉన్న కుప్ప (కో. తె.).

**పొడిబంతి** (-తొక్కు, -వేయు) పర్యా. చూ. కొర్ర బంతి. కళ్ళం తడిపి గట్టిపడేట్టు తొక్కించటానికి కట్టిన ఎడ్ల వరస (బంతి) (కో. 26, 27, 33, 35, 36).

**పొతుగురాసి** రూ. పొతురాసి; పర్యా. చూ. నిడుపు రాసి. చాలుగా పోసిన కుప్ప; ముఖ్యంగా తూర్పారపొయ్యని రాసి (బూగరరాసి)ని ఇలా పోస్తారు (తె. 41).

**పొడురాసి** చూ. పొతుగురాసి (తె. 17, 20, 22).

**పొణక** ఉ. పొడక, పొణ్క, పొనక, పొన్క. (1) వెదురుబద్దలతో అల్లిన జల్ల; బండిజల్ల; కంకులు, పొట్టు, ఎరువులు తోలటానికి ఉపయోగించేది; (2) ధాన్యం నిలువ చేసుకొనే వెదురుబద్దల గంప; గాదె (కో. 38, 39, 42-44, 46, 48; తె. 19, 21, 24, 26-28).

**పొత్తి** ఉ. పొత్తు (-చుట్టు, -తిరుగు, -తీయు, -పూయు, -పోయు, -వేయు) పర్యా. కరుకు, తీర, నలుగు, పొలి$^{1}$, పొలిగీత, పొలిగెరె, పోతుకోలు, పోతుగారి, పోసుకోలు, మొదతాలు, మొలతాడు, మొలచుట్టు, లక్షణ, లట్టణం. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూగాని, కళ్ళంచుట్టూగాని, వేసే గీత; రాసిచుట్టూ కిందవైపు గీచే గీత (కో. 3, 5, 7, 8, 11, 31, 32; తె. 1, 5, 8, 9, 12, 14, 19, 23, 26, 27, 29, 31-36, 39, 42; రా. 23); **-కట్టు** పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (ధాన్యపురాసి) దగ్గరపడే పొట్టు, గింజలు కలిసిన భాగం (తె.); **-గెరె** చూ. పొత్తి (తె.).

**పొరక(కట్ట)** ఉ. పరక, పొరకట్ట (-ఆడు,-కొట్టు) పర్యా. చూ. పొలికట్టె. కళ్ళం ఊడ్చటానికి ఉపయోగించే కందిమండలం చీపురు (తె. 1, 5, 7– 9, 32, 36; రా. 2-4, 6, 8, 11, 13, 14, 24).

**పొలి**$^{1}$ (-కట్టు, -చుట్టు) పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ తిరుగుతూ గీచే గీత; రాసిచుట్టూ కిందవైపు గీచే గీత (కో. 7; రా. 2, 9, 17, 21, 24, 25); **-గీత** చూ. పొలి$^{1}$ (కో.); **-గెరె** చూ.

పొలి[1] (రా.).

**పొలి**[2] (-అగు, -పడు) పర్యా. పొలివాటం, పొలివాటు. అనుకొన్న అంచనాకంటె కళ్ళంలో ఎక్కువధాన్యం కావటం (కో. 5, 6, 8, 15, 25); **-వాటం** ఉ. పొల్వాటం; రూ. పొలివాటు; చూ. పొలి[2] (కో.); **-వాటు** ఉ. పొలోటు; చూ. పొలి[2] (కో).

**పొలికట్టె** ఉ. పొలికట్ట, పొలిగట్ట, పొలిగట్టె; రూ. పొల్లకట్ట; పర్యా. గీటుకంప, గీ్రటుకంప, చీపురు(కట్ట), పిడికట్ట, పొరక. కళ్ళం ఊడ్చటానికి ఉపయోగించే కంది మండల చీపురు (కో. 5-9, 13, 14, 16-20, 24, 26-29, 32, 33, 35; తె. 12, 31, 33-39, 41).

**పొలి(గడ్డి)** (-కొట్టు) కళ్ళంలో మెదిగిన గడ్డి, కంకులు మొ. వి (తె. 4, 5, 40).

**పొల్లకట్ట** చూ. పొలికట్టె (తె. 8, 29).

**పొల్లు** ఉ. పల్లు, పొల్ల; పర్యా. గుల్ల, గుల్ల[2], పొట్టు, తరక, తొత్తడి, బూగర. (1) కళ్ళంలో (నుగ్గుగా) మెదిగిన గడ్డిపరకలు; (2) తూర్పారపోసినప్పుడు వేరుగాపడే పొట్టు, చెత్త; (3) (కొన్నిచోట్ల) పొట్టుతో పాటు కలిసిపడే తాలు ధాన్యం (కో. 23, 40, 41, 43, 45, 46, 48, 50; తె. 1, 5, 10-12, 14, 22-25, 27, 29, 31, 33-36, 38, 39, 42; రా. 28); **-కట్టు** ఉ. పొల్లకట్ట, పొల్లుగట్ట; పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (ధాన్యపురాసి) తగ్గరపడే పొట్టు, గింజలు కలిసిన భాగం; మామూలుగా దీన్ని కళ్ళం ఊడ్చేవాడి కిస్తారు (తె.).

**పోతుకోలు** ఉ. పోతుకాలు, పోతుగాలు; రూ. పోతుగాలు; రూ. పోతుగారి; పోసుకోలు, పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ కిందివైపు గీచే గీత (కో. 3-6, 8-16, 24, 25).

**పోతుగారి** (-పెట్టు) చూ. పోతుకోలు (తె. 37).

**పోతురాసి** పర్యా. చూ. మదనం. తూర్పారపొయ్యక ముందు పొట్టుతో కలిసి ఉన్న ధాన్యపురాసి (తె. 25, 26).

**పోసుకోలు** చూ. పోతుకోలు (కో. 1; రా. 1).

**బడితె** పర్యా. చూ. కుదప. కంది, పెసర, ఉలవ మొ. పైరు కుప్పలు కొట్టి గింజలు రాల్చటానికి ఉపయోగించే దుడ్డుకర్ర (తె. 12, 35, 36).

**బడిపె** పర్యా. చూ. గూడు. కింద గుండ్రంగా ఉండి పైన కోసు తేరేట్లు వేసినగడ్డి కుప్ప (కో. 39, 42).

**బడిమె** పర్యా. చూ. వామి. గింజలు రాల్చిన గడ్డితో వేసిన పెద్దకుప్ప; చౌప్పకుప్ప (తె. 4).

**బణివికొట్టు** (క్రి.) వరిగడ్డి కట్టలు చేత్తో పట్టుకొని గింజలు రాలగొట్టటం (రా. 17).

**బండికంత** వామిదొడ్డిలోకి బండిపోవటానికి ఏర్పరిచిన దోవ; చూ. కంత (రా. 12, 18, 21-23, 25, 28).

**బంతి** ఉ. బంతు (-కట్టు, -తిప్పు, -వేయు) పర్యా. బంతిపాటు, లంకె[2]. కళ్ళంలో పడుగు తొక్కించటానికి పక్కపక్కగా జట్టిన ఎడ్ల వరస; ఒక్కొక్క బంతికి మూడునుంచి ఆరుదాకా ఉండవచ్చు; కళ్ళం గట్టిపడటానికి కూడా బంతి (ఎడ్లతో) తొక్కిస్తారు (కో. 1-21, 23-28, 30-33, 35, 36, 40; తె. 1-42; రా. 1, 3-6, 12, 16-18, 20-23, 26-28); **-కణ్లె** చూ. -తాడు (రా.); **-గుండు** బంతికి కట్టే కంకిగుండు; చూ. గుండు (కో.); **-తాడు** పర్యా. బంతికణ్లె, బంతితాడు, బంతిమోకు, లంకెతలుగు, లంకెతాడు. బంతి కట్టటానికి ఉపయోగించే తాడు (కో. తె. రా.); **-పగ్గం** కళ్ళంమధ్య మేటికికట్టిన ఎద్దును లాగే తాడు; చూ. మేటి-(రా.); **-పలుపు** ఉ. పొలుపు; చూ. -తాడు (రా.); **-పాటు** చూ. బంతి (కో. తె. రా); **-మోకు** చూ. తాడు (రా.).

**బరకు** (క్రి.) ఉలవ, కంది మొ. చెట్లు పెర్రకటం (తె. 4, 5).

**బస్తా** (1) సుమారు నూరుసేర్ల ధాన్యం పట్టే నార సంచి; (2) ధాన్యం నింపిన గోనె (కో. 1-3, 5, 9, 14, 20, 26-28, 30-33, 45-37, 47; తె. 30, 33; రా. 1, 23, 25).

**బాన** ధాన్యం నిలవచేసుకొనే మట్టికుండ; నాలుగు బస్తాలదాకా పడుతుంది (తె. 16, 39; రా. 2, 17).

**బిళ్ళగూడు** గుండ్రంగా వేసిన గడ్డికుప్ప (రా. 17, 18, 22).

**బిళ్ళపడుగు** గడ్డి అంతటినీ (అంచెలవారీగా కాక) ఒక్కసారిగానే పరచి పేర్చిన పెద్ద పడుగు; చూ. పడుగు (కో. 23).

**బిళ్ళమండె** గుండ్రంగా వేసిన పొగాకు తోరణాలకుప్ప; గుండ్రటి చొప్పకుప్ప (కో. 18; తె. 41).

**బిళ్ళరాసి** ఉ. బిల్లరాసి; పర్యా. చూ. మేలురాసి. తూర్పారపట్టి గుండ్రంగా పోసిన మంచిగింజల కుప్ప (కో. 26-28, 32, 33, 35; తె. 31).

**బుట్ట** వెదురుబద్దలతో అల్లిన పెద్దగంప; ఇంట్లో ధాన్యం నిలవచేసుకొనేది (కో. 1, 15, 46, 47, 49, 51; రా. 1).

**బుడ్డి** పర్యా. చూ. గులక. పత్తివిడిచిన (వేరుచేసిన) పట్టి గుల్ల (రా. 22).

**బుసక** చూ. బుసి (పొట్టు) (కో. 3, 6, 7, 11, 25; తె. 39, 42).

**బుసి(పొట్టు)** పర్యా. చూ. నూగు; రూ. బుసక, బుసుగు, బూసి. (1) సజ్జ, రాగి, జొన్న మొ. పంటలు నూర్చినప్పుడు రాలే కంకిపొట్టు, సన్నటి నుసి; (2)

తూర్పార పట్టినప్పుడు వేరుగాపడే ధాన్యాల పొట్టు (తె. 1, 2, 4, 5, 11, 12, 14, 29, 32, 33).

**బుసుగు** చూ. బుసి(పొట్టు) (రా. 26).

**బూగడరాసి** చూ. బూగరరాసి (రా. 26).

**బూగర** (-కొట్టు) పర్యా. చూ. పొల్లు. తూర్పార పొయ్యని రాసిలో ధాన్యంతో కలిసిఉన్న గడ్డిపరకలు, పొట్టు, నుసి మొ. వాటి భాగం (కో. 16-20, 22, 23, 25, 27, 28; తె. 39, 40; రా. 9, 18, 20, 23); **-పోతు** పర్యా. చూ. మదనం. తూర్పార పొయ్యకముందు పొట్టులో కలిసిఉన్న ధాన్యపురాసి; పొట్టు, ధాన్యం కలిసి ఉన్న కుప్ప (కో.); **-రాసి** ఉ. బూగరాసి, బూగ్రరాసి; రూ. బూగడరాసి; రూ. చూ. -పోతు (కో. తె. రా.).

**బూగు** పర్యా. చూ. బొంతు. కంకిపొట్టువదలని (జొన్న)గింజలు (తె. 5).

**బూసి** ఉ. బూస; చూ. బుసి(పొట్టు) (తె. 19, 29, 32).

**బొట్ట** ఉ. బొట్టె. వెదురు పేళ్ళతోగాని, ఈతపేళ్ళతో గాని అల్లిన పెద్దబుట్ట; దీనికి చిన్న మూతి, పెద్దమట్టం ఉంటుంది; ధాన్యం నిలవచేసుకొనేది. చూ. చిత్రం 50 ప (కొన్నిచోట్ల) ఇటికతోగాని మట్టితోగాని కట్టిన కొట్టు (కో. 2-5, 32, 35; తె. 29-32, 41, 42; రా. 7, 9, 11, 26).

**బొద్దె** ఉ. బొద్ద. కోసివేసిన వరిగడ్డికుప్ప (తె. 12).

**బొంద** ఉ. బొందు (-కొట్టు) పర్యా. చూ. బొంతు (1) జొన్న, సజ్జ మొ. వాటి కంకిపొట్టు; కంకిలో గింజ లుండే అర; (2) కంకిపొట్టు వదలని గింజలు; (3) గింజలు రాలిన మొక్కజొన్న కంకి (కో. 21; తె. 1, 6, 8, 9, 12, 17, 21-26, 28, 29, 31-34, 36, 42; రా. 20, 23, 28); **-కట్ట** పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (ధాన్యపురాసి) దగ్గరపడే పొట్టు, గింజలు కలిసిన భాగం (తె. 1, 6, 8, 9, 12, 32-34, 36, 42).

**బొత్తు** చూ. బొంతు (కో. 41, 43, 46, 48).

**బొద్దు**[1] (-గుంజు) కళ్ళంమధ్య నలిగిన గడ్డి (తె. 32).

**బొద్దు**[2] చూ. బోజు (తె. 33).

**బొనగ** (-కొట్టు) పర్యా. చూ. నక్కు. పడగుతీసిన తరవాత ధాన్యంమీద ఉన్న చెత్తాచెదారం; దీన్ని పొలికట్టె (చీపురు)తో ఊడుస్తారు (రా. 24).

**బొంతు** (-కొట్టు) రూ. బొత్తు; పర్యా. ఇసుకు, ఉబ్బు, కరిజ, కింక, కూగు, గుబ్బు[1], గొండ, చింక, బూగు, బొంద, బోగం, ముమ్మాయి, లంకె1, సరుగు. (1) నూర్చినప్పుడు వచ్చే కంకిపొట్టు; (2) కంకిపొట్టు వదలని జొన్న, రాగి, సజ్జ, కాయధాన్యాలు మొ. వాటి గింజ (కో. 3, 5, 6, 8-10, 14, 15, 18, 19, 21, 23-25, 29; తె. 24, 35, 37, 40, 41; రా. 8, 10, 11, 20, 21, 24, 25); **-కుప్ప** బొంతు (కంకిపొట్టు) వదలని గింజలకుప్ప (రా.).

**బొరెం** పర్యా. చూ. సొంటె. వామి కట్టుబడిలో మధ్యభాగం; అడుగుకు కప్పుకు మధ్యనున్న వామిభాగం (తె. 1).

**బోగం** పర్యా. చూ. బొంతు. జొన్నకళ్ళంలో గింజలతో కలిసిఉన్న కంకులపొట్టు (తె. 9).

**బోజు** రూ. బొద్దు1, బోద; పర్యా. చూ. సొంటె. వామి కట్టుబడిలో నడిమిభాగం; అడుగు, కప్పులకు మధ్యనున్నది (తె. 7, 9, 10).

**బోడికుచ్చెల** పైన కోపు(సిగ) లేకుండా వేసిన జొన్న గడ్డికుప్ప చూ. చిత్రం 43 చ (కో. 32, 35; తె. 41).

**బోద** చూ. బోజు (తె. 4).

**బోరెం** (1) జనపనారతో అల్లిన పెద్దగోతం; బండికి సరిపడే అంత పెద్దదిగా ఉంటుంది; (2) కొమ్మచువ్వలతో గుండ్రంగా అల్లిన ఒకరకం గాదె. చూ. చిత్రం 50 ట (కో. 25; తె. 16, 17, 19-21, 23-27).

**బొడించు** (క్రి.) పడుగులోని గడ్డిని కొంకికర్రతో విదిలించి వెయ్యటం (తె. 4, 5, 7, 10).

**ముక్కు** (క్రి.) కంకులు కొన్నాళ్ళు కుప్పలో నిలవ ఉండటం (మగ్గటం) (తె. 26, 33, 38).

**మంకెనగంప** పర్యా. గూడ. సన్నటిపొట్టు పోసి ఇంటికి తీసుకుపోవటానికి ఉపయోగించే చిన్నగంప (రా. 16).

**మచ్చు** (1) దూలాలమీద తడికెవేసి, పిడకలు, కంకులు మొ.వి నిలవచేసుకొనే చోటు; (2)? వామి అడుగు (కో. 5; తె. 34).

**మంచె** (-పెట్టు) పందిరిలాగా వేసి పైన గడ్డి నిలవ చేసుకొనే కట్టడం. చూ. చిత్రం 49 చ. 2 (కో. 42, 43, 48).

**మట్టించు** (క్రి.) కళ్ళంలో వేసిన కుప్పలు ఎడ్లచే తొక్కించటం (కో. 41, 42, 45, 46-48).

**మండె** ఉ. మండి, మెండె, మొండి (-కట్టు, -దింపు, -పెట్టు, -వేయు) (1) నలచదరంగావేసే పంట గడ్డికుప్ప (2) పొగాకు తోరణాలు ఆరినతరవాత పేర్చినకుప్ప; (3) పొట్టు మొ.వి దాచటానికి చుట్టూ చొప్పతోకట్టే ఆవరణం; (4) తూర్పార పొయ్యటానికి సిద్ధంచేసిన బూగ(ర) రాసి లేక మదనం; (5) పత్తికాయలు కోసివేసిన కుప్ప; (6) నలచదరంగా వేసిన చొప్ప వామి (కో. 7, 9, 10-12, 14, 15, 17-21, 24, 25, 31-33, 36-39, 41-43, 45-

51; తె. 21, 23, 24, 27-29, 31, 37, 41; రా. 7, 9, 12, 15, 18, 20, 23, 27, 28); **-కుచ్చెల** కళ్ళంలో మెదిగిన చొప్పను తీసి నలచదరంగా వేసిన కుప్ప (కో.); **-గూడు** కంకులు దాచిపెట్టటానికి గడ్డితో కట్టిన ఆవరణం (కో.).

**మదగం** చూ. మదనం (తె. 4-6).

**మదనం** (-చేయు, -వేయు) చూ. మదగం; పర్యా. తిమ్మె, తూకరాసి, తూరుగడ, తూలుగడ, తొత్తడిరాసి, నిధి, పొట్టురాసి, పోతురాసి, బూగడరాసి, బూగరపోతు, బూగరరాసి, వడ్డ. తూర్పారపొయ్యకముందు పొట్టుతో కలిసిఉన్న ధాన్యపురాసి; పొట్టు, ధాన్యం కలిసిఉన్న కుప్ప (తె. 9-14, 28, 29, 31, 33, 35, 38, 39, 42).

**మనిక్ర** ఉ. మనిగర ; పర్యా. కయిలుగడ్డి. కళ్ళంలో సరిగ్గా నలగని గడ్డి ; కొద్దిపాటి గింజలున్న గడ్డి (తె. 1, 5, 11).

**మలగం** ఉ. మల్గం (-వేయు) పర్యా. చూ. పడుగు నూర్పిడికి కళ్ళంలో కుప్పదింపి పరిచిన కంకులు, గడ్డి (తె. 1, 7, 29, 34, 36).

**మలికోత** మిరప పంట రెండోకోత (కో. 7, 11).

**మలివిరుపు** పత్తికాయల రెండోకోత (రా. 17-28).

**మానుకాయ** ఉ. మానుగాయ. ఆకుపచ్చని పొట్టతో ఉన్న వడ్లగింజ; గింజ పాలుపోసుకొనేటప్పుడు మంచు కురవటంవల్ల ఇలాటి రంగు ఏర్పడుతుందట (కో. 18-22).

**మారు** (? < మోర) పర్యా. చూ. మొగవాయి. వామి (గడ్డికుప్ప) ముఖం; ఏటవాలుగా ఉన్న భాగం. చూ. చిత్రం 49 క. 2 (తె. 3; రా. 24, 25).

**ముక్కోండం** పర్యా. చూ. మెట్టు[1]. తూర్పారపోసే మనిషి నిలబడటానికి కట్టే మూడు కాళ్ళపీట. చూ. చిత్రం 45 క (కో. 21).

**ముట్టె** ? వామినుంచి తీసే గడ్డిమోపు (కో. 49).

**ముద్దర** (-వేయు) గింజలు దొంగలు ఎత్తుకుపోతే తెలుసుకోటానికి ధాన్యరాసిమీద ఒక పలకతో వేసేగుర్తు (కో. 1, 2, 33; తె. 5, 7, 8, 11, 33; రా. 1); **-పలక** పర్యా. -బల్ల. ముద్దరవేసే పలక (కో. రా.); **-బల్ల** చూ. -పలక (కో.).

**మునుము** ఉ. మునం, మునము (-పట్టు). ఒక మనిషి పైరు కొయ్యటానికి పదిలిన చాళ్ళు; కోతపనిలో ఒక మనిషి వాటా (కో. 6, 8, 39, 41, 43, 45; తె. 1, 11, 32, 34, 35, 36, 42; రా. 18, 20-25).

**ముమ్మాయి** పర్యా. చూ. బొంతు. కంకిపొట్టు వలదని జొన్న గింజలు (రా. 16).

**ముర్రుగాయ** పర్యా. చూ. తాలు. పలుకులేని వడ్లగింజ (కో. 22).

**ముల్లె** కంబళిలో ధాన్యంపోసి కట్టుకొన్న మూట (తె. 25).

**మునురు** (క్రి.) గాలి బాగా లేనప్పుడు తూర్పార పోసేవాడికి మరొకడు ఎదురుగా నిలబడి చేటతో విసరటం (కో. 33).

**మూగబంతి** (-తొక్కించు, -వేయు) పర్యా. చూ. కొర్రబంతి. తడిసిన కళ్ళం గట్టిపడేట్టు తొక్కించటానికి కట్టిన బంతి (ఎడ్ల వరస) (కో. 32, 40).

**మూన** రాగి, జొన్న, సజ్జ మొ. వి తూర్పారపట్టినప్పుడు దూరంగా పడే పొట్టు, నుసి (రా. 2, 3, 9, 11); **-కుప్ప** పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి (మంచి గింజలకుప్ప) దగ్గరపడే పొట్టు, ధాన్యం కలిసిన కుప్ప (రా.).

**మెట్టు**[1] పర్యా. గడంచె, కెకీ, తిగుట, తిమ్మెనబల్ల, తీట, తూరుపుపీట, తెగిబె, నెట్టుపలక, ముక్కోండం, మెట్టుపలక, సారవ, సీటి (బల్ల). తూర్పారపోసే మనిషి నిలబడటానికి కట్టే మూడుకాళ్ళపీట; కొన్ని చోట్ల మూడు కాడిమాకులు, పైకొనలు కలిసేట్టు నిలబెట్టి పైన చెక్కగాని, కంబళి గాని వేసి తూర్పారపోసే మనిషి దానిమీద కూర్చుంటాడు (కో. 19, 20, 22, 24, 25; తె. 1, 3, 4, 6, 35-39, 42; రా. 17, 18, 21-25, 27, 28); **-పలక** చూ. మెట్టు[1] (తె. రా.).

**మెట్టు**[2] (-కట్టు) పర్యా. చూ. అర్ద. గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టలు; కోసుభాగం వెయ్యని వామి; వామి అడుగు (తె. 35, 38).

**మెద** (-వేయు) పర్యా. చూ. ఓదె. కోసిన చోటనే వేసే చిన్న పంటగడ్డికట్ట; చిన్నచొప్పకుప్ప (తె. 1, 3-12, 14-27, 29, 32-39, 42; రా. 16-18, 21, 22); **-మునుము** పర్యా. చూ. ఓదెపట్టె. ఇద్దరికిమధ్య మరొక మనిషికి పైరు కొయ్యటానికి వదిలే చాళ్ళు (రా.).

**మెదుగు** పర్యా. దంగు. గడ్డి, కంకులు మొ. కళ్ళంలో నలగటం (కో. 35; తె. 3, 32, 36, 37, 39, 42).

**మెరగాలకట్టె** పర్యా. తమిరెకట్టె. కళ్ళంలో గడ్డితీసే పంగలకర్ర (రా. 9).

**మెలగాంకర్ర** పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో వట్టిగడ్డి లాగే కర్ర; దీని ఒకకొన వంపుతిరిగి ఉంటుంది (కో. 3).

**మేగు** (-వేయు) పేడతో కళ్ళం అలుకుడు (తె. 18).

**మేటికొయ్య** ఉ. మేటుకొయ్య; పర్యా. మేటిగుంజ, మేటిమాను. కళ్ళంమధ్య పాతే గుంజ; బంతిలో ఒకకొన ఎద్దును దీనికి కడతారు (కో. 30; తె. 19, 21, 24-26).

**మేటిగుంజ** పర్యా. చూ. మేటికొయ్య. కళ్ళంమధ్య పాతే గుంజ; బంతిలో ఒక ఎద్దును తీసి దీనికి కడతారు (తె.

18, 23, 26).

**మేటిమాను** పర్యా. చూ. మేటికొయ్య. కళ్ళంమధ్య పాతే గుంజ; బంతిలో ఒకకొన ఎద్దును తీసి కడతారు (రా. 14, 15).

**మేటు** ఉ. మేట, మేటి; పర్యా. చూ. వామి. కళ్ళంలో నలిగిన గడ్డి తీసివేసిన పెద్దకుప్ప. చూ. చిత్రాలు 49 క, చ, ట (కో. 37, 39, 41-45).

**మేపెద్దు** (<మేటి+ఎద్దు); పర్యా. డాకోపెద్దు, దాగిలి, దాపెద్దు, దాయన. 'బంతి'లో మొదటి ఎద్దు; మేటికి (కళ్ళంమధ్య పాతిన గుంజకు) కట్టిన ఎద్దు; బంతిలో ఎడమవైపున్నది (తె. 2-10, 12, 14, 17, 21, 29, 32-39, 42; రా. 18, 21-23).

**మేడెం** ఉ. మేటు; పర్యా. జీడెం. మెట్టపంటలు కోసి కట్టిన కట్టల్ని కోసుగా నిలబెట్టి పేర్చిన కుప్ప; గూడుకన్నా కొన్నిచోట్ల చిన్నది; కొన్నిచోట్ల పెద్దది; చూ. గూడు. చూ. చిత్రం 43 త (కో. 9, 10, 11-13, 17-21, 27, 31, 33,35; తె. 31, 32, 39).

**మేలిపడుగు** ఉ. మేల్పడుగు. కళ్ళంలో గింజలు రాలిన గడ్డితీసి, గింజలున్న గడ్డితో వేసినపడుగు; పశువులచే తొక్కించని పడుగు (తె. 9, 27).

**మేలుగడ్డి** పర్యా. నిండుగడ్డి, పంచగడ్డి. కళ్ళంలో ఇంకా తొక్కించని గడ్డి; గింజలున్నగడ్డి (రా. 25).

**మేలుబంతి** కుప్ప నూర్పిళ్ళకు కట్టిన మొదటి బంతి (ఎడ్లవరస) (తె. 23).

**మేలురాసి** పర్యా. గల్లెం?, గుండురాసి, గుండ్రరాసి, పట్టురాసి, బిళ్ళరాసి. తూర్పారపట్టి గుండ్రంగా పోసిన మంచి గింజల కుప్ప (కో. 5, 7, 8, 13-17, 19-29, 31, 32, 35, 40, 41, 44; తె. 1, 4, 12, 21, 23-27, 29, 32-34, 39, 42; రా. 27, 28).

**మైలకోత** మిరపపంట మొదటికోత (కో. 11; తె. 8; రా. 17, 18).

**మైలవిరుపు** ఉ. మైలిరుపు. పత్తి మొదటి విరుపు (కో. 11).

**మొగవాయి** పర్యా. మాకు, మోటు. వామి (గడ్డికుప్ప) ముఖం; ఏటవాలుగా ఉన్న భాగం. చూ. చిత్రం 49 క. 1 (రా. 16, 18, 21).

**మొదతాలు** ఉ. మదతాలు; చూ. మొలతాడు (వర్ణవ్యత్యయం) (కో. 19, 20).

**మొద్దు** పర్యా. చూ. కొయ్యకాలు. పంట కోసిన తరవాత పొలంలో మిగిలేవేళ్ళతో ఉన్న మోడు (కో. 23, తె. 27; రా. 17-23, 26).

**మొరనేడు** పర్యా. చూ. కొయ్యకాలు. పంట కోసిన తరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (తె. 15).

**మొలచుట్టు** పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలు రాసి చుట్టూ వేసిన గీత; రాసి చుట్టూ కింద వైపు గీచే గీత (రా. 17, 45).

**మొలతాడు** ఉ. మొనతాడు; రూ. మొదతాలు; పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ వేసే గీత; రాసి చుట్టూ కిందవైపు గీచే గీత (కో. 22, 23, 33, 38, 46).

**మోటు** పర్యా. సికరం. (1) కోసినగడ్డితో గూడు నేసేటప్పుడు పైన కోసుగా వచ్చే భాగం (కో. 22, 23); (2) పర్యా. చూ. మొగవాయి. వామి (గడ్డికుప్ప) ముఖం; ఏటవాలుగా ఉన్న భాగం. చూ. చిత్రం 49 క. 2 (రా. 17)

**మోటుకసువు** పర్యా. చూ. చప్పుగడ్డి. కళ్ళంలో మెదిగినగడ్డి; గింజలు రాలిన గడ్డి (రా. 6).

**మోటుగడ్డి** పర్యా. చూ. చప్పుదడ్డి. కళ్ళంలో మెదిగిన గడ్డి; గింజలు రాలిన గడ్డి (కో. 17; తె. 3).

**మోటుచొప్ప** పర్యా. చూ. చప్పుగడ్డి. కంకులు కోసినగడ్డి (జొన్న, సజ్జ మొ.) (రా. 18, 21, 28).

**మోడు** రూ. మోడెం; పర్యా. చూ. కొయ్యకాలు. పంటకోసిన తరవాత పొలంలో మిగిలే వేళ్ళతో ఉన్న మోడు (కో. 19, 20, 21, 23).

**మోడెం** చూ. మోడు (తె. 13).

**మోపు** (-కట్టు) ఒక మనిషి మొయ్యటానికి అనువుగా కట్టిన పంటగడ్డి కట్టలు; కొన్ని 'పన'లు కలిపికట్టిన పెద్ద కట్ట (కో. 2-4, 7-10, 18, 20-25, 26-28, 33, 37, 39-43, 45, 47, 49-51; తె. 6, 7, 10, 14-21, 23, 30, 31, 39, 40, 42; రా. 2, 3, 5-7, 9, 15-17, 19, 24, 27, 28); -మెద మొయ్యటానికి వీలుగా కట్టిన గడ్డికట్ట (రా.).

**రాసి** ఉ. రాశి (చాలామంది ఉచ్చారణలో 'స'కారమే వినబడుతుంది). ధాన్యరాశి; నూర్చి తూర్పారపోసి వేసిన మంచిగింజల కుప్ప (కో. 2-29, 31-33, 35, 37, 39-45, 49, 51; తె. 1, 4, 6, 7, 9-15, 17, 20-42; రా. 7, 9, 11, 15, 17, 18, 20-28).

**రిబ్బు** (క్రి.) పొగాకు తుంచటం (తె. 23).

**రొల్లు** ఉ. రొల్ల. పడుగు తీసిన తరవాత ధాన్యంతో కలిసిఉన్న గడ్డిపరకలు, చెత్త, పొల్లు మొ. వి (తె. 3; రా. 28).

**రోలు** (-పాపు/-బాపు) కళ్ళం మధ్యభాగం; ఇక్కడ మెదిగిన గడ్డితీసి (-బాపి) గింజలున్న గడ్డి వేస్తారు (తె. 27, 29, 31).

**లక్షణ** ఉ. లచ్చన, లచ్చెన, లట్టణ; రూ. లట్టణం; పర్యా. చూ. పొత్తి. వరిగడ్డి కాల్చిన మసితో మేలురాసి మీద చుట్టూరా గుర్తుగావేసే గీతలు (తె. 24-26, 32,

36).

లంకె[1] ఉ. లంక, లెంక; పర్యా. చూ. బొంత. అక్కడక్కడ గింజలతో ఉన్న పొట్టు (తె. 4, 7, 19, 29, 32, 35, 39, 42).

లంకె[2] (-కట్టు, -తిప్పు, -విప్పు) పర్యా. చూ. బంతి. కళ్ళంలో గడ్డి తొక్కించటానికి పక్కపక్కగా ఎడ్లను నిలబెట్టి కట్టినకట్టు; ఒక్కొక్క లంకెకు మూడునుంచి ఎనిమిది దాకా ఎడ్లను కట్టవచ్చు (కో. 37–51); -తలుగు, -తాడు పర్యా. చూ. బంతితాడు. ఎడ్లను వరసగా కట్టటానికి ఉపయోగించే తాడు (కో.).

లట్టణం (-వేయు) చూ. లక్షణ (రా. 16).

వంకె ఉ. వంకి; రూ. వంకేం; పర్యా. చూ. కొంకి (కర్ర). కళ్ళంలో గడ్డిలాగే కర్ర; దీనికి ఒకకొన వంపు తిరిగి ఉంటుంది (కో. 6, 14; రా. 1).

వంకేం ఉ. ఒంకేం; చూ. వంకె (కో. 4, 5).

వడ (-కొట్టు, -తోలు) కళ్ళంలో ఒకసారి తొక్కించిన తరవాతగూడా మెదగని కంకులు; వీటిని పైకితీసి మళ్ళీ తొక్కిస్తారు (రా. 18, 21, 26).

వడరాసి పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి పక్కన పడే పొట్టు, గింజలు కలిసిన భాగం (తె. 4).

వడ్డ పర్యా. చూ. మదనం. తూర్పారపొయ్యకముందు పొట్టుతో కలిసి ఉన్నరాసి (రా. 7).

వరిణె కళ్ళంలో ధాన్యం శుభ్రంచేసే జల్లెడ. చూ. చిత్రాలు 48 క, చ (రా. 15).

వర్రె ఉ. ఒర్రె, వరె; పర్యా. దోర. కళ్ళందగ్గర వేసిన గడ్డికుప్ప (ముఖ్యంగా మెట్టపంటలకు వాడేమాట) (కో. 8, 18; రా. 9, 11, 15, 21, 23, 25–27; తె. 3, 10); -కోత కుప్ప వేసిన తరవాత కోసే కంకికోత (రా.).

వలపఎద్దు ఉ. ఒలపఎద్దు, వలపలెద్దు; పర్యా. చూ. కదెద్దు. 'బంతి' లో చివరి ఎద్దు; బంతిలో కుడివైపున ఉండి బంతి తిప్పే ఎద్దు (కో. 37, 49; తె. 2, 8, 9, 33–36).

వళాసం ఉ. వలాసం; పర్యా. చూ. గోతం. సుమారు నూరు సేర్ల దాకా ధాన్యం పట్టే మిల్లు గోతం (నారసంచి) (కో. 17, 18, 20, 21).

వాగట్టు (1) పర్యా. చూ. దండెకట్టు. తూర్పారపోసేటప్పుడు మేలురాసి అంచునపడే పొట్టు, గింజలు కలిసిన భాగం (రా. 26); (2) పర్యా. చూ. దండగట్ట. కళ్ళం చుట్టూ కంకులు చింది పోకుండా వేసే కట్ట (కో. 11).

వాగళ్ళం ఉ. వాగళ్ళాం. కళ్ళం చుట్టూ ఉన్న లోపలి అంచు (కో. 22; తె. 39).

వాగాలు పర్యా. చూ. కదెద్దు. 'బంతి'లో కట్టిన చివరి ఎద్దు; కుడివైపున్న ఎద్దు; బంతి తిప్పే ఎద్దు; చూ. ఓగిలి (కో. 48, 50).

వాడమేటు కోలగా, పొడుగ్గా వేసిన వామి (కో. 41, 46, 48).

వాదండి పర్యా. చూ. దండగట్ట. కళ్ళం చుట్టూ కంకులు చెదిరిపోకుండా వేసిన కట్ట (కో. 25).

వామి ఉ. ఆమి, ఆము, వాం, వాము (-నేయు, -వేయు). పర్యా. గడ్డ, బడిమె, మేటు. గింజలు రాల్చిన గడ్డి తీసివేసిన పెద్దకుప్ప; చొప్పకుప్ప. చూ. చిత్రాలు 49 క, చ, ట (కో. 1–4, 6–28, 31–33, 35, 40; తె. 1, 3–9, 11–16, 20, 22, 24–27, 29, 31–39, 42; రా. 1–28).

వాసమేటు పొడుగ్గా వేసిన గడ్డివామి (కో. 37).

వాసరాసి పర్యా. చూ. మదనం. చాలుగా పోసిన కుప్ప; ముఖ్యంగా తూర్పార పొయ్యని ధాన్యాన్నే ఇలా పోస్తారు (కో. 37).

విడిపించు (క్రి.) వేరుసెనగకాయలు చెట్లనుంచి వేరు చెయ్యటం; పత్తికాయలనుంచి పత్తి తియ్యటం (కో. 40, 49; రా. 2, 4, 15).

సంచి పర్యా. గోతం. సుమారు నూరు సేర్లదాకా ధాన్యం పట్టే నారసంచి; గోనె (కో. 21–23; తె. 5, 13, 15, 16, 18, 21, 22, 24, 25; రా. 18, 25).

సడెంకొట్టు (క్రి.) కొర్ర, వరి మొ. పైర్ల కట్టలు చేత్తో పట్టుకొని బల్లకేసి కొట్టి గింజలు రాల్చటం (తె. 1, 20, 26).

సత్తర (-తొక్కు) కళ్ళంలో తొక్కించటానికి మేటి కొయ్యచుట్టూ పరిచిన కంకులు (తె. 20, 25).

సరిడె ఉ. సర్డి; పర్యా. చూ. ఓదె. వరి, జొన్న మొ. పైర్లు కోసి, పొలంలో వేసిన చిన్నకుప్ప (తె. 21, 22).

సరుగు పర్యా. చూ. బొంత. (1) సజ్జ, జొన్న, మొ. వాటి కంకిపొట్టు; (2) బొంతు (కంకిపొట్టు) వదలని గింజ (తె. 3; రా. 13, 18, 20, 21).

సళ్ళు ఉ. సల్లు (-కొట్టు, -తోలు) రూ. జట్లు; పర్యా. ఉదర, కీకట, గాబారు, గాబు, జడ్డు, జుల్లడ, తొత్తడి, బొనగ, రొల్లు. పడుగుతీసిన తరవాత ధాన్యంమీద ఉన్న చెత్త, చెదారం; దీన్ని పొలికట్టెతో ఊడ్చి తూర్పార పట్టటానికి కుప్ప చేస్తారు (కో. 3; రా. 10–12, 18, 20, 24–26).

సాగినె (-వేయు) కంకులు కోసిన చొప్పతో వేసిన కుప్ప; చూ. సామెన (కో. 25).

సామెణ ఉ. సామణి, సామిణి; చూ. సామెన (రా. 15, 17).

**సామెన** ఉ. సామిని (బహు. సామెండ్లు, సామెన్లు) రూ. సాగినె, సామెణ, సామెర; పర్యా. చూ. ఓదె. (మెట్ట) పైర్లుకోసి పొలంలో వేసిన కుప్పల వరస; కొన్ని పనలు కలిపి కోసుగా నిలబెట్టిన కుప్ప (కో. 1; తె. 3; రా. 1, 6, 11, 14, 18–22, 28); -గూడు కొన్ని సామెనలు కలిపి గుండ్రంగా వేసిన కుప్ప (రా).

**సామెర** చూ. సామెన (తె. 30; రా. 25).

**సారవ** పర్యా. చూ మెట్టు[1]. తూర్పార పోసే మనిషి నిలబడటానికి కట్టే ఎత్తుపీట. చూ. చిత్రం 45 క (తె. 40).

**సికరం** (-కట్టు) పర్యా. మోటు. గడ్డిగూడు వేసేటప్పుడు పైన కోసుగాకట్టే భాగం (తె. 22, 32).

**సిగకుచ్చుల** పైన కోసుగా వచ్చేట్టువేసిన జొన్న గడ్డికుప్ప. చూ. చిత్రం 43 క (కో. 32, 35; తె. 41).

**సింక** పర్యా. చూ. తాలు. పలుకులేని గింజ; గింజ పట్టని వట్టిపొట్టు (తె. 40).

**సిడె** (-కట్టు) నిలవచెయ్యటానికి కట్టే పొగాకు కట్ట (తె. 32).

**సిరకండె** పొడుగాటి కంకి (తె. 15).

**సీటి(బల్ల)** ఉ. సీటు(బల్ల); చూ. తిగుట. చూ. చిత్రం 45 క (తె. 12, 19, 33).

**సుంకు** ఉ. సుంక; పర్యా. చూ. నూగు. నూర్చిన ధాన్యంలో కలిసిఉన్న సన్నటి నుసి; గింజలనంటిఉండే సుంకు (తె. 3–5, 10, 14, 42; రా. 18, 22).

**సుడి** జొన్నకోసి పొలంలో వేసిన గుండ్రటికుప్ప (తె. 19).

**సుండు** చూ. సొంటె (తె. 36).

**సురితెద్దు** (<సురిటి + ఎద్దు) పర్యా. చూ. కడెద్దు. 'బంతి'లో చివరి ఎద్దు; 'బంతి' తిప్పే ఎద్దు (కో. 21; తె. 37, 39).

**సేగిగడ్డి** ఉ. సేగ్గడ్డి; పర్యా. చూ. చచ్చుగడ్డి. కళ్ళంలో మెదిగిన గడ్డి; గింజలు రాలిన గడ్డి (కో. 20).

**సొంటె** రూ. తొంటి, తొండం, సుండు; పర్యా. బొద్దు[2], బొరెం, బోజు, బోద. వామి కట్టుబడిలో మధ్య భాగం; అడుగుకు, కప్పుకు మధ్య నున్నది (రా. 17, 18, 24).

చిత్రం 43 క. సిగకుచ్చెల



చిత్రం 43 చ. బోడికుచ్చెల



చిత్రం 43 ట. కాకిగూడు



చిత్రం 43 త. మేడెం



చిత్రం 44 గుండు (కంకిగుండు)



1. గుండు
2. ఇరుసు
3. చెవికట్టు
4. పలగడపట్టె
5. నొగ(లు)
6. మోకు
7. వారిణె
8. కాడి
9. తగిరె

చిత్రం 45 క. మెట్టు (నెట్టుపలక)



చిత్రం 45 చ తిగుట



చిత్రం 46 కొప్పెర



చిత్రం 47 క. తట్ట



చిత్రం 47 చ. చేట





చిత్రం 48 క వరిణె
(జల్లెడ, వెదురుపేళ్ళది)



చిత్రం 48 చ వరిణె
(రేకుజల్లెడ)

చిత్రం 49 క. వామి



1. అద్ద
2. మొగవాయి
3. దిష్టికుండ (సున్నపుకుండ)
4. మసిబాత (మసిగుడ్డ)
5. కుడుమలదబ్బ(లు)

చిత్రం 49 చ. పందిలివామి



1. వాము
2. మంచె (పరదిలి)
3. పట్టెడరాయి
4. అడ్డచాపు
5. పాయచాపు
6. నిచ్చెన
7. ఎంటి
8. ఎంటి

చిత్రం 49 ట. పట్టెడవామి




1, వామి  2, 3. ఎంటి  4. అడ్డచాపు  5. పట్టెడ  6. అడ్డచాపు

చిత్రం 49 త. వామితట్టుపలక



చిత్రం 49 ప వామికప్పుతట్టుపలక



చిత్రం 50 ట. బోరెం



చిత్రం 50 త. ఓడ



చిత్రక 50 ప బొట్ట






చిత్రం 51 గడంచె

1. నిలువుపట్టె
2. అడ్డపట్టె
3. కాలు

# 11. పంటలు

## 1. వడ్లు

**అక్కుళ్ళు*** ఉ. అక్కుళ్లు. మాగాణిలో పండే ఒక రకం వడ్లు; డెల్టాప్రాంతాల్లో ఎక్కువ, కాని అన్ని నేలల్లోనూ పండుతాయి; వీటిలో శ్రేష్ఠమైన రకాల నెంబర్లు MTU-1, SLO-13 (కో. 17, 19-24, 26, 28-31, 34, 36, 39, 44; తె. 4, 11, 14, 16, 39, 40); భేదాలు:
**కర్రపాలక్కుళ్ళు** ఉ. కరపాలక్కుళ్ళు. అక్కుళ్ళలో మంచిరకం; వంగడం SLO-13 (కో. 21, 44).
**తూర్పుక్కుళ్ళు** విశాఖపట్నంవైపు వేసే అక్కుళ్ళ రకం; గింజ సన్నంగా ఉంటుంది; ఇప్పుడు వెయ్యటం తక్కువ (కో. 36).
**పాలక్కుళ్ళు** బియ్యం బాగా తెల్లగా ఉంటాయి; మార్టేరు ఒకటో నెంబరు (కో. 17, 19, 20, 44; తె. 40).
**బుడ్డక్కుళ్ళు** తేలిరకం వడ్లు; ?ఆడుతురై మూడో నెంబరు (కో. 28).
**బొంతక్కుళ్ళు** అక్కుళ్ళలో ఎంచిన రకం; మార్టేరు ఒకటో నెంబరు (కో. 34).

**అంటువడ్లు** ఉ. అంటొడ్లు; ?ఎం. టి. యు. తెగకు చెందినవి (రా. 6).

**అమృతసరులు** పులావుకు ఉపయోగించే 'బాస్మతి' అనే పరిమళధాన్యం కావచ్చు (తె. 1).

**అరటిరంబాలు** (రా. 11).

**అరిస్తంభాలు** ?అరటిస్తంభాలు (కో. 7).

**ఆకాసపాయలు** వర్షాధారంతో పండే ఒకరకం వడ్లు; మెట్టవడ్లు (తె. 40).

**ఆట్రగడ్డ(లు)** ఉ. ఆట్రగడ(లు);? రూ. ఆర్లగడ్డ. డెల్టాల్లో ఎక్కువగా వేసే వడ్లు; ఎంచిన వంగడం MUT-6 (కో. 12, 13, 17-20, 22-25, 27-29, 31, 35, 36, 44; తె. 4, 39, 40); భేదాలు:
**రంపూరాట్రగడ్డ** (కో. 20).
**చిన్నాట్రగడ్డ** ఉ. సినాట్రగడ. తేలిక రకం; ఆడుతురై 3, 4, నెంబర్లు కావచ్చు (కో. 28, 31; తె. 40).
**జడాట్రగడ్డ** ఉ. జడాట్రగడ. కంకి ముద్దగాఉండే రకం (తె. 39, 40).
**పాలాట్రగడ్డ** ఉ. పాలాట్రగడ. బియ్యం బాగా తెల్లగాఉండే రకం (కో. 19, 25; తె. 39).
**పెద్దాట్రగడ్డ** (కో. 17, 27, 29, 31; తె. 40).
**బొంతాట్రగడ్డ** ఉ. బొంతాట్రగడ. మార్టేరు-6వ నెంబరు దీనికి చెందినది (తె. 39).

**ఆదినారాయణలు** (తె. 32, 33)

**ఆరుకోట్లు** ఉ. ఆరుకాట్లు, ఆరుకొట్లు (తె. 7, 8, 14).

**ఆర్లగడ్డ** ఒకరకం ముతకవడ్లు; వడ్లు ఎరుపు, బియ్యం తెలుపు (కో. 4).

**ఇప్పలు** వాసనధాన్యం; ఇప్పపూరాజనా లని కూడా వాడుక (తె. 34).

**ఈతగొలకులు** ఒకరకం ముతకవడ్లు (తె. 7).

**ఈతగొలలు** వరపునకువచ్చేవడ్లు (రా. 25, 26).

**ఈతపేళ్ళు** (తె. 32).

**ఈసనకోరు(లు)** ఉ. ఈసనకొర్ర. ఆలస్యంగా నాటు వేసినా గాలిపాటుకు ఆగేరకం; 'ఈశ్వరకొర్ర, ఈశ్వర కోర' అనీ అంటారట (కో. 2-5, 15; రా. 1).

**ఉప్పుళ్ళు** కారెముళ్ళలో పెరిగే ధాన్యం (కో. 44).

**ఎచ్చవర్ణాలు** (కో. 26).

**ఎరగచ్చికలు** (కో. 41).

**ఎరగాలివడ్లు** (తె. 32).

**ఎరగొట్టెలు** ?మెట్టవడ్లు; బియ్యం ఎర్రగా ఉంటాయి (తె. 12).

**ఎరడావులు** గింజ ఎర్రగా ఉండి ఆలస్యంగా పండే మెట్టవడ్లు (కో. 29).

**ఎరపాలొడ్లు** బియ్యం కొంచెం ఎర్రగా ఉండే రకం (రా. 28).

**ఎర్రబక్కవరి** ఉ. ఎర్రబక్కొరి. వడ్లు తెల్లగాను, బియ్యం ఎర్రగాను ఉండేరకం (కో. 5).

**ఎర్రవడ్లు** ఉ. ఎరొడ్లు. పెద్దగింజ, ఎర్రని తొక్క-

---

* వాడుకనుబట్టి వడ్లపేర్లు చాలావరకు బహువచనరూపంగానే ఇవ్వవలసివచ్చింది.

ఉ. = ఉచ్చారణభేదం(-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విశ. = విశేషణం; హిం. = హిందుస్తానీ.

ఉన్న వడ్లు (కో. 24, 39; తె. 1, 10, 24, 26, 33, 36; రా. 28).

**ఎలదివడ్లు** ఉ. ఎలదొడ్లు (? <వెలది-=తెల్లటి) (రా. 23, 25).

**ఎలవడం** ఉ. ఎలమడం. మెట్టవడ్లలో ఒక రకం; 'బుడమ' కంటె ఆలస్యంగా పండుతుంది (కో. 13, 17-19; తె. 39); భేదాలు:

**తెల్లఎలవడం** బియ్యం తెల్లగా ఉండే రకం (తె. 39).

**నల్లఎలవడం** గింజ నల్లగా ఉండే రకం (తె. 39).

**బొచ్చుఎలవడం** గింజకు ముక్కుండే రకం (తె. 39).

**బోడిఎలవడం** ముక్కులేని గింజలున్న రకం (తె. 39).

**ఎస్సెల్వ** ఉ. ఎసల్వ, ఎసెల్వ, ఎస్సెల. 'SLO-2' అనే కొణామణి వంగడం (కో. 31, 34-36).

**ఏనకమస్తులు** ఏనుగుమస్తులు; ముతకరకం వడ్లు (తె. 12).

**ఏలతేసనం** (కో. 30).

**ఓమగరితెలు** మెట్టభూమిలో పండే రకం (తె. 11).

**కచ్చలు** (తె. 39).

**కత్తెరవడ్లు** ఉ. కత్తెరొడ్లు (తె. 1, 11).

**కనకమామిళ్ళు** కంకి కుచ్చుగా ఉండేరకం; 'కనక సొంపు' అనిగూడా వాడుకట (తె. 35).

**కప్పసకరలు** చూ. శకరాలు (తె. 11).

**కర్రేదలు** (తె. 42).

**కాకపసండాలు** సన్నరకంవడ్లు (రా. 1).

**కాకిముక్కులు** నల్లవడ్లు, పెద్దగింజ (తె. 22).

**కాకిరెక్కలు** వడ్లు నలుపు, బియ్యం తెలుపుగల రకం; గింజ సన్నం (కో. 4-6, 14, 18, 22; తె. 1, 7, 28, 29, 32, 33, 36, 38, 46; రా. 25, 26).

**కారెబాతులు** (తె. 11).

**కాల్‌బాలు** (తె. 11).

**కిచిడి** ఉ. కిచ్చిడీ, కిచ్చినీ, కిసిడీ, కిసిని, ఖిచిడీ. దక్షిణాదిలో పేరువడ్డ మంచిరకంవడ్లు; ఎంచిన వంగడం; GEB-24 వ నెంబరు (కో. 4, 23, 29-31, 34, 36, 39, 41, 44; తె. 1, 24-26, 28, 30; రా. 1, 2, 4, 9); భేదాలు:

**బొంతకిచిడీ** కొంచెం ముతకరకం; SLO-17 వనెంబరు (కో. 30, 31).

**బొంబాయికిచిడీ** బొంబాయికి ఎగుమతి అయ్యే సన్నధాన్యం; SLO-16 వ నెంబరు (కో. 30).

**వట్టికిచిడీ** ? 'వైట్‌కిచిడి' అన్న ఇంగ్లీషుకు భ్రష్టరూపం; ఈ రకాన్ని 'మణికత్తులు' అనికూడా అంటారుట; తెల్లకిచిడీ (కో. 31; తె. 1).

**కుకిడెలు** ఒకరకం ముతకవడ్లు (తె. 24).

**కుంకుమపూలు** ఉ. కుంకప్పూలు, కుంకంపూలు. గింజ ఎర్రగా ఉండేరకం; ముతకవడ్లు (కో. 8, 15, 17, 22; తె. 9, 11, 14, 31, 33, 36, 37).

**కుప్పెలు** (తె. 32).

**కుసుమ** ఉ. కుసం, కుసమ, కూసం (బహు. కుసమలు, కుసుమలు, కుసాలు, కూసాలు) నెల్లూర్లో ఎక్కువగా పండే వంట; గింజ సన్నంగాను, కంకి బరువుగాను ఉంటుంది; దీంట్లో ఎంచిన రకం MTU-19 (కో. 12-14, 18-23, 25, 27, 28, 31, 34-36, 39, 41, 43, 44; తె. 31, 33, 37, 39, 41); భేదాలు:

**కుసుమసన్నం** (కో. 39, 41; తె. 39).

**గుత్తికుసుమ** ఎన్ను ముద్దగాఉండేరకం; MTU (మార్టేరు) 7 వ నెంబరు (తె. 33, 39).

**చిన్నకుసుమ** ఉ. సిన్నకుసం. మామూలు కుసుమకంటె తక్కువకాలంలో పండేరకం; రెండోపంటకు వేస్తారు (కో. 16, 19, 20).

**జడకుసుమ** చూ. గుత్తికుసుమ (తె. 33).

**జల్లికుసుమ** (కో. 20).

**తెల్లకుసుమ** (కో. 36).

**దొప్పలపూడికుసుమ** (తె. 39).

**నెంబరుకుసుమ** MTU (మార్టేరు) 19 వ నెంబరు; మంచిరకం (కో. 18, 19; తె. 39).

**పెద్దకుసుమ** MTU-22 వ నెంబరు (కో. 12, 16, 17, 19, 20, 27, 28, 31; తె. 39).

**బుడ్డకుసుమ** కాస్త ముతకరకం (కో. 14, 17, 25, 27; తె. 41).

**శ్రీకుసుమ** ఉ. శ్రీకుసం. MTU (మార్టేరు) 19 వ నెంబరు కుసుమ; దీన్ని మొదట 'C-కుసుమ' అని పిలిచేవాళ్ళు (కో. 13, 17, 23).

**సన్నకుసుమ** MTU (మార్టేరు) 19 వ నెంబరు; గింజ సన్నం (కో. 12, 28, 34, 36, 39, 43, 44; తె. 31, 39).

**కేసరి(వడ్లు)** ఉ. కేసరు, కేసరొడ్లు. ఎక్కువగా నెల్లూరు ప్రాంతంలో వేసే ముతకరకం వడ్లు; గింజ ఎర్రగా ఉంటుంది; రెండో పంటకు పనికి వస్తుంది (కో. 3-6, 8, 15, 31, 34, 36; రా. 1, 13, 14, 16, 19, 20); భేదాలు:

**ఎర్రగేసరి** నాలుగు నెల్లలో పండే రకం; వడ్లు తెలుపు, బియ్యం ఎరుపు; గింజ సన్నం (కో. 3-5, 15; రా. 1).

**తెల్లగేసరి** మూణ్ణెల్లపంట; వడ్లూ బియ్యమూ తెల్లగానే ఉంటాయి; ముతకరకం (కో. 3-6; రా. 1).

**నీటికేసరి** మురుగుకు ఆగే ముతకరకం (కో. 36).

**నెంబరుకేసరి** (కో. 15).

**పుల్లకేసరి** మూణ్ణెల్ల పంట; బియ్యం తెలుపు (కో. 5).

**పెద్దగేనరి** నాలుగైదు నెల్లలో పండేరకం (కో. 4, 5).
**పొట్టిగేనరి** గింజ పొట్టిగా ఉంటుంది (కో. 4. 6).
**బుడ్డగేనరి** కొంచెం తేలికగింజ రకం (కో. 8).

**కొణామణి** ఉ. కొనామని, కోణమణి. క్రిష్ణాగోదావరి డెల్టాల్లో ఎక్కువగా పండించే వడ్లు; పొడుగాటి గింజ; ఎంచినరకాల నెంబర్లు SLO (సామర్లకోట) 1, 2, 3, 15 (కో. 13, 16, 23-25, 27-29, 31, 34, 35, 39; తె. 28, 31-33, 39, 40); భేదాలు :
**చిన్నకొణామణి** SLO 1, 2 నెంబర్లు; మామూలు కొణామణికంటె తేలిక; చెరువు కింద మాగాణిభూముల్లో పండించటానికి వీలయిన రకం (కో. 29, 34; తె. 40).
**పెద్దకొణామణి** SLO-3 వ నెంబరు, MTU (మార్టేరు) 11 వ నెంబరు, దీనికి చెందినవి (కో. 27, 29; తె. 39, 40).
**సన్నకొణామణి** SLO-15 దీనిలో ఎంచినవంగడం (కో. 13, 25, 28, 34; తె. 28, 39).

**కొత్తిమిరలు** గింజ గుండ్రంగా ఉండే ఒకరకం (తె. 11).

**కొయంబత్తులు** ఉ. కొయబత్తలు, కొయబత్తులు, కాయంబొత్తులు; చూ. కోయంబత్తూరు వడ్లు (తె. 31, 32, 39).

**కోడెవడ్లు** ఒకరకం ముతకవడ్లు (తె. 23).

**కోడెసరాలు** (తె. 30).

**కోయంబత్తూరువడ్లు** ఉ. కోయంబత్తూరొడ్లు; రూ. కొయంబత్తులు. ? చూ. కిచిడీ (రా. 14, 16).

**క్రిష్ణకాటిక(లు)** ఉ. కిట్టకాటిక, కిష్టకాటుక, కుష్ట కాటుక, క్రుష్టకాటుక; పర్యా. క్రిష్ణనీలాలు. ఆరునెల్ల పంట; గోదావరి డెల్టాలో ఎక్కువగా పండించే సన్నరకంవడ్లు; ముక్కు నల్లగా ఉంటుంది; ఎంచినరకాల నెంబర్లు MTU-5 (బొంతరకం), MTU-10 (సన్నరకం) (కో. 13, 17, 22, 26, 28, 39, 44; తె. 11, 23, 24, 26, 28, 29, 31-33, 37-39, 42, 46).

**క్రిష్ణనీలాలు** పర్యా. క్రిష్ణకాటికలు. మంచి సన్నటి వడ్లు; గింజ ముక్కుదగ్గర నల్లగా ఉంటుంది (తె. 23, 24, 28).

**గంగసానివడ్లు** ఉ. గంగసానొడ్లు, గంగసాలొడ్లు (రా. 5, 6, 8, 15).

**గణేశభోగాలు** ఒకరకం పెద్దగింజవడ్లు (తె. 24).

**గంటుమొలకలు** ? మొలకొలుకుల్లో ఒకరకం; చూ. మొలకొలుకులు (తె. 7, 8, 37, 39, 42).

**గందపుచారలు** (రా. 16).

**గన్నేరులు** ఒకరకం మెట్టవడ్లు (తె. 40).

**గమగమలు** ? 'బాస్మతీ' అనే పరిమళధాన్యం (రా. 17).

**గరికెవడ్లు** ఉ. గర్కవడ్లు. సన్నరకంవడ్లు (కో. 4, 15, 26, 43, 44; తె. 6, 11, 22, 24, 26, 28, 29, 31-34, 38); భేదాలు :
**గరికెపిషాణం** చూ. పిషాణం (కో. 5).
**గరికెసన్నం** రెండో పంటవడ్లు; దీనిలో ఎంచిన రకాలు MTU-9, MTU-15 (కో. 4, 15, 26, 43, 44; తె. 6, 33, 35, 36, 38).
**గరికెసూదులు** ఉ. గరకసూదులు; చూ. గరికె సన్నం (రా. 7).
**రాజగరికెలు** రాజగర్కలు (తె. 11, 24, 26, 28, 29, 31, 32).

**గరిడెవడ్లు** చూ. గరికెవడ్లు (తె. 25).

**గింజన్నరవడ్లు** పొడుగాటి గింజరకం (రా. 25).

**గింజంబాతికెలు** ఉ. గింజనపాతికలు. మామూలు కంటె గింజ ఎక్కువ పొడవైన రకం; వంగడం SR 26B; చవిటినేలల్లోకూడా పండుతుంది; ఒరిస్సానుంచి దిగుమతి అయిన రకమట (కో. 39; తె. 40).

**గుజివడ్లు** (తె. 11).

**గుజ్జుమొలకలు** ఉ. గుజ్జుములకలు, గుజ్జుమొల్కలు. ఒకరకం మోటువడ్లు (తె. 22, 23, 31, 32).

**గుత్తిపూసలు** (తె. 42).

**గుదియలు** (తె. 11).

**గొట్టపువడ్లు** ఉ. గొట్టపొడ్లు (కో. 30).

**గొట్టె(వడ్లు)** (తె. 10-12, 32, 34, 35, 38); భేదం :
**దంపగొట్టెలు** నీటి ముంపుకు ఆగేరకం కావచ్చు (తె. 34).

**గొఱ్ఱెంకముక్కులు** (? <గోరింకముక్కులు) గింజ చివర నల్లగా ఉండేరకం (తె. 30).

**గోదావరిఇసక(లు)** గోదావరి డెల్టాలో పండే సన్న రకం (తె. 11, 28, 29, 33).

**గోదావరులు** చూ. గోదావరిఇసక(లు) (రా. 1).

**గౌడ(లు)** ఉ. గౌడీలు (తె. 1, 6-9, 11, 12, 14); భేదాలు :
**ఇసకగౌడలు** (తె. 11).
**నల్లగౌడలు** (తె. 11).
**నారాయణగౌడలు** (తె. 11).
**నిజాం గౌడలు** (తె. 1, 11, 12, 28).
**పచ్చగౌడలు** (తె. 11).
**భీటిగౌడలు** (తె. 11).
**రామగౌడలు** చూ. రామగుడాలు (తె. 12).
**సెట్టిపల్లిగౌడలు** (తె. 11).

**గౌరికుంకుమలు** (కో. 45).

గౌరిభోగాలు ఉ. గౌరిబోగాలు (తె. 34, 35, 37, 38).

చిట్టిముత్యాలు ఉ. చిటిముత్యాలు, సిటిముత్తేలు. పొట్టిగా సన్నంగా ఉండేరకం (తె. 1, 7, 24, 38, 40).

చిత్తారిబొట్లు (తె. 30).

చింతపూలు చూ. రత్నవసుడి (తె. 5).

చిందిబాయిసీలు ఉ. సిండిబాయిలు (తె. 24, 30).

చిన్నపూవడ్లు (తె. 16).

చీరపేనులు (తె. 11).

చెందనాలు (కో. 42).

చెన్నంగులు చవిటినేలలకు పనికివచ్చేవి (రా. 11, 14, 16, 19, 20, 23).

చేటువంపులు ఉ. శాటొంపులు (తె. 39).

జానకిరాములు గింజలు జంటలుజంటలుగా కంకిలో ఉండేరకం; ఈరకాన్ని 'కొబ్బరిపువ్వు' అనిగూడా అంటారుట (తె. 11).

జానసరాలు (తె. 9).

జింకరవడ్లు ఉ. జింకరొడ్లు. 'సాంబ'లో ఒక రకం కావచ్చు (తె. 4).

జింకరోమాలు (తె. 7).

జిలమ(లు) ఉ. జిలం(వడ్లు). ఒకరకం మెట్టవడ్లు; బుడమకంటె ఆలస్యంగా పండేరకం; MTU-18 దీనిలో ఎంచిన వంగడం (కో. 18, 19, 21).

జీరాలు (రా. 16).

ఢిల్లీభోగాలు క్రిష్ణాడెల్టాలో ఎక్కువగా పండించేరకం; గింజ సన్నం; ఎంచినరకాలు మార్టేరు 8, 13 నెంబర్లు (కో. 22; తె. 4, 7, 24).

ఢిల్లీసుల్తానులు 'బాస్మతి' అనే పులావు ధాన్యం కావచ్చు (తె. 28).

డుబ్రాజ్(వడ్లు) ఒకరకం ముతకవడ్లు (తె. 24).

తల్లీగలు (కో. 30).

తాటిపేళ్ళు ఉ. తాటిపేలు (తె. 11, 32, 36).

తిమ్మసంద్రాలు (కో. 35).

తురకసురలు మెట్టవడ్లలో ఒక ముతకరకం (కో. 39).

తెల్లగన్నేర్లు ఒకరకం మెట్టవడ్లు (తె. 40).

తెల్లపాలవడ్లు ఉ. తెల్లపాలొడ్లు (తె. 35; రా. 28).

తెల్లముచ్చెలు (తె. 28).

తెల్లవడ్లు ఉ. తెల్లొడ్లు. ఒకరకం మెట్టవడ్లు (కో. 43; తె. 4, 10, 26).

తోకవడ్లు ఉ. తోకొడ్లు. 'చెన్నంగుల'కు మరొక పేరు; ధాన్యానికి ముళ్ళుంటాయి (రా. 5, 6, 8).

దాళవా(లు) ఉ. దాలవా(లు), దాళవడ్లు. రెండో పంటకు వేసేముతకరకం; నీటి ఎద్దడికి ఆగుతుంది; గింజ నల్లగాఉంటుంది (కో. 21, 29, 42, 44).

దుప్పితోకలు (తె. 30).

దుబ్బవడ్లు ఉ. దుబ్బొడ్లు. లావుగింజగల కొన్ని రకాలు (తె. 1, 3).

దూదిభోగం (కో. 42).

దూనసరులు (తె. 5.).

దొడ్డువడ్లు కొన్ని ముతకరకాలు (తె. 16, 25, 28).

దొరసానిపిక్కలు ఒకరకం ముతకవడ్లు (తె. 28).

దొరసానిపిర్రలు ఒకరకం ముతకవడ్లు (తె. 23, 29, 33).

ధనేలవడ్లు ఉ. ధనేలొడ్లు. గింజ గుండ్రంగా ఉండే రకం; చూ. కొత్తిమిరలు (తె. 4, 6).

నక్కమూతులు (తె. 6).

నడిపివడ్లు ఉ. నడిపొడ్లు. ?రెండు వంగడాల కలయిక వల్ల ఏర్పడ్డ రకం; బహుశా 'ఈసనకోరు' కావచ్చు (కో. 30).

నల్లమూతులు ఉ. నల్ల మోతులు; ?చూ. క్రిష్ణ కాటికలు (తె. 15, 16, 26).

నల్లవడ్లు ఉ. నల్లొడ్లు. గింజనలుపు వడ్లు; బియ్యం తెల్లగానే ఉంటాయి; చవిటినేలల్లో కూడా పండేరకం (కో. 3, 4, 6, 26; తె. 3-5, 10, 12, 26; రా. 1, 4, 7, 28).

నారాయణలు (కో. 30; తె. 23, 24, 30).

నీటికాసర ?నీటికేసరి; చూ. కేసరి (కో. 31, 34).

నీటిబుగ్గలు (తె. 28).

నీరుగుమ్మళ్ళు ఉ. గీరుగుమ్మల్లు (తె. 5, 11).

నీరుమునకలు ఉ. నీరుమునగలు, నీరుమున్కలు. ముంపుడు నేలలకు పనికివచ్చేవి. (తె. 1; రా. 11).

నుంగరవడ్లు ఉ. నుంగరొడ్లు (కో. 30).

నెంబర్లు ఉ. నంబర్లు, నింబర్లు. GEB-24 వ నెంబరు వడ్లు; గింజ సన్నం రకం (కో. 6, 13, 15, 20, 24, 28; తె. 31, 34, 37, 38, 41; రా. 5, 7, 8).

నేపాళాలు ఉ. నేపాలాలు (తె. 42).

పచ్చగన్నేర్లు మెట్టవడ్లలో ముతకరకం; ఎన్ను ముద్దగా ఉంటుంది; మూణ్ణెల్ల పంట (కో. 25, 30, 31, 40; తె. 11, 22, 24, 28, 30, 39).

పచ్చవడ్లు ఉ. పచ్చొడ్లు (కో. 5).

పయ్యాకులు (కో. 45).

పలావువడ్లు ఉ. పలావొడ్లు. 'బాస్మతి' అనే ఉత్తర హిందూస్థానపు ధాన్యం; గింజ సన్నంగా సువాసనగా ఉం

టుంది (కో. 3, 5, 6, 23; రా. 1, 6).

పసాడీలు చూ. పిచోడీలు (కో. 31); భేదాలు :

చిన్నపసాడీలు (కో. 31).

పెద్దపసాడీలు (కో. 31).

పసుపుకండలు (కో. 45).

పసుపుగొట్టాలు చూ. ? పచ్చగన్నేర్లు; మెట్టవడ్లు (కో. 31).

పాకిస్తానులు ? బాస్మతి అనే పులావుధాన్యం కావచ్చు (రా. 11).

పాలగుండలు (తె. 30).

పాలగుమ్మళ్ళు తెల్లని మంచిరకం ధాన్యం; సామర్ల కోట-7 వ నెంబరు; పాలగుమ్మ సరులు అని కూడా వాడుక (తె. 39, 40).

పాలజ్ఞానులు ?చూ. వజ్ఞానం (కో. 39).

పాలవంకలు ?వంకెల్లో ఒకరకం; మంచి ధాన్యం; చూ. వంకెలు (తె. 26, 28).

పాలవడ్లు ఉ. పాలొడ్లు. తెల్లగా ముతగ్గాఉండే వడ్లు; చూ. తెల్లవడ్లు (తె. 24; రా. 28).

పాలాకులు (కో. 31; తె. 11).

పిచమానం(వడ్లు) ?చూ. పిషాణం (రా. 7).

పిచోడీలు ఉ. పిసోడి; రూ. పసాడీలు. సన్నటి తెలికరకం ధాన్యం; మూణ్ణెల్లపంట; రెండో పంటకు పనికి వస్తుంది; SLO-16 వ నెంబరు దీనికి చెందినది (కో. 4, 22, 31; తె. 11, 23, 32, 37, 38); భేదాలు :

కాశీపిచోడి SLO-16 (కో. 4, 22, 31).

నెల్లూరిపిచోడీ (తె. 32).

పిచ్చివడ్లు ఉ. పిచ్చొడ్లు. ఒకరకం ముతకవడ్లు; మెట్టరకం (కో. 4; రా. 6, 8, 15).

పిన్నమెటెంగలు ?చూ. మోటెంగలు (కో. 30).

పిషాణం(వడ్లు) ఉ. పిశాణం, పిసాణం. నెల్లూరు, కడప జిల్లాల్లో పండించే మంచిరకం వడ్లు; నాట్లు ఆలస్యంగా వేస్తారు (కో. 5, 6; రా. 11, 19); భేదాలు :

బరిగెపిషాణం (రా. 11).

మనిపిషాణం (<మానిపిషాణం) అరవదేశంలో 'మాని' నెల్లో వేసేవడ్లు (కో. 5, 6).

పునాసలు తెలికవరి (కో. 29).

పులితోకలు (తె. 28).

పులిమీసాలు మోటువడ్లు; గింజసన్నగా పొడుగ్గా ఉంటుంది (తె. 1, 6, 10, 24, 28, 32).

పూబాళ్ళు ఉ. పూంబాళ్ళ (రా. 1).

పెంకాయపూత ఒకరకం సన్నవడ్లు (కో. 3, 6).

పెద్దబీటివడ్లు ఉ. పెద్దబీటొడ్లు (తె. 29).

పెద్దమాసంవడ్లు (రా. 7).

పెద్దవరి ఉ. పెద్దొరి (బహు. పెద్దవడ్లు) (కో. 3, 25, తె. 6, 38; రా. 25, 26, 28).

పేబుల్‌డేసులు ? పిచోడీగాని బాస్మతి గాని కావచ్చు (రా. 7).

పొట్టిచారలు ఉ. పోటిసార్లు, పొటీసార్లు (తె. 40).

పొట్టినల్లవడ్లు నల్లవడ్లలో ఒకరకం; బియ్యం ఎర్రగా ఉంటాయి (కో. 4-6, 14, 15).

పొట్టిమొలక(లు) ? నెల్లూరు ఫారం BCP (బుచ్చిరెడ్డిపాలెం) 2 వ నెంబరు (తె. 12, 32, 33).

పొడుగుమొలకలు మొలకొలుకుల్లో కొంచెం పొడుగు గింజ రకం (తె. 33).

పొరాబొంకులు ?రూ. బొరపొంకులు, గంజాంజిల్లాలో పండించేవడ్లల్లో ఒకరకం; బరంపురం BAM-1, 11 నెంబర్లు దీనికి చెందినవి (కో. 43).

పొలిచ్చేడలు (తె. 5).

బంగారుతీగెలు ఉ. బంగారితీగెలు. సన్నటి పొడుగు గింజ రకం; ధాన్యం పసిమిరంగులో ఉంటుంది; బియ్యం చాలా నాణ్యం; అనకాపల్లి 9 వ నెంబరు (కో. 5, 6, 14, 17, 20, 28, 36, 45; తె. 1, 5, 11, 24, 28, 39, 41; రా. 2, 16, 17, 23, 25, 26, 28).

బంగారుముక్కులు సన్నగింజరకం; కొస ఎర్రగా ఉంటుంది (తె. 24).

బంగారుమెలికలు (తె. 31).

బందరుకిట్టలు ? కుసుమల్లో ఒకరకం (తె. 12).

బందరుపోతుమొంకలు (తె. 12).

బందర్లు కుసుమలు కావచ్చు (తె. 28).

బంద్రాలు ? చూ. బందర్లు (తె. 29).

బయాకొండ ఉ. బైగొండ; చూ. బయాహుండా (తె. 1, 30, 32, 33).

బయాహుండా ఉ. బయండ, బయాఉండా, బయ్యఉండ, బయ్యండ, బయ్యాఉండా, బయ్యాండ; రూ. బయాకొండ. బియ్యం తెలుపుగా ముతగ్గా ఉండేరకం (కో. 36, 39, 41, 43-45); భేదాలు :

చిన్నబయాహుండా ఉ. సిన్నబయ్యాఉండా (కో. 36).

పెద్దబయాహుండా ఉ. పెదబయండ, పెద్దబయ్యాఉండా. గంజాం జిల్లాలో పండించే ఒక మంచిరకం; ఎన్ను ముద్దగా ఉంటుంది (కో. 36, 43).

ముతకబయాహుండా ఉ. ముతకబయ్యంఢ (కో. 45).

సన్నబయాహుండా ఉ. సన్నబయండ, సన్నబయ్యండ, బయ్యఉండ. బయాహుండాలో ఎంచినరకం; బరంపురం 3 వ నెంబరు (కో. 39, 43, 45).

**బరకుంకుమలు** ?చూ. బొరబొంకులు (కో. 45).

**బలగుత్తి** (కో. 36).

**బలరామభోగాలు** ఉ. బల్రామభోగాలు. విశాఖపట్నం తాలూకాలో పండించే రకాల్లో ముఖ్యమైనది; కొంచెం ముదురుగు ఆగేరకం (కో. 41-43, 45).

**బవనం** (కో. 20).

**బసంగి(లు)** ఉ. బసెంగ. గోదావరి డెల్టాలో పండించే వడ్లలో ఒకరకం; ఉప్పుడుబియ్యానికి పనికి వస్తుంది; మార్టేరు-3, 20 నెంబర్లు దీనికి చెందినవి (కో. 13, 24, 26-30, 34, 36; తె. 14, 30, 39).

**బసంతి** ఉ. బసంది. పులావుకు ఉపయోగించే 'బాస్మతి' అనే సన్నగింజరకం కావచ్చు (తె. 11, 16).

**బావటాలు** (తె. 1).

**బాసబడెలు** (తె. 4).

**బాస్వాములు** 'బాస్మతి' అనే పులావు ధాన్యం కావచ్చు (తె. 5).

**బీటివడ్లు** ఉ. బీటొడ్లు (తె. 24, 29).

**బుడమ(వడ్లు)** ఉ. బుడం. మెట్టవడ్లలో ఒకరకం; ధాన్యం ముతగ్గా ఉంటుంది (కో. 9, 17, 19, 24, 26, 27, 29-31, 36; తె. 1, 4, 6, 7, 24, 32, 33, 37, 39, 42; రా. 5, 13, 17); భేదాలు :

**ఎడబుడమ** (తె. 1).

**కోటిబుడమ** MTU-17 దీనిలో ఎంచినవంగడం (కో. 31).

**చారబుడమ** గింజమీద చారలుండేరకం (కో. 29).

**తెల్లబుడమ** (తె. 1, 7, 39).

**తోకబుడమ** (తె. 4.).

**నల్లబుడమ** (కో. 31; తె. 4, 32, 39).

**పాలబుడమ** (తె. 32).

**మెట్టుబుడమ** (కో. 43, 45).

**మోతకబుడమ** (తె. 1).

**బుడ్డగులకలు** (తె. 1).

**బైరివడ్లు** ఉ బైరొడ్లు (రా. 2, 4, 6).

**బొచ్చువడ్లు** గింజకు ముళ్ళుండే కొన్ని రకాలు; చూ. తోకవడ్లు (కో. 9).

**బొబ్బరిగంటె** ఉ. బొబ్బరిగంటి, బొబ్బెరగంటి; రూ. బొబ్బిలిగంటి. ముతగ్గా తెల్గ్గా ఉండేరకం; నీటి ఎద్దడికి ఆగుతుంది; అనకాపల్లి-1 వ నెంబరు దీనికి చెందినది (కో. 21, 23, 25, 31; తె. 30, 40).

**బొబ్బిలిగంటి** ఉ. బొబ్బిలిగంట, బొబ్బిలిగండి. చూ. బొబ్బరిగంటె (కో. 39, 45; తె. 42).

**బొరబొంకులు** ఉ. బరాబొంకు, బొరబొంకులు; ?చూ. పొరాబొంకులు. బరంపురం-1 వ నెంబరు దీనికి చెందిన రకం (కో. 41, 45).

**బొరుగువడ్లు** సన్నరకం వడ్లు (రా. 15).

**బొల్లిముచ్చెలు** ఒకరకం మోటువడ్లు (తె. 23).

**బొల్లిముత్యాలు** గుండ్రటి తెల్లటివడ్లు (తె. 11).

**బోడిపుల్లవడ్లు** పుల్లసన్నవడ్లు; చూ. సన్నం (రా. 14, 16).

**బోదేరెలు** వడ్లు నల్లగా, బియ్యం తెల్లగా ఉండే ఒకరకం (కో. 4).

**మంచిసాంబ్రీలు** (తె. 29)

**మటిక్యారువడ్లు** (రా. 6, 8).

**మట్టికార్లు** ఒకరకం మెట్టవడ్లు; తమిళదేశంవి (తె. 11).

**మణికిత్తనాలు** వడ్లు, బియ్యంగూడా ఎర్రగా ఉండే రకం (కో. 3; తె. 1).

**మణిముత్యాలు** (తె. 11).

**మండెపూలు** (కో. 31).

**మందవామిళ్ళు** (కో. 30).

**మరవడ్లు** (రా. 17).

**మసర(లు)** ఉ మసిరె (తె. 5, 7, 32, 33, 34); భేదాలు :

**ఆకుమసర** (తె. 5, 33, 34).

**నల్లమసర** (తె. 33).

**మహారాజభోగాలు** ఉ. మారాజబోగాలు. గింజ సన్నగా పొట్టిగా ఉండేరకం; అనకాపల్లి-8 వ నెంబరు దీనికి చెందినది (కో. 3, 7, 36, 41, 43; రా. 25, 26).

**మార్పువడలు** (తె. 7).

**మానవాడలు** (తె. 8).

**ముతకబడలు** (కో. 45).

**ముత్తెపుచారలు** (రా. 16).

**ముత్యాలు** ఉ. ముత్తేలు. గింజ గుండ్రంగా ఉండే రకం (తె. 7).

**ముదిగంటివడ్లు** ఉ. ముదిగంటొడ్లు (రా. 15).

**మురాదొల్ల** సువాసనగల రకం; చూ. బసంతి (రా. 11, 23).

**మెట్టపారాలు** (కో. 41).

**మైపాళి** ఉ. మైపాలి (బహు. మైపాళీలు, మైపాళ్ళు) మోటువడ్లలో ఒకరకం; గింజ గట్టిగా ఉంటుంది; ముఖ్యంగా విశాఖజిల్లాలో పండిస్తారు; దీంట్లో ఎంచిన రకాలు AKP (అనకాపల్లి) 4, 6 నెంబర్లు (కో. 31, 39, 41-43, 45); భేదాలు :

**కొండమైపాళి** (కో. 39).

**తాలికమైపాళి** (< ? తేలికమైపాళి) తక్కువ కాలంలో పండే పంట (కో. 42).

దుక్కమైపాళి ముతకరకం; పెద్దగింజ; అనకాపల్లి 4 వ నెంబరు (కో. 42).
పెద్దమైపాళి (కో. 41, 43, 45).
మొర్రిగూతులు (తె. 11).
మొర్రివడ్లు (తె. 26).
మొలకలు ? చూ. మొలకొలుకులు (తె. 32, 33).
మొలకొలుకులు ఉ. మలగులకలు, మొలగొలుకులు. ముఖ్యంగా నెల్లూరు, రాయలసీమ ప్రాంతాల్లో పండించే మంచిరకం వడ్లు; కంకి ముద్దగా ఉంటుంది; BCP-1, 2 నెంబర్లు దీంట్లో ఎంచినరకాలు (కో. 2–9, 12–17, 19–21, 31, 35; తె. 1, 40; రా. 1, 2, 6, 11, 23, 27).
భేదాలు :
కాశీమొలకొలుకులు (కో. 5).
గుత్తిమొలకొలుకులు (కో. 12).
జిలకరమొలకొలుకులు మరీ గింజ సన్నరకం (కో. 3).
నెల్లూరిమొలకొలుకులు నెల్లూరు జిల్లాలో పండించేవి; వీటిల్లో ఎంచినరకాలు BCP (బుచ్చిరెడ్డిపాలెం) 1, 2 వ నెంబర్లు (కో. 12, 16, 17).
పునర్వసుమొలకొలుకులు (కో. 5; రా. 1).
పెద్దమొలకొలుకులు (కో. 4–6).
బుడ్డమొలకొలుకులు (కో. 5, 6).
బొంతమొలకొలుకులు BCP (బుచ్చిరెడ్డిపాలెం) 2 వ నెంబరు (కో. 16).
మెట్టమొలకొలుకులు (కో. 13).
సన్నమొలకొలుకులు BCP-1 (కో. 4-6).
మోటెంగలు ముతకవడ్లలో ఒకరకం (కో. 30, 31; తె. 23).
మోసనం ఉ. మోషణం, మోషనం. వడ్లు తెల్లగా బియ్యం ఎర్రగా ఉండేరకం; నీటి ముంపుకు ఆగుతుంది (కో. 4, 6, 8, 9, 14, 15; రా. 1).
మోసంబులు చూ. మోసనం (తె. 39).
రత్నవసుడి ఉ. రత్తవసుడి. 'రత్నచుడీ' అనే మంచిరకం; ఒరిస్సాలోను, శ్రీకాకుళం జిల్లాలోను ముఖ్యంగా పండిస్తారు; బరంపురం-6 వ నెంబరు దీనికి చెందినది (కో. 36).
రత్నసరులు ? చూ. రత్నవసుడి (కో. 39, 43, 45).
రసంగి ? చూ. బసంగి (కో. 31, 34, 36; తె. 30).
రాగితీగలు (తె. 11).
రాజభోగాలు చూ. మహారాజభోగాలు (కో. 14; తె. 1, 6, 42).
రాజహంసలు ఉ. రాజంచలు, రాజంసలు (తె. 1, 8, 9, 11, 34).
రాదసాధనాలు (కో. 20).
రామగడలు రూ. రామగాడి. ముతకవడ్లు; ముఖ్యంగా విశాఖపట్నంలో పండించేవి; అనకాపల్లి 12 వ నెంబరు దీనికిచెందిన రకం (కో. 36, 39, 41).
రామగాడి చూ. రామగడ (కో. 43).
రామసాగరాలు AKP (అనకాపల్లి) 10 వ నెంబరు (కో. 14, 20, 27, 35, 36, 39, 41; తె. 32).
రామేశ్వరాలు (తె. 11).
రిచ్చలు (తె. 28–30).
రెడ్డిసానికాటికెలు ? క్రిష్ణకాటికలు (తె. 23, 24, 26, 28).
రైలుబేసర్లు చూ. తోకవడ్లు (కో. 5).
లక్ష్మినారాయణలు ఒక్కొక్క వడ్లగింజలో రెండేసి బియ్యపుగింజలుండే రకం (తె. 24).
లక్ష్మిభోగాలు (తె.11).
లిమ్మిటీవడ్లు ఎం. టి. యు (నూర్టేరు) నెంబరు వడ్లు (రా. 2).
లుచ్చులు ఉ. లుచ్చెలు. మధ్యప్రదేశ్‌లో పండించే ఒకరకం వడ్లను 'లూఛాయ్' అంటారు; ఆ తెగకు చెందినవై ఉండవచ్చు (తె. 24, 25, 28, 29, 33).
లోఖ్యాలు ఉ. లోఫ్యాలు, లోఖియాలు (తె. 22, 24, 26, 32).
లోహితలు ఉ. లోయితలు.? ఒకరకం ఎర్రవడ్లు (తె. 29, 31).
వంకెలు ఉ. ఒంకెలు, వంకలు, వంకేలు. పెద్ద గింజ రకం; బియ్యం ఎర్రగా ముతగ్గా ఉంటాయి; నాలుగునెల్ల పంట; గింజకొన కొద్దిగా వంపుతిరిగి ఉంటుందట; ముఖ్యంగా మైసూరు ప్రాంతంవి (కో. 7, 14; రా. 7, 11, 23, 26–28); భేదాలు :
చెంద్రవంకెలు ఉ. చెంద్రాంకెలు (కో. 31; తె. 4).
చౌటువంకెలు ఉ. సౌటాంకెలు (రా. 11, 23, 26).
జున్నుబాలవంకెలు ఉ. జులుబాలొంకెలు. రెండో పంటకు వేసే రకం; బియ్యం తెల్లగా ఉంటాయి (కో. 9; రా. 11).
తెల్లవంకెలు ఉ. తెల్లొంకెలు. తెల్లపిచోడికే మరొక పేరు (రా. 11, 26).
పెద్దవంకెలు నాలుగునెల్ల పంట, వడ్లు, బియ్యం కూడా ఎర్రగా ముతగ్గా ఉంటాయి (కో. 7).
బుడ్డవంకెలు (రా. 7).
బొడ్డువంకెలు ఉ. బొడ్డాంకెలు. వడ్లు ఎర్రగాను బియ్యం తెల్లగాను ఉండేరకం (కో. 7).

మైసూరువంకెలు ఉ. మైసూరొంకెలు (రా. 11).

వజ్జానం ఒకరకం ముతకవడ్లు; నీటిముంపుడుదు ఆగేరకం (కో. 42, 43).

వన్నిస్‌నెంబరు (<హిం. ఉన్నీస్-) MTU (మార్టేరు) 19 వ నెంబరు కుసుమ (తె. 5, 16, 18, 29).

వరి ఉ. అరి, ఒరి (బహు. వడ్లు). ఒకరకం ఆహార ధాన్యం (కో. 2-9, 12, 26-28, 30-34, 36-51; తె. 1, 11, 13-17, 19, 20, 24-28, 30, 31, 41; రా. 2-8, 11, 13-20, 22, 23, 25, 28).

వాముసంబారీలు ఉ. ఓమసంబారీలు (తె. 29).

వాసనవడ్లు సువాసనగల కొన్ని ధాన్యభేదాలు ; తులసీ పూలు, కాకిరెక్కలు మొ. వి. (తె. 4, 6, 33; రా. 25, 26).

వెదల్పులు ఉ. ఎదల్పులు (కో. 27; తె. 41).

వెండిపూలు అయిదు నెల్ల పంట; గింజ సన్నం; కిచిడీ సాంబా కావచ్చు (కో. 9, 13; రా. 23, 25, 26).

వెండిపడ్లు ఎం. టి. యు నెంబరు వడ్లు (రా. 6).

శకరాలు 'చెక్కరలు' అని గూడా అంటారట (తె. 11).

షష్టికలు చూ. సత్తిగలు. 60 రోజులపంట (తె. 39).

సత్తిగలు చూ. షష్టికలు (కో. 44).

సన్నం (బహు. సన్నలు, సన్నాలు) సన్నవడ్లు; కిచిడీలు మొ. వి (కో. 3-8, 13, 16, 17, 19-23, 25, 26, 28, 29, 31, 33-37; 41-45; తె. 1, 5, 6, 9, 11, 24, 28, 32-42; రా. 4-6, 8, 13, 15, 17-20, 27, 28); భేదాలు : ఆకుసన్నం పలిక రకం; గింజ బాగా సన్నం (కో. 13; తె. 37):

ఊరదసన్నం ఉ. ఓదసన్నం. మెట్టవడ్లలో గింజ సన్నం రకం (కో. 42, 45).

ఎర్రసన్నం ఉ. ఎరసన్నం, ఎర్రజన్నం. రెండో పంట వడ్లు; TKM-4 వ నెంబరు (కో. 21, 36, 44; రా. 4-6, 20).

ఓలపాటిసన్నం (కో. 45).

కపిలసన్నం వడ్లు నలుపు, బియ్యం తెలుపు రకం (రా. 15).

కారుమూరుసన్నం (కో. 17, 19).

కాశ్మీరుసన్నం 'బాస్మతి' అనే పులావు ధాన్యం కావచ్చు (కో. 45).

గరికసన్నం ఉ. గెరికసన్నం. దాళవాపంట వడ్లు; MTU-9 వ నెంబరు (కో. 4, 15, 26, 43, 44; తె. 6, 33, 35, 36, 38).

గుణుపురంసన్నం ఒరిస్సా ప్రాంతంలో పండే సన్న రకం; AKP (అనకాపల్లి) 3 వ నెంబరు దీనికి చెందినది (కో. 4).

గుంటూరుసన్నం మార్టేరు 19 వ నెంబరు కుసుమకావచ్చు (తె. 1).

చపుటసన్నం ఉ. సొటసన్నం. చవిటినేలల్లో వేసే సన్న రకం (రా. 6).

జిలకరసన్నం (కో. 43).

టేకుసన్నం (తె. 11).

తిమ్మసంద్రంసన్నం తిమ్మసముద్రం అనే ఊళ్ళో పండించే సన్నరకం (కో. 44).

తెల్లసన్నం (కో. 21; తె. 40; రా. 5, 6).

తోకసన్నం రెండోపంటకువేసే రకం; SLO(సామర్లకోట) 19 వ నెంబరు (కో. 34).

దుబ్బసన్నం ఉ. దుబ్బుసన్నం (తె. 36, 37).

దులపసన్నం (తె. 6).

దేశవాళీసన్నం (కో. 45).

దొడ్డసన్నం (తె. 31).

దోమసన్నం (తె. 33).

నానెల్లసన్నం నాలుగునెల్ల పంట; పిచోడీలు కావచ్చు (తె. 1).

నెంబరుసన్నం GEB-24 వ నెంబరు సన్నం గాని లేక సన్నకుసుమ, మార్టేరు 19 వ నెంబరు కాని కావచ్చు (కో. 23).

నెల్లూరుసన్నం చూ. మొలకొలుకులు (కో. 35, 44).

పాలసన్నం (తె. 11, 24, 28, 29, 32-35, 38, 39, 42).

పిచ్చికసన్నం ఉ. పిచికసన్నం. కిచిడీసాంబా కావచ్చు (కో. 41, 45).

పుల్లసన్నవడ్లు ఉ. పుల్లసనొర్లు, పుల్సనొర్లు. చిత్తూరు ప్రాంతంలో పండించే రకం; గింజ తెల్లగా సన్నగా ఉంటుంది (కో. 7; రా. 4, 6).

పూతసన్నం (కో. 44).

పెద్దసన్నం (తె. 35).

బడెసన్నం (కో. 45).

బసవయ్యసన్నం 'మొవ్వ' అనే ఊళ్ళో 'బసవయ్య' అనే ఆయన మొదట వీటి విత్తనం కట్టాడట; ? క్రిష్ణకాటుకలు (కో. 22, 28).

మదనపల్లిసన్నం TKM-4 వ నెంబరు చూ. ఎర్రసన్నం (రా. 4).

మదుసన్నం (తె. 11).

ముద్దసన్నం (తె. 35).

మూణ్ణెల్లసన్నం ఉ. మూనెలసన్నం, మూన్నెల్లసన్నం ? కాశీపిచోడీలు (తె. 1, 6).

మైలసన్నం (తె. 35, 36).

**వంకసన్నం** ఢిల్లీభోగాలకు, కాశీపిచోడీలకు కూడా ఈ పేరు వాడతారు (కో. 13, 16, 17, 19, 20, 22, 25, 26, 29, 31, 35; తె. 39, 41).
**వామనసన్నం** ఓవసన్నం (తె. 9, 34).
**సింధిరిసన్నం** (తె. 40).
**సుంకిసన్నం** ఉ. సుంకుసన్నం. శ్రీకాకుళం, విశాఖజిల్లాల్లో పండించేరకం; అనకాపల్లి-2 వ నెంబరు దీనికి చెందినది (కో. 44, 45).

సన్నపొర్లు (కో. 31).

సన్నవరులు (కో. 45).

సమరసారికలు (తె. 42).

సంబావులు ఉ. సంబవులు, సంభవులు, సంభావులు; చూ. సాంబ (కో. 5, 7, 9, 17, 20, 22, 23, 36, 44; తె. 1, 9; రా. 1, 2, 4, 6-9, 27); భేదాలు :
**అల్లీసంబావులు** గింజ సన్నంరకం (రా. 2).
**కణింగసంబావులు** ఉ. కణింగసంబవులు (< ?కళింగ-). 'బయాహుండా' కావచ్చు (రా. 1).
**కిచిడీసంబావులు** ఉ. కచిడీసంబవులు, కిచిడీసంబవులు, కిచ్చిడీసంబావులు. GEB-24 వ నెంబరు ధాన్యం (కో. 44; రా. 1, 2, 4, 9).
**కోయంబత్తూరుసంబావులు** కిచిడీసాంబా లేక కోయంబత్తూరు 2 వ నెంబరు (కో. 9, 17, 23; రా. 1).
**గరికెసంబావులు** ఉ. గిరికిసంబావులు, గెరికెసంబవులు. ?గరికెసన్నాలకే మరొక పేరు (రా. 1, 2).
**చిన్నసంబావులు** (తె. 9; రా. 2).
**నీరుడుసంబావులు** ఉ. నీరుడుసంబవులు, నీడుడుసంభావులు. ముదుగుకు ఆగేరకం (రా. 1).
**పట్టిడిసంబావులు** ఉ. పట్టిడిసంబవులు (రా. 1).
**పెద్దసంబావులు** (కో. 36; తె. 1; రా. 6).
**బుడ్డసంబావులు** బుడ్డసంబవులు. తేలికరకం (తె. 1; రా. 2).
**మట్టిసంబావులు** ఉ. మట్టిసంబవులు, మట్టిసంభావులు. వడ్లు నల్లగాను, బియ్యం తెల్లగాను ఉండే రకం (తె. 1).
**రత్నసంబావులు** ఉ. రత్నసంభావులు (కో. 23; రా. 1).
**వాడసంబావులు** ఉ. వాడసంబవులు. తమిళదేశపురకం; నీటి యెద్దడికి ఆగుతుంది (తె. 1).
**సన్నసంబావులు** ఉ. సన్నజంబావులు. కిచిడీసాంబా (రా. 1).
**స్వర్ణసంబావులు** ఉ. సొర్ణసంబవులు. సొర్ణసంబావులు; రూ. స్వర్ణసాంబవులు. తేలికరకం; రెండోపంటగా వేస్తారు: 'కిచిడీసాంబా'కు కూడా ఈ పేరు వాడతారట (తె. 1).

సాంబ(లు) ఉ. సంబా, సంబం, సాంబా (<తమిళ : సంబా = ఆగస్టు-సెప్టెంబరులో నాటబడే పంటకాలం) రూ. సంబావులు, సాంబవులు, సాంబార్లు. మంచి సన్నరకం వడ్లు; GEB-24 దీంట్లో ఎంచిన రకం (కో. 7, 12, 36, 44; తె. 11, 29, 31-37, 39, 40, 42); భేదాలు :
**ఇసకసాంబ** ఉ. ఇసెకసాంబా (తె. 40).
**ఏపురుసాంబ** (తె. 32).
**ఓవసాంబ** (తె. 31).
**కిచిడీసాంబ** ఉ. కిసినిసాంబ (కో. 36).
**జంగలీసాంబ** (తె. 37).
**జడసాంబ** (తె. 32, 33, 37, 39, 42).
**నీరుసాంబ** ఉ. నీరుసంబా. ? చూ. నీరుడుసంబావులు (కో. 5).
**వంకసాంబ** (తె. 32).
**సర్కారుసాంబ** కిచిడీసాంబా; GEB-24 వ నెంబరు
**సిరిసాంబ** (కో. 12; తె. 33, 37, 39).

సాంబవులు ఉ. సాంబావులు, సాంభవులు; చూ. సాంబ (కో. 6, 14, 20, 22; 6, 11, 12). భేదాలు :
**గుండ్రసాంబవులు** (కో. 20, 22).
**స్వర్ణసాంబవులు** చూ. స్వర్ణసంబావులు (కో. 6).

సాంబార్లు ఉ. సాంబర్లు, సామ్మర్లు; చూ. సాంబ(లు) (తె. 1, 4, 5, 7-9, 22).

సాంబ్రాణీలు కిచిడీలకే మరొక పేరట (తె. 23).

సాలబత్తలు (రా. 17).

సాలంపురి (తె. 28).

సిపాయీలు (రా. 17).

సీతమ్మవారిచిక్కుళ్ళు (కో. 34).

సీతసాగరాలు (కో. 44).

సూదివడ్లు (రా. 28).

సూపనారాయణలు (తె. 32, 33).

సూర్యనాట్లు (కో. 30).

## 2. ఇతర ధాన్యాలు

**అట్నాలు** పర్యా. బట్టగాళ్ళు. ఒకరకం పప్పు దినుసు; బటానీలు; (The garden pea) *Pisum sativum*; ఉత్తర హిందూస్థానంలో ఎక్కువగా పండిస్తారు (తె. 17).

**అనుము** ఉ. అనవు, అనుం, అనువు. అలచంద మాదిరిగా ఉండే ఒకరకం పప్పుదినుసు; అయిదారు నెల్ల పంట; *Dolichos cultratus, D. Lablab,* Linn. (కో. 7, 9, 21, 30, 39, 41-43; తె. 1, 3, 4, 6, 8, 11, 18, 19, 21-28, 31-33, 37; రా. 2-6, 8, 10, 12, 14-18, 21); భేదాలు :
**ఎఱ్ఱనుము** (కో. 12; తె. 6, 37).
**చిక్కెరనుము** తెల్లగింజరకం (రా. 6).
**చేదనుము** నల్లగింజరకం (రా. 6).
**తెల్లనుము** (కో. 12; తె. 1, 6, 9, 37).
**నల్లనుము** (కో. 12, 39, 41; తె. 1, 6, 9, 37).
**పలకనుము** సన్నగింజరకం (తె. 11).
**పట్టనుము** కాయలు గుండ్రంగా ఉండేరకం (తె. 11).
**సెనగనుము** గుండ్రటిగింజరకం (రా. 15).

**అలచంద** ఉ. అలసంద, అలిచంద, అలిసెంద, అల్సంద, అల్సెంత, అల్సొంద; పర్యా. బబ్బెర, బొబ్బర. నాలుగైదునెలల్లో పండే పప్పుదినుసు; *Vigna catjang,* Endl., *Dolichos catjang,* Linn.: ఆకులు ఆకుపచ్చటిరంగు తయారీకి, గడ్డి పశువులమేతకు ఉపయోగిస్తాయి (కో. 4, 7-9, 11, 12, 23, 41-43, 45; తె. 3, 4, 6, 9, 13, 18, 27, 34, 37, 42; రా. 3-6, 8, 10, 12, 14-19, 21, 22, 24, 25, 27); భేదాలు :
**ఎనికోటలచంద** (కో. 43).
**ఎఱ్ఱలచంద** (కో. 41).
**ఎలబండలచంద** (కో. 45).
**చిన్నలచంద** (కో. 11).
**తెల్లలచంద** (కో. 41).
**నల్లలచంద** (కో. 41).
**పెద్దలచంద** (కో. 11; రా. 6).
**సన్నలచంద** (రా. 6).

**అరికె** ఉ. అరిక, అరిగ, అరుక (బహు. అరికెలు, అళ్ళు). ఒకరకం ఆహారధాన్యం; *Paspalum frumentaceum* (కో. 4-9, 14, 15, 39, 42; తె. 1, 3, 4, 6, 9, 13, 27, 29, 39, 41; రా. 5, 7, 10, 12, 16, 18, 24-28). భేదాలు :
**గిడ్డారికె** (కో. 9).
**నట్టారికె** పర్యా. నరిగె(లు) (తె. 4, 9).
**పెద్దారికె** (తె. 9).
**బొంతారికె** (రా. 25, 28).
**సన్నారికె** (25, 28).

**ఉలవ** ఉ. ఉల్వ. నాలుగునెల్లలో పండే ఒకరకం పప్పుదినుసు; గింజలు ఉడికించి గుఱ్ఱాలకు దాణాగావేస్తారు; గడ్డి పశువులమేతకు వస్తుంది; ఈపంటవేస్తే భూమికి సత్తువ వస్తుందట; *Dolichos uniflorus,* Lam., *D. biflorus,* Linn. (కో. 3, 5, 6, 10, 11, 14, 15; 21-23, 28-30, 32, 34-36, 39, 41-43, 45; తె. 1, 4, 5, 7-10, 12, 13, 16, 17, 19-33, 35, 42; రా. 1-3, 6-10, 12, 17, 18, 20, 21, 27); భేదాలు:
**ఇందులవ** (కో. 3).
**ఎఱ్ఱులవ** (కో. 10).
**చారులవ** (<చార + ఉలవ) (కో. 35).
**చిట్టులవ** (కో. 35).
**తెల్లులవ** (కో. 10, 11, 22, 36, 39, 41, 43, 45; తె. 9, 35; రా. 6).
**దేశులవ** (కో. 35, 36).
**నల్లులవ** (కో. 5, 6, 10, 11, 22, 33, 41, 43, 45; తె. 9, 35; రా. 6).
**నాటులవ** (కో. 28).
**పిచ్చులవ** సన్నగింజ రకం (కో. 5).
**పూరద పిట్టులవ** (కో. 45).
**పెద్దులవ** (కో. 5, 6).
**మెట్టులవ** (కో. 3).
**సీములవ** (కో. 28, 35, 36).

**ఊదర(లు)** 'ఊదర' అనే ఒకరకం తృణధాన్యం; *Panicum flavidum,* Retz., *P. brizoides,* Jacq ; గింజ గుండ్రంగా ఉంటుంది; చాలాకాలం నిలవఉన్నా పుచ్చు పట్టదు; కొద్దిమంది ఆహారధాన్యంగా ఉపయోగిస్తారు; అరుగుదల కష్టం (కో. 43); భేదాలు :
**పెద్దూద(లు)** (కో. 43).
**బుర్రూద(లు)** (కో. 43).

**ఎవలు** (<యవలు) (బహు.) బార్లీ ధాన్యం; ? *Hordeum hexastichon,* Linn. (తె. 1, 9) : భేదాలు :
**మంచెవలు** మనుష్యులు తినేవి (తె. 9).
**ముల్లెవలు** ఎద్దుల దాణాగా ఉపయోగించేరకం (తె. 9).

**కటానం** పప్పుదినుసు లన్నిటికీ సామాన్యంగా వాడే

పేరు (తె. 20,21, 23).

**కంది** (బహు. కందులు, కండ్లు) పర్యా. తొగరు. ఆంధ్రదేశంలో ఎక్కువగాపండించే పప్పుదినుసు; (Congo pea or Pigeon pea) *Cajanus indicus*, Spreng (కో. 4, 5, 7, 8-11, 13-15, 17-19, 21-23, 29-32, 39, 41-45; తె. 1, 3, 5-7, 9, 12, 13, 21, 22, 24-29, 32-39, 41, 42; రా. 2-12, 14-28); భేదాలు:
**ఉత్తరాదికంది** (కో. 22).
**ఎర్రకంది** ఉ. ఎరకంది (కో. 15; తె. 1, 3, 5, 6, 9, 11, 12, 29, 33, 34).
**కారెకంది** కొంచెం గింజ నలుపురకం (తె. 1).
**కుమ్మరికంది** (కో. 45).
**కొండకంది** (కో. 29, 41, 44).
**కొమ్ముకంది** (కో. 10, 12).
**గుత్తికంది** (కో. 10-12, 14; తె. 38).
**చిన్నకంది** (తె. 38).
**చిరుకంది** ఉ. సిరికంది (కో. 18, 19, 39, 41, 45).
**జడకంది** (కో. 5, 13, 18; తె. 37, 39).
**తెల్లకంది** ఉ. తెల్లకంది (కో. 10, 15; తె. 1, 3, 6, 9, 11, 12, 29, 33, 34, 38).
**తోటకంది** (రా. 15).
**దిన్నెకంది** మెట్టలోపండే కంది (రా. 15).
**దేశికంది** (కో. 6, 9, 11-14; రా. 27).
**నడిపికంది** (కో. 45).
**పచ్చకంది** (తె. 1).
**పరింకంది** (కో. 45).
**పితపకంది** (కో. 19).
**పూతకంది** (తె. 3).
**పెద్దకంది** (కో. 18, 19, 21, 23, 29, 44, 45; తె. 10, 38, 39; రా. 6, 28).
**పోతుకంది** (కో. 23).
**బళ్ళారికంది** (కో. 6, 9, 11, 12, 14, 21, 29, 31; తె. 37, 39; రా. 27).
**బిళ్ళకంది** (కో. 39, 41).
**బుడ్డకంది** (కో. 44).
**బూతకంది** (తె. 5, 9).
**బోడికంది** (కో. 45).
**మోదంకంది** వర్షం ఎక్కువగా పడ్డా పండేరకం (తె. 3).
**సన్నకంది** (తె. 10; రా. 28).
**సోడాపూర్కంది** (కో. 13).

**కంబు** (<తమిళ: కంబు=సజ్జలు) పర్యా. చూ. సజ్జ. ఒకరకం ఆహారధాన్యం; నాలుగైదునెల్ల మెట్టపంట (Spiked millet) *Panicum spicatum*, Roxb., *Holocus spicatus*, Linn. (కో. 1; రా. 1, 2).

**కొర్ర** ఉ. కొర (బహు. కొర్రలు, కొర్లు). చామల మాదిరిగా ఉండే ఒకరకం ఆహార ధాన్యం; (The Italian millet) *Panicum italicum*, Linn., *Setaria italica*, Beauv; దంచిన గింజలను అన్నంగాను, సంకటిగాను, వండుకుతింటారు; గడ్డి పశువుల మేతగా ఉపయోగిస్తుంది (కో. 4-6, 8, 11, 13, 14, 24, 25, 30, 35, 39, 41-43, 45; తె. 1, 3, 4, 6-13, 18, 21, 24-29, 32-34, 37, 39-41; రా. 1, 3-5, 7, 9, 10-12, 14, 28); భేదాలు:
**అండకొర్ర** గుండ్రంగా ఉండే చిన్నగింజరకం (రా. 15, 16).
**అనుముంతకొర్ర** (కో. 45).
**అసకొర్ర** (కో. 45).
**ఇటికొర్ర** గడ్డి ఎక్కువగా పెరిగి గింజలు తక్కువ అయ్యేరకం (రా. 15).
**ఉమ్మకొర్ర** తొంభై రోజుల్లో పండేరకం (రా. 25).
**ఎరకొర్ర** ఎరుపు గింజరకం (కో. 12, 45; తె. 3, 10; రా. 16).
**కట్టెకొర్ర** (తె. 9).
**కురవకొర్ర** కంకి నల్లగా ఉండేరకం (రా. 9).
**కొయకొర్ర** (కో. 45).
**గోనెకొర్ర** (కో. 11).
**గొతుడుకొర్ర** రూ. గొతుముకొర్ర. నాలుగునెల్లపంట; బాగా ఎత్తు పెరుగుతుంది; గింజ ఎర్రగా ఉంటుంది (కో. 9, 13).
**గొతుముకొర్ర** చూ. గొతుడుకొర్ర (కో. 13).
**చిప్పెకొర్ర** చూ. జడకొర్ర (తె. 9; రా. 25, 28).
**చేమకొర్ర** ఉ. శామకొర్ర (కో. 12, 25).
**జడకొర్ర** ఎన్ను జల్లిగా జడలాగా ఉండేరకం (కో. 9, 10, 11, 13; తె. 3, 6, 33, 34, 37, 39; రా. 16).
**జల్లికొర్ర** (తె. 33).
**జుబ్బుడుకొర్ర** (రా. 15).
**తుప్పెడకొర్ర** తుప్పడకొర్ర (తె. 4, 6).
**తెల్లకొర్ర** గింజ తెలుపురకం (తె. 9, 45).
**తోటకొర్ర** మూణ్ణెల్లపంట (కో. 9; రా. 27, 28).
**నల్లకొర్ర** గింజనలుపురకం (కో. 45; తె. 9).
**పొటుకొర్ర** (తె. 40).
**పాలకొర్ర** ఉ. పాలకొర్ర. కంకి ఎర్రగాను, బియ్యం తెల్లగాను ఉండేరకం; బావులకింద తోటల్లో వేస్తారు (కో. 10, 11).

**పెద్దకొఱ్ఱ** ఉ. పెదకొర. లావుగింజ రకం (కో. 10, 13; తె. 9, 42; రా. 9).
**పోటుకొఱ్ఱ** ఉ. పోటుకొర (కో. 41, 45).
**పోడికొఱ్ఱ** (కో. 41).
**బొచ్చుకొఱ్ఱ** (కో. 12).
**బోడకొఱ్ఱ** ఉ. బోడకొర, బోడికొఱ్ఱ. ఎన్ను గుండ్రంగా ఉండి మీద పీచులుండే రకం (కో. 12; తె. 4, 37, 39; రా. 15, 16, 18, 27).
**మంచుకొఱ్ఱ** ఉ. మంచకొఱ్ఱ, మంచుకొర. ఎఱ్ఱటి గింజ రకం (తె. 9, 10, 40).
**ముద్దకంకికొఱ్ఱ** (కో. 35).
**ముద్దకొఱ్ఱ** (తె. 33).
**మొండికొఱ్ఱ** ఉ. మొండికొర (కో. 43, 45).
**రించకొఱ్ఱ** (కో. 45).
**లొచ్చుకొఱ్ఱ** ఉ. లొచ్చుకొర (తె. 36).
**వానకొఱ్ఱ** వానకాలం పండేరకం (తె. 10).
**శానకొఱ్ఱ** అయిదునెల్ల పంట (కో. 9, 11; రా. 25, 28).
**సన్నకొఱ్ఱ** ఉ. సన్నకొర (రా. 27).

**గంటె** ఉ. గంటి; పర్యా. చూ. సజ్జ. మెట్టభూముల్లో పండించే ఒకరకం ఆహారధాన్యం; (Spiked millet) *Pennisetum typhoideum*, Rich.; సజ్జగింజలతో అన్నం వండుకొంటారు; పిండి రొట్టెకు ఉపయోగిస్తుంది; నాలుగైదునెల్లపంట (కో. 33, 35, 39, 41-43, 45); భేదాలు :
చిన్నగంటె ఉ. సినగంటి (కో. 43).
**దేశవాళీగంటె** (కో. 39).
పాలగంటె తెల్లసజ్జ (కో. 39).
పిట్టగంటె (కో. 33, 41, 43, 45).
పునాసగంటె (కో. 45).
పెడగంటె (కో. 45).
పెద్దగంటె (కో. 33, 35, 41, 43).
పొట్టిగంటె (కో. 33).
బడెగంటె పెద్దగంటెలు (కో. 45).
బొడసరంగంటె (కో. 43).

గునకలు ఒకరకం తృణధాన్యం; a sort of wild grain (Br.) (తె. 1).

గోధుమ(లు) ఉ. గోదుమ, గోధ్మ. ఒకరకం ఆహారధాన్యం; (Wheat) *Triticum sativum*; నూక అన్నం వండుకోటానికి, పిండి రొట్టె మొ. వి చేసుకోటానికి ఉపయోగిస్తుంది (కో. 13, 22, 30; తె. 9, 17, 19-21, 23-25, 28, 30, 32, 33; రా. 18, 21); భేదాలు :
**ఎఱ్ఱగోధుమ** గింజ ఎఱ్ఱగా పొడుగ్గా ఉండేరకం; రవ్వకు ఉపయోగిస్తుంది (తె. 33).
కట్టెగోధుమ గింజ ఎఱ్ఱగా పొడుగ్గా ఉండేరకం (తె. 9).
తెల్లగోధుమ తెల్లగింజరకం; పిండిగోధుమ (తె. 9).
పిండిగోధుమ పిండికి ఉపయోగించే తెల్లటి పొట్టిగింజ రకం (కో. 13).
పొట్టిగోధుమ చూ. పిండిగోధుమ (తె. 33).
బుడ్డగోధుమ చూ. పిండిగోధుమ (తె. 9).
**బోడిగోధుమ** (తె. 32).
ములుగోధుమ (తె. 32, 33).
రవ్వగోధుమ ఉ. రొవ్వగోధుమ; చూ. ఎఱ్ఱగోధుమ (కో. 13).

**చామ** ఉ. శామ, సామ, సావ, సోమ, సోవ. ఆవాలు మాదిరిగాఉండే ఒకరకం ఆహారధాన్యం; *Panicum frumentaceum*, Roxb., *P. oplismenus frumentaceus*, Kunth., *Echinochloa frumentacea*, Link; గింజలకు ఏడుపొరలు పొయ్యేట్టు దంచిన తరవాత వచ్చిన బియ్యాన్ని అన్నంగా వండుకొంటారు; ఇసకనేలల్లోను, ఒండునేలల్లోను బాగా పండుతుంది; తొందరగా కోతకు వచ్చేపంట; గడ్డి పశువులకు ఉపయోగిస్తుంది (కో. 25, 31, 45; తె. 1, 5, 6, 13, 18, 24-27, 29, 32, 40, 42; రా. 3-5, 10, 14, 17, 18, 25). భేదాలు :
**అరచామ** ఉ. అరశామ (రా. 4).
చిన్నచామ ఉ. సిన్నసోవ (తె. 40).
జల్లిచామ ఉ. జల్లిసోవ (తె. 40).
**నుంజామ** (<నును+చామ) (తె. 27).
పునాసచామ ఉ. పునాస శామ (కో. 45).
పెద్దచామ ఉ. పెద్దశామ (కో. 45).

**చోడి** ఉ. సోడి (బహు. చోళ్ళు; ఉ. చోలు, సోల్లు, సోళ్ళు); పర్యా. చూ. రాగి. నాలుగైదు నెల్లలో పండే ఒక రకం ఆహారధాన్యం; *Eleusine coracana*, Gaertn., *Cynosurus coracanus*; దంచిన గింజలు సంకటిగాను, పిండి రొట్టెగాను ఉపయోగిస్తారు; గడ్డి పశువుల మేతకు వస్తుంది (కో. 31, 36, 39, 41-45); భేదాలు :
**ఊడ్పుచోడి** ఉ. ఉడుపుచోడి. నారు చేలో తిరగనాటి (మాగాణి సాగుతో) పండించే రకం (కో. 36, 39).
ఏడాకులచోడి (కో. 41).
కొయకాలుచోడి (కో. 43, 44).
కొరచోడి (కో. 41, 45).
గరుకుచోడి చూ. గరువుచోడి (కో. 36).
గరువుచోడి చూ. గరుకుచోడి. మెట్టసాగుతో పండిచే రకం (కో. 39).

**గోధుమచోడి** (కో. 43).
**జల్లుచోడి** (కో. 36).
**తొలతరిచోడి** (కో. 43).
**దసరాచోడి** (కో. 41).
**నల్లచోడి** (కో. 43).
**పునాసచోడి** ఉ. పునాచ్చోడి (కో. 45).
**పెద్దచోడి** ఉ. పెచ్చోడి (కో. 45).
**పైరచోడి** (కో. 43, 44).
**బురదచోడి** ఉ. బురచ్చోడి (కో. 43-45).
**ముద్దచోడి** (కో. 36).

**జొన్న** ఉ. జొన (బహు. జొంప్లు, జొన్నలు). తెలుగు దేశంలో విస్తారంగా పండించే ఒకరకం ఆహారధాన్యం; ఆంధ్రప్రదేశ్‌లో ఈ పంటపండించే భూమివిస్తీర్ణం సుమారు నూరులక్షల ఎకరాలు; (Indian millet) *Sorghum vulgare*, Pers., *Holcus sorghum*, Linn.; మెట్టలో వర్షాధారంతోగాని, బావులకింద నేలల్లో మాగాణి సాగుతోగాని పండిస్తారు; నాలుగైదునెల్లపంట; జూన్, జులై నెలల్లో వేసి సెప్టెంబరు, అక్టోబరునెలల్లో కోస్తారు; దంచిన గింజలు అన్నంగా వండుకోటానికి, పిండి రొట్టెకు ఉపయోగిస్తాయి (కో. 3, 5, 6,8-15, 18-25, 27-32, 34-36, 39, 41, 43, 45; తె. 1, 3-18, 20-42; రా. 2-6, 8, 10, 12, 14-28); భేదాలు:

**అయినాపూరుజొన్న** ఒకరకం తెల్లజొన్న (తె. 9).
**అరబ్బీజొన్న** రూ. రబ్బీజొన్న. తెల్లజొన్నలో ఒక రకం; ఎండాకాలంలో వేసే పంట (తె. 14).
**ఆముజొన్న** పచ్చజొన్నలో ఒకరకం (తె. 18).
**ఇచ్చెన్నుజొన్న** ఒకరకం తెల్లజొన్న; కంకి జల్లి (సళ్ళు)గా ఉంటుంది; దీనిలో ఎంచిన రకం అనకాపల్లి -2 వ నెంబరు; చూ. కొండజొన్న (తె. 6).
**ఇలాయిజొన్న** కంకి ముద్దగా ఉండేరకం; దీంట్లో ఎంచిన రకాలు నంద్యాల 1, 2 నెంబర్లు (కో. 31).
**ఎనముందుజొన్న** (కో. 6).
**ఎర్రజొన్న** ఉ. ఎరజొన్న, ఎర్జొన్న, గింజ ఎర్రగా ఉండే చాలారకాలు; ఎంచినరకం గుంటూరు 4 వ నెంబరు (కో. 10, 11, 13, 15, 18, 19, 27, 29, 30, 32, 34-38, 41; రా. 25, 27).
**ఎర్రపాలపుజొన్న** ఒకరకం ఎర్రజొన్న; చూ. పాలపు జొన్న (రా. 27).
**ఎర్రముల్లిజొన్న** ఒకరకం ఎర్రజొన్న (తె. 34).
**ఏడాకు(ల)జొన్న** ఒకరకం పచ్చజొన్న; ఒక్కొక్క మొక్కకు ఏడాకులు మాత్రమే ఉంటాయి; కంకి జల్లిగా ఉంటుంది; ఎక్కువగా నల్లనేలల్లో పండుతుంది (కో. 9, 12; తె. 28, 32, 33, 39; రా. 25).
**కట్టెపురిజొన్న** (తె. 11).
**కాకిజొన్న** బొంతు నల్లగాఉండేరకం; పశువుల మేతకు ఎక్కువగా ఉపయోగిస్తారు (రా. 6).
**కాకిబుసితేలు** (బహు.) బొంతునల్లగా ఉండేరకం (తె. 36).
**కాకిమారుజొన్న** ఉ. కాకిమోరజొన్న. పొట్టు (బొంతు) నల్లగాను, గింజ తెల్లగాను ఉండేరకం; జల్లికంకి (రా. 15).
**కిరీటాలు** గింజను బొంతు పూర్తిగా ఆవరించి ఉండే రకం (తె. 9).
**కుడుములజొన్న** పిండితో కుడుములు చేసుకోటానికి ఉపయోగించే సన్నగింజరకం (తె. 4).
**కొండజొన్న** కొండప్రాంతాల్లో ఎక్కువగా పండించే రకాలు; గింజ తెలుపు ఎరుపు కావచ్చు; కంకి జల్లిగా ఉంటుంది; ఎంచిన రకం అనకాపల్లి- 2 వ నెంబరు (కో. 27, 29-31, 35, 36; తె. 40, 42).
**గిడ్డజొన్న** ఉ. గిడజొన్న, గెడ్డజొన్న. ? మొక్క పొట్టిగాఉండే రకం (కో. 6, 10, 13, 14, 18; రా. 16).
**గిద్దజొన్న** (కో. 12).
**గిద్దమారిజొన్న** చూ. గిడ్డజొన్న (తె. 32, 37).
**గుండుజొన్న** గింజ, కంకి గూడా ముద్దగా గుండ్రంగా ఉండే పచ్చజొన్నలో కొన్ని రకాలు; నల్లనేలల్లో ఎక్కువగా పండుతుంది; ఎంచిన రకాలు నంద్యాల 7, 9 నెంబర్లు (తె. 10).
**గువ్వగుత్తిజొన్న** కంకి ముద్దగా ఉండేరకం (కో. 30).
**గోధుమజొన్న** పొట్టు గోధుమవర్ణంగా ఉండే రకం (కో. 30-32; తె. 41).
**చిటిముత్యాలు** ఉ. సిటిముత్తేలు. తెల్లజొన్నల్లో సన్న గింజ రకాలు (తె. 9).
**చిత్తజొన్న** చిత్తకార్తెలో ఎక్కువగా నల్లనేలలో వేసే రకం; దంటు తియ్యగా ఉంటుంది; గొడ్లమేతకు మేలైన రకం (కో. 11, 13, 29; తె. 39; రా. 14, 15).
**చిత్తపచ్చజొన్న** చిత్తకార్తెలో వేసే పచ్చజొన్న (తె. 6; రా. 26).
**చిలకపచ్చజొన్న** చూ. పచ్చజొన్న (కో. 12).
**చెంచుజొన్న** పచ్చజొన్నలో ఒకరకం (తె. 38).
**చెరుకు(పచ్చ)జొన్న** ఉ. చెరుక్కజొన్న, చెరుకుపజ్జొన్న; ? రూ. చెరుకు వెచ్చజొన్న. పచ్చజొన్నలో కొన్ని రకాలు; ఎంచిన నెంబర్లు నంద్యాల 1, 2 (తె. 28, 31; రా. 20, 25, 26, 28).
**చెరుకువెచ్చజొన్న** ఉ. చెరకువెజ్జొన్న. చూ. చెరుకు (పచ్చ)జొన్న (తె. 3; రా. 23).
**జల్లిజొన్న** పచ్చజొన్నల్లో ఒకరకం; కంకి జల్లిగా

ఉంటుంది; చూ. ఏడాకులజొన్న (కో. 27, 32, 36; తె. 34, 39).

**జల్లివెచ్చజొన్న** చూ. జల్లిజొన్న (తె. 39).

**జింకపురిజొన్న** ఎఱ్ఱనేలల్లో పండే ఒకరకం జొన్న; కంకిరెళ్ళు జింకకొమ్ములమాదిరి వంపుతిరిగి ఉంటాయట; మూడున్నరనెల్ల పంట (రా. 16).

**జెడబొంబాయిజొన్న** ఉ. జెడబొమ్మాయి. షోలాపూరు నుంచి తెచ్చినవాటిల్లో ఒకరకం (తె. 41).

**తెల్లజొన్న** ఉ. తెజ్జొన్న. అక్టోబరు, నవంబరు నెలల్లో వేసేరకాలు; గింజ తెల్లగాను, ఎన్ను ముద్దగాను ఉంటుంది (కో. 3, 6, 8, 10-15, 18, 27, 32, 34-36, 39, 41, 45; తె. 1, 3-8, 11-13, 16, 18, 25, 26, 28-33, 38, 39, 41; రా. 16, 18, 21, 22, 25).

**తెల్లపచ్చజొన్న** (తె. 31).

**తెల్లపాలపుజొన్న** చూ. పాలాపుజొన్న (రా. 27).

**తెల్లబొంబాయి** బొంబాయినుంచి తెచ్చిన కొన్నిరకాలు; ఉదా: షోలాపూరు M 47-3 (కో. 36).

**తెల్లమల్లిజొన్న** (తె. 34).

**తోకజొన్న** బొంత (పొట్ట) కొనదేరి ముళ్ళుగా ఉండేరకం (తె. 11).

**దఖాదిజొన్న** ఉ. దచ్చాదిజొన్న. (<దక్షిణాది-) కోయంబత్తూరుప్రాంతంనుంచి తెచ్చిన రకాలు; కోయంబత్తూరు 9, 11 నెంబర్లు (కో. 32).

**దుబ్బజొన్న** లావాటిగింజగల కొన్ని రకాలు (తె. 3).

**దొరజొన్న** విదేశాలనుంచి తెచ్చి వేసిన కొన్ని రకాలు (కో. 6).

**నల్లకూజొన్న** బొంతు (కంకిపొట్టు) నల్లగాఉండే కొన్ని రకాలు (రా. 15).

**నానెల్లజొన్న** నాల్గునెల్లలో కోతకువచ్చే రకాలు (తె. 11).

**నీరుజొన్న** బావులకింద తోటల్లో పండించేరకం; మూణ్ణెల్ల పంట (తె. 38).

**నేలమరిజొన్న** (కో. 12).

**పచ్చజొన్న** ఉ. పజ్జొన్న. గింజ పచ్చనిరకాలు; అన్నిటికంటె భోజనానికి శ్రేష్ఠం (కో. 3, 6, 11, 12, 19, 21, 24, 25, 27, 29, 31, 32, 34-36; తె. 1, 4-8, 10-14, 16, 25, 26, 28-33, 35-42; రా. 18, 21, 22, 25, 28).

**పచ్చమల్లిజొన్న** (తె. 34).

**పందిమూతిజొన్న** ఉ. పందిమూజ్జొన్న. కంకిపంది మూతిమాదిరి గుండ్రంగా ఉండేరకం; గింజ తెలుపు, బొంతు కొద్దినలుపు (తె. 33, 34).

**పసరుజొన్న** ఉ. పొసుపుజొన్న; చూ. పచ్చజొన్న (రా. 14-16).

**పాలజొన్న** చూ. తెల్లజొన్న (కో. 41).

**పాలాడిజొన్న** గింజ తెలుపురకం; ఎక్కువగా పశువుల గడ్డికోసం పండిస్తారు (కో. 3, 6, 9, 14, 15, 20, 21).

**పాలాపుజొన్న** ఉ. పాలాపజొన్న. బొంతు ఎఱ్ఱగా ఉండేరకం (కో. 27; తె. 39; రా. 27).

**పీలజొన్న** దంటు పీలగాఉండే పచ్చజొన్న; ఎంచిన రకాలు నంద్యాల 3, 4, 5 నెంబర్లు (రా. 25).

**పునాసజొన్న** ఎఱ్ఱనేలల్లో జూన్‌నెలలో వేసే రకాలు (తె. 38).

**పులిజొన్న** కంకిపొట్టు మసరరంగుగా ఉండేరకం (రా. 27).

**పుల్లజొన్న** ? కంకిపొట్టు ఎఱ్ఱగా ఉండేరకాలు (కో. 30; తె. 30).

**పెద్దజొన్న** ఉ. పెజ్జొన్న. పెద్దగింజరకం; ఆరునెల్ల పంట; అన్నానికి, పేలాలకు మంచిది (కో. 8-10, 13, 18, 19, 30, 32; తె. 18, 39).

**పేనాలజొన్న** (? < పేలాలజొన్న) సన్నగింజరకం (తె. 3).

**పైరజొన్న** చూ. పచ్చజొన్న (కో. 10, 11, 14, 15, 27).

**పైరపచ్చ(లు)** పచ్చజొన్నల్లో కొన్ని రకాలు (కో. 6).

**బరాటిజొన్న** (తె. 1).

**బియ్యపుజొన్న** తెల్లజొన్నల్లో ఒకరకం; ఆరునెల్ల పంట (కో. 29, 45).

**బుడ్డజొన్న** చూ. గిడ్డజొన్న (కో. 10; తె. 10).

**బుడ్డగిరిజొన్న** (తె. 32).

**బుడ్డతిమ్మాయి(లు)** పొట్టికంకి, పచ్చగింజగల రకాలు (తె. 1, 6, 11).

**బుడ్డమల్లె(లు)** కంకి గుండ్రంగా పొట్టిగా ఉండే రకాలు (తె. 7, 9).

**బుడ్డెఱ్ఱజొన్న** తక్కువకాలంలో పండే ఎఱ్ఱగింజ రకం (కో. 13).

**బెండజొన్న** గింజ బెండగింజలా ఉండేరకం; పేలాలకు మంచిది (తె. 18).

**బొంబాయిజొన్న** ఉ. బొమ్మాయి-, బొమ్మై-. షోలాపూరునుంచి దిగుమతి అయిన కొన్ని రకాలు (కో. 24, 25; తె. 32, 37, 40, 41).

**మందండీలు** లావుగింజగల కొన్ని రకాలు (తె. 9).

**మల్లె(మారి)జొన్న** 'మల్లె' పుట్టినా దెబ్బతినని రకాలు; ముఖ్యంగా తెల్లజొన్న (తె. 3, 10, 11, 13, 32, 34).

**మాగిజొన్న** తెల్లజొన్నల్లో కొన్ని రకాలు (తె. 28, 34, 35).

**మారండేయ** (తె. 11).

**మారుదండి(లు)** (తె. 10).

**మావరాలు** (తె. 13).

**ముంగారిపచ్చజొన్న** జూన్, జులై నెలల్లో వేసే పచ్చజొన్న రకాలు (రా. 19).

**ముత్యాలజొన్న** ఉ. ముత్తేలజొన్న. జల్లి కంకి, గుండ్రని గింజగల రకాలు (రా. 14, 15, 25).

**ముదురుజొన్న** చూ. పెద్దజొన్న (కో. 6, 14, 15, 27).

**ముద్దజొన్న** కంకి ముద్దగాఉండే రకాలు (కో. 27, 34, 36; రా. 6).

**ముద్దపచ్చజొన్న** (తె. 31, 29).

**ముప్పురిజొన్న** (తె. 1).

**ముసికెజొన్న** గింజను బొంతుపూర్తిగా ఆవరించి ఉండే కంకి గలరకం (తె. 1, 6, 33).

**మోడెంజొన్న** (తె. 38).

**రబ్బీజొన్న** చూ. అరబ్బీజొన్న (తె. 13).

**రాముడితలంబ్రాలు** ఉ. రాముడి తరంబ్రాలు. జల్లి కంకి, తెల్లగింజగల రకాలు; కొండ ప్రాంతాల్లో ఎక్కువగా వేస్తారు; ఎంచిన రకం అనకాపల్లి-2 వ నెంబరు (కో. 6, 14).

**రెల్లుజొన్న** పశువుల పచ్చిగడ్డికి మాత్రం పెంచేరకం (కో. 34).

**లక్కజొన్న** ఎర్రగింజ రకం (కో. 36).

**లంబాడిజొన్న** నల్లబొంతుతో ఉన్నరకాలు; చూ. కాకిజొన్న (తె. 6).

**వెచ్చజొన్న** ఉ. వచ్చజొన్న, వజ్జొన్న; చూ. పచ్చజొన్న (కో. 39, 41, 45).

**వెరంగిజొన్న** (కో. 45).

**శివుడితలంబ్రాలు** గింజ సన్నంగా తెల్లగా ఉండే రకం; పేలాలకు మంచిది (తె. 18).

**సాయిజొన్న** (తె. 13).

**సాలుజొన్న** ఉ. శాలుజొన్న. తెల్లజొన్నల్లో ఒకరకం (తె. 9, 10).

**సింగారపుజొన్న** సన్నగింజరకం; చూ. బియ్యపుజొన్న; సింహళం, మారిషస్ ద్వీపాల నుంచి మొదట దిగుమతి అయిన రకం (రా. 4).

**సీతతలంబ్రాలు** జల్లికంకి, తెల్లటి పెద్దగింజ రకాలు (తె. 36).

**సీతమ్మజొన్న** చూ. సీతతలంబ్రాలు (రా. 5, 6, 8).

**సీమజొన్న** పై దేశాలనుంచి తెచ్చిన కొన్నిరకాలు (తె. 41).

**సోలజొన్న** (తె. 1).

**తమిదె** ఉ. తమిద, తైద; పర్యా. చూ. రాగి. నీటివసరున్నభూముల్లో పండే ఒకరకం ఆహారధాన్యం; *Eleusine coracana*, Gaertn., *Cynosurus coracanus*; నాలుగునెల్ల పంట (కో. 3, 5, 16, 20, 21, 23, 24; తె. 1, 5, 7, 9, 10, 12-14, 27, 39; రా. 1). భేదాలు:

**ఎర్రతమిదె** ఉ. ఎరతైద (తె. 1, 9).

**జల్లితమిదె** (తె. 39).

**తెల్లతమిదె** (తె. 9, 37).

**నల్లతమిదె** ఉ. నల్లతైద (తె. 1, 37).

**ముద్దతమిదె** ఉ. ముద్దతమిద (తె. 39).

**తొగరు** ఉ. తొగరి (బహు. తొగళ్ళు); పర్యా. చూ. కంది. ఆంధ్రదేశంలో ఎక్కువగా పండించే పప్పుదినుసు; (Congo pea or Pigeon pea) *Cajanus indicus*, Spreng. (తె. 17-20).

**తొడెంగలు** ఒకరకం తృణధాన్యం (తె. 1).

**నరిగెలు** (1) ఒకరకం తృణధాన్యం; (2) అరికెల్లో విశేషం; చూ. అరికె (తె. 1; రా. 10).

**పిల్లపెసర** ఉ. పిల్లమిసర, పిల్లిపిసర. పెసరజాతికి చెందిన ధాన్యం; గింజ సన్నగాఉంటుంది; పచ్చిగడ్డి పశువుల మేతకు ఉపయోగిస్తుంది (కో. 3, 6, 15, 22, 26, 36, 39, 41, 45; రా. 1).

**పెసలు** (బహు; ఉ. పెసరు, పెసల్లు, పెసులు; విణ. పెసర, పెసరి) దేశమంతటా విస్తారంగా పండించే పప్పుదినుసు; (Green gram) *Phaseolus mungo*, Linn.; మెట్టపైర్లలో అక్కడిపైరుగా వేస్తారు; నాలుగైదు నెల్ల పంట; పచ్చిగడ్డి పశువులమేతగా ఉపయోగిస్తుంది (కో. 2, 3, 5, 6, 8-14, 17, 19, 21-23, 27-29, 31-34, 36-39, 41-43, 45; తె. 1, 3-14, 16-41; రా. 2-6, 8, 10, 12, 14-25, 27, 28); భేదాలు:

**ఆకుపెసలు** (కో. 6; తె. 29, 33, 39).

**కొమ్ముపెసలు** ఉ. కొమ్ముపెసర (కో. 6, 21; తె. 1, 31, 35-37, 39).

**తీగెపెసలు** ఉ. తీగపెసలు, తీగెబెసరు, తీవపెసలు (తె. 1, 18, 35, 42).

**తొలకరిపెసలు** (కో. 33).

**దేశిపెసలు** (తె. 10).

**నల్లపెసలు** ఉ. నల్లపెసర (కో. 2, 3, 5, 6, 8, 9-11, 13, 14, 19, 21-23, 27, 28, 32, 33, 36, 39, 41, 45; తె. 3, 6, 9, 11, 12, 29, 31, 33, 37-40).

**పచ్చపెసలు** ఉ. పచ్చబెసరు (కో. 2-6, 9-11, 13, 14, 22, 23, 27-29, 32, 36, 39, 41, 45; తె. 3, 6, 9, 11, 12, 18, 29, 31, 33, 35, 36, 38, 40; రా. 1, 6, 27, 28).

పరింపెసలు (కో. 45).
పుసాపెసలు (కో. 45).
పెద్దపెసలు (కో. 29; తె. 33, 34).
పైరపెసలు ? చూ. పచ్చపెసలు (కో. 33).
పొట్టుపెసలు (కో. 29).
పొలంపెసలు (కో. 43).
బంగారుపెసలు ఉ. బంగారుపెసర (కో. 22).
బందరుపెసలు (తె. 5, 9–11).
బిరుదపెసలు (కో. 39).
బూడిదపెసలు ఉ. బూడిదపెసర (కో. 21).
బొంతపెసలు చూ. నల్లపెసలు (రా. 6, 27, 28).
మేడపెసలు (కో. 4).
మోటుపెసలు 'మిటుకుళ్ళ'కే మరొక పేరట; చూ. మిటుకుళ్ళు (తె. 9).
సన్నపెసలు (తె. 33, 34).

**బట్టిగాళ్ళు** ఉ. బటగాళ్ళు; పర్యా. ఆట్నాలు. ఒకరకం పప్పుదినుసు; బటానీలు (The garden pea) *Pisum sativum* (తె. 11).

**బబ్బెర** చూ. బొబ్బర (తె. 13, 18, 19, 21–27).

**బరిగె(లు)** చూ. వరిగె (కో. 6; రా. 5, 10, 11, 18, 25).

**బాజరా** కొర్రలమాదిరిగా ఉండే ఒకరకం ఆహార ధాన్యం; పిండితో రొట్టెచేసుకొంటారు (తె. 18).

**బురకలు** ఉ. బుర్కలు. ఒకరకం తృణధాన్యం; గింజ సన్నగా, ఎర్రగా, గుండ్రంగా ఉంటుంది; దంచిన బియ్యాన్ని కొద్దిమంది అన్నంగా వండుకు తింటారుట (తె. 1, 18).

**బొబ్బర** (బహు. బొబ్బర్లు) రూ. బబ్బెర; పర్యా. చూ. అలచంద. నాలుగైదు నెలల్లో పండే ఒకరకం పప్పుదినుసు; *Dolichos catjang* Linn.; ఆకులు ఆకుపచ్చటిరంగు తయారీలోను, గడ్డి పశువులమేతగాను ఉపయోగిస్తాయి (కో. 30, 39, 41–43, 45; తె. 1, 6–8, 10, 12, 29, 32, 33, 36–38, 42); భేదాలు:
చిరుబొబ్బర (కో. 39, 41).
పెద్దబొబ్బర (కో. 39, 41).

**మక్క(లు)** చూ. మొక్క(జొన్న) (తె. 16, 17, 19–28, 30, 31, 40).

**మిటుకుళ్ళు** రూ. మెటికెలు. పెసలమాదిరిగా ఉండే ఒకరకం ధాన్యం (తె. 1, 3, 7, 34, 37; రా. 8, 18); భేదాలు:
గుండుమిటుకుళ్ళు (తె. 37).
తుప్పటమిటుకుళ్ళు (తె. 3).
దబ్బమిటుకుళ్ళు (తె. 37).
బోడిమిటుకుళ్ళు గింజ గుండ్రంగా ఉండేరకం (తె. 3).

**మినుము** ఉ. మినుగు, మినుపు, మిన్మ. అక్కడి పైరుగావేసే ఒకరకం పప్పుదినుసు; నాలుగునెల్ల పంట; (Black gram) *Phaseolus mungo*, Linn, *P. radiatus* (కో. 2, 4–6, 14, 17, 19, 21–23, 27, 29–32, 39, 41–43, 45; తె. 4, 9–11, 13, 14, 17–24, 26–29, 31, 32, 37, 40, 41; రా. 1); భేదాలు:
గంటుమినుము (తె. 40).
తీగెమినుము (కో. 19).
దుంపమినుము (కో. 41).
నల్లమినుము (కో. 19, 45).
నాటుమినుము (కో. 31, 41).
నేతిమినుము నునుపుగా, మెరుపుగా ఉండేరకం (కో. 19, 21).
పచ్చమినుము (కో. 45).
పెద్దమినుము (కో. 23, 27).
పొట్టిమినుము గింజ మెరుపుగా గుండ్రంగా ఉండేరకం (కో. 23).
బొంతమినుము (కో. 22).
మంచిమినుము (తె. 40).
సీమమినుము (కో. 31).

**మెటికెలు** ? చూ. మిటుకుళ్ళు (తె. 4).

**మొక్క(జొన్న)** ఉ. ముక్కజొన్న, మొక్కజొన్న; రూ. మక్క(లు). కొద్దిగా పండించే ఆహారధాన్యం; (Maize) *Zeamoys*, Linn; పిండి రొట్టెకు, గింజలు పేలాలకు ఉపయోగిస్తాయి; కంకులు పచ్చిగాగాని, కాల్చిగాని తింటారు; ఈపేరు 'మక్కాజొన్న' (Mecca corn) నుంచి వచ్చిందని కొందరి ఊహ; అమెరికానుంచి ఈపంట మిగిలిన దేశాలకు వ్యాపించింది (కో. 6, 14, 15, 20–22, 25, 27, 29–32, 35, 36; తె. 10, 11, 20, 32, 40, 42); భేదాలు:
ఎర్రబొంబాయిగింజ గింజ ఎరుపురకం (కో. 36).
ఎర్రమొక్కజొన్న గింజ ఎరుపురకం (కో. 35).
చిన్నమొక్కజొన్న (కో. 20).
నక్కమొక్కజొన్న ? చూ. లక్కమొక్కజొన్న (తె. 40).
లక్కమొక్కజొన్న పెద్ద కండెవేసే మొక్కజొన్న (కో. 14).
సీమమొక్క (కో. 35).

**రాగి** పర్యా. చోడి, తమిదె. మెట్ట సాగుతోను, మాగాణి సాగుతోను గూడా పండించే ఒకరకం ఆహారధాన్యం; *Eleusine coracana*, Gaertn., *Cyno-*

*surus coracanus*; గింజలు చల్లిగాని, నాట్లు వేసిగాని పండిస్తారు ; నాలుగైదు నెల్లపంట; దంచినగింజలు సంకటిగాను, పిండి రొట్టెగాను చేసుకుతింటారు; గడ్డి పశువుల మేతకు ఉపయోగిస్తుంది (కో. 3, 4, 6, 8-11 ; రా. 1-11, 14-18, 27) ;భేదాలు :

**ఎడగర్రాగి** (రా. 17).

**ఎర్రరాగి** ఎరుపుగింజరకం (రా. 9).

**కురవరాగి** ఉ. కురుపరాగి, కురుబరాగి. నల్లగింజ రకం; ఆయిదునెల్ల పంట (రా. 9, 15, 16).

**కోళగికొమ్ములరాగి** కోలగాఉండే ఎన్నులుగలది (రా. 17).

**కోలరాగి** (రా. 11).

**గిడ్డరాగి** మొక్క పొట్టిగాఉండేరకం ; మూణ్ణెల్ల పంట (రా. 15, 16).

**జానమద్దిరాగి** (రా. 17).

**తిరుపతిరాగి** (కో. 3).

**తెల్లజూరటు(రాగి)** ఎన్ను తెల్లగాఉండే రకం (రా. 1).

**నల్లజూరటు(రాగి)** ఎన్ను నల్లగా ఉండేరకం (రా. 1).

**పాలరాగి** తెల్లగింజరకం (కో. 9; రా. 17, 27).

**పెద్దరాగి** (కో. 3 ; రా. 15-17, 27).

**బాలపెట్టిరాగి** నాలుగునెల్లపంట (రా. 15).

**మజ్జిగరాగి** (రా. 16).

**మబ్బురాగి** (కో. 9).

**ముద్దరాగి** ఎన్ను ముద్దలాగా ఉండేరకం (రా. 9, 11, 18, 27).

పడిపిక్కు ఒకరకం తృణధాన్యం (తె. 1).

పరిగె(లు) రూ. బరిగె(లు). ఒకరకం ఆహారధాన్యం: *Panicum miliaceum*, Linn.; దంచినగింజలు అన్నం వండుకోటానికి, గడ్డి పశువులకు ఉపయోగిస్తాయి ; రెండు మూడు నెలల్లో కోతకువచ్చే పంట (కో. 6-15, 18, 20, 21 ; తె. 36, 37; రా. 14, 26, 27).

సజ్జ రూ. సద్ద; పర్యా. కంబు, గంటె. ఒకరకం ఆహారధాన్యం : (Spiked millet) *Pennisetum typhoideum*, Rich., *Holocus spicatus*, Linn , *Panicum spicatum*, Roxb.; నాలుగైదు నెల్ల మెట్టపంట ; దంచిన గింజలు అన్నం వండుకోటానికి, పిండి రొట్టెకు, గడ్డి పశువులమేతకు ఉపయోగిస్తాయి (కో. 5, 13-15, 18, 24, 30, 31 ; తె. 28) ; భేదాలు :

**కంటెపుసజ్జ** పొడుగాటి కంకివేసే రకం (కో. 25).

**కండెసజ్జ** చూ. కంటెపుసజ్జ (కో. 12).

**కొమ్ముసజ్జ** (కో. 13).

**గిడ్డసజ్జ** (కో. 13).

**చిన్నసజ్జ** (కో. 31).

జపాన్‌సజ్జ (కో. 13).

పిట్టసజ్జ (కో. 25).

పెద్దసజ్జ (కో. 13, 24, 25, 31).

పొట్టిసజ్జ (కో. 24).

ముల్లుసజ్జ (కో. 25).

సద్ద ఉ. సొద్ద; చూ. సజ్జ (కో. 3, 4, 6-12 ; తె. 1, 4, 6, 33, 34, 37-39, 42 ; రా. 5-10, 12-14, 17-19, 26, 27); భేదాలు :

కమ్మసద్ద ఉ. కమ్మసద్ద. మూణ్ణెల్లపంట (కో. 11 ; రా. 27).

గొండసద్ద (తె. 34).

గజంసద్ద గజంపొడవు కంకిఉండే రకముట (తె. 37).

గండసద్ద (తె. 1).

గిద్దసద్ద (రా. 14).

గుద్దేకుసద్ద మూణ్ణెల్ల పంట (కో. 9).

చిన్నసద్ద ఉ. చినసద్ద (రా. 6, 9).

జటిసద్ద (తె. 1).

తోకసద్ద (తె. 38).

దేశిసద్ద (తె. 34).

నాటుసద్ద (కో. 11).

పాలసద్ద గింజ తెలుపురకం (రా. 27).

పెద్దసద్ద ఉ. పెద్దొద్ద, పెద్దసొద్ద. బావులకింద తోటల్లో వేసే రకం; ఆరునెల్ల పంట ; గింజ లావుగా ఉంటుంది (కో. 10, 11; తె. 33; రా. 6, 9, 14, 27).

బుడ్డసద్ద మూణ్ణెల్ల పంట (కో. 9, 10).

బొప్పుసద్ద (తె. 38).

మండపుసద్ద ఉ. మండపుసొద్ద. నాలుగునెల్ల పంట; గింజ లావుగా ఉంటుంది (కో. 9).

ముద్దసద్ద (తె. 33) రకం (తె. 1).

ముప్పురిసద్ద కంకి మూడు మెలికలుతిరిగి ఉండేరకం (తె. 1).

ముల్లుసద్ద (తె. 33).

మూరసద్ద (తె. 1).

సన్నసద్ద (తె. 38).

సెనగ(లు) ఉ. చెనిగె, శనగ, సెనిగె, సెనగె; రూ. సెనె(లు); పర్యా. మంచిసెనగ. మెట్టలో పండే ఒకరకం పప్పుదినుసు; (Chick pea) *Cicer arietinum*, Linn.; పచ్చికట్టె పశువులమేతగా ఉపయోగిస్తుంది (కో. 3-5, 11-13, 15, 17, 21, 30, 32, 34, 39, 41 ; తె. 1, 4, 9, 11, 16, 17, 19, 21-28, 30, 32-38, 42 ; రా. 1, 5, 10, 12, 14, 15, 18, 21, 24-26, 28) ; భేదాలు :

కొమ్ముసెనగ (కో. 13, 39, 41).

గుండుసెనగ (కో. 39, 41).
చిరుసెనగ (తె. 11).
తెల్లసెనగ (తె. 9-11, 38).
దేశిసెనగ ఉ. దేశ్శెనగ (కో. 14).
నల్లసెనగ (తె. 10, 11).
బటానీసెనగ (కో. 41).
మంచిసెనగ (కో. 6).
సెనె(లు) చూ. సెనగ(లు) (తె. 13, 20).

## 3. ఆకులు, కాయలు, దుంపలు
### (కూరగాయలు)

**అగిసె** రూ. అవిసె. ఇరవై ముప్ఫై అడుగుల ఎత్తు పెరిగే చిన్నచెట్టు; *Sesbania grandiflora*, Pers; ఎఱ్ఱటి పూలు పూస్తుంది; దీని లేతాకు, కాయలు, పూలు, వంటకాలుగా ఉపయోగిస్తారు (తె. 38).

**అటికెమాడు** చూ. అటికెమామిడి (రా. 1).

**అటికెమామిడి** ఉ. అటికిమామిడి; రూ. అటికెమాడు. ఏడాది పొడుగునా బతికే పాకుడు కలుపుమొక్క; లేక ఎరుపు పూలు పూస్తుంది: (the spreading hog weed) *Boerhaavia diffusa*, Linn.; ఆకును కొందరు కూరగా వండుకొంటారు; వేళ్ళు ఉబ్బసం, నెత్తురుపోటు మొ. వ్యాధుల చికిత్సలో ఉపయోగిస్తారు (కో. 1, 4, 5, 9).

**అడివేర్దండ** (< ? అడివి + ఆరుదొండ). ఒకరకం కాయగూర; ఈ కూర తింటే 'వెంట్రుకలు అరుగుతాయి'ట (కో. 23).

**అనిపె** చూ. ఆనప (తె. 34).

**అంబలిమాడు** ఒకరకం కలుపుమొక్క; *Trianthema monogyna*, Linn.; కొద్దిమంది ఆకును కూరగా వండుకొంటారు; చూ. అంబటిమోడు, పుట 211 (కో. 48).

**అరిటి** ఉ. అరటి; అర్టి. నీటివనరులున్న తోటల్లో సాగుచేసి పెంచే చెట్టు; (plantain, banana) *Musa sapientum*, Linn.; 7–15 అడుగుల ఎత్తు పెరుగుతుంది; పచ్చికాయలు, ఊచ, కూరగా వండుకొంటారు; కాయలకోసం, పండ్లకోసం పెంచే ఈ చెట్టు తెగకుచెందిన రకాలు పదిహేనిరవైదాకా ఉన్నాయి; ఆకులు, పండ్లతొక్క, బెరడు, మొ.వి కాల్చిన బూడిద తోళ్ళపదునుకు, నల్లరంగు తయారీకి ఉపయోగిస్తుంది (కో. 2, 3, 5, 6, 15-17, 20, 25, 36, 43, 45; తె. 1, 13, 21-23, 27, 28, 31, 38, 39; రా. 9, 23, 26); భేదాలు (కాయలు, పండ్లు గూడా):

**అమృతపాణి** ఉ. అమృతపాణి. పండ్లకోసం పెంచేరకం; పండుమీది చెక్కు బూడిదరంగులో ఉంటుంది (కో. 5, 15, 36).

**ఎఱ్ఱరిటి** పండ్లకోసం పెంచేరకం (కో. 3, 15, 36).

**ఏనుగరిటి** ? ఒకరకం కూరరిటి; కాయ పెద్దదిగాఉంటుంది (కో. 15).

**కర్పూరచక్కెరకేళి** చక్కెరకేళి భేదం; పండరిటి (కో. 20).

**కౌసు** ఒకరకం పండరిటి (కో. 3).

**చక్కెరకేళి** ఉ. చక్రకేళి, సెక్కరకేళి. ఎక్కువ తియ్యగా ఉండే పండరిటి భేదం (కో. 5, 20, 36; రా. 23).

**జీలకండమొల** ఒకరకం కూరరిటి (కో. 36).

**పచ్చరిటిపండు** లోపలిభాగం పండినా తొక్క ఆకుపచ్చగా ఉండేరకం; పండరిటి విశేషం (కో. 3, 5, 15; రా. 9, 23).

**బత్తాసం** చూ. బత్తీసు (రా. 9).

**బత్తీసు** కూరకి, పండ్లకుగూడా ఉపయోగించే రకం; ఈ చెట్టుకు పిలకలు తక్కువ (కో. 5, 20, 36).

**బొంతరిటి** ముఖ్యంగా కూరకు ఉపయోగించే రకం; చెట్టుకు పిలకలెక్కువ; కాయలుకూడా విరివిగా కాస్తాయి; దీంట్లో 'చుండుబొంత' 'బూడిదబొంత' అని రెండురకాలు (కో. 3, 5, 15, 20, 36; రా. 9, 23).

**రంగమొగిరి** ఒకరకం పండరిటి (కో. 36).

**రసతాళి** పండరిటి విశేషం; పండు పసుప్పచ్చగా ఉంటుంది (కో. 5).

**? సపోటాఅరిటి** ఒకరకం పండరిటి (కో. 5).

**సుగంధరిటి** ఒకరకం పండరిటి; కాయ చిన్నదిగాను సువాసనతోను ఉంటుంది; చెక్కు పసుప్పచ్చగా ఉంటుంది (కో. 3, 5; రా. 9, 23).

**అల్లం** ఒదులుగా ఉండే తేమనేలల్లోను, ఎత్తైన కొండల మీదను సాగుచేసి పెంచే దుంపపైరు; (fresh ginger) *Zingiber officinale*, Roscoe.; మందుదినుసుగాను, వంటకాల్లో మసాలా దినుసుగాను దీనివాడుక (కో. 3, 15, 22; తె. 1, 10).

**అవిసె** చూ. అగిసె (కో. 2; రా. 1).

**ఆకు** పర్యా. కూర. ఆహారపదార్థంగా వండుకోటానికి ఉపయోగించే చెట్ల ఆకు. ఉదా: 'గోగాకు, చుక్కాకు'

మొ. వి; వీటినే మరికొన్ని ప్రాంతాల్లో 'గోంగూర, చుక్కకూర' అంటారు (కో. 1–6, 8, 10–14; తె. 10, 37; రా. 1–3, 7–9, 14, 16–19, 21–28).

**ఆనగ** ఉ. ఆనుగ; చూ. ఆనప (కో. 30 ; తె. 1, 5, 7–9, 32, 35, 36); భేదాలు :
కోలానగ (తె. 1, 36).
గుండానగ (తె. 1).
తెల్లానగ (తె. 9).
పచ్చానగ (తె. 9).
పొట్టినగ (<పొట్టి+ఆనగ) (తె. 9).
పొడుగానగ (తె. 9).

**ఆనప** ఉ. ఆనబ; రూ. అనిపె, ఆనగ, ఆనిగెం: పర్యా. చూ. సొర. పొలాలగట్టున, పెరళ్ళలోను పెంచే తీగపైరు : కాయలు ఆరేడు అడుగుల పొడవు కూడా సాగుతాయి ; కాయ లేతాకుపచ్చ రంగులో, తొడిమవైపు సన్నగాను, మిగిలిన భాగం లావుగా గుండ్రంగా ఉంటుంది ; (bottle gourd) *Lagenaria vulgaris*, Seringe; ?*Cucurbita sp.* ; దీన్ని కూరగా వండుకొంటారు ; ఆకుపసరు, గింజలనూనె ఆయుర్వేదంలో ఉపయోగిస్తారు (కో. 31, 39–45 ; తె. 6, 9, 12, 14, 33, 38 ; రా. 4, 16) ; ఆకారాన్ని బట్టి, రంగునుబట్టి భేదాలు :
కోలానప (తె. 33).
గుండానప (తె. 29, 33, 38).
?డోకానప (కో. 39).
తుంబానప (కో. 45).
తెల్లానప (కో. 39, 41).
నల్లానప (కో. 39, 45).
పాలానప (తె. 38).
పేగానప (కో. 41, 42, 45).
పొట్టినప (కో. 42).
పొడుగానప (కో. 43).

**ఆనిగెం** ఉ. ఆనిగం, ఆన్గెం; విణ. ఆన్గెపు-, ఆన్గెం-; చూ. ఆనప (తె. 11, 13, 16–29, 31).

**ఆలుగడ్డ** (< హిం. ఆలూ); పర్యా. చూ. ఉర్లగడ్డ. నీటివసతున్న సత్తునేలల్లో సాగుచేసి పెంచే గడ్డిపైరు ; (potato) *Solanum tuberosum*, Linn. ; వేళ్ళనంటి పెరిగే దుంపలు కూరదినుసుగాను ఉపయోగిస్తారు (కో. 10, 20, 22, 23, 27, 29, 33, 38, 39, 42).

**ఇటికెదాసరి** ? చూ. ఇసకదాసరి (కో. 5).

**ఇసకదాసరి** ఒకరకం కూరాకు మొక్క; ఆకు సన్నగా పొడుగ్గా సువాసనతో ఉంటుంది. *Gisekia pharnaceoides*, Linn. ; చూ. ఇసకదాసరి, పుట 156 (రా. 1).

**ఉర్లగడ్డ** ఉ. ఉరలగడ్డ, ఉల్లగడ్డ ; పర్యా. ఆలుగడ్డ, బంగాళాదుంప. నీటివసతున్న సత్తునేలల్లో సాగుచేసి పెంచే దుంపపైరు ; (potato) *Solanum tuberosum* Linn. ; దుంపలు కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 2, 3 ; తె. 41 ; రా. 18).

**ఉల్లంగి** ఉ. ఉల్లెంగ ; చూ. ముల్లంగి (తె. 16, 23, 27, 28).

**ఉల్లి** ఉ. ఉల్ల. నీరుల్లికి, వెల్లుల్లికి సామాన్యంగా వాడే పేరు; వివరాలు, చూ. ఉల్లిగడ్డ, తెల్లగడ్డ (కో. 9, 12–14, 21, 22, 25, 31, 39, 41, 43, 45, 51 ; తె. 1, 6–10, 13, 16, 18–20, 22–26, 28, 31–34, 36–39, 42 ; రా. 17–19, 25, 26); **-ఆకు, -కూర** నీరుల్లిఆకు ; సన్నగా పొడుగ్గా గొట్టంమాదిరిగా ఉంటుంది ; దీన్ని వంటకాల్లో ఉపయోగిస్తారు (కో. తె.) ; **-గడ్డ** ఉ. ఉల్లిగద్ద. ఒండు కలిసిన తువ్వనేలల్లో విరివిగా పెరిగే దుంపపైరు ; (onion) *Allium cepa*, Linn. ; వేళ్ళనంటి మొలిచే గడ్డలు గుండ్రగా పొరలు పొరలుగా తెలుపు, ఎరుపు, పసుపురంగుల్లో ఉంటాయి ; ఎకరానికి 7-15 వేల పౌన్లదాకా గడ్డలు కావచ్చు ; గడ్డలు, ఆకు, మసాలాదినుసుగా ఉపయోగిస్తారు (కో. తె. రా.); **-పాయ** చూ. -గడ్డ (కో. తె. రా.) ; తెగ, రంగు, పరిమాణం, మొ. వాటినిబట్టి ఉల్లి భేదాలు :
ఎర్రగడ్డ ఉ. ఎర్లగడ్డ: చూ. ఉల్లిగడ్డ (కో. 3, 4 ; రా. 6, 9, 11).
ఎర్రుల్లి(గడ్డ) ఉ. ఎరుల్లిగడ్డ. ఎర్రరంగు పొరలున్న నీరుల్లి(గడ్డ) (కో. 12, 25, 51 ; తె. 1, 36, 37, 39).
కారుల్లి (కో. 14).
గుండుల్లి(గడ్డ) ఉ. గుండుల్ల- (తె. 1).
గుండ్రపాయ ఒక్కటే పెద్దగడ్డగా ఉండేరకం (కో. 21).
చిల్లపాయ నాలుగైదు చిల్లలు (చిన్నపాయలు) కలిసి ఒకటిగా ఉండేరకం (కో. 21).
చిల్లుల్లి(గడ్డ) (<చిల్ల+ఉల్లి) ; చూ. చిల్లపాయ (తె. 39).
చెంబుగడ్డ ఉ. చెమ్మ్గగడ్డ ; చూ. చెంబుల్లి (కో. 25).
చెంబుల్లి(గడ్డ) పెద్దసైజు నీరుల్లి(గడ్డ) (తె. 39).
తెల్లగడ్డ నాలుగైదు నెల్లలో ఒడుపుకువచ్చే ఉల్లిజాతికి చెందిన పైరు ; (garlic) *Allium sativum*, Linn. ; చల్లటి వాతావరణంలో పెరుగుతుంది ; మొక్క ఎత్తు 2–3 అడుగులు; ఒక్కొక్కగడ్డ(కాయ)లో ఏడెనిమిది పాయలు (బద్దలు) ఉంటాయి ; వీటిని వంటకాల్లో మసాలా దినుసుగాను, శ్వాసకోశవ్యాధుల చికిత్సలోను ఉపయోగిస్తారు (కో. 3, 4, 8 ; తె. 29 ; రా. 6, 16).
తెల్లబాయ చూ. తెల్లగడ్డ (కో. 6; రా. 17, 18).

తెల్లుల్లి(గడ్డ) తెల్లటిపొరలుండే నీరుల్లి (కో. 12, 14, 25 ; తె. 1, 36, 37, 39).
నీరుల్లి చూ. ఉల్లిగడ్డ (కో. 21, 22).
పచ్చుల్లి(గడ్డ) (<పచ్చ + ఉల్లి) లేతపసుపు రంగు పొరలుండే ఉల్లి(గడ్డ) (తె. 36).
పాయుల్లి(గడ్డ) చూ. చిల్లుల్లి(గడ్డ) (తె. 1).
వెల్లగడ్డ ఉ. ఎల్లగడ్డ, ఎల్లిగడ్డ, వెల్లిగడ్డ; చూ. తెల్లగడ్డ (తె. 1, 6, 7, 9, 10, 13, 16, 18–20, 22–29, 31–39, 42).
వెల్లిపాయ ఉ. ఎల్లిపాయ ; చూ. తెల్లగడ్డ (కో. 13, 25).
వెల్లుల్లి ఉ. ఎల్లుల్లి చూ. తెల్లగడ్డ (కో. 22).

**ఉస్తి** ఆరునుంచి పన్నెండడుగుల ఎత్తుదాకా పొదగా పెరిగే చిన్నచెట్టు ; *Solanum trilobatum*, Linn. ; ఆకులు కొంచెం చేదుగా, వగరుగా ఉంటాయి ; కొందరు లేతాకులను కూరగా వండుకొంటారు (రా. 18).

**కంద** సారవంతమైన ఒదులు నేలల్లో సాగుచేసి పెంచే దుంపపైరు ; నేల చెమ్మకాసేదిగా ఉండాలి ; *Amorphallus campanulatus*, Blume ; పెదల్పు ఆకు, పొడుగాటి కాడ ఒకటేఉంటుంది ; దుంప అర్ధగోళాకారంలో పెరుగుతుంది; దీని అడ్డకొలత (వ్యాసం) 8″–10″; బరువు, 6–8 పౌన్లు ; గడ్డమీద పెరిగిన చిన్న కొమ్ములు విత్తనాలుగా ఉపయోగిస్తారు ; వీటిని మే–జూన్ నెలల్లో పాతిపెట్టి, సుమారు ఒక ఏడాదయింతరవాత పెళ్ళగిస్తారు ; ఆ కొమ్ములు పెరిగి పెద్ద దుంపలవుతాయి ; దుంపలో 'Calcium oxalate' అనే రసాయనిక పదార్థం ఉండటంవల్ల తిన్నప్పుడు కొద్దిగా నాలుకకు దురద కలుగుతుంది; దుంపలు కూరగా వండుకొంటారు (కో. 3–6, 15, 20–22, 41–43, 45, 48 ; తె. 22–25, 27–29, 31–33, 39, 42 ; రా. 1) ; భేదాలు (ఈ కింది పేర్లు చాలావరకు 'కంద' కు పర్యాయపదాలు కావచ్చు) :
ఎర్రకంద (కో. 48 ; తె. 23).
చిల్లకంద (కో. 21).
జిలకంద (తె. 39).
తీగకంద (రా. 1).
తీయకంద ఉ. తీకంద (కో. 5, 20–22 ; తె. 32, 39).
తెల్లకంద (తె. 23).
దుంపకంద (కో. 5, 15, 20, 22).
నసకంద (రా. 1).
నెల్లూరికంద పెద్ద దుంపరకం (కో. 22).
పుల్లకంద పెద్దదుంప, దురదఉండే రకం (తె. 23, 24, 26–28, 31, 32, 42).
మంచికంద దురద తక్కువఉండే రకం (కో. 15).
సారికంద (? <చారకంద) (కో. 22).

**కంబాల** ఒకరకం కూరాకు మొక్క (కో. 3).

**కలగూర** చూ. కల్లెగూర. తోటకూరలాగా ఉండే ఒక రకం ఆకుకూర (తె. 24, 27–29, 33, 35, 42).

**కల్లెగూర** ఉ. కలెగూర, కాలెగూర. చూ. కలగూర (తె. 12, 13, 34).

**కాకర** ఉ. కాకిర, కాకిరి, కాకెర. సారవంతమైన భూముల్లో విరివిగాకాసే తీగపైరు ; *Momordica charantin*, Linn. ; ఆకు, కాయలు చేదుగా ఉంటాయి; కాయమీద హెచ్చుతగ్గులుగా ఉండే బుడిపెలుగాని, మెత్తటి ముళ్ళుగాని ఉంటాయి (కో. 1, 3, 5, 6, 9–16, 19–23, 25, 31, 39, 41–43, 45 ; తె. 1, 7, 13, 15–18, 20–24, 26–29, 31, 33–39, 41 ; రా. 2–4, 6, 9, 14, 16–18, 21, 24–26, 28) ; కాయ ఆకారం, పరిమాణం, రంగు, రుచి మొ. వాటినిబట్టి భేదాలు :
అడివికాకర ఉ. అడివిగాకిరి, అడ్వికాకిరి. అడవుల్లో విపరీతంగా కాసే ఒకరకం ; ఆరగాకరే అని కొందరు ; *M. cochinchinensis*, Spreng ; (తె. 16, 17, 20, 21, 39).
ఆగాకర ఉ. ఆకాకర ; చూ. ఆరగాకర (కో. 22).
ఆరగాకర ఉ. ఆరగాకరి (< ? ఆడ-కాకర) ; చూ. ఆగాకర. ఇది అడవితీగకు చెందినచెట్టు ; *M dioca*, Roxb. ; ఈ చెట్టు వేళ్ళు, ఊటల నంటిఉండే కాయలు (tubers) వైద్యంలో ఉపయోగిస్తారు; కొందరు కాయలను కూరగా వండుకొంటారు (కో. 28).
ఊరగాకర ఉ. ఊరగాకెర. మామూలు కూరకాకర ; అడివికాకరకు భిన్నం (తె. 1).
కాశీకాకర (కో. 23, 25).
కోలకాకర (తె. 33).
గౌడకాకర పొట్టికాయ రకం (తె. 24).
చేదుకాకర చూ. నల్లకాకర (కో. 25 ; తె. 28).
తెల్లకాకర ఉ. తెల్లకాకరి. చెక్క తెల్లటికాయల రకం (కో. 9–13, 15, 20, 23, 25, 31; తె. 1, 23, 34–37, 39).
నల్లకాకర ఉ. నల్లకాకిరి, నల్లగాకిరి. కాయ పొట్టిగాను, చెక్క ముదరాకుపచ్చగాను ఉండేరకం ; తెల్లకాకరకంటె చేదెక్కువ (కో. 12, 13, 15, 20, 22, 23, 25, 31; తె. 1, 22, 23, 34–37, 39).
పచ్చగాకర (కో. 10, 11).
పెద్దకాకర (కో. 5, 14, 21).
పొట్టికాకర (కో. 1, 3, 5, 6, 15, 16, 20, 22, 23, 31 ; తె. 27, 31, 38, 39; రా. 9).
పొడుక్కాకర (< పొడుగు + కాకర) (కో. 3, 16 ;

రా. 9).

బుడ్డగాకర ఉ. బుడ్డగాకర. ఈ ప్రాంతంలో ఆరగాకరకే ఈ పేరు వాడతారట (తె. 15, 21, 33, 34).

బొచ్చుకాకర (తె. 37, 39).

బొంతకాకర (తె. 1, 39).

బోడకాకర ఉ. బూడకాకర, బోడకాకిరి. ? ఆరగాకర (తె. 17, 20-24, 26-28, 31).

సొరకాకర (కో. 20).

కాసర అడవుల్లోను, మెరక నేలల్లోను ఎక్కువగా పెరిగే తీగమొక్క; *Cardiospermum halicacabum*, Linn.; లేత ఆకులు, కాయలు కూర వండుకొంటారు; వేప్ళ శ్వాసకోశవ్యాధులు, కీళ్ళవాతం, చర్మరోగాలు మొ. వాటి చికిత్సలో ఉపయోగిస్తారు (కో. 15; తె. 37; రా. 18, 21).

కాశి(సి)కూర ఒకరకం ఆకుకూర (కో. 2).

కూర పర్యా. ఆకు. ఆహారపదార్థంగా వండుకోటానికి ఉపయోగించే చెట్ల ఆకు, ఉదా: తోటకూర, చుక్కకూర, గోంగూర, మొ. వి; వీటికే మరికొన్ని ప్రాంతాల్లో 'తోటాకు, చుక్కాకు, గోగాకు' అని వాడుక; కొన్నిచోట్ల రెండు పదాలూ (ఆకు, కూర) పర్యాయంగా వాడతారు (కో. 1, 4-6, 8, 10-14, 16, 20, 21, 23, 25, 28, 30-32, 36, 38, 39, 41, 43, 45, 48, 51; తె. 1, 3, 5-14, 16-31, 33-35, 37-39, 41, 42; రా. 1-3, 14-17, 22, 23, 27).

క్యాబేజి పర్యా. చూ. గోబి(గడ్డ). పాశ్చాత్యదేశాల నుంచి దిగుమతి చేసుకొన్న గింజలతో చల్లటి ప్రాంతాల్లో పెంచే (?) ఆకుపైరు; *Brassica oleracea/capitata*, Linn.; సారవంతమైన నేల, నీటివనరు ఉండాలి; మొలకలు మూడు నాలుగు అంగుళాల ఎత్తు రాగానే తీసి ఎడ ఎడంగా నాటుతారు; ఆకుల మధ్యలో 'పువ్వు' పొరలు పొరలుగా గడ్డలాగా పెరుగుతుంది; బరువు 2-12 పౌన్లదాకా ఉండవచ్చు; దీన్నే కూరదినుసుగా వండుకొంటారు (కో. 40).

కొంకరి అడవుల్లో దొరికే ఒకరకం ఆకుకూర (కో. 43, 45).

కొతిమేర ఉ. కొత్తిమేర; చూ. కొత్తిమిర (కో. 6, 11, 12).

కొత్తిమిర ఉ. కొత్తిమిరి; రూ. కొతిమేర, కొత్మీర. ధనియపుమొక్క (ఆకు); *Coriandrum sativum*, Linn.; ఆకు, గింజలు వంటకాల్లో మసాలా దినుసుగా ఉపయోగిస్తారు; మొక్క 1′-3′ ఎత్తు పెరుగుతుంది; మెట్ట పంట; మూడు, మూడున్నర నెల్లలో కోతకువస్తుంది; గింజలు(ధనియాలు) వాణిజ్యపుపంట (కో. 2; రా. 16, 18).

కొత్మీర ఉ. కొత్మీర్, కొత్మీరి, కొత్మీరు; చూ. కొత్తిమిర (తె. 15-17, 22-28, 33).

కొయుటాకు పర్యా. చూ. చిర్రి 'తోటకూర' జాతికి చెందిన ఆకుకూర; *Amarantus tristis*, Linn.; ఏడాది పొడుగునా ఆకు వేస్తూనేఉంటుంది. పెరుగు తోటకూరలాగా కాక, దీని ఆకులు, కాడలు, కోసేకొద్దీ, కొత్తవి వేస్తూనే ఉంటుంది (రా. 9, 18, 26).

కొయ్యగూర ఉ. కొయ్‌గూర; పర్యా. చూ. చిర్రి. 'తోటకూర' జాతికిచెందిన ఆకుకూర; *Amarantus tristis*, Linn.; ఆకులు కోసేకొద్దీ మారాకు వేస్తుంటుంది; ఆకులు, కాడలు వంటకాల్లో ఉపయోగిస్తారు (తె. 7, 16-20, 38; రా. 14-16, 23).

కోడిజుట్టు(కూర) కూరకంటె అందంకోసం ఎక్కువగా తోటల్లో పెంచే మొక్క; (cock's comb) *Celosia cristata*, Linn.; కాడలు ఎర్రగా, పసుప్పచ్చగా ఉంటాయి; దీని ఆకును కూరగా వండుకుంటారు; చూ. కోడిజుట్టు, పుట 161 (కో. 25; తె. 1, 29, 42).

కోసు(పువ్వు)రూ. గోసు (ముట్టి); పర్యా. చూ. గోబి(గడ్డ). పాశ్చాత్యదేశాలనుంచి దిగుమతిచేసుకొన్న గింజలతో చల్లటి ప్రాంతాల్లో పెంచే ఆకు (?) పైరు; *Brassica capitata*, Linn.; సారవంతమైన నేల, నీటివనరు ఉండాలి; మొలకలు మూడునాలుగు అంగుళాల ఎత్తు పెరగ్గానే తీసి ఎడఎడంగా నాటుతారు; ఆకులమధ్య 'పువ్వు' పొరలుపొరలుగా గడ్డలాగా పెరుగుతుంది; బరువు 2-12 పౌన్లదాకా ఉండవచ్చు; దీన్నే కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 2, 3, 8).

గంజెర ఉ. గెంజెర. బంజరునేలల్లో పెరిగే కలుపు మొక్క; *Trianthema monogyna*, Linn; ఆకును కూరగా వండుకొంటారు; చూ. గలజేరి, పుట 162 (తె. 37; రా. 18).

గాజర(గడ్డ) సారవంతమైన తేమనేలల్లో సాగుచేసి పెంచే దుంపపైరు; (carrot) *Daucus carota*, Linn.; వేళ్ళను కూర దినుసుగా ఉపయోగిస్తారు (తె. 1, 22).

గుడిచెంచలం ఒకరకం ఆకుకూర మొక్క; ? 'చెంచలి' జాతికి చెందింది కావచ్చు (కో. 51).

గునుగు విణ. గునక, గునుగు (వాడుక: గున్కకూర, గునుగ్గూర); చూ. గురుగు (తె. 1, 18, 19, 21).

గుమ్మడి ఉ. గుమ్మడ, గుమ్మిడి. గుమ్ముడు. పెరటి దొడ్లలోను, మెట్టపొలాల్లోను నేలను ఆనుకొని పొదగా పెరిగే తీగపైరు; మంచిగుమ్మడికి *Cucurbita sp*, బూడిద గుమ్మడికి *Benincasa sp.* సామాన్యంగా వాడే పేరు; కాని అవి వృక్షశాస్త్రపరిగణనలో వేరువేరు జాతులకు

చెందినవి; కాయరంగు, లోపలిగుజ్జు, ఆకుల ఆకృతి మొ. వి భిన్నంగా ఉంటాయి. వివరాలు, చూ. బూడిదగుమ్మడి, మంచిగుమ్మడి (కో. 1, 3-6, 8–14, 16, 20–23, 25, 30-32, 38, 39, 41, 43, 45 ; తె. 1, 3, 6, 7, 9, 11–13, 18, 22-27, 29, 31, 32, 34, 36-39, 42; రా. 1, 2–4, 6, 7, 9, 11, 14–18, 21–28); భేదాలు:

**కందిపొల్లగుమ్మడి** (కో. 41).

**కాశీగుమ్మడి** చూ. మంచిగుమ్మడి (కో. 20, 21 ; తె. 39).

**చిటిగుమ్మడి** (కో. 9).

**దేవగుమ్మడి** చూ. మంచిగుమ్మడి (కో. 39, 41).

**నల్లగుమ్మడి** (తె. 38; రా. 9).

**నిలువుగుమ్మడి** చూ. బూడిదగుమ్మడి (కో. 25).

**నేలగుమ్మడి** (తె. 38).

**పాలగుమ్మడి** ఉ. పాళగుమ్మడి. తెల్లగుమ్మడి ; ? చూ. బూడిదగుమ్మడి (కో. 12, 41 ; తె. 36–39); రా. 18, 21).

**పెట్టెగుమ్మడి** ? చూ. మంచిగుమ్మడి (కో. 6, 8–10).

**పెద్దగుమ్మడి** చూ. మంచిగుమ్మడి (కో. 1, 4, 5, 21, 22, 31, 39, 41, 43 ; రా. 1).

**పొడుగ్గుమ్మడి** చూ. బూడిదగుమ్మడి (కో. 8).

**బూడిదగుమ్మడి** ఉ. బూడిదె-, బూడ్ది-, బూడ్దె-. పెరళ్ళలోను, తోటల్లోను పండించే తీగెపైరు ; (ash-gourd) *Benincasa cerifera*, Savi.; నాలుగైదు నెల్లలో కాపుకు వస్తుంది ; కాయ స్తంభాకారంలో వర్తులంగా ఉంటుంది ; బూడిదెరంగు లేతకాయ కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 3-6, 8-13, 16, 20-22, 25, 31, 43, 45 ; తె. 22, 24, 26, 27, 29, 31, 34, 36, 37 ; రా. 9, 15, 18, 21).

**మంచిగుమ్మడి** పెరళ్ళలోను, తోటల్లోను పండించే తీగపైరు ; (pumpkin) *Cucurbita maxima*, Duchesne.; కాయ గుండ్రంగా, నొక్కులు నొక్కులుగా ఉంటుంది ; లోపలి కండ ముదురుపసుపు, లేతఎరుపు రంగులో ఉంటుంది ; కాయ, లేతఆకు, కూరదినుసులుగా ఉపయోగిస్తారు (కో. 6, 11, 16, 21, 25).

**మద్దెలగుమ్మడి** చూ. బూడిదగుమ్మడి (కో. 9).

**రాచగుమ్మడి** ఉ. రాసగుమ్మడి; రూ. రాజగుమ్మడి. మంచిగుమ్మడిలో చిన్నకాయ రకం (తె. 1, 22, 24-27).

**రాజగుమ్మడి** ఉ. రాజుగుమ్మడి ; చూ. రాచగుమ్మడి (కో. 4, 5, 45).

**రామగుమ్మడి** (రా. 9).

**సీమగుమ్మడి** (రా. 18).

**సోగగుమ్మడి** ఉ. సొగ్గుమ్మడి ; చూ. బూడిదగుమ్మడి (కో. 10).

**గురుగు** ఉ. గురగ, గురిగ (వాడుక ; గురిగేకు, గురుకూ్కర, గురుగూర) ; రూ. గునుగు. నదుల ఒడ్డున, వరిపొలాల్లోను మొలిచే ఒకరకం కలుపుమొక్క ; రెండు మూడడుగుల ఎత్తుంటుంది ; *Celosia argentea*, *Heliotropum indicum*, Linn.; ఆకులు కూరగా వండుకొంటారు (కో. 4, 23, 25, 39, 43, 45 ; రా. 17).

**గెనుసు(గడ్డ)** ఉ. గెంచు-, గెణుసు-, గెనసు-, పర్యా. చిలకడదుంప, పిండిదుంప, మొకరం, (మొరంగడ్డ), రత్నపురిగడ్డ, రాతాళం. నాలుగైదు నెల్లలో ఒడుపుకువచ్చే తీగపైరు (sweet potato); *Ipomaea batatas*, Lam. ; ఏడాది పొడుగునా బతుకుతుంది; వేళ్ళనంటి పెరిగే దుంపలను కూరదినుసుగా గాని ప్రధానాహారంగా గాని తింటారు ; లేత ఆకులు కొందరు కూరగా వండుకొంటారు (కో. 2, 4, 6, 8, 9, 12, 14, 15 : రా. 1, 16-18, 26) ; భేదాలు :

**ఎర్రగెనుసు** చెక్కు ఎర్రగాఉండే రకం (కో. 12; రా. 17).

**తెల్లగెనుసు** చెక్కు తెల్లగాఉండేరకం (కో. 12; రా.17).

**గైగడ్డ** పర్యా. పెండలం. నీటి వసరున్నచోట గాని, మంచి వానలు పడేచోటగాని, పెరిగే తీగపైరు; సెప్టెంబరులో దుంప నాటి నవంబరులో పెళ్ళగిస్తారు. నేలదున్ని రంధ్రాలు పెట్టి ఎరువువేసి దుంపముక్కలు పాతిపెట్టి నీళ్ళుపోస్తారు ; ఎనిమిది రోజులకల్లా మొక్క వస్తుంది; తీగకు దోహదంగా ఎత్తైన గడలు నిలబెడతారు ; తీగ ఏభైఅడుగుల ఎత్తుదాకా గడలకు, కుడివైపు మెలికలతో అల్లుకుంటుంది ; నేలలో గడ్డ పొడుగ్గా లావుగా పెరుగుతుంది ; ఎకరానికి మూడు నుండి పద్నాలుగు టన్నులదాకా దుంప కావచ్చు ; దీన్ని కూరదినుసుగా ఉపయోగిస్తారు (తె. 19, 23, 24, 26, 28, 36).

**గోకెర(కాయ)** ఉ. గోకడ, గోకర, గోకిర: పర్యా. గోరుచిక్కుడు (చూ. చిక్కుడు). మూడునుంచి పది అడుగుల ఎత్తుదాకా పెరిగే చెట్టు ; *Cyamopsis tetragonoloba*, Linn ; మూడు మూడున్నర నెలల్లో కాపుకు వస్తుంది ; కాయలు గుత్తులు గుత్తులుగా, 2-4 అంగుళాల పొడవున కాస్తాయి ; వీటిని కూరగా వండుకొంటారు ; ఆకు పచ్చిఎరువుగాను, పశువులమేతగాను ఉపయోగిస్తుంది (తె. 1, 6, 9, 35-37) ; భేదాలు :

**నవగోకెర** (తె. 1).

**పొట్టిగోకెర** (తె. 1).

**పొడుగుగోకెర** ఉ. పొడుగ్గోకెర (తె. 1).

**గోగు** (వాడుక: గోగాకు, గోగ్గూర): చూ. గోంగూర (కో. 3, 8, 11, 13, 22, 39, 43, 45 ; తె. 28;

రా. 2, 3, 7–9, 14, 18, 19, 23-28); భేదాలు:
ఎర్రగోగు (కో. 8, 13; తె. 37).
కూసాగోగు (కో. 13).
తెల్లగోగు (కో. 13; తె. 37).
దేశవాళిగోగు (కో. 21).
దొరగోగు (కో. 21).
పట్నంగోగు (తె. 37).

**గోంగూర** ఉ. గుంగూర; రూ. గోగు; పర్యా. పుంటి(కూర), పుండి. ఏడునుంచి పన్నెండడుగుల ఎత్తు పెరిగే ఆకుకూర చెట్టు; (Deccan hemp) *Hibiscus cannabinus*, Linn.; ఎర్రరేగడ, గరువునేలల్లో బాగా పెరుగుతుంది; మెట్టపైర్లలో అక్కడిపైరుగాకూడా వేస్తారు; 3–5 నెల్లలో కోతకువస్తుంది; కాడలు కుళ్ళబెట్టి నార తయారుచేస్తారు; ఆకు వంటకాలకు, పచ్చళ్ళకు, కాడలు పశువుల మేతకు పనికివస్తాయి (కో. 2, 4, 5, 10, 12, 14, 16, 20, 21, 25, 28, 30-32, 36, 39, 41, 42, 45; తె. 28, 30, 31, 38, 41; రా. 1); భేదాలు:
**ఆడగోంగూర** పక్కకొమ్మలు ఎక్కువగా వేసి పొదగా పెరిగేరకం (కో. 25).
**ఎర్రగోంగూర** ఆకునడిమి ఈనెలు, కాడ ఎర్రగాఉండే రకం (కో. 5, 12, 25, 28, 31; తె. 31, 38).
**కొండగోంగూర** కాడకు ముళ్ళుండే రకం; నారకు ప్రధానంగా పనికివస్తుంది; *H. furcatus*, Roxb. (కో. 21, 25, 27).
**తెల్లగోంగూర** కాడలు తెల్లగాఉండేరకం (కో. 12, 31; తె. 31, 38).
**పోతుగోంగూర** పక్కకొమ్మలు లేకుండా ఒకేకాడగా పెరిగే రకం; చూ. ఆడగోంగూర (కో. 25).
**సీమగోంగూర** ? చూ. తెల్లగోంగూర (కో. 31).

**గోబి(గడ్డ)** ఉ. గోపి(గడ్డ) (<హిం. గోభీ); పర్యా. కేబేజి, కోసుపువ్వు, గోసుముట్టి. పాశ్చాత్య దేశాలనుంచి దిగుమతి చేసుకొన్న గింజలతో చల్లటి ప్రాంతాల్లో పెంచే ఆకు(?) పైరు; *Brassica oleracea / capitata*, Linn.; సారవంతమైన నేల, నీటివసరు ఉండాలి; మొలకలు మూడు నాలుగు అంగుళాల ఎత్తు పెరగ్గానే తీసి ఎడంఎడంగా నాటుతారు; ఆకులమధ్య 'పువ్వు' పొరలుగా గడ్డలాగా పెరుగుతుంది; బరువు 2-12 పౌన్లదాకా ఉండవచ్చు; ఓన్నే కూరదినుసుగా ఉపయోగిస్తారు (తె. 1, 6, 7, 9, 27, 28).

**గోసు(ముట్టి)** చూ. గోసు(పువ్వు).

**చిక్కుడు** ఉ. సిక్కుడు. తోటల్లోను, పెరళ్ళలోను సాగుచేసి పెంచే తీగపైరు; అయిదారు నెలల్లో కాపుకు వస్తుంది; ఎన్నో రకాలకు చెందిన కాయగూరలను మామూలుగా 'చిక్కుడు' అని పిలుస్తారు; *Dolichos typicus, D. lablab, D. ligonosus*, etc. (కో. 9-16, 21–25, 39, 41-43, 45; తె. 1, 3, 5-7, 9–14, 16, 18, 19, 21-29, 31-39, 42; రా. 2–5, 6, 7, 9, 14-19, 21-27): భేదాలు:
**ఆకుచిక్కుడు** ? చూ. బెంగుళూరు చిక్కుడు (తె. 1).
**ఎర్రచిక్కుడు** ఉ. ఎర్సిక్కుడు (కో. 5, 13, తె. 1, 6).
**కొండచిక్కుడు** (కో. 13).
**కొమ్ముచిక్కుడు** (తె. 37).
**కోలచిక్కుడు** (తె. 34).
**గనుపుచిక్కుడు** ఉ. కనుపుచిక్కుడు, గెనుపుచిక్కుడు (కో. 13, 21-23; రా. 9, 15).
**గానెగచిక్కుడు** (తె. 31).
**గుత్తిచిక్కుడు** ఉ. గుచ్చిక్కుడు. ? చూ. గోరుచిక్కుడు (కో. 4; తె. 34).
**గెలచిక్కుడు** ? చూ. గోరుచిక్కుడు (కో. 22, 23).
**గోటిచిక్కుడు** చూ. గోరుచిక్కుడు (కో. 1; రా. 1).
**గోడుచిక్కుడు** చూ. గోరుచిక్కుడు(కో. 22).
**గోరుచిక్కుడు** ఉ. గోర్చిక్కుడు; పర్యా. గోకెర(కాయ), జౌళి, మటికె. మూడునుంచి పది అడుగుల ఎత్తుదాకా పెరిగే చెట్టు; *Cyamopsis tetragonoloba*, Linn.; మూడు మూడున్నర నెల్లలో కాపుకువస్తుంది; కాయలు గుత్తులు గుత్తులుగా 2–4 అంగుళాల పొడుపున కాస్తాయి; వీటిని కూరగా వండుకుంటారు; ఆకు పచ్చిఎరువుగాను, పశువులమేతగాను ఉపయోగిస్తుంది (కో. 2, 4–6, 8–16, 18, 21–23; తె. 13, 18, 22-24, 26-28, 32–34, 38, 39; రా. 2, 3, 15).
**చిన్నచిక్కుడు** (తె. 34).
**చీరాకుచిక్కుడు** (కో. 6).
**తీగచిక్కుడు** (కో. 1, 4).
**తెల్లచిక్కుడు** గింజలు తెల్లగాఉండేరకం (కో. 5, 10; తె. 1, 6, 9, 27, 31, 36, 37; రా. 9).
**దబ్బచిక్కుడు** గింజ గుండ్రంగా గాక బద్దగా ఉండేరకం (రా. 15).
**నల్లచిక్కుడు** గింజ నలుపురకం (కో. 10; తె. 1, 6, 36, 37; రా. 9).
**పందిటిచిక్కుడు** (రా. 1).
**పిన్నీసుచిక్కుడు** (<Beans) చూ. బెంగుళూరుచిక్కుడు (కో. 22).
**పెద్దచిక్కుడు** (కో. 3, 6; తె. 34).
**బెంగుళూరుచిక్కుడు** చల్లటి వాతావరణంలో పెరిగే పొట్టి కాయ రకం; గింజ చిన్నదిగా ఉంటుంది (కో. 3, 4).

మంచిచిక్కుడు (కో. 13).
సన్నచిక్కుడు (కో. 3; తె. 36).
సీమచిక్కుడు చూ. బెంగుళూరుచిక్కుడు (కో. 12; తె. 6; రా. 18).

చిర్రి ఉ. సిరి, సిర్రి (వాడుక: చిర్రిగూర, చిర్రేకు); పర్యా. కొయ్యటాకు, కొయ్యగూర, కొయ్యతోటకూర (చూ. తోటకూర), తరుగాకు. తోటకూర జాతికి చెందిన ఆకుకూర చెట్టు: *Amarantus tristis*, Linn.; ఆకులు కోసే కొద్దీ కొత్తాకులు ఏడాదిపొడుగునా వేస్తూనే ఉంటుంది; 'చిర్రి-కొయ్యతోటకూర', పర్యాయపదాలని కొందరు వృక్ష శాస్త్రజ్ఞులు, కావని కొందరు (కో. 1, 5, 8, 13, 21, 23; తె. 1, 37; రా. 1, 18).

చిలకముక్కాకు ?చిలకతోటకూర; తోటకూర (కో. 5).

చిలగడ(దుంప) పర్యా. చూ. గెనుసు(గడ్డ). నాలు గైదు నెల్లలో ఒడుపుపవచ్చే తీగపైరు; (sweet potato) *Ipomaea batatas*, Lam.; ఏడాది పొడుగునా బతుకుతుంది; వేళ్ళనంటి పెరిగే దుంపలను కూరదినుసుగా గాని ప్రధానాహారంగాగాని తింటారు; లేతఆకులు కొందరు కూరగా వండుకొంటారు (కో. 20–22, 28, 39, 41–43; తె. 38, 39); భేదాలు:
ఎర్రచిలగడ ఉ. ఎరసిలగడ. ఎర్రటి తొక్కఉండే రకం (కో. 28; తె. 38, 39).
తెల్లచిలగడ తెల్లటి తొక్క ఉండేరకం (కో. 39, 41–43; తె. 38, 39).

చుక్క (వాడుక: చుక్కకూర, చుక్కాకు). సుమారు అడుగెత్తు పెరిగే కూరాకుమొక్క: *Rumex vesicarius*, Linn.; ఆకులు, లేత కాడలు కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 1-5, 12, 16, 41, 43, 45; తె. 3-7, 9-14, 18–20, 22-28, 31-33, 42; రా. 1, 9, 14, 18, 19, 21-28).

చెక్రవంతి ఉ. చెక్రవర్తి, సెక్కాంతి, సెక్రమంతి, సెక్రాంతి. అయిదారడుగుల ఎత్తు పెరిగే ఆకుకూర మొక్క: *Chenpodium album*, Linn. (రా. 14, 16-19).

చెంచలి ఉ. చెంచల, సెంచలి (వాడుక: చెంచలాకు, చెంచలికూర); పర్యా. పచ్చకూర. ఒకటి రెండడుగుల ఎత్తు పెరిగే మొక్క; *Digera arvensis*, Forsk.; *D. muricata*, *Mart.*; చూ. చెంచలి, పుట 165; ఆకులు కూరదినుసుగాను, పశువులకు పచ్చిమేతగాను ఉపయోగిస్తాయి (కో. 5, 8, 11, 21, 23, 25, 39, 43, 45; తె. 1, 37–39).

చెన్నంగి ఒకరకం కూరాకుమొక్క; *Lagerstroemia sp.* Retz.; చూ. చెన్నంగి, పుట 165 (తె. 39).

చెమ్మ(కాయ) ఉ. చెంబ; చూ. తమ్మ (కో. 41; తె. 1, 28, 33, 37, 38); భేదాలు:
చెట్టుచెమ్మ ఉ. సెట్టుచెమ్మ; చూ. చెట్టుతమ్మ (తె. 1).
పుట్టచెమ్మ చూ. పుట్టతమ్మ (తె. 1, 37, 38).
మంచిచెమ్మ చూ. మంచితమ్మ (తె. 37).

చేమ ఉ. శామ. సుమారు ఏడడుగుల ఎత్తుదాకా పెరిగే దుంప పైరు; *Colocasia esculenta*, Linn.; పొడుగాటి కాడలు, వెడల్పైన ఆకులు ఉంటాయి; నీటివసరుండి చెమ్మకానే సారవంతమైన నేలల్లో పెంచే పైరు (కో. 2-5, 15, 20-22; తె. 1, 4, 7, 9, 10, 13, 16, 18, 22-24, 26-29, 32-34, 38, 39, 42; రా. 1, 11, 17, 18); -కూర ఉ. చామకూర, సోంకూర. చేమమొక్క ఆకు; దీన్ని కూరదినుసుగా ఉపయోగిస్తారు (తె. రా.); -గడ్డ, -దుంప మొక్క వేళ్ళనంటి నేలలో పెరిగేది (కో. తె. రా.); చేమ భేదాలు:
అడవిచేమ ఉ. అడివిశామ, అడ్విచేమ. 'చేమ'లో ఒక రకం; ఎక్కువగా చెరువులు, సరస్సులఒడ్డున మొలుస్తుంది *C. nymphaeifolia*, Roxb.; ముఖ్యంగా ఆకుకూర మొక్క (తె. 19; రా. 1).
తెల్లచేమ (తె. 39).
నల్లచేమ (తె. 39).

జౌళి(కాయ) ఉ. చెవల, సౌలె, సౌళ; పర్యా. గోరుచిక్కుడు (చూ. చిక్కుడు). మూడునుంచి పది అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు; *Cymopsis tetragonoloba*, Linn.; మూడు మూడున్నర నెల్లలో కాపుకు వస్తుంది; కాయలు గుత్తులు గుత్తులుగా 2–4 అంగుళాల పొడవున కాస్తాయి; వీటిని కూరగా వండుకొంటారు; ఆకు పచ్చి ఎరువుగాను, పశువులమేతగాను ఉపయోగిస్తుంది (తె. 3, 5; రా. 6, 17, 19).

టమోట ఉ. తమాట, తమోట; టోమాట; పర్యా. చూ. రామములగ. చల్లటిచోట్ల తోటల్లో పెంచే తీగపైరు; (tomato) *Lycopersicum esculentum*, Mill.; ఈ పైరు దక్షిణ అమెరికానుంచి మిగిలిన దేశాలకు వ్యాపించింది; కాయలు, పండ్లు వంటకాల్లో ఉపయోగిస్తారు (తె. 1, 7, 9, 10, 12, 13, 16-18, 20, 22, 24, 25, 27); భేదాలు:
ఎర్రటమోట (తె. 1).
గులాబిటమోట (తె. 1).
చిన్నటమోట ఉ. చిన్నతమాట (తె. 1, 9).
పచ్చటమోట (తె. 1).
పెద్దటమోట ఉ. పెద్దతమాట (కో. 29, 33; తె. 1, 9).

టోమాట చూ. టమోట (రా. 9, 15-19, 21, 24).

డొండ చూ. దొండ (తె. 22).

**తక్కాళి(కాయ)** ఉ. తక్కాలు(పంట); పర్యా. చూ. రామములగ. చల్లటిచోట్ల తోటల్లోపెంచే తీగపైరు; (tomato) *Lycopersicum esculentum*, Mill.; ఈ పైరు దక్షిణ అమెరికానుంచి మిగిలినదేశాలకు వ్యాపించింది; కాయలు, పండ్లు వంటకాల్లో ఉపయోగిస్తారు (కో. 1; రా. 1).

**తక్కాళిరువంకాయ** ఉ. తక్కాళిరొంకాయ; పర్యా. చూ. రామములగ. చల్లటిచోట్ల తోటల్లో పెంచే తీగపైరు; (tomato) *Lycopersicum esculentum*, Mill.; ఈ పైరు దక్షిణ అమెరికానుంచి మిగిలిన దేశాలకు వ్యాపించింది; కాయలు పండ్లు వంటకాల్లో ఉపయోగిస్తారు (కో. 1; రా. 1).

**తమ్మ** ఉ. తంబ, తొంబ; రూ. చెమ్మ. పది పదిహేను అంగుళాల పొడవున బద్దగాఉండే కాయలు గుత్తులు గుత్తులుగా కాసే ఒకరకం మొక్క; *Canavalia sp.*, DC. దీంట్లో రెండురకాలు: (1) రెండు నుంచి ఐదడుగుల ఎత్తున నిలువు కాడలతో పొదగాపెరిగే చెట్టు; (2) పెద్దచెట్ల కల్లుకొని పెరిగే తీగె; లేతకాయలు కూరదినుసుగాను, ఆకు పచ్చిఎరువుగాను ఉపయోగిస్తారు (కో. 1-6, 8-13, 15, 16, 20-23; రా. 1, 9, 18, 21, 22, 24-26, 28); భేదాలు:

**ఎర్రతమ్మ** ఉ. ఎర్రతంబ. తీగెమొక్క; కాయ పొడవు తక్కువ వెడల్పెక్కువ; ముఖ్యంగా కూరదినుసుగా ఉపయోగించే రకం (sword bean) *Canavalia gladiata*, Jacq. (కో. 5).

**చెట్టుతమ్మ** చూ. తెల్లతమ్మ (కో. 9).

**చీనెతమ్మ** చూ. ఎర్రతమ్మ (కో. 9).

**తెల్లతమ్మ** ఉ. తెల్లతంబ. చెట్టుగా పెరిగేరకం; (Jack bean) *Canavalia ensiformis*, DC.; కాయ పొడవెక్కువ వెడల్పు తక్కువ; గింజ తెలుపు; ముఖ్యంగా పచ్చిఎరువుగా ఉపయోగించే రకం (కో. 5).

**పుట్టతమ్మ** ఉ. పుట్టతంబ; చూ. ఎర్రతమ్మ (కో. 5).

**తరుగాకు** ఉ. తరిగాకు; పర్యా. చూ. చిర్రి. ఏడాది పొడుగునా పెరిగే ఆకుకూర; *Amarantus tristis*, Linn.; ఆకులుకోసేకొద్దీ కొత్తాకులు వేస్తూనే ఉంటుంది; కొయ్యతోటకూర (కో. 1; రా. 1).

**తుండి(కూర)** రూ. తూటి. చెరువుల్లోనూ బురద నేలల్లోనూ నీటిమీద తేలుతూ పెరిగే కూరాకు మొక్క; *Ipomaea acquatica*, Forsk.; కాడ పొడుగ్గా గొట్టంమాదిరి ఉంటుంది; లేత ఆకులు, కాడలు కూర దినుసుగా ఉపయోగిస్తారు; బెంగాలు రాష్ట్రంలో దీని వాడుక ఎక్కువ (తె. 37).

**తూటి** (వాడుక : తూటికూర, తూటాకు); చూ. తుండి (కూర) (కో. 5; తె. 33).

**తొండ(కాయ)** చూ. దొండ (తె. 17).

**తోటకూర** (వాడుక : తోటాకు అని కూడా); పర్యా. దంటు. ఆంధ్రదేశంలో విరివిగాపెంచే ఆకుకూర; *Amarantus sp.*, Linn.; ఆకు ఆకారం, కాడ రంగు పొడవులనుబట్టి ఈ జాతిలో ఎన్నో తెగలున్నాయి; గింజలు చల్లిన నెలా రెణ్ణెల్లకు కోతకువస్తాయి; ఆకులు కోలగాను కాడలు ఎర్రగాగాని, తెల్లగాగాని ఉంటాయి; ఆకులూ కాడలూ కూరదినుసుగా వాడతారు (కో. 1-5, 8, 10-14, 16, 20, 21, 23, 25, 28, 30-32, 36, 39, 41, 43, 45; తె. 1, 13, 19, 20, 22-24, 26-28, 31, 37-39; రా. 1-3, 17); భేదాలు:

**ఎర్రతోటకూర** ఎన్నూ కాడలూ ఎర్రగాఉండే రకం (కో. 23, 25).

**ఎర్రదలతోటాకు** చూ. ఎర్రతోటకూర (కో. 41).

**కొయ్యతోటకూర** ఉ. కొయ్యతోటకూర, కొయుతోటకూర; పర్యా. చూ. చిర్రి. ఏడాది పొడుగునా పెరిగేరకం; *A. tristis*, Linn; తొడిమెలు, కాడలు పొడుగు; గింజలరంగు తెలుపు లేక పసుపుపచ్చ; ఆకులు కోసేకొద్దీ కొత్తాకు వేస్తూనేఉంటుంది (కో. 12-14, 16, 21; తె. 37).

**చిలకతోటకూర** తోటకూరజాతికి చెందిన కలుపుమొక్క; *A. fasciatus*, Roxb.; ఆకును కొందరు కూరగా వండుకొంటారు (కో. 37).

**తెల్లతోటకూర** ఉ. తెల్లదోటకూర; చూ. పెరుగుతోటకూర (కో. 23).

**పెరుక్కూర** (<పెరుగు + కూర) చూ. పెరుగుతోటకూర (కో. 5; తె. 38).

**పెరుగాకు** చూ. పెరుగుతోటకూర (కో. 1, 4; రా. 1).

**పెరుగుతోటకూర** ఉ. పెరుగుదోటకూర. తోటకూర రకాల్లో ఎక్కువ కూరదినుసుగా ఉపయోగించే రకం; *A. gangeticus*, Linn.; కాడలు తెలుపు, ఆకు వెడల్పు (కో. 8, 11-14, 16, 20, 21, 25; తె. 37-39).

**మంచితోటాకు** చూ. పెరుగుతోటకూర (కో. 11).

**ముండ్లతోటకూర** కాడకు ముళ్ళుండేరకం; *A. spinosus*, Willd.; దీన్నే 'దొగ్గలికూర' అని అంటారట; చూ. దొగ్గలి (తె. 20).

**దంటు** ఉ. దొంటు; పర్యా. చూ. తోటకూర. తెనుగు దేశంలో విరివిగా పెంచే ఆకుకూర; *Amarantus gangeticus*, Linn; ముఖ్యంగా పెరుగుతోటకూరకే ఈ పేరు వాడుక; కాడలు తెలుపు, ఆకు వెడల్పు; ఆకు, కాడలు కూరదినుసుగా ఉపయోగిస్తారు (రా. 14, 15, 18).

**దురదగొండి** ఒకరకం కలుపుమొక్క; *Tragia*

*involucrata*, Linn.; వేళ్ళు చర్మవ్యాధుల చికిత్సలో ఉపయోగిస్తారు; ఆకును కొందరు కూరగా వండుకొంటారు (కో. 14).

**దూసర** ఉ. దూసరి. మెట్టనేలల్లో విరివిగా పెరిగే తీగె మొక్క; *Cocculus villosus*, DC.; దీని ఆకులు కూరగా వండుకొంటారు; వేళ్ళ కషాయం, ఆకు పసరు ఔషధాల్లో ఉపయోగిస్తాయి (రా. 18).

**దేవదారు** ఉ. దేవదారి, దేవదేవు. ఇరవై ఇరవైఅయిదడుగుల ఎత్తున పొదగాపెరిగే చిన్నచెట్టు; *Erythroxylon monogynum*, Roxb.; దీని లేత ఆకులు, కూరగా వండుకుతింటారట (కో. 1, 3, 11).

**దొగ్గలి** ఉ. దొగ్గల (వాడుక: దొగ్గలాకు, దొగ్గల కూర). తోటకూర జాతికిచెందిన కూరాకు మొక్క; ముళ్ళ తోటకూర (చూ. తోటకూర); *Amarantus polygamus*, Roxb. (కో. 11, 23, 25, 38, 39, 41; తె. 1, 9, 21-23, 33); భేదాలు: ఎఱ్ఱదొగ్గలి, తురక దొగ్గలి, తెల్లదొగ్గలి, నలికదొగ్గలి.

**దొండ** రూ. దొండ, తొండ(కాయ). పొదగాపెరిగి విరివిగా కాపుకాసే తీగపైరు; *Coccinia indica*, W. & A.; కాయలు గుండ్రంగా రెండూ రెండున్నర అంగుళాల పొడవున ఉంటాయి; పచ్చికాయలు కూరగా వండుకొంటారు; కొందరు లేత ఆకుకూడా కూరదినుసుగా ఉపయోగిస్తారట (కో. 5, 6, 13, 15, 16, 21-23, 41, 43, 45; తె. 1, 2, 24, 26, 27, 31); భేదాలు:
**ఆదొండ** చూ. ఆరదొండ (తె. 1, 31).
**ఆరదొండ** నేలమీదపాకే ముళ్ళతీగె; ఇది శాస్త్రీయంగా దొండజాతికి చెందదు; *Capparis horrida*, Linn; దొండపండ్లలాగా ఉండే దీనిపండ్లు కొందరు ఊరగాయకు ఉపయోగిస్తారు; ఆకుపసరు చర్మవ్యాధుల చికిత్సలో పనికి వస్తుంది (కో. 5, 21).
**కాకిదొండ** (కో. 23).
**కూరదొండ** మామూలుదొండ (కో. 5).
**చేదుదొండ** చూ. పిచ్చిదొండ (కో. 13).
**జయపూరుదొండ** పొడుగుకాయరకం (కో. 23).
**తియ్యదొండ** ఉ. తీదొండ; చూ. కూరదొండ (కో. 13; తె. 1).
**నైజాందొండ** చిన్నకాయరకం (కో. 22).
**పాముదొండ** మందుకు మాత్రమే పనికివచ్చే రకం (కో. 5).
**పిచ్చిదొండ** తాటిచెట్లకు అల్లుకొనే ఒకరకం తీగెమొక్క; కాయ గుండ్రంగా ఉంటుంది; ఈ కాయలు తినరు; వీటిని 'అవ్వగూదకాయ' అనికూడా అంటారట (కో. 5).
**పూరుదొండ** ? కూరదొండ (కో. 15).
**మంచిదొండ** మంచిదొండ; చూ. కూరదొండ (తె. 31).

**దోస** మెట్టపొలాల్లోనూ పెరళ్ళలోనూ వానాకాలం పెరిగే తీగెపైరు (cucumber) *Cucumis sativus*, Linn.; కాయలు కోలగాగాని గుండ్రంగాగాని ఉంటాయి; వీటిని ఎన్నోరకాల వంటకాల్లో ఉపయోగిస్తారు (కో. 1, 6-16, 20, 22-24, 27, 28, 31, 32, 44, 45; తె. 1, 7, 9, 31, 34, 37-39, 41; రా. 9, 15, 18, 20); భేదాలు:
**కుక్కదోస** చూ. బుడమదోస (కో. 31).
**చేదుదోస** ఉ. చేద్దోస; చూ. బుడమదోస (కో. 14, 15).
**తియ్యదోస** ? చూ. నక్కదోస (కో. 13).
**నక్కదోస** చిన్నకాయ రకం; మామూలుగా బంగారు చాయలో ఉంటుంది; వంటకాలకు ఉపయోగించే రకం (కో. 1, 6, 8, 16, 20).
**పడమటదోస** చిన్నకాయ; పులుపెక్కువ; ఎక్కువకాలం నిలవ ఉంటాయి (కో. 22).
**పందిరిదోస** (కో. 23; తె. 1, 31, 37).
**పెద్దదోస** కాయ పెద్దది; ఆకుపచ్చటి రంగులో ఉంటుంది; పులుపు తక్కువ (కో. 6, 8, 11-13).
**బారుదోస** చూ. పెద్దదోస (కో. 20).
**బుడమదోస** కాయ నూగునూగుగా చిన్నదిగా ఉంటుంది; చేదు; ఆకుపచ్చని చారలుంటాయి; ఊరగాయగా ఉపయోగిస్తారు; *Cucumis maderaspatanus*, Roxb.; (కో. 8, 9, 11, 13, 20; తె. 1, 37).
**బుడ్డిదోస** చూ. బుడమదోస (కో. 6, 15).
**మంచిదోస** వంటకాల్లో ఉపయోగించేది (కో. 14).
**ములుదోస** (తె. 1).
**లంకదోస** ఎఱ్ఱటి పెద్దకాయల రకం; ఎక్కువకాలం నిలవ ఉండవు (కో. 14, 22).
**సేనెదోస** ? తియ్యదోస (తె. 31).

**నల్లేరు** నాలుగుపలకల కాడలతో పెరిగే చెట్టు; లేతకాడలు వంటకాల్లో ఉపయోగిస్తారు; చూ. నల్లేరు, పుట 170 (కో. 11).

**నాగరాసికూర** రూ. నామెరాసి. ఒకరకం ఆకుకూర (కో. 43).

**నామెరాసి** చూ. నాగరాసి(కూర) (కో. 43).

**నేలతంగెడు** వరిపొలాల్లో కోతలు కాగానే పెంచే రెండు మూడడుగుల ఎత్తైన మొక్క; *Cassia angustifolia*, Vahl; ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు; కొందరు లేత ఆకును కూరదినుసుగా వాడతారు; చూ. తంగెడు, పుట 167 (కో. 11).

**పగడపుకూర** ఒకరకం ఆకుకూర (కో. 39).

**పచ్చకూర** పర్యా. చెంచలి. ఒకటి రెండడుగుల ఎత్తు

పెరిగే మొక్క; *Digera arvensis*, Forsk.; *D. muricata*, Mart.; ఆకుకూరదినుసుగాను, పశువులకు పచ్చిమేతగాను ఉపయోగిస్తాయి; చూ. చెంచలి, పుట 165 (తె. 19, 29, 31, 34, 42).

పాయల ఉ. పాయిల, పాయిలి, బాయిల, బాయిలి, వాయల, వాయిలి; (వాడుక : పాయలకూర, పాయలాకు); రూ. పావలి; పర్యా. బచ్చలి. తెనుగుదేశంలో విస్తారంగా ఉపయోగించే కూరాకుమొక్క; *Portulaca sp.*, Linn; చూ. పాయలాకు, పుట 172 (కో. 8, 23, 25; తె. 6, 9, 10, 14, 17-20, 22-29, 31, 33, 37, 38); భేదాలు :

గంగపాయల(కూర) ఉ. గంగపాయిల, గంగపాయిలి, గంగబాయిలి, గంగవాయల; రూ. గంగపావలి. తెలంగాణాలో విస్తారంగా ఉపయోగించే ఆకుకూర; *P. oleracea*, Linn. (తె. 6, 9, 17, 18, 20, 22-29, 31, 37, 38).

బొడ్డుపాయల ఉ. బొడ్డుపాయల (కో. 23, 25; తె. 37).

సన్నపాయల(కూర) ఉ. సన్నవాయిలికూర; *P. quadrifida*, Linn. (తె. 19, 26, 27).

పాల (వాడుక : పాలకూర, పాలాకు). ఆకుకూరగా ఉపయోగించే సన్నటి తీగెమొక్క; *Oxystelma esculentum*, Br.; దీని కషాయం నోటిపుండ్లు మానటానికి పుక్కిలిస్తారు (కో. 11; తె. 1, 6, 7, 9, 11-13, 16, 18, 20, 22-24, 27, 28, 32, 35, 42).

పావలి చూ. పాయల (తె. 7, 11, 12, 32); భేదం;

గంగపావలి చూ. గంగపాయల(కూర) (తె. 7, 11, 12, 32).

పిండిదుంప పర్యా. చూ. గెనుసు(గడ్డ). నాలుగైదు నెలల్లో ఒకుపుకువచ్చే దుంప; *Ipomaea batatas*, Lam.; ఈ దుంపలు కూరదినుసుగా గాని, ప్రధానాహారంగా గాని తింటారు (కో. 45).

పిప్పింటేకు ఒకటి రెండడుగుల ఎత్తుపెరిగే మొండి కలుపుమొక్క; *Acalypha indica*, Linn.; ఆకు (?) కూరదినుసుగాను, చర్మవ్యాధుల చికిత్సలోను ఉపయోగిస్తారు (కో. 13).

పుచ్చ దోసజాతికి చెందిన తీగెపైరు; దీంట్లో పండ్లుగా తినేవి, కూరగా ఉపయోగించేవికూడా ఉన్నాయి; *Cucumis sp.* (కో. 1, 5, 6, 8, 27, 31, 32, 44, 45 : తె. 37; రా. 20); భేదాలు :

అడవిపుచ్చ కాయ చేదుగాఉంటుంది; *C. pubescens*, Willd. (తె. 37).

కరపుచ్చ దోహదంగా పెట్టిన గడలకు అల్లుకొని పెద్ద కాయలు కాసేరకం; 'కర్బూజా'కు తెలుగుసేత కావచ్చు; *Citrullus vulgaris* Schrad; పండ్లు ఎండాకాలంలో చలవకు తింటారు; కండ ఎర్రగాగాని తెల్లగాగాని ఉంటుంది (కో. 5; రా. 20).

కూరపుచ్చ చిన్నసైజుకాయ; సొరకాయరుచి ఉండేరకం (తె. 37).

పెద్దపుచ్చ (కో. 27, 31).

వెర్రిపుచ్చ బంజరునేలల్లో సాగుచేయకుండా పెరిగే మొక్క; గుజ్జు చేదుగాఉంటుంది; వైద్యంలో వాడుక; *Citrullus colocynthis*, Schrad. (కో. 5, 27, 31).

పుంటి(కూర) ఉ. పొంటి(కూర); చూ. పుంది (తె. 13, 16, 17-20, 23, 24, 26, 27).

పుండి (వాడుక : పుండికూర, పుండైరు); రూ. పుంటి(కూర); పర్యా. చూ. గోంగూర. ఏమునుంచి పన్నెండడుగుల ఎత్తుపెరిగే ఆకుకూర చెట్టు; *Hibiscus cannabinus*, Linn.; ఎర్రరేగడ, గరువునేలల్లో బాగా పెరుగుతుంది; మెట్టపైర్లలో అక్కడక్కడ పైరుగాకూడా వేస్తారు; 3-5 నెల్లలో కోతకువస్తుంది; కాడలు కుళ్ళబెట్టి నార తయారుచేస్తారు; ఆకు పులుపు; ఇవి వంటకాలకు, పచ్చళ్ళకు, కాడలు పశువులమేతకు పనికివస్తాయి (తె. 1, 3, 5, 6-12, 14, 34; రా. 16, 17, 21, 22); భేదాలు :

ఎరపుండి ఎర్రగోంగూర (తె. 1, 34).

తెల్లపుండి తెల్లగోంగూర (తె. 1, 34).

పుదీన(నా) ఉ. పూదీన, పొదీనా. చల్లటి వాతావరణంలో ఏడాదిపొడుగునా గుబురుగా పెరిగే చిన్నమొక్క; *Mentha arvensis*, Linn.; ఆకులు సువాసనకలిగి ఉంటాయి; వీటిని పచ్చడి చేసుకొంటారు; దేశీయౌషధాల్లో దీని వాడుక విస్తారం (కో. 2; తె. 27, 28, 35; రా. 15, 16).

పులిచింత ఒకరకం కలుపుమొక్క, 'చెంచలి' మొక్కలాగా ఉంటుంది; *Bauhinia malabarica*, (?) *Oxalis corniculata*, Linn; లేత ఆకులు కూరగా వండుకొంటారు (తె. 1).

పెండలం ఉ. పెండ్లం; పర్యా. నైగడ్డ. నీటివసతున్న చోటగాని, మంచివానలు పడేచోటగాని పెరిగే తీగమొక్క; *Dioscorea alata*, Linn.; సెప్టెంబరులో దుంప నాటి నవంబరులో పెళ్ళగిస్తారు; నేలదున్ని చంద్రాలుపెట్టి ఎరువువేసి దుంపముక్కలు పాతిపెట్టి నీళ్ళుపోస్తారు; ఎనిమిది రోజులకల్లా మొలకవస్తుంది; తీగెకు దోహదంగా ఎత్తైన గడలు నిలబెడతారు; తీగ షష్టైఅడుగుల వరకు దాకా గడలకు, కుడివైపు మెలికలతో అల్లుకొంటుంది;

నేలలో గడ్డ పొడుగ్గా లావుగా పెరుగుతుంది; ఎకరానికి మూడునుంచి పద్నాలుగు టన్నులదాకా దుంప కావచ్చు; దీన్ని కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 4, 5, 15, 20-22, 36, 39, 42, 43; తె. 1, 28, 39; రా. 1); భేదాలు:

**ఎఱ్ఱపెండలం** ఉ. ఎరపెండలం. చెక్క ఎఱ్ఱగాఉండే రకం; ? *D. purpurea*, Roxb. (కో. 21; తె. 39).

**కఱ్ఱపెండలం** ఉ. కరపెండ్లం; పెండలం తెగకుచెందిన దుంప; దీన్ని దీదలు ఉడకబెట్టుకొని ప్రధానాహారంగా తింటారు (కో. 41, 45; తె. 1).

**తెల్లపెండలం** (కో. 21; తె. 39).

**నీటిపెండలం** (కో. 36).

**బూతపెండలం** ? అడవుల్లో పెరిగేరకం; *D. pentaphylla*, Linn. (రా. 1).

**పేరంటాలాకు** ఒకరకం ఆకుకూర; *Corchorus olitorius*, Linn.; ఈ చెట్టుపూలు ముదురుపసుపు రంగులోను, గింజలు నల్లగాను ఉంటాయి; కాయలు గుండ్రంగా పొడుగ్గా ఉంటాయి; లేతఆకు కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 11).

**పొట్ల** ఉ. పొట్ట, పొట్లె; రూ. పొళ్ళ. తోటల్లోను; పెరళ్ళలోను కాయలకోసం పెంచే తీగెమొక్క; (snake-gourd) *Trichosanthes anguina*, Linn.; కాయలు 1-6 అడుగుల పొడవున గుండ్రంగా తెల్లటి (లేక ఆకుపచ్చటి) చారలతో ఉంటాయి (కో. 16, 20-23, 30, 39, 41, 45; తె. 1, 7, 11, 13, 16-28, 31, 33, 34, 36-39; రా. 18, 21); భేదాలు:

**కోలపొట్ల** (తె. 37).

**చారపొట్ల** ఉ. సారపొట్ట (కో. 22, 41; తె. 1).

**జంటపొట్ల** ఉ. జంటపొట్ట. కాయలు జంటలు జంటలుగా దిగేరకం (కో. 5, 22).

**తెల్లపొట్ల** తెల్లచారల కాయలుండే రకం (కో. 39; తె. 34).

**నల్లపొట్ల** ఉ. నిడిపొట్లు, పొడుగాటి కాయరకం (కో. 22, 39; తె. 34.)

**నిడిపొట్ల** ఉ. నిడిపొట్లు. పొడుగాటి కాయరకం (తె. 1).

**పచ్చపొట్ల** చూ. నల్లపొట్ల (తె. 1).

**పిచ్చికపొట్ల** ఉ. పిచికపొట్ట, పిచికెపొట్ల (కో. 5, 21, 22).

**పెద్దపొట్ల** (కో. 5).

**పొట్టిపొట్ల** (తె. 1, 37).

**బారుపొట్ల** ఉ. బారుపొట్ట (కో. 21).

**పొన్నగంటి(కూర)** ఉ. పొన్నిగంటి-, పొన్గెంటి-. ఎక్కువకాడలతోను, సన్నటి పొడుగాటి ఆకులతోను పొదగాపెరిగే మొక్క; *Alternanthera sessilis*, R. Br.; ఆకు, కూరగా వండుకొంటారు (1, 2, 4, 6, 21, 23, 25; తె. 1, 18, 20, 27, 28, 33, 39; రా. 1).

**పొలపాకు** ఉ. పలపాకు. ఒకరకం ఆకుకూర (కో. 13, 14).

**పొళ్ళ** ఉ. పొల్ల; చూ. పొట్ల (కో. 1, 3-6, 8-15; తె. 35; రా. 1, 9, 11, 16, 24-26, 28).

**బంకోట** ఒకరకం ఆకుకూర (తె. 1).

**బంగాళాదుంప** పర్యా. చూ. ఉర్లగడ్డ. నీటివసతున్న నల్లనేలల్లో సాగుచేసి పెంచే దుంపపైరు; (potato) *Solanum tuberosum*, Linn.; దుంపలు కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 44, 45, 50).

**బచ్చలి** (వాడుక: బచ్చలాకు, బచ్చలికూర) ఉ. బచ్చల; పర్యా. చూ. పాయల. తెనుగుదేశంలో విస్తారంగా ఉపయోగించే కూరాకుమొక్క; *Portulaca oleracea*, Linn. (కో. 1, 4, 13, 14, 20, 21, 23, 25, 28, 39, 41, 43, 45, 47; తె. 18, 22, 23, 24, 26-29, 31, 33-35, 37-39, 42); భేదాలు:

**తివ్వబచ్చల** చూ. తీగెబచ్చలి (కో. 47).

**తీగెబచ్చలి** ఉ. తీగబచ్చలి. గడలకు అల్లుపెట్టే రకం (కో. 23; తె. 37).

**పుల్లబచ్చలి** బచ్చలి ఆకులాగానే ఉంటుంది, కాని ఆ జాతికి చెందిందికాదు; *Vitis setosa* (కో. 13, 21).

**పెండ్లిబచ్చలి** (తె. 28).

**పొట్టిబచ్చలి** (తె. 28).

**బఱ్ఱెబచ్చలి** ఉ. బఱ్ఱెబచ్చల (కో. 21).

**బప్పం** 'పాయిల' జాతికిచెందిన కూరాకుమొక్క; పుల్లపాయిల (కో. 45).

**బలుసు** ఉ. బల్సు. పొలాలకు కంచెగావేసే మొక్క; *Canthium parviflorum*, Lam.; ఆకులు కూరదినుసుగా ఉపయోగిస్తారు; కాడలనుంచి నారతీస్తారు (కో. 39, 45).

**బీర** వానాకాలంలో పెరళ్ళలోను, మెట్టపొలాల్లోను పెంచే తీగెపైరు; *Luffa acutangula*, Roxb.; కాయలు కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 1-6, 8-16, 20-23, 25, 27, 29, 31, 32, 39, 41-43, 45; తె. 1, 3, 5, 6, 9-14, 16-39, 41, 42; రా. 2-4, 6, 9, 11, 14-19, 21-28); భేదాలు:

**అంబటిబీర** చూ. నేతిబీర (రా. 23, 25).

**కొమ్ముబీర** (కో. 13, 21).

**గఱిబీర** చెక్క అరలరలుగా ఉండేరకం (కో. 20).

**గుత్తిబీర** చూ. నేతిబీర (కో. 21; తె. 34, 42).

చిట్టిబీర (కో. 20).
చిన్నబీర (కో. 43).
చేదుబీర (కో. 10; తె. 1).
జంటబీర (కో. 22).
తనబీర (కో. 6, 15, 27, 31).
నాటుబీర (కో. 13, 41).
నున్నబీర చూ. నేతిబీర (కో. 41).
నెలబీర (కో. 9, 22).
నేతిబీర మామూలు బీరకంటె కాయ చిన్నదిగాను తొక్క నునుపుగాను ఉంటుంది; *L. aegyptica*, Roxb.; కాయలు గుత్తులు గుత్తులుగా కాస్తాయి; వీటిని కూరదినుసుగా ఉపయోగిస్తారు (కో. 2-6, 8, 10-12, 22, 27; తె. 1, 9, 31, 34, 37, 38, 42; రా. 1, 15-17, 21, 26).
పిచచబీర (కో. 21).
పుల్లబీర (కో. 43, 45).
పెద్దబీర (కో. 5, 20, 22, 25, 29).
పొట్టిబీర (కో. 8, 31, 39, 42; తె. 1, 36; రా. 9).
పొడుగుబీర (కో. 8; తె. 1, 36; రా. 9).
పొలంబీర (కో. 14).
బుడ్డబీర (కో. 6, 15).
బొట్టుబీర (కో. 25).
మంచిబీర (కో. 9, 11, 15, 27, 31; తె. 9, 34, 37, 38).
మట్టిబీర (కో. 4, 5, 14, 25; తె. 37, 38, 42).
మడిబీర (కో. 39).
సొల్లుబీర (కో. 21).

బెండ తొలకరి తరవాత పెరళ్ళలోను, సారవంతమైన తోటల్లోను గింజలువేసి పెంచేచెట్టు; ఎత్తు 3-5 అడుగులు (Okra, lady-finger) *Hibiscus esculentus* Linn.; పసుపుపచ్చటి పూలు పూస్తుంది; కాయలు మొదలంతా కొన సన్నంగా, 5-10 అంగుళాల పొడవున ఉంటాయి; రెణ్ణెల్లలోపుగానే కాయలు కోతకువస్తాయి; వీటిని కూర దినుసుగా ఉపయోగిస్తారు; కాడలనుంచి తీసిన నార కాయితాల పరిశ్రమలో ఉపయోగిస్తారు; ఆకులు పశువుల మేతగా పనికివస్తాయి (కో. 1-6, 8-10, 12-15, 20-23, 25, 39, 41-43; తె. 1, 3-7, 9, 10, 13, 14, 16-29, 31, 32, 34-39; రా. 1-4, 6, 7, 9, 11, 14-19, 21, 23-26, 28); భేదాలు:
అరాశబెండ (కో. 3, 8; తె. 31).
ఎర్రబెండ (కో. 23).
ఏడాకులబెండ ఆకులు ఏడుమాత్రమే ఉంటాయి; నెల రోజులకే మొగ్గ కనిపిస్తుంది; కాయ పొట్టి; చూ. నెలబెండ (కో. 22, 23).
కొమ్ముబెండ (కో. 4, 6, 9, 13; తె. 1, 36).
చిట్టిబెండ (తె. 1, 36).
చిన్నబెండ (కో. 10).
తిరుపతిబెండ కాయ పొడుగురకం (తె. 5, 9).
దేశిబెండ (తె. 9).
నున్నబెండ (కో. 1, 4-6).
నూగుబెండ (కో. 1, 4-6, 13, 25; తె. 1, 5).
నెలబెండ చూ. ఏడాకులబెండ (కో. 3, 5, 8, 25).
పచ్చబెండ (తె. 1).
పూనాబెండ (కో. 22).
పెద్దబెండ పొడుగు కాయలు కాసేరకం (కో. 5, 21, 23).
పొట్టిబెండ చూ. ఏడాకులబెండ (కో. 25; తె. 1, 37).
బుడ్డబెండ చూ. ఏడాకులబెండ (తె. 5).
సీమబెండ (కో. 27).

బొద్ది జడలాగా అల్లుకుపోయే తీగమొక్క; *Rivea hypocrateriformis*, Chois.; ఆకులు కూరగా వండుకొంటారు (కో. 1, 4, 11; తె. 37).

బోదండం ? అడవిలో దొరికే ఒకరకం ఆకుకూర (కో. 45).

మటికె(కాయ) (<మరాఠీ 'మటికీ'); ఉ. మటిక-, మిటిక-, మొటిక-; పర్యా. గోరుచిక్కుడు(చూ. చిక్కుడు); మూడునుంచి పది అడుగుల ఎత్తువరకు పెరిగేచెట్టు; *Cyamopsis tetragonoloba*, Linn.; మూడు మూడున్నర నెల్లలో కాపుకు వస్తుంది; కాయలు గుత్తులు గుత్తులుగా 2-4 అంగుళాల పొడవున కాస్తాయి; వీటిని కూరగా వండుకొంటారు; ఆకు పచ్చిఎరువుగాను, పశువుల మేతగాను ఉపయోగిస్తుంది (కో. 3, 9; రా. 4, 6, 7, 9, 11, 18, 21-23, 27, 28).

మామిడెల్లం (మామిడి + అల్లం). కొండమీద విరివిగా పెరిగే పసుపుజాతికి చెందిన మొక్క; (mango-ginger) *Cucurma amada*, Roxb.; తోటల్లోను సారవంతమైన మెట్టనేలల్లోను పెంచుతారు; దీని వేళ్ళు వంటకాల్లో అల్లంగా వాడతారు; పచ్చిమామిడి వాసనవల్ల దీనికి పేరువచ్చింది; వైద్యంలో జీర్ణకారిగా ఉపయోగిస్తారు (కో. 22).

మారికూర ఉ. మారెకూర. ? ఒకరకం ఆకుకూర (కో. 43, 45).

మునగ రూ. ములగ. ఉష్ణప్రాంతాల్లో పెరిగే పెళుసుచెట్టు; (the drum-stick tree) *Moringa pterygosperma*, Goertn.; కాయలు ఒకటి ఒకటిన్నర అడుగులు పెరుగుతాయి; లేత ఆకులు, కాయలు వంటకాలుగా వాడతారు; బెరడునుంచి వచ్చే జిగురు, పూలు, వేళ్ళు దేశీయ

వైద్యంలో వాడతారు; కొయ్య నీలిరంగు తయారీలో ఉపయోగిస్తుంది; ఆకులు మేకలకు, గొర్రెలకు మేతగా కొట్టివేస్తారు (కో. 11-13, 15, 16, 29; తె. 37-39; రా. 2, 3, 18).

**ములగ** చూ. మునగ (కో. 23).

**ముల్లంగి** రూ. ఉల్లంగి; పర్యా. మూలిగడ్డ. ఎత్తైన కొండలమీద సాగుచేసి పెంచే దుంపపైరు; (radish) *Raphanus sativus*, Linn.; ఆకులు, వేరు వంట కాలుగా ఉపయోగిస్తాయి (కో. 4, 49; తె. 24, 38, 39; రా. 1, 15, 16, 18); భేదాలు :
**ఎర్రముల్లంగి** తోటల్లో పెంచే రకం (తె. 39).
**పచ్చముల్లంగి** (తె. 39).

**మూలిగడ్డ** (<హిం. మూలి); పర్యా. చూ. ముల్లంగి. ఎత్తైన కొండలమీద సాగుచేసి పెంచే దుంపపైరు; (radish) *Raphanus sativus*, Linn.; ఆకులు, వేరు వంట కాలుగా ఉపయోగిస్తాయి (తె. 22).

**మెంతి(కూర)** ఉ. మెంటం, మెంత్యూకర; రూ. మెంతినికూర. మెట్టనేలల్లో సాగుచేసి ఏటా పెంచే చిన్న మొక్క; *Trigonella foenumgraecum*, Linn; ఆకు, కూరదినుసుగా వాడతారు; గింజలు తాలింపుదినుసుగాను, ఔషధాల్లోను ఉపయోగిస్తారు (కో. 2, 20; తె. 6, 7, 11, 17-19, 22-28, 34-37).

**మెంతినికూర** చూ. మెంతి(కూర) (రా. 17).

**మొకరం** ఉ. మొగరం; రూ. మొరం(గడ్డ); పర్యా. చూ. గెనుసు(గడ్డ). నాలుగైదు నెల్లలో ఒడుపుకువచ్చే తీగెపైరు; *Ipomaea batatas*, Lam.; ఏడాది పొడుగునా బతుకుతుంది; వేళ్ళనంటిపెరిగే దుంపలను కూర దినుసుగా గాని ప్రధానాహారంగా గాని తింటారు; లేత ఆకులు కొందరు కూరగా వండుకొంటారు (తె. 35, 36, 47); భేదాలు :
**ఎర్రమొకరం** ఎర్రటి తొక్కఉండే రకం (తె. 2).
**తెల్లమొకరం** తెల్లతొక్క ఉండేరకం (తె. 1).

**మొరం(గడ్డ)** చూ. మొకరం (తె. 1); భేదాలు :
**ఎర్రమొరం** చూ. ఎర్రమొకరం (తె. 1).
**తెల్లమొరం** చూ. తెల్లమొకరం (తె. 1).

**రత్నపురిగడ్డ** పర్యా. చూ. గెనుసు(గడ్డ). నాలుగైదు నెల్లలో ఒడుపుకువచ్చే తీగెపైరు; *Ipomaea batatas*, Lam.; ఏడాదిపొడుగునా బతుకుతుంది; వేళ్ళనంటిపెరిగే దుంపలను కూరదినుసుగా గాని, ప్రధానాహారంగా గాని తింటారు; లేత ఆకులు కొందరు కూరగా వండుకొంటారు (తె. 13, 16, 20, 26, 27).

**రాతాళం** ఉ. రతాలు; (మరాఠీ రాతాళ్) పర్యా. చూ. గెనుసుగడ్డ. పెద్దసైజు గెనుసుగడ్డ; *Ipomaea batatas*, Lam.; తొక్క నల్లగాఉంటుంది (తె. 22, 23).

**రామములగ** ఉ. రామ్ములగ; పర్యా. టమోట, టోమాట, తక్కాళిపు(కాయ), తక్కాళివంకాయ. చల్లటి చోట్ల తోటల్లో పెంచే తీగెపైరు; (tomato) *Lycopersicum esculentum* Mill.; ఈ పైరు దక్షిణఅమెరికా నుంచి మిగిలిన దేశాలకు వ్యాపించింది; కాయలు, పండ్లు వంటకాల్లో ఉపయోగిస్తారు (కో. 6, 12, 14, 29, 33; తె. 37-39, 41; రా. 23).

**వంకాయ** ఉ. అంకాయ, ఒంకాయ. తోటల్లోను పెరళ్ళలోను పెంచే కాయగూర; (egg-plant, brinjal) *Solanum melongena*, Linn.; ఇసుక, గరువు నేలల్లో బాగా పెరుగుతుంది; నాలుగైదు నెల్లలో కాపుకు వస్తుంది; కాయలు చాలా రకాల వంటకాల్లో ఉపయోగిస్తారు; నిలవ ఉండటానికి ముక్కలు కోసి, ఎండబెట్టి వరుగు చేస్తారు (కో. 5-17, 19-23, 25, 27-29, 32, 33, 39, 41-43, 45; తె. 1, 7, 9, 11-14, 16-20, 22-29, 31-39, 41, 42; రా. 2-4, 7, 14-16, 18, 19, 21, 22, 24, 25); భేదాలు :
**అట్టువంకాయ** ఉ. అట్టవంకాయ, అట్టొంకాయ. తీగె మొక్కకు కాసేరకం (రా. 15, 16).
**కర్పూరపుకాయ** కాయ లావుగా గుండ్రంగా ఉంటుంది; తొడిమెలకు ముళ్ళుంటాయి (కో. 13, 15, 19).
**కవులూరివంకాయ** గుండ్రటి కాయరకం (కో. 23, 25).
**కస్తూరికాయ** ఉ. కత్తూరికాయ చూ. కర్పూరపు వంకాయ (కో. 33).
**గంజివంకాయ** (కో. 6, 8, 15; తె. 35-38; రా. 18).
**గాడిదవంకాయ** (కో. 6, 8, 9).
**గుత్తివంకాయ** కాయలు మూడేసి కలిసి గుత్తిగా కాసేరకం (కో. 5, 22, 23, 25).
**తీగెవంకాయ** చూ. అట్టువంకాయ (తె. 37).
**తెల్లవంకాయ** కాయ తెల్లగా లావుగా గుండ్రంగాఉంటుంది (కో. 5, 10, 12, 14, 22, 23, 25, 27-29, 33; తె. 1, 35-37; రా. 15).
**నల్లవంకాయ** సన్నగా నల్లగా పొడుగ్గా ఉండేకాయ (కో. 5, 10-14, 20, 22, 23, 25, 27; తె. 1, 36-38; రా. 15).
**నీటివంకాయ** నల్లగా పొడుగ్గాఉండేరకం (కో. 28, 29, 33).
**పచ్చవంకాయ** చూ. తెల్లవంకాయ (తె. 1, 36).
**పాలవంకాయ** చూ. తెల్లవంకాయ (కో. 13).
**పున్నవంకాయ** పెద్దకాయరకం; తెల్లవంకాయ కావచ్చు (తె. 37).
**పెద్దవంకాయ** (కో. 8, 12; తె. 9).
**పొట్టివంకాయ** (తె. 1).

ముళ్ళవంకాయ తొడిమెకు ముళ్ళుంటాయి; కాయ తెల్లగా గుండ్రంగా ఉంటుంది (కో. 6, 8-11, 14, 27-29, 33 తె. 1, 35, 36).

వాక చూ. వాకుడు (తె. 22).

వాకుడు రూ. వాక. ఇసక, చట్టునేలల్లో విరివిగా పెరిగే ముళ్ళచెట్టు; *Carissa carandas*, Linn.; గుండ్రటి పుల్లటికాయలు కాస్తుంది; వీటిని పప్పులో కలిపి వండుకొంటారు; ఆకులు పట్టు పురుగులకు ఆహారం (కో. 14, 15).

వావింటాకు (*వావిలి, విణ. వావింటి); ఉ. వామింటాకు. ఆకులు ఎక్కువగా మందుల్లో ఉపయోగిస్తారు; ? ఆకుకూరగాకూడా వాడుక; ? *Oleone pentaphylla*, Brown.; 'వాయింట, వావింట' ఒక దినుసుకూరాకు మొక్క (శబ్దరత్నాకరము) (కో. 6, 13).

వెలగ ఉ. ఎలక, ఎలగ, ఎలక్క, ఎల్గ; రూ. వెలం. ఒకరకం పండ్లచెట్టు; (wood-apple) *Feronia elephantum*, Correa.; కాయ గుండ్రంగా గట్టి పెంకుతోను, లోపల గుజ్జుతోను ఉంటుంది; పండుగుజ్జు వంటకాల్లో ఉపయోగిస్తారు; ఈ చెట్టునుంచి వచ్చే జిగురు ఔషధాల్లో చాలారకాలుగా వాడతారు (కో. 11; తె. 1, 17, 18, 21, 22, 24, 26, 28).

వెలం చూ. వెలగ (కో. 41).

సాపరజంగాకు ఒకరకం ఆకుకూర (కో. 4).

సీకాయ వంకర ముళ్ళుండే కాడలతో అడవుల్లో పొదగాపెరిగే చెట్టు; *Acacia concinna*, DC.; ఆకు పుల్లగాఉంటుంది; కొందరు చింతపండుకు బదులు ఉపయోగిస్తారట; పచ్చడిగాగూడా చేసుకొంటారు; కాయలు సబ్బుగా ఉపయోగిస్తాయి (కో. 1).

సేసిరేసి(కూర) ఒకరకం ఆకుకూర; చూ. 'చేతరాసి, చేతలాసి'; *Pharnaceum Mollugo diffusa*, Ainsl.; Brown (కో. 48).

సొత్తికూర ముల్లంగి ఆకు; దీన్ని కూరదినుసుగా ఉపయోగిస్తారు; చూ. ముల్లంగి (కో. 50).

సొర పర్యా. అనిపె, ఆనగ, ఆనప, ఆనిగెం. పెరళ్ళలో ఇంటిమీదికి అల్లుపెట్టి పెంచే తీగెమొక్క; (bottle gourd) *Lagenaria vulgaris*, Seringe; ? *Cucurbita Sp.*; కాయ తొడిమవైపు సన్నం అడుగువైపు లావు; లేతాకుపచ్చరంగులో ఉంటుంది; పొడవు 1-7 అడుగులదాకా ఉండవచ్చు; దీన్ని కూరదినుసుగా ఉపయోగిస్తారు; ఆకుపసరు, గింజలనూనె వైద్యంలో ఉపయోగిస్తారు; గుజ్జు తొలిచిన ఎండుబుర్ర పాత్రగాను, నాగస్వరంగాను ఉపయోగిస్తారు (కో. 1-6, 8-16, 19-23, 25, 31, 32; తె. 3, 17, 20, 37-39, 42; రా. 1-4, 6, 7, 9, 14, 15, 17, 18, 21-25, 27); భేదాలు:

కాడిసొర (కో. 9, 13).

కిన్నెరసొర కాయగుండ్రంగాఉండేరకం(తె.39,42;రా.9).

కుంటసొర కాయ పనసకాయ ఆకారంలో ఉండేరకం (కో. 20, 22).

కొమ్మిసొర (కో. 25).

కోలసొర (తె. 39).

గుండుసొర (కో. 12, 23; తె. 37, 39; రా. 9).

గుమ్మడిసొర ? చూ. కిన్నెరసొర (కో. 13).

తెల్లసొర (తె. 3, 37).

నల్లసొర (కో. 15, 25, 31; తె. 3, 37, 39; రా. 9).

నాగసొర అడవుల్లో పెరిగేరకం; కాయ పేడు మందం; గుజ్జు చేదు; దీన్ని ఎండబెట్టి గుజ్జుతొలిచి పాములవాళ్ళు నాగస్వరం చేసుకొంటారు (కో. 9, 10, 15, 19, 20; తె. 3, 37; రా. 9).

పాముసొర చూ. నాగసొర (కో. 31).

పాలసొర (తె. 38, 39).

పెట్టెసొర చూ. కిన్నెరసొర (కో. 5, 6, 8, 10, 14,31).

పొట్టిసొర (కో. 16).

పొడుగుసొర (కో. 5, 6, 11, 14-16; తె. 42).

బారుసొర (కో. 21-23).

బిందెసొర (కో. 11).

బుర్రసొర చూ. నాగసొర (తె. 42).

## 4. రొక్కపుదినుసులు, పండ్లు

**అంజూర** (<హిం. అంజీర్) అత్తితెగకుచెందిన చిన్న చెట్టు; *Ficus carica*, Linn.; ఆరేడడుగుల ఎత్తు; పండ్లను చక్కెరపాకులో మాగబెట్టి తింటారు (తె. 1, 10; రా. 23).

**అత్తి** పర్యా. బొద్ద, మేడి. ఒకరకం చిన్న పండ్లచెట్టు; (fig tree) *Ficus glometra*, Roxb ; బెరడు రంగులతయారీకి ఉపయోగిస్తుంది ; పచ్చికాయలు కూరకు, పండ్లు తింటానికి; బోదెమీద లక్క తయారవుతుంది (కో. 6, 8, 14).

**అల్లి** పెద్దచెట్టు; *Memecylon sp.*, Linn.; పూలు, ఆకులనుంచి తయారైన లేతపసుపురంగు చాపల పరిశ్రమల్లో ఉపయోగిస్తారు ; ఎండాకాలంలో పండే పండ్లు తింటానికి అనువుగా ఉంటాయి (కో. 39, 41, 45).

**అవిసె** ఉ. అవిశ, అవిసి. ఒకరకం నూనెగింజలచెట్టు; (Linseed, flax) *Linum usitatissimum*, Linn.; గింజల నూనె వార్నీషులు, రంగులు, అంచుసిరా, మొ. వాటి తయారీలో వాడతారు; పట్టనుంచి తీసిన నార (linen) గుడ్డల పరిశ్రమలో ఉపయోగిస్తుంది (తె. 9-11, 13, 17, 18, 21-23, 34); భేదాలు :
గుండవిసె (తె. 34).
తెల్లవిసె (తె. 34).
నల్లవిసె (తె. 34).

**ఆముదాలు** (బహు.) ఉ. ఆందాలు ; ఆందేలు, ఆమదాలు, ఆమిదాలు, ఆమిదేలు, ఆమెదాలు. ఒకరకం నూనెగింజలు; చెట్టుపేరు (castoroil plant) *Ricinus communis*, Linn.; (కో. 2-9, 11, 14, 18, 19, 24, 28, 30, 32, 37, 38, 43, 45 ; తె. 1, 2, 4, 6-9, 11-14, 17, 19-39, 41, 42; రా. 1-6, 8, 10-12, 14-28); భేదాలు :
ఎర్రాముదాలు ఉ. ఎర్రాందేలు, ఎర్రాండ్రేలు (తె. 33; రా. 6).
గిడ్డాముదాలు (కో. 4).
చిట్టాముదాలు ఉ. చిట్టాందేలు (కో. 5, 11, 18, 19, 43, 45 ; తె. 38 ; రా. 6).
చిన్నాముదాలు చిన్నాందేలు (కో. 9; తె. 6, 34, 37).
పెద్దాముదాలు ఉ. పెద్దాంద్రేలు, పెద్దామదాలు (కో. 4-7, 9, 11, 18, 19, 34, 37, 38, 43, 45).
ముద్దాముదాలు ఉ. ముద్దాందేలు (తె. 33).
సర్కారాముదాలు ఉ. సర్కారాంద్రేలు (తె. 6, 7).

**ఆవాలు** (బహు.), పర్యా. సాసవ(లు). మూడునుంచి అయిదడుగుల ఎత్తుదాకా పెరిగే గింజల చెట్టు; *Brassica juncea*, Corr.; *B. nigra*, Linn.; కాయలు ఒకటి రెండంగుళాల పొడవుంటాయి ; గింజలు తాలింపు దినుసు ; గింజలనుంచి తయారుచేసిన నూనె ఔషధాలకు, వంటకాలకు ఉపయోగిస్తుంది (తె. 7, 11, 18, 19, 23-26).

**ఇరికి** పర్యా. నక్కెరు. అక్కడక్కడ తోటల్లో పెంచే పండ్లచెట్టు; sebesten *Cordia Myxa*, Linn.; ఏప్రిల్, మే నెలల్లో పండే పండ్లు కొందరు తింటారు ; పట్ట నార తాళ్ళకు, కొయ్య ఓడల నిర్మాణానికి ఉపయోగిస్తారు ; బోదెమీద లక్క తయారవుతుంది (కో. 13; తె. 1).

**ఇలాతికాయ** పర్యా. చూ. వేరుసెనగ. మెట్టనేలల్లో విరివిగా పండించే అమెరికాదేశపు చిన్నమొక్క ; (pea nut or ground nut) *Archis hypogaea*, Linn ; నేలలో ఊడల నంటుకొని పెరిగే కాయల గింజలు, నూనె దినుసుగాను, ఆహారపదార్థంగాను ఉపయోగిస్తాయి (తె. 9, 10).

**ఇనరుక** చూ. ఉసిరిక (రా. 23).

**ఈత** సూదుల్లాంటి కొనలున్న ఆకులతో పెరిగేచెట్టు; *Phoenix sp.*, Roxb.; ఎండిన ఆకులు చాపలు, బుట్టల అల్లకానికి కాడలనార తాళ్ళు మొ. వాటికి, పండ్లు తింటానికి ఉపయోగిస్తాయి (కో. 2, 6, 15, 39, 41, 45; తె. 28, 37, 39; రా. 1) ; భేదాలు :
చిట్టీత నేల నానుకొని పొదగాపెరిగే చిన్నచెట్టు; *P. farinifera*, Willd.; బోదె అట్టే ఉండదు ; పండ్లు చిన్నవి, గుజ్జు తక్కువ (కో. 2, 6, 15 ; రా. 1).
పెద్దీత ముప్పై నలభై అడుగులఎత్తు పెరిగేరకం; *P. sylvestris*, Roxb.; ఎండాకాలంలో పండే పండ్లు తింటానికి అనువుగా ఉంటాయి ; ఆకులు, బుట్టలు చాపలు మొ. వాటి అల్లకానికి పనికివస్తాయి ; దీని కల్లు బెల్లం, చక్కెర పరిశ్రమల్లో వాడతారు (కో. 2, 6 ; రా. 1).

**ఉసిరిక** ఉష్ణప్రాంతాల్లో పెరిగేచెట్టు; *Phyllanthus embica*, Linn.; కాయలు, చెట్టుబెరడు, ఆకులు నల్లరంగు చెయ్యటానికి, తోళ్ళ పదునుకు ఉపయోగపడతాయి ; పండ్లు ఊరగాయకు వాడుక (కో. 9-11, 15).

**ఊటి** పర్యా. పిసిని, పిసినికి. ఒకరకం చిన్నచెట్టు; *Maba buxifolia*, Roxb.; ఎండాకాలంలో పండ్లు పండుతాయి ; ఇవి తింటారు (కో. 5, 14; రా. 1).

**ఓకలేగకాయ** ? చూ. వాక (కో. 11).

**కమల** పర్యా. సంత్ర. నారింజ భేదం; (tangerine)

*Citrus reticulata*, Blanco.; మామూలు నారింజ కన్నా పండు చిన్నది; తొక్క వదులు, నునుపు, రంగు ఎరుపూ పసుపు; కండ ఎరుపు, తీపి (రా. 7, 23); భేదాలు :

**చిన్నకమల** (రా. 7).

**పెద్దకమల** (రా. 7).

**లాంద్ర** కమలాల్లో ఒకరకం (రా. 23).

**కలిగి** చూ. కలివె (రా. 1).

**కలిమె** చూ. కలివె (తె. 1).

**కలివె** ఉ. కలే; రూ. కలిగి, కలిమె. చిన్న ముళ్ళ పొద: *Carissa carandas*, Linn.; కంచెగా ఉపయోగిస్తారు; జూలై ఆగస్టుల్లో పండే నల్లటి పండ్లు తింటారు; పచ్చికాయలు ఊరగాయకు ఉపయోగిస్తాయి; చూ. కలివి, పుట 159 (కో. 5, 6, 10, 11, 14).

**కామంచి** ముఖ్యంగా దేశీయౌషధంలో ఉపయోగించే చిన్న మొక్క: *Solanum nigrum*, Linn.; దీని ఆకులతో వండిన కూర నీరువ్యాధి ఉన్నవాళ్ళకు పథ్యంగా పెడతారు; పండ్లు కొందరు తింటారు (కో. 13, 15).

**కాము** నిలువున ఎత్తుగాపెరిగే పెద్దచెట్టు; *Pongamia glabra*, Linn.; కానుగుచెట్టు; దీని గింజలనుంచి వచ్చే మట్టిరంగు నూనె దీపాలకు ఉపయోగిస్తారు (కో. 42, 43, 45).

**కిచ్చిడి** ఉ. కిచిడి; పర్యా. చూ. నారింజ. నారింజ భేదం: *Citrus maderaspatana*, Tan.; దీన్నే కోస్తాజిల్లాల్లో వడ్లపూడినారింజ అంటారు; పండు మామూలుగా పులుపు; ఎండాకాలంలో పండేది తీపి; కమలాకన్నా పెద్దసైజు, తొక్క వదులుగా నొక్కులు నొక్కులుగా ఉంటుంది (రా. 7).

**కీర** దోసజాతికి చెందిన తీగెమొక్క; పండు చిన్నది; కూరకన్నా ఎక్కువగా తింటానికి వాడేరకం (రా. 9).

**కుసుమ** ఉ. కుసమ, కుస్మ. ఒకరకం నూనెగింజల చెట్టు: (safflower) *Carthamus tinctoris*, Linn.; గింజలనూనె తేటగా పసుప్పచ్చగా ఉంటుంది; దీన్ని వంటకాలకు, దీపాలకు, మోటబొక్కెన్ల పూతకు ఉపయోగిస్తారు; కొందరు ఈ చెట్టు లేతాకులను కూరదినుసుగా వాడతారు; పూలనుంచి పసుపురంగు తయారవుతుంది (తె. 1, 4, 6, 8-13, 32, 35; రా. 10, 12, 17-22, 24-26); భేదాలు :

**బోడికుసుమ** చెండు బోడిగాఉండేరకం (రా. 18).

**ముండ్లకుసుమ** చెండు ముళ్ళతో ఉండేరకం (రా. 18).

**కొబ్బరి** అన్నిభాగాలు విలువైన చెట్టు (coco-nut) *Cocos nucifera*, Linn.; ఆకులు చాపలల్లకంలోను, ఎండుకొబ్బరినుంచి తీసిన నూనె వంటకాల్లోను వాడతారు; మట్టనుంచి నార తయారవుతుంది (కో. 20, 28).

**గగ్గురు** పర్యా. చూ. సీతాఫలం. తోటల్లో పెంచే చిన్న చెట్టు; (custard apple) *Anona squamasa*, Linn.; పండ్లు ఎండాకాలంలో కాస్తాయి; రామాఫలంకంటె రుచి ఎక్కువ (తె. 39).

**గిన్ని** పర్యా. నేరేడు. ఒకమోస్తరు ఎత్తుపెరిగే చెట్టు; (black plum) *Eugenia jambolana*, Linn.; పండ్లు గుండ్రంగా నీలంగా తింటానికి అనువుగా ఉంటాయి; చెట్టుపట్ట తోళ్ళపదునుకు, రంగులతయారీకి ఉపయోగిస్తుంది (తె. 39); భేదాలు :

**అల్లగిన్ని** చూ. అల్లనేరేడు (తె. 39).

**గంగగిన్ని** గంగనేరేడు (తె. 39).

**గొలుం** ఉ. గొలిం. ఉష్ణప్రాంతాల్లో పెరిగే చిన్నచెట్టు; *Glycosmis cochinchinensis*, Pierre; దీని చిన్న తెల్లటిపండ్లు తింటారు (కో. 39, 41, 43).

**చిటుమట** ఉ. చిటిమిటి; ? పర్యా. బిక్కి; పొదగాపెరిగే చెట్టు: ? *Gardenia gummifera*, Linn.; పసుప్పచ్చగా కరక్కాయలంత ఉండే పండ్లు తియ్యగా పుల్లగా సువాసనతో తింటానికి అనువుగా ఉంటాయి (కో. 11; తె. 17, 19, 23, 24, 27).

**చింత** ఎనభైఅడుగుల ఎత్తుదాకా పెరిగే పెద్దచెట్టు; (tamarind tree) *Tamarindus indica*, Linn.; చిగురు, కాయలు, పండ్లు వంటదినుసుగా వాడతారు; ఆకులు ఎరుపు, పసుపు రంగుల తయారీకి పనికివస్తాయి; కొయ్య చేవ; వ్యవసాయపు పనిముట్లకు, కలపగాను వాడతారు (కో. 12; తె. 1, 6, 11, 18, 21, 28, 33-38; రా. 5, 7, 14, 16, 18, 23).

**చీని** నారింజభేదం; ? *Limonia trifoliata*, DC; పండు తియ్యగా ఉంటుంది; బహుశా 'కమలా'కు మరొక పేరు కావచ్చు (రా. 7-9, 19, 23, 25). భేదాలు :

**చిన్నచీని** (రా. 7).

**దేశవాళీచీని** (రా. 23).

**పెద్దచీని** (రా. 7).

**మొలకచీని** (రా. 23).

**చెకోత్ర** ఉ. శకోత్ర (< హిం. చకోత్ర); పర్యా. చూ. పంపరపనస. నిమ్మజాతి (Citrus) కి చెందిన చెట్టు; (pumelo, shaddock) *Citrus decumana*, Linn.; ఏడాదిపొడవునా కాపుకాస్తుంది; నారింజమాదిరి తొనలుంటాయి; పండు పెద్దది; తొనల్లోపలి ముత్యాలరంగు ఎరుపుగాని, తెలుపుగాని; తొక్క నునుపు, మందం (తె. 24).

**చెరుకు** ఉ. చెర్కు. ఎనిమిది పన్నెండు అడుగుల ఎత్తున గడలుగా పెరిగే గడ్డి; (sugar-cane) *Sacc-*

*harum officinarum*, Linn.; గడలనుంచి తీసిన రసం బెల్లం, చక్కెర పరిశ్రమలకు, పిప్పి కాయితాల పరిశ్రమకు ఉపయోగిస్తాయి (కో. 20, 34, 36; తె. 9, 13, 26; రా. 3, 6, 15); భేదాలు:

**బంగారుతీగ** (కో. 36).

**బెల్లంచెరుకు** (కో. 34).

**జనుము** ఉ. జనుం. మామూలుగా పొలంగట్లపక్కన నారకోసం పెంచే పైరు; (Indian hemp, san-hemp) *Crotelaria juncea*, Linn; మొక్క పదిఅడుగుల ఎత్తుదాకా పెరగవచ్చు; పూత పూయగానే మొక్కలు పీకి ఎండబెట్టి కుంటల్లో మురగబెడతారు; నాలుగైదు రోజుల తరవాత కాడలు కుళ్ళి నార తయారవుతుంది; విత్తనాలు పాడిపశువులకు మంచి ఆహారం (కో. 1, 3, 11, 13, 21, 23, 26).

**జాన** ఉ. జాని, జేన. ఒకరకం పండ్లచెట్టు; *Grewia asiatica*, Linn.; నల్లటి గుండ్రటి పండ్లు పండుతాయి; కొందరు తింటారు (కో. 5, 10, 11, 14; తె. 1).

**జీడి** ఉష్ణప్రాంతాల్లో గుబురుగాపెరిగే చెట్టు; (marking-nut) *Semicarpus anacardium*, Linn.; కప్పలాంటి పండ్ల నంటిఉండే కాయలు; విలువైన రొక్కపు దినుసు; కాయరసం నల్లరంగు తయారీకి ప్రశస్తం; కొందరు పండ్లు తింటారు (కో. 15, 39, 41; తె. 17, 19, 26).

**జేమ** ఉ. జామి, జామె (గుజరాతీ జాంబ, దక్షినీ జామ్). అమెరికా ఖండానికి స్వాభావికమైన చిన్న పెరుసు చెట్టు; (guava) *Psidium guyava*, Linn.; పోర్చుగీసువారిద్వారా మనదేశం వచ్చిఉంటుంది; గుండ్రటి పళ్ళు తింటానికి అనువుగా ఉంటాయి; కొన్నిచోట్ల ఆకులు, చెట్టు పట్టలు రంగుల తయారీకి ఉపయోగిస్తారు (కో. 20, 28, 31, 39, 41, 43, 45; తె. 1, 7, 9-13, 16-29, 31-33, 36, 38, 39, 42); భేదాలు:

**ఎరజేమ** (తె. 9, 39).

**చిన్నజేమ** (తె. 9).

**తెల్లజేమ** (తె. 9, 39).

**పెద్దజేమ** (తె. 9).

**టెంకాయ(చెట్టు)** పర్యా. చూ. కొబ్బరి. అన్నిభాగాలు వాణిజ్య వస్తువులుగా విలువైన చెట్టు; (coconut) *Cocos nucifera*, Linn; ఆకులు, మట్టనార, ఎండుకొబ్బరి ముఖ్యమైన రొక్కపుదినుసు (రా. 2, 3, 19).

**తాటి** ఉ. తాడి. మామూలుగా పొలాలగట్లమీద వేసే చెట్టు; (palmyra palm) *Borassus flabellifer*, Linn.; ఎత్తుగా నిటారుగా పెరుగుతుంది; జూన్ ఆగస్టు నెలల్లో పండ్లు పండుతాయి; ముదరనిగింజ (ముంజె)లు చలవకు తింటారు; కొందరు పండ్లుకూడా తింటారు; గెలలో ఉండే కాయకు రెండు మూడు చొప్పున ముంజెలుంటాయి; ఆకులు, నార, కల్లు, మొ. ప్రధానమైన వాణిజ్య వస్తువులు (కో. 6, 28, 38, 39, 41, 43, 45).

**తునికి** ఉ. తునికి; రూ. తూకి, తూగి. ముప్పైనుంచి నలభై అడుగుల ఎత్తుదాకా అడవుల్లో పెరిగే చెట్టు; (Coramandel ebony) *Diospyros melanoxylon*, Roxb.; ఆగస్టునెలలో సపోటామాదిరి ఉండే పండ్లు పండుతాయి; పండురంగు పసుపు; ఏడెనిమిది గింజలుంటాయి; గుజ్జు పచ్చగా తియ్యగా తింటానికి రుచిగా ఉంటుంది; ఆకులు బీడీలు చుట్టటానికి ఉపయోగిస్తారు (తె. 17, 19, 21-24, 27, 28, 39).

**తురుబూజా** (<హిం. తర్బూజ్); పర్యా. పుచ్చ. నీరింకిన వాగుల్లో సాగుచేసి పండించే తీగెపైరు; (watermelon) *Citrullus vulgaris*, Schrad; పండ్లు పెద్దవి; చలవకు తింటారు; గుజ్జు ఎర్రగాగాని తెల్లగాగాని ఉంటుంది (రా. 9); భేదాలు:

**ఇంగన్** (రా. 9).

**జాంగిన్నె** (రా. 9).

**జాలిబుడమ** (రా. 9).

**బతాసా** (రా. 9).

**బరిగ్గిన్నె** (రా. 9).

**లడ్డుగిన్నె** (రా. 9).

**సెరబత్** (రా. 9).

**తూకి** చూ. తునికి (తె. 24).

**తూగి** చూ. తునికి (కో. 11).

**దనేలు** చూ. ధనియాలు (తె. 7, 10, 29, 34-37; రా. 5, 10, 12, 17-19, 21, 24-26).

**దబ్బ** నారింజభేదం; (citron) *Citrus medica*, Linn.; *C. pennisesiculata*, Tan.; కాయ పండినా పుల్లగానే ఉంటుంది; చెక్క మందం, నునుపు; ఔషధాలకు, ఊరగాయకు వాడుక (కో. 20; తె. 28, 29; రా. 7); భేదాలు:

**దూదిదబ్బ** (రా. 7).

**నారదబ్బ** (రా. 7).

**దాక** ద్రాక్ష; ఎత్తైనకొండలమీద చల్లటి వాతావరణంలో పెరిగే తీగెమొక్క; (grape-vine) *Vitis vinifera*, Linn.; పండ్లు తింటానికి, ఔషధాల్లోను, సారాపరిశ్రమలోను ఉపయోగిస్తాయి (తె. 10).

**దాడిమ్మ** చూ. దానిమ్మ (రా. 23).

**దాణిమ్మ** చూ. దానిమ్మ (తె. 13, 16).

**దానిమ్మ** ఉ. దానెమ్మ, దాలిమ్మ; రూ. దాడిమ్మ, దాణిమ్మ. ఒకరకం చిన్న పెరుసుచెట్టు; (pomegranate)

*Punica granatum*, Linn.: ఎఱ్ఱటి పూలు పూస్తుంది; పండ్లలోపలి గింజలు తింటానికి అనువుగా ఉంటాయి; పండు చెక్క ఎరుపు, పసుపు రంగుల తయారీలో వాడతారు (తె. 7, 17, 22-28, 33).

**దేవదారు** నెల్లూరు రాయలసీమ జిల్లాల్లో కొండల్లో పెరిగే చిన్నచెట్టు; (bastard sandal) *Erythroxylon monogynum*, Roxb.; ఆకులు కూరదినుసు; ఎఱ్ఱటి చిన్నపండ్లు తింటానికి ఉపయోగం; దేశీయౌషధాల్లో ఆకులు, బెరడు వాడతారు (కో. 11).

**ధనియాలు** (బహు.), ఉ. దనియాలు, దన్యాలు; రూ. దనేలు. నల్లనేలల్లో సాగుచేసి పెంచే పైరు; (coriander) *Coriandum sativum*, Linn.; చాలాచోట్ల పత్తితో అక్కడిపైరుగా వేస్తారు; గింజలు ముఖ్యమైన రొక్క-పు దినుసు; ఔషధాల్లోను, వంటకాల్లోను ఎక్కువగా వాడుక (కో. 3, 11, 22, 31, 32; తె. 16-20, 22-31; రా. 1).

**నక్కెరు** ఉ. నక్కెర; పర్యా. ఇరికి. అక్కడక్కడ తోటల్లో పెంచే పండ్లచెట్టు; (sebesten) *Cordia myxa*, Linn.; ఏప్రిల్, మే నెలల్లో పండే పండ్లు కొందరు తింటారు; పట్టనార తాళ్ళకు, కొయ్య ఓడల నిర్మాణానికి ఉపయోగిస్తాయి; బోదెమీద లక్క తయారవుతుంది (కో. 13, 31; తె. 1).

**నారంగి** చూ. నారింజ (రా. 23).

**నారింజ** ఉ. నారింజె; రూ. నారంగి; పర్యా. కిచ్చిలి. పుల్లటిపండ్లు కాసే చెట్లజాతికి చెందినది; (orange) *Citrus maderaspatana*, Tan.; పండు, ఆకు పసుప్పచ్చ రంగుల్లో ఉంటుంది; చెక్క మందంగా, ముడతలతో ఉంటుంది; ఎండాకాలంలో పండే పండ్లు తియ్యగా ఉంటాయి (కో. 14, 20, 26; తె. 27, 28, 36, 39, 42; రా. 23).

**నిమ్మ** ఉష్ణప్రాంతాల్లో సారవంతమైన తోటల్లో సాగుచేసి పెంచే పండ్లచెట్టు; (lime) *Citrus aurantium*, Linn.; పండు నారింజకంటె చిన్నసైజులో ఉంటుంది; పుల్లటి రసం వంటకాలు, ఊరగాయలు, వైద్యం మొ. వాటిల్లో ఉపయోగిస్తారు (కో. 8, 14, 15, 17, 20, 26, 43, 45; తె. 1, 2, 6, 7, 9, 10, 16, 22-24, 26, 28, 29, 31, 32, 34, 35, 42; రా. 8-10, 19, 23);
**భేదాలు:**
**అడ్డనిమ్మ** కాయ కోలగా ఉండేరకం (రా. 9).
**కరిణె** పచ్చడినిమ్మ; చూ. కర్ణకాయ (తె. 2, 7).
**కర్ణకాయ** పచ్చడి నిమ్మ (రా. 23).
**గజనిమ్మ** పెద్దనిమ్మ; *C. pennisesiculata*, Tan. (రా. 9).
**దూదినిమ్మ** ? చూ. దబ్బ, నారింజ (తె. 1, 2).
**నాటునిమ్మ** (రా. 9).
**పుల్లనిమ్మ** (రా. 7, 9).
**సన్ననిమ్మ** మామూలు నిమ్మ (తె. 2; రా. 19, 23).

**నువ్వు(లు)** ఉ. నువులు, నూ(లు), నూవు(లు); రూ. నూగు(లు). ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనెగింజల చెట్టు; (sesamum) *Sesamum indicum*, DC.; 1-4 అడుగుల ఎత్తు; నాలుగైదు నెల్లలో పైరు ఒడుపుకు వస్తుంది; మసరకేగడి నేలలు పైరుకు మంచివి; గింజ సన్నం; రంగు తెలుపుగాని, నలుపుగాని; గింజలనుంచి తయారుచేసిన నూనె ప్రధానమైన వాణిజ్యవస్తువు; వంటకాలకు, సబ్బు, అత్తర్లు మొ. వాటి పరిశ్రమలోను ఉపయోగం (కో. 1-6, 28, 32, 33, 39, 41, 42; తె. 1, 3, 4, 6-14, 16-39, 42; రా. 2, 3, 5-7, 9, 11, 14, 16, 17, 21, 24-28); భేదాలు:
**ఎఱ్ఱనువ్వు(లు)** ఉ. ఎర్నూలు, ఎఱ్ఱనూలు (కో. 5; తె. 1, 4, 7, 18, 38).
**కుట్నువ్వు(లు)** ఉ. కుట్నూలు (కో. 39).
**కురునువ్వు(లు)** ఉ. కురునూలు. గింజ సన్నంరకం (తె. 4; రా. 6).
**గడ్డినువ్వు(లు)** ఉ. గడ్డినూలు, గడ్డినూవులు (తె. 1, 4, 6, 8-11, 14).
**గొండనువ్వు(లు)** నల్లనువ్వుల్లో ఒకరకం (తె. 13).
**చిన్ననువ్వు(లు)** (కో. 3).
**జడనువ్వు(లు)** ఉ. జడనువులు, జడనూవులు (తె. 7).
**తెల్లనువ్వు(లు)** ఉ. తెల్నూవులు, తెల్లనూలు (కో. 5, 39; తె. 7, 13, 18, 34, 35, 37, 38; రా. 7).
**నల్లనువ్వు(లు)** ఉ. నల్నూవులు, నల్లనూలు, నల్లనూవులు (తె. 4, 7, 18, 34, 35, 37; రా. 17).
**పునాసనువ్వు(లు)** (కో. 41).
**పెద్దనువ్వు(లు)** (కో. 45; తె. 8, 10; రా. 4, 6).
**పైరనువ్వులు** ఉ. పైరనూలు (కో. 41, 43).
**బురదనువ్వు(లు)** ఉ. బురదనూలు (కో. 44).
**మంచినువ్వు(లు)** (తె. 1, 9, 14).
**వెన్నెలనువ్వు(లు)** (కో. 41).

**నూగు(లు)** చూ. నువ్వు(లు) (కో. 7-11, 14, 30, 31; రా. 1, 8, 18; తె. 2); భేదాలు:
**ఎఱ్ఱనూగు(లు)** (కో. 30).
**కురునూగు(లు)** (కో. 14).
**తెల్లనూగు(లు)** (కో. 9-11).
**నల్లనూగు(లు)** (కో. 9-11, 14).

**నెమ్మి** ఉ. నెమ్మ. ఒకరకం చెట్టు; ? *Ougenia dalbergioides*, Benth. (MAMP, p. 575);

నెమ్మలు పండితే జొన్నలు పండుతాయ్, అని సామెత (కో. 11).

**నేరేడు** ఉ. నేరడ; పర్యా. గిన్ని. ఒకరకం పండ్ల చెట్టు; (black plum) *Eugenia jambolana*, Lamk.; పండ్లు నీలంగా చిన్నవిగా ఉంటాయి; కొందరు తింటారు; చెట్టుపట్ట తోళ్ళపదునుకు, రంగుల తయారీకి ఉపయోగిస్తుంది (కో. 12, 14, 15, 31, 39, 45; తె. 1, 2, 17, 19, 24, 26, 38; రా. 1); భేదాలు:

**అల్లనేరేడు** చూ. అల్లగిన్ని. నేరేడు పండ్లవంటి పండ్లు కాసేచెట్టు; అల్లోనేరేడు; *Myrtus communis*, Linn.; కాయలు, ఆకులు, పట్ట, తోళ్ళపదునుకు, రంగుల తయారీకి వాడతారు; ఆకులనుంచి తయారుచేసిన ఔషధం మెదడుకు సంబంధించిన జబ్బుల్లో ఉపయోగిస్తుంది; పండ్లు కొందరు తింటారు (తె. 2, 17, 19, 21-23, 26-28).

గంగనేరేడు ఉ. గంగనేరడు (కో. 12).

**నేలపెసర** ఉ. నేలపిసర, నేలపిసిరి; పర్యా. చూ. వేరుసెనగ. ముఖ్యంగా నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పుదినుసు; (peanut, ground-nut) *Arachis hypogœa*, Linn.; (తె. 13, 17, 19).

**నేలబుడ్డ** పర్యా. చూ. వేరుసెనగ. ముఖ్యంగా నూనెతీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పుదినుసు; (peanut; ground-nut) *Arachis hypogœa*, Linn. (రా. 23, 28).

**నేలసెనగ** పర్యా. చూ. వేరుసెనగ. ముఖ్యంగా నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పుదినుసు; (pea-nut, ground-nut) *Arachis hypogœa*, Linn.; (తె. 7, 33; రా. 16, 18).

**పత్తి** రేగడ నేలల్లో ఎక్కువగా సాగుచేసి పెంచే రొక్కపుపైరు; (cotton) *Gossypium sp.*, Linn.; ఆరెనిమిది నెలల్లో కాయలు పండుతాయి; కాయలనుంచి పత్తి విడిపించగా మిగిలిన గింజలు పశువులకు ఆహారంగా గాని, నూనెదినుసుగా గాని ఉపయోగిస్తారు (కో. 9-14, 29, 30-32, 39, 41, 45; తె. 3, 4, 13, 17-21, 23, 27, 28, 30, 31; రా. 10, 11, 17-26); భేదాలు:

ఎర్రపత్తి ఉ. ఎరపత్తి (కో. 12, 39, 41, 45; రా. 25).

**కాంబోడిపత్తి** *G. hirsutum*, Linn. (రా. 25).

కొండపత్తి (కో. 29, 31).

చిన్నపత్తి (తె. 18; రా. 18-20).

జహరిపత్తి దేశవాళీపత్తి (తె. 3).

తెల్లపత్తి (కో. 11, 39, 45; రా. 25).

తెల్లపూతపత్తి (తె. 18).

**నాటుపత్తి** (కో. 11, 31).

పునాసపత్తి (కో. 41, 45).

పెద్దపత్తి (కో. 41, 45; రా. 20).

పొలంపత్తి (కో. 29).

ముంగారిపత్తి ఎర్రపత్తి (తె. 3; రా. 19).

**పనస** అడవుల్లోను, తోటల్లోను పెరిగే పెద్దచెట్టు; (jack-fruit) *Artocarpus integrifolia* Linn.; పెద్దకాయలు కాస్తుంది; కాయపొడవు 1-2½ అడుగుల దాకాను, బరువు అరవైపౌన్లదాకాను ఉండవచ్చు; పచ్చికాయ కూరకు, పండు తొనలు తింటానికి; ఒక్కొక్కపండుకు ఎనభైదాకా తొనలుంటాయి; పసుప్పచ్చటి కొయ్య కలపగా ప్రశస్తం (కో. 45-51).

**పంపరపనస** పర్యా. చకోత్ర. నిమ్మజాతికిచెందిన చెట్టు; (pumelo, shaddock) *Citrus decumana*, Linn.; పండుమీది తొక్కమందం; లోపలితొనలు ఆకారంలో నారింజ తొనల్లాగా ఉండి పరిమాణంలో పెద్దవిగా ఉంటాయి; ఈచెట్టు పశ్చిమభారత ద్వీపాలనుంచి మనదేశానికి వచ్చింది; ఏడాదిపొడవునా పండ్లు పండుతాయి (కో. 20).

**పరికి** ఉ. పర్కి; రూ. పరిమ. ఉష్ణప్రాంతాల్లో పెరిగే చిన్న ముళ్ళచెట్టు; *Zizyphus oenoplia*, Mill.; కంచెమొక్కగా వాడుక; వానాకాలంలో పండే పండ్లు చిన్నవిగా, నల్లగా, తీపి పులుపుగా ఉంటాయి (తె. 21-24).

**పరిమ** ఉ. పరివ; చూ. పరికి. (కో. 41, 45).

**పల్లీ(కాయ)** పర్యా. చూ. వేరుసెనగ. ముఖ్యంగా నూనెతీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పుదినుసు; (peanut, ground-nut) *Arachis hypogœa*, Linn.; (తె. 18, 20, 25-28).

**పసుపు** ఉ. పస్పు. మామూలుగా వంగ, ఆముదం, మొక్కజొన్న మొ. వాటితో కలిపివేసే రొక్కపుపైరు; (turmeric) *Cucurma longa*, Roxb.; నాటిన కొమ్ములు ఎనిమిది తొమ్మిదినెల్ల తరవాత పెళ్ళగిస్తారు; కొమ్ములపొడి రంగుల్లోను, వంటకాల్లోను, గృహాలంకరణ సాధనంగాను ఉపయోగిస్తుంది (కో. 2, 3, 20, 22; తె. 9, 10, 13, 26, 32, 33; రా. 1, 7, 9, 15); భేదాలు:

**అడవిపసుపు** (కో. 20).

కస్తూరిపసుపు (కో. 22).

**బొంతపసుపు** (కో. 22).

**పిండి** ? ఒకరకం పండ్లచెట్టు (కో. 41, 45).

**పిసిని** చూ. పిసినికి (కో. 43).

**పిసినికి** (< ఓఢ్రం. పిసిన); రూ. పిసిని. పర్యా. ఊటి. ఒకరకం చెట్టు; *Maba buxifolia*, Pers.; ఎండాకాలంలో పండే గుండ్రటి పండ్లు; కొందరు తింటారు (కో. 39, 41, 45).

**పుచ్చ** పర్యా. తురుబూజా. నీరింకిన వాగుల్లో సాగు

చేసి పండించే తీగెపైరు ; (water-melon) *Citrullus vulgaris*, Schrad ; పండ్లు పెద్దవి; చలవకు తింటారు; గుజ్జు ఎర్రగాగాని తెల్లగాగాని ఉంటుంది (తె. 28; రా. 1).

**పుంట్లు** (బహు.), ఒకరకం నూనెగింజలు, నువ్వులతో కలిపి నూనెతీస్తారు ; గింజలు, పిట్టు పశువులకు దాణాగా వేస్తారు (తె. 18).

**పువ్వాకు** ఉ. పొవ్వాకు; చూ. పొగాకు (కో. 6, 10; తె. 12, 31, 42).

**పొగాకు** ఉ. పుగాకు ; రూ. పువ్వాకు. పదిహేడో శతాబ్దంలో (1605) పోర్చుగీసువారు మనదేశంలో ప్రవేశపెట్టిన వర్తకపు పైరు; (tobacco) *Nicotiana tabacum*, Linn ; చల్లటి వాతావరణం, సారవంతమైన భూమి పెరుగుదలకు ముఖ్యం; ఆకును సిగరెట్లు, చుట్టలు, నస్యం మొ. వాటి పరిశ్రమలో ఉపయోగిస్తారు (కో. 5, 6, 9, 15, 17, 18, 20, 21, 23, 24, 30-33, 39, 41-43, 45 ; తె. 1, 3, 5, 6, 7, 10-13, 18, 21-38 ; రా. 15, 17-19, 22-24, 26, 28); పొగాకు భేదాలు :
**కరాకు** పొడుగాటి ఆకు (కో. 14).
**కోలాకు** (కో. 24).
**గూబాకు** (కో. 5).
**తూర్పుపొగాకు** (కో. 20).
**తోకాకు** సన్నగా పొడుగ్గా ఉండే ఆకు (కో. 5, 10, 11).
**దొరపొగాకు** ప్రధానంగా సిగరెట్లకు ఉపయోగించే నాణ్యమైన రకం (కో. 5, 10, 12).
**దోనేకు** (కో. 10, 25).
**నడ్డేకు** (కో. 14).
**నాటుపొగాకు** (కో. 5, 10, 12).
**నీర్షేకు** వెడల్పైన ఆకు (కో. 14).
**నేపాల్ పొగాకు** (కో. 43).
**పోతారం** కోలగాఉండే ఆకు (కో. 45).
**బర్రేకు** (కో. 11).
**మెట్టపొగాకు** (కో. 20).
**సూరకత్తి** కోలగాఉండే ఆకు (కో. 41).

**పొప్పడ** ఉ. పుప్పడి, పుప్పొడి, పొప్పడి; చూ. బొప్పాయి (తె. 22, 24-28).

**బత్తాయి** పర్యా. ముసంబి, మోసంబి. నారింజ భేదం; (sweet orange) *Citrus sinensis*; పండు తొక్క నునుపు; తొనలు, రసం తీపి; పండు పసుపు-ఎరుపు రంగుల్లో ఉంటుంది (కో. 20, 26 ; తె. 29 ; రా. 23).

**బలుసు** ఉ. బలస, బల్స. పొదగాపెరిగే చిన్నచెట్టు; *Canthium parviflorum*, Lamk. ; ఆకుకూర దినుసు ; పండ్లు తింటారు ; చూ. బలుసు, పుట 175 (కో. 6, 39, 41, 43, 45).

**బిక్కి** ? పర్యా. చిటమట. అడవుల్లో పెరిగే ఒకరకం పండ్లచెట్టు; *Gardenia gummifera*, Linn. ; పసుప్పచ్చగా కరక్కాయలంత ఉండే పండ్లు తియ్యగా పుల్లగా సువాసనతో తింటానికి అనువుగా ఉంటాయి (రా. 1).

**బుడమ** దోసజాతికిచెందిన తీగెపైరు ; *Cucumis pubescense*, Willd. ; కాయలు పచ్చివిగాగాని, పండుకొనిగాని తింటారు ; పండ్లు కొందరు తింటారు (కో. 45 ; తె. 7, 9, 31, 34 ; రా. 18, 20) ; భేదాలు :
**కోలబుడమ** (తె. 34).
**దాసరిబుడమ** (తె. 34).
**పెద్దబుడమ** (తె. 34).

**బుడ్డ(లు)** ఉ. బుడ్లు ; పర్యా. చూ. వేరుసెనగ. ముఖ్యంగా నూనెతీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పుదినుసు ; (peanut, ground-nut) *Arachis hypogæa*, Linn. (తె. 1-3, 6 ; రా. 21-26, 28) ; భేదం :
**గుత్తిబుడ్డ** గుత్తి వేరుసెనగ (తె. 3).

**బొద్ద** పర్యా. చూ. అత్తి. ఒకరకం చిన్న పండ్లచెట్టు; (fig tree) *ficus glometra*, Roxb. ; బెరడు రంగులతయారీకి, పచ్చికాయలు కూరకు, పండ్లు తింటానికి; బోదెమీద లక్క తయారవుతుంది (కో. 41, 45).

**బొప్పర** చూ. బొప్పాయి (తె. 37).

**బొప్పాయి** రూ. పొప్పడ, బొప్పర. పెరళ్ళలోను, తోటల్లోను పెంచే చిన్న పండ్లచెట్టు ; (papaya) *Carica papaya*, Linn ; మెక్సికోదేశంనుంచి వచ్చింది ; దీనికి ఆకులు, కాడలు తప్ప కొమ్మలుండవు ; కోలగా చిన్న సొరకాయ ఆకారంలోఉండే దీని కాయలు కూరకు, పండ్లు తింటానికి ; ఏడాది పొడవునా కాపు కాస్తుంది (కో. 3).

**భూసెనగ** ఉ. బూసెనగ ; పర్యా. చూ. వేరుసెనగ. ముఖ్యంగా నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పుదినుసు ; (peanut, ground-nut) *Arachis hypogæa*, Linn. (తె. 23, 24).

**ముక్కా** ఏటిఒడ్డున ఇసకనేలల్లో సాగుచేసి పెంచే దోసజాతి మొక్క ; (musk melon) *Cucumis melo*, Linn ; కడప, కర్నూలు జిల్లాల్లో పండిస్తారు ; ఎండాకాలంలో పండే పండ్లు చలవకు తింటారు (రా. 9) ; భేదాలు :
**కోలముక్కా** (రా. 9).
**గుండుముక్కా** (రా. 9).

**మాదీఫలం** నారింజ భేదం ; దబ్బ కావచ్చు ; చూ. దబ్బ ; ? (citron) *Citrus medica*, Linn. ; దబ్బ తెగకు చెందింది (కో. 45).

**మామిడి** ఉ. మామ్డి. తెలుగుదేశంలో విరివిగా తోటల్లో పెంచే పండ్లచెట్టు ; (mango) *Mangifera foetida*, Lour. ; ఎండాకాలంలో కాపుకువస్తుంది ; పండ్లరంగు, ఆకారం, రుచి, ఉపయోగం మొ. వాటినిబట్టి ఎన్నో రకాలు; పచ్చివి ఊరగాయలకు, పంటకాలకు, పండ్లు తింటానికి వాడుక (కో. 12, 26, 28, 31, 32, 39, 41, 43, 45; తె. 6, 9-11, 15-19, 21-29, 31-34, 38, 39, 42; రా. 2, 3, 7, 14, 23) ; భేదాలు :

**అటుకమామిడి** (తె. 9).

**అంటుమామిడి** (కో. 6, 15, 26, 27).

**అబ్బాస్** (రా. 23).

**అమిరితం** (రా. 23).

**ఆచాము** (రా. 23).

**ఆము** పండులావు (తె. 9).

**ఇర్సాలమామిడి** పండు పెద్దది, గుండ్రం, తీపి ; (పీచు తక్కువ) (తె. 15).

**ఏనుగుతల** (కో. 41, 45).

**ఏనుగుతొండం** (కో. 26).

**కర్జూర్** (రా. 23).

**కలకటేరు** ఇమాం పసందుకే మరొకపేరట (కో. 43, 45).

**కలంమామిడి** ఉ. కలాంమామిడి. కాయ పొడుగ్గా పెద్దదిగా ఎక్కువగా తీపిగా ఉండేరకం (తె. 15, 16).

**కాసరి** (కో. 27).

**కోతిపిర్ర** పండు మూతివద్దర ఎరుపు, మిగిలిన భాగం ఆకుపచ్చ; ? సువర్ణరేఖ (కో. 45 ; తె. 15).

**కోల్నగోవ** (కో. 45).

**గన్నేరు** (కో. 41).

**గుజీమామిడి** పండ్లు గుత్తులు గుత్తులుగా దిగేరకం (తె. 15).

**గులాబివన్నె** (కో. 26).

**చిత్తూరుమామిడి** (కో. 26).

**చప్లి** (రా. 23).

**జాంగీర్** (రా. 23).

**జొన్న(ల)రాశి** చిన్నకాయ రకం (తె. 9, 10, 15).

**తొక్కుమామిడి** కాయ పులుపు ; పచ్చడికి, ఊరగాయకు వాడేరకం (తె. 15).

**తోటగున్న** (కో. 41).

**తోతమామిడి** (తె. 15, 16).

**తోతావరి** (తె. 9, 10).

**[illegible]ల్లమామిడి** (తె. 15).

**[illegible]ల్లఎంద్రాస్** (కో. 41).

**[illegible]ల్లాన్‌రసం** (కో. 45).

**నల్లారెడ్డి** (రా. 23).

**నల్లేంద్రు** ? నల్లఎంద్రాస్ (కో. 39).

**నీలం** పండుచిన్నది; పీచుతక్కువ, తీపిఎక్కువ (కో. 26, 27 ; రా. 23).

**నీలంపురి** చూ. నీలం (తె. 16).

**పచ్చడిమామిడి** పుల్లమామిడి ; ఊరగాయలకు ఉపయోగించే రకం (కో. 26, 27).

**పచ్చమామిడి** చూ. పచ్చడిమామిడి (తె. 15).

**పలకదంతత** (కో. 41).

**పసంద్** పెద్దపండు ; తీపిఎక్కువ ; భేదాలు :

**ఇస్మాల్‌పసంద్**

**తత్తూర్‌పసంద్**

**దిల్‌పసంద్**

**మధురాపసంద్**

**రెడ్డిపసంద్**

**వెంకటేశపసంద్** (రా. 23).

**పీతర్** (రా. 23).

**బంగాలా** (కో. 26).

**బంగినిపల్లి** ఉ. బంగిరిపల్లి, బంగిరిపిల్లి, బింగినిపల్లి. నూజివీడు ప్రాంతంలో పండేరకం ; పండు పెద్దది ; తీపి ఎక్కువ, పీచుతక్కువ (కో. 26, 27, 39, 41, 45).

**బారమోస్** (< హిం. బారామాసి). దీన్నే కొండమామిడి అనీ అంటారట ; పన్నెండునెల్ల పొడవునా కానేరకాలకు హిందూస్తానీలో ఈ పేరు వాడుక (కో. 43).

**బెంగుళూరు** (రా. 23).

**బెనిషాని** (రా. 23).

**బేరిశ** పీచులేనివాటిల్లో ఒకరకం (తె. 16).

**మక్కువ** (కో. 43).

**మలగూబ** ఉ. మలగుబ, మల్గూబ (తె. 9, 10; రా. 23).

**ముంతమామిడి** (కో. 6).

**రసాలు** (బహు.). రసానికి ఉపయోగించేరకం (కో. 26, 27).

**రాజమామిడి** (కో. 41, 45).

**వాలాజా** (రా. 23).

**సువర్ణరేఖ** ఉ. సూర్నరేక (కో. 39, 41, 43, 45).

**మారేడు** ఉ. మారడ. అడవుల్లోను, తోటల్లోను పెరిగే పెద్దచెట్టు ; (bel-fruit tree) *Aegle marmelos*, Corr. ; మర్రిచెట్టుమాదిరి ఊడలుంటాయి ; చెట్టుమీద జిగురు తయారవుతుంది ; పట్టనుంచి పసుపురంగు తయారుచేస్తారు ; పండిన పండ్లు రుచిగాఉంటాయి ; కొయ్య కలపగా ప్రశస్తం (తె. 1, 2).

**మిరప** ఉ. మిర్ప, మెరప, మెరిప, మెర్ప. బ్రెజిల్ దేశపు కాయపైరు; పోర్చుగీసువారు మొదట మనదేశానికి

తెచ్చారు; (red pepper) *Capsicum annum* Roxb.; మొక్క మూడునాలుగడుగుల ఎత్తు పెరుగుతుంది; కాయలు పచ్చివి, పండువి కారపుదినుసుగా వంటకాల్లో విరివిగా వాడతారు (కో. 2, 3, 5, 8–13, 17, 19, 21, 24, 27–29, 31–33, 35, 36, 39, 41–45; తె. 1, 3, 5–7, 9–13, 16–30, 32–39, 42; రా. 1–7, 9, 15, 17, 18, 19, 21–23, 25, 28); భేదాలు:
**కూరమిరప** పెద్దకాయరకం (కో. 45).
**కొండమిరప** కాయ చాలా చిన్నది; కారం ఎక్కువ (కో. 27, 31, 41, 45).
**తెల్లమిరప** (కో. 43).
**నాటుమిరప** (కో. 41, 45).
**పచ్చిమిరప** (కో. 43).
**పడమటిమిరప** (కో. 45).
**పొట్టిమిరప** (కో. 32, 33, 43, 44).
**బుడ్డమిరప** (కో. 31).
**సన్నమిరప** (కో. 29, 35).
**సీమమిరప** (కో. 28, 32, 44).

**మిర్చి** ఎండిన పండు మిరపకాయలు; చూ. మిరప (కో. 10, 27–33, 35, 43; తె. 28); భేదాలు:
**ఎర్రమిర్చి** (కో. 36).
**కాకినాడకాయ** (కో. 28, 33, 35).
**గొల్లపొలిముచ్చు** (కో. 33).
**దేశకాయ** (కో. 10).
**దేశవాశికాయ** (కో. 27–29, 31, 32, 43).
**పచ్చమిర్చి** (కో. 36).
**పరంగికాయ** (కో. 29).
**బళ్ళారికాయ** (కో. 10, 35).
**సీమకాయ** (కో. 28, 32).

**ముసంబి** ఉ. ముసమ్మి; చూ. మోసంబి (తె. 2, 7).

**మేడి** పర్యా. చూ. అత్తి. ఒకరకం చిన్న పండ్లచెట్టు; (fig tree) *Ficus glometra*, Roxb.; బెరడు రంగులతయారీకి, పచ్చికాయలు కూరకు, పండ్లు తింటానికి; బోదెమీద లక్క తయారవుతుంది (తె. 1, 17).

**మొర్రి** ఒకరకం పండ్లచెట్టు; పండు నేరేడుపండు రంగులో ఉంటుంది; గుండ్రం, పులుపు; కొందరు తింటారు (తె. 16, 17, 19–22, 24, 26–28).

**మోసంబి** రూ. ముసంబి; పర్యా. చూ. బత్తాయి. నారింజ భేదం; (sweet orange) *Citrus sinensis*, Osbeck.; పండు తొక్క నునుపు; తొనలు, రసం తీపి; పండు, పసుపు-ఎరుపు రంగుల్లో ఉంటుంది (తె. 23, 24, 27; రా. 23).

**రామాఫలం** ఒకరకం చిన్నపండు, పండ్లచెట్టు; (bullock's heart) *Anona reticulata*, Linn.; ఆకులు, కాడలు, పచ్చికాయలు సిరిరంగు తయారీకి విస్తారంగా ఉపయోగిస్తారు; వానాకాలం చివరికాపుకు వస్తుంది; పండ్లు చాలామంది తింటారు (కో. 41; తె. 16, 28).

**రేగు** ఉ. రేగి; రూ. రేణి, రేనె. ముఖ్యంగా పొలాలకు కంచెగావేసే ముళ్ళచెట్టు; *Zizyphus jujuba*, Lmk.; చిన్నకాయలు కాస్తుంది; పండ్లు చాలామంది తింటారు; ఆకులు పట్టుపురుగులకు ఆహారం (కో. 5, 6, 11, 14, 39, 41, 45; తె. 1, 21, 22, 26, 28, 29, 39; రా. 23); భేదాలు:
**కాకిరేగు** (కో. 41, 45).
**కామరేగు** (కో. 39, 41).
**కాశిరేగు** (కో. 41).
**కొండరేగు** (కో. 5, 6).
**గంగరేగు** ఉ. గంగిరేగు; రూ. గంగరేనె. రోడ్లపక్కన నీడకోసం, అందంకోసం పెంచే పెద్దచెట్టు; (umbrella tree) *Thespesia populnea*, Corr.; గంగరావి, ఇదీ ఒకటేనని కొన్నిగ్రంథాలు; కాని గంగిరావిపండ్లు తినరు (తె. 2, 28; రా. 23).
**జిట్రేగు** కలపకోసం పెంచే చెట్టు; ? (rose-wood) *Dalbergia latifolia*, Roxb.; గింజలనుంచి నూనె తీస్తారు (తె. 28).
**పుల్లరేగు** (కో. 5).
**సీమరేగు** 'ఏపిల్' పండ్ల చెట్టుకే ఈ పేరని కొందరు; కాని సందిగ్ధం; ? (apple) *Pyrus malus*, Linn. (కో. 6; తె. 28).

**రేణి** చూ. రేగు (తె. 18).

**రేనె** చూ. రేగు (కో. 12; తె. 38; రా. 23): భేదాలు:
**గంగరేనె** చూ. గంగరేగు (రా. 23).
**పుల్లరేనె** (రా. 23).
**మిర్చిరేనె** (రా. 23).

**వాము** ఉ. ఓమ, వామ్ము. జీర్ణకారులైన ఔషధాల్లో ఉపయోగించే గింజలు; (bishop's weed) *Carum copticum*, Benth.; గింజలనుంచి ఒకరకం నూనె కూడా తీస్తారు (కో. 6, 11, 14; తె. 18).

**వేరుబుడ్డ** పర్యా. చూ. వేరుసెనగ. ముఖ్యంగా నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం తప్పుదినుసు; (peanut, ground-nut) *Arachis hypogæa*, Linn. (తె. 3).

**వేరుసెనగ** ఉ. వేర్సనగ; పర్యా. ఇలాతికాయ, నేలసెనగ, నేలబుడ్డ, నేలసెనగ, పల్లీ(కాయ), బుడ్డ(లు), భూసెనగ, వేరుబుడ్డ, సీమసెనగ, సెనక్కాయ మెట్టలో

పండే ఒకరకం పప్పుదినుసు; (peanut, ground-nut) *Arachis hypogæa*, Linn.; వేళ్ళకు కానే కాయల పప్పుతో నూనె తయారుచేస్తారు; దక్షిణ అమెరికానుంచి 19వ శతాబ్దిలో మనదేశానికి ఈ పైరు వచ్చింది (కో. 2-6, 9, 12, 16, 18, 20, 23, 24, 35, 39, 41-45; తె. 10, 29, 31, 35, 37-39, 42; రా. 2, 17); భేదాలు:

**అల్లుసెనగ** ఉ. అల్లుజెనగ; చూ. పల్లిసెనగ (కో. 18).

**గుత్తి(వేరు)సెనగ** ఉ. గుత్తేర్సెనగ. గుత్తులు గుత్తులుగా వేళ్ళకు కాయలేర్పడేరకం; ఇలా కానిరకం తీగసెనగ (కో. 2, 3, 5, 9, 13, 14, 18, 23; తె. 33; రా. 2).

**జుట్టుసెనగ** చూ. గుత్తిసెనగ (తె. 4, 7).

**తీగ(వేరు)సెనగ** (కో. 9, 14; రా. 1).

**పలగాయ** చూ. గుత్తి(వేరు)సెనగ (తె. 12).

**పల్లిసెనగ** కొమ్మ పొడుగునా మూడువిత్తుల కాయలు దిగే రకం; వీటిని పీక్కుంటాదున్ని ఏరతారు (కో. 23).

**పెద్దవేరుసెనగ** ఉ. పెద్దేర్సెనగ (కో. 5).

**సదాంకాయ** ఒకరకం పండు; ఊరగాయలకు ఉపయోగించేది (తె. 15, 16).

**సంత్ర** ఉ. సంతార్, సంత్రా; పర్యా. కమల. నారింజ భేదం; (tangerine) *Citrus reticulata*, Blanco.; మామూలు నారింజకన్నా పండు చిన్నది; తొక్క వదులు, నునుపు, రంగు ఎరుపు, పసుపు; కండ ఎరుపు, తీపి (తె. 6, 23, 24, 27, 28; రా. 23); భేదాలు:

**దేశవాళీసంత్ర** (రా. 23).

**నాగపూర్‌సంత్ర** (రా. 23).

**సపోటా** ఉ. సపూటా. ఒకరకం దక్షిణఅమెరికా పండ్లచెట్టు; (neesberry) *Achras sapota*, Linn; ఎండాకాలం ఆరంభంలో కాపుకాస్తుంది; పండు కోడిగుడ్డు ఆకారంలో ఉండి తింటానికి రుచిగా ఉంటుంది (కో. 2, 5, 6, 15, 39; తె. 21-24, 27, 28; రా. 1, 23); భేదాలు:

**గుండుసపోటా** (రా. 23).

**పాలసపోటా** (కో. 2, 5, 6; తె. 21-24, 28; రా. 1, 23).

**సాసవ(లు)** పర్యా. ఆవాలు. మూడు నుంచి అయిదడుగుల ఎత్తుదాకా పెరిగే నూనెగింజల చెట్టు; (mustard) *Brassica juncea*, Corr.; *B. nigra*, Linn.; కాయలు ఒకటి రెండంగుళాల పొడవుంటాయి; గింజలు తాలింపుదినుసుగాను, గింజలనుంచి తయారుచేసిన నూనె ఔషధాలకు, వంటకాలకు ఉపయోగిస్తుంది (రా. 9, 17).

**సితపలక** చూ. సీతాఫలం (తె. 32, 33, 42).

**సీతాఫలం** ఉ. సీతపలం; చూ. సితపలక; పర్యా. గగ్గురు. తోటల్లో పెంచే చిన్నచెట్టు; (custard apple) *Anona squamosa*, Linn.; పండ్లు ఎండాకాలంలో కాస్తాయి; రామాఫలంకంటె రుచి ఎక్కువ, చూ. పుట 182 (కో. 14, 15, 39, 41; తె. 13, 16-28).

**సీమచింత** రోడ్లపక్కను, అడవుల్లోను, పొలాలగట్ల మీద పెంచే మెక్సికోదేశపు చెట్టు; (manilla tamarind) *Pithecolobium dulce*, Benth.; ఎండాకాలం కాపుకు వస్తుంది; కాయలు 4-6 అంగుళాల పొడవున కోలగా చింతకాయల్లాగా ఉంటాయి; కాయకు 6-8 గింజలుంటాయి; గింజల నావరించిఉండే తెల్లటి పప్పు తింటానికి అనువుగా ఉంటుంది (రా. 1, 23).

**సీమసెనగ** పర్యా. చూ. వేరుసెనగ. మెట్టలోపండే ఒకరకం పప్పుదినుసు; (peanut, ground-nut) *Arachis hypogæa*, Linn.; వేళ్ళకుకానే కాయల పప్పుతో నూనె తయారుచేస్తారు; దక్షిణఅమెరికానుంచి 19వ శతాబ్దిలో మనదేశానికి ఈ పైరు వచ్చింది (రా. 15).

**సెనక్కాయ** (సెనగ + కాయ); పర్యా. చూ. వేరుసెనగ. మెట్టలో పండే ఒకరకం పప్పుదినుసు; (peanut, ground-nut) *Arachis hypogæa*, Linn.; వేళ్ళకు కానే కాయల పప్పుతో నూనె తయారుచేస్తారు; దక్షిణఅమెరికానుంచి 19వ శతాబ్దిలో మనదేశానికి ఈ పైరు వచ్చింది (తె. 4; రా. 2-6, 8, 10, 12, 14, 15, 19, 20); భేదం:

**బోదసెనక్కాయ** గుత్తివేరుసెనగ (రా. 18).

# 12. పశువులు

## 1. సామాన్యభేదాలు

**అగ్గిచెత్రం** చురుకైన ఎద్దు (కో. 50).

**అంబోతు** ఉ. ఆబోతు; పర్యా. చాండు, పోకడగంక. ఎద్దులో విత్తనపుకోడె (తె. 20-28).

**ఆవు** గోజాతిలో ఆడది; గోవు (కో. 1-25, 27, 30, 37-51 ; తె. 8, 10, 14, 21-25 ; రా. 1, 3, 6, 9, 11, 15-18, 21, 27).

**ఎద్దు** పర్యా. గోద. గోజాతిలో మొగది; బండ్లు మొ. వి లాగటానికీ సేద్యంచేయటానికీ ఉపయోగించే పెంపుడుజంతువు; ఈ కింది ప్రాంతాలకుచెందిన ఎద్దులు స్థానికంగా ప్రశస్తమైనవి: అమరవాది, అమరావతి, అల్లికేర (మైసూరు), ఇందూరు, ఉండూరు, ఉలుసూరు (బెంగుళూరు), ఒంగోలు, ఓను (మహారాష్ట్రం), ? కురమ (నల్గొండ). కొబ్బరిసీమ (బెంగుళూరు), కొల్లేరు, గుట్టల సీమ (కర్నూలుజిల్లా), గుంటూరు, చంద్రగిరి, చాటాపురం, తుల్జాపూర్, తూర్పునాడు (ఒంగోలు), దూపాటిసీమ (కర్నూలు). దేవరకొండ (నల్లమలలు), నందికొండ, నాగమండలం, నిజాంబాద్, పర్ణశాల (భద్రాచలం), పల్నాడు, బిదారు, బీదర్, బెంగుళూరు, బెల్లపుసీమ (హిందూపూర్), ముర్రా, మైసూరు, మొలకసీమ(గద్వాల), విహారాబాద్, వందర (దూపాటిసీమ), సిరిదేశం (మైసూరు), సుగారీ (కడప చిత్తూరు మధ్య కొండజాతి), హల్లీ (బొంబాయి): స్వభావాన్నిబట్టి, అవయవలక్షణాల్నిబట్టి ఎన్నో పేర్లు వాడుకలో ఉన్నాయి; ఉదా: ఆకుగిట్ట ఎద్దు, ఉబడి, ఏకక్రొమ్మూతిది, గవ్వకళ్ళది, ఇత్యాది (కో. 1-51 ; తె. 1-12, 14-16, 22, 23, 29-42 ; రా. 1-28).

**ఎనుము** పర్యా. చూ. బర్రె. గేదె; పాడికోసం మచ్చిక చేసి పెంచే సాధుజంతువు (కో. 1, 3; తె. 8, 12, 14, 26, 35 ; రా. 1, 2, 3, 7, 9, 11 ,12, 14, 15, 17, 21, 24, 28) ; **ఎనపగొడ్డు** ఉ. ఎంపగొడ్డు; చూ. ఎనుము (రా.); **ఎనపపడ్డ** ఉ. ఎనప్పడ్డ, ఎంపపడ్డ. ప్రాయంలో ఉన్న బర్రె (రా.): **ఎనపపోతు** ఉ. ఎనప్పోతు. దున్న (తె. రా.): **ఎనుగొడ్డు** చూ. ఎనపగొడ్డు (రా.): **ఎనుబోతు** చూ. ఎనపపోతు (తె. రా.).

**కవరు** ఒకరకం అడవిజాతి ఎద్దు (కో. 41).

**కుర్ర** ఉ. కుర; పర్యా. కొదమ. చిన్నదున్న; (అరుదుగా) చిన్నఎద్దు (కో. 1-5, 7, 14-17, 32 ; తె. 16-23, 31-36, 38, 41 ; రా. 16) ; **-దుడ్డె** ఉ. కుర దుడ్డె, కుర్రదూడె; చూ. కుర్రదూడ (తె.) ; **-దూడ** లేత దున్న (కో.).

**కొదమ** (బహు.) పర్యా. కుర్ర. చిన్నదున్న (కో. 39, 45-48, 50).

**కోడె** ఉ. కోడి. సుమారు రెండేళ్ళప్రాయంలో ఉన్న ఎద్దు; లేత ఆబోతు (కో. 1-29, 32, 35, 37-51; తె. 1-29, 31-40, 42 ; రా. 4, 6, 18, 21, 27, 28) ; **-దూడ** లేతకోడె (కో. తె. రా.) ; **-పెయ్య** చూ. కోడె దూడ (కో.): కోడెల్లో రకాలు: **ఎరగోడె** (-కోడె) **ఎర్రమల-** (కర్నూలు) ప్రాంతంది (రా.) ; **కట్టుగర-** వయసునఉన్న కోడె ; కట్టించే కాయకువచ్చిన కోడె (తె.): **కమ్మ-** ఒంగోలు జాతిది (తె.); **కురవ-** నల్గొండప్రాంతం అడవిజాతిది (తె.) ; **నక్కరోజు-** రొప్పుతూ నడిచేది (కో.) ; **నంది-** అందంగా ఉండేది; నందిలాగా ఉంటుందట (కో.); **మల-** నల్లగొండల ప్రాంతానికి (కర్నూలు జిల్లాకు) చెందినది (తె.) ; **ముప్ప-** ప్రాయంలో ఉన్నది (కో. తె.): **మూగ-** ? మదించిన కోడె (తె.); **వట్ట-** వట్టకొట్టని కోడె: ఆబోతు (కో. తె.): **విత్తనం-** చూ. వట్టకోడె (తె.).

**గిత్త** పొట్టిగాఉన్న ఎద్దు (కో. 2, 12, 16, 26-29, 35, 44 ; తె. 3, 6-8, 39, 40 ; రా. 2, 4-8, 14, 15, 18-20, 22-28) ; గిత్తల్లో రకాలు : **ఎర్రమల-** ఎర్రకొండల ప్రాంతానికి (కర్నూలు జిల్లాకు) చెందినది (రా.) ; **కనుమ-** చూ. ఎర్రమల- (రా.) ; **జవారి-** దేశవాళీ గిత్త (తె.); **తరిపి-** ? కొంచెం వయసుమళ్ళిన గిత్త (కో.); **తాండవ-** (? తాండాగిత్త; తాండాలు = లంబాడీలు) నల్లకొండల ప్రాంతంది (తె.) ; **నగిరి-** చిత్రగల్లు సీమ (మైసూరు రాష్ట్రం)ది (రా.) ; **నల్లమల-** నల్లమలకొండల ప్రాంతానికి (కర్నూలు జిల్లాకు) చెందినది (రా.)

**గిరంగు** కొండల్లో తిరిగే దున్న ; గిరివాసులు మచ్చిక

---

ఉ. = ఉచ్చారణభేదం(-భేదాలు) ; కో. = కోస్తాజిల్లాలు ; చూ. = చూడు ; తె. = తెలంగాణా ; పర్యా. = పర్యాయపదం (-పదాలు) : రా. = రాయలసీమ ; రూ. = రూపాంతరం (రూపాంతరాలు) ; విశ. = విశేషణం.

చేసి సేద్యానికి ఉపయోగిస్తారు (కో. 44, 49, 50).

**గేదె** పర్యా. చూ. బర్రె. పశువిశేషం; ఎనుము; పాడికోసం మచ్చికచేసి పెంచే సాధుజంతువు (కో. 13, 17, 21-23, 26-29, 34, 36, 37, 40, 43, 45-48); గేదెల్లో రకాలు: **గొడి-** ఉ. గొడుగేదె. నల్లగా ఎత్తుగా ఉండేది; నాటుగేదెకన్న పెద్దది (కో.); **పల్ల-** బూడిద రంగు బొచ్చున్న గేదె (కో.); **పూరి-** నాటుగేదె (కో.); **బొబ్బిలి-** బొబ్బిలిప్రాంతానికి చెందినది; స్థానికంగా ప్రశస్తమైనది (కో.).

**గొడ్డు** పశువు; ఆవు, ఎద్దు, బర్రె, దున్న-వీటన్నిటికీ సామాన్యంగా గాని, ఏవో కొన్నిటికి పరిమితంగా గాని వాడే పేరు; కొన్నిచోట్ల (ఉత్తరతెలంగాణాలో) దున్నలకు, గేదెలకు గొడ్లని; ఎడ్లకు, ఆవులకు గోదలని వాడుక (కో. 16, 45, 47; తె. 13, 21, 22, 24-30; రా. 7, 14, 23-28).

**గోద** పర్యా. ఎద్దు. గోజాతిలో మొగది (తెలంగాణాలో కొన్నిచోట్ల 'ఆవు'కు 'ఎద్దు'కు సామాన్యపదంగా కూడా వాడుక); కొన్నిప్రాంతాల్లో దీనికి 'గొడ్డు-గోద' అనే జంట పదంలోనే వాడుక; చూ. గొడ్డు (తె. 13, 17-21, 24-28).

**చాండు** ఉ. సాండు; పర్యా. చూ. ఆంబోతు. విత్తనపు కోడె (తె. 18).

**జిరంగు** చూ. గిరంగు (కో. 44, 49, 50).

**తగలు** కట్టుకారుకు వచ్చిన పడ్డ (కో. 33).

**తరిపి** (విణ.), ఆవు, గేదె మొ.వి ఈని చాలారోజులైన దశ (కో. 16, 21-23, 26, 27, 29-33, 35; తె. 1, 16, 19, 30, 34, 35, 40, 41).

**తరుపు** (1) ప్రాయంలోఉన్న ఆవు లేక పెయ్య; (2) పాలువిడిచిన దూడ (కో. 1, 3, 4, 7, 8; తె. 2, 32, 36, 38; 42; రా. 1, 6, 18, 21, 23).

**దుడ్డె** ఉ. దూడె; చూ. దూడ (కో. 31; తె. 1, 13, 15-18, 20, 21-28, 31-34, 37, 38).

**దున్న** పర్యా. పోతు. మహిషజాతికిచెందిన మొగ జంతువు; ఎనుబోతు (కో. 2, 7-10, 12, 16, 17, 20-22, 24, 28, 32, 35, 45; తె. 1, 9, 13, 19, 23-28, 31, 33, 36-42; రా. 1-6, 11, 15-19, 21, 23, 25, 27); **-కిచ్చ** చిన్నదున్న (కో.); **-కుర్ర** చూ. దున్నకిచ్చ (కో. తె.); **-దుడ్డె** దూడగాఉన్న దున్న; లేత దున్న (తె.); **-పోతు** ఎదిగిన దున్న (కో. తె. రా.); దున్నల్లో రకాలు: **కోర-** కోరకొమ్ముల దున్న (తె.); **గమిడీ-** తూరుపుకొండల దున్న; గొడుపోతు (కో.); **చుక్క-** నెత్తిమీద చుక్కఉన్నది; ప్రశస్తమైనది (తె.); **పల్ల-** బూడిదెరంగు బొచ్చున్నది (కో. తె.); **పాకాల-** పాకాలప్రాంతానికి చెందినది; స్థానికంగా ప్రశస్తమైనది (తె.); **బొబ్బిలి-** బొబ్బిలిప్రాంతపు దున్న; స్థానికంగా ప్రశస్తమైనది (కో.).

**దున్నంగి** పాలువిడిచిన లేతదున్న; చిన్నదున్న (రా. 6).

**దూడ** రూ. దుడ్డె. ఆవుకుగాని గేదెకుగాని పుట్టిన చిన్నది (కో. 1-8, 10, 12-18, 20-29, 32-37, 39-41, 44-47; తె. 1-12, 14-29, 31-42; రా. 6, 18, 21, 23); **-పెయ్య** లేత ఆవుదూడ (కో.); భేదాలు: **ఎడ-** పాలువిడిచిన దూడ (కో.); **కట్టుగర-** కట్టుకారుకు వచ్చిన పెయ్య (తె.); **తరిపి-** చూ. ఎడదూడ (కో. తె.); **తరుపు-** ఎదిగిన దూడ (తె.); **మూగ-** పాలువిడిచినది (తె.); **లేగ-** పాలుతాగేది (కో. తె.).

**నర్ర** ఉ. నర. (1) పెంకెఎద్దు; ఒకరకం అడవిజాతి ఎద్దు (కో. 39; తె. 33; రా. 9, 21, 23, 25, 26, 28).

**పడ్డ** (1) సుమారు మూడేళ్ళ ప్రాయంలోఉన్న బర్రెదూడ; (2) (అరుదుగా) ఆవుదూడ (కో. 1-9, 12, 13, 20, 22, 23, 24, 26-35, 39-51; తె. 3, 4, 15, 22, 32-42; రా. 6, 18, 21, 23, 27, 28); **-దూడ** ఉ. పడదూడ. ప్రాయంలోఉన్న బర్రెదూడ (కో. తె. రా.); **-పెయ్య** పాలువిడిచిన పెయ్య (కో.); పడ్డల్లో రకాలు: **కట్టుగారు-** కట్టే అదునుకువచ్చిన గేదె (కో. 26, 27, 31, 32, 35; తె. 22, 40); **తారీత-** కొన్ని ఈతలయిన పడ్డ (తె.).

**పసరం** పశువు (తె. 25; రా. 18).

**పెయ్య** ఉ. పయ, పెయ. (1) చిన్నవయసు ఆవు; లేత ఆవు; (2) (అరుదుగా) ఈనకాపుకువచ్చిన గేదె (కో. 1-51; తె. 1, 2, 13, 15-42; రా. 1, 6, 13, 21, 23, 27); **-దుడ్డె** చూ. పెయ్యదూడ (తె.); **-దూడ** ఉ. పయదూడ, పెయదూడె. ఆవుదూడ (కో. తె.); పెయ్యల్లో రకాలు: **ఎడగారు-** పాలువిడిచిన ఆవుదూడ (కో.): **కట్టుగారు-** కట్టే అదునుకువచ్చిన ఆవు (కో. తె.); **కట్టు-** చూ. కట్టుగారు- (తె.); **కన్నె-** ? పాలు విడిచిన ఆవుదూడ (కో.); **కోదమ-** లేగపెయ్య; పాలు విడవని ఆవుదూడ (కో.); **చెల-** ఉ. చెలపెయ్య. ప్రాయపు పెయ్య (కో. తె.); **తరిపి-** ఉ. తరిప్పెయ్య. పాలువిడిచిన పెయ్య (కో.); **దూక-** పాలువిడవని పెయ్య (కో.).

**పోకడగంక** పర్యా. చూ. ఆంబోతు. విత్తనపుకోడె (తె. 17).

**పోతు** పర్యా. దున్న. మహిషం; ఎనుబోతు (కో. 32, 35, 37-51; తె. 1, 3, 4, 8, 10, 12-14, 16-29, 31, 33, 36, 38, 39, 42; రా. 2, 6, 18, 19, 21); **-కుర్ర** ప్రాయంలోఉన్న దున్న (తె.); **-దుడ్డె**

# 12. పశువులు

## 1. సామాన్యభేదాలు

అగ్గిచెర్రం చురుకైన ఎద్దు (కో. 50).

**ఆంబోతు** ఉ. ఆబోతు; పర్యా. చాండు, పోతడగంక. ఎద్దులో విత్తనపుకోడె (తె. 20-28).

**ఆవు** గోజాతిలో ఆడది; గోవు (కో. 1-25, 27, 30, 37-51; తె. 8, 10, 14, 21-25; రా. 1, 3, 6, 9, 11, 15-18, 21, 27).

**ఎద్దు** పర్యా. గోద. గోజాతిలో మొగది; బండ్లు మొ. వి లాగటానికి సేద్యంచేయటానికీ ఉపయోగించే పెంపుడుజంతువు; ఈ కింది ప్రాంతాలకుచెందిన ఎద్దులు స్థానికంగా ప్రశస్తమైనవి: అమరవాది, అమరావతి, అగ్గిశేర (మైసూరు), ఇందూరు, ఉండూరు, ఉలుసూరు (బెంగుళూరు), ఒంగోలు, ఓను (మహారాష్ట్రం), ? కురమ (నల్గొండ), కొబ్బరిసీమ (బెంగుళూరు), కొల్లేరు, గుట్టల సీమ (కర్నూలుజిల్లా), గుంటూరు, చంద్రగిరి, చాటాపురం, తుల్జాపూర్, తూర్పునాడు (ఒంగోలు), దూపాటిసీమ (కర్నూలు), దేవరకొండ (నల్లమలలు), నందికొండ, నాగమండలం, నిజాంబాద్, పర్ణశాల (భద్రాచలం), పల్నాడు, బిదారు, బీదర్, బెంగుళూరు, బెల్లపుసీమ (హిందూపూర్), ముర్రా, మైసూరు, మొలకసీమ(గద్వాల), వికారాబాద్, వందర (దూపాటిసీమ), సిరిదేశం (మైసూరు), సుగాలీ (కడప చిత్తూరు మధ్య కొండజాతి), హళ్ళీ (బొంబాయి); స్వభావాన్నిబట్టి, అవయవలక్షణాల్నిబట్టి ఎన్నో పేర్లు వాడుకలో ఉన్నాయి; ఉదా: ఆకుగిట్ట ఎద్దు, ఉబిది, కుక్కమూతిది, గవ్వకళ్ళది, ఇత్యాది (కో. 1-51; తె. 1-12, 14-16, 22, 23, 29-42; రా. 1-28).

**ఎనుము** పర్యా. చూ. బర్రె. గేదె; పాడికోసం మచ్చిక చేసి పెంచే సాధుజంతువు (కో. 1, 3; తె. 8, 12, 14, 26, 35; రా. 1, 2, 3, 7, 9, 11, 12, 14, 15, 17, 21, 24, 28); **ఎనపగొడ్డు** ఉ. ఎంపగొడ్డు; చూ. ఎనుము (రా.); **ఎనపపడ్డ** ఉ. ఎనప్పడ్డ, ఎంపపడ్డ. ప్రాయంలో ఉన్న బర్రె (రా.); **ఎనపపోతు** ఉ. ఎనప్పోతు. దున్న (తె. రా.); **ఎనుగొడ్డు** చూ. ఎనపగొడ్డు (రా.); **ఎనుబోతు** చూ. ఎనపపోతు (తె. రా.).

**కవరు** ఒకరకం అడవిజాతి ఎద్దు (కో. 41).

**కుర్ర** ఉ. కుర; పర్యా. కొదమ. చిన్నదున్న; (అరుదుగా) చిన్నఎద్దు (కో. 1-5, 7, 14-17, 32; తె. 16-23, 31-36, 38, 41; రా. 16); **-దుడ్డె** ఉ. కుర దుడ్డె, కుర్రదూడె; చూ. కుర్రదూడ (తె.); **-దూడ** లేత దున్న (కో.).

**కొదమ** (బహు.) పర్యా. కుర్ర. చిన్నదున్న (కో. 39, 45-48, 50).

**కోడె** ఉ. కోడి. సుమారు రెండేళ్ళప్రాయంలో ఉన్న ఎద్దు; లేత ఆబోతు (కో. 1-29, 32, 35, 37-51; తె. 1-29, 31-40, 42; రా. 4, 6, 18, 21, 27, 28); **-దూడ** లేతకోడె (కో. తె. రా.); **-పెయ్య** చూ. కోడెదూడ (కో.); కోడెల్లో రకాలు: **ఎరగోడె** (-కోడె) **ఎర్రమల-** (కర్నూలు) ప్రాంతంది (రా.); **కట్టుగర-** వయసునఉన్న కోడె; కట్టించే కారుకువచ్చిన కోడె (తె.); **కమ్మ-** ఒంగోలు జాతిది (తె.); **కురవ-** నల్గొండప్రాంతం అడవిజాతిది (తె.); **నక్కరోజు-** రొప్పుతూ నడిచేది (కో.); **నంది-** అందంగా ఉండేది; నందిలాగా ఉంటుందట (కో.); **మల-** నల్లగొండల ప్రాంతానికి (కర్నూలు జిల్లాకు) చెందినది (తె.); **ముప్పు-** ప్రాయంలో ఉన్నది (కో. తె.); **మూగ-** ? మదించిన కోడె (తె.); **వట్టి-** వట్టకొట్టని కోడె: ఆబోతు (కో. తె.); **విత్తనం-** చూ. వట్టికోడె (తె.).

**గిత్త** పొట్టిగాఉన్న ఎద్దు (కో. 2, 12, 16, 26-29, 35, 44; తె. 3, 6-8, 39, 40; రా. 2, 4-8, 14, 15, 18-20, 22-28); గిత్తల్లో రకాలు: **ఎర్రమల-** ఎర్రకొండల ప్రాంతానికి (కర్నూలు జిల్లాకు) చెందినది (రా.); **కనుము-** చూ. ఎర్రమల- (రా.); **జవారి-** దేశవాళీ గిత్త (తె.); **తరిపి-** ? కొంచెం వయసుమళ్ళిన గిత్త (కో.); **తాండవ-** (? తాండాగిత్త; తాండాలు = లంబాడీలు) నల్లకొండల ప్రాంతంది (తె.); **నగిరి-** చిత్రగల్లు సీమ (మైసూరు రాష్ట్రం)ది (రా.); **నల్లమల-** నల్లమలకొండల ప్రాంతానికి (కర్నూలు జిల్లాకు) చెందినది (రా.)

**గిరంగు** కొండల్లో తిరిగే దున్న; గిరివాసులు మచ్చిక

---

ఉ. = ఉచ్చారణభేదం(-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం (రూపాంతరాలు); విశే. = విశేషణం.

**ఎదాభారాలు** (బహు.) పర్యా. చూ. మెడపాము(లు). మెడకు రెండుపక్కలా నల్లటి చారలు (కో. 8).

**ఎదిరికౌడ** తోక చివర పొడుగ్గాఉండే సుడి (కో. 38).

**ఎదురుసుడి** ఉ. ఎదరసుడి; పర్యా. ఎదసుడి. ఎదురురొమ్ముమీది సుడి (కో. 10, 22, 23, 25).

**ఎరిణమ్మ** ఏకుపండ్ల ఎద్దు; దీన్ని కొనటం మంచిది కాదట (కో. 48).

**ఎఱ్ఱ** (విశే.), ఉ. ఎర. ఎఱ్ఱమట్టి ఎరుపు (కో. 1-8, 10-26, 28, 29, 32; తె. 1-4, 6-12, 14, 19, 29, 30, 33-40; రా. 1, 4-6, 8, 9, 11, 16, 18, 21-28); **-కారు** నలుపురంగుమీద ఎఱ్ఱపొడ (రా.); **-గఱ్ఱె** (-కఱ్ఱె) ఉ. ఎరగిరి. ఎరుపు నలుపు కలిసిన రంగు (కో. (రా.); **-జాల** ఉ. ఎరజాల. తెలుపులో ఎఱ్ఱచార; ఎరుపుమీద తెల్లచుక్క (కో. తె. రా.); **-పొడ** ఉ. ఎరపొడ. ఎఱ్ఱమచ్చ (తె.); **-బట్ట** ఎరుపుమీద తెల్లబట్ట (పెద్దమచ్చ) గాని, తెలుపుమీద ఎఱ్ఱబట్టగాని (కో. తె. రా.); **-బొల్లి** శరీరం ఎరుపు, మొగం తెలుపు (తె. రా.); **-మట్టె** చూ. ఎఱ్ఱబట్ట (కో. తె. రా.); **-మైల** చూ. ఎఱ్ఱగఱ్ఱె (కో. రా.); ఎరుపురంగులో రకాలు: **చవుటెఱ్ఱ** ఇంకోరంగు కలవని ఎరుపు (రా.); **జింటెఱ్ఱ** జింకరంగుమాదిరి ఎరుపు (రా.); **దోరెఱ్ఱ** లేతఎరుపు (తె.); **పగడపెఱ్ఱ** పగడం మాదిరి ఎరుపు (రా.); **పండెఱ్ఱ** నిండైన ఎరుపు (తె. రా.); **బొంతెఱ్ఱ** దుమ్మురంగులో ఉండే ఎరుపు (రా.).

**ఎలకవన్నె** తెలుపుమీద నల్లచార, చూ. అలకబట్ట (కో. 46).

**ఎల్ల** (విశే.) (<వెల్ల-). తెలుపురంగు (కో. 6, 9, 12, 13, 15-18, 20, 21, 23-25, 27, 29, 32, 33, 35-51; తె. 11, 13, 29, 32, 37-42; రా. 20); **-బొల్లి** మొగం తెలుపు, శరీరం మరొకరంగు (తె.); **కాపనెల్ల** ఉ. ప్రేవనెల్ల. (1) అచ్చతెలుపు; (2) కొంచెం ఎరుపుకలిసిన తెలుపు (కో. తె.).

**ఏదుగొయ్య** (1) వీపున రెండువైపులా ఉండే సుడి; (2) పర్యా. చూ. పొరకసుడి. మలుగుకు బెత్తెడుదూరంలో ఎటువైపైనా ఉండేది; చెరుపు (తె. 5-7, 9-11).

**ఒంటికవ్వం** మెడకిందనుంచి జెబ్బలవరకూ ఉండే నల్లటి మచ్చ. 'ఒంటికవ్వం ఉంటే ఇంటికవ్వం నిలవదు' అని సా. మెత (కో. 4; రా. 1).

**కణతసుడి** కణతమీద ఉండేది; ఇది రెండుకణతల మీద ఉంటే మంచిది (కో. 5, 9, 13, 14).

**కంటిపులి** రూ. కనుపులి. కంటిమీద తెల్లటిమచ్చ; ఇది ఒకకంటికే ఉంటే చెరుపు; 'కంటిపులి ఉంటే ఇంటిపులి (యజమాని) పోతుంది' అని సామెత (కో. 1-3; రా. 1, 4).

**కంఠలాల** మెడమీది (? కింది) సుడి (తె. 14).

**కంఠాభరణం** మెడమీది సుడి; రెండువైపులా రెండుంటాయి; మంచిది (కో. 39).

**కత్తెరజాల** నలుపులో ఎరుపుచార (కో. 51; తె. 1).

**కత్తెరబట్ట** నలుపులో ఎఱ్ఱపొడ (తె. 35).

**కత్తెరసుడి** వీపుమీద కత్తెరమాదిరిఉండే సుడి (తె. 38, 39).

**కనకతోక** తెల్లటి కుచ్చున్నతోక; ఇది పశువుకు మంచిలక్షణం (కో. 2, 5; రా. 1).

**కనుపులి** ఉ. కనిబులి; చూ కంటిపులి (కో. 10; రా. 27).

**కన్నుఱ్ఱు** కాడి రాపిడికి గుండ్రంగా పుండుబడ్డ అఱ్ఱు (కో. 5).

**కన్నె** పర్యా. చూ. కపిల. కపిలవర్ణం; నలుపు పసుపులు కలిసినరంగు (రా. 18, 28).

**కపిల** (విశే.) రూ. కమిల, కయిల; పర్యా. కన్నె. నలుపు పసుపులు కలిసినరంగు (తె. 10).

**కమిల** చూ. కపిల (తె. 35).

**కంప్రం** పర్యా. చూ. పాడెసుడి. వీపుమీదగాని, పొట్టమీదగాని నాలుగువైపులా ఉండే నాలుగుసుళ్ళు; చాలా చెరుపు (తె. 18).

**కయిల** ఉ. కైల (< కవిల < కపిల, విశే.); చూ. కపిల (తె. 1, 2, 27, 31, 41); **-కరి** కపిలవర్ణంలో నలుపెక్కువగాఉన్న వన్నె (తె.); **-పసె** నలుపుతో కలిసి తెలుపెక్కువగాఉన్న వన్నె (తె.).

**కరవ** శరీరంమీద వెనకాముందూ నలుపు, మధ్యన తెలుపు (కో. 6).

**కరి** రూ. కరిగి; పర్యా. చూ. మడి. పశుయోని (రా. 18, 20-28).

**కరిగి** చూ. కరి. తె. 20, 22-24, 26).

**కరిబాయి** చూ. కరివాయి (రా. 16-18).

**కరివాయి** ఉ. కరివాయి, కరువాయి; రూ. కరిబాయి. పై పెదవిమీదఉండే నల్లమచ్చ; ఇదిఉంటే కుటుంబాదాయం తగ్గుతుందట (కో. 1; రా. 1).

**కఱ్ఱి** (విశే.) ఉ. కరి, కరె, కఱ్ఱె. నలుపురంగు (కో. 1-29, 31, 33, 35, 41, 44-46, 48, 49, 51; తె. 1-4, 6, 18, 20-25, 30-42; రా. 5. 6, 8, 9, 11, 15, 16, 18, 21-28); **-జాల** ఉ. కరిజాల, కఱ్ఱెజాల. నలుపుమీద తెలుపు, మొ. మరొక రంగుచార (కో. తె. రా.); **-బట్ట** ఉ. కరెబట్ట. నలుపుమీద తెల్లమచ్చ (కో. తె. రా.); **-బూసర** తెలుపుమీద నల్లచుక్క(లు) (కో.); **-బొల్లి** శరీరం నలుపు, మొగం తెలుపు (తె.

రా.); **-మైల** (1) శరీరం నలుపు, మెడమీద నలుపు; (2) నలుపుమీద తెలుపు, ఎరుపుమచ్చ (కో.); కర్రి రంగులో రకాలు: **కాకి-** ఉ. కాక్కర్రె, కాక్కర్రి. కాకి నలుపు (కో. తె.); **-చవుట** ఉ. చవిటికర్రి, చవిటెకర్రె, చౌటకరి, చౌటకరె, చౌటకర్రె. లేతనలుపు; కపిలవన్నె (కో. తె. రా.); **చేగర్రి** ఉ. చేకరె, చేగరి, చేగర్రె, చేగారి. ఎరుపులో నలుపు; చేవనలుపు (తె. రా.); **తాటి-** ఉ. తాటికరి. తాటికాయ నలుపు (కో. తె. రా.); **పుల్ల-** ఉ. పుల్లకరి, పుల్లకర్రె, పుల్లగరి. మసరరంగు; ఎరుపుతో కలిసిన నలుపు (రా.); **బూజ-** బూడిదరంగు (కో.); **బొంత-** ఉ. బొంతకర్రె. (1) కొంచెం ఎరుపు నలుపులు కలిసిన రంగు; (2) నలుపురంగు, ముదుగురోమం ఉండటం (కో. తె.); **మాల-** ఉ. మాలకరి. కారునలుపు (కో. రా.); **మైల-** ఉ. మైలకరి, మైలకరె. కపిలవన్నె (తె.); **సుద్ద-** ఉ. సుద్దకరి. అచ్చనలుపు (రా.).

**కలువ** (విశే.) ఉ. కలవ. తెలుపునలుపు రంగుల కలయిక; ? చూ. కపిల (తె. 1, 5, 31, 36, 42).

**కాకిదోర** ఎరుపులో కొంతలెక్క నలుపుకలిసిన రంగు (కో. 21).

**కాడిసుడి** ఉ. కాటిసుడి. అర్రమీద ఉండే సుడి; దీని వల్ల జోడెద్దుకు చెరుపు (కో. 10, 22; తె. 1, 2; రా. 1).

**కారు** ఉ. కారె. ఎల్ల, నల్ల కలిసిన రంగు; తెలుపులో నలుపుచార (కో. 5, 37; రా. 9, 25); **మైల-** తెలుపులో నలుపుచార (రా. 25).

**కాసె** ఉ. కాశ; (1) పర్యా. చూ. మడి. పశుయోని (తె. 25); (2) ? తోకకింది భాగం (తె. 26, 27).

**కుక్కమైల** గోధుమవన్నెలో నలుపుకలిసిన రంగు (తె. 6, 34, 37).

**కునెం** (బహు. కునేలు) నెబ్బరసుడి, చూ. అనువు (కో. 51).

**కుప్పసుడి** రూ. కొప్పుసుడి; పర్యా. గజపుసుడి, గొడుగుసుడి, చెండుసుడి, తానపుసుడి, ధనసుడి, ధాన్యపుసుడి, మూపురంమీద ఉండేది; దీనివల్ల కుటుంబాదాయం పెరుగుతుందట (కో. 1, 2, 5, 7; తె. 3; రా. 5, 7, 9, 18, 24, 25).

**కుంపటిసుడి** ముచ్చెల(న) గుంటలో ఉండేది; చెరుపు (కో. 10, 11, 23).

**కొంకిసుడి** పర్యా. బండకోపుసుడి. మోకాలి వెనక భాగంలో ఉండేది (కో. 29).

**కొండగిరి** వీపుమీద ఎక్కడైనా, రెండువైపులా ఉండే సుడి (రా. 24, 25).

**కొప్పుసుడి** చూ. కుప్పసుడి (తె. 11).

**కొమ్ము** పర్యా. పన. పశువుల తలమీద జంటగా మొలిచే గట్టి అవయవ విశేషం; ఇది మామూలుగా వంపు దిరిగి కోసుగా ఉంటుంది (కో. 1-35, 37, 39, 40, 44-51; తె. 1, 3-5, 7-42; రా. 1, 4-7, 9, 11, 13-16, 18-28); భేదాలు: **అడ్డ-** పర్యా. అడ్డపన. చూ. పన. వెలుపలికి వంగిన కొమ్ము (కో. తె.); **ఆడ-** పొడుగ్గా వల్చగా సన్నగాఉండేది (కో.); **ఇర్రి-** కొస చుట్టుతిరిగిన కొమ్ము (కో.); **ఒర-** ఒకటి ముందుకు ఒకటి వెనక్కు తిరిగిఉండే కొమ్ము(లు) (కో.); **కట్టె-** సన్నటి గట్టికొమ్ము (కో. తె.); **కర్ర-** చూ. కట్టె (కో.); **కుప్పె-** పొడుగాటి కొమ్ము (కో.); **కెల్లి-** చూ. ఒర- (కో.); **కొచ్చె-** నిటారుగా ఉన్న కొమ్ము (తె.); **కోర-** పర్యా. కోరపన. చూ. పన. (1) వెనక్కు వాలి ముందుకు తిరిగిన కొమ్ము; (2) కోసుగా పొడుగ్గా ఉన్న కొమ్ము; (కో. తె. రా.); **గిద్దె-** చూ. దుంప- (కో.); **గిన్నె-** ? వెనక్కు వాలి కొనలు కలిసిన కొమ్ము(లు) (కో.); **గుజ్జు-** వెనక్కువాలి కొనలుగలిసిన కొమ్ము(లు) (తె.); **గుండు-** ఉ. గుండుగొమ్ము; పర్యా. గుండుపన; చూ. పన. లోపలివైపుకు గుండ్రంగాతిరిగి కొనలుకలిసిన కొమ్ము (కో. తె.); **గుండ్ర-** చూ. గుండు- (కో. తె.); **గుమ్మ-** ? చూ. గుంపు (కో.); **గూడు-** చూ. చందమామ- (కో. తె. రా.); **గొంగి-** కొనలు ముందుకుతిరిగిన కొమ్ము (తె.); **గొడుగు-** ఉ. గొడుగ్గొమ్ము; చూ. కోర- (తె.); **గొర్రె-** గొర్రెకుమాదిరి మొదలు దగ్గరనే చుట్టలు తిరిగిన కొమ్ము (కో.); **గోలు-** ఉ. గోల్కొమ్ము; చూ. గుంపు- (తె.); **చందమామ-** గుండ్రంగా లోపలికి వంపుతిరిగిన కొమ్ము (తె. రా.); **చందు-** చూ. చందమామ- (తె.); **చప్పి-** వెనక్కు బాగా వాలిన కొమ్ము (కో. తె.); **చప్పిడి-** ఉ. చప్పిలి-; చూ. చప్పి- (తె.); **చిప్పి-** చూ. పంగకొమ్ము (కో.); **చిప్పెర-** చూ. పంగ- (కో.); **చిర్ర-** నిటారుగా సన్నగా ఉన్న కొమ్ము (రా.); **చువ్వ-** సన్నగాఉండేది (కో.); **చేటు-** వెలుపలికి ఏటవాలుగా వాలి కొనలు క్రమంగా దూరమైన కొమ్ము(లు) (కో.); **జల్ల-** వెడల్పుగా చిన్నదిగా అందంగాఉన్న కొమ్ము (కో.); **జింక-** చూ. ఇర్రి- (కో. తె.); **జిర్ర-** చూ. చిర్ర- (కో.); **తోలు-** మొదలు సడలి వేలాడేకొమ్ము (కో. తె. రా.); **దుంప-** లావుగా, పొట్టిగా బోడిగాఉండే కొమ్ము(లు) (కో.); **దువ్వెన-** ఉ. దువెన-. వెనక్కు సాపుగా పెరిగిన కొమ్ము(లు) (రా.); **దూగొమ్ము** చూ. దువ్వెన- (కో.); **దూజారు-** చూ. దువ్వెన- (రా.); **దూబ-** చూ. దువ్వెన- (రా.); **దూబెన-** ఉ. దూబాన-; చూ. దువ్వెన- (రా.); **నిలువు-** ఉ. నిలువుగొమ్ము; పర్యా. నిలువుపన, చూ. పన. నిటారుగాఉన్న కొమ్ము (కో. తె. రా.); **నెట్టె-** చూ. ఒర- (రా.); **నెల-**

చూ. చందమామ- (తె.); **పంగ-** పంగలక్రమమాదిరి కొనలు క్రమంగా దూరమైన కొమ్ము(లు) (కో. తె. రా.); **పటూరా-** చూ. అడ్డ- (తె.); **పడస-** చూ. దుంప- (కో.); **పలవరగాయ-** చూ. ఇర్రి- (రా.); **పాయ-** చూ. పంగ- (కో.); **పిడస-** చూ. దుంప- (కో.); **పురి-** చూ. ఇర్రి- (రా.); **పూగొమ్ము** చూ. పూత- (కో. తె.); **పూత-** కొన వెడల్పుగా, తెల్లగా, మొద్దుగాఉన్న కొమ్ము (కో. తె. రా.); **పొట్టేలు-** ఉ. పొటేలు కొమ్ము(లు). గొర్రెపోతు కొమ్ములమాదిరి వెనకనుంచి ముందుకు వంపుదిరిగిన కొమ్ము(లు) (కో.); **పొలుసు-** మీద గరుగ్గాఉండేది (కో.); **బండ-** లావుగాఉండేది (కో.); **బద్ద-** వెడల్పుగాఉండేది (కో.); **బర్రి-** చూ. పంగ- (కో.); **బాడవ-** పెద్దకొమ్ము (కో.); **బిళ్ళ-** చూ. చందమామ- (కో. రా.); **బుంగ-** పర్యా. బుంగపన, చూ. పన లోపలివైపుకు గుండ్రంగా తిరిగి కొనలుకలిగిన కొమ్ము(లు) (కో. తె. రా.); **బుట్టి-** చూ. దుంప- (కో.); **బుడం-** ఉ. బుడెంకొమ్ము; దుంప- (కో.); **బుడిగి-** చూ. దుంప- (రా.); **బొంగ-** చూ. పంగ- (కో. రా.); **బొటితె-** చూ. దుంప- (తె.); **బొట్టె-** పర్యా. బొట్టెపన, చూ. పన. లావుగా, పొట్టిగా బోడిగాఉండే కొమ్ము (కో.); **బొడుసు-** ఉ. బుడుసు-, బొడిసి-, బొడ్సు-; చూ. దుంప- (కో. తె.); **బొద్ద-** కొనలుకలిసిన కొమ్ము(లు) (కో.); **బొల్లి-** ? వెనక్కువంగిన కొమ్ము(లు) (తె.); **బోటు-** చూ. ఒర- (కో. తె.); **బోడి-** ఉ. బోడ-; పర్యా. బోడిపన. చూ. పన. (1) వెనక్కువాలిన పొట్టి కొమ్ము. (2) బాగా గిటకబారి మొద్దుగాఉండే కొమ్ము (కో. తె. రా.); **మాలి-** నిటారుగా ఉండి కొన వెనక్కువంగిన కొమ్ము(లు) (తె.); **ముద్ద-** చూ. దుంప- (కో. తె.); **మునిగోర-** ఉ. ముంగారి-. కొన ముందుకువంగిన కొమ్ము(లు) (కో. తె. రా.); **మెట్టె-** ఉ. మెట్ట-; చూ. ఒర- (కో. రా.); **మెంట-** ఒకటి ఎత్తుగా ఒకటి తగ్గుగా ఉన్న కొమ్ములు (కో. తె. రా.); **మొటిక-** చూ. దుంప- (కో.); **మొట్టి-** చూ. దుంప- (కో. రా.); **రాగోల-** ఉ. రాగాల-; పర్యా. రాగోలపన; చూ. పన. పంగలక్రమమాదిరి కొనలు క్రమంగా దూరమైన కొమ్ము(లు) (కో. తె.; **రివ్వ-** ఉ. రివ-; చూ. చువ్వ- (కో.); **రొడ్డ-** రెండూ ఎడంవైపుకు వంగినవి (రా.); **లండి-** ఉ. లండాకొమ్ము. సన్నటి అందమైన కొమ్ము(లు) (కో.); **లేడి-** చూ. ఇర్రి- (కో.); **లొట్ట-** చూ. తోలు- (తె.); **లోడు-** చూ. తోలు- (కో.); **వడగొమ్ము** చూ. ఇర్రి- (రా.); **వాణి-** చూ. లండి- (కో.); **వాలుగొమ్ము** చూ. దువ్వెన- (కో.); **వెనిగోర-** ఉ. ఎనిగోర-. వెనకనుంచి ముందుకువంగిన కొమ్ము (తె. రా.); **సవారి-** నిలువుగా ఉండి కొన వంపుదిరిగిన కొమ్ము (తె.); **సుల్-** చూ. లండా- (కో.); **సూది-** ఉ. సూదిగొమ్ము. చక్కగా కొనదేరిన కొమ్ము (కో. తె.).

**కొరివిమచ్చ** పర్యా. అగ్నిమచ్చ. ఒంటిమీద ఎక్కడైనా కాల్చినట్టు నల్లగాఉండే మచ్చ; చెరుపు (కో. 1, 4, 6; రా. 1).

**కోతిమైల** కోతివన్నెలాటి మసరరంగు (కో. 23).

**గగ్గిరోమం** ఒంటిమీద అక్కడక్కడ కుప్పలు కుప్పలుగాఉండే బొచ్చు (కో. 10).

**గంగడోలు** రూ. డంగడోలు. ఎద్దులకు, ఆవులకు మెడకింద వేలాడే తోలు; సాస్న (కో. 12, 26, 27, 35; తె. 19, 20, 23–28).

**గంగమైల** ఉ. గంగుమైల. ఒకరకం కపిలవర్ణం (కో. 1, 38).

**గజపుసుడి** పర్యా. చూ. పుప్పసుడి. మూపురంమీద ఉండేది; మంచిది (తె. 30).

**గంటసుడి** పర్యా. గాటిసుడి. గంగడోలుమీది సుడి; ఇది ఉంటే జోడెద్దుకు ప్రమాదం (కో. 12).

**గద్దగోరు** ఉ. గెద్దగోరు. తోకచివర చిన్న వంకర; మంచిదిగాదు (కో. 37, 40, 46, 47).

**గంతసుడి** పర్యా. చూ. గాటిసుడి. మలుగునుంచి నాలుగంగులాలకు మించి ముందువైపు ఉండే సుడి; (కొన్నిచోట్ల) వీపుకు రెండువైపులా ఉండేది (కో. 4, 6, 13, 18, 22, 23, 25; తె. 3, 32, 36).

**గందపుమచ్చ** రూ. గంధంమచ్చ. మెడకింద చార (రా. 1).

**గందంమచ్చ** చూ. గందపుమచ్చ (తె. 14, 29, 31, 35).

**గంధపట్టె** ఉ. గంధంపట్టె; పర్యా. చూ. మెడపాము(లు). గొంతుకు రెండుపక్కలాఉండే నల్లచార(లు) (కో. 6, 14).

**గర్భసుడి** బొడ్డుసుడికి జానెడు ఎడంగా వెనకవైపున ఉండేది (తె. 6, 8).

**గవ్వమచ్చ** నొసలుమీద గవ్వమాదిరిగాఉండే(? తెల్ల) మచ్చ (కో. 47).

**గాటిపొల్లు** ? వీపుమీద ఒకపక్కన ఉండేమచ్చ (కో. 4).

**గాటిసుడి** ఉ. గాడిసుడి; పర్యా. ఈలుగొయ్య, గంతసుడి. (1) వీపుకు ఇరువైపులా ఉండేది; (2) డొక్కలో ఉండేది (అరుదు); (3) పర్యా. గంటసుడి. గంగడోలు కిందిభాగంలో ఉండేది; ఇది ఉంటే జోడెద్దుకు ప్రమాదంట (కో. 2, 5, 7, 18–20, 22, 24, 25; తె. 3, 4, 37–39; రా. 11, 18, 22, 23, 28).

**గాడిదమైల** బూడిద వన్నెహెచ్చ (కో. 2–7, 15;

రా. 1).

**గిట్ట** ఉ. గిట్టె, గెట్టె; రూ. గెటికె, గొట్టె; పర్యా. డెక్క. కాలికొసన జంటగామొలిచే గట్టి గోరువంటి అవయవం (కో. 3–21, 24, 25; తె. 1, 4, 5, 28, 36; రా. 3, 4, 14, 18); భేదాలు: **ఆకు-** ఉ. అగ్గిట్ట, అగ్గెట్ట; రూ. ఆకుగొట్టె; పర్యా. గువ్వడెక్క, పావచ్చు, పావుడెక్క, పోతుగెటికె. పల్చగా వెడల్పుగాఉన్న గిట్ట(లు) (కో.); **గుర్రపు-** ముద్దగా గట్టిగా చీలికసందు తక్కువగా ఉన్న గిట్ట(లు) (కో.); **చిరి-** ఉ. చిరిగెట్టె; రూ. చిరిగెటికె. కాలివెనక అడుగు గిట్టకు అంగుళంపైన జంటగా మొలిచే చిన్నగిట్ట(లు) (తె.); **జేడె-** ఉ. జేడెగెట్ట. చీలికసందు వెడల్పుగాఉన్న గిట్ట(లు) (కో.); **తిరుగు-** ఉ. తిరుగెట్టె; పర్యా. నెరుంగొట్టె. కొన్ని పశువులు నడిచేటప్పుడు ఎక్కువగా అరిగే వెలుపలిగిట్ట (తె. రా.); **తెర్ర-** చూ. జేడెగిట్ట (కో.); **పవ్వ-** చూ. ఆకు- (కో.); **పిల్ల-** ఉ. పిల్లగెట్టె; చూ. చిరి- (కో.); **పెన-** ఉ. పెనగెట్టె. కొనలు ఒకదానిమీది కొకటి ఎక్కిన గిట్ట(లు) (తె.); **మాద-** ఉ. మాదగెట్టె కొనసాగిన గిట్ట(లు) (కో.); **ముద్ద-** ఉ. ముద్దగెట్టె ముద్దగా గట్టిగా చీలికసందు తక్కువగాఉన్న గిట్ట(లు) (కో. తె. రా.); **సర్దు-** చూ. తిరుగు- (కో.).

**గూటంసుడి** చూ. గూటిసుడి (కో. 1; తె. 36; రా. 1, 3, 5, 7, 9, 18).

**గూటిసుడి** రూ. గూటంసుడి. తోకకింది సుడి (కో. 6, 10, 11, 14, 18, 24; రా. 11, 23, 28).

**గెటికె** చూ. గిట్ట (తె. 5); రకాలు: **చిరి-** రూ. చిరిగిట్ట; చూ. గిట్ట (తె.); **పోతు-** ? పర్యా. ఆకుగిట్ట; చూ. గిట్ట. పల్చగా వెడల్పుగాఉన్న గిట్ట(లు) (తె.).

**గొట్టె** ఉ. గొట్టు; చూ. గిట్ట (కో. 20, 21; తె. 4; రా. 3, 4): రకాలు: **ఆకు-** ఉ. అగ్గొట్టు; రూ. ఆకుగిట్ట, చూ. గిట్ట (తె. రా.); **గుర్రపు-** రూ. గుర్రపుగిట్ట; చూ. గిట్ట (కో.): **నెరుం-** పర్యా. తిరుగుగిట్ట; చూ. గిట్ట. కొన్ని పశువులు నడిచేటప్పుడు ఎక్కువగా అరిగే వెలుపలిగిట్ట (రా.): **ముద్ద-** రూ. ముద్దగిట్ట; చూ. గిట్ట (కో. తె. రా.): **మూల-** కొసన కొద్దిగా వంపుతిరిగిన గిట్ట (కో.).

**గొడుగుసుడి** పర్యా. చూ. కుప్పసుడి. మూపురంమీద ఉండేది: ఇది ఉంటే కుటుంబాదాయం పెరుగుతుందట (రా. 3–5, 22).

**గోచిగడ్డం** ముడ్డిదగ్గర ఆకుమాదిరి ఉండేసుడి; చెరుపు (కో. 49).

**గోచిరిక** వెనక తొడమీద చిన్న పాముపడగలాటి సుడి: చూ. నాగబంధం (కో. 48).

**గోదుముజాల** గోధుమవన్నె చార (రా. 28).

**గోదుమపొడ** గోధుమవన్నె మచ్చ (తె. 12).

**గోరింకబట్ట** ఉ. కోరంకిబట్ట, గొర్రెంకబట్ట, గోరంకిబట్ట. ఒంటిమీద నలుపు తెలుపులు కలిసిన ఒకరకపు రంగుచార; గోరువంకరంగు మాదిరి రంగుచార (తె. 1, 5; రా. 1, 5, 6, 8).

**గోసెసుడి** ఒకరకం సుడి; ? చూ. గోచిరిక (కో. 27).

**చక్కిటిసుడి** మూపురం దిగువభాగంలో ఉండేది; చూ. కుప్పసుడి (తె. 8).

**చంక** పర్యా. చూ. పొదుగు. ఆవు, గేదె మొ. జంతువులు చేపినప్పుడు పాలుకూడే చోటు (కో. 16, 35; తె. 1, 6, 7, 9, 10, 12, 37-39); రకాలు: **కుక్క-** పాలు తక్కువగాఉండేది (తె.); **గిన్నె-** వెడల్పుగా గిన్నె మాదిరి ఉండి, రొమ్ములు పొట్టిగా లావుగాఉండేది (తె.): **జారు-** కిందికి జారి పొడుగాటి చన్నుతోఉండేది; ఇదిగల పశువు పాలు బాగా ఇస్తుంది (తె.); **బండ-** పైభాగం చిన్నదిగా ఉండి, చన్ను పొడుగ్గాఉండేది (తె.); **వారు-** సన్నంగాఉండేది; ఇదిగల పశువు పాలు బాగా ఇస్తుంది (కో. తె.).

**చంకమడత** ? మోకాళ్ళకు పైవైపున ఉండే సుడి; మంచిది (కో. 1–4; రా. 1).

**చంకసుడి** పర్యా. చూ. చిలకసుడి. జెబ్బమడతలో ఉండే సుడి (కో. 11, 14, 20).

**చన్ను** పర్యా. రొమ్ము, సిరం. ఆవు, గేదె మొ. వాటి రొమ్ము (స్తనం) (కో. 12, 26-29, 31, 32, 35, 37, 39; తె. 1, 41); భేదాలు: **అంటు-** పొడుగునంటి చిన్నదిగా ఉండేది (తె.); **కరికె-** బిరుసు చన్ను; దీన్నుంచి పాలు బాగా రావు (తె.); **చిట్టి-** చూ. అంటు- (తె.); **నార-** కొసదేరిన చన్ను; మెత్తగా, కోలగా ఉంటుంది; దీన్నుంచి పాలు బాగా వస్తాయి (కో.); **బిర్రు-** చూ. కరికె- (కో.); **బొంగు(ర)-** లావుపాటిది (కో. తె.).

**చింతపూజాల** చింతపువ్వుమాదిరి (తెలుపు ఎరుపు రంగు) చార (కో. 5; తె. 39; రా. 1, 4–6, 21, 22).

**చిలకముక్కు** పర్యా. చూ. చిలకసుడి. జెబ్బ మడతలోగాని, మోకాలి మడతలోగాని చిలకముక్కు ఆకారంలో ఉండే సుడి (కో. 1, 2, 10, 11, 13; తె. 39).

**చిలకసుడి** పర్యా. చంకసుడి, చిలకముక్కు, మడతసుడి. జెబ్బమడతలోగాని, మోకాలిమడతలోగాని ఉండే సుడి (కో. 16, 32; తె. 38; రా. 27).

**చిలిపిబట్టు** ఉ. శిలిబ్బట్టు. ఎరుపు తెలుపు నలుపు వన్నెల మచ్చ(లు) (కో. 22).

**చిలిపివన్నె** ఉ. శిలిపొన్నె. ? గోధుమరంగు (కో. 14, 15).

**చీపురుసుడి** ఉ. చీపిరిసుడి; పర్యా. చూ. పొరకసుడి. మలుగుపు బెత్తెడు దూరంలో ఎటువైపైనా ఉండే సుడి; తోకమట్టమీద ఉండేది; ఇదిఉంటే చీపురుతో తుడిచినట్టు సంపద తుడుచుకుపోతుందట (కో. 18; తె. 18, 30, 31, 39).

**చుక్క** నుదుటిమీద ఏరంగులోనైనా ఉండేచుక్క; మామూలుగా తెల్లచుక్క (తె. 15, 17, 18, 23, 24, 28, 31).

**చుక్కకన్ను** ఉ. చుక్కన్ను. ఒక కంటిమీద మచ్చ; చెరుపు; చూ. కింటిపులి (కో. 39).

**చూడి** ఉ. సుడి, సూడి. పశుగర్భధారణం (తె. 16–28).

**చెండు** పర్యా. చూ. మూపురం. ఎడ్లమెడవెనక ఎత్తుగాఉండే భాగం (కో. 6, 8–11, 13–17, 35; రా. 6, 8–11, 13, 14, 17); **-సుడి** పర్యా. చూ. కుప్పసుడి. మూపురంమీద ఉండేది; మంచిది (కో. రా.); చెండు రకాలు: **ఆకు-** పల్చటి మూపురం (రా.); **ఒరుగు-** ఒక వైపుకు వంగిఉండేది (కో.); **ముద్ద-** గుండ్రంగా ఎత్తుగా ఉండేది (కో.).

**చెవులపాము(లు)** రెండు చెవులమీద పాము పడగల్లాగా ఉండే సుళ్ళు (రా. 28).

**చేగదోర** ఎరుపు కాస్త తక్కువగాఉన్న చేవరంగు (తె. 31).

**చేమట్టి** చేవరంగు బట్ట(మచ్చ) (తె. 2).

**చేరు** ఉ. శేరు. పశువుల్లో మొగవాటి మూత్రావయవం (కో. 12, 27; తె. 28).

**చేరుచుక్క** మొగాన నిలువుగాఉండే సుడి; ఒకటిగాని, రెండుగాని ఉండవచ్చును (కో. 20, 23).

**చేరుసుడి** పర్యా. చూ. బొడ్డుసుడి. బొడ్డుకు సూటిగా వీపుమీద ఉండేది; కొన్నిచోట్ల మంచిదని మరికొన్నిచోట్ల చెడ్డదని (రా. 27).

**జంటుకవ్వం** మెడనుంచి రెండుజెబ్బలవరకు వ్యాపించిన రెండు చారలు; ఒకటి ఉంటే చెరుపు, చూ. ఒంటికవ్వం (రా. 1).

**జాల** ఉ. జాలె. ఏదైనా ఒకరంగులోఉన్న ఒంటిమీద మరొక రంగుచార (కో. 3, 5, 7, 10, 11, 51; తె. 1, 4, 6, 24, 28, 31, 39; రా. 1, 4, 6, 18, 21–24, 28).

**జూకాయవన్నె** ? కపిలవర్ణం (రా. 8).

**జెబ్బ** పశువుతొడ (కో. 24; తె. 20, 28); **-సుడి** జెబ్బమీద ఉండేది; మంచిది (కో. తె.).

**జెర్రి(సుడి)** వీపుమీద, ముడ్డిమీద జెర్రి ఆకారంలో ఉన్న సుడి; రెండుంటే మంచిది, ఒకటి చెరుపు; సుడి మొదలు ముందుకుంటే మంచిది, వెనక్కుంటే చెరుపు (కో. 27, 29–31; తె. 11, 13, 14, 16–31, 35, 41).

**టుంపటుసుడి** రొమ్ముమీద ఉండేది; యజమానికి అగ్నిప్రమాదం కలుగుతుందట (కో. 31).

**డంకాజోడు** వెన్నుకు పైవైపు రెండుపక్కలాఉండే సుళ్ళు; చెరుపులేదు (కో. 37–40, 43, 44, 46–50).

**డంకాసుడి** వెన్నుపూసకు ఒకపక్కన ఉండేది; ఒకటి చెరుపు; రెండువైపులా రెండుంటే మేలు (కో. 1, 3, 34, 39, 43, 44; రా. 1).

**డంగడోలు** చూ. గంగడోలు (కో. 1, 6).

**డెక్క** ఉ. డెక్కె; పర్యా. చూ. గిట్ట. కాలికొసన జంటగా మొలిచే గట్టి గోరు (కో. 22, 23; తె. 20, 23–28); రకాలు: **గువ్వ-** ఉ. **గువ్వడెక్కె**; పర్యా. ఆకుగిట్ట; చూ. గిట్ట. పల్చగా వెడల్పుగాఉన్న గిట్ట(లు) (కో.); **పావు-** ఉ. పావుడెక్కె; చూ. గువ్వ- (కో.).

**తల** పర్యా. పణత. కొమ్ములతో ఉన్న శరీరభాగం (కో. 4, 6, 7, 9, 10, 13, 16, 18, 21, 23, 31, 35; తె. 1, 12, 13, 25–29, 31–33, 35–39, 41; రా. 15, 16, 23, 25, 26); భేదాలు: **అడ్డ-** అడ్డగొమ్ములున్న తల (కో. తె.); **ఆడ-** పొడుగ్గా పల్చగా కొమ్ములున్న తల (కో.); **కోర-** పొడుగ్గా ముందుకు తిరిగిన కోసుకొమ్ములున్న తల (కో.); **గూడ-** లోపలికి తిరిగి కొసలు కలిసిన కొమ్ములున్న తల (కో.); **చక్కటి-** ఉ. చక్కనితల. నిలువుకొమ్ములున్న తల (తె.); **చప్ప-** పంగకొమ్ముల తల (కో.); **పంగ-** పంగకొమ్ముల తల (కో. తె. రా.); **ప్రె-** ఉ. ప్ర-, ప్రి-, ప్రెదల; చూ. పంగ- (కో. తె.); **పొట్లు-** పొట్టేలు కొమ్ములున్న తల (తె.); **బాస-** మొద్దుగా పొట్టిగా కొమ్ములున్న తల (రా.); **బుంగ-** బుంగకొమ్ములున్న తల; చూ. గూడ- (కో. తె.); **బొమ్మ-** నిలువుకొమ్ములున్న తల (కో.); **బోగర-** చక్కగా వెనక్కువాలిన కొమ్ములున్న తల (తె.); **మెంటె-** ఒకటి వెనక్కు ఒకటి ముందుకు వాలిన కొమ్ములున్న తల (తె.).

**తాకుసుడి** రూ. తావుసుడి. నడివీపున ఉండేది; మామూలుగా అన్నిఎద్దులకూ ఉంటుంది (రా. 1).

**తానపుసుడి** పర్యా. చూ. కుప్పసుడి. మూపురంమీద ఉండేది; మంచిది (తె. 40, 41).

**తావుసుడి** చూ. తాకుసుడి (కో. 1).

**తెల్ల** (విణ.) శ్వేతవర్ణం; తెలుపు, ఎల్లరంగు (కో. 2, 6, 9, 14, 15, 19, 20, 29, 30; తె. 1, 2, 6–8, 10, 12, 14, 17–19, 29, 30, 36, 38, 39; రా. 7, 11, 15, 16, 18, 20, 21); **గొలుకు(లు)-** (-కొలుకులు) తెల్లటి కనురెప్ప(లు); **ఈ**

లక్షణం ఉన్న పశువును పట్టించుకున్నవాళ్ళు కొనరట; దీనికి చురుకుదనం తక్కువ అని నమ్మకం (కో.); **-పొడ** నలుపు, ఎరుపులమీద తెల్లమచ్చ (తె.); **-బట్ట** తెలుపుమీద నల్లమచ్చగాని, ఎర్రమచ్చగాని (తె. రా.); భేదాలు: **బాపన-** పర్యా. చూ. బాపనెల్ల. మంచి తెలుపు (కో.); **మైల-** కపిలవన్నె; మైల(నలుపు) కలిసిన తెలుపు (తె.).

**తేలుకొండి** తోకమీద ఒక పక్కను ఉండే సుడి; చెరుపు (రా. 22, 28).

**తేలుసుడి** ముట్టెమీద ఉండేది; మంచిదిగాదు (తె.3).

**తొడజెర్రి** తొడ(జబ్బ)మీద పొడుగ్గాఉండే సుడి; మొదలు పైకిఉంటే మంచిది, క్రిందికిఉంటే చెరుపు (తె.27).

**తొండగిరి** ఉ. తొండగెరి; పర్యా. తోకజెర్రి, తోకబలుసు, తోకసుడి. తోకమీద పొడుగ్గాఉండే సుడి; సుడి మొదలు పైకిఉంటే చెరుపు, కిందికిఉంటే మంచిది (కో. 1, 2, 5-7, 9-11, 13, 14, 18, 20-25, 27, 32, 37; తె. 37-39, 42; రా. 1, 23, 24).

**తోక** పశువులకు వెనకభాగంలో వేలాడుతూఉండే అవయవ విశేషం (కో. 3, 5, 9-13, 28, 29, 39, 40, 46, 48; తె. 7, 9, 12, 13, 18, 20, 24, 29; రా. 24, 25); **-జెర్రి** పర్యా. చూ. తొండగిరి. తోకమీద జెర్రిమాదిరి పొడుగ్గా ఉండేసుడి; మొదలు పైకిఉంటే చెరుపు; కిందికి ఉంటే మంచిది (రా.); **-బలుసు** చూ. -జెర్రి (కో.); **-మట్టు** తోకకింద నాగుపడిగె మాదిరి ఉండే సుడి; చెరుపు (తె.); **-మొండి** తోకమొదట పైన ఉండే సుడి (తె.); **-సుడి** చూ. -జెర్రి (కో. తె.); తోకల్లో రకాలు: **ఎగుదోక** పొట్టిగా ఉండేది (కో.); **కప్ప-** మట్ట (మొదలు) వెడల్పుగా ఉండేది (కో.); **కలవ-** తెలుపు నలుపు రంగులు గలది (కో.); **కల్మ-**? చూ. కలవ- (1) నల్లటి తోకకుచ్చు; (2) తెల్లటి తోకకుచ్చు (తె.).

**దామెనసుడి** పర్యా. దేవమణి, దేవమానికం, దేవసుడి, దేవుమాను, పట్టెడసుడి, పలుపుసుడి. గంగడోలుకు రెండువైపులా ఉండేది; ఒకటి ఉంటే చెరుపు, రెండు మంచిది (తె. 1-3; రా. 2, 3, 7, 9, 16, 18).

**దేవమణి** పర్యా. చూ. దామెనసుడి. గంగడోలుకు రెండువైపులా ఉండేది; ఒకటి ఉంటే చెరుపు, రెండు మంచిది (తె. 4, 5).

**దేవమానికం** రూ. దేవుమాను; పర్యా. చూ. దామెనసుడి. గంగడోలుకు రెండువైపులా ఉండేది; ఒకటి ఉంటే చెరుపు, రెండు మంచిది (తె. 10).

**దేవసుడి** పర్యా. చూ. దామెనసుడి. గంగడోలుకు రెండువైపులా ఉండేది; ఒకటి ఉంటే చెరుపు, రెండు మంచిది (తె. 5, 6; రా. 3, 5, 9).

**దేవుమాను** చూ. దేవమానికం (తె. 18).

**దొడ్డిసుడి** (1) వీపుమీద ఉండేది; చూ. గంతసుడి; (2) మూపురం పక్కభాగంలో ముందుకుచూస్తున్న సుడి (కో. 23; తె. 1, 7, 34).

**దొంతరసుడి** నొసటిమీద వరసగాఉండే (మూడు) సుళ్ళు (కో. 13, 25, 26, 37; తె. 37-39).

**దోర** (విశ.) లేతఎరుపు (కో. 7, 17, 21, 22, 25, 27-30, 35-38, 40-45, 48-50; తె. 3, 4, 7-10, 12, 13, 15, 17, 19, 21-23, 25-28, 30-33, 35, 36, 38-41); **-జాల** లేత ఎరుపుచార (తె.); **-బట్ట** లేత ఎరుపుమచ్చ (తె.); **-మైల** లేత ఎరుపులో కలిసిన నలుపు (కో. తె.).

**ధనసుడి** పర్యా. చూ. కుప్పసుడి. మూపురంమీద ఉండేది; దీనివల్ల కుటుంబాదాయం పెరుగుతుందట (కో. 15; తె. 3; రా. 23).

**ధాన్యపుసుడి** ఉ. దాన్నెపుసుడి; పర్యా. చూ. కుప్పసుడి. మూపుమీద ఉండేది; వెన్నుమీదనని కొందరు; దీనివల్ల ధాన్య సమృద్ధి కలుగుతుందట (కో. 11, 12, 15, 16, 18, 19, 21-23, 25, 27, 29, 31, 32; తె. 37-39, 41; రా. 25).

**నక్కచార** నక్కమాదిరి మసరరంగుచార (కో. 46, 47, 49).

**నక్కమైల** మసరరంగు పొడ (తె. 6).

**నగారసుడి** పొరకసుడి స్థానంలోఉండే జంటసుడి (రా. 4, 7).

**నల్ల** (విశ.) క్రిష్ణవర్ణం (కో. 5; తె. 6, 8, 27, 29, 31; రా. 5-9, 11, 18, 20, 23, 28); **-గాసె** నలుపులో తెలుపుకలిసిన రంగు భేదం (తె.); **-జాల** మరొక రంగుమీద నల్లచార (కో. రా.); **-జేముట్టె** (-చేముట్టె) నల్లచేపరంగుమచ్చ (రా.); **-పొడ** నల్లటి మచ్చ (తె.); **-బట్ట** రూ. నల్లముట్టె. నల్లటిమచ్చ (తె. రా.); **-ముట్టె** చూ. బట్ట (రా.); **-మైల** నలుపులో తెలుపు (రా.).

**నష్టసుడి** ఉ. నట్టసుడి; చూ. నొష్టసుడి (కో. 13, 16, 22; తె. 29).

**నాగపడిగె** ఉ. నాగబడిగె, నాగుబడిగె; పర్యా. నాగపాశం, నాగబంధం, నాగసర్పం, నాగుబాము. తోకమట్టకింద నాగుపాము పడగమాదిరి ఉండేసుడి (తె. 5, 11, 18, 21, 22, 24, 25).

**నాగపాశం** పర్యా. చూ. నాగపడిగె. తోకమట్టకింద నాగుపాము పడగమాదిరి ఉండేసుడి (కో. 40).

**నాగబంధం** ఉ. నాగబందం; పర్యా. చూ. నాగపడిగె. తోకమట్టకింద నాగుపాము పడగమాదిరి ఉండేసుడి (కో. 44, 46-48).

**నాగసర్పం** పర్యా. చూ. నాగపడిగె. తోకమట్టకింద నాగుపాము పడగమాదిరిఉండే సుడి (కో. 33-36, 38, 43).

**నాగిక్క** ఒక కంట్లో తెల్లటిమచ్చ; చెరుపు (కో. 51).

**నాగుబాము** పర్యా. చూ. నాగపడిగె. తోకమట్టకింద నాగుపాము పడగమాదిరిఉండే సుడి (తె. 10).

**నాపబఱ్ఱి** ఉ. నాబ్బరి, నాబ్బఱ్ఱి, నాబ్బఱ్ఱె; పర్యా. మెంటబఱ్ఱి. పరచగా సన్నగాఉన్న పక్కఎముక(లు) (బఱ్ఱెముక) (కో. 1, 3, 7, 15).

**నూకపొద** గజ్జిపొదలాగాఉన్న చిన్నచిన్న మచ్చ(లు) (తె. 36).

**నూగుసుడి** రెండు పిఱ్ఱలమీద ఉండేది (తె. 39);

**నెత్తిసుడి** పర్యా. చూ. నొష్టసుడి. నెత్తి(నొసటి)మీద ఉండేది; మంచిది (తె. 14, 25).

**నొష్టసుడి** ఉ. నొట్టసుడి; రూ. నష్టసుడి; పర్యా. నెత్తిసుడి, పణతసుడి. నెత్తి (నొసటి) మీద ఉండేది; మంచిది (కో. 8, 9, 13, 16, 20, 24, 25; తె. 15, 17, 23-25, 27, 28).

**పంచకల్యాణి** ఉ. పంచకల్యాని, పంచకళ్యాని. నాలుగుకాళ్ళు తెలుపు, నడినెత్తిన తెల్లటిచుక్క, పూదోక (తెల్లటి తోకకుచ్చు) ఉన్న పశువు; ఇవన్నీ మంచిలక్షణాలు (కో. 10, 11, 47; తె. 1, 17, 22).

**పట్టెడసుడి** పర్యా. చూ. దామెనసుడి. గంగడోలుకు రెండువైపులా ఉండేది; ఒకటి ఉంటే చెరుపు, రెండు మంచిది (కో. 10; రా. 11).

**పణత** పర్యా. తల. కొమ్ములతోఉన్న శరీరభాగం (తె. 1, 19, 22, 25-28); **-సుడి** ఉ. పడతసుడి; పర్యా. చూ. నొష్టసుడి. నెత్తి(నొసటి)మీద ఉండేది; మంచిది (తె.).

**పన** పర్యా. కొమ్ము. పశువుల తలమీద జంటగా మొలిచే గట్టి అవయవవిశేషం; ఇది మామూలుగా వంపు దిరిగి కోసుగా ఉంటుంది (కో. 4, 6, 25; తె. 8, 9, 12, 24-28, 30, 32-34, 36, 37, 40-42; రా. 22); పనల్లో రకాలు: **అడ్డ-** ఉ. అడ్డబన; పర్యా. అడ్డగొమ్ము, చూ. కొమ్ము. వెలుపలికి వంగినకొమ్ము (తె.); **కొంగ-** కొన ముందుకువంగిన కొమ్ము (కో.); **కోర-** పర్యా. కోరకొమ్ము (1) వెనక్కు వాలి ముందుకుతిరిగిన కొమ్ము; (2) కోసుగా పొడుగ్గాఉన్న కొమ్ము (కో.); **గుండు-** పర్యా. గుండుకొమ్ము. చూ. కొమ్ము. లోపలివైపుకు గుండ్రంగా తిరిగి కొసలుకలిసిన కొమ్ము (తె.); **చిప్పెర-** ఉ. చిప్పర-. పంగలకొమ్ము(లు) (తె.); **తొగ-** చూ. అడ్డగొమ్ము (తె.); **దూబన** వెనక్కు వాలుగాపెరిగిన కొమ్ము(లు) (కో. తె. రా.); **నిలువు-** పర్యా. నిలువు కొమ్ము, చూ. కొమ్ము. నిటారుగాఉన్న కొమ్ము (కో. తె.); **పాపోసు-** చందమామ మాదిరి గుండ్రంగా లోపలికి వంపు దిరిగిన కొమ్ము (తె.); **బుంగ-** పర్యా. బుంగకొమ్ము. చూ. కొమ్ము. లోపలివైపు గుండ్రంగాతిరిగి కొసలుకలిసిన కొమ్ము(లు) (తె.); **బొట్టె-** పర్యా. బొట్టెకొమ్ము. లావుగా పొట్టిగా బోడిగా ఉండేకొమ్ము. (కో.); **బోడి-** ఉ. బోడ-; పర్యా. బోడికొమ్ము. చూ. కొమ్ము (1) వెనక్కు వాలిన పొట్టికొమ్ములు; (2) బాగా గిటకబారి మొద్దుగాఉండే కొమ్ములు (కో. తె.); **రాగోల-** ఉ. రాగాల-; పర్యా. రాగోలకొమ్ము, చూ. కొమ్ము. పంగలకఱ్ఱ మాదిరి కొసలు క్రమంగా దూరమైన కొమ్ములు (తె.).

**పన్నపాతర** ముడ్డిదగ్గర ఆకుమాదిరి ఉండేసుడి; చెరుపు (కో. 51).

**పయ్యె** (విణ.) ఉ. పయె, పయ్యా, పెయ, పై; చూ. పసె (కో. 30; తె. 7-10, 12, 13, 18, 21-26, 29, 32, 33, 35, 37-39, 42); **-బట్టు** ఉ. పెయబట్ట, పై బట్ట. పసెరంగుమీద మరేరంగుదైనా మచ్చ (తె.); **-బొల్లి** ఉ. పైబొల్లి. శరీరం ఎరుపు, మొగం తెలుపు (తె.); పయ్యె రంగులో రకాలు: **అచ్చు-** ఉ. అచ్చపయె. పూర్తి పాటల వర్ణం (తె.); **గోదుం-** ఉ. గోధుం-. గోధుమవంటి ఎరుపు (తె.); **దోర-** ఉ. దోరపయె. లేత ఎరుపు తెలుపుల కలయిక రంగు (తె.); **నీలి-** రూ. నీలిపసె, చూ. పసె (తె.); **పండు-** తెలుపును మించిన ఎరుపు; ? పండెరుపు (తె.); **బాపన-** ఉ. బాపనపయె, బాపనపెయ. అచ్చతెలుపు లేక పూర్తిఎరుపు (తె.); **లక్క-** ఉ. లక్కపయ్యె. లక్క ఎరుపు (కో. తె.).

**పలుపుసుడి** పర్యా. చూ. దామెనసుడి. గంగడోలుకు రెండువైపులా ఉండేది; ఒకటి ఉంటే చెరుపు, రెండు మంచిది (కో. 23; రా. 1, 2, 5, 7).

**పల్ల** (విణ.) రూ. పాల. ఎరుపు తెలుపుల కలయిక వన్నె; (Brown color); తెలుపును మించిన ఎరుపు (కో. 5, 7-11, 15, 17); **-బఱ్ఱె** రాగి, తెలుపు వెంట్రుకలున్న బఱ్ఱె (కో.).

**పసికె** చూ. పసె (తె. 32, 33).

**పసె** (విణ.) ఉ. పసి, పస్సె; రూ. పయ్యె, పసికె. తెలుపుదనం ఎక్కువ కలిసిన ఎరుపు (కో. 5, 7, 9, 10, 11, 14; తె. 1-6, 36; రా. 1, 4-6, 8, 9, 11, 15, 16, 18, 20-22, 24-28); పసె భేదాలు: **తైల-** నలుపు కలిసినపసె (తె.); **నల్ల-** నలుపు ఎక్కువగాఉన్న తెలుపు ఎరుపులు (తె.); **నీలి-** రూ. నీలిపయ్యె. నలుపు, లేక ఎరుపు కలిసినరంగు (రా.); **బాపన-** ఉ. బాపనపసి, బేపనపసి. తెల్లదనం ఎక్కువగాఉన్న పసె (కో. తె. రా.);

బెంచ- పూర్తి తెలుపు (రా.).

**పాడిసుడి** ముడ్డిపూసమీద ఉండేది; ఇదుంటే పాడి పెరుగుతుందంట (కో. 5, 6; తె. 40).

**పాడెసుడి** పర్యా. కంప్రం, పోరుసుడి. వీపుమీదగాని, పొట్టమీదగాని నాలుగువైపులాఉండే నాలుగు సుళ్ళు; చాలా చెరుపు; (కొన్నిచోట్ల) వీపుకు రెండువైపులా పాడె ఆకారంలో చారలుగాఉండే సుళ్ళు (కో. 1, 10, 11, 14, 16, 20-23, 27, 29-32; తె. 3, 7, 8, 30, 32-42; రా. 1, 4, 5, 9, 18, 23, 25, 27, 28).

**పాతాళసుడి** మూపురం కిందఉండేది; చెరుపు (రా. 4, 22).

**పాపచుప్పు** పర్యా. ఆకుగిట్ట. చూ. గిట్ట. పల్చగా వెడల్పుగాఉన్న గిట్ట(లు) (కో. 20).

**పాముసుడి** గంగడోలుమీద పొడుగ్గాఉండే సుడి; చెరుపు (రా. 24, 25).

**పాల** (విశ.) (1) తెలుపు; (2) చూ. పల్ల (కో. 1, 5, 6, 9, 10, 14, 15, 19-21, 24-26, 29, 32, 33, 35; తె. 4, 7-9, 35, 42; రా. 25); **-బట్ట** (1) ఎరుపు మీద తెల్లమచ్చ; (2) తెలుపుమీద నల్లమచ్చ (కో. తె. రా.); **-మట్టె** చూ. -బట్ట (తె.); **-ముని** తెలుపుమీద నల్లమచ్చ (రా.).

**పాలు** పశుస్తన్యం (కో. 12, 16-27, 29, 37, 39-51; తె. 1-42; రా. 1-28); **ఎలుబాలు** (-పాలు) ఈనిన పదహారు రోజులతరవాత ఇచ్చేపాలు; జున్నుకట్టని పాలు (కో. తె.); **జేడి-** ఈనకముందు పితికితే వచ్చే పాలు (తె.); **జున్ను-** పశువులు ఈనిన అయిదురోజులలోపల ఇచ్చే పాలు (కో. తె. రా.); **తరిపి-** ఉ. తరిప్పాలు. గొడ్డు వట్టిపోవటానికి ముందు కొన్నిరోజులు ఇచ్చేపాలు (కో. తె. రా.); **మలప-** ఉ. మలప్పాలు. దూడచచ్చిన గొడ్డు ఇచ్చే పాలు (తె.); **ముర్రుబాలు** (-పాలు) (1) ఈనిన ఐదురోజులదాకా ఇచ్చేపాలు; (2) ఈనక ముందు పితికితే వచ్చే పాలు (కో. తె. రా.); **రేగటి-** చూ. రేగటి -. ఈనిన పదిహేను రోజులదాకా ఇచ్చేపాలు (కో. తె.); **రేగటి-** చూ. రేగటి- (కో. తె.); **సొల్లుబాలు** (-పాలు) వెన్న తక్కువగాఉండే పల్చటిపాలు (కో.).

**పాళపుసుడి** నొసటిమీద జంటగాఉండే సుళ్ళు; చెరుపు (కో. 20).

**పిడుగుసుడి** పర్యా. పుర్రెసుడి, బొంగరంసుడి, మెదడుసుడి. నడినెత్తిమీద (కొమ్ములమధ్య) ఉండేది; మంచిది (కో. 25; తె. 38, 39).

**పిడసుడి** ముట్టెమీద ఉండేది; చెరుపు (తె. 1).

**పుట్టుసుడి** ముడ్డిమీద గుండ్రంగా ఉండేది (తె. 31).

**పుర్రెసుడి** పర్యా. చూ. పిడుగుసుడి. కొమ్ములమధ్యన ఉండేది; మంచిది (తె. 22).

**పులిచార** పుల్లరంగుచార; చూ. పుల్ల (కో. 15).

**పుల్ల** (విశ.) తెల్ల గోధుమవన్నె; పసుపుదనం ఎక్కువగల తెలుపు (కో. 1, 2, 4-11, 12, 14, 16-18, 20, 25-29, 31-33, 35-40, 42-46, 48; తె. 1, 3, 4, 6-10, 12-15, 21-28, 33-36, 41; రా. 1, 5-9, 15, 16, 18, 20, 23-28); **-జాల** మరో రంగుమీద పుల్లరంగుచార (కో. రా.); **-దోర** పుల్ల రంగుతో కలిసిన లేత ఎరుపు (తె.); **-పొడ** మరొక రంగుమీద పుల్లరంగు మచ్చ (తె.); **-బట్ట** పుల్లవన్నె మచ్చ (తె. రా.); **-మట్టె** చూ. -బట్ట (రా.); **-మైల** పుల్లరంగుమీద నల్లపొడ (రా.); **పుల్లెర్ర** ఎరుపుకలిసిన పుల్లరంగు (తె.); పుల్లరంగులో భేదాలు: **గుమ్మడి-** ఎర్ర గుమ్మడి చాయ (తె.); **గోదుమ-** గోధుమవన్నె (తె. రా.); **చవుట-** తెలుపెక్కువకలిసిన పుల్లరంగు (తె.); **జూకాయ-** జువ్వికాయవంటి రంగు (రా.); **తవిదె-** తవిదె (రాగి)గింజలరంగు (తె.); **దోర-** ఉ. దోరబుల్ల. లేత పుల్లరంగు (కో. తె.); **పందర-** తెల్లదనం ఎక్కువ కలిసినవన్నె (తె.); **బలుసుగాయ-** ఉ. బల్సుకాయపుల్ల, బలుసుకాయరంగు; చూ. బలుసు, పుట 252 (తె. రా.); **బాపన-** అచ్చం పుల్లరంగు (కో. తె. రా.); **రేణిగాయ-** రేగుపండు రంగు (రా.).

**పెరికిమచ్చ** ? గౌరవర్ణపుమచ్చ (కో. 47).

**పైనాకుడు** వీపుమీద జంటసుళ్ళు (కో. 45).

**పొడ** ఒకరంగునంటి మీద ఏదైనా మరొకరంగుమచ్చ (తె. 1, 6-8, 36).

**పొదుగు** ఉ. పొదగు, పొద్గు; రూ. బొదుము; పర్యా. చంక. చేపినప్పుడు ఆవు, గేదె మొ. వాటికి పాలుకూడే చోటు (కో. 10-13, 16-25, 28-30; తె. 3-28, 30, 31, 36, 40, 41); భేదాలు: **కంచ-** లావుగా ఉండేది; పాలు సరిగా ఇవ్వదు (తె.); **కుక్క-** పొదుగు పెద్దదిగా ఉన్నా, పాలు తక్కువఉండేది (కో.); **కుండ-** పెద్ద పొదుగు; పాలు బాగాఇచ్చేది (కో. తె.); **గడ్డ-** ఉ. గెడ్డ పొదుగు; చూ. కుండ- (కో. తె.); **గిన్నె-** వెడల్పుగా గిన్నెమాదిరి ఉండేది; చన్ను పొట్టిగా లావుగా ఉంటుంది (కో. తె.); **గుండు-** చూ. కుండ- (కో. తె.); **గుల్ల-** చూ. కుండ- (తె.); **జారు-** కిందికిజారి, పొడుగాటి చన్నులతో ఉండేది; ఇదిగల పశువు పాలు బాగా ఇస్తుంది (కో. తె.); **తెంక-** చూ. గిన్నె- (కో.); **దొంగ-** పై భాగం చిన్నదిగా ఉండి, చన్నులు పొడుగ్గాఉండేది (తె.); **బిళ్ళ-** చూ. గిన్నె- (కో.); **బుడ్డ-** చూ. కుండ- (తె.); **బొంగ-** ? చూ. కంచ- (కో.); **ముద్ద-** రెండుచన్నుల పొదుగు (కో. తె.); **లోబొదుగు** చూ. దొంగ- (కో.).

పొదుము చూ. పొదుగు (కో. 37, 43-51).

పొరకసుడి పర్యా. ఏడుగొయ్య, చీపురుసుడి. మలుగుప జెత్తెకుదూరంలో ఎటువైపైనా ఉండే సుడి; ఇదిఉంటే పొరకతో ఊడ్చినట్టు సంపద ఊడ్చుకుపోతుందట (కో. 1-9, 11, 12, 15, 16, 24, 25, 27, 29, 31, 32; తె. 1-9, 12, 32-38, 40-42; రా. 2-5, 7, 9, 11, 18, 22-26, 28).

పోటుసుడి ఉ. పోడుసుడి. ముందరిజెబ్బ మడత (చంక) కింద ఉండేది; చెరుపు (కో. 36; తె. 3, 12, 34, 36, 41, 42; రా. 5, 9, 18, 23, 24).

పోరుసుడి పర్యా. చూ. పాడెసుడి. వీపుమీదగాని, పొట్టమీదగాని నాలుగువైపులా ఉండే నాలుగుసుళ్ళు; చాలా చెరుపు (కో. 39).

బట్ట రూ. మట్టె. ఏదైనా రంగుమీద మరొకరంగుమచ్చ (కో. 1-15, 17, 26, 28-33, 35, 36, 39, 41, 42; 44; తె. 1, 3, 6-12, 14, 22-24, 27, 29, 31-42, రా. 1, 5-8, 11, 16, 18, 20-28).

బండకోపుసుడి పర్యా. కొంకిసుడి. మోకాలివెనక భాగంలో ఉండేది (రా. 2, 4, 7).

బల్లికొమ్ము మట్టెమీద ఉండేసుడి (తె. 10).

బారెడుసుడి ? పర్యా. ఎదరవాలు. గంగడోలుమీది సుడి (తె. 40).

బాసికపుసుడి చూ. బాసికం(సుడి) (కో. 7-11, 16-19, 21, 22, 24, 25).

బాసికం(సుడి) రూ. బాసికపుసుడి, బాసిగం, బాసింగం. నుదుటిమీద పక్కపక్కన ఉండే జంటసుడి; యజమాని పెళ్ళిగానివాడైతే పెళ్ళి అవుతుంది; పెళ్ళి అయినవాడైతే పెళ్ళాం చచ్చిపోయి మళ్ళీ పెళ్ళి అవుతుందట (కో. 1-6, 12, 14, 27, 29, 31-33, 35-37, 39, 47, 49; తె. 30-33, 35, 37-42; రా. 1, 3, 9-11, 24, 26-28).

బాసిగం చూ. బాసికం(సుడి) (తె. 36).

బాసింగం చూ. బాసికం(సుడి) (కో. 41; తె. 3, 4, 6, 9, 11-18; రా. 2, 4, 5, 7, 18, 22, 23).

బూజ (విశ.) ఉ. బూజు. బూడిదవన్నె (రా. 18, 24).

బూజర ? పూలపూల చుక్కలు (కో. 4).

బూత (విశ.) ? ఏవైనా మూడురంగులు కలిసిన వన్నె (తె. 4).

బేడిసుడి పర్యా. చూ. సంకెళ్ళసుడి. మోకాళ్ళదిగువన ఉండేది; యజమానికి సంకెళ్ళుపడతాయట (తె. 3, 4).

బొంగరంసుడి పర్యా. చూ. పిడుగుసుడి, కొమ్ముల మధ్యన ఉండేది; మంచిది (తె. 21).

బొచ్చె పశువురొమ్ము (తె. 27).

బొట్టుసుడి నొసటమీద ఉండే ఒంటిసుడి; మంచిది (కో. 36; తె. 39).

బొడ్డుసుడి పర్యా. చేరుసుడి, నవుబొడ్డు(సుడి). బొడ్డుకు సూటిగా వీపుమీద ఉండేది; కొన్నిచోట్ల మంచిదని మరికొన్నిచోట్ల చెడ్డదని (కో. 12, 30, 33, 36, 37, 39-41, 46, 47, 49; తె. 2, 3, 5, 8, 10-14, 16, 19, 27, 33, 35-38, 42; రా. 18, 22, 28).

బొండకొయ్య(సుడి) పర్యా. చూ. సంకెళ్ళసుడి. మోకాళ్ళదిగువన ఉండేది; చెరుపు (రా. 1).

బొండసుడి పిల్లగిట్టలదగ్గర ఉండేది; చెరుపు (రా. 25).

బొత్తసుడి పొట్టమీదిసుడి; ఒకటి చెరుపు, రెండు మంచిది (తె. 20, 21).

బొల్లి ఒళ్ళు ఏరంగులోఉన్నా మొగం తెలుపు (కో. 2, 3, 5, 6, 11, 14-16, 18, 20, 22, 39, 40, 43, 45-47, 51; తె. 1-3, 7, 10-13, 19, 21-34, 36-39, 42; రా. 5, 6, 11, 15, 16, 18, 20); బొల్లి భేదాలు: గద్ద- ఉ. గెద్ద-; పర్యా. గరుడ-. ఒళ్ళునలుపు మొగం తెలుపు (కో. తె. రా.); గరుడ- పర్యా చూ. గద్ద- (తె. రా.); తీతుక- తీతుకపిట్టలాగా కంటిరెప్పల మీద తెలుపు (కో.).

మక్కుసుడి మలుగులమీద ఉండేది; చెరుపు (తె. 28).

మంగమచ్చ ? పుట్టుమచ్చ (కో. 7).

మట్టె చూ. బట్ట (కో. 5, 19; తె. 1, 2, 4, 6-9; రా. 4-9, 15, 16, 23).

మడతసుడి పర్యా. చూ. చిలకసుడి. జెబ్బ మడతల్లో గాని, మోకాళ్ళ మడతల్లోగాని ఉండేది (కో. 5-8; రా. 24, 25).

మడి పర్యా. కరి, కరిగి, కానె. పశుయోని (కో. 12, 27; తె 3, 5, 6, 10, 11, 32, 36, 38).

మన్నికవాలు ఉ. మన్నికాలు; పర్యా. చూ. రొమ్ముసుడి. రొమ్ముమీద ఉండేది; కుడివైపున ఉంటే మంచిది (రా. 4, 7).

మసర (విశ.) ఏదైనా రెండుమూడు రంగుల కలయిక; మామూలుగా మబ్బురంగు; ఎరుపు కలిసిన తెలుపు నలుపులు (కో. 9, 10, 14, 23; తె. 3-5, 10, 12, 13, 15, 17, 20, 27, 34, 35); మసర భేదాలు: గాడిద- గాడిదవన్నె (కో.); తాటి- తాటిపండురంగు (తె.); నల్ల- నలుపుతో కలిసిన మరొక రంగు (తె.).

ముకుజోరు ముక్కుచివర్న ఉండేసుడి; ఎద్దు పొగరు మోతుదవుతుందట (కో. 40).

**ముక్కంటిసుడి** చూ. ముక్కాణిసుడి (కో. 2-4).

**ముక్కన్ను(సుడి)** ఉ. ముగ్గన్ను; చూ. ముక్కాణిసుడి (కో. 5, 7, 33, 38-40, 43, 46-50; రా. 1, 25).

**ముక్కాణి(సుడి)** రూ. ముక్కంటిసుడి, ముక్కన్ను(సుడి). (1) నొసటమీద పైన ఒకటి కింద రెండుగాఉన్న సుళ్ళు; (2) నొసట మూడోకన్నులాగా ఉన్నసుడి; ఈ లక్షణంఉన్న పశువు పవిత్రమైనదట (కో. 9-11, 13, 14, 16-18, 25; తె. 3, 38, 39; రా. 1-11, 18, 24-28).

**ముంగలిసుడి** మూపురంకింద ముందుభాగంలో ఉండేది (తె. 5).

**ముసి** ఒళ్ళు ఏదైనా రంగులో ఉండి, మెడ నల్లగా ఉంటే, అది (రా. 11, 15, 16).

**మూపురం** ఉ. మోపురం; రూ. ఊపురం; పర్యా. చెండు. ఎద్దు మెడ వెనక ఎత్తుగాఉండే భాగం (కో. 26, 27; తె. 41).

**మెడపాము(లు)** పర్యా. ఎదాభారాలు, గంధపెట్టె. మెడకు రెండుపక్కలా నల్లటిచార(లు) (కో. 1, 5, 7, 18, 20-24).

**మెంటుబర్రి** పర్యా. నాపబర్రి. కురచగాఉన్న పక్కఎముక (బర్రెఎముక) (రా. 1).

**మెదడుసుడి** పర్యా. చూ. పిడుగుసుడి. నడినెత్తిన (కొమ్ముల మధ్య) ఉండేది; మంచిది (తె. 15, 16).

**మైల** ఏదైనా మరొక రంగుమీద నలుపు; నలుపు మించుగాఉన్న రంగు (కో. 1, 7, 9, 13, 14, 17, 25, 37, 39-41, 46, 48, 50; తె. 3, 6, 19, 21-29, 31, 32, 34-37, 40, 41; రా. 6, 11, 16, 18, 21-23, 25, 26, 28); -బట్ట నల్లమచ్చ (తె. రా.).

**మొత్తసుడి** తోకకింద సుడి (కో. 12).

**మొదసుడి** పర్యా. చూ. లద్దెసుడి. ముడ్డికి బెత్తెడు దిగువ ఉండేది; పేడ వేసేటప్పుడు ఆ సుడికి పేడతగిలితే చెడ్డది (కో. 13).

**మోటుబర్రి** ఉ. మోటబరి. పక్కఎముకల్లో ఒకటి కురచగా ఉండి నిక్కబొడుచుకునేది; చూ. మెంటబర్రి (కో. 1, 3-5, 8; రా. 1, 5, 18).

**మోపుడుసుడి** మోకాళ్ళమీద ఉండేది (కో. 25).

**రాజసుడి** ఉ. రాచసుడి, రాజుసుడి. (1) ముచ్చెల గుంటలో ఉండేది; (2) వీపుమీద మూపురానికి అంగుళం వెనకభాగంలో ఉండేది; మంచిది (కో. 6, 7, 9, 10, 13, 14, 16, 20-23, 39-41, 46-48; రా. 9, 18, 22, 25, 26, 28).

**రాసిసుడి** ఉ. రాసెసుడి, రాస్సుడి. మూపుమీదఉండేది; వెన్నుమీదనని కొందరు; దీనివల్ల ధాన్యసమృద్ధి కలుగుతుందట (కో. 27, 32, 34-36).

**రొమ్మాసి** పర్యా. చూ. రొమ్ముసుడి. రొమ్ముమీద ఉండేది; కుడివైపున ఉంటే మంచిది (రా. 1).

**రొమ్ము** పర్యా. చన్ను, సిరం. ఆవు, గేదె మొ. వాటి పాలచన్ను; చన్ను (కో. 39-41, 45); భేదాలు: నార- కొనదేరిన చన్ను (కో.); పొరక- సన్నటి కోలచన్ను (కో.); బెట్టు- బిరుసుచన్ను; దీనినుంచి పాలు బాగా రావు (కో.).

**రొమ్ములకుంపటి** పర్యా. చూ. రొమ్ముసుడి. రొమ్ము మీద ఉండేది; కుడివైపున ఉంటే మంచిది (తె. 40).

**రొమ్ముసుడి** పర్యా. రొమ్మాసి, రొమ్ములకుంపటి, మన్నికవాలు. రొమ్ముమీద ఉండేది; కుడివైపు ఉంటే మంచిది (కో. 13, 14, 17, 18; రా. 11).

**లక్క** ఎరుపురంగు (కో. 46, 50, 51).

**లక్ష్మిసుడి** ఉ. లచ్చిమిసుడి, లచ్మిసుడి. వెన్నుపూస మీద ఉండేది; మంచిది (కో. 17, 26; తె. 1).

**లద్దెసుడి** ఉ. లద్దిసుడి; పర్యా. మొదసుడి. ముడ్డికి బెత్తెడు దిగువన ఉండేది; పేడవేసేటప్పుడు ఈ సుడికి పేడ తగిలితే మంచిదికాదట (కో. 16; తె. 37-40, 42).

**వరెన్నుసుడి** ఉ. వ్రెన్నుసుడి. ? వెన్నుమీద సుడి; చూ. లక్ష్మిసుడి (కో. 26, 29, 30, 33-37, 40, 43-45, 47).

**వాడెసుడి** జబ్బమీది సుడి (తె. 31).

**సంకెళ్ళసుడి** రూ. అంకెళ్ళసుడి; పర్యా. బేడిసుడి, బొండకొయ్య(సుడి). మోకాళ్ళదిగువన ఉండేది; ఇదిఉంటే యజమానికి సంకెళ్ళు పడతాయట; చెరుపు (కో. 1-28, 32, 35, 36, 41; తె. 34-36, 38, 39, 42; రా. 1, 3-5, 7, 9, 11, 18, 22-27).

**సవుబొద్దు(సుడి)** ఉ. సబొద్దు; పర్యా. చూ. బొద్దు సుడి. బొద్దుకు సూటిగా వీపుమీద ఉండేది; కొన్నిచోట్ల మంచిదని, మరికొన్నిచోట్ల చెడ్డదని (కో. 4, 5, 10; రా. 23).

**సాత్వికసుడి** ఉ. సాతికసుడి, సాత్తికసుడి; పర్యా. సాధ్యపుసుడి. వీపుమీద దామెనసుడికీ, బొద్దుసుడికీ మధ్యన ఉండేది; మంచిది (రా. 26, 28).

**సాధ్యపుసుడి** ఉ. సాద్దెపుసుడి; పర్యా. చూ. సాత్విక సుడి. వీపుమీద దామెనసుడికీ బొద్దుసుడికీ మధ్యన ఉండేది; మంచిది (రా. 9, 18, 27).

**సిరం** పర్యా. చూ. చన్ను. ఆవు, గేదె మొ. వాటి రొమ్ము (కో. 39, 40, 46-50); సిరం భేదాలు: జల్లు- పాలు రెండుమూడు ధారలు వచ్చేది (కో.); పాల- మెత్తటి చన్ను; దీనినుంచి పాలు బాగావస్తాయి (కో.); పీనె- గట్టి

చన్ను ; పాలు బాగా రావు (కో.) ; రండి- చూ. పీనె- (కో.).

సుడి పశువుల ఒంటిమీద ఎక్కడైనా కనపడే రోమావర్తం (మొత్తంగా మలుపులుతిరిగిన వెంట్రుకలు) (కో. 1-50; తె. 1-42 ; రా. 1-11, 16, 18, 22-28).

సూలకన్ను తెల్లటికన్ను ; పశువులకు మంచిలక్షణం (కో. 7).

## 3. ఉనికి, మేత

**అంచె** పర్యా. చూ. తట్ట. పశువులకు దాణా పెట్టే బుట్ట (తె. 23-29, 32).

**అటుకు** ఉ. అటక, అటుక, అడుకు ; రూ. అట్టవ, అట్టాం, అట్టుక; పర్యా. చూ. మచ్చు. గొడ్లకొట్టంలో కప్పుకింది మేత, పొట్టు, మొ. వి పెట్టుకోటానికి ఏర్పరచిన చోటు (కో. 39, 41, 44, 48 ; తె. 29, 32, 42).

**అట్టువ** ఉ. అటవ; చూ. అటుకు (కో. 11 ; తె. 33; రా. 10, 14, 15, 18).

**అట్టాం** చూ. అటుకు (కో. 4).

**అట్టుక** చూ. అటుకు (తె. 4).

**అడిమేత** పర్యా. దాణా. కొన్నిరకాల ధాన్యాలు, పప్పుగింజలు, ఉడకబెట్టిగాని, రుబ్బిగాని పశువులకు బలానికి పెట్టేమేత (రా. 15, 18-20).

**అలవ** పర్యా. చూ. మచ్చు. గొడ్లకొట్టంలో కప్పుకింద మేత, పొట్టు మొ. వి పెట్టుకోటానికి ఏర్పరచిన చోటు (కో. 24).

**ఇలారం** పర్యా. గుత్తాపుసాల. గుండ్రంగా వేసిన పశువులకొట్టం. చూ. చిత్రం 52 క (కో. 37, 46, 48).

**ఊలదంటు** లేపిలేని జొన్నదంటు, చూ. దంటు (రా. 16-19).

**కంకర** పర్యా. గగ్గి. (1) గింజపట్టని ఎన్ను ; (2) గింజలురాల్చిన కంకి :- ఇవి పశువులకు మేతగా వేస్తారు (తె. 31).

**కట్టుగొయ్య** పర్యా. చూ. గూటం. పశువుల్ని కట్టివెయ్యటానికి పాతే కర్ర (కో. 39).

**కట్టుగోరు** పర్యా. చూ. గూటం. పశువుల్ని కట్టివెయ్యటానికి పాతే కర్ర (కో. 37).

**కట్టుమట్టు** ఉ. కట్టుమట్ట, కట్టుముట్ట ; పర్యా. చూ. గాడిపట్టు. గాడి (మేతవేసే అర) దగ్గర పశువుల్ని కట్టివేసే చోటు (కో. 1 ; తె. 37).

**కట్టె** ఉలవ, కంది, జనుము, వేరుసెనగ, మొ. వాటి ఎండుగడ్డి ; దీన్ని పశువులకు మేతగావేస్తారు (కో. 4, 16, 17, 19, 20, 23, 24, 28, 31, 32 ; తె. 31, 36, 39; రా. 5, 18).

**కడుగు** పర్యా. కుడితి. పశువులకు ఆహారంగా పెట్టే నీళ్ళు ; నానబెట్టిన ధాన్యం (జొన్న, ఉలవ, సజ్జ, సెనగ), రేగి, అడవిబెండ, తుమ్మ, మొ. వాటి కాయలు రుబ్బి దీంట్లో కలుపుతారు ; గింజల కడుగునీళ్ళు, అన్నంలో వార్చిన గంజి, చిట్టు, తవుడు, మొ. వి కూడా కలుపుతారు (కో. 39, 47 ; రా. 4, 10 12, 18, 21, 22, 24-28).

**కంబం** పర్యా. చూ. నిట్ట. కొట్టం(సాల) కట్టుబడిలో వేసే నిలువుగుంజ (తె. 31).

**కవ్వ** ? జొన్న, చోడి, మొ. వాటి పొల్లులో మిగిలిన నాపగింజ ; దీన్ని దంచి ఉడకబెట్టి పశువులకు దాణాగా వేస్తారు (కో. 46, 49).

**కసువు** పర్యా. చూ. గడ్డి. (1) అరిగ, కొర్ర, చామ, వరి, వరిగె, మొ. పంటలు నూర్చగా మిగిలిన, ఆకు, కాడ, మొ. వి; ఇది పశువులకు ఆహారం ; (2) పశువులకు మేతగా వేసే మొక్కలు, ఆకులు, కాడలు (పచ్చివిగాని, ఎండువిగాని) (రా. 2-4).

**కుడితి** ఉ. కుడిది ; పర్యా. కడుగు. పశువులకు ఆహారంగా పెట్టే నీళ్ళు ; నానబెట్టిన ధాన్యం (జొన్న, ఉలవ, సజ్జ, సెనగ), రేగి, అడవిబెండ, తుమ్మ, మొ. వాటి కాయలు రుబ్బి దీంట్లో కలుపుతారు ; గింజల కడుగునీళ్ళు, అన్నంలో వార్చిన గంజి, చిట్టు, తవుడు, మొ. వి కూడా కలుపుతారు (కో. 11, 13, 16-18, 22, 23, 27-32, 37, 44, 45 ; తె. 1, 6, 9, 10, 13, 15-17, 20, 26-40 ; రా. 16).

**కూగు** పర్యా. చూ. బొత్తు. జొన్న, రాగి, మొ. వాటి గింజల నంటుకొనిఉండే సన్నటి పొట్టు ; తూర్పారపోసినప్పుడిది వేరవుతుంది ; దీన్ని పశువులకు ఆహారంగా వేస్తారు (రా. 9, 18).

**కొంకి** పర్యా. చూ. కొంకిరికట్టె. కొట్టంలో ఏరకట్ట (తాళ్ళకట్ట) తగిలించే వంకరకర్ర (రా. 22, 26).

**కొంకిరికట్టె** ఉ. కింకిరికట్టె, కొంకరకట్టె; పర్యా. కొంకి, కొంగకట్టె, కొంగెన, కొాట్టె. కొట్టంలో ఏరకట్ట

(తాళ్ళకట్ట) తగిలించే వంకరకర్ర (రా. 11, 25, 28).

**కొంగకట్టె** పర్యా. చూ. కొంకిరికట్టె. కొట్టంలో ఏరకట్ట (తాళ్ళకట్ట) తగిలించే వంకరకర్ర (రా. 9).

**కొంగెన** పర్యా. చూ. కొంకిరికట్టె. కొట్టంలో ఏరకట్ట (తాళ్ళకట్ట) తగిలించే వంకరకర్ర (రా. 18).

**కొట్టం** ఉ. కొఠ్ఠం; పర్యా. సాల, సావిడి. పశువుల నివాసంకోసం ఏర్పరచిన ఇల్లు (కో. 1-4, 6-8, 10, 11, 15, 16; తె. 1, 5, 8-15, 17-29, 31, 34-39, 42; రా. 1, 3, 6).

**కొట్టి** పర్యా. చూ. కొంకిరికట్టె. కొట్టంలో ఏరకట్ట (తాళ్ళకట్ట) తగిలించే వంకరకర్ర (రా. 21).

**కొరటు** రాగిగింజలు కొట్టిన పిండివేసి కాచిన నీళ్ళు; పశువులకు ఆహారం (రా. 6, 18).

**కొల్లాం** గడ్డి, బొట్టు, నిలవచేసుకొనే పెద్దగంప; కొట్టంలో మచ్చుమీద పెడతారు. చూ. చిత్రం 52 త (కో. 37, 38, 40, 42).

**కొష్టం** చూ. కొట్టం (కో. 13, 24).

**గగ్గి** పర్యా. కంకర. (1) గింజపట్టని ఎన్ను: (2) గింజలు రాల్చిన కంకి: -ఇవి పశువులకు మేతగా వేస్తారు (కో. 4, 8, 11, 13, 18, 24, 32; తె. 10; రా. 18, 28).

**గంజు** పశువుల మూత్రం (రా. 18).

**గటుకచొప్ప** కంకులతోఉన్న గడ్డి: చూ. చొప్ప (తె. 30).

**గడ్డి** పర్యా. కసువు, చెత్త, తాలు. (1) ఆరిగ, కొర్ర, చామ, వరి, వరిగె, మొ: పంటలు నూర్చగా మిగిలిన ఆకు, కాడ, మొ. వి; ఇవి పశువులకు ఆహారం; (2) పశువులకు మేతగావేసే మొక్కలు, ఆకులు, కాడలు (పచ్చివిగాని, ఎండువిగాని) (కో. 2, 4, 5, 8, 10-32, 39, 41-43, 45; తె. 1, 3-12, 14, 29-42; రా. 5-28; పంట గడ్డి మాత్రమేగాక, ఈ కింద (కలుపు) మొక్కలు, కొండ గడ్డి, కొన్ని చెట్లఆకు కూడా పశువులమేతగా ఉపయోగిస్తారు (పేర్లు చాలావరకు 'మొక్కలు: చెట్లు' భాగంలో వచ్చాయి, చూ. పుటలు 155-184; వివరాలు ఆయా పుటల్లో చూసుకోవాలి):

**ఉట్నాలు** చూ. ఉటూకు, పుట 157 (తె. 14).

**ఊదర(గడ్డి)** చూ. ఊదర, పుట 157 (కో. 46, 49, 51).

**ఏడె(గడ్డి)** చూ. పుట 158 (తె. 14).

**కంచెగడ్డి** చూ. పుట 158 (తె. 8).

**కనపగడ్డి** చూ. కనప, పుట 159 (కో. 39, 41, 45).

**కప్పరతి(గడ్డి)** చూ. కప్పరద్దు, పుట 159 (కో. 46, 47).

**కావరొడ్డ** ? గానుగచెట్టు ఆకు; చూ. కానుగు; పుట 160 (కో. 43).

**కారకంది** చూ. కారుకంది, పుట 160 (తె. 35).

**కారె(గడ్డి)** చూ. పుట 160 (తె. 35).

**కొలిమె** (తె. 14).

**కొల్లగంజేరు** గంజేరులో ఒకరకం; చూ. గలజేరి, పుట 162 (కో. 13).

**కోడికాలు** చూ. పుట 161 (కో. 51).

**గరికి** ఉ. గరక; చూ. గరిక, పుట 161 (కో. 37-41, 43, 45-47, 50, 51; తె. 35).

**గాజురొడ్డ** (కో. 43).

**గుజ్జంగి** ఉ. గుజ్జెంగ; చూ. పుట 162 (కో. 37, 39-41, 47, 49, 50).

**గునుగు** చూ. పుట 162 (కో. 43; తె. 35).

**చిప్పర** ఉ. చిప్పెర; చూ. పుట 164 (కో. 37, 39, 41, 45; తె. 35; రా. 16-19).

**చిరిచేమాకు** ఉ. సిరిశామాకు; చూ. చేమ, పుట 248 (కో. 51).

**చెంగలి** చూ. పుట 165 (కో. 37, 39, 41, 43, 45, 47, 50, 51).

**చెవలకాడ** చూ. పుట 165 (కో. 39).

**జల్లర** (కో. 43).

**జీలిగి** ? చూ. జీలుగు, పుట 166 (కో. 43).

**జెరుపోతు(గడ్డి)** పొలంగట్లమీద మొలిచే గడ్డిమొక్క (తె. 14).

**తక్కెల** ? తక్కెడ: పొలంగట్లమీద పెరిగే తీగెమొక్క; ఆకు చిక్కుడాకుమాదిరి ఉంటుంది (తె. 14).

**తుంగ** చూ. పుట 168 (కో. 40, 45, 50, 51).

**తొండ** చూ. దొండ, పుట 250 (తె. 14).

**దర్భ(గడ్డి)** చూ. దబ్బాకు, పుట 169 (కో. 51).

**నక్కిరిగడ్డి** (కో. 47).

**నూము** ? చూ. నూగు(కట్టె), పుట 171 (కో. 39).

**పిల్లిపెసర** చూ. పిల్లిపీచర, పుట 173 (కో. 11, 13, 16, 17, 20, 51).

**పుటుపుటాలు** చూ. కాకిబుడ్డాకు, పుట 160 (తె. 14).

**పూతిర** చూ. పూతిర(చెట్టు), పుట 174 (కో. 40, 41).

**పూలుసేర్లగడ్డి** ? చూ. పుల్సెర, పుట 174 (కో. 47).

**పొర్లుగాడి** ఒకరకం కలుపుమొక్క (కో. 35).

**బల్లిగడ్డి** చూ. బల్లిగడ్డి పుట 175 (కో. 51).

**మర్రి(రొష్ట)** ఉ. మరి; చూ. మర్రి, పుట 177 (కో. 43).

**మోదెములం** చూ. పుట 179 (తె. 35).

**రాకాసి(గడ్డి)** ఉ. రాగిస(గడ్డి), రాస(గడ్డి): చూ. పుట

179 (కో. 47).

**రాగి** చూ. రావి (తె. 1).

**రాగిస(గడ్డి)** చూ. రాకాసి(గడ్డి), పుట 179 (కో. 41 45).

**రావి** రూ. రాగి (కో. 50, 51).

**రాస (గడ్డి)** చూ. రాకాసి(గడ్డి), పుట 179 (కో. 37, 39).

**రెయ్యికాలు** చూ. రెయ్యికాలు(గడ్డి), పుట 179 (కో.15).

**వెదురు** (కో. 51).

**వేప(రొడ్డ)** చూ. వేప, పుట 181 (కో. 43).

గంప గడ్డి, పొట్టు, మొ. వి వేసుకొనే పెద్దబుట్ట (కో. 17, 28 ; తె. 3, 4, 6, 9, 10, 14, 29, 33, 34, 38; రా. 2, 7, 12, 16-18, 20, 21, 23-26, 28).

**గాటికంబం** పర్యా. చూ. గాటిగుంజ. గాడిదగ్గర పశువును కట్టివెయ్యటానికి పాతినగుంజ (రా. 28).

**గాటిగుంజ** ఉ. గాడిగుంజ; పర్యా. గాటికంబం, గాడి గూటం. గాడిదగ్గర పశువును కట్టివెయ్యటానికి పాతిన గుంజ (రా. 8, 9, 11, 12, 16, 18, 20, 21, 23, 26, 27).

**గాటిపాడు** చూ. గాడిపట్టు (తె. 4).

**గాడి** పర్యా. గోల్లాం, గోణాం, మట్టు. కొట్టంలో పశువులకు మేతవెయ్యటానికి ఏర్పరచిన అర (కో. 1-11, 13-15, 17-26, 29, 37, 42, 46 ; తె. 3-6, 9-12, 14-27, 29, 35, 37, 39; రా. 1-12, 16, 18-28); **-గూటం** పర్యా. చూ. గాటిగుంజ. గాడిదగ్గర పశువును కట్టివెయ్యటానికి పాతినగుంజ (రా.) ; **-పట్టు** రూ. గాటి పాడు ; పర్యా. కట్టుమట్టు. గాడిదగ్గర పశువుల్ని కట్టివేసే చోటు (తె.).

**గానుగచెక్క** ఉ. గానిగెచెక్క, గానెగచెక్క ; పర్యా. చూ. తెలికెపిండి. గానుగఆట్టిన నూనెగింజల (నువ్వు, వేరుసెనగ, కుసుమ, మొ. వాటి) పిట్టు (కో. 28; తె. 3, 4, 11, 34, 36, 37, 39 ; రా. 4, 9, 11-18, 20, 24).

**గాబు** పర్యా. చూ. తొట్టి. పశువులు కుడితితాగే పెద్ద (కో. 29, 31, 32, 35 ; తె. 30, 37, 38, 40,

గుగ్గెళ్ళు ఉ. గుగ్గిళ్ళు, గుగ్గుళ్ళు. పశువులకు వేసే దాణా ; ఉడకబెట్టిన పప్పువినుసు (కో. 10, 14, 16, 21-28, 30, 31 ; తె. 30, 31, 40, 41).

గుంజ పర్యా. చూ. గూటం. పశువుల్ని కట్టివెయ్యటానికి పాతే కర్ర (కో. 26, 27, 31, 32, 35 ; తె. 40 ; రా. 19).

గుత్తాపుసాల పర్యా. ఇలారం. గుండ్రంగావేసిన పశువులకొట్టం. చూ. చిత్రం 52 క (కో. 46).

గుల్ల పర్యా. చూ. తట్ట. పశువులకు దాణాపెట్టే బుట్ట (తె. 3, 9-15, 17-22, 33-35 ; రా. 5, 6, 8, 14).

గూటం పర్యా. కట్టుగొయ్య, కట్టుగోర, గుంజ, గొత్తు. పశువుల్ని కట్టివెయ్యటానికి పాతే కర్ర (కో. 2, 27, 32, 33, 35 ; తె. 4-12, 17, 18, 33, రా. 1-3, 6, 22).

గూన పర్యా. చూ. తొట్టి పశువులు కుడితితాగే మట్టి తొట్టి (తె. 31).

గొత్తు పర్యా. చూ. గూటం. పశువుల్ని కట్టివెయ్యటానికి పాతే కర్ర (రా. 2, 4, 5, 14, 15).

గోల్లాం పర్యా. చూ. గాడి. కొట్టంలో పశువులకు మేత వెయ్యటానికి ఏర్పరచిన అర (కో. 28, 33).

గోణాం పర్యా. చూ. గాడి. గొట్టంలో పశువులకు మేత వెయ్యటానికి ఏర్పరచిన అర (కో. 50).

గోలెం పర్యా. చూ. తొట్టి. పశువులు కుడితితాగే మట్టి తొట్టి (కో. 39, 45 ; తె. 26, 28, 31-34, 39).

చిట్టు సన్నపొట్టు కలిసిన బరక తవుడు ; ఇది తడిపి పశువులకు ఆహారంగా వేస్తారు (కో. 16, 17, 22, 39, 43-45 ; తె. 29).

చితుకు పర్యా. చూ. తొక్కుడు. కొట్టంలో గొడ్ల కాళ్ళకింద నలిగిన గడ్డి ; దీన్ని తీసివేస్తారు (రా. 5).

చెత్త పర్యా. చూ. గడ్డి. (1) ఆరిగ, కొర్ర, చామ, వరి, వరిగె మొ. పంటలు నూర్చగా మిగిలిన ఆకు, కాడ, మొ. వి; ఇవి పశువులకు ఆహారం; (2) పశువులకు మేతగావేసే మొక్కలు, ఆకులు, కాడలు (పచ్చివిగాని, ఎండువిగాని) (కో. 28 ; రా. 4).

చొప్ప జొన్న, సజ్జ, రాగి, మొక్కజొన్న మొ. వాటి గడ్డి; పశువులమేత (కో. 2-5, 8, 10-13, 15, 16, 18-25, 27-32, 37, 39 ; 41, 43, 45, 48, 49 ; తె. 1, 3-14, 29-42 ; రా. 4-6, 8-11, 15-28).

జబ్బ పర్యా. చూ. తట్ట. పశువులకు దాణాపెట్టే బుట్ట (తె. 8, 23).

జల్ల పొట్టు, కంకులు, నిలవచేసుకొనే పెద్దగంప ; దీన్ని కొట్టంలో ఉంచుతారు (కో. 10-13, 17, 19, 24, 28, 31, 32 ; తె. 39 ; రా. 17, 18, 28).

జాడు ఎన్నువెళ్ళని (జొన్న, సజ్జ, మొ. వాటి) దంటు; దీన్ని పెరికి పశువులకు మేతగా వేస్తారు (కో. 5, 6, 11, 13-15, 19, 20, 23-25, 32, 36 ; తె. 10 ; రా. 4, 18, 21, 25-28).

తట్ట పర్యా. అంచె, గుల్ల, జబ్బ, ?దామర, పుటికె, పశువులకు దాణాపెట్టే బుట్ట; దీని మూతి వెడల్పుగాఉంటుంది (కో. 30-32, 40 ; తె. 23, 31, రా. 11, 15).

తవుడు ఉ. తౌడు. బియ్యం దంచితే వచ్చే సన్నటి నుసి; దీన్ని కుడితిలో కలిపి పశువులకు ఆహారంగా వేస్తారు

(కో. 4, 10, 13, 17, 19, 22, 23, 25-28, 32, 33, 37, 40, 46, 49-51; తె. 4, 6, 14, 23, 29, 31, 34, 38-41; రా. 2, 3, 19).

**తాలు** పర్యా. చూ. గడ్డి. (1) అరిగ, కొర్ర, చామ, వరి, వరిగె, మొ. పంటలు నూర్చగా మిగిలిన ఆకు, కాడ మొ. వి. ఇవి పశువులకు ఆహారంగా వేస్తారు; (2) పశువులకు మేతగావేసే మొక్కలు, ఆకులు, కాడలు (పచ్చివిగాని, ఎండువిగాని) (రా. 5, 15).

**తెలికెపిండి** ఉ. తెలకపిండి, తెలగపిండి, తెలికపిండి, తెలికిపిండి: పర్యా. గానుగచెక్క, పిండి (2). గానుగబట్టిన నూనెగింజల (నువ్వు, వేరుసెనగ, కుసుమ, మొ.) పిట్టు (కో. 14, 16, 17, 19, 22-25, 41, 45, 48-50; తె. 8, 9, 17, 18, 20, 21, 23-28, 31, 34, 37, 38, 42).

**తొక్కు** ఉ. తొక్క. ఉలవ, పత్తి మొ. వాటి గింజలు తొక్కి పశువులకు వేసే దాణా (రా. 3, 10, 12, 16, 18-21, 24-26, 28).

**తొక్కుడు** పర్యా. చిదుదు, దుగ్గు. కొట్టంలో పశువుల కాళ్ళకింద నలిగిన గడ్డి; దీన్ని తీసివేస్తారు (కో. 27).

**తొట్టి** రూ. తొట్లె; పర్యా. గాబు, గూన, గోలెం, దోనె. పశువులు కుడితితాగే మట్టితొట్టి (కో. 26, 27, 29, 30; తె. 9, 10, 12, 15, 19, 21, 24, 26-28, 33, 35, 36, 40, 41; రా. 8, 12, 17, 18, 19, 24).

**తొట్లె** చూ. తొట్టి (తె. 13, 25).

**దంటు** జొన్న, సజ్జ మొ. వాటి కాడ(లు): ఇది పాడిగొడ్లకు మేలైన మేత (కో. 14, 17, 24, 27, 32; తె. 35, 40, 41; రా. 2, 16-19, 22-28).

**దాణా** ఉ. దాణ, దాన, దానా; పర్యా. అడిమేత. కొన్నిరకాల ధాన్యాలు, పప్పుగింజలు, ఉడకబెట్టిగాని, రుబ్బిగాని పశువులకు బలానికిపెట్టే మేత (తె. 1, 3, 4, 6-12, 14, 19, 22, 23, 27-29, 32-39, 42; రా. 4, 16, 17, 21, 28).

**దాపె** పర్యా. చూ. నిట్ట. కొట్టం కట్టుబడిలో మధ్యవేసే నిలువుగుంజ (కో. 39).

**దామర** పర్యా. చూ. తట్ట. పశువులకు చిట్టుపోసిపెట్టే బుట్ట (కో. 39).

**దుగ్గు** పర్యా. చూ. తొక్కుడు. కొట్టంలో పశువుల కాళ్ళకింద నలిగిన గడ్డి; దీన్ని తీసివేస్తారు (రా. 11).

**దొడ్డి** చుట్టూ దడిగాని, గోడగాని కట్టి పశువులను తోలి ఉంచే చోటు (కో. 3, 26, 27, 29-31, 33, 35, 36; తె. 17-19, 21-23, 25-28, 31-38, 41; రా. 6-8).

**దోనె** పర్యా. చూ. తొట్టి. పశువులు కుడితితాగే మట్టితొట్టి (తె. 39; రా. 28).

**నాము** లేతచొప్ప; కొయ్యకాలుకు వేసేచిగురు: ఇది తింటే గొడ్లకు 'ఉంగిడి' అనే జబ్బు వస్తుంది (కో. 27, 32; తె. 40, 41; రా. 17, 18).

**నిట్ట** పర్యా. కంబం, దాపె, బెలుగు, మవురా, మొకరం. కొట్టం (సాల) కట్టుబడిలో మధ్యవేసే నిలువుగుంజ (కో. 32, 35, 37, 39-41, 44, 46, 48, 49); **-రాటు** ఉ. నిట్రాట; రూ. నిట్టాడు; చూ. నిట్ట (కో.); **నిట్టాడు** రూ. నిట్రాట; చూ. నిట్ట (కో.).

**పచ్చికసువు** పర్యా. పచ్చిగడ్డి. పశువులకు వేసే పచ్చిమేత; పొలంలోనుంచి కోసితెచ్చే మేత (రా. 3, 4).

**పచ్చిగడ్డి** ఉ. పచ్చిగెడ్డి; పర్యా. పచ్చికసువు. పశువులకువేసే పచ్చిమేత; పొలంలోనుంచి కోసితెచ్చే మేత (కో. 4, 5, 16, 17, 19, 22, 24, 31, 37, 39-47; తె. 30, 40; రా. 5, 6, 10, 17-19, 24-28).

**పందిరి** బడ్డీలాగకట్టి మేత నిలవచేసుకొనే చోటు; ? చూ. మచ్చు (కో. 26, 27, 29-33, 35, 36; తె. 30, 31, 40, 41).

**పలగడ** రూ. పలగండి, పలగాడి; పశువుల కొట్టానికిగాని, దొడ్డికిగాని అమర్చినవాకిలి దడి; తుమ్మకర్రలతోగాని, వెదురుబద్దలతోగాని కడతారు (తె. 8; రా. 4, 6).

**పలగండి** చూ. పలగడ (కో. 7).

**పలగాడి** చూ. పలగడ (కో. 8).

**పారుకోల** కొట్టంలో పేడగోకే కర్ర (రా. 12).

**పిండి** (1) పర్యా. పుబ్బ. కొన్ని ధాన్యాలు, పప్పుగింజలు నానబెట్టి రుబ్బి పశువులకు వేసే దాణా; (2) పర్యా. చూ. తెలికెపిండి. గానుగబట్టిన నూనెగింజల (నువ్వు, వేరుసెనగ, కుసుమ, మొ.) పిట్టు (కో. 2, 4, 5, 8-10, 13-17, 19-24, 25, 27, 28, 31, 37, 40, 41, 45-51; తె. 3-15, 17, 20, 24, 26-29, 31-42; రా. 2-10, 12, 13, 18-28).

**పుటికె** పర్యా. చూ. తట్ట. పశువులకు దాణాపెట్టే బుట్ట (రా. 4, 10, 12, 15, 17, 24, 25).

**పులికుండ** చూ. కుడితికుండ (రా. 16).

**పుల్ల** పర్యా. కట్టె. ఉలవ, జనుము, సెనగ మొ. వాటి ఎండుగడ్డి; పశువుల మేత (తె. 31).

**పెంట** చూ. పేడ (తె. 30).

**పెండ** చూ. పేడ (తె. 3, 4, 6; రా. 21-23, 28).

**పేడ** రూ. పెంట, పెండ. పశువుల మలం (రా. 2, 7, 11, 12, 15, 18, 24-26).

**పేర్పు** చిన్న (కుడితి) కుండ (తె. 22).

**పొట్టు** పర్యా. పొల్లు. ఉలవ, పెసర, కంది మొ. వి నూర్చగా మిగిలిన తుక్కు; ఇది పశువులకు ఆహారంగా వేస్తారు (కో. 2, 4, 5, 10, 11, 13, 16-19, 21, 27-

29, 32, 47-49; తె. 3-6, 10, 13, 21-23, 25, 28, 30, 31, 36, 39, 40; రా. 2-28).

**పొది** ? ఇంటిపక్కా వెనకా పశువుల్ని కట్టివేసే చోటు (తె. 18).

**పొరక** ఉ. పరక, పురక. కొట్టంలో కసువు, పేడ ఊడ్చటానికి, వెదురు మొ. వాటి పుల్లలతోగాని దూసర తీగెతోగాని కట్టిన చీపురు (రా. 15, 18, 23, 25; తె. 3, 4, 6, 31).

**పొల్లు** పర్యా. పొట్టు. ఉలవ, పెసర, కంది మొ. వి నూర్చగా మిగిలిన తుక్కు; దీన్ని పశువులకు ఆహారంగా వేస్తారు (కో. 46; తె. 1, 7-9, 11, 12, 19, 20, 29, 31-35, 37, 38, 42).

**బచ్చు** కొట్టంలో పశువుల మూత్రం నిలిచే గుంట (గొయ్యి) (తె. 4).

**బుట్ట** (బహు. బిట్టలు, బుట్లు) పర్యా. మల్ల. పశువులకు దాణాపెట్టే తట్ట; దీనిమూతి చిన్నది (కో. 8, 26-33; తె. 1, 6, 7, 31, 36-39; రా. 3, 4, 9).

**బుసక** ? కంకి అరల్లో గింజనంటుకొని ఉండే సన్న పొట్టు; తూర్పారబట్టినప్పుడు వేరయ్యే దీని నుసిని పశువులకు ఆహారంగా ఉపయోగిస్తారు (కో. 4).

**బెలుగు** పర్యా. చూ. నిట్ట. కొట్టం కట్టుబడిలో మధ్య వేసే నిలువుగుంజ (తె. 31).

**బొండ** పర్యా. చూ. బొత్తు. జొన్న, రాగి మొ. వాటి గింజలను అంటిఉండే సన్నటిపొట్టు; తూర్పారపోసినప్పుడిది వేరవుతుంది; పశువులకు ఆహారం (రా. 28).

**బొత్తు** పర్యా. నూగు. బొండ, సరుగు. జొన్న, రాగి మొ. వాటి గింజల నంటుకొనిఉండే సన్నటి పొట్టు; తూర్పార పోసినప్పుడిది వేరవుతుంది; పశువులకు ఆహారం (కో. 39, 41, 43-45, 47).

**బొందుచొప్ప** కంకివెళ్ళని వరి, వరిగె, మొ. వాటి గడ్డి; గొడ్లమేతగా ఉపయోగిస్తుంది (కో. 15, 20, 24; రా. 15-19).

**మచ్చు** ఉ. మొచ్చు; రూ. మంచె; పర్యా. అటుకు, అట్టవ, అట్టాం, అట్టుక, అలవ. గొడ్లగొట్టంలో కప్పుకింద మేత, పొట్టు నిలవ ఉంచుకోటానికి ఏర్పరచిన చోటు (కో. 4, 10, 11, 13, 14, 20, 27, 33, 35; తె. 31; రా. 16, 18, 20-28).

**మంచె** చూ. మచ్చు (కో. 32).

**మట్టు** ఉ. మొట్టు; పర్యా. చూ. గాడి. కొట్టంలో పశువులకు మేతవెయ్యటానికి ఏర్పరచిన అర (కో. 27, 32, 35; తె. 20, 24-26, 28).

**మడ్డికూడు** పర్యా. మడ్డిమేత. సజ్జలు, జొన్నలు, మొ. ధాన్యం దంచి కడక్కుండా వండి పశువులకు పెట్టే దాణా (కో. 11, 13-22, 27, 28, 31, 32; తె. 41).

**మడ్డిమేత** పర్యా. మడ్డికూడు. సజ్జలు, జొన్నలు, మొ. ధాన్యం దంచి కడక్కుండా వండి పశువులకు పెట్టే దాణా (రా. 11, 26).

**మల్ల** పర్యా. బుట్ట. పశువులకు దాణాపెట్టే తట్ట (కో. 27, 35).

**మపురా** చూ. మొకరం (తె. 31).

**మొకరం** రూ. మపురా; పర్యా. చూ. నిట్ట. కొట్టం కట్టుబడిలో మధ్య వేసే నిలువుగుంజ (కో. 14).

**మోటుచొప్ప** కంకులు కోసిన గడ్డి; చూ. చొప్ప (కో. 11; రా. 17, 18).

**రాట** పర్యా. చూ. నిట్ట. కొట్టం కట్టుబడిలో మధ్య వేసే నిలువుగుంజ (కో. 37, 40, 46, 47).

**రుబ్బు** పర్యా. పిండి (1). కొన్ని ధాన్యాలు, పప్పు గింజలు నానబెట్టి రుబ్బి పశువులకు వేసే దాణా (కో. 40, 46-48, 50, 51).

**రొచ్చు** ఉ. రచ్చు. పశువుల మూత్రంతో ఏర్పడ్డ బురద (రా. 4, 11, 12, 21-24, 26, 28).

**వాతసాల** పర్యా. చూ. వారసాల. పొడుగ్గావేసిన పసుల కొట్టం. చూ. చిత్రం 52 చ (కో. 39).

**వారసాల** పర్యా. వాతసాల, వాససాల. పొడుగ్గావేసిన పసులకొట్టం. చూ. చిత్రం 52 చ (కో. 40, 41).

**వాససాల** పర్యా. చూ. వారసాల. పొడుగ్గావేసిన పసుల కొట్టం. చూ. చిత్రం 52 చ (కో. 37).

**సరుగు** పర్యా. చూ. బొత్తు. జొన్న, రాగి, మొ. వాటి గింజల నంటుకొని ఉండే సన్నపొట్టు; తూర్పారపోసినప్పుడిది వేరవుతుంది; పశువులకు ఆహారం (రా. 17, 18).

**సాల** పర్యా. చూ. కొట్టం. పశువుల నివాసంకోసం ఏర్పరచిన ఇల్లు (కో. 37, 39-46, 48-51).

**సావిడి** పర్యా. చూ. కొట్టం. పశువుల నివాసంకోసం ఏర్పరచిన ఇల్లు (కో. 18-23, 26, 27, 29, 32, 33, 35, 36; తె. 40, 41).

**సైదం** దాణాలో ఒకరకం; జొన్న పిండిగాని, గోధుమ పిండిగాని నానబెట్టి, ఉప్పుకలిపి పెడతారు (తె. 22).

# 4. అలంకారాలు, బంధనాలు

**అంచు** పర్యా. చూ. కుప్పె. ఎద్దుకొమ్ము(ల) కొసన అలంకారంగా వేసే తొడుపు, ఇత్తడిదిగాని వెండిదిగాని. చూ. చిత్రం 56 (తె. 2, 6).

**అంజె** ఉ. అంజ ; చూ. అందె (కో. 4; రా. 1, 10).

**అడుసు** పర్యా. చూ. కుప్పె. ఎద్దుకొమ్ము(ల) కొసన అలంకారంగా వేసే తొడుపు, ఇత్తడిదిగాని వెండిదిగాని. చూ. చిత్రం 56 (కో. 40).

**అడ్డానం** పర్యా. చూ. బొడ్డువారు. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ; దీనికి అద్దాలు, కుచ్చులు, మొ. వి కడతారు (కో. 39).

**అందె** రూ. అంజె. కాలికితొడిగే బోలుకడియం (కో. 6, 15 ; తె. 39 ; రా. 3, 18).

**అరికట్టు(డు)** పర్యా. చూ. లంకె. దొంగపశువు తప్పించుకుపోకుండా మంచిపశువుతో కలిపికట్టే కట్టు (తె. 16, 17, 19).

**ఈడుపుగర్ర** పర్యా. చూ. గుది. దొంగగొడ్లకు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (కో. 41).

**ఉరిగజ్జెలు** ఎద్దు ముందుకాళ్ళకు అలంకారంగా కట్టే చిరుమువ్వ(లు) (తె. 14).

**ఒల్లెతాడు** పర్యా. చూ. పనతాడు. అడుగువైపున కొమ్ములు రెండింటికి కలిపి నూలు, తోలు, వెంట్రుకలు మొ. వాటితో పేని కట్టే తాడు (కో. 19, 22 ; తె. 39).

**కన్నె** ఉ. కన్ని ; పర్యా. చూ. పలుపు. పశువుల మెడకు వేసి గుంజకు కట్టేతాడు. చూ. చిత్రం 60 (కో. 30, 33, 37, 38, 40, 43-51 ; తె. 17, 21, 23).

**కప్పెర** ఉ. కొప్పెర ; పర్యా. లొటారం. దొంగగొడ్డు మెళ్ళోకట్టే కొయ్యగంట ; (కొద్దిచోట్ల) ఇనపగంట (కో. 30 ; తె. 15, 29, 30, 32, 33, 42).

**కరడికుచ్చులు** పర్యా. చూ. పనకుచ్చులు. ఎద్దు మొగాన వేలాడేట్టు అలంకారంగా కొమ్ములకుగట్టే కుచ్చులు. చూ. చిత్రం 54 (రా. 16).

**కాలిపిందె** ఎద్దుకాలికి వేసే కడియం (రా. 22).

**కాలుమెడ** ఉ. కాలిమెడ ; పర్యా. కొనతం, వంగాలు. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికి మెడకు కలిపికట్టే కట్టు (కో. 12, 41, 43 ; తె. 5, 6, 8-10 ; రా. 2, 6, 14, 21, 27).

**కిరగాని** ఉ. కిరకాని; పర్యా. కిరిగానిగె, గిరక, చుట్టుకాని, తిరగాని, తిరుగుడుమాను. బొనగాని, మెడగాని, ఎద్దుకు కాడి మరప (అలవాటుచెయ్య) టానికి అమర్చిన గానుగ మాదిరి కొయ్యయంత్రం. చూ. చిత్రం 61 (తె. 34, 37; రా. 4).

**కిరిగానిగె** పర్యా. చూ. కిరగాని. ఎద్దుకు కాడి మరప (అలవాటు చెయ్య)టానికి అమర్చిన గానుగమాదిరి కొయ్యయంత్రం. చూ. చిత్రం (రా. 4).

**కుచ్చు** పర్యా. సుంచు. ఎద్దులకు అలంకారంగా మొగాన వేలాడేట్టు కొమ్ములకు గట్టిన కుచ్చు(లు); ఇవి తోలు, నూలు, ఊలు, మొ. వాటితో చేస్తారు (కో. 1-8, 12-18, 29-24, 26-35, 40, 43, 48 ; తె. 1, 2, 5-9, 12-16, 18-29, 33, 37, 39, 42 ; రా. 1-6, 18-20, 25-28).

**కుప్పె** పర్యా. అంచు, అడుసు, తొడుపు, పన్ను, పీకె, పుచ్చె, బొద్దె. ఎద్దు కొమ్ము(ల)కొసన అలంకారంగా వేసే తొడుపు, వెండిదిగాని, ఇత్తడిదిగాని. చూ. చిత్రం 56 (కో. 2, 6, 10, 15 ; తె. 7, 15 ; రా. 1-8, 10, 14, 16, 18, 21).

**కుళాట** దారానికి గవ్వలుకూర్చి కొమ్ములకు దిగేసే అలంకారం (తె. 18).

**కొడతాం** ఉ. కొణతాం. కట్టుతాడుగా ఉపయోగించే కర్ర ; దీనికి రెండుకొసలా తాళ్ళుంటాయి (కో. 48, 50).

**కొణత(కట్టె)** పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (రా. 3).

**కొనతం** ఉ. కొంతం ; పర్యా. చూ. కాలుమెడ. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికి మెడకు కలిపికట్టే కట్టు (తె. 11, 12, 14, 25).

**కొమ్ముకుచ్చు(లు)** పర్యా. చూ. పనకుచ్చు(లు). ఎద్దుమొగాన వేలాడేట్టు కొమ్ములకుగట్టిన కుచ్చు(లు). చూ. చిత్రం 54 (తె. 23, 25 ; రా. 2-6, 8, 11, 16, 18, 20, 21).

**కొమ్ముగజ్జె(లు)** పర్యా. చూ. పనగజ్జె(లు). ఎద్దు కొమ్ములకు కట్టి నొసటమీదికి పడేట్టు వేసిన చిరుమువ్వల పట్టెడ (తె. 37 ; రా. 6, 8, 10).

**కొమ్ముదాడు** పర్యా. చూ. పనతాడు. నూలు, తోలు, వెంట్రుకలు మొ. వాటితో పేని కొమ్ములు రెండిటికి అడుగువైపునకట్టే తాడు (తె. 12, 38).

**గగ్గిరెట్టు** ఉ. గగిరెట్టు. ఎద్దుకొమ్ము(ల)కు కుప్పె కింద వేసే ఉంగరం; బోలుగా గలగల్లాడుతుంది. చూ. చిత్రం 56 (రా. 5, 15).

**గగ్గెర** ఉ. గగ్గిరె. మామూలుగా పందెపెద్దుకు కాలికి తొడిగే వెండి బోలుకడియం (కో. 10 ; రా. 22).

**గజ్జె(లు)** ఉ. గజ్జ(లు). ఎద్దుకాళ్ళకు, కొమ్ములకు, మెడకు అలంకారంగా కట్టే చిరుమువ్వ(లు) (కో. 2, 3, 10-13, 17-19, 24, 27, 31, 32, 48 ; తె. 3-8,

10-12, 14-16, 18-33, 35-39, 42; రా. 1, 2, 4, 6, 8-12, 14-16, 18, 21-23, 27, 28).

**గంట(లు)** ఉ. గెంట(లు). మెడవారు (ఎద్దుమెడలో కట్టే తోలుపట్టెడ)కు వేసిన గంట(లు) (కో. 1-35, 37-51; తె. 1-42; రా. 1-12, 14-18, 26, 27).

**గరిచిక్కం** రాటిమట్ట పేళ్ళతో అల్లిన చిక్కం (కో. 22).

**గవిసెన** ఉ. గవిశన, గవుశన; పర్యా. జూళ్ళు, ఋరికె, ముసుగు. పండగల్లో ఎద్దువీపుమీద కప్పే చిత్రవస్త్రం (కో. 9-13, 15, 16, 18, 24; తె. 2, 3, 12, 39; రా. 1, 10, 12, 16, 18, 21).

**గాలు** పర్యా. చూ. గుడి. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (రా. 22).

**గిరక** పర్యా. చూ. కిరగాని. ఎద్దుకు కాడి మరప (అలవాటుచెయ్య) టానికి అమర్చిన గానుగ మాదిరి కొయ్యయంత్రం. చూ. చిత్రం 61 (తె. 36).

**గుంగురు** (బహు. గుంగుర్లు, గుంగుర్రు) పర్యా. మువ్వ. పెద్దసైజు గజ్జె(లు); ఇవి పట్టెడ (మెడారు)కు వేస్తారు (తె. 17-20, 22-25).

**గుండుకొయ్య** పర్యా. చూ. గుడి. దొంగగొడ్లకు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (రా. 1).

**గుడి** ఉ. గుదె; పర్యా. ఈసుపుగర్ర, కొణతకట్టె, గాలు, గుండుకొయ్య, టొంక, తుంట, దుక్క, దుడ్డు(కట్టు), దొబ్బె, బడితె, బదె, బండకొయ్య, బొద్దెం, మొద్దు. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య (కో. 2, 3, 5, 6-8, 10, 12-25, 39, 45; తె. 1, 3-5, 10, 24, 35, 37-39; రా. 1, 2, 9, 11-13, 20-28); **-కట్టె** ఉ.-కట్ట,- కట్టి; చూ. గుడి (కో. తె. రా.); **-కొయ్య** చూ. గుడి (కో. రా.); **-బండ** చూ. గుడి (కో. తె.).

**గున్నాబట్ట** పర్యా. నగడ. ఎద్దుకొమ్ములకు అలంకారానికి తొడిగే కాకిబంగారపు రేకు (రా. 5).

**గురిగజ్జె(లు)** ఎద్దుమెడకుకట్టే చిరుమువ్వ(లు) (తె. 11).

**గూటం** (వాడుక: మెడగూటం) పర్యా. చూ. గుడి. దొంగగొడ్లకు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (రా. 25).

**గొలుసు** ఉ. గొల్సు; పర్యా. నాను, సరిపెణ. ఎద్దుమెడకు అలంకారంగావేసే గొలుసు; ఇత్తడిదిగాని, రాగిదిగాని (తె. 7, 10, 14, 23, 26, 27).

**చిక్కం** ఉ. చిక్కెం; పర్యా. బుట్ట, మూతిపుటికె, మూతిబుంగ, మూతిబుట్ట. పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికివేసే జల్లెడ; దీన్ని వెదురుబద్దలు, తాడు, పేము, మానరతీగె, మొ. వాటితో అల్లుతారు. చూ. చిత్రం 58 (కో. 2, 3, 5-11, 14, 15, 17, 18, 20-24, 37, 40, 44, 46; తె. 3, 17, 18, 20-23, 26-28, 31, 42; రా. 18, 24, 26).

**చిక్కుతాడు** ఉ. చికుతాడు; పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికితగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (రా. 2, 7).

**చిటికి** పర్యా. చూ. చిర్ర. దొంగగొడ్డు పరుగెత్తకుండా ముందుకాలు కొసనగట్టే పంగలకర్ర (కో. 41).

**చిటిమూరుతాడు** పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (కో. 42).

**చిట్టిగర్ర** పర్యా. చూ. చిర్ర. దొంగగొడ్డు పరుగెత్తకుండా ముందుకాలు కొసనగట్టే పంగలకర్ర (కో. 23).

**చింబోర** ఉ. చింబారు, సింబార, సింబోర, సింబోరు. చూ. చిలమోర (రా. 5, 6, 8, 12, 14-16, 18-20).

**చిరత** చూ. చిర్ర. దొంగగొడ్డు పరుగెత్తకుండా ముందుకాలు కొసనగట్టే పంగలకర్ర (కో. 5, 39, 40, 43, 45; తె. 6).

**చిర్ర** ఉ. చిర; రూ. చిరత; పర్యా. చిటికి, చిట్టిగర్ర. దొంగగొడ్డు పరుగెత్తకుండా ముందుకాలు కొసనగట్టే పంగలకర్ర (తె. 34-36, 38).

**చిలమరక** చిరమలక, చిరుమొరికె, చిలమలక; చూ. చిలమోర (తె. 5-11, 14).

**చిలముకుదాడు** ఉ. సిలముగిదాడు, సిల్మకుదాడు; పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (తె. 4; రా. 21, 22).

**చిలమోర** ఉ. చిలమూర, చిలమూరు; రూ. చింబోర, చిలమరక; పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికితగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (కో. 7-9: తె. 2, 3, 38; రా. 10, 24-26, 28).

**చుట్టుకాని** పర్యా. చూ. కిరగాని. ఎద్దుకు కాడి మరపటానికి అమర్చిన గానుగమాదిరి కొయ్యయంత్రం. చూ. చిత్రం 61 (తె. 38).

**జాలికుచ్చు** కొమ్ములకు కట్టే రంగుల నూలుకుచ్చు, చూ. కుచ్చు (తె. 15).

**జీను** పర్యా. చూ. బొడ్డువారు. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూవేసే తోలుపట్టీ; దీనికి అద్దాలు, కుచ్చులు మొ. వి కడతారు (తె. 12).

**జీలుమోకు** దొంగగొడ్డును పట్టుకోటానికి వీలుగాకట్టిన పొడుగుతాడు (తె. 35).

**జూళ్ళు** (ఏక. ? జూడు); పర్యా. చూ. గవిసెన. పండగల్లో ఎద్దువీపుమీద కప్పే చిత్రవస్త్రం (తె. 18, 19, 21-23; రా. 22).

**జోడా** పర్యా. బంధం. దొంగదానికి ఒకవైపు రెండు కాళ్ళకూ కలిపికట్టే కట్టు (కో. 40, 41, 43, 51).

**టంగువారు** ఉ. టంగవారు, టంగారు, టంగువార, తంగోరు ; పర్యా. చూ. బొడ్డువారు. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూవేసే తోలుపట్టీ; దీనికి అద్దాలు, కుచ్చులు, మొ. వి కడతారు (కో. 17. 24 ; తె. 29, 32, 33, 38, 39, 42).

**టిక్కిడి** పర్యా. చూ. లంకెపీట. దొంగగొడ్డు పరుగెత్తిపోకుండా మోకాళ్ళకు కొట్టుకొనేట్టు మెడకు వేలాడగట్టిన రెండుకొయ్యల పలక. చూ. చిత్రం 57 (కో. 8).

**టొంప** పర్యా. చూ. గుది. దొంగగొడ్లకు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (కో. 43, 45-49, 51); **-కర్ర** పర్యా. చూ. లంకె(పీట). దొంగగొడ్డు పరుగెత్తిపోకుండా మోకాళ్ళకు కొట్టుకొనేట్టు మెడకు వేలాడగట్టిన రెండుకొయ్యల పలక. చూ. చిత్రం 57 (కో. 45).

**తగులు** ఉ. తవులు; చూ. తలుగు (తె. 29, 35, 36).

**తనుగు** ఉ. తన్గు ; చూ. తలుగు (తె. 18-21).

**తమ్మె** రూ. తిమ్మె ; పర్యా. పొనికి. (1) పలుపులో మెడకువేసే భాగం; (2) కొమ్ములకుగాని, మెడకుగాని కట్టే పలుపు (కో. 5, 10, 11, 13, 14, 16, 17, 19, 20; రా. 6, 18).

**తలకుచ్చు(లు)** పర్యా. చూ. పనకుచ్చు(లు). మొగాన వేలాడేట్టు కొమ్ములకు గట్టిన కుచ్చులు. చూ. చిత్రం 54 (కో. 3, 7, 10, 11, 13, 23 ; రా. 8, 18).

**తలగజ్జె(లు)** పర్యా. చూ. పనగజ్జె(లు). ఎద్దుకొమ్ములకు కట్టి నొసటిమీదికి పడేట్టు వేసిన చిరుమువ్వల పట్టెడ (రా. 8, 10, 14).

**తలంటుతాడు** పర్యా. చూ. పనతాడు. అడుగువైపున కొమ్ములు రెంటికి కలిపి నూలు, తోలు, వెంట్రుకలు మొ. వాటితో పేని కట్టే తాడు (కో. 42, 46).

**తలతాడు** పర్యా. చూ. పనతాడు. అడుగువైపున కొమ్ములు రెండింటికి కలిపి నూలు, తోలు, వెంట్రుకలు, మొ. వాటితో పేనికట్టే తాడు (కో. 12, 18, 24, 25 ; తె. 35, 37, 42 ; రా. 9, 10, 14, 18, 24, 26).

**తలుగు** ఉ. తలువు, తగ్లు, తొలుగు ; రూ. తగులు, తనుగు; పర్యా. చూ. పలుపు. పశువుల మెడకువేసే గుంజకు కట్టే తాడు ; మెడతాడు ; (కొన్నిచోట్ల) కొమ్ములకుకట్టే తాడు (కో. 8-11, 47, 48, 50 ; తె. 1-3, 6-8, 11-16, 22-28, 31-34, 42 ; రా. 5-11, 14-16, 18-27).

**తిమ్మె** ఉ. దిమ్మె ; చూ. తమ్మె (తె. 8, 32, 37, 39).

**తిరగాని** పర్యా. చూ. కిరగాని ; ఎద్దుకు కాడిమరపటానికి గానుగమాదిరి అమర్చిన కొయ్య యంత్రం. చూ. చిత్రం 61 (తె. 38).

**తిరుగుడుమాను** పర్యా. చూ. కిరగాని. ఎద్దుకు కాడి మరపటానికి గానుగమాదిరి అమర్చిన కొయ్యయంత్రం. చూ. చిత్రం 61 (రా. 18, 21, 27).

**తుంట** ఉ. తుండ ; పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (తె. 11, 12, 14, 15, 32, 39).

**తొడక** పర్యా. చూ. బొనుగు. దొంగగొడ్డుకు మెళ్ళో కట్టే గంట ; కంచుదిగాని, ఇనపదిగాని, చూ. చిత్రం 59 (కో. 50).

**తొడుపు** పర్యా. చూ. కుప్పె. ఎద్దుకొమ్ముల కొసన అలంకారంగా వేసేది. చూ. చిత్రం 56 (కో. 3, 7).

**తోడా** కాళ్ళకు తొడిగే ఒకరకం పూజలకడియం (కో. 40).

**దామెన** ఉ. దామెర. మందలో ఉన్నప్పుడు ఏదెనిమిది పశువులను కలిపికట్టే పొడుగాటి తాడు. చూ. పలుపు (తె. 9, 10, 19).

**దాయ (-కట్టు)** పాలు తియ్యటానికి తన్నేఆవు కాళ్ళకు కట్టే కట్టు (కో. 16, 20).

**దిసిగంట** మెడకు తగిలించేవారు పట్టెడకు అడుగున ఒక్కటిగావేసిన చిన్నగంట (కో. 26-29, 32-35 ; తె. 40, 41).

**దుక్క** పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (కో. 37, 48, 50).

**దుడ్డు** పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (తె. 13, 16-18, 23, 29).

**దొణ్ణె** ఉ. దొణ్ణి. పర్యా. చూ. గుది. దొంగగొడ్డుకు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (రా. 15-17).

**నగడ** పర్యా. గున్నాబట్ట. కొమ్ములకు అలంకారానికి తొడిగే కాకిబంగారపు రేకు (రా. 8).

**నగుడు** ఉ. నవుడు ; పర్యా. చూ. నాడం. ఎద్దుగిట్టకు అరక్కుండా వేసిన ఇనపబిళ్ళ (కో. 50).

**నడుంవారు** ఉ. నడిమోరు, నడింవారు, నడుమోర ; పర్యా. చూ. బొడ్డువారు. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ ; దీనికి అద్దాలు, కుచ్చులు మొ. వి కడతారు (కో. 4, 14, 18-25, 28, 29, 32, 40, 41; తె. 2, 7).

**నాడం** ఉ. నాడె, నాళం ; రూ. లాడం ; పర్యా. ? నగుడు. ఎద్దు గిట్టలకు అరక్కుండా వేసిన ఇనపబిళ్ళ (కో. 13, 15-17, 20, 24, 28-37, 40, 46-49, 51).

**నాను** (బహు. నాండ్లు, నాన్లు); పర్యా. చూ. గొలుసు. ఎద్దుమెడకు అలంకారంగా వేసే గొలుసు- ఇత్తడిదిగాని, రాగిదిగాని (తె. 13, 18, 22).

**పగ్గం** ఎద్దును అదుపులో పెట్టటానికి, కొమ్ములకు తగిలించి తోలేవాడు పట్టుకొనే తాడు (కో. 2, 3, 5, 6, 9-25, 30, 32, 37, 43; తె. 1-15, 17-26, 28, 29, 32-38, 41, 42; రా. 3-5, 14, 17, 18, 21-24, 26-28).

**పట్టెడ** ఉ. పట్టెడి (బహు. పట్టెండ్లు, పట్టెళ్ళు); పర్యా. మెడారు. ఎద్దుమెడలో అలంకారంగావేసే తోలుపట్టీ; దీనికి మువ్వలు, గజ్జెలు, మొ. వి కడతారు. చూ. చిత్రం 53 (కో. 1, 3-6, 8-19, 21-28, 32, 35, 37, 39, 41, 43, 45, 50, 51; తె. 1, 12, 18, 20, 21, 24, 28, 31, 32, 35-39; రా. 1, 2, 5-9, 11, 14, 22, 26, 27).

**పనకట్టు** పర్యా. చూ. పనతాడు. నూలు, తోలు, వెంట్రుకలు మొ. వాటితో పేని కొమ్ములు రెండింటికి కలిపి కట్టేతాడు. చూ. చిత్రం 54 (తె. 2, 6, 31, 39).

**పనకుచ్చు(లు)** పర్యా. కరిడెకుచ్చు(లు), కొమ్ము కుచ్చు(లు), తలకుచ్చు(లు), పనసుంచు(లు). మొగాన వేలాడేట్టు కొమ్ములకు గట్టిన కుచ్చులు. చూ. చిత్రం 54 (కో. 24, 25, 43, 48; తె. 1, 2, 5-9, 11, 12, 16, 18-24, 26-29, 33-37, 39, 42; రా. 6, 9, 21, 22, 25, 28).

**పనగజ్జె(లు)** ఉ. పొనగజ్జె(లు); పర్యా. కొమ్ము గజ్జె(లు), తలగజ్జె(లు), వడిసె(లు). ఎద్దుకొమ్ములకు కట్టి నొసటిమీదికి పడేట్టు వేసిన మువ్వలపట్టెడ (తె. 2, 3; రా. 6, 9, 11, 12, 15, 18, 21-23).

**పనతాడు** ఉ. పన్తాడు, పొనతాడు; పర్యా. ఒల్లెతాడు. కొమ్ముదాడు, తలతాడు, తలంటుతాడు, పనకట్టు, పనవారు. అడుగువైపున కొమ్ములు రెండిటికి వెంట్రుకలతో పేని కట్టే తాడు; (కొన్నిచోట్ల) దీనికే కుచ్చులు వేలాడకడతారు. చూ. పనకుచ్చులు (కో. 30, 38, 47-49; తె. 10, 11, 22-24, 29, 34, 38; రా. 12, 23, 24, 26, 28).

**పనవారు** ఉ. పనార, పనోరు, పన్నారు; పర్యా. చూ. పనతాడు. అడుగువైపున కొమ్ములు రెండిటికి కలిపి నూలు, తోలు, వెంట్రుకలు, మొ. వాటితో పేని కట్టే తాడు (కో. 25, 31; తె. 5, 9, 12, 25-29, 31-34).

**పనసుంచు(లు)** పర్యా. చూ. పనకుచ్చు(లు). మొగాన వేలాడేట్టు కొమ్ములకు గట్టిన కుచ్చులు. చూ. చిత్రం 54 (తె. 7, 38).

**పన్ను** పర్యా. చూ. కుప్పె. ఎద్దుకొమ్ము(ల) కొసన అలంకారంగా వేసే తొడుపు. చూ. చిత్రం 56 (కో. 21).

**పలుపు** ఉ. పొలుపు; పర్యా. కన్నె, తగులు, తనుగు, తలుగు. పశువుల మెడకువేసి గుంజకుకట్టే తాడు; చూ. చిత్రం 60 (కో. 1-7, 12-26, 29, 30, 32, 33, 36-39, 47-49; తె. 4, 5, 9, 12, 14, 35, 37-42; రా. 1, 5, 8, 14-16, 18, 19, 24).

**పొసికి** పర్యా. చూ. తమ్మె. ? ముడి తగిలించే పలుపు భాగం (కో. 45).

**పీకె** పర్యా. చూ. కుప్పె. ఎద్దుకొమ్ము(ల) కొసన అలంకారంగా వేసే తొడుపు. చూ. చిత్రం 56 (కో. 18, 23; తె. 9, 37).

**పుచ్చె** పర్యా. చూ. కుప్పె. ఎద్దుకొమ్ము(ల) కొసన అలంకారంగా వేసే తొడుపు. చూ. చిత్రం 56 (తె. 18).

**పెన** పర్యా. చూ. లంకె. దొంగపశువు తప్పించుక పోకుండా మంచిపశువుతో కలిపి కట్టే కట్టు (రా. 15, 16, 18).

**పెయ్యపచ్చడం** జనపనులకతో వలమాదిరి అల్లి, కన్ను కన్నుకూ కుచ్చులుకట్టి పండగల్లో ఎద్దువీపుమీద కప్పేది (తె. 15).

**బడితె** ఉ. బడ్తె; చూ. బడె (తె. 25, 42).

**బడె** ఉ. బడి; రూ. బడితె; పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకువేలాడకట్టే బరువుకొయ్య (రా. 4, 6, 8, 14).

**బండకొయ్య** ఉ. బండకొయ, బండగొయ్య; (1) పర్యా. బొండ. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికికట్టే బందం; చూ. లంకెపేట; (2) పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య. చూ. చిత్రం 57 (కో. 5, 11; తె. 27, 28; రా. 1, 25).

**బందం** పర్యా. బోడా. దొంగదానికి ఒకవైపున రెండు కాళ్ళకు కలిపికట్టే కట్టు (కో. 6, 7, 9, 10, 12, 14, 18, 22; తె. 1, 2, 9, 12, 29, 33, 38, 39; రా. 5, 8, 12).

**బందె** బందెలదొడ్డికి తోలిన దొంగగొడ్లకు యజమాని నుంచి వసూలుచేసే సుంకం (కో. 2, 10, 11, 14, 16, 17, 20, 21; రా. 1).

**బందెలదొడ్డి** ఉ. బందిలదొడ్డి. దొంగమేపు మేసే గొడ్లను తోలేచోటు (కో. 2, 10, 11, 14, 16, 17, 20, 21; రా. 1, 17, 18).

**బానగాని** పర్యా. చూ. కిరగాని. ఎద్దుకు కాడిమరప (అలవాటుచెయ్య)టానికి అమర్చిన గానుగమాదిరి కొయ్య యంత్రం. చూ. చిత్రం 61 (తె. 37).

**బాసింగం** ? ఎద్దుమొగంమీద వేలాడేట్టు కట్టిన బిళ్ళ (తె. 15).

**బుట్ట** ఉ. మట్టి (బహు. బుట్టలు, బుట్లు); పర్యా. చూ. చిక్కం. పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికివేసే జల్లిబుట్ట; దీన్ని వెదురుబద్దలు, తాడు, పేము, దూసరతీగె, మొ. వాటితో అల్లుతారు. చూ. చిత్రం 58 (తె. 13, 15,

19, 24, 25, 27).

**బుడ్డాం** పర్యా. చూ. లంకెపీట. దొంగగొడ్డు పరుగెత్తి పోకుండా మోకాళ్ళకు కొట్టుకొనేట్టు మెడకు వేలాడగట్టిన రెండుకొయ్యల పలక. చూ. చిత్రం 57 (కో. 41).

**బురికి** పర్యా. చూ. గవిసెన. పండగల్లో ఎద్దు వీపుమీద కప్పే చిత్రవస్త్రం (రా. 4, 5, 14).

**బొడగ** చూ. బొనుగు (కో. 33).

**బొడ్డువారు** ఉ. బొడ్డారు; బొడ్డోరు. పర్యా. అడ్డానం, జీను, టంగువారు, నడుంవారు. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ; దీనికి అద్దాలు, కుచ్చులు మొ. వి కూడా కడతారు (కో. 2-5, 7-17, 26, 27, 35; తె. 3, 4, 37; రా. 6-8, 10-12, 18, 23-25, 27, 28).

**బొడ్డె** పర్యా. చూ. కుప్పె. ఎద్దుకొమ్ము(ల) కొసన అలంకారంగా వేసే తొడుపు. చూ. చిత్రం 56 (కో. 24).

**బొడ్డెం** పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకువేలాడ గట్టే బరువుకొయ్య (కో. 40).

**బొణుగు** ఉ. బొణగ, బొణ్గు; చూ. బొనుగు (తె. 15, 20, 24-27).

**బొండ** పర్యా. బందకొయ్య (1). దొంగగొడ్డు పరిగెత్త కుండా కాలికికట్టే బంధం (తె. 42).

**బొనుగు(లు)** ఉ. బునగ, బొంగు, బొనగ, బొనిగె, బొనుక, బొన్గ; రూ. బొడగ, బొణుగు; బొనుగుడు(గంట); పర్యా. తొడక, తొడుగు. దొంగగొడ్డుకు మెళ్ళోగట్టే గంట, కంచుదిగాని, ఇనపదిగాని. చూ. చిత్రాలు 53, 59 (కో. 17, 18, 22-25, 30, 31, 34, 36, 38-40, 42; తె. 5, 9, 11, 19, 29-34, 37-39, 42).

**బొనుగుడు(గంటు)** చూ. బొనుగు (కో. 20).

**మడిసెల** ఉ. మడిసె, మడిసేల. దొంగెద్దుకు ఒక కాలు మడిచికట్టే కట్టు (తె. 1, 2, 7-9, 39).

**ముకుచిక్కారు** ఉ. ముకుసిక్కారు, ముకుసిగారు; పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి ఎద్దుమూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (తె. 29, 33).

**ముకుచిలమ** ఉ. ముకుసిలమ, ముగుసెలిమె; పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (తె. 1, 12).

**ముకుబంతి** పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం; ? ముగుదాడు (కో. 1; రా. 1).

**ముక్కుమురికె** పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికితగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (తె. 13, 15).

**ముగుచిక్కం** ఉ. ముగుసిక్కెం; పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికితగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (తె. 32, 35, 36).

**ముగుచింబరమ్** పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (రా. 3).

**ముగుదాడు** ఉ. ముక్కుతాడు, ముగదాడు, ముగుదాడు, మొగదాడు, మొగుదాడు. పెంకెఎద్దును అదుపులో పెట్టటానికి ముక్కులోగుండా దూర్చి కట్టే తాడు (కో. 1-6, 8, 12, 13, 15, 22, 37, 39-41, 44-46, 50; తె. 2, 3-27; రా. 1-3, 6, 8, 10, 11, 16, 18, 22, 25, 28).

**మువ్వ** ఉ. మొవ్వ; రూ. మూగ, మూవ. పెద్దసైజు గజ్జె(లు); వీటిని మెడపట్టెడకు వేస్తారు. చూ. చిత్రం 53 (కో. 2-5, 7, 10-15, 21-29, 33-46, 48-51; రా. 1).

**ముసుగు** పర్యా. చూ. గవిసెన. పండగల్లో ఎద్దువీపు మీద కప్పే చిత్రవస్త్రం (రా. 6, 8).

**మూగ** చూ. మువ్వ (కో. 31; తె. 2-5, 10, 12, 13, 15, 16, 19-21, 27-36, 39, 42; రా. 6, 8, 10, 12, 14, 18, 20, 23, 28).

**మూతిచిక్కం** పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికితగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (కో. 30-32, 34, 44, 46).

**మూతిపుటిక** పర్యా. చూ. చిక్కం. పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికివేసే జల్లిబుట్ట; దీన్ని వెదురు దబ్బలు, తాడు, పేము, దూసరితీగె, మొ. వాటితో అల్లుతారు. చూ. చిత్రం 58 (కో. 50).

**మూతిబుంగ** పర్యా. చూ. చిక్కం. పశువులు మెయ్య టానికి వీల్లేకుండా మూతికివేసే జల్లిబుట్ట; దీన్ని వెదురు బద్దలు, తాడు, పేము, దూసరితీగె మొ. వాటితో అల్లుతారు. చూ. చిత్రం 58 (కో. 41, 51).

**మూతిబుట్ట** ఉ. మూతిబుట్టి, మూతిబుట్టె; పర్యా. చూ. చిక్కం. పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికివేసే జల్లిబుట్ట; దీన్ని వెదురుబద్దలు, తాడు, పేము, దూసరతీగె, మొ. వాటితో అల్లుతారు. చూ. చిత్రం 58 (కో. 1, 37, 38, 40, 46-49; తె. 1, 6, 7, 11, 12, 14, 29, 32, 33, 38; రా. 1).

**మూవ** చూ. మువ్వ (తె. 6, 7, 26, 37, 38; రా. 9, 11, 24, 27).

**మెడగాని** ? పర్యా. చూ. కిరగాని. ఎద్దుకు కాడిమరప (అలవాటుచెయ్య)టానికి గానుగమాదిరి అమర్చిన కొయ్య యంత్రం. చూ. చిత్రం 61 (తె. 39).

**మెడారు** (<మెడవారు); ఉ. మెడోరు; పర్యా. పట్టెడ. ఎద్దుమెడలో అలంకారంగావేసే తోలుపట్టీ; దీనికి మువ్వలు, గజ్జెలు, మొ. వి కడతారు. చూ. చిత్రం 53 (తె. 6; రా. 12, 18-20, 22-25, 28).

**మొద్దు** పర్యా. చూ. గుది. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య (తె. 1, 6-9).

**మోర్కె** ఉ. మోర్కి; పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (తె. 17, 19).

**రుంగు(లు)** పట్టెడకుగట్టే పెద్దమువ్వ(లు). చూ. చిత్రం 55 (కో. 18).

**లంకె** రూ. లెంకె; పర్యా. అరికట్టు, పెన. దొంగ పశువు తప్పించుకుపోకుండా మంచిపశువుతో గలిపికట్టే కట్టు (కో. 16, 21).

**లంకెపీట** రూ. లెంకపీట; పర్యా. టిక్కిడి, టొంప కర్ర, బుడ్డాం, లంపటం. దొంగగొడ్డు పరుగెత్తిపోకుండా మోకాళ్ళకు కొట్టుకొనేట్టు మెడకు వేలాడగట్టే రెండు కొయ్యల పలక. చూ. చిత్రం 57 (కో. 3, 4, 7-18, 21, 22, 24; తె. 1, 3, 5-7, 9, 11, 12, 13-24, 32-39, 42).

**లంపటం** పర్యా. చూ. లంకెపీట. దొంగగొడ్డు పరుగెత్తిపోకుండా మోకాళ్ళకు కొట్టుకునేట్టు మెడకు వేలాడగట్టిన రెండుకొయ్యల పలక. చూ. చిత్రం 57 (కో. 39).

**లాడం** ఉ. లాలం; చూ. నాడం (కో. 3, 6-11, 14; రా. 18).

**లెంకపీట** ఉ. లెంకెపీట (కో. 26; తె. 12, 25-28, 34-36).

**లెంకె** చూ. లంకె (తె. 6, 9, 12).

**లోటారం** పర్యా. కప్పెర. దొంగగొడ్డు మెళ్ళోకట్టే కొయ్యగంట; (కొద్దిచోట్ల) ఇనపగంట (తె. 17-27).

**లోడుగు(లు)** ఉ. లుడుగు, లోడగు; పర్యా. చూ. బొనుగు. దొంగగొడ్డుకు మెళ్ళోకట్టే గంట; కంచుదిగాని, ఇనపదిగాని. చూ. చిత్రం 59 (కో. 6, 7, 10, 11, 13, 16, 26-29, 31-36; తె. 40).

**వంగాలు** (? <వంగు + కాలు); పర్యా. కాలుమెడ. దొంగగొడ్డుకు కాలికీ మెడకూ వేసే బంధం (తె. 5-10; రా. 4, 13-15, 16, 28).

**వడిసె(లు)** ? పర్యా. చూ. పనగజ్జె(లు). ఎద్దుకొమ్ములకు కట్టి నొసటిమీదికి పడేట్టు వేసిన చిరుమువ్వల పట్టెడ (కో. 41, 45).

**వారకాని** ఒక అల్లరిఎద్దును మరిరెండు మంచిఎద్దులతో కలిపికట్టే కాడి (తె. 38).

**సరిగె** ఎద్దుకాలుకు అలంకారంగా పేని వేసే వరిగడ్డి కడియం (రా. 16, 18, 22).

**సరిపెణ** పర్యా. చూ. గొలుసు. ఎద్దుమెడకు అలంకారంగా వేసే గొలుసు (రా. 15, 16).

**సిగమోర** ఉ. సిగమూర, సిగమూరు, సిగమోరు; పర్యా. చిక్కుతాడు, చిటిమూరుతాడు, చింబోర, చిలమరక, చిలముకుదాడు, చిలమోర, ముకుచిక్కారు, ముకుచిలమ, ముకుబంతి, ముక్కుమురికె, ముగుచిక్కం, మూతిచిక్కం, మోర్కె, సిరిముట్టె. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (కో. 2-6, 8, 11, 13-25, 27-29, 35, 37, 47, 48, 50; తె. 37, 39, 42; రా. 9, 11, 27).

**సిరిముట్టె** పర్యా. చూ. సిగమోర. తాడుతోగాని తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. చూ. చిత్రం 55 (కో. 33, 36).

**సుంచు(లు)** పర్యా. కుచ్చు(లు). ఎద్దకొమ్ములకు అలంకారంగా వేసే కుచ్చు(లు) (తె. 7, 38).

## 5. వ్యాధులు

**అమిరె** ఉ. అవిరె; రూ. అయిరు. కంటిజబ్బు; రెప్ప వ కొయ్యకంత పెరిగి, కన్ను ఎర్రబడి నీళ్ళుకారుతుంది . 13, 16, 20, 24, 31; తె. 37; రా. 17, 18).

**అయిరు** చూ. అమిరె (కో. 11, 20).

**అగ్రు** రూ. అరు; పర్యా. చూ. కన్నగ్రు. మెడమీది ము: ఇది మానుతూ సెలవేస్తూ ఉంటుంది (కో. 3, 31, , 36, 37; తె. 37, 41; రా. 13).

**అసినెమరు** పర్యా. చూ. అసిమేపు. మేత కొద్దిగా మెయ్యటం; చాలారకాల జబ్బులకు ఇదొక లక్షణం . 25).

**అసిమేత** పర్యా. చూ. అసిమేపు. మేత కొద్దిగా మెయ్యటం; చాలారకాల జబ్బులకు ఇదొక లక్షణం . 24).

**అసిమేపు** పర్యా. అసినెమరు, అసిమేత. మేత కొద్దిగా మెయ్యటం; చాలారకాల జబ్బులకు ఇదొక క్షణం (కో. 10).

**ఆరు** చూ. అగ్రు (రా. 20).

**ఆరె** దవడ వెంబడి ఉబ్బటం (కో. 23).

**ఇపిరి** ముందరి కాళ్ళవాపు (రా. 1).

**ఇసువాయువు** ఉష్ణరోగం; మూత్రమార్గానికి నిరోధ ర్పడుతుంది; చూ. ఉచ్చకల్లు (కో. 20).

**ఇసర** (? <విసరు) ఒకరకం తిక్క; ఒంటిమీద గుల్లలు వుతాయి: గొడ్డు ఊరికే పిచ్చిగా తిరుగుతుంది (కో. 1, 48).

**ఈరవకుట్టు** ఒకరకం కడుపునొప్పి (కో. 1).

**ఈసెన** పశువు ఎండిపోయి, నీరసించిపోతుంది; చూ. సల(రోగం) (కో. 3).

**ఉలిగిడి** పర్యా. నాము. కొన్నిరకాల లేతజొన్న న్నలు. ఆ ముదపాకసలు తినటంవల్ల వచ్చే వ్యాధి; ణం. కడుపుబ్బు. ఊపిరిపీల్చుకోటంలో బాధ ఉంటాయి కో. 6, 10, 12, 14, 18, 19, 21-25, 28; తె. 8-40, 42).

**ఉచ్చకల్లు** ఉష్ణవ్యాధి; మూత్రమార్గానికి రాయి అడ్డం డుతుంది (కో. 11, 16, 20).

**ఉంతె** (-పోవు) కాలికి దెబ్బదగిలి కీలుతప్పటం (తె. 5).

**ఉపరివాపు** ఉ. ఉపరోపు, ఉపిరోపు. నీరుజబ్బు; వాలుకింద నీరుదిగి ఏర్పడే వాపు (కో. 14, 20).

**ఉబ్బరం** చూ. ఉబ్బు (కో. 22).

**ఉబ్బు** రూ. ఉబ్బరం; పర్యా. చూ. ఊద. కడు ఉబ్బటం (రా. 16).

**ఉయ్యాలరోగం** ? దొమ్మలో ఒకరకం; చూ. దొమ్మ (కో. 50).

**ఉరిడిపోటు** రూ. ఒరుడుపోటు. తోక వెంట్రుకలు రాలిపొయ్యే వ్యాధి (కో. 49, 50).

**ఊదు** ఉ. ఊద; పర్యా. ఉబ్బరం, ఉబ్బు. (1) పాండు రోగం; ఒళ్ళంతా ఉబ్బుతుంది; (2) కడుపు ఉబ్బటం (కో. 6, 10, 11, 13, 14; రా. 13, 18).

**ఊదువట్టు** బీజంవాపు (తె. 1, 2, 38, 39).

**ఎటికపాము** కడుపులో పుట్టే జబ్బు పురుగు; అజీర్ణ రోగలక్షణం (తె. 1).

**ఎండువాతం** ఉ. ఎండివాతం, ఎండోతం. మేత మెయ్యక చిక్కిపోవటం; మలబద్ధకం (కో. 14, 20, 24, 51).

**ఎదల** ఉ. ఎదలు; చూ. ఎసల (కో. 12; తె. 29, 33).

**ఎదురుకుతికె** ఒకరకం కంఠరోగం; గవదలు వాస్తాయి (తె. 34).

**ఎదురుపుటక** మెడమీద కానేకాయ; పంవర భేదం కావచ్చు. చూ. పంపర (రా. 12).

**ఎర్రసంకటం** ఒకరకం తిక్కరోగం (కో. 44).

**ఎసల** ఉ. ఎస్సల; రూ. ఎదల. గుండెజబ్బు; ఎగరొప్పు (తె. 1-3, 6-10, 39).

**ఎళనాగర** ఒంటిమీద గడ్డలులేవటం (రా. 17).

**ఏనుగగజ్జి** ఉ. ఏనిగ్గజ్జి, ఏనుగ్గజ్జి. దూడలకు, బర్రెలకు ఎక్కువగావచ్చే చర్మవ్యాధి; లక్షణాలు: దురద, పుండ్లు, చర్మం చెక్కలు చెక్కలుగా లేచిపోవటం (కో. 1, 16, 20-22, 37, 48, 49).

**ఒరుడుపోటు** చూ. ఉరిడిపోటు (కో. 44).

**ఔటు** చూ. కౌట (తె. 26).

**కటికరోగం** నెత్తురు పారుకొనే జబ్బు. చూ. ముసర (రా. 15).

**కట్టుగుది** తేలికరకం కీళ్ళజబ్బు; ఎద్దు నడిచేముందు కొద్దిదూరం వెనక్కాళ్ళు కుంటుతూవెళ్ళటం; చూ. మందగుది (కో. 37, 47).

**కట్టుతెవులు** నెత్తురు పారుకొనే జబ్బు, చూ. ముసర (రా. 4, 7).

**కడుపుకుట్టు** పర్యా. కడుపునొప్పి. ఒక రోగలక్షణం; కడుపులో నొప్పి (కో. 2, 3, 8).

**కడుపునొప్పి** పర్యా. కడుపుకట్టు. ఒక రోగలక్షణం; కడుపులో కుట్టు (కో. 46, 51; తె. 1-4, 14, 23-31).

**కణితి** రూ. కంతి. ఒంటిమీద ఎక్కడైనా బుడిపెలాగా

ఏర్పడే లావాటి గుల్ల ; ప్రమాదంలేదు, చూ. బిళాదీ (కో. 13).

**కంటిపువ్వు** కంట్లో కాయ కాయటం (కో. 41 ; తె. 14).

**కంటిపొర** కంటి గుడ్డుమీదికి పొర అడ్డంవచ్చేవ్యాధి (కో. 2).

**కనిపిరికి** ఒకరకం మూర్ఛరోగం ; లక్షణాలు : తల తిప్పుడు, కళ్ళారుస్తూ సొరిసిపడటం (కో. 4-6, 11, 16).

**కనుమసి** ఉ. కనుముసి; రూ. కనుమిసిరి, కన్నెమిసె. కళ్ళు చీకట్లుకమ్మి పశువు గిర్రునతిరిగి చచ్చిపోయే జబ్బు (తె. 29, 34).

**కనుమిసిరి** చూ. కనుమసి (తె. 32).

**కంతి** చూ. కణితి (కో. 37).

**కందిమెడ** పర్యా. చూ. కన్నర్రు. అర్రు(మెడ)మీది పుండు ; అంగుళం వెడల్పు రంధ్రం ఏర్పడి ఉండుండి నెత్తురు కారుతుంటుంది (తె. 4).

**కన్నమెడ** పర్యా. చూ. కన్నర్రు. అర్రు(మెడ)మీది పుండు : అంగుళం వెడల్పు రంధ్రం ఏర్పడి ఉండుండి నెత్తురు కారుతుంటుంది (తె. 3).

**కన్నర్రు** ఉ. కన్నర, కన్నరు ; పర్యా. అర్రు, అరు, కందిమెడ, కన్నమెడ, గంటర్రు, పోటర్రు. అర్రు(మెడ) మీది పుండు ; ఒక అంగుళం వెడల్పు రంధ్రం ఏర్పడి ఉండుండి నెత్తురుకారుతుంటుంది (కో. 3, 6, 8, 11, 14, 16-18, 21, 22, 24 ; రా. 14, 16).

**కన్నెమిసె** చూ. కనుమసి (తె. 31).

**కప్పనాగర** ఉ. కంపనాగరి ; చూ. కప్పనామర (తె. 7, 11).

**కప్పనామర** రూ. కప్పనాగర. నాముజబ్బు లక్షణం; నాలుక గరుకెక్కటం ; నోటివెంబడి చొంగ. చూ. నాము (కో. 10).

**కప్పనాలికె** నాలిక కింద బొబ్బలు (కో. 11).

**కర్నెపొడి** ఉ. కన్నెపుడి, కర్నపొడి, కర్నెపుడి. కడుపుబ్బి, పేడ వెయ్యకపోవటం (తె. 10, 11, 14, 15).

**కల్లవాపు** పొదుగు, గంగడోలుమీది వాపు (కో. 20).

**కసిమిరి** రూ. కసిరె. ఒకరకం చర్మరోగం ; ఒళ్ళు దురద, గొడ్డు ఎండలో నిలవలేకపోవటం (కో. 24, 25 ; తె. 31).

**కసిరె** చూ. కసిమిరి (తె. 1).

**కాకిచిమ్మ** పర్యా. కాకిరోగం. మూర్ఛరోగం ; పశువు నడుస్తూ నడుస్తూ పడిపోతుంది (కో. 51).

**కాకిరోగం** పర్యా. కాకిచిమ్మ. మూర్ఛరోగం ; పశువు నడుస్తూ నడుస్తూ పడిపోతుంది (తె. 4).

**కారుబ్బు** కడుపుబ్బటం ; దొమ్మలక్షణం కావచ్చు. చూ. దొమ్మ (తె.).

**కాలసంచ** 'సంచ' అనే జబ్బు ; గిట్టల్లో పురుగులు పడతాయి ; చూ. సంచ (కో. 46-49).

**కాలిగాలి** కాళ్ళకి పుండ్లు ఏర్పడే జబ్బు, చూ. గాలి (తె. 42).

**కాలివప్పె** నోటికి, కాళ్ళకు పుండ్లు ఏర్పడే జబ్బు, చూ. సంచ (రా. 3).

**కాలుమడి** మూత్ర నిరోధం కలిగే జబ్బు, చూ. ఉచ్చకల్లు (కో. 16, 24).

**కాశీరోగం** ఒకరకం ఉష్ణరోగం ; మూత్రం ఎర్రగా వస్తుందట (కో. 25).

**కాసనామర** పర్యా. కాసె. "కాసెగడ్డి" తినటంవల్ల వచ్చే నాముజబ్బు, చూ. నాము (కో. 10).

**కాసె** పర్యా. కాసనామర. "కాసెగడ్డి" తినటంవల్ల వచ్చే కడుపుజబ్బు (కో. 8, 9 ; తె. 30).

**కీలుమండె** మోకాళ్ళ దగ్గర గడ్డ (కో. 24).

**కీల్జెట్టు** కీళ్ళకు, గిట్టలకు వచ్చే ఒకరకం జబ్బు ; చురకలు వేస్తారుట (తె. 28).

**కీళ్ళవాతం** మోకాళ్ళవాపు ; కాళ్ళు పట్టుకుపోతాయి (కో. 17, 20).

**కుండి(జైద్యం)** ఒకరకం అంటురోగం ; కాలికి నోటికి పుండ్లు ఏర్పడతాయి, చూ. గాలి (తె. 1, 2, 35, 36 ; రా. 4).

**కుతికవాపు** ఉ. కుతికాపు, కుతికోపు. గొంతువాపు (కో. 1, 9, 25, 39 ; రా. 1).

**కుందు** ఉ. కుంది. లక్షణాలు : కడుపుబ్బు, కాలికుంటు, వణుకు (తె. 4, 39 ; రా. 2, 4, 5, 7, 12-18, 20).

**కుందేటివెర్రి** ఒకరకం నరాలజబ్బు ; లక్షణాలు : గిరగిర తిరగటం, గోడలకి గుంజలకి తల మోటించటం, నోటివెంబడి చొంగ, కండ్లవెంబడి నీరు, బిత్తరి చూపులు (కో. 20, 24 ; తె. 39).

**కురమ** ఉ. కురం, కురము, కురుము, కుర్మ, కుర్రం. లక్షణాలు : వణుకు, జ్వరం, కడుపుబ్బు, ఒళ్ళు ఓగుసుకుపోవటం, నోటివెంబడి చొంగ ; పశువు గడ్డి తినదు, నడవలేదు ; 'అమ్మవారు' జబ్బు అనికూడా అంటారు ; కొన్ని రకాలకు మూడురోజులు దాటితే పశువు బతుకుతుందట (కో. 2, 3, 7-31, 36, 38-44, 47 ; తె. 2-6, 9, 10, 13, 14, 16, 21, 26-29, 31, 33, 36-39, 42 ; రా. 2, 3, 6-8, 10-13, 18, 20-28) : భేదాలు : **-ఊదు** కడుపులో పోసే పోత (రా.) ; ఏనిగ- దగ్గు, నాలుగుకాళ్ళు బిగదీసుకొని పోవటం ; పశువు చచ్చిపోతుంది (కో. రా.) ; **కుంటి-** కాళ్ళకు వచ్చే కురమ, చూ. ఏనిగ-

(తె.) ; **కుండి-** ? చూ. కుంటి- (రా.) ; **చలి-** వణుకుతో వచ్చే కురమ (కో. రా.); **తిమ్మిరి-** కాళ్ళు బిగదీసుకుపోయి నడవలేకపోవటం (కో.) ; **నాస-** ? దీర్ఘవ్యాధిగా నిలిచి పోయే కురమ (రా.) ; **పంది-** గొంతులో గురక (కో.) ; **బండ-** ? చూ. నాస- (రా.); **బొంత-** నోటివెంబడి నురుగు, పాకులాడుతూ నడవటం (కో.) ; **మబ్బు-** గొడ్డుకళ్ళు చీకట్లు కమ్మటం (తె.) ; **వాత-** చూ. తిమ్మిరి- (కో.).

**కు(్రమిల్లి** జలుబు (రా. 1).

**కొండలజబ్బు** జెబ్బవాపు (కో. 31).

**కొమ్ముగురిసె** చూ. కొమ్ముగొడిసె (కో. 5).

**కొమ్ముగొడిసె** ఉ. కొమ్ముగుడిసె; రూ. కొమ్ము గురిసె, కొమ్ముగొరిజె, కొమ్ముగొలుసు ; పర్యా. కొమ్ము డొల్ల, కొమ్ముపరి, కొమ్మువాలుడు. కొమ్మల్లో పురుగుపడి తొలవటం ; ముక్కువెంబడి నీళ్ళు ; మాదలో ఒకరకం కావచ్చు. చూ. మాద (కో. 3, 6, 8–10 ; తె. 39).

**కొమ్ముగొరిజె** చూ. కొమ్ముగొడిసె (కో. 25 ; తె. 31).

**కొమ్ముగొలుసు** చూ. కొమ్ముగొడిసె (కో. 14, 15, 28, 29, 33 ; తె. 40, 41).

**కొమ్ముడొల్ల** పర్యా. చూ. కొమ్ముగొడిసె. కొమ్మల్లో పురుగులు పడి తొలవటం ; ముక్కువెంబడి నీళ్ళు, చూ. మాద (కో. 13, 16, 18, 20, 21, 23, 36).

**కొమ్ముపరి** పర్యా. చూ. కొమ్ముగొడిసె. కొమ్మల్లో పురుగులుపడి తొలవటం ; ముక్కువెంబడి నీళ్ళు, చూ. మాద (తె. 34).

**కొమ్మువాలుడు** పర్యా. చూ. కొమ్ముగొడిసె. కొమ్మల్లో పురుగుపడి తొలవటం ; ముక్కువెంబడి నీళ్ళు, చూ. మాద (తె. 23 ; రా. 24).

**కొరుకుడు** మామూలుగా దూడలకువచ్చే తెగులు ; పేనుకొరికి పడెలు పడెలుగా బొచ్చూడిపోవటం (కో. 22).

**కొట** ఉ. కొటు ; రూ. ఔట. కాలు బిగదీసుకుపోవటం; పశువు నడవలేదు (కో. 9 ; తె. 4, 9, 10).

**గంగవె(్రి** ఒకరకం నరాలజబ్బు ; చూ. కుందేటివె(్రి (కో. 18).

**గంటె(్రు** (<గంటి+అ(్రు); పర్యా. చూ. కన్నె(్రు. అ(్రు (మెడ)మీది పుండు ; అంగుళం వెడల్పున రం(్ధం ఏర్పడి ఉండుండి నెత్తురు కారుతుంటుంది (కో. 21, 22).

**గాగపొట్టు** కళ్ళల్లో చీముగారే పుండు (కో. 33).

**గాడ్పు** చూ. గాలి (కో. 44).

**గాలి** రూ. గాడ్పు. ఒకరకం అంటురోగం ; నోట్లోను, గిట్టల సందున పుండ్లు (కో. 1–8, 10–17, 19–25 ; తె. 1, 3–5, 7, 10, 14–28, 36–39, 42 ; రా. 1, 6–10, 12, 13, 15, 16, 18, 20–22, 24, 25, 28); **-కుంటు** గిట్టల్లో పురుగులుపడి నడవలేకపోవటం (కో. తె.) ; **-కుండు** చూ. గాలికుంటు (రా.).

**గుడ్లతెవులు** గుడ్లుగుడ్లుగా ఏర్పడే పుండు; పుట్టరణం; మాదభేదం (రా. 16, 28).

**గుండెచేర్లు** ఉ. గుండెశే(్లు. ఎదు(్రొమ్ము పైకి ఉబ్బుతుంది ; చూ. దొమ్మ (తె. 19).

**గుండెముక్కర** చూ. గుండెముక్కు (తె. 6).

**గుండెముక్కు** ఉ. గుండెముక్కు ; రూ. గుండె ముక్కర. ఒకరకం గుండెజబ్బు ; నెరిడె (నురుగుదబ్బ) ఉబ్బటంవల్ల వస్తుందట ; పశువు అకస్మాత్తుగా విలవిల తన్నుకు చస్తుంది ; చూ. నెరిడె (కో. 9, 13, 14, 18 ; తె. 7, 8, 11, 37, 38).

**గుండెవాపు** లక్షణాలు : రొమ్మువాపు, ఊపిరాడదు, నీళ్ళు, మేత ముట్టదు ; చూ. గుండెముక్కు (కో. 31 ; తె. 5, 12, 15, 17, 23, 26, 28, 29, 31, 33, 34, 38 ; రా. 11).

**గుదిపెట్టు** రొమ్మువాపు ; నెలరోగంలో ఒకరకం ; చూ. నెల (కో. 4–8, 15, 16).

**గురక** ఉ. గురుక, గురుకు. మామూలుగా నల్లగొడ్లకు వచ్చేజబ్బు ; గొంతువాపు, లోపలగు(్రు, నోటివెంబడి చొంగ (కో. 5, 7, 10, 17, 19, 20, 23 – 25 ; తె. 17, 29, 38–42).

**గు(్రపుకొంకి** కాలిమడత వెనకవైపు వాచి, కాలు బిగదీసుకుపోవటం (తె. 9).

**గూటిగడ్డ** జెబ్బమీద గడ్డ (కో. 5).

**గూటిబిళ్ళ** దవడలకింద వాపు; గవదబిళ్ళలు (కో. 9).

**గొరసగాలి** గిట్టల్లో పురుగులుపడి గొడ్డు నడవలేకపోవటం ; చూ. గాలి (కో. 1 ; రా. 1).

**గొల్లెతం** డెక్కలుపుచ్చి ఊడిపోవటం ; చూ. గొరిసెగాలి (తె. 31).

**గౌదవాపు** కుతికకింద వాయటం (కో. 31).

**చచ్చుగూడ** ఒకరకం పక్షవాతం ; ముందుకాళ్ళు పట్టుకపోతాయి (కో. 11).

**చచ్చుదవడ** దవడలకు వచ్చే వాతరోగం (కో. 3).

**చట్టు** ? గూడవాపు (తె. 17, 25).

**చలిచెడుసు** ఒకరకం నరాలజబ్బు ; పోతూపోతూ గి(్రునతిరిగి పడిపోవటం ; వె(్రిచూపు (కో. 10).

**చలిదౌడ** పంటినొప్పి (తె. 34, 42).

**చవుటగుల్ల** గిట్టలసందున పుండు (తె. 37).

**చిటికాలు** కాలుజాడించికాని నడవలేకపోవటం ; చూ. మందగుది (తె. 3).

**చీడ(పొర)** నెత్తురు పారుకొనేజబ్బు ; చూ. ముసర (కో. 11, 12 ; తె. 38, 39, 41, 42 ; రా. 27).

**చెడవాపు** ఉ. చెడాపు, నెడాపు. చెంపలు వాయటం (తె. 30, 35, 38).

**చెదలకొమ్ము** గేదెలకు వచ్చే కొమ్ముడొలుపు; కొమ్ముల్లో పురుగుపడి తొలుస్తుంది; చూ. కొమ్ముగొడిసె, మాద (కో. 22).

**చేరువాపు** మూత్రావయవం మీద గుల్ల లేర్పడి వాయటం (తె. 38).

**జడుపు** ఒకరకం అంటురోగం; కాలిగిట్టల్లో పురుగులు; నోటివెంబడి చొంగ, జ్వరం; చూ. గాలి (కో. 38, 42–44, 46, 48); -గాటు చూ. జడుపు (కో.).

**జరక** చూ. సరక (రా. 26).

**జరుపు** చూ. సరక (రా. 4, 16).

**జింకరోగం** ఒకవిధమైన నరాలజబ్బు; వెర్రి; చూ. కుందేటివెర్రి (తె. 4, 12, 14).

**జీనగ(రోగం)** చూ. జీలిగె(రోగం) (రా. 10).

**జీలిగె(రోగం)** రూ. జీనగ(రోగం). జీర్ణకోశవ్యాధి; లక్షణాలు: పొట్టఊదుడు, పేడవెయ్యకపోవటం, కృశించిపోవటం (కో. 10; తె. 7–9, 14, 37).

**జెబ్బకుంట** పర్యా. చూ. జెబ్బవాపు. ముందరిగూడలు వాయటం (తె. 6).

**జెబ్బవాపు** ఉ. జెబ్బాపు, జెబ్బోపు; రూ. సప్పవాపు; పర్యా. జెబ్బకుంట. ముందరిగూడలు వాయటం (కో. 25, 28–30, 32, 35, 36, 39, 40, 44, 46, 50; తె. 6, 9, 12, 13, 19, 20, 22–28, 30-34, 39, 40, 42; రా. 18).

**జెర్రిపోటు** కాలిగుత్తి (పిల్లగిట్టలదగ్గర) వాయటం; చూ. కౌట (కో. 46, 50).

**జెలగరోగం** క్రమంగా కృశించిపొయ్యే జబ్బు (కో. 9).

**జొమ్మ** ఉ. జుమ్మ, జుమ్మా, జొమ్ము; చూ. దొమ్మ (కో. 37, 38, 40, 41, 44, 46, 48, 50, 51).

**జోలుమెడ** ? మెడకింది తోలు పల్చబడి వేలాడటం (తె. 3).

**డెక్కజడుపు** గిట్టల్లో పురుగులు పడటం; చూ. గాలికుంటు (కో. 40, 42).

**డెక్కపుచ్చు** గిట్టల్లో పురుగులుపడటం; చూ. గాలికుంటు (కో. 45).

**తలనాదు** ఈనిన నెలలోపల ఆవుకు వచ్చే జబ్బు; నొప్పితో తల వేలబడిపోతుంది (కో. 16).

**తలపిరికె** ఒకరకం నరాలజబ్బు; చూ. కుందేటివెర్రి (కో. 11).

**తసులు** ఒకరకం దగ్గు (తె. 4).

**తాటాకుజబ్బు** ? పాండురోగం (కో. 29).

**తిక్క** తలతిరుగుడురోగం (కో. 51; తె. 30, 32, 37, 42).

**తిప్పసంకటం** కట్టుగొయ్యచుట్టూ పిచ్చెత్తినట్టు తిరగటం (కో. 37).

**తిమ్మిరివాతం** కాళ్ళు పట్టుకపోవటం (కో. 23).

**తిరుగుడు(రోగం)** కట్టుగొయ్యచుట్టూ పిచ్చెత్తినట్టు తిరగటం (తె. 25).

**తీపు** ఉ. తీపి. దూడలకువచ్చే రోగం; లక్షణాలు: కాళ్ళ పీకుడు, మెడ తిరిగిపోవటం (కో. 24; తె. 34).

**తుమ్ము** ముక్కులో బంతిలాగ గడ్డకట్టటం; ఎక్కువగా తుమ్ములు; చూ. ముగబంతి (తె. 23–28).

**తొక్కుడి** నెత్తురు పారుకొనే రోగం.

**తొండగిరి** చర్మంమీద పొక్కులు (రా. 13, 18).

**తొండ(రోగం)** తోక వెంట్రుకలు రాలిపోవటం; తోకమాద, చూ. మాద (కో. 45; తె. 31, 34).

**తోకగురుజు** చూ. తోకగొడిసె (కో. 17, 18, 22, 23, 25, 26; తె. 40).

**తోకగొడిసె** ఉ. తోగ్గుడిసి, తోగ్గుడిసె; రూ. తోకగురుజు, తోకగొలుసు; పర్యా. తోకతెవులు, తోకపేను. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించిపోవటం (కో. 3, 4, 7, 8, 10, 11; తె. 37).

**తోకగొలుసు** చూ. తోకగొడిసె (కో. 13, 16, 20).

**తోకతెవులు** పర్యా. చూ. తోకగొడిసె. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించిపోవటం (తె. 5).

**తోకపేను** పర్యా. చూ. తోకగొడిసె. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించిపోవటం (కో. 33, 36).

**దంతలూటి** పన్నుచుట్టూ లేచే పుండు (తె. 37).

**దబ్బ** చూ. దొమ్మ (తె. 16, 40).

**దబ్బరికం** రూ. దబ్బలకం, దబ్బుడకం. ముందరికాళ్ళకు వచ్చే కీళ్ళవాపు (కో. 20).

**దబ్బలకం** చూ. దబ్బరికం (కో. 9).

**దబ్బుడకం** చూ. దబ్బరికం (తె. 18).

**దమ్ము** చూ. దొమ్మ (తె. 27, 28).

**దుసల** రూ. దూసడ. పారుడురోగం; చూ. ముసర (రా. 5, 6, 8).

**దూలగొమ్ము** కొమ్ములను పురుగు తొలవటం; కొమ్ము మాద కావచ్చు; చూ. మాద (కో. 33).

**దూలవాపు** జెబ్బవాపు (తె. 29).

**దూసడ** చూ. దుసల (రా. 7).

**దేవరసరుగు** ఒకరకం పారుడురోగం (తె. 4).

**దొబ్బ** చూ. దొమ్మ (తె. 5, 8, 13, 14, 17–19, 21).

**దొమ్మ** రూ. జొమ్మ, దబ్బ, దమ్ము, దొబ్బ, సొమ్మ. ఊపిరితిత్తుల జబ్బు; లక్షణాలు: శ్లేష్మం, గొంతు పట్టు

కోటం, ఊపిరికట్టు, ఎగపోత; ప్రమాదకరమైన వ్యాధి (కో. 1–5, 7, 11, 12, 14, 15, 18, 20–25, 27–36, 47, 48; తె. 1, 2, 4, 7–13, 17, 19, 20, 22–27, 29–31, 33–39, 41, 42; రా. 1, 5, 7, 10–12, 18, 20, 23, 24, 27, 28); -కుట్టు దొమ్మవల్ల కడుపుబ్బు (రా.); -నెరిడె దొమ్మలో ఒకరకం; నెరిడె (నురుగుదబ్బ) ఉబ్బుతుంది (కో.); -ముసర దొమ్మలో రక్తం పారుకోటం (రా.); -సెల ఉ. దొమ్మశల. దొమ్మలో గుండెపట్టుకుపోవటం (రా.); ఇతరభేదాలు: **ఉడుకు-** దొమ్మలో జ్వరం (తె.); **ఉబ్బు-** దొమ్మలో కడుపుబ్బరం; పశువు చచ్చిపోతుంది (తె.); **ఎర్రగుండె-** మూడు గుండెల్లోను ఒకటి (ఎర్రది) వాయటంవల్ల వచ్చే దొమ్మ (కో.); **ఎర్ర-** ఉ. ఎరదొమ్మ. నెత్తురు కక్కటం (కో. తె.); **గుడి-** (తె.); **గుడ్ల-** లక్షణం: గుండెల్లో గుడ్లు గుడ్లుగా పుండు పెరుగుతుందట; మాదకావచ్చు (కో.); **గుంటె-** (కో.); **గూటి-** కృశత్వం, రొప్పు, ఎగపోత ఎక్కువగా ఉన్న దొమ్మ; ? క్షయ (కో.); **చలి-** ఉ. చల్దొమ్మ. వణుకుతోవచ్చే దొమ్మ (కో. తె. రా.); **డుబ్బ-** (తె.); **నల్లగుండె-** మూడు గుండెల్లోను ఒకటి (నెరిడె, నల్లగుండె) వాయటంవల్ల వచ్చేది (కో.); **నార-** దొమ్మరకం; ఇది వచ్చిన గొడ్డు నిదానంగా చస్తుందట; లక్షణాలు: మొగం నల్లకప్పు వెయ్యటం; ముట్టెవెంబడి చొంగ, ఒళ్ళు చలవకురావటం (తె.); **నాలి-** ఉ. నాల్దొమ్మ; చూ. **నార-** (కో. తె.); **నావురు-** ? నాము తినటంవల్ల వచ్చేది (కో.); **నీటి-** నిలవఉన్న గడ్డి తినటంవల్ల వచ్చేది; మూత్రం ఎక్కువ, ఒళ్ళు చల్లబడుతుంది (కో.); **నీరు(డు)-** చూ. నీటి- (రా.); **నెత్తురు-** ఉ. నెత్రు- నెత్తురు కక్కటం లక్షణంగా వచ్చే దొమ్మ (తె.); **పాల-** ? దూడలకు వచ్చేది (తె.); **పిడక-** ఉ. పిడికె-, పిరక- (తె.); **బుర్ర-** (తె.); **మిడి-** లక్షణం; తిరుగుతూ తిరుగుతూ గొడ్డు చచ్చిపోతుంది (కో. రా.); **మురికి-** లక్షణం: నోటి వెంబడి చొంగ (కో.); **రేక-**లక్షణం: కడుపుబ్బు, హఠాత్తుగా చావు (కో.); **వాతపు-** లక్షణాలు: కీళ్ళు పట్టుకుపోవటం, దగ్గు (కో.); **సిక-** ఉ. సుకి-; చూ. **చలి-** (తె.).

**దొరుడుపోటు** గాలిగుత్తి వాయటం; చూ. జెర్రిపోటు (కో. 44).

**ధనుర్వాయి** ఒకరకం వాతరోగం; నడ్డి నీలుక్కుపోతుంది (తె. 34).

**నక్కమోరు** మూత్రావయవం వాపు (కో. 46).

**నక్కవగురు** ఉ. నక్కొగురు. ఒకరకం ఊపిరితిత్తుల జబ్బు (తె. 5).

**నంజు** నీరుజబ్బు; గంగడోలు కిందికి నీరు దిగుతుంది (కో. 24; తె. 5, 31).

**నముళ్ళు** (బహు.) మోకాళ్ళ వాపు (తె. 17).

**నలపాటిరోగం** పశువు కృశించే జబ్బు (తె. 12).

**నల్లపిప్పి** పర్యా. చూ. నల్లపట్టు. లక్షణాలు: ఒళ్ళునల్లకప్పు వెయ్యటం; అనిమేపు; పారుకోటం (కో. 3).

**నల్లబంటు** చూ. నల్లవట్టు (తె. 26).

**నల్లబాటు** చూ నల్లవట్టు (తె. 23).

**నల్లమట్టు** చూ. నల్లవట్టు (కో. 25).

**నల్లమబ్బు** పర్యా. చూ. నల్లవట్టు. లక్షణాలు: ఒళ్ళు నల్లకప్పు వెయ్యటం; అనిమేపు; పారుకోటం (కో. 36, 37).

**నల్లమారి** పర్యా. చూ. నల్లవట్టు. లక్షణాలు: ఒళ్ళు నల్లకప్పువెయ్యటం; అనిమేపు; పారుకోటం (కో. 38).

**నల్లవట్టు** రూ. నల్లబంటు, నల్లబాటు, నల్లమట్టు, నల్లవాటు; పర్యా. నల్లపిప్పి, నల్లమబ్బు, నల్లమారి. లక్షణాలు: ఒళ్ళు నల్లకప్పు వెయ్యటం; అనిమేపు; పారుకోటం (తె. 28, 31).

**నల్లవాటు** చూ. నల్లవట్టు (తె. 22).

**నల్లెడ** చూ. నెరిడె (తె. 13, 29, 32, 33).

**నాగబరి** లక్షణం: పొట్ట ఉబ్బి పేడ వెయ్యకపోవటం చూ. నాము (కో. 15).

**నాగర** చూ. నాము (కో. 29; తె. 7, 11).

**నాగసలిపి** దొమ్మలో ఒకరకం; ఎగరొప్పు; చూ. దొమ్మ (కో. 3).

**నామర** చూ. నాము (కో. 10, 33).

**నాము** ఉ. నాం; రూ. నాగర, నామర; పర్యా. ఉంగిడి. కొన్నిరకాల లేత జొన్నమొక్కలు, ఆముద పాకులు తింటంవల్ల వచ్చే జబ్బు; వణుకు, కడుపుబ్బు, ఊపిరి పీల్చుకోటంలో బాధ కలుగుతాయి (కో. 3, 32, 33; తె. 2, 25, 28, 31, 39, 42; రా. 16, 18, 23).

**నాలికచేరు** ఉ. నాలికెనేరు. నాలికకింద నల్లగా రెండు నరాలు ఉబ్బుతాయి; వాటిలో చెడురక్తం పేరుకుంటుందట; పశువు మేత తినలేదు (కో. 23; తె. 5, 24, 29, 33, 34).

**నావరు** పశువు కృశించి చచ్చిపోతుంది; (శబ్దరూపాన్ని; బట్టి-చూ. నామర) (తె. 9).

**నాసర(తెవులు)** తెగపారుకొనే రోగం (తె. 6).

**నాసులు** (? బహు.) ఊపిరితిత్తుల జబ్బు; ఎగరొప్పు చూ. ఎసల (తె. 39).

**నీరుగుల్ల** పొట్టలో బల్ల (తె. 4).

**నీరుచురుకు** వేడిచేసి మూత్రం బొట్టుబొట్టుగా పడే జబ్బు (కో. 20).

**నుసిమిరి** చర్మవ్యాధి; దురద, ఒంటిమీద పడెలు

పడెలుగా నల్లమచ్చలు, గజ్జిపుండ్లు ఏర్పడతాయి; బొచ్చు ఊడి చెక్కులు గట్టటం (కో. 3-8, 10, 13-15, 19-24, 27-29, 32, 35, 36; తె. 40).

**నూతి గుడ్లు** గుడ్లుగా ఏర్పడే పుండు; పుట్టరణం కావచ్చు (రా. 14).

**నూనెమచ్చ** ? ఒకరకం చర్మరోగం (కో. 4-6, 15).

**నెత్తురుకట్టు** ఉ. నెత్తరకట్టు. రక్తం పారుకొనే జబ్బు (రా. 9).

**నెత్తురుమచ్చ** ముక్కులనుంచి నెత్తురుకారటం (కో. 7).

**నెత్తురెక్క** ముక్కులనుంచి నెత్తురు కారటం (మేకల జబ్బు) (కో. 4).

**నెరడరు** చూ. నెరిడె (తె. 42).

**నెరిడె** ఉ. నరెడ, నెరడు, నెరిడ, నెరిడి, నెరుడ; రూ. నల్లెడ, నెరెడరు, నెలెడ. గుండెజబ్బు. కడుపులో మేత పొట్టకుపైన ఉండేది 'నెరిడె'; అది వాచి ఊపిరితిత్తుల కడ్డంపడి శ్వాస ఆడక పశువు చచ్చిపోతుంది (కో. 1-11, 14, 16, 17, 20, 22, 23, 28, 33, 35; తె. 41; రా. 1, 12, 18, 22, 27, 28); **-కుట్టు** ఊపిరికుట్టు (కో.); **-దొమ్మ** ఉ. నెరిడి దొమ్మ. నెరిడెలో ఊపిరి సలపక పశువు చచ్చిపోతుంది (కో. రా.); **భేదాలు:** **జువ్వి-** లక్షణాలు: కాళ్ళు నీలుక్కుపోవటం; కళ్ళు మూతలు, రొప్పు, బాధతో అరుపు (కో.); **జెంకు-** లక్షణాలు: నడుస్తూ నడుస్తూ గొడ్డు సొలిసి పడిపోతుంది; ఒళ్ళు బిగదీయటం; పల్చగా పారుకోటం (కో.); **నాగ-** గుండె ఆగిపోవటం; పొట్ట ఉబ్బటం; శ్లేష్మం గొంతు కడ్డుపడుతుంది; చావు తప్పదు (కో. రా.); **బొంత-** లక్షణాలు: ముక్కు నరాలుబ్బటం; ఆయాసం (కో.); **వాకు-** గుండెకు కఫం అడ్డపడటంవల్ల ఎగపోత; వణుకు (కో.).

**నెలెడ** చూ. నెరిడె (తె. 31).

**నేలవెర్రి** తలకాయ నేలకు మోటించటం; తలతిప్పు; చూ. పందేటివెర్రి (కో. 10).

**నోటిపుల్ల** అంగిట్లో బెజ్జాలుపడటం (తె. 28).

**నోటిసంచ** నోట్లో పుండ్లుపడి మేత తినలేకపోవటం; చూ. సంచ (కో. 37, 39, 46, 48).

**పక్షవాతం** ఉ. పచ్చెవాతం. నరాలజబ్బు; శరీరంలో ఏదో భాగం చైతన్యం లేకుండాపోవటం (కో. 13).

**పంగజెట్ట** గిట్టలసందుల్లో వాపు (కో. 24).

**పడకపుండు** మలుగు (మక్క)మీదగడ్డ (రా. 26).

**పంటిసొర** పంటిమీద పుండులేచి పన్ను తొర్రబోవటం (కో. 7).

**పంపర** చెవులకింద గాని, గంగడోలు మీద గాని, మరెక్కడైనా మెత్తటిచోట ఎత్తుగా వాపు; కమ్మకాకలాటిది- వాతలు వేస్తే తగ్గుతుందట (కో. 3, 5, 9, 11, 13, 14, 17, 20, 24; తె. 1, 7, 8, 11, 23, 37-39; రా. 12, 14, 16, 18).

**పాముముట్టు** పాము నాకినట్టు శరీరమంతా పొడలు (కో. 39).

**పారుడు** పర్యా. పుర్రు(రోగం). అతిసారం; బిళ్ళ పురుగులు గడ్డితోపాటు తింటే ఇది వస్తుందట (కో. 12, 14, 28-30, 33, 34; తె. 40; రా. 2, 11).

**పాలఉలిపి** ఒంటిమీద ఎక్కడైనా తెల్లటి పులిపిరి (కో. 47).

**పాలకింత** ఉ. పాలకింకు. పాలుతాగే దూడకు వచ్చే ఒక జబ్బు (తె. 37, 40).

**పాలగడ్డ** పాలుతాగే దూడకు గొంతులో గడ్డ (తె. 37).

**పాలగురక** దూడగా ఉన్నప్పుడు వచ్చే గురకరోగం; అది అట్లానే నిలిచిపోతుందట (కో. 14, 15).

**పాలజెంకి** దూడకువచ్చే అజీర్తి (తె. 38).

**పిట్టబారురోగం** నడుం చచ్చుకుపోవటం (తె. 31).

**పిప్పికొమ్ము** కొమ్ము పుచ్చిపోవటం; చూ. కొమ్ముగొడిసె (కో. 24).

**పిల్లిసరుకు** రక్తవిరేచనాల జబ్బు (కో. 3, 4, 7; రా. 1).

**పుట్టుబొల్లి** ఒకరకం చర్మరోగం; పుట్టుకతో వచ్చింది (కో. 50).

**పునుగు** ? పక్షవాతం; నడుస్తూ నడుస్తూ కూలబడిపోవటం (కో. 5).

**పురుగుచేష్ట** పురుగు (పాము) ముట్టి ఒంటిమీద చారెడు చారెడు మచ్చ లేర్పడటం (కో. 10, 11).

**పుర్రు(రోగం)** పర్యా. పారుడు. అతిసారం; బిళ్ళ పురుగులను గడ్డితోపాటు తింటంవల్ల ఇది వస్తుందట (కో. 9; తె. 1, 20, 24, 25, 27).

**పులుతెవులు** నెత్తురు పారుకొనే రోగం (రా. 21).

**పెట్టుగూడ** ఒకరకం గూడవాపు; పశువు హఠాత్తుగా మరణిస్తుందట (కో. 11).

**పెద్దచీడ** పర్యా చూ. పెద్దరోగం. కలరాలాటి వ్యాధి; నెత్తురు పారుకోటం; నోటివెంబడి జొల్లు; మూత్రంలో రక్తం; ప్రమాదకరమైనది (కో. 6, 8, 9, 14, 15; తె. 39).

**పెద్దచెట్ట** పర్యా. చూ. పెద్దరోగం. కలరాలాటి వ్యాధి; నెత్తురు పారుకోటం; నోటివెంబడి జొల్లు; మూత్రంలో రక్తం; ప్రమాదకరమైన వ్యాధి (తె. 32).

**పెద్దరోగం** పర్యా. పెద్దచీడ, పెద్దచెట్ట, పెద్దసుసుకు, పెద్దసొరువు. కలరాలాటి వ్యాధి; లక్షణాలు: నెత్తురు పారు

కోటం : నోటివెంబడి జొల్లు; నీరుడు (మూత్రం)లో రక్తం : ప్రమాదకరమైన వ్యాధి (కో. 30; తె. 2, 6-8, 11, 28, 29, 31, 33, 35-37; రా. 4, 15).

**పెద్దసరుకు** పర్యా. చూ. పెద్దరోగం. కలరాలాటి వ్యాధి; నెత్తురు పారుకోటం; నోటివెంబడి జొల్లు; మూత్రంలో రక్తం; ప్రమాదకరమైన వ్యాధి (కో. 7).

**పెద్దసొంబువు** పర్యా. చూ. పెద్దరోగం కలరాలాటి వ్యాధి : నెత్తురు పారుకోటం; పోటివెంబడి జొల్లు; మూత్రంలో రక్తం; ప్రమాదకరమైన వ్యాధి (తె. 12).

**పోతుర్రు** పర్యా. చూ. కన్నర్రు. అర్రు (మెడ)మీది పుండు : అంగుళం వెడల్పు రంధ్రం ఏర్పడి ఉండుండి నెత్తురు కారుతుంది (తె. 37).

**బర్లు** నెరిడెవాపు; చూ. నెరిడె (కో. 18).

**బికారిరోగం** తిక్కరోగం; గొడ్డు కట్టుకొయ్యచుట్టూ పిచ్చెత్తినట్టు తిరుగుతుంది (కో. 51).

**బిళాడీ** ఉ. బిలాతీ. ఒంటిమీద ఎక్కడైనా బుడిపె లాగా ఏర్పడే లావాటి గుల్ల; ప్రమాదం లేదు; చూ. కణితి (కో. 38).

**బూరగొమ్ము** కొమ్మును పురుగు తొలవటం; చూ. కొమ్ముగొడిసె (కో. 36).

**బొడిగెరోగం** మెడవాపు (తె. 10).

**బొడ్డారు(కుట్టు)** కడుపునొప్పి; మూత్రంలో రక్తస్రావం (తె. 4, 5, 12).

**బొడ్డుసూల** పర్యా. బొడ్డేరు. మూత్రనిరోధం కలిగే జబ్బు : చూ. ఉచ్చకల్లు (తె. 26).

**బొడ్డేరు** పర్యా. బొడ్డుసూల. మూత్రనిరోధం కలిగే జబ్బు : చూ. ఉచ్చకల్లు (తె. 4, 5, 12, 31).

**బొబ్బ(తెగులు)** ఒళ్ళు పెట్లిపోయి బొబ్బలు పొక్కటం : ప్రమాదకరమైనది (కో. 3, 9, 15).

**బోపెరోగం** ? ముక్కువాపు (కో. 47).

**బోరెల్లి** లక్షణం : కడుపుబ్బు (కో. 1).

**మంజర్య** గూడువట్టి కుంటటం (తె. 13).

**మంజీరవాపు** ఉ. మంజీరాపు. ? కాలిగుత్తి దగ్గర వాపు (తె. 34).

**మందగుది** ఉ. మందగుదె. నడిచేముందు కొద్దిసేపు వెనకాలికాళ్ళు ఈడుస్తూపొయ్యే జబ్బు; ప్రమాదంలేదు (కో. 6, 9, 13-15, 18, 20, 21, 24, 37, 38, 44, 47; రా. 18, 24).

**మరిమెడ** చూ. మలిమిడి (తె. 37).

**మలిమిడి** రూ. మరిమెడ. పిల్లగిట్టల దగ్గర వాపు; కాలిపుంటు (కో. 8-10, 14, 17, 18, 20, 23-25; తె. 39).

**మజ్జెరి** ఉ. మజ్జెరు. ? జబ్బవాపు (తె. 11, 14).

**మాద** ఉ. మాదు, మోద. శరీరంలో కొన్నిచోట్ల పెరిగే పుట్టరణం (cancer) (కో. 3, 9, 11-13, 16-29, 31, 32, 36, 37, 40, 46-51; తె. 1, 31, 37-41; రా. 18, 21, 26); భేదాలు : **కంఠ-** గొంతులో పుండు; కుతికెవాపు (కో.); **కన్ను-** గుడ్డులోపలినుంచి కొయ్యకండ పెరగటం (కో.); **కొమ్ము-** ఉ. కొమ్మీద, కొమ్ముమోద. తల్లోపుండు పుట్టి అయిదారు నెలల్లో కొమ్ము వాలిపోవటం; చూ. కొమ్ముగొడిసె (కో. తె. రా.); **గుడ్ల-** ఉ. గుడ్లమోద. ? గర్భకోశంలో ఏర్పడే పుండు; గుడ్లు గుడ్లుగా పెరుగుతుంది (తె.); **చెవు-** చెవులో పుండు; చీము కారుతుంటుంది; చెవి వాలిపోతుంది (కో.); **చేరు-** ఉ. నేరుమాద, నేరుమోద. మూత్రావయవం లోపల కురుపు; వాపు గుడ్లుగుడ్లుగా పైకివస్తుంది (కో. తె. రా.); **తల-** ఉ. తలమోద. తల్లోపుండు; కొమ్ములూడిపోతాయి (కో. తె.); **తోక-** తోకచివర ఏర్పడేది (కో.); **దొంగ-** ఉ. దొంగ మాదు. గొంతుమీద వాపు; మాదకాదు; గవదబిళ్ళల లాటిది (కో.); **పుట్ట-** ఉ. పుట్టమోద. కంట్లో కొయ్యకండ పెరగటం (కో.).

**మిడసరం** ఉ. మెడసరం. ఒకరకం వాతపుజబ్బు; జబ్బలువాచి పశువు నడవలేదు (కో. 38, 40).

**మిందె** కాలిగుత్తి (గిట్టల పైభాగం) వాపు (తె. 17).

**ముక్కుతొర్ర** పర్యా. ముక్కుబుర్ర. లక్షణాలు; ముక్కుకు నోటికి కలిపి కంతలుపడతాయి; పశువు నీళ్ళు తాగలేదు; కృశించిపోతుంది (తె. 24).

**ముక్కుబంతి** చూ. ముగబంతి (కో. 30).

**ముక్కుబుర్ర** పర్యా. ముకుతొర్ర. లక్షణాలు : ముక్కుకు నోటికి కలిపి కంతలు పడతాయి; నీళ్ళు తాగలేక పోవటం; చిక్కిపోవటం (కో. 24).

**ముగబంతి** ఉ. ముగుబంతి, ముచబంతి, మూబంతి, మొగబంతి; రూ. ముక్కుబంతి; పర్యా. ముగుదుమ్మ, ముట్టెబంతి. లక్షణాలు : విపరీతంగా తుమ్ములు, ముక్కుల వెంబడి నీళ్ళు, చీమిడి కారటం; రోగం ముదిరితే తుమ్మినప్పుడు ముక్కునుంచి కండలు పడతాయి; వీటిని 'ముగబంతికాయ' అంటారు (కో. 6, 11, 14, 16-25, 28, 29, 32, 33; తె. 40, 41; రా. 14, 18).

**ముగుదుమ్మ** పర్యా. చూ. ముగబంతి. లక్షణాలు : విపరీతంగా తుమ్ములు, ముక్కులవెంబడి నీళ్ళు, చీమిడి కారటం; రోగం ముదిరితే తుమ్మినప్పుడు ముక్కునుంచి కండలు పడతాయి; వీటిని 'ముగబంతికాయ' అంటారు (తె. 37).

**ముగ్గురోగం** పశువు నిలబడి ఊగుతూ ఉంటుంది; చూ. ఉయ్యాలరోగం (తె. 5).

**ముట్టెబంతి** పర్యా. చూ. ముగబంతి. లక్షణాలు;

విపరీతంగా తుమ్ములు, ముక్కువెంబడి నీళ్ళు, చీమిడి కారటం; రోగం ముదిరితే తుమ్మినప్పుడు ముక్కునుంచి కండలు పడతాయి; వీటిని 'ముగబంతికాయ' అంటారు (కో. 34).

**ముర్రుగాలు** మోకాళ్ళ వాపు; చూ. మొరం (తె.24).

**ముసర** 'కలరా' వంటి జబ్బు; ఎక్కువగా పారుకొని గొడ్డు డీలా పడిపోతుంది (కో. 1, 5, 6, 10, 15; తె. 3; రా. 1, 5–8, 10–12, 14, 21–25, 28); భేదాలు: **గుండె-** ముసరలో దొమ్మవాపు (రా.); **నల్ల-** నెత్తురు పారుకొనే రోగం (రా.); **నెత్తురు-** చూ. నల్ల- (రా.); **పిల్ల-** చూ. నల్ల- (కో. రా.); **మూత-** లక్షణం: ఒళ్ళంతా బిళ్ళలుకట్టి, అవి చితికి చీముకారటం (కో.); **సాబేతు-** లక్షణాలు: ముక్కునుంచి నీరుకారటం; కంటినుండి రక్తం, గడగడ వణకటం (కో.).

**మూర్ఛ** గొడ్డు నడుస్తూ నడుస్తూ పడిపొయ్యే జబ్బు; ఒకరకం నరాల రోగం (కో. 10, 11, 13).

**మొరం** ఉ. మొటం; రూ. మొరవ, మొరవడి, మోర్లు. కీళ్ళవాపు; మోకాళ్ళ కొంకులు వాస్తాయి; పశువు నడవలేదు (తె. 39; రా. 27).

**మొరవ** ఉ. మరవ; చూ. మొరం. మోకాళ్ళు నీరుదిగి ఉబ్బుతాయి (కో. 10, 24, 25).

**మొరవడి** చూ. మొరం (తె. 25, 37).

**మొలవడి** చూ. మొరం (తె. 25, 37).

**మోర్లు** (బహు.) చూ. మొరం (కో. 20–22).

**రక్తకాసె** నెత్తురు పారుకొనేరోగం; చూ. ముసర (తె. 32).

**రక్తగాణి** ఉ. రత్తగాని. రక్తవిరేచనాల జబ్బు (కో. 38).

**రక్తవల్లి** మూత్రంలో నెత్తురుపడటం (కో. 1).

**రక్తసూల** ఉ. రగతసూల, రత్తసూల. మూత్రంలో నెత్తురుపడటం (తె. 31).

**రచ్చబల్ల** కడుపులో గడ్డ (బల్ల); డొక్కలో నొప్పి (కో. 30; తె. 30, 31).

**రిల్లనొప్పి** పిల్లగిట్టదగ్గర వాపు, నొప్పి (రా. 26).

**రెల్లరుపు** రిల్ల (పిల్లగిట్టదగ్గర) వాపు; కాలు కుంటటం (కో. 16).

**రొమ్మడ్డ** గుండె నిలిచిపొయ్యే జబ్బు; చూ. దొమ్మ (తె. 9).

**వగర్పు** ఎగరొప్పు (రా. 18).

**వడేపుకుట్టు** మూత్రంలో రక్తస్రావం; చూ. బొడ్డేరు (తె. 9, 10).

**వాతం** లక్షణాలు: కీళ్ళవాపు; కాళ్ళు నిలుక్కుపోయి నడవలేకపోవటం; కళ్ళవెంబడి నీరు, పుసులుకట్టటం (కో. 11, 12, 16–18, 20, 24, 26, 32, 37–47, 49–51; తె. 1, 15, 18, 20, 25, 27, 37).

**వాయి(రోగం)** వాతపు నొప్పులు; కీళ్ళవాపు; చూ. వాతం (కో. 4, 16; రా. 26).

**వెరి** వెర్రి; తిక్కరోగం (తె. 34, 39): **-మంక** వెర్రిలో ఒకరకం; గొడ్డు నేలమీదపడి నాలిక పీక్కొని చస్తుంది (తె.).

**సంచ** ఒకరకం అంటురోగం; నోట్లోను, కాళ్ళ గిట్టల్లోను పుండ్లు; 'అమ్మవారు' అంటారు (కో. 37, 39, 46–49, 51).

**సన్నుకాలు** కాలిమడుపులో వాపు; చూ. నక్కమూరు (కో. 41).

**సప్పవాపు** ఉ. సొప్పోపు; చూ. జెబ్బవాపు (తె. 10; రా. 1, 5, 10, 11, 16, 17, 23, 28).

**సరక** రూ. జరక, జరుపు, సరుపు. నెత్తురు పారుకునే రోగం; చూ. ముసర (రా. 9, 10, 18, 25).

**సరుపు** చూ. సరక (తె. 34).

**ససల(రోగం)** శరీరం కృశించే లక్షణం ఉన్న జబ్బు; క్షయ (రా. 16, 18).

**సిరవాయి** ఉ. సిరోయి. చేరు (మూత్రావయవం) వాపు; చేరుమాద; చూ. మాద (తె. 34).

**సీమగుడ్డు** ? నాము తెగులు (కో. 38).

**సుడి** ఒకరకం తిక్క; గొడ్డు గిర్రున తిరిగి పడిపోతుంది (తె. 27).

**సుద్దకట్టు** వేడిచేసి మూత్రమార్గానికి అడ్డేర్పడటం; చూ. ఉచ్చకల్లు (కో. 24).

**సెల** ఉ. సిల, సెశ. గుండె ఆగిపోవటం; శరీరంలో ఎక్కడైనా బిగదీయటం (కో. 8, 10; తె. 31, 37, 39; రా. 5–10, 12, 16–18, 20, 23–28); భేదాలు: **గుండె-** గుండె పట్టుకుపోవటం (రా.): **నారు-** నిదానంగా గొడ్డు చచ్చే గుండెజబ్బు (తె. రా.); **ముక్కు-** ఉ. ముక్కుసిల; రూ. ముగుసెల, మోరసెల. ముక్కునరాలు బిగదీసుకుపోవటం; కడుపుబ్బు, నోటిచొంగ; ముక్కునరాల్లో నెత్తురు పేరుకుంటుందట (కో. తె. రా.); **ముగు-** చూ. ముక్కు- (తె. రా.); **మోర-** చూ. ముక్కు- (రా.).

**సెలక** చిక్కిపొయ్యే రోగం; క్షయ (తె. 38).

**సొమ్మ** చూ. దొమ్మ (తె. 18).

**సొరసి** నాలుకపూత; పశువు మేత తినలేదు (కో.45).

**సొరుగుడు** ఒకరకం తిక్క (కో. 34).

**సొరె(లు)** (-పోవు) పండ్లల్లో బెజ్జాలు; నీళ్ళు తాగేటప్పుడు బాధ (తె. 25).

**సొలుపు** వాతరోగం; కాళ్ళు పట్టుకుపోతాయి (కో.26).

చిత్రం 52 క. ఇలారం



చిత్రం 53 చ. కొట్టం (వానసాల)



చిత్రం 52 ట. గాడి



(వెదురుబద్దలది)



(రాతికట్టడం)

చిత్రం 53 పట్టెడ

చిత్రం 52 త. కొల్లాం



(వెదురుబద్దలది)



(మువ్వలది)



(గజ్జెలది)

చిత్రం 54 పనతాడు



(కుచ్చులది)



(కుచ్చులది)



(పూసలు, మువ్వలు కూర్చినది)

చిత్రం 55 సిగమోర



చిత్రం 56
(కొమ్ము)కుప్పె






చిత్రం 57 లంకెపీట (కొన్ని రకాలు)







చిత్రం 58 చిక్కం



(బద్దలది)



(నారది)

చిత్రం 59 బొనుగు



చిత్రం 60 పలుపు (తన్నె)



చిత్రం 61 కిరగాని



# 13. ఆచారాలు : వ్యవహారాలు

## 1. పండగలు, నమ్మకాలు

**అంకమ్మ** ఒక గ్రామదేవత (కో. 12).

**అడ** గ్రామదేవదలకు నైవేద్యంగాపెట్టే వంటకం (రా. 22, 23).

**అదును** పర్యా. చూ. ఆయం. గ్రామవృత్తులవారికి కళ్ళంలో ఇచ్చే ధాన్యభాగం (తె. 4, 6, 8).

**అద్దపుచేట** గౌరిగేటప్పుడు అద్దం చూపించినందుకు కళ్ళంలో మామూలుకంటే మంగలికి అదనంగా ఇచ్చే చేటెడు గింజలు (తె. 1, 35).

**అద్దపుదోసిళ్ళు** (బహు.). గౌరిగేటప్పుడు అద్ద చూపించినందుకు మామూలుకంటే అదనంగా మంగలికి కళ్ళంలో ఇచ్చే కొన్ని దోసిళ్ళ గింజలు (తె. 36).

**అరకపూజ** ఏడాదిలో మొదటిసారిగా కాడికట్టేముందు అరకకు (ఎద్దులనుకట్టిన నాగలికి) చేసే పూజ ; ఎడ్లకాళ్ళకు చమురు, మొగాన పసుపు కుంకుమ, గిట్టలకు, కొమ్ములకు సున్నం, ఎర్రమన్ను పూసి టెంకాయ కొడతారు (తె. 29, 34).

**అరుకునుడు** ఉ. అర్కునుడు (? <అరు + కొనుడు). ఏడాదిలో కొత్తగా నాగలికట్టేముందు చేసుకొనే పండగ ; చూ. ఏరువాక (తె. 16-23).

**అల్లిదేవర** వానకోసం అడవిలో వనభోజనంచేసి ఆరాధించే దేవత ; చూ. గాలిదేవర (రా. 4).

**ఆనతి** (-కట్టు). గ్రామదేవత పూజకు ఊరివాళ్ళు పూజారి (బయండ్లవాడి)కి ఇచ్చే ఆదేశం (తె. 11, 12, 29, 35-37, 42).

**ఆముదాలసగినం** ఉ. ఆందేలసగినం. వానరాకను గురించిన శకునం ; నట్టింట్లో అలికి ముగ్గుపెట్టి దానిమీద ఒక్కొక్క కార్తెకు ఒక్కొక్క వరస చొప్పున ఆముదాల గింజల వరసలుపెట్టి గంప బోర్లించి మర్నాడు తెరిచూస్తే ఏ కార్తెపేరున వరస చెదిరిఉంటే ఆ కార్తెలో వర్షం వస్తుందట (రా. 18, 22).

**ఆయం** పర్యా. అదును, కట్టడి, గుత్త. గ్రామవృత్తుల వారికి కళ్ళంలో మామూలుగా ఇచ్చే ధాన్యభాగం (తె. 1, 3, 4).

**ఆరెద్దులకార్తె** ఆరుద్రకార్తెలో చేసుకొనే పండగ ; మట్టితో ఎద్దుబొమ్మలుచేసి మిద్దెలమీద పెట్టి, గుగ్గిళ్ళు, పేల పిండి నైవేద్యం పెడతారు (రా. 23).

**ఆవిటి(వారాలు)** ఉ. అగిటి. దమ్ములముందు జూన్ నెల (మృగశిరకార్తె)లో చేసే గ్రామదేవతపూజ (తె. 1, 2, 21-28, 35, 36, 38).

**ఈదంబరి** (-పెట్టు). ఒక ఆచారం ; పత్తిఏరేముందు పొలంలో ఆరెచెట్టుకు పూజచేసి భోంచేస్తారు (తె. 18, 28).

**ఉగాది** సంవత్సరాది ; చైత్రశుద్ధ పాడ్యమినాడు వచ్చే పండగ ; ఈరోజునే కొందరు, నాగలిపూజ, గాడిపూజ చేసి అరక కడతారు (కో. 1-51 ; తె. 1, 3, 4, 9, 13, 18, 20, 21, 23 - 28, 37, 39 ; రా. 10, 11, 18, 22, 25-28).

**ఉత్రె** (-జేయు). ? గ్రామదేవతకు చేసే జాతర (తె. 13).

**ఊరిదేవర** (1) గ్రామదేవత ; (2) గ్రామదేవతకు చేసే జాతర (రా. 3, 13, 14).

**ఊరుపండగ** ఊరంతా పోగుచేసిన అన్నం ఊరిబయట పశువులకు పెట్టే పండగ (కో. 50).

**ఎద్దుసగినం** వానవచ్చే కార్తె తెలుసుకోటానికి తార్కాణ ; నడివీథిలో అలికి ముగ్గుబెట్టి ఎద్దును అక్కడ నిలబెట్టాలి ; ఏ కార్తె పేరుచెప్పినప్పుడు ఎద్దు పేడబెట్టి గంజు (మూత్రం) పోస్తుందో ఆ కార్తెలో వాన వస్తుందట (రా. 6, 18).

**ఎర్రమ్మ** ఒక గ్రామదేవత ; కోతకు ముందు పొంగలి బెట్టి ఏటపొటేగోసి ఆరాధిస్తారు (తె. 29, 41).

**ఎల్లమ్మ** ఒక గ్రామదేవత ; ఈ దేవతకు తొమ్మిది రోజులు జాతర చేస్తారు (తె. 2, 9).

**ఏరక** చూ. ఏరువాక (రా. 21, 22).

**ఏరువాక** రూ. ఏరక. జ్యేష్ఠ శుద్ధపూర్ణిమ (ఏరువాక పున్నమ) నాడు చేసే పండగ ; ఎడ్లను, సాగుపనిముట్లను, గాటిని, అలంకరించి ధూపదీప నైవేద్యాలతో పూజిస్తారు ; ఆ తరవాతనే అరకలు కడతారు (కో. 2, 8, 11, 12 ;

ఉ. = ఉచ్చారణభేదం(-భేదాలు) ; కో. = కోస్తాజిల్లాలు; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం; విశ. = విశేషణం; హిం. = హిందుస్తానీ.

తె. 3-5, 9, 10, 37, 39 ; రా. 27).

**కంచెమ్మ** ఒక గ్రామదేవత ; ఏటలుగొట్టి పణ్యారపు బండ్లు కట్టి జాతర చేస్తారు (రా. 7).

**కట్టుడి** పర్యా. చూ. ఆయం. గ్రామవృత్తులవారికి కళ్ళంలో మామూలుగా ఇచ్చే ధాన్యభాగం (తె. 1, 34, 36).

**కనితెలపూజ** కన్యకాదేవతల పూజ ; మోటబావిదగ్గర మూడుబొమ్మలు పెట్టి ధూపదీప నైవేద్యాలతో పూజచేసి మోటకడతారట (తె. 1, 2, 6).

**కనుము** సంక్రాంతి వెళ్ళిన మరునాడు చేసే పశువుల పండగ ; పశువులను అలంకరించి, గారెలు బూరెలు తిని విస్తారు (కో. 1, 3, 5-7, 46-48, 50, 51 ; రా. 1).

**కన్నెపొంగలి** పొలంలో కన్యకాపరమేశ్వరి పూజ చేసి పొంగలి పొంగించి, ఏటలు కొట్టి ఆ పొలి పొలంలో చల్లే ఆచారం (రా. 2).

**కప్పడుగు** (? < కప్ప + అడుగు) ; వాన రాకపోతే చేసే కప్పసంబరం ; చూ. కప్పలకావడి (కో. 44).

**కప్పతల్లి** వాన రాకపోతే చేసే సంబరం ; ఒక పెద్ద కప్పను గుడ్డలో చుట్టి పాడుతూ ఊరేగించి చెరువులో వదులుతారు ; చూ. కప్పలకావడి (కో. 31-34 ; తె. 17-21, 23-27, 30, 31, 40, 42).

**కప్పలకావడి** వానరాకపోతే చేసే కప్పసంబరం; ఒక కర్రకు గుడ్డ ఉయ్యాలగట్టి దాంట్లో కప్పనుబెట్టి ఇద్దరు పిల్లలు బుజాన వేసుకుని పాడుతూ ఊరంతా తిప్పుతారు (కో. 26, 30, 37; తె 4, 5, 9-11, 13, 16, 32-35, 37, 38).

**కప్పలదేవర** వానరాకపోతే చేసే కప్పసంబరం; చూ. కప్పలకావడి (తె. 22).

**కప్పసంబరం** వానరాకపోతే నడిపే ఆచారం ; చూ. కప్పలకావడి (కో. 48).

**కప్పాలమ్మ** వానరాకపోతే చేసే కప్పసంబరం ; చూ. కప్పలకావడి (కో. 3).

**కళ్ళంపూజ** కళ్ళంలో కంకిపుప్పుచేసే పూజ (తె. 14).

**కాటమయ్య** అడవిలో పసులకాపరులు ప్రతిష్ఠించి ఆరాధించే దేవత (రా. 10, 18-20).

**కామప్ప** వానకోసం పూజించే దేవత ; కామప్పను (? మన్మథుణ్ణి) ఊరంతా దిప్పి గ్రామ మధ్యంలో తగలబెట్టే ఉత్సవం (తె. 4).

**కారుపున్నమ** వైశాఖపూర్ణిమ (? జ్యేష్ఠపూర్ణిమ) నాడు చేసే ఎద్దులపూజ (రా. 17, 18).

**కొత్తమాస** ఉగాది తరవాత (? ముందు) వచ్చే అమావాస్యనాడు చేసే పండగ ; కొత్తనాగలికి పూజచేసి అరక కడతారు (కో. 37, 40, 42, 48-50).

**కొత్తమ్మ** ఒక గ్రామదేవత (కో. 39).

**కొత్తలపండుగ** కొత్తధాన్యం ఇంటికి తెచ్చుకొన్న తరవాత చేసే పండగ (కో. 30 ; తె. 13, 16-23, 25-28).

**కొలుపు** పర్యా. చూ. గత్తర, పోతయ్య, పోలమ్మ, ముత్యాలమ్మ మొ. గ్రామదేవతలకు చేసే జాతర (కో. 27-32, 34, 35 ; తె. 2, 13, 16, 18, 19, 21, 23, 24, 27, 30, 31, 40).

**కోకమ్మచేట** ముట్టుకోకలు ఉతికిన చాకలివాడికి మామూలుగా ఇచ్చే చేటెడు గింజలు (తె. 1, 35).

**గంగజాతర** వర్షంకోసం చేసే గంగాదేవి పూజ (కో. 40, 41, 47, 51 ; తె. 35, 37 ; రా. 2, 4, 8-10, 14, 16, 18, 19, 23, 24, 28).

**గంగానమ్మ** ఒక గ్రామదేవత ; వానకోసం ఏట బలి ఇచ్చి ఈ దేవతను ఆరాధిస్తారు ; చూ. గంగజాతర (రా. 26).

**గణపతి** వినాయకుడు ; కళ్ళంలో ప్రతిష్ఠించి ఆరాధిస్తారు (తె. 34, 35).

**గత్తర** (-చేయు) ; పర్యా. కొలుపు. గ్రామదేవతకు చేసే జాతర (తె. 31).

**గంపజాతర** వాన రాకపోతే చేసే వనభోజనం ; ఊరివారంతా గంపల్లో అన్నంపెట్టుకొని వెళ్ళి అడవిలో తిని కేకలువేసుకుంటూ ఇంటికి వస్తారట (తె. 3, 5, 15, 17, 19-24, 28).

**గాజులచేట** పాలేరు భార్యకు గాజులనిమిత్తం కళ్ళంలో ఇచ్చే చేటెడు గింజలు (కో. 23).

**గాడిపండగ** పశురోగ నివారణకు నడిపే ఆచారం ; పశువులకు మేతవేసే అర (=గాడి)కి పూజచేసి ఏటను బలి ఇస్తారు (తె. 15).

**గాలిదేవర** వానకోసం పొలిమేరదగ్గర వనభోజనం వెళ్ళి ప్రతిష్ఠించి ఆరాధించే దేవత (రా. 13, 15, 16).

**గాపు** (-పట్టు) ; పొలంలో జంతుబలిచేసి రక్తం చల్లటం ; బలిచేసిన జంతురక్తం (కో. 28 ; తె. 27, 31).

**గుత్త** పర్యా. చూ. ఆయం. పనిచేసేవాళ్ళకు ధాన్యరూపంలో ఇచ్చే మామూలు (తె. 6)

**చలిబోనం** రూ. చద్దిబోనం ; పర్యా. చలుపారం. పెరుగుకలిపిన అన్నం; పోలేరమ్మ, పోచెమ్మ మొ. దేవతల జాతర్లలో దీన్ని తట్టలో పెట్టుకొని 'బైరోడు' (మాదిగ) ఊరంతా తిరిగి పొలిమేరదగ్గర గ్రామదేవతకు నైవేద్యంగా పెట్టివస్తాడు (తె. 17-19, 21, 25, 26).

**చలుపారం** (< చలుపు + ఆరం) ; పర్యా. చూ. చలిబోనం. పోలేరమ్మ, పోచెమ్మ మొ. గ్రామదేవతల జాతర్లలో పెరుగు కలిపిన అన్నం తట్టలో పెట్టుకొని

తె. 3-5, 9, 10, 37, 39; రా. 27).

**కంచెమ్మ** ఒక గ్రామదేవత; ఏటలుగొట్టి పణ్యారపు బండ్లు కట్టి జాతర చేస్తారు (రా. 7).

**కట్టడి** పర్యా. చూ. ఆయం. గ్రామవృత్తులవారికి కళ్ళంలో మామూలుగా ఇచ్చే ధాన్యభాగం (తె. 1, 34, 36).

**కనికెలపూజ** కన్యకాదేవతల పూజ; మోటబావిదగ్గర మూడుబొమ్మలు పెట్టి ధూపదీప నైవేద్యాలతో పూజచేసి మోటకడతారట (తె. 1, 2, 6).

**కనుము** సంక్రాంతి వెళ్ళిన మరునాడు చేసే పశువుల పండగ; పశువులను అలంకరించి, గారెలు బూరెలు తిని విస్తారు (కో. 1, 3, 5-7, 46-48, 50, 51; రా. 1).

**కన్నెపొంగలి** పొలంలో కన్యకాపరమేశ్వరి పూజ చేసి పొంగలి పొంగించి, ఏటలు కొట్టి ఆ పొలి పొలంలో చల్లే ఆచారం (రా. 2).

**కప్పదుగు** (? < కప్ప + అడుగు); వాన రాకపోతే చేసే కప్పసంబరం; చూ. కప్పలకావడి (కో. 44).

**కప్పతల్లి** వాన రాకపోతే చేసే సంబరం; ఒక పెద్ద కప్పను గుడ్డలో చుట్టి పాడుతూ ఊరేగించి చెరువులో వదులారు; చూ. కప్పలకావడి (కో. 31-34; తె. 17-21, 23-27, 30, 31, 40, 42).

**కప్పలకావడి** వానరాకపోతే చేసే కప్పసంబరం; ఒక కర్రకు గుడ్డ ఉయ్యాలగట్టి దాంట్లో కప్పనుబెట్టి ఇద్దరు పిల్లలు బుజాన వేసుకుని పాడుతూ ఊరంతా తిప్పుతారు (కో. 26, 30, 37; తె 4, 5, 9-11, 13, 16, 32-35, 37, 38).

**కప్పలదేవర** వానరాకపోతే చేసే కప్పసంబరం; చూ. కప్పలకావడి (తె. 22).

**కప్పసంబరం** వానరాకపోతే నడిపే ఆచారం; చూ. కప్పలకావడి (కో. 48).

**కప్పాలమ్మ** వానరాకపోతే చేసే కప్పసంబరం; చూ. కప్పలకావడి (కో. 3).

**కళ్ళంపూజ** కళ్ళంలో కంకికుప్పకుచేసే పూజ (తె. 14).

**కాటుమయ్య** అడవిలో పసులకాపరులు ప్రతిష్ఠించి ఆరాధించే దేవత (రా. 10, 18-20).

**కామప్ప** వానకోసం పూజించే దేవత; కామప్పను (? మన్మథుణ్ణి) ఊరంతా తిప్పి గ్రామ మధ్యంలో తగలబెట్టే ఉత్సవం (తె. 4).

**కారుపున్నమ** వైశాఖపూర్ణిమ (? జ్యేష్ఠపూర్ణిమ) నాడు చేసే ఎద్దులపూజ (రా. 17, 18).

**కొత్తమాస** ఉగాది తరవాత (? ముందు) వచ్చే అమావాస్యనాడు చేసే పండగ; కొత్తనాగలికి పూజచేసి అరక కడతారు (కో. 37, 40, 42, 48-50).

**కొత్తమ్మ** ఒక గ్రామదేవత (కో. 39).

**కొత్తలపండుగ** కొత్తధాన్యం ఇంటికి తెచ్చుకొన్న తరవాత చేసే పండగ (కో. 30; తె. 13, 16-23, 25-28).

**కొలుపు** పర్యా. చూ. గత్తర. పోతయ్య, పోలమ్మ, ముత్యాలమ్మ మొ. గ్రామదేవతలకు చేసే జాతర (కో. 27-32, 34, 35; తె. 2, 13, 16, 18, 19, 21, 23, 24, 27, 30, 31, 40).

**కోకమ్మచేట** ముట్టుకోకలు ఉతికిన చాకలివాడికి మామూలుగా ఇచ్చే చేటెడు గింజలు (తె. 1, 35).

**గంగజాతర** వర్షంకోసం చేసే గంగాదేవి పూజ (కో. 40, 41, 47, 51; తె. 35, 37; రా. 2, 4, 8-10, 14, 16, 18, 19, 23, 24, 28).

**గంగానమ్మ** ఒక గ్రామదేవత; వానకోసం ఏట బలి ఇచ్చి ఈ దేవతను ఆరాధిస్తారు; చూ. గంగజాతర (రా. 26).

**గణపతి** వినాయకుడు; కళ్ళంలో ప్రతిష్ఠించి ఆరాధిస్తారు (తె. 34, 35).

**గత్తర** (-చేయు); పర్యా. కొలుపు. గ్రామదేవతకు చేసే జాతర (తె. 31).

**గంపజాతర** వాన రాకపోతే చేసే వనభోజనం; ఊరివారంతా గంపల్లో అన్నంపెట్టుకొని వెళ్ళి అడవిలో తిని కేకలువేసుకుంటూ ఇంటికి వస్తారట (తె. 3, 5, 15, 17, 19-24, 28).

**గాజులచేట** పాలేరు భార్యకు గాజులనిమిత్తం కళ్ళంలో ఇచ్చే చేటెడు గింజలు (కో. 23).

**గాడిపండగ** పశురోగ నివారణకు నడిపే ఆచారం; పశువులకు మేతవేసే అర (= గాడి)కి పూజచేసి ఏటను బలి ఇస్తారు (తె. 15).

**గాలిదేవర** వానకోసం పొలిమేరదగ్గర వనభోజనం వెళ్ళి ప్రతిష్ఠించి ఆరాధించే దేవత (రా. 13, 15, 16).

**గావు** (-పట్టు); పొలంలో జంతుబలిచేసి రక్తం చల్లటం; బలిచేసిన జంతురక్తం (కో. 28; తె. 27, 31).

**గుత్త** పర్యా. చూ. ఆయం. పనిచేసేవాళ్ళకు ధాన్యరూపంలో ఇచ్చే మామూలు (తె. 6)

**చలిబోనం** రూ. చల్దిబోనం; పర్యా. చలుపారం. పెరుగుకలిపిన అన్నం; పోలేరమ్మ, పోచెమ్మ మొ. దేవతల జాతర్లలో దీన్ని తట్టలో పెట్టుకొని 'బైరోడు' (మాదిగ) ఊరంతా తిరిగి పొలిమేరదగ్గర గ్రామదేవతకు నైవేద్యంగా పెట్టివస్తాడు (తె. 17-19, 21, 25, 26).

**చలుపారం** (< చలుపు + ఆరం); పర్యా. చూ. చలిబోనం. పోలేరమ్మ, పోచెమ్మ మొ. గ్రామదేవతల జాతర్లలో పెరుగు కలిపిన అన్నం తట్టలో పెట్టుకొని

ఊరంతా తిరిగి బైరోడు (మాదిగ) పోలేరమ్మదగ్గర గ్రామ దేవతకు నైవేద్యం పెట్టి వస్తాడు (తె. 27, 28).

**చల్దిబోనం** చూ. చలిబోనం (తె. 20, 22, 23).

**చిత్తబలి** పండిన పొలానికి చిత్తకార్తెలో ఏటను బలి ఇవ్వటం (కో. 39, 41, 42; తె. 37).

**చెట్టుజాతర** వానరాకపోతే నడిపే ఆచారం: అడవి నుంచి ఇష్టమైన చెట్టును నరికి తెచ్చి ధాన్యాదులన్నీ కలిపి రుబ్బి రొట్టెలుజేసి మేకపోతును గొట్టి రొట్టెలు నెత్తురుకలిపి గొయ్యితీసి గొయ్యిలో పెట్టి చెట్టును పాతటం (కో. 42, 45).

**చెట్టుదేవర** వానకోసం నడిపే ఆచారం; ఊరిబయట అందరూ ఒక చెట్టును పూజించి అక్కడ అన్నం తింటారు (రా. 16).

**చెరువుగంగమ్మ** వానకోసం జరిపే జాతర; చెరువుకు మేకపోతును బలిఇస్తారు (రా. 14, 28).

**చేటుబిచ్చం** గ్రామవృత్తులవాళ్ళకు చేటలతో మామూలుగా ఇచ్చే గింజలు; చూ. ఆయం (తె. 1, 35, 36).

**చౌడమ్మ** ఒక గ్రామదేవత; పిండిముద్దలో జోతులు వెలిగించి నెత్తినబెట్టుకొని ఆడుతూ పాడుతూ ఈ దేవతను కొలుపులుజేస్తారు (రా. 28).

**జమ్ములమ్మ** ఒక గ్రామదేవత; కల్లుకుండ అమ్మవారి ముందు పెట్టి ఏటలు కొడతారు (రా. 28).

**జాకర** ఒక గ్రామదేవత; ముఖ్యంగా గిరిజనులు ఆరాధించే కొండదేవత (కో. 49).

**జాతర** పర్యా. గత్తర. గ్రామదేవతోత్సవం (కో. 12, 27, 28, 35; తె. 20, 34).

**జోకుమారుడు** వానకోసం ఆరాధించే దేవత; గంపలో దేవతను ప్రతిష్ఠించి నెత్తినబెట్టుకొని పాడుకొంటూ ఇంటింటికి తిరుగుతారు; మహాలయ అమావాస్య(భాద్రపద-అమావాస్య) నాడు ఓటి (నీళ్ళులేని) కుంటలో ఆ దేవతను విడిచివస్తారు (తె. 4; రా. 17).

**తలగంప** ముందుగా మేలురాసినుంచి వినాయకుడి పేరు మీద తీసే గంపెడు గింజలు (కో. 27, 29; తె. 40, 41).

**తవగంప** కొత్తధాన్యం పాతరపోసే ముందు ఇంటి ఆడపడుచుకు ఇచ్చే గంపెడు గింజలు (కో. 21).

**తోడుచేట** కళ్ళంలో రైతుకు తోడుగా కావలిగాచిన మాదిగవాడికి మామూలుగా ఇచ్చే చేటెడు గింజలు (తె. 1, 35).

**దమ్ముపూజ** మాగాణిలో పైరు మొలకెత్తేటప్పుడు ఏటబలితో చేసేపూజ (కో. 41).

**దరగయ్య** ఒక గ్రామదేవత (రా. 28).

**దేవ(ర)దోసిళ్ళు** కళ్ళంలో గింజలు కొలిచేటప్పుడు దేవుడిపేర ముందుగా తీసే కొన్ని దోసిళ్ళ గింజలు (తె. 1, 5-9, 14, 33-36; రా. 18, 25-27).

**దొంగకట్టు** కళ్ళంలో గింజలు దొంగల్నుంచి రక్షించిన మాదిగకిచ్చే గింజలున్న వరిగడ్డి, వగైరా (తె. 1, 35).

**దొంగచేట** దొంగల్నుంచి కళ్ళంగాపాడినందుకు మాదిగవాడికిచ్చే చేటెడు గింజలు (తె. 1, 35, 36).

**పంటమూన** వరిదుబ్బును పసుపు కుంకుమలతో పూజించి ఉంద్రాళ్ళు, గుగ్గిళ్ళు పెట్టే ఆచారం (కో. 14).

**పసులపండగ** సంక్రాంతి వెళ్ళిన మర్నాడు చేసే పండగ; పశువులను అలంకరించి, గారెలు బూరెలు తినిపిస్తారు; చూ. కనుము (కో. 1, 40, 46, 48; రా. 1, 6, 8, 9, 11).

**పాండవపొంగలి** వాన రాకపోతే పాండవులపేర ఐదు బొమ్మలు పెట్టి పొంగళ్ళు పొంగించే ఆచారం (కో. 27; తె. 23, 24, 39, 42).

**పాతపాటెమ్మ** ఉ. పాటిపాటెమ్మ. ఒక గ్రామదేవత (కో. 12).

**పాలపొంగళ్ళు** పొలం ఏపుగా పెరిగేటప్పుడు బియ్యం, బెల్లం, పాలు మొ. వి పొంగించటం (కో. 12, 27, 28, 32; తె. 1, 17, 24-28, 34, 39, 41).

**పెద్దమ్మ** ఒక గ్రామదేవత (తె. 31).

**పొంగుబోనం** చేను ఈనేటప్పుడు పొలంలో వండే పొంగలి (తె. 17).

**పొత్తి** కళ్ళంచుట్టూ ఒకడు పొలితిరిగే ఆచారం; చూ. పొలి (తె. 1, 2, 5, 19, 26, 34): -కుప్ప పొత్తితిరిగే వాడికి రాసిలో వదిలే ధాన్యం (తె.).

**పొలి** (1) గ్రామాచారాల్లో దేవత(ల)పేర పెట్టే నైవేద్యం-ధాన్యం, అన్నం, జంతుబలి, మొ. వి; (2) గ్రామ దేవతలను, వ్యవసాయధనాన్ని ఆరాధించే విధానం (కో. 2, 7, 10, 12, 13, 15-29, 31, 32, 35, 37, 40, 41, 45-49, 51; తె. 1, 3-13, 16, 19, 22, 26, 31-42; రా. 2, 4-15, 17-28); **-కట్టు, -గట్టు** (క్రి.). గింజలుచేతబట్టుకొని ఒకడు తిరుగుతూ మేలురాసిచుట్టూ గీతగీయటం (కో. రా.); **-కేక** ఉ. పులికేక. కళ్ళంచుట్టూ గాని, రాసిచుట్టూగాని పొలితిరిగేవాడు స్థానికంగాఉన్న సంప్రదాయాన్ని బట్టి బిగ్గరగా అనే మాటలు, పాడేపాటలు, ఉదా: "పంచపాండవులిచ్చిన పంట పొలోపొలి" (కో. తె.); "పోచెమ్మ ఇచ్చింది పొలోపొలి" (తె.); "వలియొ వలియో రావేలుగలవాడ రార పొలిగా" (కో.); "పొలోలిగా పొలి గలపొలిగా" (రా.); **-గాడు** పళ్ళెక నెత్తినబెట్టుకొని పొలి గీత గీసేవాడి వెంబడి పొయ్యేవాడు (కో.); **-గింజలు** మేలురాసిలో దేవుడిపేర దీసిన అయిదు దోసిళ్ళ ధాన్యం; చూ. దేవ(ర)దోసిలి (రా.); **-చుట్టు** (కి.). ఉ. -జుట్టు; చూ. -కట్టు (కో. తె.); **-చేట** ఉ. పొలెచ్చేట. పొలితిరిగే

వాడు పట్టుకొనే ధాన్యపుచేట; దీంట్లో వినాయకుణ్ణి బెట్టి రాసిచుట్టూ తిరుగుతాడు; ఈ గింజలు పొలితిరిగేవాడికే వదుల్తారు (కో. తె.); **-తిరుగు** (క్రి.). పనిచాలించిన తరవాత కళ్ళంచుట్టూ ఒకడు గింజలు చేతబట్టుకొని "పొలో పొలి" అంటూ తిరగటం (కో. తె.); **-దేవర** పండిన చేనికి ఏటను బలిఇచ్చి రక్తంచల్లి కోతలు మొదలుపెట్టే ఆచారం (రా.); **-పండగ** చూ. -దేవర (రా.); **-పళ్ళెక** చూ. -చేట (కో.); **-పాట** (-పాటలు) పొలిదిరిగేవాడు పాడేపాట, ఉదా: 'పొలిగలుగు సీతమ్మకు పోతట్లు, మలిగలుగు సీతమ్మకు మండెట్లు' (కో.); **-పెట్టు** (క్రి.). ఊరి జాతర్లలో దేవతపేర నైవేద్యం పెట్టటం (తె.); **-బాది** పొలిదిరిగినవాడు కళ్ళం అడుగున ఊడ్చుకొని పోగుచేసు కొన్న గింజలు (తె.); **-బొబ్బ** చూ. -కేక (తె.); పొలిలో రకాలు: **అన్నం-** పంటచేలో బొమ్మనుబెట్టి పూజచేసి నైవేద్యంగా పెట్టే అన్నం (తె.); **అలుకు-** గింజలు చల్లే (అలికే) రోజు పొలంగట్టుకు బొట్లుపెట్టి ఏటబలితోచేసే పూజ (తె.); **ఏటి-** ఏపుగాపెరిగే చేలో సూర్యచంద్రాదు లను పూజించి ఏటను బలిఇచ్చి దాని రక్తం పొలంలోచల్లే ఆచారం (తె. రా.); **కమురు-** కోతలకుముందు కొడవల్ని పూజించి ఏటనుకొట్టే ఆచారం (తె.); **కోడి-** పండినచేనికి కోడిని బలిఇచ్చి చేసేపూజ (తె.); **కోత-** కోతలకు ముందు పంటచేనికి ఏటనుబలిఇచ్చిచేసే పూజ (తె. రా.); **చాలేటి-** దున్నటం మొదలుపెట్టినప్పుడు తెగిన మొదటి చాలుకు పూజచేసి ఏట బలిఇవ్వటం (తె.); **చిత్త-** పండిన పొలానికి చిత్తకార్తెలో ఏటను బలిఇచ్చే ఆచారం (కో.); **చేట-** నిండురానిని చేటలో విసిరే ఆచారం (కో.); **దంతె-** (1) రాసిచుట్టూ దంతెతో పొలిచుట్టటం; (2) దంతెతోలే ముందు దాన్ని పూజించి చేసే ఏటబలి (తె.); **పచ్చ-** పచ్చపొలానికి ఏటబలితో చేసేపూజ (కో. తె.); పసరు- చూ. పచ్చ- (రా.); **బోనం-** చూ. అన్నం- (రా.); **రాసి-** ధాన్యపు కుప్పకు పూజచేసి పెట్టే నైవేద్యం (కో. తె.); **రేగు-** చూ. ఏట- (తె.); **సాగు-** పొలం దున్నే ముందు ఏట బలితో చేసేపూజ (రా.); **సుంకు-** సుంకు పట్టిన పైరుకు ఏటబలితో చేసే పూజ (రా.).

**పొలిమేరమ్మ** ఊరి సరిహద్దుదగ్గర ఉండే గ్రామదేవత; ఏటేటా ఏటబలితో ఆరాధిస్తారు; చూ. పోతేరమ్మ (రా. 5, 6, 13-16).

**పోచెమ్మ** ఒక గ్రామదేవత (తె. 2, 18, 25-27).

**పోతులయ్య** ఒక గ్రామదేవత (తె. 4, 37).

**పోలమ్మ** ఒక గ్రామదేవత (తె. 33).

**పోలేరమ్మ** ఒక గ్రామదేవత; చూ. పొలిమేరమ్మ (కో. 12; తె. 37, 39; రా. 9, 27).

**బంగారమ్మ** ఒక గ్రామదేవత; పైర్లకు తెగుళ్ళుపడితే కుంభం పోసి ఏటలుగొట్టి ఆరాధించి పొలిమేరదగ్గర విడిచి వస్తారు (రా. 28).

**బడిమె** మాదిగవాడికిచ్చే దండకట్టు (పొట్టు, గింజలు కలిసిన భాగం) (తె. 1).

**బయేరుసామి** వానకోసం ఆరాధించే ఒక గ్రామదేవత; భైరవస్వామి (కో. 29).

**బాడివారం** దమ్ములు అయిపోయిన తరవాత చేసు కొనే పండగ; పశువులకు పరమాన్నం వండి పెడతారు (కో. 49).

**బావిగంగమ్మ** ఉ. బాయిగంగమ్మ. వానకోసం ఆరాధించే దేవత; బావిదగ్గర పూజచేసి ఏటలుగొట్టి ఆరాధిస్తారు (రా. 14, 16).

**బుసిపట్టు** మాదిగవాడికి మామూలుగా ఇచ్చే పొట్టు, గింజలు కలిసిన భాగం (దండకట్టు) (తె. 35).

**బేతాలుడు** ఒక గ్రామదేవత (తె. 15).

**బొమ్మదేవర** కపిలగట్టే ముందు బొమ్మచేసి పూజచేసే దేవత (రా. 11, 13, 14, 16, 24, 25).

**బోణం** (-పెట్టు) ధాన్యరాశిమీద ఒక చెంబు అలంక రించి పెట్టే ఆచారం (తె. 31).

**బోనం** (తీయు, -పెట్టు, -పోయు), గ్రామదేవతలకు నైవేద్యంగా పెట్టే వంటకం; నిండుకుండ భోజనం (తె. 18, 20, 22, 25-28, 34, 35).

**మల్లలమ్మ** ఒక గ్రామదేవత (రా. 23).

**మాతమ్మ** ఒక గ్రామదేవత; చూ. గంగదేవత (రా. 9).

**మారెమ్మ** ఒక గ్రామదేవత (రా. 15, 16, 28).

**మాలపున్నమ** మహాలయపూర్ణిమ; వానకోసం జోకుమారుడి పూజచేస్తారు; జోకుమారుడు (రా. 18).

**ముత్తేలమ్మ** ఒక గ్రామదేవత (కో. 31; తె. 37, 39, 40).

**మేర** మంగలి, చాకలి, మొ. ఆయగాళ్ళకు కళ్ళంలో కొలిచే గింజలు (తె. 33, 37; రా. 18, 24, 26, 27); **-గింజలు** చూ. మేర (రా.).

**మైసమ్మ** ఒక గ్రామదేవత (తె. 17, 20-22, 25).

**మొగులేట** (-కొట్టు). అడవిలో మేఘాన్ని పూజించి చేసే ఏట బలి (తె. 36).

**రామదండు** వానకోసం నడిపే ఆచారం; ఊళ్లో ఇంటి కొకరు వంతున తలంటిపోసుకొని కర్రలకు రాగిఆకులు పసుపుగుడ్డలు కట్టుకొని రాములవారి పటం బట్టుకొని మూడూళ్ళుగాని, ఐదూళ్ళుగాని తిరుగుతారట; ఆ ఊళ్ళల్లో వీరికి అతిథిసత్కారాలు చేస్తారట (తె. 26, 27, 30, 31, 35).

**లచ్చిమ్మ** దేవతగా ఆరాధించే పచ్చపొలం; సస్యలక్ష్మి

(తె. 4, 5).

**లింగమయ్య** ఒక గ్రామదేవత (రా. 28).

**వనభోజనం** వానకోసం ఊరివారు వనంలో పూజలు, భోజనాలు చేసే సంప్రదాయం (తె. 31, 40).

**వరదపాసెం** వానకోసం నడిపే ఆచారం; పరమాన్నం, బెల్లపుపానకం సంతర్పణ జేస్తారు (కో. 40, 41, 44, 46 - 49; తె. 1, 7, 9, 10, 16, 21 - 27, 32-38).

**వలసజాతర** ఊరివారంతా పొలిమేరదగ్గరకు వెళ్ళి, గాలిదేవరను పూజించి పాయసాలు వండుకొని తిని వచ్చే సంబరం; వానకోసం నడిపే ఆచారం (రా. 14).

**వలసదేవర** వానకోసం అడవికి వనభోజనం వెళ్ళి ఆరాధించే దేవత (రా. 5, 6).

**వినాయకగంప** కళ్ళంలోనుంచి గింజలు ఇంటికి తెచ్చేటప్పుడు పసుపు కుంకాలతో ఆడపడుచు కిచ్చే ధాన్యపుగంప (కో. 26, 27, 33, 35; తె. 41; రా. 12, 18, 23, 24).

**సంజీవరాయుడు** గ్రామదేవతగా ఆరాధించే ఆంజనేయ స్వామి (రా. 9).

**సత్తెమ్మ** ఒక గ్రామదేవత (రా. 10).

**సమ్మక్క** ఒక గ్రామదేవత (కో. 30; తె. 30).

**సాగుబాటు** నాగటిపూజ; చూ. ఏరువాక (తె. 24).

**సాలదేవర** వానరాకుంటే ఊరివారంతా వనభోజనం వెళ్ళి ఆరాధించే దేవత (తె. 42).

**సాలోకులు** కళ్ళంలో దానధర్మాలుగా వేసే గింజలు (తె. 36).

**సిడిమాను** పోలేరమ్మకొలువులో బండిమీద ఊరేగించే గొర్రెపోతును కట్టే కర్ర (కో. 14).

**సుంకులమ్మ** ఒక గ్రామదేవత (రా. 28).

**సెలగ** ఉ. సెలిగె. కళ్ళంలో ధాన్యం కొలిచేటప్పుడు (ఇరవైకుండల కొకటి చొప్పున) లెక్క గుర్తుకు పోసే పిడికెడు గింజల కుప్ప (కో. 11; తె. 1).

## 2. చుక్కలు, కార్తెలు

**అక్కాచెల్లెలుచుక్క(లు)** పూర్వోత్తరాషాఢలు కావచ్చు; ఇవి దగ్గర దగ్గరగా ఉంటాయి (కో. 33).

**అగ్నికార్తె** ఉ. అగినికర్తె, అగినికర్తెరి; పర్యా. చూ. భరణి. వైశాఖమాసం (మేనెల మొదటిభాగం)లో వచ్చే కార్తె; ఈ కార్తెలో ఎండలు మొదలౌతాయి (కో. 39-41, 43).

**అంకతాడు** ? చూ. వంకతాడి (కో. 30).

**అత్తాకోడలిచుక్క(లు)** పుబ్బ ఉత్తర నక్షత్రాలు కావచ్చు; దూర దూరంగా ఉంటాయి; పుబ్బకంటే ఉత్తర కాంతిమంతంగా ఉంటుంది (కో. 14, 26-32, 35, 36, 44; తె. 40, 41).

**అనూరాగ** ఉ. అనారాగ, అనారాగి, అనారోగ, అనారోగి, అనురోగ, అనూరాగం, అనురోగ, అనోరాగ, అనోరాగి, అనోరోగ, అన్రాగ, అన్రోగ, అన్రోగి; చూ. అనూరాధ (కో. 10-13, 16 - 18, 20-22, 24, 27, 28, 33, 34, 36, 41, 43—45; తె. 1, 3, 5, 7-12, 14, 25, 29, 32, 36, 38, 39, 42; రా. 4, 5, 7, 9, 11, 18, 21-24, 26-28).

**అనూరాధ** ఉ. అనారాద, అనూరాద, అనూరోద, అనోరోజ, అనోరోద; రూ. అనూరాగ, ఆరాద. కార్తిక మాసం (నవంబరు మధ్యభాగం)లో వచ్చే కార్తె (కో. 23-26, 30, 32, 35, 40, 46; తె. 6, 34, 35, 37).

**అన్నదమ్ములచుక్క** పూర్వోత్తరాభాద్రలు కావచ్చు (కో. 33).

**అయోధ్యచుక్క** ఉ. అయోద్దెసుక్క; పర్యా. చూ. ధ్రువుడు. ధ్రువనక్షత్రం; ఇది ఉత్తరదిక్కున కనిపిస్తుంది; ఎప్పుడూ అస్తమించదు (తె. 4).

**అరంజోతి** ఉ. అరంజోతి; చూ. అరుంధతి (కో. 20, 33, 36, 37, 39—41, 44-46, 48, 49; తె. 3, 5, 9, 12, 20, 22, 23, 27, 29, 34-39, 42; రా. 5, 9, 20-28).

**అరుంజతి** చూ. అరుంధతి (తె. 32).

**అరుంధతి** ఉ. అరుందతి; రూ. అరంజోతి, అరుంజతి; పర్యా. జ్యోతిచుక్క, ధనంజ్యోతి, పరంజ్యోతి. సప్తర్షి మండలంలో వశిష్ఠుడుచుక్కదగ్గర కనపడీ కనపడకుండా ఉండే చిన్నచుక్క (కో. 26-28, 35; తె. 31, 40, 41).

**అశ్వని** ఉ. ఆశ్వని; రూ. అసెని; పర్యా. ఎడకార్తె, చింతపువుకార్తె. చైత్రమాసం (ఏప్రిల్ నెల రెండోభాగం)లో వచ్చే కార్తె (కో. 2, 27, 46—48).

**అష్టం** చూ. హస్త (తె. 1, 6).

**అష్టిమి** చూ. హస్త (కో. 16).

**అసిలి** చూ. ఆశ్లేష (రా. 3-5).

**అసిలేరు** ఉ. అసలేరు, అసిసేరు, ఆస్లేరు; చూ.

అశ్లేష (కో. 10-13, 18, 19, 21-31, 44 ; తె. 1, 3-15, 18, 20, 21, 23-29, 32-42 ; రా. 7, 9, 11, 18, 21-28).

**అసెని** ఉ. అశని, అసని, అసిని, అస్సని, అస్పిని ; చూ. అశ్వని (కో. 41, 45 ; తె. 1, 3, 4, 6, 9, 11, 12, 31-36, 38, 39, 42 ; రా. 11).

**ఆరాద** చూ. అనూరాధ (తె. 29, 40).

**ఆరుద్ర** ఉ. అపదర, అపద్ర, అరద్ర, అరిద్దర, ఆరిద్ర, ఆరిద్రె, ఆపదన, ఆపదర, ఆరుదల, ఆరెద, ఆరెద్ర, ఆలిద్దర, ఆలుద్ర ; రూ. ఆరెద్దల(కార్తె). జ్యేష్ఠమాసం (జూలై నెల రెండవభాగం)లో వచ్చేకార్తె; దీంట్లో ముంగారి పైర్లు వేస్తారు (కో. 10-13, 16-26, 28-31, 33-37, 39-41, 43, 44, 46 - 49 ; తె. 1, 5, 8, 10-12, 14-38, 40).

**ఆరెద్దల(కార్తె)** ఉ. ఆరిద్దల, ఆరుద్దల ; చూ. ఆరుద్ర (తె. 3, 4, 6, 7, 9, 39 ; రా. 3-5, 7, 9, 11, 18, 21-28).

**ఆలబొద్దుచుక్క** శుక్రనక్షత్రం కావచ్చు ; ఆవుల్ని ఇంటికి తోలేవేళ (సాయంకాలం) ఇది కనిపిస్తుంటుంది (కో. 44).

**ఆలమంద** పర్యా. ఆవులదొడ్డి, కోనేరు, గొడ్లదొడ్డి, దొడ్డిచుక్కలు, పసులమంద. శతభిషానక్షత్రం కావచ్చు ; దగ్గర దగ్గరగా ఉండే నూరుచుక్కల గుంపు (కో. 28, 31, 35).

**ఆలలు** వరసగా ఉండే మూడు చుక్కలు ; గొరు కొయ్యలు గావచ్చు (కో. 51).

**ఆవులదొడ్డి** పర్యా. చూ. ఆలమంద. శతభిషానక్షత్రం గావచ్చు ; దగ్గర దగ్గరగా ఉండే నూరుచుక్కల గుంపు (తె. 24).

**ఆశ్లేష** ఉ. అసలేస, అసలేసు, అసిలేసె, ఆసిలేష, ఆస్లేస, ఆస్లేసి ; రూ. అసిలి, అసిలేరు. ఆషాఢ మాసం (ఆగష్టు మొదటిభాగం)లో వచ్చే కార్తె (కో. 32, 33, 35-37, 39-41, 43, 45, 48 ; తె. 26, 31).

**ఇప్పకొయ్యలు** పర్యా. చూ. గొరుకొయ్యలు. ఆపుద్రా నక్షత్రం ; గొర్తిచెక్కల్లాగా వరసగాఉండే మూడుచుక్కలు (కో. 34).

**ఉత్తర** ఉ. ఉత్తరి, ఉత్తరె, ఉత్తిరి, ఉత్తుర, ఉత్తెర, ఉత్ర. భాద్రపదమాసం (సెప్టెంబరు మొదటి భాగం)లో వచ్చే కార్తె ; ఈ కార్తెలో పత్తివేస్తారు (కో. 10-13, 16-18, 20-37, 39, 41, 43-46, 48, 49 ; తె. 1-12, 14-20, 22-42 ; రా. 3-5, 7, 9, 11, 18, 21-28).

**ఉత్తరసాల** చూ. ఉత్తరాషాఢ (తె. 10, 12).

**ఉత్తరాషాఢ** రూ. ఉత్తరసాల. పుష్యమాసం (జనవరి మొదటి భాగం)లో వచ్చే కార్తె (కో. 49).

**ఎడకార్తె** పర్యా. చూ. అశ్వని. చైత్రమాసం (ఏప్రిల్)లో వచ్చే కార్తె ; సేద్యపు పనులు తక్కువగా ఉండే కార్తె (తె. 27).

**ఎదురుచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. ధ్రువ నక్షత్రం, చూ. ధ్రువుడు ; (కొన్నిచోట్ల) శుక్రుడు ; ఈ చుక్కఉన్న దిక్కున ప్రయాణం చెయ్యగూడదు (కో. 9, 10, 37, 45-48).

**ఎరచుక్క** కుజుడు పేరుతోఉండే చుక్క ; ఎర్రరంగు మెరుపుతో ఉంటుంది (తె. 1, 34, 37).

**ఏసమంచం** పర్యా. పొన్నమాను, పొన్నమామిడి, పొన్నరతం. దక్షిణంవైపున కనపడే ఆరుచుక్కలు; నాలుగు పెద్దవి, రెండు చిన్నవి ; ఏసగా ఉండే మంచంమాదిరి ఉంటా యిట (కో. 26-29, 32, 33, 35 ; తె. 40, 41 ; రా. 5, 7, 11, 23).

**ఓదెలతడుపులు** పర్యా. గిరప్పదులు. పూర్వోత్తరా షాఢల (జంటకార్తెల)కు సామాన్యంగాపెట్టిన పేరు; పుష్య మాసం (డిశంబరు)లో వచ్చే కార్తెలు ; పైరుకోసి పొలంలో వేసిన ఓదెలను ఇవి తడుపుతాయట (తె. 32 ; రా. 7, 5, 18, 24).

**కటక** పర్యా. చూ. పుష్యమి. ఆషాఢమాసం (జులై నెల రెండోభాగం)లో వచ్చే కార్తె (కో. 45).

**కతికి** చూ. కృత్తిక (రా. 21).

**కత్తి** చూ. కత్తెర (రా. 7).

**కత్తిక** చూ. కృత్తిక (కో. 45).

**కత్తెర** రూ. కత్తి ; పర్యా. చూ. కృత్తిక. కృత్తిక కార్తె ; వైశాఖమాసం (మే నెల రెండోభాగం)లో వచ్చేది (కో. 27, 29, 34 ; తె. 9, 31, 34-36, 38, 41).

**కంబడిచుక్క** పర్యా. చూ. ధ్రువుడు, ధ్రువనక్షత్రం; ఇది ఉత్తరదిక్కున కనిపిస్తుంది ; ఎప్పుడూ అస్తమించదు (తె. 29).

**కరవడికార్తెలు** వర్షంలేని కార్తెలు ; వ్యవసాయానికి ఉపయోగం లేనివి ; జ్యేష్ఠనుంచి రోహిణిదాకా (కో. 33).

**కర్కాటక** ఉ. కరకాటకి ; పర్యా. చూ. పుష్యమి. ఆషాఢమాసం (జులైనెల రెండో భాగం)లో వచ్చే కార్తె (కో. 41, 43).

**కర్తిక** చూ. కృత్తిక. (తె. 4).

**కర్తెరి** పర్యా. చూ. కృత్తిక. కృత్తిక కార్తె ; వైశాఖ మాసం (మే నెల రెండోభాగం)లో వచ్చే కార్తె (కో. 43).

**కాపుచెరుపుచుక్క** పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి అనే నక్షత్రం ; నవగ్రహాల్లో ఒకటి ; ఇది జ్యేష్ఠ, ఆషాఢమాసాల్లో రాత్రి ఒంటిగంటకు తూర్పున

పొడుస్తుంది; దాన్ని చూచి తెల్లవారింది అనే భ్రమతో ఒక రైతు పొలానికి వెళ్ళి అపాయంతో మరణించాడట; ఇది కొన్ని నెల్లు సంధ్యవేళ, కొన్నినెల్లు అర్ధరాత్రి వేళ, కొన్ని నెల్లు తెల్లవారుజామున పొడుస్తుంది (రా. 9).

**కార్తి** (బహు. కార్తులు); చూ. కార్తె (తె. 17, 20, 22–28).

**కార్తె** ఉ. కర్తె; రూ. కార్తి. కృత్తిక మొదలు ఒక్కొక్క నక్షత్రంలో సూర్యు డుండేకాలం; సుమారు పదమూడున్నర రోజులు; ఇరువైఏడు నక్షత్రాలకు ఆ విధంగా ఇరువైఏడు కార్తెలు (కో. 9, 33, 40, 41, 51).

**కావడిచుక్కలు** (బహు.). బృహస్పతి కిందివైపున మూలగాఉండే రెండు చుక్కలట; లేక, చూ. గొల్లకావడి (కో. 14).

**కాశీచుక్క** పర్యా. చూ. ధ్రువుడు. ధ్రువనక్షత్రం: మనకు కాశీ ఉన్నదిక్కున (ఉత్తరదిక్కున) కనిపిస్తుంది; ఎప్పుడూ అస్తమించనిది (తె. 33).

**కిటికె** ఉ. కిటిక, కిటెక, కిటెకె; చూ. కృత్తిక (తె. 5, 7, 11, 12, 14, 28, 29, 32, 33, 42).

**కిరికతి** చూ. కృత్తిక (తె. 11).

**కుక్కచుక్క** పునర్వసు నక్షత్రం (కో. 48).

**కుంచేటిచుక్క** పర్యా. ఎదురుచుక్క, కోడికూత చుక్క, గంటచుక్క, గుడ్డిచుక్క, చాకలిచుక్క, చాయ చొన్నలచుక్క, తెలగాయచుక్క, తెల్లవారుచుక్క, పరమటి చుక్క, పసరంచుక్క, పసులచుక్క, పెద్దచుక్క, పొద్దు పొడుపుచుక్క, మోటచుక్క, వలచుక్క, సందెచుక్క. శుక్రుడు పేరుతో ఉండేచుక్క; పొద్దుపొడిచేముందు (తూర్పున) కొన్ని నెల్లు, పొద్దుగూకేముందు (పడమట) కొన్ని నెల్లు ప్రకాశవంతంగా ఆకాశంలో కనిపిస్తుంది; ఇది పొడిచింతరవాత (సాయంకాలం) కుంచేళ్ళు మేతకు పోతాయట (కో. 11, 25; తె. 3-7, 10, 25, 36, 38-40, 42; రా. 21-25).

**కుమ్మరసారె** రోహిణీ నక్షత్రం; కుమ్మరిసారెమాదిరి కోసుగా ఉండే అయిదు (? ఆరు) చుక్కల మొత్తం (తె. 35; రా. 5, 28).

**కూరెగొయ్యలు** ఉ. కూరగొయ్యలు; పర్యా. చూ. గొరుకొయ్యలు. ఆరుద్రానక్షత్రం; గొర్తిచెక్కల్లాగా వరసగా ఉండే మూడుచుక్కలు (తె. 18).

**కృత్తిక** ఉ. కుత్తిక, కుత్తికె, కురితిక, కురుత్తిక, కుర్తిక, కుర్తికె; రూ. కతికి, కత్తిక, కర్తిక, కిటికె, కిరికతి; పర్యా. కత్తి, కత్తెర, నిజుకత్తెర. కృత్తికకార్తె; వైశాఖ మాసం (మే నెల రెండోభాగం)లో వచ్చేది (కో. 46-48; తె. 1, 3, 6; రా. 3, 4, 9, 11, 18, 28).

**కొమిరెగొయ్యలు** ఉ. కొమ్రెగొయ్యలు; పర్యా. చూ. గొరుకొయ్యలు. ఆరుద్రానక్షత్రం; గొర్తికొయ్యల్లాగా వరసగా ఉండే మూడుచుక్కలు (తె. 16, 17, 19, 20).

**కోడికూతచుక్క** పర్యా. చూ. కుంచేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం; పొద్దుపొడిచేముందు (కోడికూతవేళ) కొన్ని నెల్లు ఆకాశంలో కనిపిస్తుంది (కో. 31).

**కోనేరు** పర్యా. చూ. ఆలమంద. శతభిషానక్షత్రం కావచ్చు; దగ్గర దగ్గరగాఉండే నూరు చుక్కలగుంపు (తె. 27).

**కోమటిచుక్క** పర్యా. చూ. మూలచుక్క. బుధుడు (వైశ్యగ్రహం) పేరుతో ఉండే నక్షత్రం (తె. 14).

**గంటచుక్క** పర్యా. చూ. కుంచేటిచుక్క. పొద్దు పొడిచే ముందు కొన్నినెల్లు (తూర్పున); పొద్దుగూకిన వెనక కొన్నినెల్లు (పడమట) ఆకాశంలో కనిపిస్తుంది: దీన్నిబట్టి రాత్రి, వేకుపజాము తెలుసుకొంటారు (తె. 27).

**గంపచుక్క** పర్యా. పొద్దు. సూర్యుడు (తె. 27).

**గయచుక్క** పర్యా. చూ. ధ్రువుడు. ధ్రువనక్షత్రం; మనకు గయ ఉన్న దిక్కున (ఉత్తరదిక్కున) కనిపిస్తుంది; ఎప్పుడూ అస్తమించనిది (తె. 33).

**గర్బదులు** (బహు.) (? < గర్భదత్తులు) పర్యా. ఓదెదలతడుపులు. పూర్వోత్తరాషాఢలు జంటకార్తెలను అలా పిలుస్తారు; పుష్యమాసం (డిశంబరు)లో వచ్చే కార్తెలు (రా. 9).

**గుడ్డిచుక్క** పర్యా. చూ. కుంచేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం పొద్దుపొడిచే ముందు కొన్నినాళ్ళు, పొద్దుగూకిన వెనక కొన్నినాళ్ళు ఆకాశంలో కనిపిస్తుంది (రా. 4, 5, 7, 21).

**గుర్తు** పర్యా. చూ. చుక్క. ఆకాశంలో మెరిసే జ్యోతి, గ్రహం (తె. 41).

**గొల్లదొడ్డి** పర్యా. ఆలమంద. శతభిషానక్షత్రం కావచ్చు; దగ్గరగా ఉండే నూరు చుక్కలగుంపు (కో. 32; తె. 41).

**గొరుకాళ్ళు** చూ. గొరుకొయ్యలు (రా. 9, 11, 24-26).

**గొరుకొయ్యలు** (బహు.) ఉ. గరకొయ్య, గొర కొయ్యలు, గొరుకొయలు, గొర్రకొయ్యలు, గొర్రుకొయలు, గొర్రుకొయ్యలు, గోరుకొయలు; రూ. గొరుకాళ్ళు, గోరు కోళ్ళు, గొర్తికొయ్యలు; పర్యా. ఇప్పకొయ్యలు, కూరె గొయ్యలు, కొమిరెగొయ్యలు, గొల్లకావడి. ఆరుద్రానక్షత్రం; గొర్తిచెక్కల్లాగా వరసగా ఉండే మూడుచుక్కలు (కో. 10, 11, 13-16, 20, 26–29, 35; తె. 1, 3, 4, 7-9, 11, 12, 14, 15, 20, 24-33, 38, 40, 42; రా. 6, 18, 21, 23, 27, 28).

**గోరుకోళ్ళు** చూ. గొరుకొయ్యలు (తె. 34-38).

**గొర్తికొయ్యలు** ఉ. గొర్తికొయలు; చూ. గొరు కొయ్యలు (కో. 30, 32; తె. 4, 5, 10, 22, 23).

**గొల్లకార్తె** (1) పర్యా. చూ. హస్త. హస్తకార్తె, భాద్రపదమాసం (సెప్టెంబరు రెండోభాగం)లో వచ్చేది (కో. 21, 22); (2) పర్యా. చూ. జ్యేష్ఠ. మార్గశీర్షమాసం (డిశంబరు మొదటిభాగం)లో వచ్చే కార్తె (తె. 29).

**గొల్లకావడి** పర్యా. చూ. గొరుకొయ్యలు. ఆరుద్రా నక్షత్రం; వరసగా మూడు చుక్కలు కావడిబద్దలాగా ఉంటాయట (కో. 33, 36, 37, 39-41, 43-51).

**చదరలు** పర్యా. బార్తాలచుక్కలు. పూర్వోత్తరాభాద్ర నక్షత్రాలు; మొత్తం నాలుగు చుక్కలు (తె. 32).

**చాకలిచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం; పొద్దుపొడిచే ముందు కొన్నినెల్లు, పొద్దుగూకిన వెనక కొనిపనెల్లు ఆకాశంలో కనిపిస్తుంది; ఈ చుక్క పొడుపుచూచి (సాయంకాలం) చాకళ్ళు రేవునుంచి ఇంటికి వస్తారు (తె. 20, 24).

**చాయజొన్నలచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం; ఈ చుక్క పడమటవైపు ఉండే నెలల్లో తెల్లజొన్నలు బాగా పండుతాయట (తె. 9).

**చిట్టె** చూ. జ్యేష్ఠ (రా. 24).

**చిత్త** ఉ. సిత; రూ. చిత్తర. ఆశ్వయుజమాసం (అక్టోబరు మొదటిభాగం)లో వచ్చే కార్తె; తెల్లజొన్న పైరువేసే అదను (కో. 10-13, 16-37, 39-41, 43-45, 48; తె. 1, 3-12, 14, 16-25, 27-38, 41, 42; రా. 3-5, 7, 9, 11, 18, 21-28).

**చిత్తర** చూ. చిత్త (తె. 39).

**చింతపువుకార్తె** పర్యా. చూ. అశ్విని. చైత్రమాసం (ఏప్రిల్)లో వచ్చేకార్తె; ఇది చింతచెట్లు పూతపూచేకాలు (తె. 27, 28).

**చిన్నపుగ** ? పర్యా. చూ. పుష్యమి. ఆషాఢమాసం (జూలైనెల రెండోభాగం)లో వచ్చే కార్తె (తె. 13).

**చిన్నపుసిలి** ఉ. చిన్నపుసల; చూ. చిన్నపుసేల (తె. 3, 4, 10-12, 14, 29, 33, 37, 39; రా. 4, 5, 24).

**చిన్నపుసేల** ఉ. చినవుశాల, చినపుసాల, చిన్నపాసాల, చిన్నపుశాల, చిన్నపూసాల; రూ. చిన్నపుసిలి, చిన్నపూసైం; పర్యా. చూ. పుష్యమి (కో. 10-13, 16, 17, 21-25, 27, 30-32; తె. 1, 5-9, 21-25, 27, 28, 30-32, 34-36, 39-42; రా. 3, 7, 9, 11, 18, 21-28).

**చిన్నపూసైం** ఉ. చినపుశం, చినపూశం; చూ. చిన్నపుసేల (తె. 15-20, 26, 27).

**చుక్క** పర్యా. గుర్తు, నక్షత్రం. ఆకాశంలో మెరిసే దివ్యజ్యోతి; గ్రహం (కో. 26-32, 35, 36; తె. 26, 28, 30, 31, 40).

**చెన్నమ్మసూసకం** పర్యా. చూ. పిల్లలకోడి. కృత్తికా నక్షత్రం; తొమ్మిదిచుక్కల గుంపు (రా. 21).

**జంట(లు)** రూ. దంట(లు). పూర్వోత్తరాభాద్రలు కావచ్చు (. 34, 36, 38).

**జాముచుక్క** పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం; ఒక్కొక్కప్పుడు రాత్రి ఒక జాముతరవాత పొడుస్తుంది (కో. 44; రా. 25).

**జిట్ట** చూ. జ్యేష్ఠ (కో. 41; తె. 1, 6, 14, 32, 34, 35, 37, 38; రా. 5, 7, 18, 21, 26-28).

**జ్యేష్ఠ** ఉ. జెట్ట, జేట్ట, జేష్ట, జేష్ఠ; రూ. చిట్టె, జిట్ట, దేష్ట; పర్యా; పర్యా. గొల్లకార్తె, మనోరాగ, మనోరాద. మార్గశీర్షమాసం (డిసెంబరు మొదటిభాగం)లో వచ్చేకార్తె (కో. 10, 11, 13, 17, 27, 34-36, 44; తె. 12, 31, 40; రా. 4, 5, 8, 9, 23).

**జ్యోతిచుక్క** పర్యా. చూ. అరంజోతి. సప్తర్షి మండలంలో వశిష్ఠుడిచుక్కదగ్గర కనపడీ కనపడకుండా ఉండే చిన్నచుక్క (తె. 33).

**డొల్లుగత్తెర** పర్యా. చూ. భరణి. వైశాఖమాసం (మే నెల మొదటిభాగం)లో వచ్చే కార్తె; దీంతో ఎండలు మొదలౌతాయి (కో. 29; తె. 39).

**తల్లికడుపు** సూర్యుడు అస్తమించే చోటు (కో. 9, 10).

**తల్లిచుక్క** బృహస్పతి పేరిట చుక్క కావచ్చు; చూ. మూలచుక్క (కో. 36).

**తెలగాయచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క శుక్రుడు పేరుతో ఉండే నక్షత్రం; పొద్దుపొడిచేముందు తూర్పువైపు కనిపించే ప్రకాశవంతమైన నక్షత్రం (తె. 4).

**తెల్లవారుచుక్క** ఉ. తెల్లారిచుక్క, తెల్లావుచుక్క, తెల్లారెచుక్క; పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం; పొద్దుపొడవకముందు పుట్టేది (కో. 20, 27, 28, 30, 32, 36, 39-41, 43-45; తె. 1, 8, 11, 14, 19, 24-29, 31-33, 35-38, 40, 41).

**తేలు(చుక్క)** వృశ్చికరాశి (తె. 4, 14, 16, 19-21, 26, 27; రా. 7, 10-12).

**తోకచుక్క** పర్యా. పొరకచుక్క. తోకతోవచ్చే నక్షత్రం; ఇది కనబడితే దేశారిష్టం అంటారు (కో. 26, 27, 44, 45, 51; తె. 1, 11).

**దంట(లు)** చూ. జంట(లు) (తె. 1, 7, 32, 37, 39).

**దినకర్తరి** ఉ. దినకత్తిరి; పర్యా. చూ. భరణి. వైశాఖమాసం (మే నెల మొదటిభాగం)లో వచ్చే కార్తె;

దీంతో ఎండలు మొదలౌతాయి (కో. 39, 41).

**దురుమండచుక్క** ధ్రువనక్షత్రం; ఇది ఉత్తరదిక్కున కనిపిస్తుంది ; ఎప్పుడూ అస్తమించదు (తె. 10).

**దేష్ట** చూ. జ్యేష్ఠ (కో. 16, 18, 20, 21, 23, 25, 32).

**దొంగచుక్క** పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం; ఒక్కొక్కప్పుడు రాత్రి రెండు జాములకు పొడుస్తుంది (కో. 26-29, 35; తె. 10).

**దొడ్డిచుక్కలు** పర్యా. చూ. ఆలమంద. శతభిషా నక్షత్రం గావచ్చు; దగ్గర దగ్గరగా ఉండే నూరుచుక్కల గుంపు (కో. 29).

**ధనంజ్యోతి** ఉ. దనంజ్యోతి; పర్యా. చూ. అరంజోతి. సప్తర్షిమండలంలో వశిష్టుడిదగ్గర కనపడీ కనపడకుండా ఉండే చిన్నచుక్క (తె. 4).

**ధనిష్ఠ** ఉ. దనిస, దనిష్ట, దనుస. మాఘమాసం (ఫిబ్రవరి మొదటిభాగం)లో వచ్చే కార్తె (కో. 51; తె. 10, 32).

**ధ్రువుడు** ఉ. దురుడు. ద్రువుడు; పర్యా. అయోధ్య చుక్క, కంబడిచుక్క, కాశీచుక్క, గయచుక్క, దురుమండచుక్క, బొడ్డుచుక్క, వెనకచుక్క, ధ్రువనక్షత్రం ; ఇది ఉత్తరదిక్కున కనిపిస్తుంది; ఎప్పుడూ అస్తమించని నక్షత్రం (కో. 37, 44; రా. 21).

**నక్షత్రం** పర్యా. చూ. చుక్క. ఆకాశంలో మినుకు మినుకు మనే జ్యోతుల సమూహం (తె. 26).

**నడిజాముచుక్క** బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం; ఈశాన్యమూల పొడుస్తుంది; చూ. దొంగచుక్క (కో. 30).

**నిజకత్తెర** పర్యా. చూ. కృత్తిక. కృత్తికార్తె; వైశాఖ మాసం (మే నెల రెండోభాగం)లో వచ్చేది (తె. 39).

**నెల** చంద్రుడు (కో. 39, 41, 45; తె. 29, 31, 33).

**పట్టెమంచం** పర్యా. చూ. మంచంకోళ్ళు. సప్తర్షి మండలంలో మంచంకోళ్ళమాదిరి ఉండే నాలుగుచుక్కలు; వాటి వెనక వరసగా మరిమూడు చుక్కలుంటాయి; వాటిని దొంగలంటారు (కో. 16, 20, 25, 30, 31, 33, 36; తె. 1, 4-7, 9, 10, 12, 14, 29, 31-40, 42; రా. 15-18, 20-25, 28).

**పరంజ్యోతి** పర్యా. చూ. అరుంధతి. సప్తర్షి మండలంలో వశిష్ఠుడుచుక్క దగ్గర కనపడీ కనపడకుండా ఉండే చిన్నచుక్క (తె. 11).

**పరమటిచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడు పేరుతో ఉండేనక్షత్రం; పొద్దుగూకిన తరవాత పడమట ఆకాశంలో కనిపిస్తుంది (తె. 33).

**పసరంచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం; పొద్దుగూకిన తరవాత పశువుల్ని ఇండ్లకు తోలేవేళ పడమట పొడుస్తుంది (తె. 12).

**పసులచుక్క** ఉ. పసలచుక్క; పర్యా. చూ. కుందేటి చుక్క. పొద్దుగూకిన తరవాత పశువుల్ని ఇండ్లకు తోలేవేళ పడమట ఆకాశంలో కనిపిస్తుంది (తె. 8, 15, 16, 19, 32, 34, 35).

**పసులపాన** చూ. పసులపానాది (తె. 41).

**పసులపానాది** ఉ. పసలపానాది, పసలబానాది; రూ. పసులపాన; పర్యా. చూ. పాలబాట. ఆకాశంలో ఉత్తరం నుంచి దక్షిణానికి తెల్లటి దోవలాగా మెరుస్తూఉండే చుక్కల బారు (తె. 14, 15, 18).

**పసులమంద** పర్యా. చూ. ఆలమంద. శతభిషా నక్షత్రం కావచ్చు; దగ్గర దగ్గరగా ఉండే నూరుచుక్కల గుంపు (కో. 26).

**పాముచుక్క** ఆశ్లేషా నక్షత్రం; పాము ఆకారంలో ఉండే అయిదు చుక్కల వరస (తె. 10).

**పాలబాట** పర్యా. పసులపాన, పసులపానాది, సొమ్ములగోర్జె, స్వర్గంబాట. ఆకాశంలో ఉత్తరంనుంచి దక్షిణానికి తెల్లటి దోవలాగా మెరుస్తూఉండే చుక్కలబారు (కో. 26-29, 32, 35, 44; తె. 40, 41).

**పిల్లలకోడి** పర్యా. కోడిపెట్ట. మంగలకత్తి, సంపతక్క, సంపతి(చుక్క). కృత్తికానక్షత్రం; తొమ్మిది చుక్కలు గుంపుగా ఉంటాయి: ఒకటి పెద్దది, మిగిలినవి చిన్నవి (కో. 9-13, 16, 25, 27, 29, 30, 32, 33, 35-37, 39-41, 43-48, 51; తె. 1, 3, 4, 7, 9, 17-20, 22-25, 28, 31, 33-41; రా. 5, 9, 11, 18, 24, 26, 28); **-మడమ** ఉ. పిల్లలకోడి మడెం. కృత్తికానక్షత్రం (పిల్లలకోడి) పొడిచినతరవాత పొడిచే చుక్క (తె.).

**పుగ** ఉ. పుక; చూ. పుబ్బ (కో. 25, 27-31, 33-35, 44; తె. 16, 18-20, 26, 30, 31, 35, 36, 41).

**పునర** ఉ. పునారు; చూ. పునర్వసు (కో. 22, 39, 41, 43, 45, 47).

**పునర్వసు** ఉ. పునరసు, పునర్బి, పునర్బు, పునర్వెనెం, పున్నరు; రూ. పునర, పున్నర; పర్యా. పెద్ద పుగ, పెద్దపునేల, పెద్దపూనెం, ఆషాఢమాసం (అగస్టునెల మొగటిభాగం)లో వచ్చే కార్తె (కో. 21, 29, 37, 44, 48, 49; తె. 26, 28, 35).

**పున్నర** ఉ. పున్నరి; చూ. పునర్వసు (కో. 33, 34, 36).

**పుబ** చూ. పుబ్బ (కో. 10, 11, 23, 24; తె. 27, 34, 40).

**పుబ్బ** రూ. పుగ, పుబ, పువ, పువ్వ, పూబ, పూవ,

శ్రావణమాసం (ఆగష్టు చివరిభాగం)లో వచ్చే కార్తె (కో. 12, 13, 16-18, 20, 21, 24, 36, 37, 40, 43, 46, 48; తె. 3-12, 14, 15, 23, 26, 28, 31; రా. 3-5, 7, 9, 11, 18, 21-28).

**పువ** చూ. పుబ్బ (కో. 22, 26, 32; తె. 17, 21, 22, 24, 25).

**పువ్వ** చూ. పుబ్బ (తె. 29, 34, 37).

**పుష్యమి** ఉ. పుషమి, పుసమి, పుసెం, పుసెమి; రూ. పుసాల, పుస్సి; పర్యా. కటక, కర్కాటక, చిన్నపుగ, చిన్నపుసాల, చిన్నపుసిలి, చిన్నపూసెం. ఆషాఢ మాసం (జులై నెల రెండోభాగం)లో వచ్చే కార్తె (కో. 18, 26, 36, 37, 44, 48; తె. 26).

**పుసాల** చూ. పుష్యమి (కో. 28, 29, 34, 35).

**పుస్సి** ఉ. పుసి; చూ. పుష్యమి (కో. 33, 39).

**పూబ** చూ. పుబ్బ (తె. 1, 39, 42).

**పూర్వసాల** చూ. పూర్వాషాఢ (తె. 10, 12).

**పూర్వాషాఢ** రూ. పూర్వసాల. పుష్యమాసం (డిసెంబరు రెండోభాగం)లో వచ్చే కార్తె (కో. 49).

**పూవ** చూ. పుబ్బ (కో. 39, 41, 45; తె. 33).

**పెద్దచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే పేరుగల నక్షత్రం; పొద్దు పొడవకముందు తూర్పున కొన్ని నెల్లు ప్రకాశవంతంగా ఆకాశంలో కనిపిస్తుంటుంది (కో. 33; తె. 15, 41).

**పెద్దపుగ** పర్యా. చూ. పునర్వసు. ఆషాఢమాసం (ఆగష్టునెల మొదటిభాగం)లో వచ్చే కార్తె (తె. 13).

**పెద్దపుసిలి** ఉ. పెద్దపుసల, పెద్దపుసలి; చూ. పెద్ద పుసేల (తె. 3, 4, 10-12, 14, 29, 33, 37, 38; రా. 4, 5, 24).

**పెద్దపుసేల** ఉ. పెద్దపసేల, పెద్దపసేల, పెద్దపుసేల, పెద్దపూసే(ల)లి; రూ. పెద్దపుసిలి, పెద్దపూసెం; పర్యా. చూ. పునర్వసు. ఆషాఢమాసం (ఆగష్టునెల మొదటి భాగం)లో వచ్చే కార్తె (కో. 10-13, 16, 17, 20, 25, 27, 30-32; తె. 1, 5-10, 21, 22, 28, 30-32, 34-36, 40, 42; రా. 3, 7, 9, 11, 18, 21-28).

**పెద్దపూసెం** ఉ. పెదపూశం, పెద్దపూశం, చూ. పెద్ద పుసేల (తె. 15-20, 26, 27).

**పొద్దు** పర్యా. గంపచుక్క. సూర్యుడు (కో. 39, 41, 45; తె. 29, 31, 33).

**పొద్దుపొడుపుచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం; పొద్దుపొడవక ముందు తూర్పున కొన్ని నెల్లు ప్రకాశవంతంగా కనిపిస్తుంది (కో. 29; తె. 3; రా. 26).

**పొన్నమాను** పర్యా. చూ. ఏసమంచం. దక్షిణంవైపున నాలుగుపక్షులుగా కనపడే నాలుగు చుక్కలు (కో. 30, 32; తె. 22, 41; రా. 5).

**పొన్నమామిడి** పర్యా. చూ. ఏసమంచం. దక్షిణం వైపున కనబడే ఆరుచుక్కలు; నాలుగు పెద్దవి, రెండు చిన్నవి; ఏసగా ఉండే మంచంమాదిరి ఉంటాయట (రా. 10).

**పొన్నరతం** పర్యా. చూ. ఏసమంచం. దక్షిణంవైపున కనబడే ఆరు చుక్కలు; నాలుగు పెద్దవి, రెండు చిన్నవి; ఏసగా ఉండే మంచంమాదిరి ఉంటాయట (రా. 14).

**పొరకచుక్క** పర్యా. తోకచుక్క. తోకతోవచ్చే నక్షత్రం; ఇది కనబడితే దేశారిష్టం అంటారు (తె. 6).

**బాపనగొర్రు** ఉ. బావనగొర్రు. గొర్తికొయ్యలకు కొద్ది ఎడంగా వరసగాఉండే మూడు చిన్న చుక్కలు (కో. 11, 13, 14; తె. 24).

**బార్తాలచుక్కలు** పర్యా. చూ. చదరలు. పూర్వోత్తరా భాద్ర నక్షత్రాలు కావచ్చు; మొత్తం నాలుగు చుక్కలు (రా. 7, 22, 24, 28).

**బేపికూన** పునర్వసు నక్షత్రం కావచ్చు; కుక్కచుక్క (కో. 37).

**బొడ్డుచుక్క** పర్యా. చూ. ధ్రువుడు. ధ్రువనక్షత్రం; ఇది ఉత్తరదిక్కున కనిపిస్తుంది; ఎప్పుడూ అస్తమించనిది (తె. 6).

**భరణి** ఉ. బరణి, బరన, బరని, బరెన, బర్ని; పర్యా. అగ్నికార్తె, డొల్లగత్తెర, దినకర్తరి. వైశాఖమాసం (మే నెల మొదటిభాగం)లో వచ్చే కార్తె; దీంతో ఎండాకాలం మొదలౌతుంది (కో. 27, 45-48; తె. 1, 3, 4, 9, 11, 12, 29, 31-38, 42; రా. 3, 4, 7, 11, 18, 21).

**మఖ** ఉ. మక; రూ. మగ. శ్రావణమాసం (ఆగష్టు నెల మధ్యభాగం)లో వచ్చే కార్తె (కో. 27, 46; తె. 26, 40).

**మగ** చూ. మఖ (కో. 10-13, 16-18, 20-23, 25, 26, 28-34, 36, 37, 39-41, 43-45, 48; తె. 1, 3-12, 14-19, 21-42; రా. 3-5, 7, 9, 11, 18, 21-28).

**మంగలకత్తి** పర్యా. చూ. పిల్లలకోడి. కృత్తికా నక్షత్రం; తొమ్మిది చుక్కలు గుంపుగా ఉంటాయి; ఒకటి పెద్దది, మిగిలినవి చిన్నవి (రా. 7).

**మంచం(కోళ్ళు)** పర్యా. పట్టెమంచం, ముత్తే(ల) మంచం, ముద్దాపమంచం, ఋషిచుక్కలు, సప్తమారుషులు. సప్తర్షి మండలంలో మంచంకోళ్ళమాదిరి ఉండే నాలుగు చుక్కలు; వాటి వెనక వరసగా మరి మూడు చుక్కలుంటాయి; వాటిని దొంగలంటారు (కో. 39, 41, 45; తె. 8, 11, 28).

**మడిమెచుక్క** ఉ. మడెంచుక్క, మెడెముచుక్క.

బుధుడి పేరుతో ఉండే చుక్క; (కొందరు) రోహిణినక్షత్రం అని (కో. 23; తె. 1, 6, 12, 40).

**మనోరాగ** ఉ. మనారాగ, మనోరోగ, మన్రాగ; రూ. మనోరాద; పర్యా. చూ. జ్యేష్ఠ. మార్గశీర్షమాసం (డిశంబరు మొదటి భాగం)లో వచ్చే కార్తె (తె. 5, 7, 9-11, 39; రా. 22).

**మనోరాద** పర్యా. చూ. జ్యేష్ఠ (కో. 26)

**మిర్గు** చూ. మృగశిర (తె. 13, 15-22, 26).

**మీసర** చూ. మృగశిర (కో. 25).

**ముత్తే(ల)మంచం** పర్యా. చూ. మంచంకోళ్ళు. సప్తర్షిమండలంలో మంచంకోళ్ళమాదిరి ఉండే నాలుగు చుక్కలు; వాటి వెనక వరసగా మరిమూడు చుక్కలుంటాయి; వాటిని దొంగలంటారు (రా. 5, 7, 9, 11, 18, 23-27).

**ముద్దాపమంచం** ఉ. ముద్దప్పమంచం; పర్యా. చూ. మంచంకోళ్ళు. సప్తర్షిమండలంలో మంచంకోళ్ళమాదిరి ఉండే నాలుగుచుక్కలు; వాటి వెనక వరసగా మరిమూడు చుక్కలుంటాయి; వాటిని దొంగలంటారు (తె. 3; రా. 21, 22).

**మూల** రూ. మూలం. మార్గశీర్షమాసం (డిశంబరు మధ్యభాగం)లో వచ్చే కార్తె (కో. 10, 11, 13, 16-25, 27, 29, 32, 35; తె. 1, 6, 8, 11, 12, 31, 32, 38, 39; రా. 3-5, 7, 9, 18, 21, 23, 24, 26-28).

**మూలచుక్క** పర్యా. కాపుచెరుపుచుక్క, జాముచుక్క, తెలగాయచుక్క, దొంగచుక్క, నడిజాముచుక్క, రెడ్డిచుక్క, రెడ్డిబొడుపుచుక్క, రేచుక్క, సందుచుక్క, సందె(కాడ)చుక్క. బృహస్పతి పేరుతోఉండే నక్షత్రం; ఈశాన్యమూల పొడుస్తుంది; నడిజాముకు తూర్పువైపు కనిపిస్తుంది (కో. 11; తె 1, 3-5, 7, 9, 11, 12, 24, 25, 27-29, 31-38, 42).

**మూలం** చూ. మూల (కో. 44).

**మృగశిర** ఉ. మగసిర, మగనెల, ముగసిర, ముగసిల, ముగనెల, మురకసిర, మురగసిర, మురసిర, మురికిసిర, ముర్గలసిర, మున్గసిర, ములగసిర, ములగసిరి, మెల్లరసిరి, మృగసల, మెరుగుసిల, మొగసిర, మొగసిల, మొగినెల, మొలకసిల; రూ. మిరుగు, మీసర, మెడసరి, మెరుగు, మెరుపుసాలు. జ్యేష్ఠమాసం (జూన్ నెల రెండోభాగం)లో వచ్చే కార్తె; ఈ కార్తెలో తొలకరివానలు కురుస్తాయి; ముంగారి పైర్లు (పచ్చజొన్న, సజ్జ, వేరుసెనగ, క్రొర మొ. వి) వేస్తారు (కో. 10, 11, 13, 16-24, 26-36, 40, 41, 46-49; తె. 1, 3, 6, 8, 24-32, 34-38, 40, 42; రా. 3-5, 7, 9, 11, 18, 23, 25, 26, 28).

**మెడసరి** చూ. మృగసిర (కో. 39).

**మెరుగు** ఉ. మెరగం, మెరిగ; చూ. మృగసిర (తె. 4, 5, 7, 9-12, 14, 33, 36).

**మెరుపుసాలు** చూ. మృగశిర (రా. 21, 22).

**మోటుచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం; పొద్దుపొడవకముందు తూర్పున కొన్నినెల్లు పొడుస్తుంది (తె. 22, 41).

**రుషిచుక్కలు** పర్యా. చూ. మంచంకోళ్ళు. సప్తర్షి మండలంలో మంచంకోళ్ళమాదిరి ఉండే నాలుగు చుక్కలు; వాటి వెనక వరసగా మరిమూడు చుక్కలుంటాయి; వాటిని దొంగలంటారు (కో. 37).

**రెడ్డిచుక్క** ఉ. రేడిచుక్క; పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతోఉండే నక్షత్రం; ఈశాన్యమూల పొడుస్తుంది (కో. 11; తె. 35, 36, 40, 41; రా. 27).

**రెడ్డిబొడుపుచుక్క** ఉ. రెడ్డిపొడుపుచుక్క; పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతోఉండే నక్షత్రం; ఈశాన్యమూల పొడుస్తుంది (కో. 9, 10, 12, 13, 16, 20, 25).

**రేచుక్క** పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం; ఈశాన్యమూల పొడుస్తుంది (కో. 37, 40, 41, 43, 45-49, 51).

**రేయినడుపుచుక్క** పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతోఉండే నక్షత్రం; ఈశాన్యమూల పొడుస్తుంది; రాత్రిళ్ళు ఉదయాస్తమయాలున్న నక్షత్రం (కో. 37, 40, 41, 46-49).

**రోణి** ఉ. రోని; చూ. రోహిణి (కో. 31, 39, 41, 44, 45; తె. 1, 4, 7, 8, 10-12, 14, 29, 30, 32, 34-36, 38, 39).

**రోయిణి** ఉ రోయిని; చూ. రోహిణి (కో. 10-13, 17, 20, 21, 27, 28, 30, 33, 35-37, 40, 43, 47, 49; తె. 3, 5, 6, 9, 30, 31, 33, 37, 40-42; రా. 7, 9, 11, 18, 21, 22, 26, 28).

**రోవిణి** ఉ. రోవిని, రోవుణి; చూ. రోహిణి (కో. 19, 22-25, 34).

**రోహిణి** ఉ. రోహిని; రూ. రోణి, రోయిణి, రోవిణి; జ్యేష్ఠమాసం (జూన్ నెల మొదటిభాగం)లో వచ్చే కార్తె; ఎండల కార్తె (కో. 16, 18, 32).

**లంకాద్వారం** ? వరసగాఉండే రెండుచుక్కలు (కో. 47).

**లెంకెచుక్కలు** పూర్వోత్తరాషాఢలు కావచ్చు; పొన్నమాను తరవాతఉండే రెండు చుక్కలట (తె. 4).

**వంకతాడి** ఉ. ఒంకతాడి; ? రూ. అంకతాడు.

(1) దక్షిణాన వరసగా నిలువుగా కనబడే అయిదు చుక్కలు; (2) (కొందరు) పది పన్నెండు మోచెయివంపు మాదిరిగా ఉండే చుక్కలని (కో. 25 ; తె. 24).

**వడ్లచుక్క** పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతోఉండే నక్షత్రం ; ఈశాన్యమూల పొడుస్తుంది (తె. 9).

**వలచుక్క** పర్యా. చూ. కుందేటిచుక్క. శుక్రుడనే నక్షత్రం ; పొద్దుపొడవకముందు తూర్పున కొన్నినెల్లు, పొద్దు గూకిన తరవాత పడమట కొన్నినెల్లు ఆకాశంలో ప్రకాశవంతంగా కనిపిస్తుంటుంది (కో. 48, 49).

**విశాఖ** ఉ. ఇశాకి, ఇశాకు, ఇశాఖ, ఇశాగ, ఇశాగి, ఇషాక, ఇసాక, ఇసాకి, ఇసాకు, ఇసాగ, ఈశాక, ఈశాకి, విశాక, విశాకు. కార్తికమాసం (నవంబరు మొదటిభాగం)లో వచ్చే కార్తె (కో. 10-13, 16-29, 31-35, 37, 39-45, 48 ; తె. 1, 3-12, 14, 17-25, 27-42 ; రా. 4, 5, 7, 9, 11, 18, 21-28).

**వెనకచుక్క** పర్యా. చూ. ధ్రువుడు. ? ధ్రువనక్షత్రం. ఇది ఉత్తరదిక్కున కనిపిస్తుంది ; ఎప్పుడూ అస్తమించనిది (తె. 12).

**శతభిష** ఉ. చెతబిస. మాఘమాసం (ఫిబ్రవరి రెండో భాగం)లో వచ్చే కార్తె (తె. 10, 32).

**సంగడిచుక్కలు** పూర్వోత్తరాభాద్రలు కావచ్చు ; దగ్గర దగ్గరగా ఉండే నాలుగు చుక్కలు (తె. 5, 6, 9, 12, 29).

**సందుచుక్క** ఉ. సందచుక్క ; చూ. సందె(కాడ) చుక్క (కో. 36, 39, 40, 44).

**సందె(కాడ)చుక్క** రూ. సందుచుక్క ; పర్యా. చూ. మూలచుక్క. బృహస్పతి పేరుతోఉండే నక్షత్రం ; ఒక్కొక్కప్పుడు సూర్యుడు గూకినతరవాత పడమట కనబడుతుంది (కో. 20, 29-33, 35 ; తె. 9, 34, 41).

**సప్తమారుషులు** పర్యా. చూ. మంచంకోళ్ళు. సప్తర్షి మండలంలో మంచంకోళ్ళమాదిరి ఉండే నాలుగు చుక్కలు; వాటివెనక ఉండే మరిమూడు చుక్కలు (కో. 44, 46, 47, 49).

**సంపతక్క** చూ. సంపతిచుక్క (కో. 10 ; రా. 22, 23, 25, 27).

**సంపతిచుక్క** ఉ. సంపచ్చుక్క ; చూ. సంపతక్క; పర్యా. చూ. పిల్లలకోడి. కృత్తికానక్షత్రం ; తొమ్మిది చుక్కలు గుంపుగాఉంటాయి ; ఒకటి పెద్దది, మిగిలినవి చిన్నవి (తె. 37, 39).

**సాత్తి** ఉ. సేతి ; చూ. స్వాతి (కో. 10-12, 16, 19-36, 39, 41, 43-45 ; తె. 1, 3-12, 14, 17-25, 27-29, 31-41 ; రా. 5, 7, 9, 11, 18, 21, 22, 24-28).

**సొమ్ములగోర్జె** పర్యా. చూ. పాలబాట. ఆకాశంలో ఉత్తరంనుంచి దక్షిణానికి మెరుస్తూఉండే చుక్కలబారు ; పసులదారిలాగా చుక్కల్ని పోల్చుకోటానికి ఇది ఆనవాలుగా ఉంటుందట (కో. 37, 44, 46-49).

**స్వర్గంబాట** ఉ. సొరగంబాట ; పర్యా. చూ. పాలబాట. ఆకాశంలో ఉత్తరంనుంచి దక్షిణానికి మెరుస్తూఉండే చుక్కలబారు (రా. 18, 22, 24, 25, 28).

**స్వాతి** ఉ. సోతి ; రూ. సాతి. కార్తికమాసం (అక్టోబరు చివరిభాగం)లో వచ్చే కార్తె (కో. 13, 17 ; తె. 30; రా. 3, 4, 23).

**హస్త** ఉ. అత్త, అస్త, అస్తి ; రూ. అష్టం, అష్టమి, హస్తమి ; పర్యా. గొల్లకార్తె. భాద్రపదమాసం (సెప్టెంబరు రెండోభాగం)లో వచ్చే కార్తె ; ఈ కార్తెలో ముంగారిపైర్లు వేస్తారు (కో. 26-28, 33-37, 39, 41, 43, 45, 48; తె. 4, 5, 9-12, 14, 29, 31, 33, 34, 42 ; రా. 5, 21).

**హస్తమి** ఉ. అత్తం, అత్తిమి, అస్తం, అస్తమి, అస్తిమి ; చూ. హస్త (కో. 10-13, 17-25, 29, 30, 32, 44 ; తె. 3, 8, 12, 17-28, 32, 35-41 ; రా. 3, 4, 7, 9, 11, 18, 23, 24, 26-28).

## 3. వాన, గాలి

**అరగాలం** తెగిన ఇంద్రధనుస్సు (తె. 35).

**అరపదును** తడీ పొడిగా సాగునేల తడవటం (రా. 3, 9, 17, 18, 22, 24, 26).

**ఆగడప** (-వేయు): (? <అగ + అడప, లేక ఆగ + గడప). మేఘాల దొంతర; మెట్లు మెట్లుగా ఉండే మబ్బులు. చూ. ఆగం (కో. 1, 9, 10, 13-25).

**ఆగం** (-చేయు); పర్యా. చూ. మొగులు. ఆకాశంలో తెరలు తెరలుగా కూడుకొని కనబడే నీటి ఆవిరి; మేఘం; చూ. ఆగడప (కో. 39, 48).

**ఆవిటి** వి., విశ. (-పడు, -పూను) ఉ. ఆమటి. ఆవటి, ఆయిట, ఆయిటి, ఆయేటి. ఎండాకాలం తరవాత ఆరంభమయ్యే కాలం; మృగశిరకార్తె (కో. 24 ; తె. 1, 21–28, 35, 36, 38); **-గాలి** ఉ. ఆయిటగాలి. తొలకరిలో వీచేగాలి (తె.); **-వాన** ఉ ఆమటోన, ఆయిటోన, ఆయేటివాన. తొలకరిలో పడేవాన (కో. తె.).

**ఇంద్రజిత్తు** ఉ. ఇందర్జిత్తు; పర్యా. చూ. కొరడు. చినుకులగుండా ప్రసరించే సూర్యకిరణాలవల్ల ఎదురుగాఉన్న మబ్బులమీద కనబడే ఏడురంగుల విల్లు; ఇంద్రధనుస్సు (కో. 17, 19–22).

**ఇసరగాలి** చూ. ఈదరగాలి (తె. 3).

**ఈదగాలి** చూ. ఈదరగాలి (తె. 1, 34).

**ఈదరగాడ్పు** చూ. ఈదరగాలి (తె. 31).

**ఈదరగాలి** ఉ. ఈదురుగాలి; రూ. ఇసరగాలి. ఈదగాలి, ఈదరగాడ్పు; పర్యా. నాచుగాలి, పులకగాలి, సొడెసర్ది గాలి. తుప్పరతో వీచే చల్లగాలి (కో. 26, 27, 29–33, 35, 49; తె. 4, 6, 13, 23, 27, 28, 31, 32, 38, 40, 41).

**ఈదురువాన** ఉ. ఈదరోన. ఈదరగాలితో వచ్చేవాన (కో. 29, 33, 35; తె. 7).

**ఉప్పెనవాన** ఉ. ఉప్పినివాన. పెద్దపెట్టున కురిసేవాన (కో. 48).

**ఉరుము** మేఘాల్లో విద్యుత్తు ఏర్పడ్డప్పుడు కలిగే ధ్వని (కో. 26, 39, 41, 43, 45, 51; తె. 1, 8, 27, 32, 34–39, 42).

**ఉలిపదును** కొద్దిగా సాగునేల తడవటం (రా. 18).

**ఎదురుజాగిలాలు** ఎదురెదురుగా ఉండే ఎర్రమబ్బులు (కో. 37).

**ఎద్దడి** పర్యా. చూ. ఒరుపు. వర్షాభావం (కో. 49).

**ఎరగాలి** పర్యా. చూ. దుమారం. ఎర్రదుమ్ముతో బలంగా వీచేగాలి; ఝంఝామారుతం (తె. 3–5, 7, 37).

**ఎర్రగావురు** ఉ. ఎర్రకవురు. ఎరుపుకలిసిన నల్లరంగు (మబ్బుల రంగునుగురించి చెప్పేటప్పుడు వాడే మాట) (కో. 26, 27, 33, 35, 43; తె. 41; రా. 18, 26).

**ఎర్రడాలు** (-బారు). ఉ. ఎరడాలు. ఎర్రరంగు (మబ్బుల రంగునుగురించి వాడే మాట) (కో. 20, 24, 39; తె. 1, 24, 36–38, 42).

**ఎలకటుగాలి** ఉత్తరదిక్కునుంచి వీచే గాలి (కో 43).

**ఎల్లంకిగాలి** వాన రాకముందు వీచే దుమ్ముగాలి (కో. 43).

**ఒరుపు** పర్యా. ఎద్దడి, గెరువు. వర్షాభావం; ఎండల తీవ్రత (కో. 49).

**ఒరుపుగాలి** పర్యా. చూ. దుమారం. ఎర్రదుమ్ముతో బలంగావీచే గాలి (తె. 8).

**కట్టుమొగులు** ఉ. కట్టుమొగలు; రూ. కట్టుమొయిలు. ఉదయాస్తమయాల్లో సూర్యుడు కనిపించకుండా అడ్డపడ్డ మబ్బు (తె. 36).

**కట్టుమొయిలు** ఉ. కట్టుమయిలు; చూ. కట్టుమొగులు (కో. 6, 12, 15–19).

**కడవపోత** పర్యా. చూ. కుండపోత. కడవలతో కుమ్మరించినట్టు వానకురిసే తీరు (తె. 30, 41).

**కత్తెరగాలి** కృత్తిక కార్తెలో వీచే వేడిగాలి (కో. 27, 29, 32, 35; తె. 40, 41).

**కత్తెరవాన** కృత్తికకార్తెలో కురిసే వాన (కో. 33; తె. 1).

**కాకినెరడ** నల్లమబ్బు (తె. 4).

**కాటికమబ్బు** నల్లటి మేఘం (కో. 33).

**కారుమబ్బు** నల్లమేఘం; వానమొయిలు (కో. 28, 34–37, 40, 44, 49).

**కారువాన** సంక్రాంతి వెళ్ళినతరవాత వచ్చే వాన (కో. 33).

**కార్తెమూల** ఈశాన్యదిక్కు (కో. 13-15, 17, 18).

**కావురుమబ్బు** దట్టంగా ఆవరించిన నల్లమబ్బు (కో. 31).

**కుండదెబ్బ** పర్యా. చూ. కుండపోత. కడవలతో కుమ్మరించినట్టు వానకురిసే తీరు (కో. 31).

**కుండపోత** పర్యా. కడవపోత, కుండదెబ్బ, కుంభవృష్టి, ముంతపోత. కడవలతో కుమ్మరించినట్టు వానకురిసే తీరు (తె. 13, 25, 28; రా. 18, 21–23).

**కుంభవృష్టి** ఉ. కుంబవుష్టి; పర్యా. చూ. కుండపోత. కడవలతో కుమ్మరించినట్టు వానకురిసే తీరు (కో. 32; తె. 40).

**కుళ్ళుడువాన** ఎడతెగకుండా తుప్పరగా పడేవాన

(కో. 36 ; తె. 40).

**కొండమబ్బు** కొండలతీరుగా ఆవరించిన మేఘం (తె. 28).

**కొరడు** ఉ. కొఱడు (-ఒడ్డు); రూ. కొఱ్ఱు ; పర్యా. ఇంద్రజిత్తు, వరదగూడు, సింగిడి, సింగిణి, హరివిల్లు. చినుకులగుండా ప్రసరించే సూర్యకిరణాలవల్ల ఎదురుగాఉన్న మబ్బులమీద కనబడే ఏడురంగుల విల్లు; ఇంద్రధనుస్సు (కో. 12, 22, 25, 39, 43; తె. 36, 37, 39 ; రా. 18).

**కొఱ్ఱు** చూ. కొరడు (కో. 10, 11, 13, 17, 24).

**కోటకొమ్మ** చాలా ఎత్తుగాఉన్న మబ్బు (కో. 37, 38; తె. 38).

**కోటగాలి** పడమటి దిక్కునుంచి వీచేగాలి; వేడిగాలి (తె. 11, 14).

**కోటతెప్ప** పెద్దమబ్బు (తె. 7).

**కోటబొమ్మంచులు** (-తీర్పు) ఒకదానిమీద ఒకటిగా ఉన్న మబ్బులతీరు (కో. 24).

**కోరమబ్బు** నల్లంచులున్న తెల్లమబ్బు (కో. 28, 31).

**గండుతెప్ప** పెద్దమబ్బు (తె. 35).

**గండుముసురు** జడివాన (తె. 1, 35).

**గాడిదమబ్బు(లు)** గాడిదరంగు మబ్బు (కో. 9, 13, 19, 23).

**గాడుపు** చూ. గాలి (కో. 26, 31, 35, 36, 46; తె. 12, 17, 21-28, 30-32, 37, 40, 41).

**గాలి** రూ. గాడుపు, గాలుపు. భూమిని ఆవరించిఉండే వాయుపదార్థం (కో. 1-51 : తె. 1-42; రా. 1-28); **-మబ్బు** గాలి వీచగానే విడిపోయ్యే మేఘాలు (కో.); **-వాన** ఉ. గాలోన, ఘాలివాన. ఎక్కువగాలితో వచ్చే వాన; తుపాను (కో. తె. రా.).

**గాలుపు** చూ. గాలి (కో. 40, 41, 43).

**గిద్దెవాన** కుంభవృష్టి (తె. 37).

**గుడి** (-కట్టు); పర్యా. చూ. వరదగూడు. చంద్రుడి చుట్టూగాని, సూర్యుడి చుట్టూగాని కాస్త ఎడంగా వలయాకారంలో కట్టే హద్దు; పరివేషం (కో. 16, 18, 21, 22, 39, 41, 43, 45).

**గుడ్డిమబ్బు** వానకురవని మేఘం (కో. 22).

**గువ్వముసురు** ఉ. గువముసురు. నిరంతరం తుప్పరగా పడేవాన (తె. 1, 36).

**గెరువు** పర్యా. చూ. ఒరుపు. వర్షాభావం (తె. 28).

**గొర్తిపదును** రూ. గోరుపదును. గొర్రుతో విత్తటానికి అనువుగా నేలతడవటం (రా. 17, 18, 22-24).

**గొర్రెతొక్కుడు** గొర్రెతొక్కిన నేలమాదిరి ఉన్న మబ్బులు (తె. 24).

**గోరగుడ్డు** (-వేయు) నీటి అలల్లాంటి మబ్బులు (కో. 48).

**గోరుపదును** చూ. గొర్తిపదును (తె. 39)

**చలిగాడ్పు** చూ చలిగాలి (తె. 31).

**చలిగాలి** రూ. చలిగాడ్పు; పర్యా. సొదెనద్దిగాలి, శీతగాలి. మార్గశీర్షమాసంలో వీచే చల్లగాలి (కో. 26, 27, 31, 35, 40, 41, 47; తె. 3, 5, 29, 30, 33, 35, 38).

**చల్లగాలి** (1) చల్లగా నెమ్మదిగా వీచేగాలి; (2) చూ. చలిగాలి (కో. 31, 32; తె. 40).

**చిత్తమోదు** చిత్తకార్తెలో ఆగుతూ కురుస్తూఉండే వానజల్లు (రా. 24, 25).

**చినుకు(లు)** వాననీటిబొట్టు (కో. 27-29, 31, 46, 48; తె. 13, 24, 35; రా. 11, 18, 26).

**చుట్టుగాలి** రూ. సుట్టగాలి; పర్యా. చూ. సుడిగాలి. గిరగిరతిరిగే వాయుగుండం (తె. 3).

**చెంద్రగుడి** చూ. చెంద్రగూడు (కో. 15, 17; తె. 1; రా. 18, 24).

**చెంద్రగూడు** రూ. చెంద్రగుడి; పర్యా. చెంద్రమండలం. చెంద్రుడిచుట్టూ ఏర్పడే పరివేషం; చూ. వరదగూడు (తె. 1, 39; రా. 25).

**చెంద్రమండలం** పర్యా. చూ. చెంద్రగూడు. చెంద్రుడి చుట్టూ ఏర్పడే పరివేషం; చూ. వరదగూడు (కో. 9-13).

**చౌడపుగాలి** చినుకులతో వీచేగాలి (కో. 37).

**జడివాన** ఉ. జడోన; రూ. దడివాన. సందులేకుండా కురిసే సన్నవాన (కో. 50; తె. 27, 41; రా. 5, 21, 26).

**జలరేకలు** ఉ. జిలరెక్క(లు); పర్యా. చూ. వానకాళ్ళు. పల్చటి మబ్బు అడ్డంవచ్చి చారలు చారలుగా కిందికి దిగే సూర్యుడి వెలుతురు (కో. 6, 9, 10, 13, 14).

**జల్లు** రూ. డల్లు, దల్లు. తపతపపడే వానచినుకులు (కో. 26, 31, 32, 35, 43, 49; తె. 1, 24, 36, 38, 39; రా. 1).

**జిందర** ఉ. జీదర. తడిపొడి చినుకులు (రా. 18, 21).

**జిలుగువాన** తుప్పరగాపడే వాన (కో. 28).

**జెట్టిమబ్బు** ? ఎర్రటిమేఘం (కో. 27).

**డల్లు** చూ. జల్లు (తె. 11-14, 21, 23, 26, 28, 32-34).

**తల్లిపదును** నేల అడుక్కుదిగిన తడి (రా. 17, 18, 24).

**తుపానుగాలి** వర్షంతోపాటు వేగంగా వీచేగాలి (కో. 46).

**తుపారం** చూ. తుప్పర (తె. 27).

**తుప్పర** ఉ. తుప్పిరి, తుప్పురు; రూ. తుపారం, తుమారం, తుమురు, తుంపర, తువ్వర, తూర, దుబ్బురు, దూబర, దూవర. పలచగాపడే సన్నచినుకుల వాన (కో. 30, 41, 46; తె. 8, 29, 37; రా. 7, 25).

**తుమారం** చూ. తుప్పర (కో. 33; తె. 39).

**తుమురు** చూ. తుప్పర (తె. 10, 33).

**తుంపర** ఉ. తుంపిరి; చూ. తుప్పర (కో. 27, 35; తె. 5, 14, 26, 28; రా. 5).

**తువ్వర** ఉ. తువర; చూ. తుప్పర (తె. 7, 37; రా. 9, 11, 24, 26).

**తూర** చూ. తుప్పర (రా. 3).

**తెప్ప** ఉ. తిప్పె, తెప్పె (-కమ్మ); పర్యా. చూ. మబ్బు. ఆకాశంలో తెరలు తెరలుగా కూడుకొని కనబడే నీటి ఆవిరి; వానమబ్బు (కో. 6, 7, 12, 35; తె. 4, 8-12, 14, 15, 35, 37, 38).

**తేలమబ్బు** దట్టంగా ఆవరించినా వానరాకుండా తేలిపొయ్యే మేఘం (కో. 36).

**తొలకరి(వాన)** ఉ. తొల్కరి. ఎండాకాలం తరవాత ఆరంభమయ్యే వాన; నేల పదునుకావటానికి కురిసే వాన (కో. 10, 18, 23, 26, 27, 33, 35; 37, 40, 44 46-51; తె. 3, 28, 37, 41; రా. 24, 25).

**దడివాన** చూ. జడివాన (తె. 27; రా. 27, 28).

**దబ్బాటువాన** ఉ. దబాటివాన, దబ్బటవాన, దబ్బాటుపోన, దిబాటవాన, దెబ్బటోన. పెద్దపెట్టున వచ్చిన కొద్దిసేపట్లో నిలిచిపొయ్యే వాన (కో. 12, 29; తె. 3-5, 7, 9, 10, 27, 28, 32, 34, 36, 42; రా. 9, 11, 18, 22-28).

**దయ్యపుమబ్బు** ఉ. దెయ్యప్మొబ్బు; పర్యా. బూతమబ్బు. పెద్దగా కొండలాగా ఆవరించిన నల్లమబ్బు (కో. 26-28, 31, 35; తె. 40, 41).

**దల్లు** చూ. జల్లు (తె. 27).

**దవగాలి** పర్యా. చూ. దుమారం. ఎఱ్ఱదుమ్ముతో బలంగావీచే గాలి (తె. 33, 35).

**దవముసురు** జడివాన (తె. 12).

**దుక్కివాన** ఉ. దుక్కోన. దున్నటానికి తగినంతగా నేల పదునయ్యేవాన; పొలం బెత్తెడు నానితే వాడేమాట (కో. 29, 41, 43, 45, 46).

**దుందారం** చూ. దుమారం (తె. 1).

**దున్నుపదును** దున్నటానికి వీలైనంత తడి (రా. 17, 18).

**దుబ్బురు** చూ. తుప్పర (తె. 11-13, 24).

**దుమారం** ఉ. తుమారం, తుమ్మరం; రూ. దుందారం; పర్యా. ఎరగాలి, ఒరుపుగాలి, దవగాలి, బరాటంగాలి, బోదరగాలి. ఎఱ్ఱదుమ్ముతో బలంగావీచే గాలి (కో. 4, 27-35; తె. 12, 22-30, 35, 42).

**దూదర** ? తుపాను (రా. 24).

**దూబర** చూ. తుప్పర (తె. 3; రా. 18, 21, 25).

**దూవర** ఉ. దూమర; చూ. తుప్పర (రా. 22, 28).

**దోరపదును** ఒక మోస్తరుగా సాగునేల తడవటం (రా. 1).

**నల్లకావురు** (మబ్బుల) నల్లరంగు (కో. 26).

**నాచుగాలి** పర్యా. చూ. ఈదురుగాలి. తుప్పరతో వీచే చల్లగాలి (కో. 48).

**నానుడువాన** ఎడతెగకుండా పడే సన్నవాన (తె. 35, 39, 40; రా. 24, 25).

**నీలిమబ్బు** నల్లమబ్బు (కో. 26, 33, 44).

**పంటగాలి** పర్యా. చూ. పైరగాలి. ఆగ్నేయదిక్కునుంచి వీచే చల్లగాలి; ఇది వీస్తే పైర్లు ఏపుకు వస్తాయి (తె. 33).

**పదును** ఉ. పొదును. సాగునేలలో వానవల్ల కలిగే చెమ్మ లేక తడుపు (తె. 4, 9, 27, 39; రా. 1, 3, 6, 9, 17, 18, 22-24, 26); **-వాన** ఉ. పదునాన, పదునోన. విత్తటానికి చాలినంతగా నేలతడిసే వాన (తె. రా.).

**పరగడగాలి** పర్యా. రొదగాలి. వాన వచ్చేముందు దుమ్ముతో బలంగావీచే గాలి (కో. 48).

**పసరగాలి** పర్యా. చూ. ఈదరగాలి. ముసురులో తుప్పరతోవీచే గాలి (కో. 41).

**పాకురుమేఘం** కెరటాలమాదిరి కనబడే మబ్బు (కో. 46).

**పిడుగు** (-పడు) వాన కురిసేటప్పుడు నేలతాకే మెరుపు (కో. 12, 41, 43, 45; తె. 1, 32, 34-39, 42).

**పిల్లగాలి** పర్యా. పీచరగాలి, రవగాడ్పు. సన్నగావీచే చల్లగాలి (కో. 32).

**పీచరగాలి** పర్యా. చూ. పిల్లగాలి. నెమ్మదిగావీచే చల్లగాలి (కో. 27; తె. 41).

**పీచరమబ్బు** రూ. పీచుమబ్బు. పల్చగాపట్టిన తెల్లమబ్బు (కో. 26, 27, 33; తె. 40).

**పీచుమబ్బు** చూ. పీచరమబ్బు (తె. 36, 42).

**పులకగాలి** ఉ. పులగ్గాలి; పర్యా. చూ. ఈదరగాలి. వానాకాలంలో తుప్పరతోవీచే చల్లగాలి (కో. 31, 35; తె. 40).

**పైరగాడ్పు** చూ. పైరగాలి (తె. 24).

**పైరగాలి** రూ. పైరగాడ్పు, పైలగాలి; పర్యా. పంటగాలి, మాగిగాలి. (1) ఆగ్నేయ దిక్కునుంచి వీచే చల్లగాలి; ఇది వీస్తే పైర్లు ఏపుగా వస్తాయి; (2) చల్లటిగాలి (కో. 12, 21-23, 26-37, 39, 40, 43, 48; తె. 11, 12,

